శ్రీ ర స్తు

# శ్రీమదాంధ్ర
# వచనమహాభారతము

## ఆరణ్యపర్వము

ద్వితీయసంపుటము



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

వారిచే ప్రకటితము

1949

# విషయసూచిక

## ప్రథమాశ్వాసము

విషయము.



## ద్వితీయాశ్వాసము

| విషయము. | | పుట. |
|---|---|---|


## తృతీయాశ్వాసము

విషయము.

శ్రీ

శ్రీ గణేశాయ నమః.

శ్రీ రుక్మిణీసత్యభామాసమేత శ్రీగోపాలకృష్ణపరబ్రహ్మణే నమః.

# శ్రీమదాంధ్ర
# వచనమహాభారతము

## ఆరణ్యపర్వము



### ప్రథమాశ్వాసము

శ్లో. "నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమమ్,
దేవీం సరస్వతీం వ్యాస్తం తతో జయముదీరయేత్."

జనమేజయుండు వైశంపాయనునితో నిట్లనియె. "మహాత్మా! పాండవులీతెరగున దుర్యోధనాదులచే మోసపోవుటయేకాక తమసంపద నంతయుఁ గోల్పోయిరి కదా! మఱియును దుర్యోధనుండు వారిని బరుషంబు లాడెనే? ఇందులకు వీరలు కుపితులైనను, జేయునది లేక ధర్మపాశబద్ధులు గావున వనవాసమునకుఁ గృతనిశ్చయులైరి గదా? వా రరణ్యంబున నాకాలంబు నెట్లు గడపిరి? వారు కాననమునకుఁ బోవుతఱి వారిని వెంబడించినవా రెవరు? వనవాసకాలంబున నేయాహారమును భుజించుచుండిరి? ఏయేస్థలములయందు వసించిరి? అరణ్యమున వారు తమకాలము నెట్లు గడపిరి? మహాపతివ్రతయు దొడ్డయిల్లాలును నైన ద్రౌపది యీవ్యసనము నెటు లోర్చె?" నని యడుగఁగా నారాజచంద్రున కు సమ్మునిచంద్రుం డిట్లానతిచ్చె.

రాజోత్తమా! పాండుకుమారులు జూదమునం దోడి యందలి సమయము మేరకు ద్రౌపదీసమేతులై హస్తినాపురమును వదలి యరణ్యాములకుఁ బోవుచుండ, వారిని ఇంద్రసేనుఁడు మున్నగు సేవకులు పదునాలుగు రుత్తమరథములం గొని వెన్నంటిరి. వారిమార్గమున వర్ధమానపుర మనునది యొండు కలదు. ఆపురముఁ జొచ్చి వారు వెళ్లుచుండ, హస్తినాపురమునందలి జనులు పాండవులపై నుండు రాజభక్తితోను, విశ్వాసముతోను వారిని వెన్నంటి కలిసికొని యిట్లనిరి. "అయ్యయో! ధర్మరాజు ధర్మాత్ముండు. ఈమహనీయునిపాలనమున మే మందఱము సుఖముగ జీవించుచుంటిమి. ఇఁకమీఁద దుర్యోధనునిపాలనమునకు లొంగి యుండవలయునే! అక్కటా యీదుష్ట చతుష్టయ మగు దుర్యోధనకర్ణశకునిదుశ్శాసనులపాలనమునఁ బ్రజల మగు మే మెట్లు జీవింపఁగలము? దుర్యోధనుఁడు పాపాత్ముఁడు; పాపసహాయుఁడు; గురుద్వేషి; ఆచారవిహీనుఁడు; దుర్జనుఁడు; ధనలుబ్ధుఁడు; దురభిమాని; నీచుఁడు; సాహసించి యెంతకార్యమునైనను జేయువాఁడు ఈతనిరాజ్యమున నుండిన మేని, వర్ణాశ్రమధర్మములు వినష్టము లగును. కులాచారవ్యవస్థ కూలిపోవును. ధర్మార్థసౌఖ్యము లడుగంటును. కావున సకలసుగుణరాసులైనవారును, మహాత్ములును నగు పాండుపుత్త్రులతో మనమును బోవుద" మని నిశ్చయముగా నాడుచు ధర్మపుత్త్రునకుఁ జేతులు మోడ్చి "మహాత్మా! మమ్మును వదలి మీ రెట కేఁగెదరు? దుర్యోధనాదు లన్యాయపుజూద మాడ, నందు మీ రోడి ధర్మపాశబద్ధులై కాననంబుల నుండుటకుఁ బోవుచున్నవారా? మీవెంట మేమును వచ్చెదము. బహుకాలము నుండి మేము మిమ్మును భక్తితో భజించితిమి, మీ కనురక్తులము. ప్రియులము. హితులము. అట్టిమమ్మును మీ రిట్లు విడనాడి చనం జనునే? దుర్యోధనునిరాజ్యమున మే ముండ నేరము. నీరు, వస్త్రములు, నువ్వులు, భూమియు సువాసనల నీనుచుండుపుష్పములతోఁ గూడి సుగంధమును బొందును. అట్లే ప్రజలు సత్పురుషులసహవాససంపర్కములవలన నుత్తమగుణములఁ బొందుదురు. దుష్టులతోఁ గూడినచో, వారును నధర్మమునకుఁ బాల్పడుదురు. పుట్టుకచేతను, గర్మానుష్ఠానముచేతను, జదువుకొనినవిద్యచేతను మనుష్యులు సాధారణముగఁ బరిశు

ద్ధాత్ములుగను, నైష్ఠికులుగను, మహనీయులుగను, సతతశాంతులుగను నగుచుందురు. అట్టియుత్తమపురుషులతోఁ గూడినవారు ప్రయత్నము చేయకుండఁగనే పుణ్యరాశిం బడయుదురు. మధ్యస్థుఁ డగువాని సావాసంబున మనుజుండు మధ్యస్థుఁడే యగును గాని యున్నతస్థితికి రానేరఁడు. నీచులచెలిమిచే వీనికిని నీచత్వమే సిద్ధించును. దుష్టులసాంగత్యము ధర్మాచారములకు హానిఁదెచ్చును. కాఁబట్టి యోధర్మరాజా! నీవును నీతమ్ములును సద్గుణసంపన్నులరు. మీవెంట వచ్చి మేమును ధర్మాచరణపరాయణులమై యుండెదము. అని చెప్పఁగా ధర్మరాజు "ఓ సకల జనులారా! మీకు మాయందలి మిక్కుటమగు ప్రీతివిశ్వాసములచే మాయందు లేనిగుణములను మా కారోపించి మమ్మును గొప్పగాఁ దలంచుచున్నారు. మేము ధన్యులమైతిమి. నేను మీకుఁ దోఁబుట్టువు వంటివాఁడను. నా మనవిని గొంత నాలకింపుఁడు. నామాటకు మాఱాడకుండుటకు మిమ్ము వేఁడెద. మమ్ముఁ గన్నాకై పెంచిన మాతాత భీష్ముండును, మాతండ్రికి మాఱైన తండ్రియగు ధృతరాష్ట్రుఁడును, మా కన్నింటికిఁ దోడ్పడుచుండిన విదురుఁడును, మీఁదుమిక్కిలి మాకన్నతల్లి కుంతియును మాకుఁ గల సుహృద్బృందమంతయు హస్తినాపురముననే యున్నవారు. మాపడరానిపాట్లను దలంచి వారు తీరనిదుఃఖమున నుందురు. మీరు వెనుదిరిగి మావారి నందఱను మిక్కిలి ప్రీతితో నోదార్చుచుండుఁడు. మీ రిట్లాచరించినచో నాకు మిక్కిలి శ్రేయస్సును గూర్చినవారగుదురు. మావారి నెల్లవారిని మీయొద్ద దాపరక ముంచితిమి. వారిని సుఖులుగఁ జేసినచో మీరు నన్ను సంతసింపఁ జేసినవారే యగుదురు. మావెంబడి దూరప్రయాణమును జాలింపుఁడు. ఇఁక మఱలుఁడు" అని వినయపూర్వకవాక్యంబులచే వారిని ధర్మరాజు సమాధానపఱుప, వారు ధర్మపుత్త్రునాజ్ఞను, వేఁడికోలును నతిక్రమింప నేరక కొంతసేపాలోచించి యారాజనందనుల సద్గుణములఁ గొనియాడుచు హస్తిపురంబునకు మగిడి చనిరి.

పిదపఁ బాండవులు రథముల నెక్కి గంగాతీరమునకుఁ బోవుచు, నాదారియందుఁ బ్రమాణాఖ్యమహావృక్షము నొక్కదానిం గనిరి. అప్పటికి సూర్యాస్తమయసమయం బగుటయు, నా రాత్రి యావృక్షంబు

క్రింద నీరు ద్రాగి విడిసియుండిరి. ఆచుట్టుప్రక్కలపల్లెలవార లగు కర్మఠు లైన బ్రాహ్మణులు కొందఱు ధర్మపుత్త్రుఁడు తమ్ములతో నచ్చో విడిసియున్నాఁడని తెలిసి యచ్చోటికి కేతెంచి ధర్మరాజుం గాంచి యుబుసుపోకకు-ననేకపుణ్యకథలను వినిపించుచు నిష్టగోష్ఠిని శాంతముగ జరిపిరి. అట్లువా రా రేయి గడపి వేఁకువన పుణ్యజలములు గల గంగానదియం దు స్నాతులై యరణ్యప్రవేశమునకు యత్నములు సలుపుచుండ భిక్షాన్నమే జీవనముగాఁ గల విప్రులు గొందఱు వారి కడ్డు దగిలి తాముసు ధర్మరాజు వెంబడి నరణ్యములలో వసింప నిశ్చయించినవార మని తెలుపఁగా వారికి ధర్మజుండు "మేము మాసర్వస్వమును రాజ్యమును గోల్పోయితిమి. ఒక్కసమయముం జేసి కానల వసియింపఁ బోయెదము. మీరు కానల వసింప నోపరు. అయ్యది యనేకక్రూరమృగములకు నిలయము. అందు మనుష్యుల కపాయములు నిత్యసిద్ధములు. అచ్చటికష్టములను మీ రోర్వఁజాలరు. నానిమిత్తమున మీరు డయ్యుటకు నే నోర్వను. విప్రులకష్టములను జూచుచుండు దేవతలకైనం జెలుపువాటిల్లు. ఇఁక మనుష్యమాత్రుఁడ నగు నావంటివానికి వేఱుగఁ జెప్పవలయునా ? మగిడి మీనివాసస్థలంబుల కేఁగుఁడు" అని చెప్పఁగా నాబ్రాహ్మణులు "రాజా! మేము నీవే శరణమ వని నిన్ను భజించు నుద్దేశముతో వచ్చియుండ మమ్ము నీకు విడనాడఁ దగునే? దేవతలు సైతము, భక్తులయందు వాత్సల్యమును జూపుదురు. వారు భక్తపరాయణులు. మేముసదాచారసంపన్నులమగు బ్రాహ్మణులము. మాయెడఁ బ్రసన్నుండ వగుము" అనిరి. అందులకు యుధిష్ఠిరుఁడు మఱియు నిట్లనియె. "మీరు భూసురులరు. మీయెడ నాకుఁ గడుంగడు భక్తి గలదు. నే నసహాయుండను. నాతమ్ములును సర్వస్వమును గోల్పోవుటం జేసియు, మాధర్మపత్ని యగు ద్రౌపదికి సంభవించిన పరాభవమునం జేసియు మిగుల వగఁ గొని యున్నవారు. మీ కరణ్యమునందు ఫలమూలముల నాహారార్థముగఁ గొని తెండని వారిని గష్టపెట్టనేరను." అని చెప్పఁగా నాబ్రాహ్మణులు "మాయాహారము, మాపోషణము మీకు వగఁ గూర్పఁ బనిలేదు. మాకు వలసిన భోజ్యవస్తువులను మేమ సమకూర్చుకొని దేహయాత్ర నడుపుచు, నిత్యకర్మానుష్ఠానములను జలుపుచు, మీకు శుభములఁ

గోరుచు, మీ వెంట నిష్టకథాసల్లాపములచే సుఖింప నెంతుము" అనిరి. ఆ మాటలకు ధర్మాత్ముండు కటకటంబడి, "మీయాహారముల మీరల దెచ్చుకొనుచు నా వెంట నుండుటకు నే నెట్లోర్తు? ఇంతకష్టమునకుఁ గారణ మాదురోధనుని దురుద్యోగమే కదా!" యని చింతించుచుండ సాంఖ్యయోగాచార్యుఁడును, నధ్యాత్మతత్త్వవేత్తయును నగు శౌనకుఁడను బ్రహ్మర్షి ధర్మరాజున కిట్లనియె.

శౌనకుఁడు ధర్మరాజునకుఁ దత్త్వముఁ జెప్పుట

ధర్మపుత్త్రా! శోకభయములు మూఢులను దుఃఖమున ముంచును. విద్వాంసునిచెంతఁ జేరవు. నీవంటిజ్ఞాను లనేకదోషములతోఁ గూడుకొనినవియు, మోక్షమునకు విఘాతకారులును నగు కర్మముల నాచరింపఁదగునా? వేదములందును, స్మృతులందును, బురాణములందును బాపపరిహారకములగు ననేక భావముల నాచరించుటయం దభ్యాసము గల విజ్ఞానివి. ద్రవ్యము మున్నగువానిసంకటములయందును, స్వజనులకుఁ దటస్థించిన యాపదలయందును నీవంటి తెలివితేటలు గలవారు చింతిల్లుట కూడునా? ఇవి యన్నియు ననిత్యమగు శరీరమునకు సంబంధించిన వని యెఱుంగవా? చిత్తము శుద్ధియగుటకొఱకు "జనకగీత" లను నీతుల నుపన్యసింతు. సావధానుఁడవై వినుము. ఇవి వినుటచే నించుక దుఃఖోపశమనము కాఁగలదు. రోగము, ఆయాసము, ఇష్టముకానిది లభించుటయు, ఇష్టమైనది లభింపకపోవుటయు నను నీనాలుగును శరీరమునకు దుఃఖకరములు కాని యివి సమయోచితచికిత్సలచేతను, నుపాయముల చేతను దొలఁగును. స్నేహము మొదలుగాఁగల మానసదుఃఖము సంతోషముచే నణఁగిపోవును. ఇంతేకాక నీటియందుండు నగ్నివలె నిర్మలమగు విజ్ఞాన ముదయించుచుండఁగనే యయ్యది యుపశమించును. మానసదుఃఖముచే శరీరము తపించును. నిప్పువలెఁగాగి యెఱ్ఱనై యుండు నినుపగుండును నీట వేసినచో నాయుష్ణముచే నీరును నెట్లు వేఁడెక్కి తపించునో యట్లే మనస్సు దుఃఖించినచో శరీర మాదుఃఖముచేఁ దపించు నంటిని. మానసదుఃఖములకు మూలమైనస్నేహముచే సంసర్గము, దుఃఖము, రాగము గలుగును. రాగము, దుఃఖము నను నివి కొలఁదివైనను

మహావృక్షపుఁదొఱ్ఱలో నెంతమాత్రమగ్నికణము పడవైవఁబడినను, వృక్ష
ము నంతటిని నెట్లు దహించునో యట్లు మనకలవాటుపడిన ధర్మార్థములను
నశింపఁజేయును. సంసర్గదోషములను చెప్పఁగాఁ దెలిసికొని వానిని వదల
వలయును. నిర్వేదుఁడు కావలయును. వెంటనే వైరాగ్యము తనంతటఁ
గలుగును. మిత్రులు ధనము ననెడి వీనియందలి యపేక్ష విడువ దగినది.
జ్ఞానులగువారు భార్య పుత్త్రులు మిత్త్రులు ననియెడి వీనియెడ సంసర్గమును
జేసినను మాత్ర ముంచుచుఁ దామరాకున నుండు నీటిబొట్టువలె వర్తిం
పుదురు. జ్ఞానులు వీరియెడ విశేషసంగమును జేయరు. మఱియును
ననురాగమునుండి కామమును, కామమునుండి తృష్ణయుఁ బుట్టును.
తృష్ణచే సర్వపాపములును, శాశ్వతమైన భయమును, మితిలేనియధర్మ
కార్యచింతయు శరీరమును నావరించుకొనును. ఆతృష్ణయే ప్రాణాంతక
మైన రోగము. ఇది వివేకము లేని దేహి నాశ్రయించి వానిదేహము
ముసలితనముచే జీర్ణమగుచుండినను, దాను మాత్రము ప్రవర్ధమాన
మగుచుండును. సాంబ్రాణిపుల్లకొనను గాల్చినచో నారవంతయు గ్రమ
ముగా సాంబ్రాణిపుల్ల నంతటిని గాల్చువిధమున నాశ యవివేకిని
నన్నివిధంబులఁ జెఱుచును. మఱియు విశేషముగ ధనార్జనము చేయఁగాఁ
జేయఁగా, శరీరమునకు మృత్యుభయమువలె నాయర్థవంతునకు రాజు
లచేతను, నగ్నిచేతను, దొంగలచేతను, స్వజనులగు భార్యపుత్త్రమిత్ర
బంధువులచేతను నపారభయ ముండును. ఆకాశమున సంచరించు పక్షులు,
భూమియందు నరణ్యములో సంచరించువ్యాఘ్రము, నీళ్లలోఁ దిరుగు
చేపలు నను నివన్నియు మాంసమును నెట్లు తినునో యట్లే ధనవంతు
నెల్లవారు నెల్లప్పుడు భక్షింతురు. కొందఱి కర్థమే యనర్థదాయకము.
ద్రవ్యమునందు వాంఛ గలపురుషుఁడు శాశ్వతకల్యాణము నంద లేఁడు.
ద్రవ్యమునందు లోభము, మోహము, గర్వము, కార్పణ్యము, భయము
నను నివి యెడతెగక సంసిద్ధములై యుండును. ద్రవ్యసంపాదనము,
సంపాదితద్రవ్యరక్షణము, రక్షితద్రవ్యవినాశనము నను మూఁటి
యందును దుఃఖము గల్గుచుండు. ద్రవ్యాశగలవారు దానివలని
దుఃఖమును నోర్తురు. అర్థమునిమిత్తము మిత్త్రులఁ జంపుదురు. శత్త్రువు
లను బాలింపుదురు. వారినె యాశ్రయింపుదురు. కావున నోధర్మపు

ంద్రా! సర్వదుఃఖాకరమైన యర్థవినాశమునకుఁ జింతింపరాదు. ఆశ
కంత మెన్నండును లేదు. దీనిని బాగుగ గుర్తించుకొని యాశను విడ
నాడువాఁడే విద్వాంసుఁడు. వాఁడే వివేకి. వాఁడే సంతోషి. నిత్యసం
తోషికానివాఁడే మూఢుఁడు. రూపము, యౌవనము, జీవితము, నైశ్వ
ర్యము ప్రియులతోడి కూడిక యనునివి యన్నియు ననిత్యములు. కావున
వివేకియగువాఁడు వీనియందలి యాశను వదలును. ద్రవ్యము లేకుండు
టచేఁ గలిగెడు తాత్కాలిక కష్టముల నోర్చికొని తృష్ణను త్యజించుట
మేలు. కోట్లకొలఁది ద్రవ్యార్జనమును గావించిన మనుష్యుం డెవ్వం
డేనియు సుఖంబున నుండువాఁడు గలఁడే? కావున ధార్మికులయభీష్టమే
పరమార్థ మని యెల్లవారు ప్రశంసింతురు. పోనిమ్ము; ధర్మార్థముగ, ధన
మార్జించుటకంటె నిరాశయే లెస్స. “అడుసు ద్రొక్క నేల? కాలు
గడుగ నేల” యన వినమే. కావున నో ధర్మరాజా! ధర్మము నపేక్షింతు
వేని ధనాశను విడువుము” అనిన శౌనకునకు ధర్మరా జిట్లనియె.

మునీంద్రా! స్వప్రయోజనముకొఱకు నర్థార్జనము గావింపవల
యు ననువాఁడనుగాను. బ్రాహ్మణులఁ బోషించునిమిత్తము ద్రవ్యసంపా
దనము వాంఛింతును. ఆశ్రమస్థులకు నాశ్రమధర్మము నడపింపవలయు
ననుట ముఖ్యకర్తవ్యము కాదే? నేనో గృహస్థాశ్రమమునందు నున్న
వాఁడ. యతులు బ్రహ్మచారులు పక్వాన్నములనే భక్షింతురు. వారు
పాకముఁ జేసికొనరు. అట్టివారు గృహస్థునిపై నాధారపడియుందురు.
గృహస్థుఁడు శరీరపోషణమునకు ద్రవ్యసంపాదనము గావించికొని వస్తు
సంచయము చేసి పచనాదులం గావించి యతిథిఁ దృప్తిపఱచి, యెల్ల
భూతములను సంతృప్తిగావించి యార్తునకుఁ బడక, బడలినవానికి
స్థలము, దాహము గొన్నవానికి నుదకము, నాఁకలిగొన్నవానికి నన్నము
నొసంగవలయును. ఇది యుత్తమగృహస్థధర్మము. ఇంకను గృహస్థుఁ
డగువాఁడు దేవతల నారాధించునిమిత్తము నిత్యమగ్నినిఁ బూజింప
వలయును. బంధువులను, దారపుత్రాదిజ్ఞాతులను, భృత్యులను, పశు
వులను సంరక్షింపకున్న నవి వానిపరలోకములకు హానిఁ గలిగించు.
కావున గృహస్థుం డందఱిఁ దనుపవలయు. స్వప్రయోజనమునకు
మాత్రమే గృహస్థుండు వంటచేసికొనరాదు. వృథగాఁ బశుహింస

నేయరాదు. శాస్త్రీయముగ వండఁబడు నన్నము భుజింపఁదగినది. రాత్రి యును బవలును సాహారాదులఁ వండి భూతములకుఁ దృప్తిగా వాయసములకును, శునకములకును, నంధులకును,గురూపులకును బలుల నర్పింపవలయును. దీనినే వైశ్వదేవమందురు.అతిథులు నభ్యాగతులును భుజింపఁగా నవశిష్టమగు నన్నమును విఘసమందురు.యజ్ఞశిష్టము నమృతమందురు. ఈవిఘసామృతముల నేగృహస్థుఁడు భుజింపవలయును. అతిథిసత్కార మనునది యొకయజ్ఞము. ఇం దతిథులను బ్రీతితో గౌరవింపవలయును. వారుభుజించి లేచినపిదప వారిచేతులలోఁ బుష్పములనిచ్చి మంచిమాటలాడవలయును. వారు తమయునికిపట్లకుఁ బోవుతఱి వారివెంటఁ గొంత దవ్వరిగి మరలవలయును. ప్రీతిపూర్వకము లగుమాటలతో వారి కుపచారములను జేయవలయును. వారిని గొలిచియుండవలయును. ఈ యైదువిధములగు దక్షిణలతోఁ గూడికొనియుండు నతిథిసత్కార మను యజ్ఞమును గృహస్థుఁ డనుదినంబును జేయుచుండవలయును. ఆకస్మికముగ మార్గమునఁ బోవుచు లభించిన వాఁడును, మార్గాయాసముచేఁ బడలినవాఁడును, మున్నెప్పుడును జూడఁబడనివాఁడును నగు నభ్యాగతునకు మృష్టాహారము నొసంగి భక్తితో సత్కరించిన మహాత్ముని పుణ్యఫల మగ్గలము కాదే ? గృహస్థధర్మము నీతీరునఁ బ్రవర్తింపఁజేయు పుణ్యపురుషునకు నుత్తమలోకంబు లఱచేతిలోని వని పెద్దలు వక్కాణింతురు. ఇందులకు మీ రేమి చెప్పుదురో యనిన ధర్మరాజునకు శౌనకుఁ డి ట్లనియె.

ధర్మరాజా! లోక మెల్లను విపరీతప్రవర్తనమును గావించుచున్నది.ఏకర్మములను సాధువైనవాఁ డొనర్చుటకు నేవగొనునో వానినసాధువగువాఁ డొనర్చి సంతసించును.మోహమునకు ననురాగమునకు లోఁబడి యింద్రియము లీడ్చు తెఱంగునఁ బోవుకర్ముఁడు శిశ్నోదరసంతృప్తికై యర్థమును నాహారమును నెక్కు డార్జించియు నతిథులకుఁ బెట్టకుండు. విడివడి యథేచ్ఛములుగా సంచరించుగుఱ్ఱములచే లాగఁబడిన రథము నందలి రథికునివలె వివేకశూన్యుఁడు విజ్ఞాననాశకములగునింద్రియములచే మోసపోవును. విషయసంసర్గము గల యింద్రియములతో మన

స్సును గలియుచుండును. మన సేయేయింద్రియములఁ గలియునో యా యింద్రియము మిక్కిలి యుత్సాహముతో స్వకార్యమును నిర్వహించుకొనును. పిదప సంకల్పమే యాధారమగు కామముచే విషయముల వలన బాధింపఁబడి దేహి లోభమనునిప్పునందు, వెలుఁగున కాసపడి దీపాగ్నిచే భస్మమగుమిడుతచందమున భస్మీభూతుఁ డగును. ఇట్లు లోభముచే భ్రష్టుఁడై యనేకమార్గములం బోయి సుఖాభాసం బగు మహామోహమున మునిఁగి తన్నుఁ దా నెఱుంగనేరక యవివేకకార్యములకు, దురాశలకుం జిక్కి యధోగతిఁ జెంది బ్రహ్మ మొదలు గడ్డిపోచవఱకుఁ గల సర్వభూతలోకములయందు జననమరణముల నొందుచు సంసారచక్రమునందుఁ దిరుగుడుపడుచుండును. ఇయ్యది యవివేకులమార్గము. ధర్మమునందును శ్రేయస్సునందునుగోరికగల పెద్దలు మోక్షమున పేక్షించి, కర్మముల నాచరింపవలయు ననియు, వానిని బరిత్యజింపవలయు ననియు రెంటినిఁ జెప్పు వేదములముఖ్యాభిప్రాయము నెఱింగి సకలకర్మముల యొక్క ఫలాపేక్షను వదలి సకలధర్మముల ననుష్ఠింతురు. నిష్కామకర్మాచరణమును గావింతురు. యజ్ఞము, వేదాధ్యయనము, దానము, తపస్సు, సత్యము, దమము, క్షమ, తృష్ణాత్యాగము ననునెనిమిది విధములధర్మము వర్తిల్లుచున్నది. అందు మొదటివి యగు యజ్ఞము, అధ్యయనము, దానము, తపస్సు అను నాల్గింటిని గర్మముల మూలమున ననుష్ఠించువాఁడు పితృయానమార్గమున నయ్యైకర్మములకు విధించినలోకముల కరిగి యాయాకర్మములఫలముల ననుభవించును. నిష్కామకర్మము నాచరించి, కర్మఫలములను బ్రహ్మార్పణంబు గావించి, యమము, నియమము, ప్రాణాయామము, ప్రత్యాహారము, ధ్యానము, ధారణ, మననము, సమాధి యను నష్టాంగయోగమునఁ జిత్తమును బరిశుద్ధము సేసికొని, సత్యము, క్షమ, దమము, లోభములను నాల్గింటిని వశపఱచుకొని, సంకల్పసంబంధమును, నింద్రియనిగ్రహమును జిత్తనిరోధమును, వ్రతవిశేషమును, గురుసేవనమును, నల్పాహారము భుజించుటయు, వేదాధ్యయనము గావించుటయు, కర్మసన్న్యాసంబును వీని నన్నిటిని లెస్సగా వాడుకలోనికిఁ దెచ్చికొని యాశాద్వేషములు బొత్తుగ లేనివాఁడై జ్ఞానియగువాఁడు జననమరణరూపసంసారమును గెల్చి దేవ

యానమార్గమున నుత్తమలోకములకరుగును.ఏకాదశరుద్రులగు అజుఁడు ఏకపాదుఁడు,అహిర్బుధ్న్యుఁడు,త్వష్ట,రుద్రుఁడు,హరుఁడు,శంభుఁడు,త్ర్యంబకుఁడు,అపరాజితుఁడు, ఈశానుఁడు,త్రిభువనుఁడుమున్నగువారును,ద్వాదశాదిత్యులగు నింద్రుఁడు, ధాత,పర్జన్యుఁడు,త్వష్ట,పూష, అర్యముఁడు, భగుఁడు,వివస్వంతుఁడు, విష్ణువు, అంశుమంతుఁడు,వరుణుఁడు, మిత్రుఁడు మున్నగువారును నీవిధ మగు యోగాచరణంబు గావించి పరమపదంబు నలంకరించిరి. కుంతీపుత్త్రుఁడా! నీవును మనస్స్థైర్యము కలిగి శాంతినిఁ బొంది, తపస్సు యోగము ననియెడి వీనిచే మహిమను సంపాదించి సిద్ధిని బడసి విప్రుల భరింపుము. సిద్ధులు సర్వంబు సాధింతురు. అనిన శౌనకు మాటలను ధర్మరాజు విని తనపురోహితుఁ డగు ధౌమ్యున కిట్లనియె.

"మునీశ్వరా! సదా వేదాధ్యయనపరులగు విప్రులు మావెంట నరణ్యవాసమున మాతో నిడుమలఁ గుడుచుటకు సంసిద్ధులుగ నున్నారు. ఎంత వారించినను వారు నిలువనోపరు.నాయందనురాగముగల వీరిని నే విడువనొల్ల. వీరలను నరణ్యంబునఁ బోషించుట కుపాయం బొకటి యానతిమ్ము" అని యడుగ ధౌమ్యుం డొకముహూర్తమాత్రం బాలోచించి ధర్మదూషితముగాని యొక యుపాయము నాలోచించి నిశ్చయించి ధర్మజున కిట్లని విన్నవించెను.

### ధౌమ్యుండు ధర్మరాజునకు నాదిత్యహృదయము నుపదేశించుట

పూర్వ మొకానొకప్పుడు సర్వభూతములు నన్నములేక, యాఁకలి కోర్వలేక తపింప సాగెను. అప్పుడు కర్మసాక్షి యగు సూర్యుం డీభూతములన్నియు మలమలమాడుటను జూడలేక యుత్తరాయణమునఁ బ్రవేశించి తనకిరణములమూలమునఁ బుడమిలోని సకలరసములను బీల్చి, మరల దక్షిణాయనమునఁ బ్రవేశించి మేఘరూపమున నోషధులను బొందించి రాత్రికాలములందుఁ జంద్రకిరణములమూలమున వానిని దడుపుచుఁ బెంచి యం దన్నమును నుత్పత్తిసేసి సర్వభూతములను బ్రజలను రక్షించెను. కావుననే యన్న మాదిత్యమయము నాఁబడు. సూర్యుఁడే సర్వభూతములకుఁ దండ్రి. భీముఁడు, కార్తవీర్యుఁడు, పృథువు, నహుషుఁడు మున్నగు తొల్లింటిరాజాధిరాజులును,చక్రవర్తులును, దపోనిష్ఠచే

సూర్యు నారాధించి యన్నమును సాధించి సర్వభూతకోటి నాపదలనుండి తొలఁగించి రక్షణము గావించిరి. నీవును దప మొనర్చి యామహిమచే భూసురులను భరింపుము. అనిన విని జనమేజయుండు ధర్మనందనుని సూర్యోపాసనావిధిని వివరింపు మని వైశంపాయను నడుగ నామహర్షి సత్తముఁడు ఓ జనమేజయమహారాజా! తత్ప్రకారమును జెప్పెద. శుచివై శాంతముగ విను మని యిట్లనియె.

ఈసూర్యారాధనముచే నన్నంబు సాధింప నగు నని యారాధనా విధానమును జెప్పి సూర్యుఁడు, అర్యముఁడు, భగుఁడు, పూషుఁడు ననునవి మొదలుగా సూక్ష్మాత్మ, మైత్రేయుండు, కరుణాన్వితుండు అనియెడు నామంబులు కడపటఁ గలనూటయెనిమిది సూర్యదేవతాక నామములను ధర్మరాజునకు ధౌమ్యుఁ డుపదేశించెను. పిదప ధర్మజుతో ధౌమ్యుఁడు, తా నుపదేశించిన సూర్యనామములు సూర్యనామాష్టోత్తరశతం బనియు, నయ్యది బ్రహ్మచే మొట్టమొదటఁ జెప్పఁబడియె ననియు, నానామంబులను సూర్యోదయకాలమునఁ బ్రతిదినమును బఠించు బ్రహ్మచారులు భార్యలను బొంది గృహస్థు లగుదురు. పుత్రార్థులు పుత్త్రులను, ధనకనకవస్తువాహననిలయంబులలో నెవ రెయ్యవి కోరుదురో వా రా యావస్తువులును,సర్వాభీష్టములును, పూర్వజన్మము నందలి జాతిస్మరణమును, ధైర్యసాహసాదిగుణములును, విశేషబుద్ధియుఁ బడయుదురు. సూర్యారాధనమున శోకమోహములు వాయును. చోరాగ్నులవలని భయంబులు దొలఁగును. సముద్రయానముఁ జేయు వారు సముద్రమునఁ గలుగు విపరీతములచేఁ గలుగుకుండు వాయుదురు అని చెప్పి ధర్మజు నుద్దేశించి, ఓ ధర్మపుత్త్రా, నీ వీనామముల జపించి లోక బాంధవు నారాధింపుము. దేవతలు, సిద్ధులు, సాధ్యులు, మునులు కిన్నరులు, రాక్షసులు, యక్షులు, పితృగణములు ననియెడివారిచే నెల్లప్పుడు నుతింపఁబడుచు బంగారువంటిచాయ గలిగి, యగ్నికాంతికి దీటైన ప్రభలతో నొప్పారు భాస్కరునకు నమస్కరించుచున్నాను. అని ప్రార్థించి ధర్మరాజునకు ధౌమ్యుండు సూర్యస్తోత్రం బుపదేశించెను. ధర్మజుఁడును నిత్రాగరిష్ఠుండై పరిశుద్ధాత్మ గలవాఁడై దివ్యపుష్పములతో సూర్యదేవునినూటయెనిమిదినామంబులను బఠింపుచుఁ బూజించెను.

పిదపఁ గొన్నాళ్లు గంగాసలిలములయందు నిత్యస్నాన మాచరించుచు వాయుభక్షణుఁడును, జితేంద్రియుఁడునై యోగమును సాధించి కర్మసాక్షి యగు సూర్యునకు నెదుట నిల్చి యాచండభానుం డగు పరదేవతను నిట్లని స్తుతించెను.

## ధర్మరాజు సూర్యు నారాధించుట

పరమపురుషా! నీవే లోకములకుఁ గన్ను. సర్వదేహధారుల కాత్మవు వారలపుట్టుకకుఁ గారణమవు. కర్మఠుల యాచారంబు నీవ. సర్వసౌఖ్యములకును గతివి నీవ. మోక్షమును జెందినవారు నీలోకములఁ బ్రవేశించి సద్గతిని జెందుదురు. జగత్తుయొక్క ధారణమును నీవు కావింతువు. స్వయంప్రకాశమానమూర్తివి. నీవెలుఁగుచే జగంబులను వెలిగించువాఁడవు. నీకిరణస్పర్శచే నన్నియును బావనము లగును. ప్రయోజనాపేక్ష లేక లోకములను బాలించువాఁడవు. ప్రతిదినమును భూసురులు ముప్పూటలయందు నిన్ను నుతించుచు నుపస్థానమంత్రములచే నిన్ను పాసింతురు. ఇంతేకాక సిద్ధులు, చారణులు, గంధర్వులు, యక్షులు, గుహ్యకులు, పన్నగులు, వసురుద్రాదిత్యవాలఖిల్యాదులు, ముప్పదిమూఁడుకోట్లదేవతలు, పితరులు, ఇంద్రుఁడు, ఉపేంద్రుఁడు, అష్టవసువులు, ఏకాదశరుద్రులు, సాధ్యులు, మహర్షులు ననెడివీ రెల్లరు నీదయకుఁ బాత్రులై ధనవంతుని వెంబడించు ధనార్థులవలె నతివేగముగ నడుచుచుండు నీరథంబును వెంబడించుచు వరార్థులై నిన్ను బహుకాలంబు సేవించి ముక్తులైరి. దివ్యము లగు పారిజాతకుసుమములచే విద్యాధరులు సదా నిన్నుఁ బూజించి యిష్టసిద్ధిఁ బడసిరి. సకలలోకములలోను నీవే పెద్దవు. అన్నింటిని నీవెలుంగుచేఁ బ్రకాశింపఁ జేయుచున్నావు. తేజస్సులన్నియు నీలో నడంగియుండు. వెలుతురు గల యన్నివస్తువులకు నీవే దొరవు. సత్యము, సత్త్వము, సాత్త్వికభావము నను నివి రూపములు. నీతేజంబున విశ్వకర్మ నిర్మించిన సుదర్శనచక్రమును సాధనముగాఁ జేకొని విష్ణుండు రాక్షసులమదము నణఁగించెను. నీవు వేసవియందు నీకిరణముల మూలమున సకలరసముల నాకర్షించి, వర్షర్తువున మేఘరూపివై వర్షించి సకలౌషధములను బెంపొందించుచున్నావు. చలికాలమునందు మానవశరీర

ములు చలిచేఁ గొంకుపోఁగా,వానిని నీవు నీకిరణములచే స్పృశించి వాటిని సౌఖ్యవంతులుగఁ జేయుచున్నావు. సప్తద్వీపములతోఁ గూడుకొని యున్న యీ భూలోకమును, సకలలోకములను నీకిరణములచేఁ బ్రకాశమానముగఁ జేయుచు లోకహితముఁ గావింతువు. నీ వుదయింపకున్న లోకములనెల్లఁ గటికిచీఁకటి యావరించియుండు. అటులేని ధర్మములు మున్నగు కర్మములు పెద్దలచే నాచరింపఁబడవు. బ్రాహ్మణులగ్న్యాధానము, పశుబంధము,యజ్ఞము,తపస్సు మున్నగుకర్మములను, మహానుభావుఁడా! నీయనుగ్రహంబుననే చేసెదరు. బ్రహ్మదేవునియొక్క పగలు మాత్రము వేయియుగములపరిమాణము గలది. ఇందులకు నీవే కారణమవు. సర్వ మన్వంతరములును నీయాజమాన్యముననే జరుగుచుండు. ప్రళయకాలమునందు నీక్రోధమునఁ బుట్టిన సంవర్తక మని పేర్కొనఁబడుననలంబు మూఁడు లోకములను భస్మరాసులుగఁ జేయును. వెంటనే నీకిరణములచేఁ బుట్టినమేఘములు నానావిధములగువన్నెలతో వెలయుచుఁ గన్నులు మిఱుమిట్లుగొలుపు మెఱపులను మెఱసి,బ్రహ్మాండమును బీటలువాఱునట్లు పిడుగులు పడఁ జేసి, కడవలతో ముంచిపోసినట్లు వానలు గురిపించి జగములను నీట ముంచును. ఆతీరుననే జలమయమైనభూప్రదేశమునుమరలఁ దీవ్రమగు నెండలు కాసి నీటి నంతయును శోషింపఁ జేయుదువు. పండ్రెండురూపముల ధరించుశక్తిగలవాఁడవు నీవు. కావుననే నిన్ను ద్వాదశాత్ముఁ డని పెద్ద లందురు. ఇంద్రుఁడవు నీవ. విష్ణుఁడవు నీవ. అగ్నివి నీవ. ప్రజాపతివి నీవ. మనస్సవు నీవ. ప్రభుఁడవు నీవ.శాశ్వతమగుబ్రహ్మవు నీవ. సవితృ, హంసపదములతోఁ జేర్కొనఁబడువాఁడవును నీవే. ఓమహాత్ముఁడా! షష్ఠినాఁడు గాని, సప్తమినాఁడు గాని నిన్నారాధించు వారికి సమస్తైశ్వర్యములు గలిగించి లక్ష్మి తాను వారియింట వసియించు. ఓమహానుభావా! త్రికరణశుద్ధులై నీకు మ్రొక్కువారు చిరంజీవు లగుదురు. నీరోగులై సుఖింతురు. వారి నేపాపములును నంటవు. వివిధాన్నముల కన్నింటికి యజమానుఁడా! నావెంబడి నుండువారి కాతిథ్యమును జేయఁగోరి నిన్నన్నమును బ్రసాదింపు మని ప్రార్థించు నా కన్నము నొసంగుము. ఓకర్మసాక్షీ! నీయనుచరులు మాఠరుఁడు, అరుణుఁడు, దండుఁడు మున్నగువారికిని, శనైశ్చరునకును, క్షుభ, మైత్ర మున్నగు

మాతృకలకును సాష్టాంగనమస్కారములం జేసెద. శరణాగతుండ నగున న్నెల్లరును గాపాడవలయును." అని ధౌమ్యుఁ డుపదేశించినచొప్పున సూర్యోపాసనమును ధర్మజుఁడు నిష్ఠతోఁ జేయఁగా సూర్యుండు ప్రసన్నుఁడై, దగదగ మండుచున్నయగ్నిహోత్రునివలె వెలుంగుచు, ధర్మపుత్త్రునకు సాక్షాత్కరించి యిట్లనియె.

### సూర్యుండు ధర్మరాజునకు నక్షయపాత్రము నొసఁగుట

"పాండునందనా! నీతపంబునకు మెచ్చితి. నీకు వరముల నొసంగెద. నేను భాస్కరుఁడను. నీకుఁ బ్రత్యక్షమైతిని నీయిష్టము సిద్ధించుఁ గాక! నీ కీపండ్రెండేండ్లును మృష్టాన్నంబు నే నిత్తు. నీయరణ్యవాసకాలమున నీకును నీయతిథులకును గొఱఁత లేకుండ నే నన్నంబు పెట్టెద. ఈతామ్రపాత్రమును గొనుము. ద్రౌపది వంటయింటఁ గాయగడ్డలువండి యీపాత్రమున నుంచె నేని దీనిమహిమచే రసవంతమైన యన్న మపరిమితముగ నక్షయ మగును. ఇఁకఁ బదునాలవయేట మీరు మీరాజ్యమును మగిడి పొంది సుఖు లగుదురు" అని వక్కాణించి భానుఁ డంతర్హితుఁ డయ్యెను.

ఈసూర్యస్తోత్రమును నిత్యము పరిశుద్ధాత్ముఁడై పఠించు పుణ్యాత్మునకు నబ్బరానిఫలంబులనుసూర్యుఁడొసఁగు. పుత్త్రులఁగోరువారు సంధ్యాకాలములయందు దీనిని బఠించుచోఁ బుత్త్రులఁ బడయుదురు. విద్యార్థులు విద్యను, ధనార్థులు ధనమును, నాపన్నుఁ డాపన్నివారణను, భాస్కరోపాసనచేఁ బడయుదురు. కారాబద్ధుండు ముక్తుఁ డగును. జయార్థి విజయమును బొందును. స్త్రీపురుషు లెవ్వరైనను నీఫలములం బొందుదురు. ఈభాస్కరస్తోత్రము బ్రహ్మప్రోక్త మని మున్నె నుడువఁబడియున్నది. బ్రహ్మదీనిని నింద్రునకును, నింద్రుఁడు నారదునకును, నారదుఁడు ధౌమ్యునకు నిట్లు పరంపరగాఁ బ్రసాదంప నిప్పుడు ధౌమ్యుఁడు తనశిష్యుండగు ధర్మపుత్త్రున కుపదేశించె. దీనిప్రభావం బగ్గలంబు. ఈలోకమున సూర్యోపాసకులు సకలవాంఛితములను గొఱఁత లేకుండ ననుభవించి శరీరత్యాగానంతరము సూర్యసాలోక్యమును బడయుదురు.

ఇట్లు సూర్యానుగ్రహంబున వాంఛితంబు వడసి ధర్మపుత్త్రుండు తపమును జాలించి ధౌమ్యునకు నమస్కరించి, తమ్ముల నభినందించి,

సూర్యప్రసాదమును వారికి వివరించి,నరలబ్ధమైనయక్షయపాత్రను ద్రౌపది
కొసంగె. ద్రుపదరాజనందనయు నదిమొదలు కాయగూరలను వండి
యాసూర్యదత్తపాత్రంబునఁ బెట్టి దానినుండి యాశ్చర్యముగాలభించు
రసవంతమై రుచ్యమైన చతుర్విధాన్నంబున బ్రాహ్మణాతిథ్యభ్యాగతసంత
ర్పణము యథేష్టముగఁగావించుచుండె. బ్రాహ్మణాతిథ్యభ్యాగతులాహార
ములనుగొనినపిదప,ధర్మపుత్త్రుఁడు మిగిలినయన్నమును దమ్ములకుఁబెట్టించి
పిదప శేషమును దానును గుడుచుచుండె. అందఱును భుజించినపిదప
ద్రుపదనందన దానును నాహారమును భుజించుచుండె.

## ధర్మరాజు కామ్యకవనమును బ్రవేశించుట

ఇట్లు ధర్మపుత్త్రుండు సూర్యప్రసాదమున లభించిన యక్షయ
పాత్రమునం దుత్పన్నంబు లగు నన్నరాసులచేత భూసురులను నిత్య
తృప్తులంజేయుచు వారియాశీర్వాదంబులను బడయుచు శాస్త్రోక్తములైన
యిష్టి మున్నగుకర్మములను దత్తత్కాలానుసారంబుగఁ బ్రవర్తిల్లఁ
జేయుచు సుఖముతోఁ గాలమును గడుపుచుండె.అంతట ననుచరులందఱు
వెంట రాఁగా గంగాతీరమును వదలి సరస్వతీ దృషద్వతీ యమునా
నదులయందు స్నానమాచరించినిత్యపూజలఁ జేయుచునరణ్యమార్గమునఁ
బడమటిదేశంబుఁ జొచ్చి సరస్వతీతీరంబున నొప్పాఱునదియు, మునిజ
నుల కతిరమణీయంబైనదియు నగు కామ్యకం బనువనమును బ్రవేశంచెను.

## ధృతరాష్ట్రుండు విదురునితో నాలోచించుట

అంత నిట ధృతరాష్ట్రుఁడు పాండవులవనవాసమునకుఁ గొంత చిం
తించి మతిమంతుఁడగు విదురుం బిలిచి నీవు శుక్రునంతటిప్రజ్ఞావంతుఁడవు.
ధర్మసూక్ష్మముల నెఱింగినవాఁడవు. కౌరవులకుఁ బాండవులకు సముఁడవు.
నాకును నిష్టుఁడవు. ప్రజ లెల్లఁ బాండవులవనవాసము నిమిత్తముగాఁ
మనలఁ జేరరైరి. మనకు హానిఁ దలంతురు కాఁబోలు. వారు మనలఁ
జేరు నుపాయము నూహించి చెప్పు మనిన విదురుం డిట్లనియె. రాజా!
ఆలకింపుము. ధర్మము, అర్థము, కామము, రాజ్యము ఈనాలుగును
ధర్మము మూలముగాఁ గలవి. కావున నీవు ధర్మమార్గము ననుసరించి
పాండవులను నీకొడుకులను నందఱఁ గాపాడుకొనుము. దుష్టుఁ డైన

దుర్యోధనుఁడు శకుని యాలోచనచే నన్యాయ్యమైన జూదము
నాడి సత్యసంధుఁడగు ధర్మజు మోసముచే నోడించెను. ఈయధర్మ
మునకు మనస్సున నొచ్చి ధర్మజాదు లలిగియున్నారు. ఇందుల కొక
యుపాయ మున్నది. తన్మూలమున నీపుత్త్రులును సుఖులై యుందురు.
వారి నెల్లవిధముల నాపదలు చేర నీయకుండఁ జేసి రక్షించుకొనుము. ఆ
యుపాయ మెయ్యది యంటేని వినుము. పాండవుల నింతటనైన రప్పించి
వారి రాజ్యమును వారి కిప్పించుట. అదియ లగ్గు. దీనిచే నీకుఁ గీర్తియు
ధర్మంబును గల్గును. ధర్మము వృద్ధిఁ బొందును. క్షేమము చేకూఱును.
ఈవిధమున నాచరించుటవలన శకుని కవమానమును, పాండవులకు
సంతోషము నగు. రాజైనవాఁడు తనసంపదలతో సంతోషించుచు, నిత
రుల సంపదల కాశింపకునికియే పరమధర్మము. నీనూర్గురు కొడుకులలో
నొక్కని నైనఁ దక్కించుకొనుటకుఁ గోరితి వేని యతిశీఘ్రమున ని
ట్లొనర్పుము. కానినాఁడు నీకొడుకులకు ముప్పుతప్పదు. పాండవులు దివ్య
మూర్తులు. ధైర్యసాహసయుతులు. వారిబలపరాక్రమములు నీ వెఱుంగ
నివి కావు. భీమార్జునులు దేహబలమునందును, వివిధాస్త్రవిద్యావిశేష
ములయందును ప్రఖ్యాతి గాంచినపురుషులు. వైరివీరులను గార్చిచ్చు
వోలెఁ బొదివిదహింతురు. కడిందివీరు లగుటం జేసి యీసు పెంపున శత్రు
వుల నిర్మూలంబు సేయుదురు. వారలకు సాధింపరానిది త్రిలోకములయం
దేదియును లేదు. దుర్యోధనుఁడు పుట్టినయపుడే నీకు హితంబు బోధిం
చితి. మేలు చేకొన వైతివి. వీనిపుట్టినపాపవేళయందు దుర్నిమిత్తంబు
లనేకములు గలిగినవి. వీనిచేతఁ గౌరవుల కాపదలు పుట్టు నని నుడివితి.
కులదూషకు దూషించి కులమును రక్షించుకొనుము. ఇది ధర్మువు.
రాజ్యమును ధర్మపుత్త్రుఁడు పాలించునేని ప్రజలు, బంధువులు,
రాజులును సంతసింతురు. వీరు వా రనవేల ? ఎల్లవారును సుఖింతురు.
దుర్యోధనశకుని కర్ణాదులు పాండవులను గొలుతురు గాక ! సభా
మధ్యంబున ద్రౌపదిని, భీమునిఁ బ్రార్థించుటకు దుశ్శాసనున కానతి
నొసంగుము. ఇట్లు చేసి, కృతార్థుండ వగుము. సూర్యుని తేజస్సుతోఁ
బ్రకాశించు మహాబుద్ధిమంతుఁడు, నీతిమంతుఁడైన ధర్మరాజు మీవారి
కృత్యములను మన్నించు. ఇట్లు చేసి కులమును బాలింపుము. నీకతంబున

ప్రతిపక్షులము రక్షింపఁబడు. నీవు నన్నుఁ బిలిచి హితంబు సెప్పు మనిన నింతకంటె వేఱేదియుం జెప్పనేర. ఇట్లొనర్చి కృతకృత్యుండవై యాచంద్రార్కస్థాయి యగు కీర్తిని బొందుము. అనిన ధృతరాష్ట్రుం డిట్లనియె.

“విదురా! నీమాటలన్నియుఁ బాండవులకే హితంబులు. నాపుత్త్రుడై నాశరీరమునుండి పెద్దవాఁడుగఁ బుట్టినవాని నే నెట్లు విడుతు. ఆత్మపుత్త్రులవినాశం బొకండు గోరునే? నీ విట్లనఁదగునే! ఇతరులకై నాదేహంబునఁ బుట్టినవారిని విడువు మని బోధించువా రుందురా? నేను నిన్ను నెన్నివిధముల మర్యాదలతోఁ జూచుచున్నను కుత్సితముగ నేపలుకుచుందువు. నీవు నాకొడుకులయున్నతి నెన్నండును సహింపవు. నీయాలోచనలు దురాలోచనలు. నీప్రాపు నాకు ముప్పు గలిగించు. పాండవుల నెప్పుడును బొగడుచుందువు. నీవు వారికడ కేఁగెదవో, యింక నెందులకేనియు నీయిచ్చవచ్చినచోటికిఁ బొమ్ము.” అని నిరాకరించి పలుకఁగ నే విదురుండు పాండవులకడకుఁ బోవువాఁడై వేగవంతములైన గుఱ్ఱముల నొకరథమునకుఁ బూన్చి యందుఁ గూర్చుండి పాండవు లున్న కామ్యకవనంబున కరిగె.

### విదురుఁడు కామ్యకవనంబున నున్న ధర్మరాజాదులకడ కేఁతెంచుట

అచ్చోట వేదవేదాంగపారగులును, గర్మఠులును, ధర్మపరులును నగు బ్రాహ్మణులును, దమ్ములును, ద్రౌపదియుఁ దన్ను చుట్టుకొనఁ బెద్ద కొలువమరి యుండు ధర్మరాజు దూరంబున వచ్చువిదురుం గని భీమసేనున కిట్లనియె. భీమసేనా! నాఁడు జూదంబున మనము మనయాయుధంబుల నొడ్డుట మఱచుటను మరల జూదమాడి యాయాయుధంబుల నోడిచికొనునిమిత్తము క్రమ్మఱ జూదమాడఁ బిలుచుటకు విదురుని నాదుష్టుఁ డగు దుర్యోధనుఁడు శకుని దురాలోచనం జేసి పంపె నేమో! కానినాఁ డీతని కిప్పట్టున కేల రావలసివచ్చె? ఈతనిమాటలను మనము ద్రోసిపుచ్చనేర మని మునుపటి చొప్పున నిప్పుడును నీతఁడే వచ్చుచున్నాఁడు. కటకటా! ఇఁకను నేనుజూదం బాడనోప. అర్జునునిగాండీవమును, నీగదను వారోడిచికొన్న నీపదునాలుగేండ్లు చెల్లినపిదప మనకు రాజ్యమెట్లు లభించును!” అని వారు తమలోఁ దా మనుకొనుచుండ విదురుండుసమీపించెను. అంత నాధర్మపుత్త్రాదులతని కెదు రేఁగి సత్కరించి

కూర్చుండ వేఁడి యందఱుం గూర్చుండి యతఁడేల వచ్చెనో యాకారణం బడుగ వారికి విదురుం డిట్లనియె.

"ధర్మపుత్త్రా! మీరు వనవాసంబున కేఁగినకొన్నినాళ్లకు ధృతరాష్ట్రుండు నన్నుఁ బిలిచి నీవు కౌరవులకును బాండవులకును సముఁడవు. ఎట్లొనర్చిన హిత మగును?" అని యడుగ, నే నుభయపక్షములవారికిని బాలితులగు ప్రజలకును, జగంబునకును మేలుగ హితవచనంబులాడితి. సర్వజనులకు రుచ్యమైన యాహారము రోగికి నపథ్యంబగునట్లు నాయాడినమాటలు నాచేత రాజునకు రుచింపవయ్యె. దురాచారయగుదుష్టభార్య సదాచారవంతుఁడగు సత్పురుషునకు సుఖము నొడఁగూర్చునే? జవ్వనికి బహుగుము దుకిం డింపుఁగూర్చునే? కార్యగతుల తెఱఁగు కలరూపు సెప్ప బుద్ధిమంతులు దాని నాదరింతురు; అల్పబుద్ధు లగువారి కయ్యది విషము వోలె నిరసనముఁ గలిగించు. తామరాకుపై నీటిబొట్టువలె నేను మీకుభయులకు నుచితంబుగ నేపక్షమును నంటక బోధించినను దానిని రాజు వినఁడాయెను. దానంజేసి రాజు నన్నొల్లక యొగ్గులాడి నన్ను విపరీతములు పలుకువానిగ నెన్ని, నాహితవచనంబులకుఁ బెడమొమిడి నన్నెటకేనియుం బొమ్మనెను." అని చెప్పి "ధర్మశూన్యు లగు దుర్యోధనాదులకు రాజ్యంబు స్థిరము కానేర" దని సూచించి మఱియు నిట్లు తెలిపెను. "ఓధర్మాత్ముఁడా! ఆరాజ్యసంపద లన్నియుఁ దమకుఁ దామ వచ్చి నిన్ను వలచు. బలవంతులగు శత్త్రురాజులు పైఁబడి పీడించుచున్నను నోర్పుతోఁ దఱివేచురాజు నీతిపరుఁడు. ఆఁకలి మందగించినరోగి క్రమముగఁ బథ్యాదులచే నాఁకలిని వృద్ధిఁ బొందించుమాడ్కిఁ గ్రమంబుగ భూవలయము నంతను సాధించు. ఎవఁడు తనధనమును సహాయులకుఁ దగురీతిఁ బంచియిచ్చునో, వాఁ డాపదలఁ బొందినపు డాసహాయులు దప్పక వానికిఁ దోడ్పడుదురు. వానియాపదలయందును వారు పాల్గొందురు. ఇయ్యదియే సహాయులవలనిలాభము. సహాయబలముచే రాజ్యము సులభోపాయమున సాధింప నగు. అట్టివారిని దనవలె నాదరింపవలయు. తన్నధికునిఁగ భావింప రాదు. ఇట్టిరాజవశ్యంబుగ వృద్ధిఁ బొందు." అనఁగా ధర్మరాజు విదురునితో "నీయాలోచనప్రకారము నేను నడచెదను. మఱియు

నేయే వేళలలో నెట్లెట్లు బోధింతువో యాయా వేళలలో నట్లు చేసెద." నని యొప్పుకొని విదురుని మెప్పుగా నాదరించుచుండె.

### విదురుఁడు మఱల ధృతరాష్ట్రునొద్దకుఁ బోవుట

మఱియు నిట హస్తిపురమున ధృతరాష్ట్రుఁడు, పాండవులయొద్ద విదురుఁ డున్నాఁడని యెఱింగి యతనిబుద్ధికౌశలముచేఁ బాండవుల కెట్టిమేళ్లొనఁగూర్పఁబడునో యని చింతించి యేమియును దోఁపక రాజు లందఱును జూచుచుండ మూర్ఛవోయి క్రిందఁబడి, కొంతసేపటికిఁ దెప్పఱిలి లేచి, దగ్గఱ నున్న సంజయునిఁ బిలిచి యిట్లనియె. "సంజయా! విదురుఁడు నాతమ్ముఁడు; చెలికాఁడు; సకలధర్మముల నెఱింగినవాఁడు మిక్కిలి బుద్ధిమంతుఁడు; తేజస్వి. అతనిమనస్సు నొవ్వ నే నాడినమాటలు ములుకులై తోఁప నాతఁడు నాయొద్ద నుండనొల్లక కామ్యకవనమున బాండవు లుండ వారియొద్ద కేఁగి వారిచెంత నున్నవాఁడు. విదురుఁ డప్పుడప్పుడు నాకు రుచించునట్లు ధర్మంబులు సెప్పుచు నన్ను సంతోష పెట్టుమాట లాడుచు నాయొద్ద నుండును. అట్టివాఁ డిప్పుడు లేమి నామనస్సు కొఱఁతపడియున్నది. నీవు త్వరితగమనమున విదురునిఁ దోడ్కొని రమ్ము" అని పశ్చాత్తాపముతో నేడ్చెను. అంత ధృతరాష్ట్రునాజ్ఞఁ గొని సంజయుఁడు కామ్యకవనమున కేఁగి యందు ధౌమ్యుఁడు మున్నగు వేనవేలు భూసురులును, ధర్మమూర్తు లనఁదగు తమ్ములును, విదురుఁడును, పాంచాలియు ననెడి వీరెల్లరును దన్నుఁ గొలుచుచు నరణ్యమున నుండియు దేవతలసమూహముతోఁ గూడుకొని యున్న దేవేంద్రునివిధమునఁ బ్రకాశించుచున్న ధర్మరాజును జూచి యాతనిచే సత్కృతుఁడై యిట్లనియె. "ధర్మపుత్త్రా! కౌరవరాజు [illegible], ధర్మాత్ముండగు విదురుని నెప్పుడును దలంచుచు నేయుండు. మీ యనుమతిఁ బొంది విదురునిఁ దోడ్కొనివచ్చుటకు నన్నంపియున్నాఁడు" అనిమఱియు విదురునితో, "మహానుభావుఁడా! ధృతరాష్ట్రమహారాజెల్లప్పుడును మిమ్మే తలంచుచు వేఱొద్దియును దోఁపక, మీరు లేకున్నఁ బ్రాణము లేల" యనివగచుచున్నాఁడు. వేగమున నిన్నుఁ దోడ్కొనిరా నన్నంపెను. ఏవిధముననైనను హస్తినాపురమునకువచ్చి యారాజుం బ్రతికింపుము" అనఁగా ధర్మరాజు విదురుని ధృతరాష్ట్రునొద్దకుఁ బోయి యుండుమనెను.

ఆతనియనుమతిఁ గొని విదురుఁడు హస్తినాపురమున కేఁగి పెద్దరాజును సందర్శింపఁగా నాతఁ డావిదురుని గౌఁగిలించుకొని శిరమును మూర్కొని దగ్గఱఁ జేర్చి "విదురా! నీ వతిశాంతచిత్తుఁడవు. నాభాగ్యముచే నేఁ బెప్ప పంపఁగా నామాటల నాదరించి మరల వచ్చితివి. నిన్నుం జూడక నే నిన్నినాళ్లు మఱేమియుం దోఁపక కృశించితిని. నాతప్పుల నోర్చి నన్ను మన్నింపుము" అనిన విదురుఁడు మహారాజా! నీయాజ్ఞను శిరస్సున వహించి నీవు రమ్మనఁగానే నీయొద్దకువచ్చితి. నీవును, నీసుతుండును నెఱిఁ దప్పి పలుకఁగాఁ బథ్యమైనపలుకేఁ బలికితిని. కాని నాకు వారునువీరును నొక్కటియె. దీనులైనవారియెడఁ గొంత యెక్కుడుగఁ బ్రీతి నుంచితి. ఇది యుచిత మనియు, ధర్మ్య మనియు నే నెంచెదను. ఇందు విచారము వలదు. అని చెప్పి యెప్పటియట్ల కార్యసహాయుండై విదురుఁడు ధృత రాష్ట్రునొద్ద నుండఁగా వా రిద్దఱసమాగమంబును గూర్చి సంశయించి దుర్యోధనుండు కర్ణశకునిదుశ్శాసనుల రావించి వారితో నిట్లనియె.

"రాజు మఱల విదురుని రప్పించెను. విదురుఁ డెప్పుడును పాండవ పక్షపాతి. వారిహితంబును గోరుచుండు. వానిబుద్ధి విని రాజు మరలఁ బాండవుల రప్పించుటకు మున్న మనము కర్తవ్యము నాలోచింతము. మనకు మే లెయ్యదియో యాలోచించి నిర్ణయించుకొనవలయును. పాండవులు మరల నిటకు వచ్చి రేని నేను నిప్పులఁ జొచ్చి కాని, నీటఁ మునింగి కాని, విషము మ్రింగి కాని, యురిఁ దగిలించుకొని గాని, జలాహారంబులు లేక ప్రాయోపవేశమునఁగాని, ప్రాణముల వదలెదను. పాండవు లిచ్చోటికి వచ్చి వారు మరల నిండోలగంబున నుండుట నేఁ జూచి యోర్వను." అని చెప్పఁగా నందులకు శకుని "రాజా! నీవేల యిట్లు మూఢునివలె మాట లాడెదవు? సత్యనిరతు లగు పాండవులు మరలఁ దండ్రి రమ్మన్నను రానేరరు. వచ్చిరి పో, మన మేదో యుపాయమును బన్ని మరల వారిచే జూదమాడించి వారిసకలధన ముల నోడిచికొని దేబెలం గావించి పంపుదము" అనెను. ఈమాట లకు దుర్యోధనుఁడు మెచ్చక పెడమొగముఁ బెట్టఁగాఁ గర్ణుఁడు రోష మున శకునిదుశ్శాసనాదులతో నిట్లనెను. "నామాట లాలకింపుఁడు. మన మిప్పుడు కవచాదులను ధరించి, యాయుధపాణులమై, రథముల

నెక్కి యిప్పుడే మన మందఱ మొక్కమ్మడిగా నడవులలో ననాథులై తిరుగుచుండు నాపాండవులను జుట్టుముట్టి వధింతము. మన మేవిధమున నైనను రాజరాజునకుఁ బ్రియంబు చేయవలయును. పాండవులముక్కున నూపిరియుండునందాఁక వారు మనకుఁ బ్రబలశత్రువులు. కావున వారిని జంపివత్తము. నేన నాయితము చేసికొని రణభేరి మ్రోగించి తఱలుదము. ఇంతకంటె వేఱుపాయము లేదు. వారు సమసిరేని ధార్తరాష్ట్రులు, మన మెల్లవారమును సుఖింపవచ్చును. వారిప్పుడు సంపద లన్నియుఁ గోల్పోయి యసహాయులమైతిమేని దుఃఖమున మునింగియున్నారు. వారిని హింసించి చంపుట కియ్యది యదను. పిదప వారలం గెలువ లేము.'' అనఁగా నీమాటల కందఱును సంతోషించి సేన నాయితమునేసి పాండవులపై కెత్తి వచ్చుటకు నిశ్చయించిరి.

## వేదవ్యాసుండు ధృతరాష్ట్రునొద్దకు వచ్చుట

ఇట్లు యుద్ధసన్నద్ధుండై సమస్తబలమును సమకూర్చి దుర్యోధనుండు వెలువడ నుండఁగా, నీదురుద్యోగమునంతయు మహానుభావుండు వేదవ్యాసుండు తనదివ్యజ్ఞానమున నెఱింగి శీఘ్రగతి ధృతరాష్ట్రునొద్దకేతెంచి యిట్లనియె. ధృతరాష్ట్రా! కౌరవుల కెల్లవారికిని హితమునుగోరి నీతో నొక్కమాట చెప్పెద. సావధానుండవై వినుము. దుర్యోధనుఁడు మున్నగువారు మహాపురుషు లగు పాండవులను బిలిచి మాయజూదమాడి వారిసంపదల నన్నిటిఁ గైకొని వారిని రాజ్యభ్రష్టులఁ జేసి యరణ్యములకుఁ బంపుట నాకెంతయుఁ బ్రియము గాదు. వారు తాముచేసిన సమయము మేరకుఁ బదుమూఁడేఁడులు గడపి పదంపడిక్రోధమూర్తులుగ దుర్యోధనాదులపైకి యుద్ధసన్నద్ధులై తారే వత్తురు. ఇప్పుడరణ్యమున వా రున్నారు. వారిపైకి నీకొడుకు దురాలోచనచేసి యుద్ధముచేయుటకు సైన్యము నాయితమునేసెను. ఇతఁ డచ్చటి కిప్పు డిట్లు పోయి భంగపడి వచ్చునే కాని వేఱొండు లాభము గలుగ నేరదు. నీకొడుకును బిలిచి యుచితరీతిని నీప్రయత్నమును మానుమనుము. బంధుజనవిరోధ మెంతయు నింద్యము. దానిచే నధర్మమును నపకీర్తియుఁ జేకూరును. ఈసందర్భమున దూరాలోచనచేయక యుపేక్షించినచోఁ జేటు మూడును. నీవును, భీష్ముఁడును, గురువగు ద్రోణుండును, విదురుండును నుండి యధర్మము నడచుచుండఁ జూచు

చుండఁ దగునా? ఎప్పుడును బాండవులతో నీకొడుకునకుఁగల విరోధమే కీడు దెచ్చునో? నీవా పంతమును గూడి దీనిని వారింపకుండుట తగని కార్యము" అనిన విని వేదవ్యాసునకు ధృతరాష్ట్రుం డిట్లనెను.

"మహానుభావా! నాకును, గాంధారికిని, భీష్మద్రోణకృపవిదురులకును దుర్యోధనుని చేత లనిష్టములు. జూదమునకు మే మిష్టపడినవారము కాము. మా తెలివిలేమియు, దైవబలమును నిట్టిఘోరకార్యములకు సహాయపడెను. దుర్యోధనునినిమిత్తమునఁ బుట్టుచుండు నీచెడుగుల నన్నిటిని, వానియందలి పుత్త్రస్నేహమువలన నివారింప లేకయున్నాను" అనఁగా ధృతరాష్ట్రునకు కృష్ణద్వైపాయనుం డిట్లనియె. "నీవు చెప్పినది సత్యము తల్లిదండ్రులకు సుతులయందలి ప్రేమకంటె లోకమున వేఱొకటి యధికమైనది యుండ నేరదు. ఎంతధనవంతునకైనను, బుత్త్రులు లేనిచో మనఃప్రియ మెంతమాత్ర ముండ నేరదు. ఇందుల కొక కథ చెప్పెద నాలకింపుము.

## ధృతరాష్ట్రునకు నింద్రసురభిసంవాదమును వ్యాసుఁడు సెప్పుట

పూర్వ మొకప్పుడు కామధేనువు దేవేంద్రునియొద్దకుఁ బోయి గోడుగోడు మని యేడ్చెను. దానిం జూచి జాలిపడి దేవరాజు నీవు లోకములోనిగోవుల కెల్లఁ దల్లివి. నీ కేమి కష్టము గలిగె? నీ విట్లేడ్వ నేల? దేవతలకు, మనుష్యులకు, నాగుల కెల్ల క్షేమమా? అని యడుగఁ గామధేనువు "దేవా, నాసంతానమునకుఁ దప్ప మిగిలినవా రందఱకు క్షేమము. అందఱును సుఖులై యున్నవారు. వినుము. కృషి చేసి జీవించువారు బలిష్ఠములైన యెద్దులతో దుర్బలములైన యెద్దులను గాడికిఁ గట్టి బలముగలవానితో సమానముగ బక్కయెద్దులు భారవంతములయిన నాగళ్లను దున్నునప్పుడు లాగలేకున్న, బలహీనమైనవానిని మునికోలఁ గొట్టియు, ములుగఱ్ఱతోఁ బొడిచియుఁ బిట్టలు లాడెలగునట్లు హింసించెదరు. నాసంతతి యిట్లు బాధలఁ బొందుటను జూచుచుండ లేక యీతీరున దుఃఖము గలదాన నైతి" నన నింద్రుండు "నీకు బిడ్డ లనేకము లున్నవి. వాని కన్నింటికి కొకసమయముననే గష్టములు రావు. ఏవో కొన్ని బాధితములైనచో వగవ నేల?" అనెను. అప్పుడు సురపతితో సురభి, "సురేంద్రా! దీనానసులై

దుర్బలులై న సంతతివారి దుఃఖమును నెట్లు చూడ నోపుదు ? అనిన నింద్రుండునన్ని సురభికిం గరుణించి వానం గురియించెను. కావున భూమి యం దెల్లెడలను బచ్చిక విస్తారముగ మొలచెను. మఱియు నాసమయము కృషి లేని దగుటచేం జిక్కియున్న పశువు లన్నియుం జక్కంగా మేసి బలముగలవానితో సమానము లైనవి. ఈ యింద్రసురభిసంవాదము వేదములయందు వినంబడును. కావున నో రాజా! నీకుం బుత్త్రస్నేహ ముండుట యరుదుగాదు. ఐనను దీనులై యరణ్యావాసముం జేయుచున్న యీపాండవులయెడ దయాళుండ వగుము. నీవును బాండురాజును విదు రుండును నా కొక్కరూప. అటులే నీకొడుకులునూర్వురును బాండుసుతు లేవురును నీ కొక్కరూప కా యని యెఱుంగవలయు. సజ్జనసహవాస మున దుర్మతులు సజ్జను లగుదురు. ఇది సత్యము. కావునం గొన్నాళ్లు నీ కొడుకు దుర్యోధనునిం బాండవులయొద్ద నుంచినచో వాఁడు శాంత చిత్తుఁడును, ధర్మాత్ముండు నగు. ధర్మరాజు రాజర్షి. వానితోడిసావాసము సర్వజనహితమైనది. కావున నతనిచెంతకు నీకొడుకు దుర్యోధనునిం గొంతకాల ముండునట్లు పంపుము. అట్లొనర్చుటచే నుభయపక్షముల వారికి మేలగు ననంగా ధృతరాష్ట్రుండు భగవంతుం డగు వేదవ్యాసుని కిట్లనియె.

"మునీంద్రా! దుర్యోధనుఁడు నామాటల నాలకింపఁడు. కురుకుల మును గాపాడవలయు నను బుద్ధి నీకుం గలదేని వానికి మీరే బుద్ధులు గఱపుఁ" డని మ్రొక్కంగా, వేదవ్యాసుండు "మైత్రేయుం డను ముని చంద్రుఁడు పాండవులయొద్దనుండి. నీక్షేమము లరయుటకు నిచ్చోటి కిప్పుడు వచ్చును. ఆఋషీశ్వరుఁడు నీకొడుకునకు ధర్మబోధము జేయం గలఁడు. అతఁడు బోధించినదాని వినకున్న వెంటనే శపియించు నాకుం బోవలయుం దడ వయ్యె" నని యరిగెను.

## మైత్రేయుం డను మునినాథుండు దుర్యోధనుని శపించుట

అంత ధర్మమతియు, మహాతపస్వియు, బుద్ధిమంతుఁడును నగు మైత్రేయుం డను ఋషిసత్తముం డనేకతీర్థముల కేఁగి నానాట బహుస్థలములం గ్రుమ్మరుచుం గొండొకకాలమునకు హస్తినాపురమున కేతెంచి రాజైనధృతరాష్ట్రుని సందర్శించెను. అప్పు డమ్మునీంద్రుని నుచిత

స్థితిని రాజు సపర్యలచే నాదరించి సుఖవిశ్రాంతునిఁగఁ జేసి "మహాత్మా! ఏచోటి నుండి మీరు వచ్చితిరి?" అని యడుగ మైత్రేయుం డిట్లనియె. "కురూత్తమా, కామ్యకవనమునుండి వచ్చుచున్నాను. నీకుమారులు పాండవులు ధర్మాత్ములు ప్రతిజ్ఞమేరకు నరణ్యమున వసించుచు, జడలు ధరించి, నారబట్టలుగట్టి, కూరగాయలు, బూస్లు, నావు లలును ఆహారం బుగా నమ్మహారణ్యంబున నియమములఁ గుడుచుచుండువారు. తీర్థయాత్రా పరుండనై బహుదేశసంచారముఁ గావించి కామ్యకవనంబునకు రాఁగా నచ్చోట వారుండుట యెఱింగి వారిచేఁ గొన్నాళ్లర్చితుండనై యుండి నినుఁ జూచువేడ్క నిచ్చోటి కరుదెంచితి" ననఁగా, కురురాజు "మునీశ్వరా! ధర్మాచరణపరులును, సత్యవాక్కులును నగు పాండవు లందు క్షేమముగ నున్నారా? వారె మహాశక్తిపరులు. సత్యాత్ములు. మిక్కిలి యొద్దిక గలిగి, సమయాతిక్రమమును జేయుటకు సమకట్టరు గదా?" యని యడిగెను. అందులకును ఋషీశ్వరుఁ డిట్లనియె. కామ్యకవనంబునఁ గొన్నాళ్లు నీపుత్త్రులగు పాండవులకడ నుండ నచ్చటి మునులచే నీపుత్త్రుల దుర్మార్గమువలన జూదము ప్రవర్తిల్లుటయు నందుఁ గల్గినయన్యాయంబును విని వగచి నీక్షేమమును గోరి నీయొద్ద కేతెంచితి నే నెచ్చోటినుండినను నీక్షేమముల నారయుచుండుదును. నీవును, భీష్ముఁడును బ్రతికియుండఁగ నీపుత్త్రులలో నిట్టివైరభావ మొండొరులపైఁ దగినది కానేరదు. పాండవులు మహారణ్యములయం దుండియుఁ నెడ తెగక బ్రాహ్మణాశీర్వచనముల ప్రభావమున ధర్మాత్ములై యున్నారు. వారలు సమయ మేల దప్పుదురు? వా రాడినమాటఁ దప్పినచోఁ సూర్య చంద్రాదులగతి సైతముతప్పఁగలదు. అట్టివారికిఁ గారణము లేక నీపుత్త్రుఁ డెగ్గొనర్చెను." అని చెప్పి దుర్యోధనునితోఁ "అయ్యా! నీవు మతి మంతుఁడవై తేని పాండవులతోఁ జెలిమిచేయుము. విరోధ ముడుగుము. అట్లగుటచే వారికిని మీకును కురుకులం బంతటికిని మేలు గల్గును. నామాట వినుము. పాండవులు మహాశూరులు. వజ్రదేహులు. సత్యవ్రత పరాయణులు. పౌరుషయుతులు. మహాబలులగు హిడింబ బకాసురు లను జంపినవారు. కామ్యకవనంబునఁ గిమ్మీరుండను ఘోరరాక్షసుండు వారివెంబడి నున్న మునులకు నడ్డంబుగా నిలుచుటయు, హింసించు

టయుఁ గావించుచుండ నందులకు భీముం డలిగి హానింబట్టి వధించె. పది వేలయేనుంగుల సత్తువగల జరాసంధుని భీముఁ డొకండు మల్లయుద్ధ మునఁ గీటడంచె. ఇవి యన్నియు మీ కెఱుంగనివి కావు. ద్రుపదుఁడు మున్నగు మహాధనికులును బలశాలురును నగు రాజులు సంబంధబాంధవ్య ములచే వారికి సహాయులై యున్నారు. జగన్నాథుఁ డగు దేవుఁడు వారి కనుస్యుఁ డగునా! ఇట్టిబలపరాక్రమవంతులతో నీకు విరోధ మేల? పగ సాధించుటచేఁ గీడు గల్గు. వారితోఁ బొందు లగ్గగు. కోపము వలదు. నామాట వినుము. నీకు మే లగును. ఈసమాధాన మొడఁ గూర్చుట కే నేతెంచినవాఁడ. ఇది లోకకల్యాణంబు సర్వశ్రేయము. అనఁగా దుర్యోధనుం డా మాటలకు నతనిం బరిహసించి, చేతులతోఁ దొడలఁ దట్టి బాహువులఁ బైకెత్తి, కాలిబొటనవ్రేలి నేల రాయుచుం డుటనుం జూచి మైత్రేయుం డలిగి యీతిరస్కారంపుఁ జేతలచే నెట్లును గానున్న యుద్ధమందు భీముఁడు గదచే నీతొడలను విఱుగఁగొట్టు వాఁ డని శపించెను. ఆశాపమున కదరిపడి ధృతరాష్ట్రుండు "అవ్విధ ముగఁ గాకుండ ననుగ్రహింపుము" అనఁగా మైత్రేయుండు "ధృతరాష్ట్రా! నీకొడుకు పాండవులతోడి వైరంబు చాలించి శాంతచిత్తుఁ డగునేని, నా శాపంబు కార్యరూపమును దాల్పదు. అట్లు కానినాఁడ అవశ్యము నా వాక్కు ఫలింపఁగల" దనుటయు ధృతరాష్ట్రుఁడు "మునీంద్రా! కిమ్మీరవధ సమాచారంబును నాకు వివరింపు" మనఁగా, మైత్రేయుండు "దాని నేఁ జెప్పను. నీకొడుకు నామాట విన నొల్లఁడు. నీప్రశ్నమునకు నీతమ్ముఁడు విదురుం డుత్తరము నొసంగు" నని చెప్పి యమ్ముని తనయిచ్చను నేఁగెను. భీమునిచేఁ గిమ్మీరుండు చంపఁబడెనే యని వగచుచు దుర్యోధనుండు సభామందిరమును వీడెను.

## భీముఁడు కిమ్మీరుఁ డను రాక్షసుం జంపుట

అంతఁ గిమ్మీరుండు వధింపఁబడినప్రకారము నంతను వినుటకుఁ గుతూహలియై యుండుధృతరాష్ట్రునకు విదురుం డిట్లని చెప్పెను. "రాజా! ఆలకింపుము. భీమునిపరాక్రమము నే నేమని చెప్పుదును. అది యమాను షము. జూదమునఁ బాండవు లోడి యిటనుండి తరలి మూఁడహో రాత్రములు నిరంతరప్రయాణము సలిపిపోవుచుండ నొక్కనాఁడర్ధరాత్ర

మున రాక్షసప్రచారసమయమునఁ గిర్మీరవనమునం దొకరాక్షసుండు చేతులు సాచి నోరు దెఱచికొని గ్రుడ్లు మెఱయ భయంకరుఁడై దారి కడ్డముగ నిలిచెను. అప్పుడు భయంకరము లగు వానియెనిమిది తెల్లనికోఱ పండ్లును, నెఱుపుగలిగినమిడుగ్రుడ్లును, బైకిలేఁగియుండు తలవెండ్రుకలును, జూడ సూర్యునితేజస్సుతోఁ గూడినమెఱుముల రాశివోలెను, గొంగల బారుతోఁగూడిన క్రొక్కారుమబ్బువలెను నుండెను. ఇట్లు మాయగావించు చున్న యారాక్షసునిం జూచి, వానియఱపులకు భీతిల్లి వనమునం దున్న సింహవ్యాఘ్రాదు లగు క్రూరజంతువులు, పక్షులు తమయునికి పట్లను వదలి పాఱుచుండెను. వానితొడలయూరపిడిచేఁ బుట్టిన గాలికి వడఁకి తీఁగలెల్ల వృక్షములను జుట్టికొనెను. అప్పుడు పెనుగాలి యొకటి వీచెను. ఆగాలిచే దారి నడుచుచు బ్రాహ్మణసంఘము ముందు రాఁగాఁ బాండవు లేవురును ద్రౌపదితోడుమూరమ్ము కన్నుల నడ్డగింప నొక్కరాక్షసుండు పర్వతాకారమున దారికడ్డమై నిలుచుటం జూచిరి. ఆవికృత ఘోరరూపమును జూడలేక ద్రౌపది మిక్కిలి భీతిల్లి కన్నులు మూసికొనఁగాఁ బాండవు లేవురును నామె నూఱడించుచుండిరి. ధౌమ్యుండు రాక్షసవినాశకములగు మంత్రములను నుచ్చరించుచుం డెను. కాన వానిమాయలు నశించె. వాఁడు కామరూపియై ఘోరముగఁ బాండవులకుఁ గాన్పించెను. అంతట ధర్మనందనుఁడు వానింజూచి "నీవెవ్వఁ డవు? ఎవ్వరివాఁడవు? ఈవనంబున నుండ నేల?" యనిన వాఁడిట్లనియెను. నేనుబకాసురుని తమ్ముఁడను. నన్నుఁగిర్మీరుఁడందురు. మనుష్యులభక్షించి జీవించువాఁడను ఈకామ్యకవనమునందు యథేచ్ఛాసంచారముఁ గావిం చుచు సుఖియగుదును. మీ రెవ్వరు? నాకు వెఱచి మానవు లీయరణ్య మును జొరనోడుదురు. మీరిందుల కేల వచ్చితిరి? మిమ్ము నందఱఁ జంప మీమాంసము నిప్పుడ భుజించెద" ననిన నారాక్షసునకు ధర్మజుం డిట్ల నియె. "ేము పాండవులము. నేనువారిలో యుధిష్ఠిరుఁ డనువాఁడ. నీవును మ మ్మెఱింగియుందువు. వీరే భీమార్జుననకులసహదేవులు. ఒకప్రతిజ్ఞచే వనవాసముఁ జేయ వచ్చితిమి." అనఁగా నారాక్షసుండు "ఎట్టెట్టూ, ఈతఁడా భీముండు! ఈతనిఁ జంపవలయు నని యాయుధపాణినై బహుకాలమునుండి వేచియున్నవాఁడ. ఇయ్యది పుణ్యదినము. దైవ

యోగముఁ జేసి యితఁడు వంటయింటిలోనుండే లయ్యెను. వీఁడు బ్రాహ్మణవేషముతో వేత్రకీయవనంబున నా ప్రియసోదరుండు బకాసురునిం జంపె. వీనికి విద్యాబలమె కాని దేహబలంబు లేదు. మఱియు నానెచ్చెలి హిడింబునిం బరిమార్చె; వానిచెల్లెలు హిడింబను వశపఱచుకొనియె. ఈదుష్టాత్ముండు తెలివిలేక మనుష్యులకుఁ జొరనశక్యమైన యీఘోరారణ్యముం జొచ్చె. నేఁడు వీనిని వధించి వీనినెత్తుట బకహిడింబులకుఁ దర్పణంబు గావించి వారిఋణముఁ దీర్చుకొనియెద. ఈ రాక్షసులకు మృత్యుదేవతవంటి వీనిని నగస్త్యుఁడు వాతాపినిం బోలె నఱిగించుకొనియెద. మీ రందఱును జూచుచుండ వీనిమాంసమును నమలి, నెత్తురు త్రావి నాకులంబుపగ సాధించుకొనియెద" అనెను అందులకు ధర్మరాజు వానికి నలిగి యదలించెను. భీముఁ డింతలో నొక చెట్టును మొదలంటఁ బెఱికికొని వానిపై కుఱుకం దొడంగెను. అర్జునుండు గాండీవపుటల్లెత్రాటిని సవరించి టంకారంబు గావించి, యమ్మునందుఁ దొడింగి యుద్ధసన్నద్ధుం డయ్యెను. ఇంతలో భీముఁ డర్జునున కడ్డంబువోయి యీదుష్టాత్ము నిప్పుడ యమపురికిఁ బంపెద. నీ వాగుమని తనచే నున్న మహావృక్షమును వానిపై వైచెను. అట్లు వైచుట యింద్రుండు వజ్రమును పర్వతముపై వైచునట్లుండెను.అందులకుఁ గిమ్మీరుఁడు గినిసి తనచేతనున్న కొఱవిని ద్రిప్పి భీముపైఁబడ విసరివైచుటయు, దానిని భీముఁడు దనయెడమకాలిచే నలిపివైచెను. అంతటఁ గిమ్మీరుఁడొక్కమహావృక్షమును బెకలించికొని వచ్చుటం గని భీముఁడును వేఱొకవృక్షంబుచే దాని నడ్డగించుచుండెను. ఇట్లు వారిద్దఱును సమీపమునసుండు చెట్లన్నియుసమసిపోవునట్లు వానితోఁ గొంతసేపు పోరాడిరి. వీరియుద్ధము వాలిసుగ్రీవులయుద్ధమునకు సమానంబై యుండె. కొంతవడికి నిరువురును నొండొరులపై ఱాలు రువ్వుకొనుచుండిరి.దీనిని భీముఁ డెంతమాత్రము సరకుగొనఁడయ్యె. ఇట్లుండఁ గిమ్మీరుం డెంతయును నుద్రేకంబుతో నట్టహాసంబు సేయుచు, ఱాలదెబ్బలచే నొచ్చియును, దటాలున సూర్యునిఁ బట్టు రాహువుంబోలె భీముం బట్టుకొనియె. పిదప నొకరినొకరు ఘోరమృగములవలె వ్రేళ్లలో నుండు గోళ్లతో గిల్లుచు పండ్లతోఁ గొఱుకుచు మహాభయంకరమైన పెనఁకువ గావించిరి.

ఇట్లు కొంతవడి కాఁగా రాక్షసుండు సత్త్వంబుతఱిగియున్నాఁడని భీము
నకుం దోఁపఁగా, నతండుద్రేకించి యకార్యమున స్వేచ్ఛగాఁ దిరుగాడుచు
మదించినయేనుంగుకైవడి నా రాక్షసుం బట్టికొని వాఁ డార్పులు పెడ
బొబ్బలిడ సందిట నిఱికొని మహావాయువు వృక్షముసుం బోలె విసరు
చుండె. అంతటఁ గిమ్మీరుని భీముండు త్రాటితోఁ బశువుసు గట్టునట్లు
తన చేతులసందున బిగియఁబట్టి పైకెత్తి, పగిలినభేరివలె వాఁడు
కుయ్యో మొఱ్ఱో యని యఱచుచుండ గిరగిరం ద్రిప్పి కీళ్లు సడల
గ్రుస్సుబుకఁగా, మొలను గాళ్లక్రింద నదిమిపట్టి, మెడను రెండుచేతులం
బట్టి వానిదేహమును పెళ్లుమన విఱిచి పశువును వధించునట్లు చిత్రవధఁ
గావించి "ఓరీ రాక్షసాధమా! బకహిడింబులు నాచేఁ జచ్చినందులకు
బగఁ దీర్పవచ్చి వారిపాటునే యనుసరించి యమపురికిఁ బోయితివిగదే!"
అని యాపాపపుఁబీనుఁగును జూచి యుల్లసమాడి దూరముగఁ బాఱఁ
ద్రోచెను. ఇట్లు కిమ్మీరుని నశ్రమంబునఁ జంపి యావనవాసులను రాక్షస
భయం బుడిపినమహాశూరుఁడగునాభీముని ధర్మార్జుననకులసహదేవులును,
ద్రౌపదియు ధౌమ్యాదులగు విప్రోత్తములును బొగడిరని విదురుఁడు
ధృతరాష్ట్రునకు కిమ్మీరవధ వృత్తాంతమును జెప్పఁగా నతండు విని పెద్ద
నిట్టూర్పు నిగిడించుచుఁ జింతిల్లుచుండె.

### యాదవ పాంచాలాదులు పాండవులకడ కేతెంచుట

అంతటఁ బాండవులు జూదమున నోడి తమరాజ్యమును శత్రు
వులపాల్సేసి, జడలు దాల్చి, నారచీరలం గట్టి ఘోరమృగముల కునికి
పట్టైన యరణ్యములందు వాసము నెట్టెటో చేయుచున్నారని వారికి
సఖులును, సంబంధులును నగు యాదవపాంచాలాదులు విని ధార్తరా
ష్ట్రుల నిందించుచు నచ్యుతపురోగములై పాండవులకడ కేతెంచి చింత
తో నుండువారి నూరడింపుమాట లాడుచుండ శ్రీకృష్ణుండు యుధిష్ఠిరు
నకు మ్రొక్కి కంట నీరు గార్చుచు నిట్లనియె. పాపులగు దుర్యోధనాదు
లయు శకునికర్ణులయు నెత్తురు వేగమె భూమియందుఁ బాఱఁగలదు.
ఈదుష్టుల నందఱ నొక్కపెట్టునవధియించి ధర్మరాజునకు భూరాజ్య మభి
షేకంబు గావింపుదము. అధర్మమున సాధులకు దుర్యోధనుం డెగ్గు సేసె.
అట్టియధర్మపరుండు సర్వవిధములచేతను వధ్యుండె. ఇది సనాతనంబైన

యుత్తమధర్మము. అని ప్రళయకాలరుద్రునిమాడ్కిఁ గన్నులెఱ్ఱజేసి యావేశపరుండై విజృంభించియున్న జనార్దనునిఁ బ్రశాంత చిత్తునిఁగఁజేసి యర్జునుం డతని నిట్లని కీర్తించె.

ఓజనార్దనా! నీవు పుణ్యమూర్తివి. పూజనీయుఁడవు. పురాణ పురుషుండవు. ఈశ్వరుండవు. అప్రమేయుండవు. చరాచరంబు లగు జీవ కోటులెల్ల నీయందుండి పుట్టును. నీయంద స్థితిం బడసి నీయంద లయ మొందును. నీవు తొల్లి గంధమాదనపర్వతప్రాంతములలోఁ గంద మూలములను భక్షించుచుఁ బదివేలేండ్లు తపం బొనర్చితివి. పుష్క రంబునఁ బదునొకండువేలవర్షంబులు వాయుభక్షణుండ వగు తపస్వివై యుంటివి. మధుసూదనా! నీవేకదా నూఱేండ్లూర్ధ్వ బాహుండవై యేక పాదంబున నిలిచి బదరీవనంబున ధ్యానాసక్తుండవై యుంటివి. సరస్వతీతీరం బున ద్వాదశవార్షిక సత్రమునందుఁ బైకి వస్త్రధారణము లేక బక్కచిక్కి జ్ఞానయోగంబును బూని యున్న మహానీయుండవు నీవ కావే! ఓమహానుభావా! ప్రభాసతీర్థంబున దివ్యవర్షసహస్రంబులు నియమముతో నేక పాదంబుపై లోకసంగ్రహార్థము తపం బాచరించిన మహర్షివి నీవేకదా! నీవు క్షేత్రజ్ఞుండవు. నిత్యుఁడవు. మఱియు నరకాసురుని సంహరించి యదితికి మణికుండలంబులు కానుకగా నిచ్చి యింద్రునకు నింద్రపదమును మరల నిప్పించిన మహాపురుషుండవు నీవే. విష్ణుండవు; జిష్ణుఁడవు; సూర్యుండవు; సోముఁడవు; ధర్ముఁడవు; ధాతవు; యముఁడవు; వహ్నివి; వాయువవు; వైశ్రవణుండవు; రుద్రుండవు; కాలంబవు; ఆకసంబవు; భూమివి; దిక్స్వరూపివి; బ్రహ్మవు; భూతజాలంబుల కన్నింటికి గురుండవు; చైత్రరథవనమునందు మహాయాగములం గావించి లక్షసువర్ణముల భూసురులకు దక్షిణ లిచ్చి సంతోషసముద్రంబున నోలలాడించిన మహాకీర్తివి; వామనరూపంబున నదితికశ్యపులకుఁ బుత్త్రుండవై పుట్టి బలిని యాచించి త్రిపాదపరిమితభూవ్యాజంబున లోకంబుల నెల్లనాక్ర మించిన విశ్వరూపివి నీవ కావే. ఆయవతారంబున నుపేంద్రుం డని పేర్కొనఁబడిన ప్రజ్ఞాశాలివి నీవే కదా! ఓజనార్దనా! ధర్మసంస్థాపనము నిమిత్తమున ననేకావతారంబు లెత్తి లోకభీకరులగు క్రూరరాక్షసులను రూపుమాపిన జగత్పతివి నీవ కావే! నరకాసురుం జంపి ప్రాగ్జ్యోతిషంబు

నకు మార్గము నిరాతంకముగఁ జేసితివి. శిశుపాలాదుల వధించినశూరుండవు నీవ. రుక్మిని విరూపిఁ జేసి రుక్మిణిని సాధించిన సర్వాలంకారమూర్తివి నీవ. ద్వారకను సర్వయోగులనివాసస్థలమును, చిత్రవిచిత్రనానాలంకారములతో నుండుదానిని నొక్కనిమిషంబున వశపఱచుకొన్న మహామాంత్రికుండవు నీవ కావే! కార్తవీర్య నంతటిబలపరాక్రమశాలి యగు భోజుని సత్రమంబున వధించిన ప్రతాపశాలివి నీవ కావె. గోపతి తాలకేతువులఁ బొరిగొన్నశూరుండవు నీవ. నీయందుఁ గ్రోధమును కడమును లేదు. మాత్సర్యము నిన్ను సమీపింపదు. అనృత మనున దెట్టిదో నీవెఱుంగవు; కౌటిల్యము కుటిలమై నీకు దూరమున నుండును. సనకాది మునీంద్రులు నిన్ను సదా యభయం బొసంగు మనెదరు. యుగాంతమున ప్రస్వాత్వము నొంది సర్వభూతములను నీయం దణఁగున ట్లొనర్తువు. యుగాదియందు నీనాభియందు హిరణ్యగర్భుండు పుట్టి సర్వజగత్తులను మరల సృజించుచున్నాఁడు. అప్పుడు మధుకైటభులను క్రూరరాక్షసులు బ్రహ్మను సంహరింప నుద్యుక్తులు కాఁగా రోషానలమున జ్వలించుచు నీముఖమునుండి శూలమును ధరించి, శంభుఁడు త్రిలోచనుండు జనించెను; కావున ఓ పుండరీకాక్షా! బ్రహ్మయు నీశ్వరుఁడును నిరువురును నీదేహమునందుఁ బుట్టినవారలే. నీయాజ్ఞ చొప్పున నిరువురును ప్రవర్తించువారేయని తొల్లి నారదుండు వచించె. చిత్రరథవనమునం దనేక యాగముల నొనర్చి యాచకులకు వలసినట్లు ధనాదుల నిచ్చి యపారకీర్తిని బడసినవాఁడవు నీవే కదా! నీబాల్యమున నీ వొనర్చినయమానుషకార్యములను వేఱొక్కండు చేయఁగలఁడే? బలదేవసాహాయ్యమునఁ గృష్ణుండవై లోకులకు సామాన్యుండవు నా నుండు నీయొక్క యగణితమాహాత్మ్యంబును గొనియాడుటకు నైతమర్థు లెవరు? కైలాసంబున ననేకభూసురులమధ్యమున విరాజిల్లినమహాత్ముఁడవు నీవ కావె యని యర్జునుండు నానావిధముల నుతింప భగవంతుఁ డనుగ్రహించి, రోషము నుపశమింపఁ జేసి, సంతుష్టచిత్తుఁడై యర్జునున కిట్లనియె. మన మిద్దఱ మొక్కరూప. నీవు నావాఁడవు. నేను నీవాఁడను. నీశత్రుమిత్రులు నాకు శత్రుమిత్రులు. మనము పూర్వజన్మమున నరనారాయణులను ఋషులము. నీవు నరుఁడ వనియు, నేను నారాయణుండ ననియుఁ జెప్పఁ బడుదుము. దేవతలకోర్కు

లీడేర్చునిమిత్తము మన మీానరరూపముల ధరించితిమి. మన కిరువురకును నేకత్వము కాని యన్యత్వము లేదు. మనకు నేపాటి భేదమును లేదని చెప్పుచుండఁగా ద్రౌపది ధృష్టద్యుమ్నాదులతోఁగూడికొని సమీపించి సకలరాజమధ్యమున నుండు శ్రీకృష్ణున కిట్లనియె.

ద్రౌపది శ్రీకృష్ణునితోఁ దనదుఃఖములను జెప్పి దుఃఖించుట

ఓ మధుసూదనా! పూర్వము ప్రజాసృష్టిసమయమునందు నీవే ప్రజాపతివై లోకముల నన్నింటిని సృజించితి వని యసితుండైన దేవలుండు చెప్పె. యజ్ఞస్వరూపుండవు నీవే. యజ్ఞఫలము నొసంగువాఁడవును నీవే యని జామదగ్న్యుండు వచించెను. సత్యాత్మకుఁ డనియు, యజ్ఞాత్మకుఁడనియు నీవు పేర్కొనఁబడుదు వని కశ్యపుండు వక్కాణించెను. సర్వదేవతలకుఁ బ్రభుఁడవు వని నారదమునివాక్కు యథార్థమును బోధించియుండె. నీవు పరమశాంతుఁడ వని ఋషు లందఱును నానతిచ్చియుండిరి. ఆట వస్తువులను బాలుం డుపయోగించుచుఁ దోడివారితోఁ గ్రీడించుగతి, నీవు బ్రహ్మతోను, శివునితోను, నింద్రునితోను జగముయొక్క సృష్టి, స్థితి, లయ మను నాటలాడి మురియుచుందువు. ఆకసంబున శిరస్సును, భూమినిఁ బాదంబులును, సకలలోకాలోకములను గర్భమునందును, నుంచికొనినవిరాట్స్వరూపుండవు నీవ! అధ్యాత్మవిద్యాపరు లగు మునీంద్రులకు నీవే గతివి. యుద్ధమునందు వెనుదియక పోరి వీరస్వర్గంబుఁ బొందినశూరులచేఁ బొందఁదగినవాఁడవు నీవే. నీవే లోకములకుఁ గర్తవు; భర్తవు; నీశ్వరుఁడవు; భూతములలో నుండు పరమాత్మవు. లోకపాలకులతోఁ గూడినలోకములు, నక్షత్రములు, దిశలు, సూర్యచంద్రాదులు, సకలభూతములును నీయందే కుదురై యున్నవి. మర్త్యలోకమున నుండు జీవకోట్లకు మరణంబును, దేవతల కమర్త్యత్వంబును నీవలననే కలుగుచుండు. ఇట్టిమహిమ గలవాని సమ్ముఖమునందుఁ బలుకుట నాకుఁ బలుకులు లేవు. కాని, నీకు నాయెడఁ బ్రీతివిశ్వాసంబులు మెండని సాహసించి విన్నపము గావించుకొనియెద. లోకరక్షకుఁడా! నామనవి యాలింపుము. నన్ను రక్షింపుము.

నేను బాండవులకు ధర్మపత్నిని. నీకు జెలిని. ధృష్టద్యుమ్నునకుఁ జెల్లెలిని. ఇంతటివారిప్రాపు గల నేను గౌరవసభలో నేకవస్త్రను,

రజస్వలనునై యుండియు దుశ్శాసనునిచేఁ దలవెండ్రుకలు పట్టి యీడ్వఁ బడితి. ఆపాపాత్ముండు తగు నిది తగ దని యాలోచింపఁడు. అప్పుడు నాపాటును జూచి దుర్యోధనాదులు నవ్వి నన్ను దాసినగాఁ సైగకొనఁ జూచిరి. జగత్తును జయింపఁగలశూరు లయ్యును నాపతులు చేయు నది లేక యూరకుండిరి పెద్ద లగు భీష్మద్రోణు లుపేక్షించిరి. బహుభంగ పాట్లకుఁ బాలైతిని. భీముని బాహుబలమేని, యర్జునుని ధనుర్విద్యాకౌశ లంబేనియు నన్ను రక్షింపఁజాలవయ్యె. అర్జునుని గాండీవమును భీమా ర్జునులును నీవును దప్ప నొరు లెవ్వరెత్తనైన నేరు. అట్టివారుండును నాభంగపాటుకాలంబునకు నసద వోలె నుండె. బలశాలురు గాకున్నను భర్తలు భార్యల రక్షించుట సనాతనధర్మము. భార్య రక్షిత యగునే నేని సంతతియు రక్షణఁ జెందు; సంతతి రక్షింపఁ బడుటచే నాత్మ రక్షణము తనంతట నప్రయత్నముననే కల్గును. తానే భార్యయందుఁ బుత్రరూపంబునఁ బుట్టుటంజేసి భార్య 'జాయ' నాఁబడు. భార్యయు భర్త తనగర్భంబునఁ బుట్టునా యని యతని కనేక సపర్యలు సేయుచుండు; రక్షించుచుండు; ధర్మ మీతీరున నుండ ధర్మపత్నిని నను వ్రతను శరణార్థి వేడినదాన నగు నన్ను నాభర్త లుపేక్షించిరి. ప్రతివింధ్యాది కుమారు లను జూచి యైనను నన్ను రక్షింపరైరి. నాభర్తలా స్త్రీత్రాణపరాయణు లయ్యును, వారినే నమ్మి, వారినే దైవములుగ భావించు నాకీబాధ దుర్మార్గులచేఁ గలుగఁగాఁ జూచుచు నూరకుండిరి. వీరిపౌరుషం బేల? దుష్టాత్ముం డగు నాదుర్యోధనుండు వీరికొనర్చిన చెడుగులను లెక్కింప రాదు. పాండవులును, ధార్తరాష్ట్రులును నొక్కటిగా బాల్యమందుఁ జదువుకాలమున దుర్యోధనుండు భీమునకు విషాన్నంబుఁ బెట్టించె. దీర్ఘాయుష్కతంబున విషము భీమునందు జీర్ణమయ్యె. దుర్యోధనుండు దలంచినకీడు భీమునకు మూఁడదయ్యె. ప్రమాణకోటియందు నిద్రిం తుండై యుండు భీముని లతలు మున్నగువానిచే గట్టిగా బిగించి కట్టి గంగలోఁ ద్రోసిరి. భీముఁడు నామహాప్రవాహంబునఁ బడి గంగానదిలోనికిఁ జొచ్చిపాతాళంబుఁ జూచి భవబంధములు ద్రెంపుకొని పైకిఁబోవు మహాయోగికైవడిఁ దన్నుఁ గట్టినబంధములను ద్రెంచుకొని నీటిపై కెగఁబ్రాఁకి గట్టుచేరెను. మఱియొకపరి

యాతఁడు నిద్రించుచుండ నతనిఁ బాములచేఁ గఱపించె. ఆతండు వజ్ర
మువంటి దేహముగలవాఁ డగుటచే వానివిష మేమియు నాతనిని
జేయదయ్యెను. మోసపెట్టి యతనియనుంగుసారథిం జంపించె. మఱియు
వీరి నైదుగురను గుంతీమహాదేవిని వారణావతంబున లక్కయిండ్లు
చొఱఁబంచి యారాత్రి యాయిండ్లకు నిప్పువెట్టి దహించివైచె. విధివశం
బున విదురునికృపావలోకంబునంజేసి వీ రందు దహింపఁబడక తప్పించు
కొనిరి. అట్లుతప్పించుకొని వారొకయరణ్యమార్గంబునఁ బోవుచుండ నం
దొకరాక్షసుండు హిడింబుం డనువాఁడు వీరిలో భీముని మాఱ్కొని
యతనితోడి యుద్ధమున మడిసెను. వానిచెల్లెలు హిడింబి యనురక్కసి
భీముని వలచి వానిచేఁ బరిగ్రహింపఁబడియె. వీరిరువురకును ఘటోత్క
చుండను మహాబలుం డొక్కండుపుట్టెంగాదె? పిదప నేకచక్రాపురంబునఁ
బాండవులు బ్రాహ్మణవేషధారులై భిక్షాన్నంబు గుడుచుచుఁ గాలంబుఁ
గడపుచుండఁ దత్పురవాసులకు మృత్యువైయున్న బకాసురుని భీముండు
చంపి వారలకు సంతసంబుచేసె. పదంపడి వారు నాస్వయంవరోత్సవంబు
చూచుటకు బ్రాహ్మణు లేతెంచుచుండ వారితోఁ గలిసికొని పాంచాల
రాజ్యంబున కేతెంచిరి. అంతట స్వయంవరంబున నర్జునుఁడు మత్స్యయం
త్రంబుఁ దెగనేసి నన్నుఁబడయుట యంత తెఱింగినదియ కాదే? ఇట్టి
శూరులకుఁ బత్నినై పాండురాజునకుఁ గోడలనై, మహాకులీన నయ్యు నాఁ
డాసభలో నాపడినపాట్లు తలంచుకొనిన గుండెలు జల్లు మనవే? మహా
పాపాత్ముండగు దుశ్శాసనుండు నాతలవెండ్రుకలంబట్టి యీడ్చుచు నన్నుఁ
బడరానిపాట్లను బడఁజేసెనని పలుకుచుఁ గన్నీరు సంతతధారగాఁ గార్చు
చుఁ బైటచెఱంగున నెమ్మోము గప్పికొని యేడ్చుచు 'నాకు మహామ
హులైన భర్త లుండియు, శూరు లగు కొడుకు లన్న లుండియు, జగ
న్నాథుండ వగు నీ వుండియు ననాథ నైతి. నీచులు నన్నవమానించు
చుండ వీ రందఱును జేయునది లేక యూరక చూచుచుండిరి. అన్నిట
కంటె సూతపుత్త్రుం డగు కర్ణునిపరిహాసపుమాటలు వీనులకు ములుకులై
శోకాగ్నిని బ్రజ్వరిల్లునట్లొనర్చినవి. సంబంధముచేతను, గౌరవబుద్ధి
చేతను, జెలిమిచేతను, బ్రభుత్వపుఁబోడిమిచేతను నీవు నన్నీయవమానము
నందుండి రక్షింపవలయు' నని గోడుగోడు మని యెలుంగెత్తి దీనురాలై

యేడ్చుచుండ నాపద్బాంధవుండగు శ్రీకృష్ణుం డప్పరమపతివ్రత కిట్లనియె. అమ్మా! ద్రౌపదీ! నీక్రోధాగ్నికిఁ బాత్రులైన యాందుష్టులు గాండీవము నందుండి వెలువడినఘోరబాణములచే నిహతులైన నెత్తురుటేరులు ప్రవహింపఁ జూచి వారిభార్యలు నింతకంటె ఘోరంబుగా శీఘ్రముననే యేడ్చుట నందఱముఁజూడఁ గలము. దుఃఖింపకుము.ఎల్లవిధములఁ బాండవులకు మేలొనర్తు. వారిని రాజాధిరాజులుగఁజేసి నిన్నుఁ బట్టపుదేవినిగా నేఁజేయుదు. నామాటలను నమ్ముము.ఆకసంబు బ్రద్దలైనను,హిమవంతంబు వ్రక్కలైనను,దెసలుఁ బీటలు వాఱినను, సముద్రం బింకిపోయినను నావచనంబు లసత్యంబులు గానేరవు. అనఁగా నప్పుడు ద్రౌపది కడగంటి చూపునఁ జూడఁగా నర్జునుండు ద్రౌపది నిట్లోదార్చెను—"ఓశుభాంగీ! యేల వగచెదవు? మాధవుమాటలు తప్పవు. ఈమహాత్ముండు మన కెల్లరకును దెప్పకొయ్యవంటివాఁడు. మనయాపదలం బాపి, మనశత్రువులను దప్పక పొలియించును. అట్టివాని కృపాపారవశ్యమున మనము తప్పక రక్షింపఁబడెదము. ఏడుపుడుగుము"అనఁగాఁ గ్రోధముచే నిప్పులు రాలుచుండు కన్నులతో ధృష్టద్యుమ్నుం డిట్లనియె. "ఓకమలాక్షి! దుర్మార్గులగు దుర్యోధనదుశ్శాసనుల భీముండును, నిన్నుఁ బరిహసించిన కర్ణుని నర్జునుండును, సభ వాఁడూరకుండిన ద్రోణుని నేనును ననిం జంపుదుము. వగవకుండుము" అని యందఱును ద్రుపదరాజపుత్రిని సమాధానపఱచిరి. అప్పు డవ్వీరులందఱును వాసుదేవు మొగంబుఁ జూచుటయు నంతనతండు ధర్మరాజుతో నిట్లనియె. రాజా, నేను ద్వారకయందే యుంటినేని యీయాపద మీకు రానీయను.ధృతరాష్ట్రదుర్యోధనాదులు నన్నుఁ బిలువకున్నను బిలువనిపేరంటముగా నే నవశ్యంబుగ ద్యూతకాలమున మీకడనైయుండుదు. ఆసభలో నందఱు వినునట్లు వెలఁది,జూదంబు, వేఁట, పానము నను నీనాల్గును దుర్వ్యసనంబు లనియుఁ, గామము నందుండి పుట్టుటచే నది మనుష్యునకు హానిదెచ్చి వాని నైశ్వర్యంబునుండి తొలఁగించు ననియు, నందు ద్యూతము మహావ్యసన మనియు, దానం జేసి యొక్కముహూర్తంబున నరుండు త్యాగభోగంబులు లేకయే సర్వసంపదలను బాయు ననియు, దొల్లి నిషధేశ్వరుం డగు నలుం డను వాఁడు జూదమాడి తన్నిమిత్తంబున రాజ్యభ్రష్టుం డయ్యె ననియు

సకారణంబుగను యుక్తియుక్తముగ నుపన్యసించి, యావల మఱియు నిట్లనియె. ఓధర్మరాజా! నేనప్పు డచ్చోట నుండు మిమ్ము జూడంబోడ నిచ్చు వాఁడనే? అప్పు డిట్టియాపదలు మీకు సంభవించియుండ నేరవు. దుర్యోధనుండు నామాటలను విన నొల్లఁడేని వానిని, దదీయులగు జూదరులను నెల్లర నిగ్రహించి యప్పుడ శాస్తి యొనర్చి యుండుదును. నేను ద్వారకయం దుండమి మీ కిన్నిపాట్లు పడవలసె. పిదపఁ గొన్నాళ్లకు ద్వారకకు రాఁగా యుయుధానుండు మావృత్తాంత మెల్లఁ గ్రమంబున నుడువ నెఱింగి యదరిపడి మిమ్ముఁ జూచుటకు వేగంబ యిచ్చోటికి వచ్చితి. కట్టా! మీరు కష్టములఁ గుడుచుచుండ నేను జూడవలసివచ్చెఁగదా!" యనఁగా, ధర్మరాజు శ్రీకృష్ణుని 'మాధవా! నీ వాదినములలో ద్వారకయం దుండక యెటకేఁగితివి?' యని యడుగ,'ధర్మపుత్త్రా! రాజసూయయాగమునందు శిశుపాలుని వధించి యుంటిని గదా? వాని తమ్ముఁ డగు సాళ్వుం డనువాఁ డందులకు నాపైఁ గోపించి దుర్మదంబుతోఁడ వానిదైన సౌభనగరంబుమీఁదికి దండెత్తిపోయి యుంటిని.' అనఁగా మఱియును ధర్మరాజు దానిని వివరింపుమని వేఁడ వసుదేవనందనుండు పాండునందనున కిట్లనియె.

## శ్రీకృష్ణుండు ధర్మరాజునకు సౌభవధోపాఖ్యానంబుఁ జెప్పుట

ధర్మపుత్త్రా! నీవొనర్చినరాజసూయయాగమునందు నీవు నన్నుఁ బూజింప దానిని సహింప నోపక రోషముతోఁ గను లెఱ్ఱనేసి దుర్భాషలాడిన శిశుపాలుని నేను జక్రప్రయోగంబున వధింపఁగా వానితమ్ముండు సాల్వుం డనువాఁ డందులకు నాపైఁ గినిసి వలసినచోటికి కేఁగునట్టి శక్తిగల సౌభ మను పురమునందుఁ గూర్చుండి నే నింద్రప్రస్థపురంబున నుండఁగనే ద్వారవతిపై దండెత్తివచ్చెను. అటులా సాళ్వుఁడు తనసైన్యముతో ద్వారవతీపురంబును ముట్టడింపఁగా, నుగ్రసేనుఁడు శతఘ్నులు మున్నగు యంత్రములను గట్టాయితంబులు సేసి, శక్తి తోమరములను, భిండివాలాంకుశములను, బరిఘలు, గండ్రగొడ్డండ్రు మున్నగు యుద్ధోపకరణంబులను, భేరులను దప్పెటలను మృదంగములను; బూరలు మున్నగు వాద్యంబులను, బిడుగులు మున్నగువాని

నడ్డగించు సాధనంబులను సిద్ధపఱచి, పురద్వారంబులయం దయ్యైచోట్లఁ బలుమానుసులను నిలిపి, కోటచుట్టు శూరులఁ గావలి నిలిపి గదుని సాంబుని నుద్ధవుని శత్రుసైన్యంబుల నడ్డగించుటకు వలయుముఖ్యమార్గములనునిచి,పతాకము లెత్తించి, తోరణంబులు కట్టించి గోపురద్వారములను నున్నతప్రాకారములను గోటబురుజులను సురక్షితంబులుగఁ జేసి, కోటచుట్టునుండు నగడ్తలలో నీఁ బెలం గ్రుచ్చి,పట్టణముచుట్టును గ్రోసెడు దూరము భూప్రదేశము నంతయు నెగుడుదిగుడుగా నొనర్చి, యగడ్తలపై నచ్చటచ్చట నుండు వారధులను బగులఁ గొట్టించి, యగడ్తను జలార్ణవముగం జేసి సర్వవిధంబుల శత్రువులు పురము ప్రవేశింపకుండునట్లు నిరోధంబు లంతటం జేసి, పురజను లాటఁ బాటలం దేమఱియుండనీయక ధనరక్షణము గావించునిమిత్తము, నటవిటగాయకులను బురము వెలువరించి, విదేశములకు సరకులు గొనిపోవు నోడలప్రచారమును నాపియుంచి, సురాపానాదులు మున్నగు మత్తుపదార్థముల యమ్మకము గావింపకుండ యానపెట్టి, యెవరును సుర, కల్లు మున్నగువానిని ద్రాగఁ గూడదని చాటించి, యేమఱక పురమును గాపాడుచుండెను. సైనికులకుఁ గాలాతిక్రమణ మెంతయుంగాక జీతములకు బత్తెములకు మూఁడు వెండి బంగారముల నొసంగి వారిని బ్రోత్సహించుచుండె. శూరుఁడని తెలిసినఁ గాని యితరుల కెవ్వరికిని సైనికోద్యోగంబుల నీయఁడయ్యె. పురప్రవేశంబును బురజనులవలె శత్రువులు గావింతు రని సాంకేతికంబుల నేర్పఱచి రహదారు లున్నఁ గాని యన్యులను బురప్రవేశంబుచేయ నీయఁడయ్యె. ఈతీరున ద్వారవతీపురం బుగ్రసేనరక్షితమైయుండ సాళ్వుండు సౌభంబుతో ద్వారవతీబహిర్భాగంబునఁ బుట్టలు, దేవాలయంబులు, శ్మశానభూములు తక్క మిగిలిన స్థలములయం దొక్క జలవసతి గల విశాలభూప్రదేశమునందుఁ దనసైన్యమును విడియించి చతురంగబలంబుల వివిధవ్యూహములు పన్ని ధ్వజంబులను రథంబులపై నెత్తించి వాయువేగమనోవేగంబుల ద్వారావతిపై విజృంభించుటయు, సాళ్వుని యట్టహాసంబును సహింపనివారై యాదవులు సాంబుఁడు,చారుదేష్ణుఁడు, ప్రద్యుమ్నుఁడు, ననిరుద్ధుఁడు మున్నగువారు కవచంబులు ధరియించి విండ్ల నారులు సారించి, ధనుష్టంకారమున భూనభోంతరాళంబులు బ్రద్ద

లుగా వివిధాయుధంబులతో ననేకయుద్ధంబుల నాఱితేఱిన సైనికులదళం బులు వెంటరాఁగా, వీఁడు వెడలి సాళ్వసేనపై కుఱికిరి. అప్పుడుసాంబుఁడు క్షేమవృద్ధియను శత్రుసైనికునిందాఁకి బాణవర్షంబులు కురియింప వాఁడు వెనుదీయక మాయాయుద్ధంబున సాంబునిపైఁ బుంఖానుపుంఖంబు లుగ బాణంబు లేసె. జాంబవతీకుమారుఁ డగు నా సాంబుండు క్షేమ వృద్ధిమాయలకు మోసపోక జాగరూకుండై మెలఁకువతో శత్రుబాణం బుల వారించికొని, మరల వాని నంపవర్షంబున ముంపఁగా క్షేమవృద్ధి నాంబుబాణంబులవ్రేటున కోర్వలేక తొలఁగి చనియె. ఇట్లు క్షేమవృద్ధి పరాజితుఁడు కాఁగా వేగవంతుండను రాక్షసుండు సాంబుని వేగంబునఁ డాఁకె. అంత సాంబుండు మదాతిరేకమున గదాపాణియై విదారించుచు శత్రుం దాఁకుటయు వేగవంతుండు గదవ్రేటునకు స్రుక్కి క్రిందఁబడు టయు సాంబుండెదురు లేక శత్రుసైన్యమును జీకాకుపఱుపఁ దొడంగెను.

అంతట వివింధ్యుం డను ఘోరరాక్షసుఁ డొక్కండు మహారథుండు విజృంభించి పైకివచ్చుటయు వానిని జారుదేష్ణుం డెదిరించి నిలునిలుమని ఘోరయుద్ధంబు సేయఁ బోరు కొంతవడికి దుర్భరంబయ్యె. వారు వృత్రవాసవుల తెఱంగున నొహటించియు, బాణంబుల వైచియు, గదలఁ బ్రయోగించియుఁ, దోమరంబుల సారించియు, ముసలముద్గరంబుల నొక్కరొక్కరిపైఁ బ్రయోగించుచుండిరి. ఇంతలోఁ బ్రద్యుమ్నుం డతి తీక్ష్ణణంబును, దేజోవంతంబు నగు నొక్కమహాస్త్రంబు నభిమంత్రించి వివింధ్యునిపై వ్రేయ వాఁడు దానికిఁ బ్రతీకారంబు చేయలేక దానికిఁ బూర్ణాహుతియై కాలుని పట్టణంబున కరిగె.

ఇట్లు శత్రుసైన్యంబునఁ గొందఱు మొనగాండ్రు చచ్చుటయు, సాళ్వునిసేన వికావికలై హాహారవంబులతో వెనుదిరుగఁజొచ్చెను. అప్పుడు సాళ్వుండు సౌభం బధిష్ఠించి మరలినసైన్యమును బెద్దయెలుంగునం బోరునకుఁ బురికొల్పఁగా యాదవబలంబున సంక్షోభంబు పుట్టె. వెంటనే ప్రద్యుమ్నకుమారుండు యాదవుల నెల్లఁ గూర్చి "ఈ వెడ మాయల కదరకుఁడు, తొలంగవలదు, ధైర్యంబుఁబూనుఁడు. నాశౌర్య మును గనుఁడు, సాధనస్సునందుండి వెలువడు కాలాగ్నిసమానంబులగు బాణంబులతో నిదిగో సాళ్వునిసౌభమును విధ్వంసంబు గావించి

వానిపీనుఁగు మీకంటఁ గానిపించెద. వెఱవకుఁడు." అని ధైర్యంబు సెప్ప సేనలు విజృంభించి పోర సాగుచుండె. ఇంతలోఁ బ్రద్యుమ్నుండు కవచంబు దొడిఁగి, ధనుష్పాణియై యంబులపొదుల నిండ బాణంబుల నింపి, ఖడ్గాదియుద్ధసామగ్రులతో నింపిన తేరెక్కి శత్రువుల గుండెలు జల్లు మన గుణము సారించి టంకారము చేయుచు నలుదిక్కుల దానయై యెక్కడచో నిలువక చూచువారికి భీతిజనింపఁగను తెప్పవాల్చు నంతలో యుద్ధభూమిమధ్యప్రదేశంబుఁ జొచ్చి సౌభవాసు లగు రాక్షసులకు సమ్మోహం బొనర్చి యట్టహాసంబున సాళ్వుం దాఁకె. వాఁడును వెఱవక ప్రద్యుమ్నకుమారునిపై శరంబులను వేనవేలుగఁ బ్రయోగించుచు నెంతమాత్రమును ముఖవివర్ణత నొందక, గాత్రచలనము రవంతయైనను లేక ధీరుఁడై యెదురుపోరాడుచుండె. ప్రద్యుమ్న రథంబుపై నధిష్ఠితంబైన మొసలి పలుమాఱు నోరు తెఱచి తెఱచి సాళ్వసేనలను భయభ్రాంతములనుగఁ జేయుచుండె. ఇంతలో సాళ్వుండు సౌభమును దిగి ధ్వజయుతంబును, ననేకయుద్ధసాధనంబులతో సహితంబునగు నొక్కబంగారుతేరెక్కి ప్రద్యుమ్నునిపైఁ గవిసి యనేకబాణంబు లేసె. అంతఁ బ్రద్యుమ్నుండు కినుక వహించి యాఁడు గఱచి, "అద్దిరా శౌర్యంబు! ఇదే చూడుము. మగంటిమి గలవాఁడవైనచో దీనిని దప్పించుకొను"మని యొక్కదారుణబాణంబు సాళ్వుపైఁ బ్రయోగింప వాఁడు తన్నివారణంబునకు మండుచుండునగ్నిసమానములైన శరంబులను బ్రయోగించుచుండె. ప్రద్యుమ్నుం డాబాణంబులనడుమఁ దునియలుగాఁ జేయుచుండె! సాళ్వుం డనేకాస్త్రంబులఁ బ్రయోగించె. ఇట్లు సాళ్వబాణవిద్ధుండై క్రుద్ధుండైన ప్రద్యుమ్నకుమారుండు మర్మభేది యగు నొక్కదివ్యబాణంబును సాళ్వుపై బ్రయోగింప నది వానికవచంబుఁ బగిల్చి యురంబుదాఁక, వాఁ డందులకు మూర్ఛవోయి రథంబుపై వ్రాలఁగ వానిసైనికులు హాహారవంబులతోఁ బాఱుచుండ సాళ్వుండు కొండొకవడికి మూర్ఛదేఱి విచ్చిన సైనికుల మరల్చికొని రోషంబునఁ బ్రద్యుమ్నుపై శరవర్షంబులుఁ గురియ నతఁడు తేరిపై వ్రాలె. అంత సాళ్వుండు బాణపరంపరలను మూర్ఛితుపైఁ బ్రయోగించి సింహనాదంబు సేసినఁ బ్రద్యుమ్నుసారథి దారకునిపుత్త్రుండు తేరి నవలికిఁ దోలంగం

దోలుకొనిపోవుటయు యదువృష్ణిభోజాంధకసైనికులలో హాహాకారం బులు వొడమె. అంతః గొంతసేపటికిం బ్రద్యుమ్నుండు మూర్ఛదేరి "దారుకసుతా! ఇది యేటికార్యంబు పగఱకు వెన్నిచ్చి పురంబు నేను బ్రవేశించినచో సుగ్రసేనాదియదువీరులు న న్నేమందురు? రథంబును యుద్ధభూమినుండి యేల దోలఁగఁదోలుకొని వచ్చితివి? ఇయ్యది యాదవులఁ ధర్మంబుగాదు. సాళ్వనిప్రేటులకు వెఱచితివో" అనఁ బ్రద్యుమ్న కుమారునకు దారుక పుత్త్రుఁడిట్లనియె.'యదువీరా! ప్రద్యుమ్నకుమారా! యుద్ధమందు నేను వెఱచినవాఁడనుగాను. నీవు సాళ్వబాణపరంపర లకు మూర్ఛపోయితివి. మూర్ఛపోయినరథికులతో రణరంగమున సారథి రథము నుంపఁడు. కొంతసేద దేఱునిమిత్తము తేరుతొలంగం ద్రోలుట యత్యవసరము. యుద్ధమున సారథి రథికుని, రథికుఁడు సారథిని బరస్పరము కాపాడుకొనుచుండుట ధర్మవు. అమ్మేరకు ధర్మము నాచరించితినే కాని నీశౌర్యంబు తగ్గింపను గాదు. లెమ్ము. శత్రువుల గెల్వుము. పరాక్రమవంతుండవై శత్రువు నోహటింపుము. ఇదే నీయాజ్ఞానుసారంబు ర్తించెద ననఁగానే ప్రద్యుమ్నుండు తేరిని రణాంగణమునకు మఱల్పుమనఁగా దారుకసుతుం డట్ల కావించె. అప్పుడు ప్రద్యుమ్నుండు సారథితో నేను జీవించియుండునం దాఁక నా తేరి నిట్లు మరల్పకుము. యుద్ధమున శత్రువులకు వెన్నుఁజూపుటయుఁ,బడ్డవానిని, శరణన్న వానిని,స్త్రీని, బాలుని, వృద్ధుని రథములేని పాదచారిని, యుద్ధసాధనములు విఱిగినవానిని జంపుటయు యాదవులకులధర్మము కాదు. యదువంశ చరిత్రంబును, యుద్ధధర్మమును సారథికార్యంబును జక్కఁగ నెఱింగిన నీ విట్లాచరించుట వగునే? వాసు దేవబలరామసాత్యకిచారుదేష్ణగదసారణాక్రూరాదులగు యాదవులలోఁ బెద్దలు దీని విన్న నే మందురు? స్త్రీలు పరిహాసింపరే? నన్ను నమ్మి నాతండ్రి ద్వారవతీపురరక్షణంబు నాపైనునిచి ధర్మరాజు రాజసూయంబునకుఁ బోయె. మన మిప్పుడు యుద్ధమునకు వచ్చునపుడు కృతవర్మ యుద్ధసన్నద్ధుం డాయె. సాళ్వుపైఁ బోరున కిందఱు వలయునే? నే నొక్కండన వాని పొగరడంతు నని యంటినే. ఆమహాశూరుండు దీనివిన్న నేమనును? నన్ను మెచ్చునే? ఇప్పటి కిది చాలుఁజాలు" అనఁగా సారథి నే నప్పుడు తేరు దోలఁగింపకున్న మనజయంబు నమ్మఁ

దగినదిగాదు. నే నెప్పుడు నీమేలు గోరియుండుదు. తెలియక నే నిట్లు చేసినవాఁడను గాను. ఇదే తేప దోలుచున్నాఁడ రణాంగణంబునకు నేతెంచితిమి. అని చెప్పి మునికోల నశ్వముల నదల్చుటయు నవి రోషపూరితంబులై యాకసంబునకుఁ బర్వుచాడ్పున నేలపై నడుగులు మోపక చిత్రమండలాదిగతుల సాళ్వసేనలఁ గలఁప సాళ్వుండు దానిం జూచి సహింపక సారథిపై మూఁడువాలమ్ము లేసె. అందులకు దారుకపుత్త్రుండు చలింపక రథమును దోలుచుండఁ బ్రద్యుమ్నుఁ డింతలో వేగంబున సాళ్వుపై ననేకబాణములం బ్రయోగించె. సాళ్వుఁ డంతటఁ జిత్రవిచిత్రమాయలం జేసి యదుసేనపై నంపవాన గురియించె. దాని నెఱింగి ప్రద్యుమ్నుండు బ్రహ్మాస్త్రంబు నభిమంత్రించి సాళ్వుపై నేయుటయు నయ్యది ఘోరాకృతిం దాల్చి, సాళ్వుఁ డెన్ని ప్రత్యస్త్రంబులు ప్రయోగించినను వెనుదిరుగక యాయస్త్రంబుల నెల్ల భగ్నంబులు గావించుచు రాక్షసమాయల నెల్లఁ బటాపంచలుగఁ జేసి యనేకరాక్షసులఁ గాలుపురికిం బంపె. సాళ్వుండు తేరిపై మూర్ఛవోయె.అంతట నిలువక ప్రద్యుమ్నుండు వేఱొకదివ్యాస్త్రంబునుసాళ్వుపైఁ బ్రయోగింప యత్నింపఁగా సాళ్వసేనలయందు హాహారవంబులు పుట్టె. అత్తఱి వాయుభట్టారకుం డదృశ్యుండై "ప్రద్యుమ్నా! ఈఘోరాస్త్రం బుపసంహరింపుము. సాళ్వుండు వాసుదేవునిచే వధింపఁబడువాఁడు. విధినిర్ణయం బట్టిద" యనఁగా బ్రద్యుమ్నుం డామాట లంగీకరించి నిజాస్త్రం బుపసంహరించె. అంతఁ గొండొకవడికి సాళ్వుండు మూర్ఛదేఱి ప్రద్యుమ్నుం గెలుచుట యసాధ్యం బని తలంచి "చావు తప్పి కన్ను లొట్టవోయిన" తెఱఁగున సౌభారూఢుఁడై తనసేనతోడ నాకసంబున కెగసి పోయె. ప్రద్యుమ్నాదు లంతట ద్వారావతిం జొచ్చి మిక్కిలి జాగరూకులై మెలఁగుచుండిరి.

ధర్మనందనా! నీరాజసూయయాగంబు ముగియఁగానే నేను మీ యొద్ద సెలవుఁగైకొని యింద్రప్రస్థంబు దరలి కొన్నిదినములకు ద్వారావతీనగరమున కరుగ, నాపురంబు విఱిగినకోటబురుజులు గలదై విప్రులు వేదములు చదువమియు, స్త్రీలు నగలు ధరింపమియు, నుద్యానవనంబుల సొంపు గానరామియుఁ జూచి తెలిసికొనఁగాఁ గృతవర్మ సాభాపతియగు

సాళ్వుఁడు ద్వారావతిపై దండెత్తివచ్చి పోరి పరాజయమునొంది పోయె 'నని సంగతి తెలిపెను. అపుడు నేను సాళ్వుం జంపి కాని పురమును జొర నని ప్రతిజ్ఞఁ జేసి బలదేవాదియాదవులను, వసుదేవాదివృద్ధజనులను బ్రమాదము గలుగకుండఁ బురమును రక్షించుచుండునట్లు నియోగించి, యప్పుడ యుద్ధసన్నద్ధుండనై ప్రయాణభేరి మ్రోగించి, పురోహితాది భూసురాశీర్వచనంబులఁ గైకొని, శైబ్యసుగ్రీవ మేఘపుష్పవలాహకంబు లను పేళ్లు గల గుఱ్ఱములఁ బూన్చిన తేరు నెక్కి, గరుడధ్వజంబు గాలిచేఁ జలింపుచుండఁ, బాంచజన్యమును బూరించి, చతురంగబలసమే తుఁడనై వెడలి బహుదేశంబులు దాఁటి, దూరప్రయాణంబున మూ_ర్తి కావతప్రదేశంబున కరుగ నంతకు మున్ను సాళ్వుండు నారాక నెఱింగి, సముద్రసమీపంబునకు సౌభంబుతో నరిగెను. అది తెలిసి వానివెంట దవిలి తఱుమ, వాఁడును గామగమనంబుగల సౌభముతో సముద్ర మధ్యంబున నంతరిక్షమున నుండి యోహాటించి మమ్ము యుద్ధమునకు నవ్వుచుఁ బిల్వఁగా, నేను శబ్దవేధిబాణంబులను, మర్మభేదనోపాయంబు లాగ నతనిపైఁ బ్రయోగింప నవి యన్నియుఁ గృతఘ్నునకుం జేసిన మేలువంటివయ్యె. సాళ్వుం డంతరిక్షమున సౌభమున నుండి నన్ను నాసైన్యమును ననేకబాణపరంపరలయందు ముంచివైచెను. మేమును వానిపై నంపవానను జిమ్మితిమి. అయినను శత్రు వదృశ్యుండై యంత రిక్షమునందుండి బహుమాయలతోఁ బోరుచుండుటయు, మేము నేలపై నిలుచుండి మెడ లెత్తి యాకసంబున నుండు సౌభంబుతోడి సాళ్వుతోఁ బోరవలసి వచ్చుటయుఁ గొంతకాలమువఱకు సాళ్వ శర పరంపరలచే సారథి నన్నుఁ గాని, నేను సారథిఁ గాని వీక్షించుటకు వీలులేనట్లు చేసి సైన్యము నంతటి దిగ్భ్రమఁ బొందునట్లు చేయఁగా నేను దారుకుని, దారుకుఁడు నన్నును, నెలుంగెత్తి, పరస్పర క్షేమ ముల నారసికొనుచుఁ గొంతవడికి వానిబాణంబులను బ్రతిబాణంబు లచేఁ బ్రతిహతంబు సేయఁగా సౌభంబుతో సాళ్వుండు మాకుఁ గ్రోసుదూరంబునఁ గానంబడియె. అంత నాసైనికులు సాళ్వుని సౌభంబునందలి యితరరాక్షసులం దేఱిచూచి, సింహనాదములను జేసి చప్పట్లు గొట్టిరి. వీనివలన నే నుద్రేకంబు గల్గి విజృంభించి శరపరంప

రచే సౌభంబులోనిరాక్షసులం గొట్ట వారు కొందఱు శిరంబులు దెగిన వారును, గాలుసేతులు విఱిగినవారునై హాహారవంబులతో సౌభంబునం దుండి సముద్రంబునం బడిరి. వారి మొండెములను సముద్రములోనిమీనంబులు విందు లారగించెను. నే నతిముదంబునం బాంచజన్యమును బూరించితి. తనసైనికులపాట్లు నోర్వ లేక సాళ్వుండు మాయావియై యంతరిక్షంబున సంచరించుచు వివిధమారణాయుధంబులను నా సేనపైం బ్రయోగింప నాసైన్యం బాతాఁకుడున కోర్వ లేక దైన్యంబు నొందె. మఱియు వానిమాయచే నొకప్పుడు నిప్పుకణంబులవాన గురియుచు వచ్చెను. మఱొకప్పుడు బొగ్గులతాఁకుళ్లు గలిగెను. వేఱొకప్పుడు తటాలుమని చిమ్మచీకటి చెలరేఁగెను. ఇంకొకపరి వీక్షించుట కలవి గాని తేజఃపుంజంబు దిశల నన్నిటి నాక్రమించుకొనసాగెను. రేయి పగలుగఁ దోఁచెను. పగలు రేయివలె నంధకారమయమయ్యెను. ఉన్నట్టుండి సైన్యమును జలి యావరించెను. వెంటనే సైరింపరాని వేడిమి పొడమెను. పర్వతములపై నుండి భూరిశిలలు పైఁబడుచుండునట్లుండెను. ఇట్లొకప్పుడు వ్యత్యస్తములగుసుదినదుర్దినములు వానిమాయచే నేనఱుంగఁగొట్టెను వాఁడంచులకు నిలువక యాకసంబున నూఱుగురు సూర్యులు వెలుంగుచుండునట్లును, నూఱుగురుచంద్రులు ప్రకాశించుచుండునట్లును, లెక్కలేనినక్షత్రములు కాంతితో నుండునట్లును, బగలిది, రేయి యిది, తూర్పియ్యది, పడమర యిద్ది, దక్షిణోత్తరము లివ్వి యని నిర్ధారించుటకు వీలు లేక వేయివిధంబుల మాయఁ గావించుచుండె. అవి యన్నియు సాళ్వమాయగా నెఱింగి ప్రజ్ఞాస్త్రప్రయోగంబుచే వాని మాయ నంతయు విఱియఁ జేసితి. అంత వాఁడు నాపై శతఘ్ని నొక్కమాఱును, గదను వేఱొక్కమాఱును, శూలము నింకొక్కమాఱును గ్రమముగ శూలభిండివాలముసలాద్యాయుధములను బ్రయోగింప, నేను వాని నన్నిటిని నాదివ్యబాణచాతుర్యంబున వ్యయ్యలుగఁ గావింప నాదురాత్ముం డంతఁ బోక నారథరథ్యసారథుల నంపవాన ముంచె. అంత దారుకుండు వెలవెల నగుచు నివ్వెఱపోయి 'జనార్దనా! తడవు సేసితేని సాళ్వదెబ్బల కోర్వలేను. వీని నతిశీఘ్రంబున యమపురికిం బంపుము. దివ్యాస్త్రకౌశలంబుఁ జూచుట కిది వేళ గాదు.

సాళ్వవిజృంభణమును నాఁపవలయు. అవయవంబులు నొచ్చుచున్నవి” అని పలికెను. నే నా సారథిదీనాలాపంబులకు శత్రువులయంపములు కులతాఁకుళ్లచే జర్ఝరీభూతంబై పూఁచిన మోదుగుతీరున నుండువాని శరీర మెట్టనె, నెత్తురు కార్పుచుండుటకును, వగఁ జెంది మెల్లనైన శాంతవచనంబులు వలుకుచున్నంత, ద్వారావతినుండి కృతవర్మ పంపిన దూత యొకఁడు వచ్చి నాకట్టెదుట నిలిచి “వాసుదేవా! ఉగ్రసేనుం డిట్లు నీకు వార్తఁ బంపియున్నాఁడు. వినుము. నీవు సైన్యంబుతో ద్వారకను వీడఁగానే సాళ్వుం డదృశ్యాకారుండై ద్వారకం బ్రవేశించి నీతండ్రి వసుదేవుం బట్టికొని బొరిఁబొరి వధించె. ఇఁకఁ బోర నేల? మరలి ద్వారకను గాపాడుకొనుము. అంతకన్న మేలుకార్యం బింకొక్కటి గలదే” యని దీనవదనుండై డగ్గుత్తికతోఁ జెప్పెను. నేనును గొంత యాలోచించి మహాప్రతాపశాలురగు బలదేవుఁడు, సాత్యకి, ప్రద్యుమ్నుఁడు, చారుధేష్ణుఁడు, సాంబుఁడు మున్నగువారిని ద్వారకారక్షణకై నియమించి వచ్చినాఁడ. ఇంతప్రమాదంబు జరుగునే? లోకములను జయింపఁగల జెట్టు లనఁబడువా రుండ వసుదేవుఁ బట్టుటకు నింద్రుఁడైన సాహసించునా? ఇది యేటిమాట? వసుదేవుండు వధింపఁబడె నని విన్నచో బలదేవాదు లగు యాదవవీరులు ప్రాణంబుఁతో నుందురే? ఇట్లు సర్వవినాశం బేల గల్గు? అని యాలోచన చేయుచు సాళ్వుతో విజృంభించి పోరుచుండ మనంబు కలఁత నొంది పుణ్యము నశింపఁగా స్వర్గమునందుండి క్రిందఁబడిన యయాతియుంబోలె, మాతండ్రిరూపంబు చిందఱవందఱలైన తలవెంట్రుకలు, నుత్తరీయము, శిరోవేష్టనము ననెడి వీనితో సౌభంబునందుండి క్రిందఁ బడినట్లు గోచరం బయ్యెను. దానినిఁ జూచుచున్నంతనే నాచేతిధనస్సు తనంతట జాఱిపడెను. నేను బరవశమైనదేహముతోఁ దేరిపై నొకతట్టున నొఱుగ వ్రాలితి. దీనినిం గన్న నా సైనికులు హాహాకారంబులతో నపుడు గఱచువారును, హాయనువారును, నింక దిక్కెయ్యది యనువారును,నిట్టిదియుం గలుగునే యనువారునునై ఱెచ్చపడియుండిరి. అంతఁ గొంతసేపునకు నేద దేఱి యంతటం గలయం గనుంగొనఁగా సౌభంబును, సాళ్వుని, నాతండ్రివసుదేవునిం గానక, దానిని సాళ్వమాయగా నెఱింగి శార్ఙ్గంబును జేతఁ బూని వేగంబున

నందు బాణముల సంధించి క్రూరవిషసర్పములనంటి దారుణబాణము లను సౌభంబున నుండు రాక్షసులపైఁ బ్రయోగింపఁ దలలు ప్రస్సిన వారును, గాలుసేతులు దెగినవారును, నడుములు విఱిగినవారును వక్షం బులు వ్రయ్యలైనవారును, ముక్కులు చదిసినవారును, జెక్కులు చిదిసినవారును, గ్రుడ్లు నెత్తురులు స్రవించువారును నై దానవు లనేకులు క్రిందఁబడిరి. ఇంతలో సాళ్వమాయాబలంబున సౌభం బదృ శ్యం బయ్యె. పలుదెసలయందుండి యాప్పులు పెడబొబ్బలు భయంక రారావంబున వినఁగా వానినన్నిటినిశబ్దవేధిబాణంబుల ఖండించిన నయ్యవి యొకదిక్కునుండి వేఱొకదిక్కు మొగంబై యార్వ వాని నట్ల సమయించి యెటుచూచినను సాళ్వునకు నేన యై వాఁ డెన్ని రూపంబు లెత్తిన నే నందులకుఁ బ్రతిరూపంబుల నెత్తి ఘోరంబుగా ననేకా హోరాత్రంబులు వానితోఁ బోర నున్నట్టుండి వాఁ డనేకపర్వత సర్వం బులను మాయచే నాసైన్యముపైఁ గురియింప నందులకు నాసైనికులు డొల్లంబోయిరి. నే నంత వజ్రాస్త్రప్రయోగమున మాయాపర్వతముల మాయగావించిన నాసైనికులు, మబ్బు వీడినసూర్యునివలెఁ బ్రకాశించు నన్నుం గని సంతసించిరి. అంత దారుకుండు నన్ను మార్వోడఁ బట్టి వీక్షించి "మధుసూదనా! గుఱ్ఱములు పర్వతవర్షంబున డస్సినవి. ఇఁక నుపేక్షింపరాదు. సాళ్వునిఁ బరిమాప్పునాలోచనంబు వేగంబనేయుము. శత్రువు దుర్బలుఁడైనను, దనయింట నుదాసీనుండైనను, బలవంతుఁడైన రాజు సర్వవిధముల విజృంభించి వాని వధింపవలయు. ఇట్లు ధర్మంబుండ మనలను హింసించుచు ననేకమాయోపాయములఁ బన్ని మన కాపదలం గావించుచుండు సాళ్వునివంటిశత్రువు విషయంబున వేతెన్న నేల? తడయకుము. వేగంబ వధోపాయమును జూడుము. కనికరింపరాదు." అనిన సారథివచనంబు లాలకించి, సాళ్వ నిర్జింప, ఖాండవదహన మప్పటిసమయంబున నా కగ్నిదత్తంబును సర్వాయుధనిరసనంబును, బ్రతికూలయక్షరాక్షసవినాశకంబును నగు చక్రాయుధం బభిమంత్రించి సౌభంబును, నందుండురాక్షసులను సాళ్వునితోఁగూడ నందఱనునిర్జితులు గావలసినవా రని ప్రయోగింప నాఘోరసాధనంబు ప్రళయకాలమున సహస్రరూపములతో వెలుఁగుసూర్యునివలెఁ బ్రకాశించుచు, దావాన

లంబుఁ గ్రక్కుచు, నంచులచే నానాయుధంబుల నీనుచు సౌభంబు పయింబడి దానిని బ్రక్కలు సేసి, యం దుండినరాక్షసులఁ దనయం దుండి వెలువడినఘోరదవానలంబుచే భస్మీభూతులం గావించి, మరలి నాయొద్దకు రాఁగా, దానిని గ్రమ్మఱఁ దేజోవతంబు గావించి సౌభ్యుపైఁ బ్రయోగింప దానిదారుణస్పర్శమునఁ బాశుపతంబునఁ ద్రిపురాసురుల వలె సౌభ్యుండు పీనుంగై పడియె. హతశేషు లగు రాక్షసులు చిందఱ పందఱలై నానాముఖంబులకు వెఱచఱచి పాఱెరి. నేను బరమోల్లాస భరితహృదయుండనై నామిత్రులకు సంతసంబు గావించినందులకు ముదం బంది శంఖంబుఁ బూరించి జయజయధ్వనులు భూమ్యాకాశ మధ్య ప్రదేశంబుల బీటలు వాఱింప ద్వారకను జేరి సుఖం బుండ నిశ్చ యించుకొనఁగా మీవిపద్దశ నాకర్ణించి వేగంబున నిట కరుగుదెంచితి. ఈకారణమున జూదమప్పుడు హస్తినాపురమునకు రా నేర నైతి. దీని చేత మీరు నానాపదలపాలయితిరి.అందులకు వగచినఁ గార్యంబు లేదు. సమయంబు దీఱినపిదప దీర్ఘాలోచన గావించి కర్తవ్యమును జేయుదము” అని చెప్పి జనార్దనుండు పాండవుల వీడ్కొనునప్పుడు ధర్మజ భీములకు మ్రొక్కె; అర్జునునిఁ గౌఁగిలించె; నకులసహదేవుల ప్రణామంబులం గొనియె, ద్రౌపది నూరడించె; ధౌమ్యునాశీర్వచనంబులు శిరసావహించె. అటు లొనర్చి సుభద్రాభిమన్యులం దోడ్కొని తాను ద్వారావతికి విచ్చేసె. ధృష్టద్యుమ్నుండు ప్రతివింధ్యాదిద్రౌపదేయుల దోడ్కొని ద్రుపదుపురంబునకుఁ జనియె. కైకేయాదు లందఱును బాండవుల వీడ్కొలు గావించి తమతమపురంబులకుం జనిరి.

### పాండవులు ద్వైతవనంబునకు వచ్చియుండుట

మఱియు నిటఁ బాండవులును రథముల నెక్కి యాయుధములు ధరించి యింద్రసేనాదులగు నిరువండ్రు సేవకులు ముందునడువ ననేక సహ స్రబ్రాహ్మణులతో ద్వైతవనమునకుం బోయిరి. అంత ధర్మరాజు తమ్ముల కిట్లనియె. ఇయ్యది భయంకర మగునరణ్యము. క్రూరమృగములు సింహ ములు, పెద్దపులులు, శరభములు కొండజెలగలు, మదపుటేనుఁగులు మున్నగునవి స్వేచ్ఛగ విహారము సలుపుచుండు. అప్రమత్తులరై

యుండవలయు నని చెప్పెను. అంతకుమున్ను వీరు ద్వైతవనమునకుఁ బ్రయాణమై పోవుచుండఁగా నింద్రప్రస్థవాసు లగు జనులు ధర్మరాజు నకుం బ్రదక్షిణముగ వచ్చి ముందట నిలిచిరి. ధర్మరాజు రథముల నిలుపఁ బంచి వారినిఁ గృపతో నాదరించె. అంతనా ప్రజ లిట్లనిరి. "మా కెల్ల నో ధర్మపుత్త్రా! నీవు దండ్రివంటివాఁడవు. మహానుభావుండవు. మమ్మును, నమరావతికి సమానంబైన యింద్రప్రస్థపురంబును, రాజసూయయాగం బునకు ముందు మయనిర్మితమై నీకుఁ గానుకగా నొసంగఁబడిన యమ్మ యద్భుతసభను విడిచి కానల కేగుచున్నవాఁడవు. సదా ధర్మాత్ముండవు. దుర్యోధనాదిదుష్టులు నలువురును, గపటోపాయములచే నీ కిట్టి యిడు మలు గుడువవలసివచ్చె" నని లజ్జావిషాదంబులు గదుర నాక్రోశించు చుండ వారలం జూచి యర్జునుండు "అయ్యా! ధర్మరాజునకు విజయము సేకూరునట్లు లాశీర్వదింపుఁడు. పదమూఁడేఁడులును బ్రతిజ్ఞను గడపి యీరాజు శత్త్రువుల గెల్చి యవశ్యంబు రాజ్య మేలును. మావెంబడి నీఘోరకాననంబులకు మీ రేల వచ్చెదరు?" అని చెప్పఁగా విని వారు పాండవులయొక్కయు, ద్రౌపదియొక్కయు సెలవుగైకొని వచ్చినత్రోవ నరిగిరి. అంత ధర్మజుఁడు, "ఈపండ్రెండేఁడులును నరణ్యవాసము చేయ వలయును. ఇందు మనుష్యసంచారము లేదు. ఇచ్చటి శృంగారములం జూడుఁడు" అనిచెప్పఁగా నన్నకు నర్జునుం డిట్లనియె. మహారాజా! నీవు సర్వకాలములయందును పెద్దలసేవను జేసినవాఁడవు,నిన్నెప్పుడును విప్రులు విడువక చుట్టుకొనియుందురు. సర్వలోకములకు మేలు గోరుచు సంచ రించుచుండు నారదుండు, వేదవ్యాసుండు మున్నగు మునీంద్రులమహి మల నెఱింగినవాఁడవు. కావున నీమహారణ్యమున మనము నివసించుటకుఁ దగిన ప్రదేశమును శ్రేయస్కర మగుదానిని నీవ నిర్ణయింపుము. నీనిర్దే శించిన ప్రదేశమున నుండెదము. సర్వవిధముల రమణీయమగు నీద్వైత వనమున నుండుదము గాక యనఁగానే ధర్మరాజందులకు సమ్మతించెను. అయ్యడవి యెల్లప్పుడు లేఁతచిగుళ్లతోను, నెత్తావిగలిగిన పుష్పములతోను గూడికొని దీర్ఘశాఖలు గలిగి, యెండవేడిమిని నేలపైఁ దగుల నీయక, యంధకారబంధురము గావించి, పచ్చని పొదలపై నల్లుకొనియుండునానా విధములగు తీఁగలతోఁ బెనఁచుకొని కన్నులకు రామణీయకమును, జల్లఁ

దనమును గొల్పుచుండు తమాలరసాలకర్ణికారాదివృక్షంబులతో వెల యుచుండునదియు, మదించినతుమ్మెదలఝుంకారంబులతోను, నాకసం బున మేఘములఁ గాంచి తనంతటనె విప్పియాడువగ నెమళ్లం జూచుచు మంజులధ్వనుల వీనుల కింపుగొల్పునాఁడు నెమళ్లకంఠస్వరంబులతోను, గన్నుల కింపైనవివిధవర్ణములతో నుండుచిలుకలధ్వనులతోను మనోహర మంజులధ్వనులఁ గావించుకోకిలారావంబులతోను,నిర్మలోదకములతోను ండు సరోవరంబులతోను, మదించినయేనుంగుల సమూహములఘీంకా రములతోను, ననేకసిద్ధుల కునికిపట్టై యుండు నాద్వైతవనమును జొచ్చి రథంబు దిగి తన్నుఁ గాంచుట కేతెంచినమునీంద్రులకును సిద్ధచారణుల కును మ్రొక్కి వారియాశీర్వచనములను శిరసా వహించి, వారిచ్చినకాను కలను గొని యొక్కమహావృక్షమూలమున ధర్మజుండు తమ్ములును, ద్రౌపదియు, సేవకులును దన్నుఁ జుట్టి కొలుచుచుండఁ గూర్చుండి తప స్సిద్ధు లగుమహనీయులను బూజించుచుండెను. అంతట నందుఁ బాండవు లేవురును సరస్వతీనదీతీరంబున స్వేచ్ఛావిహారంబు గావించుచు నడవుల యందలి కందమూలపదార్థములను సేకరించి విప్రుల కొసంగుచుఁ దాము నారగించుచుఁ ధౌమ్యుండు చెప్పినచొప్పున దేవపితృకార్యములం జేయుచు సుఖులై యుండునంత నొక్కనాఁడు మార్కండేయమునీం ద్రుం డచ్చోటికి కేతెంచె. ఇట్లు వచ్చి ధర్మరాజాదులచే సుచితసత్కారం బులం గొని వారినడుమ సుఖాసీనుండై వారి నెల్లఁ దేరిపాఱఁ జూచి మనమ్మున శ్రీసీతారాములం దలంచి చిఱునవ్వు నవ్వెను. అంత ధర్మరాజు 'మహానుభావా! మునులెల్లరు మేముపడునిడుమల కనుతాపమందుచుండ వీరిందఱసమక్షమంబున నవ్వ నేల యని యడుగ నమ్మునీంద్రుండు రాజ చంద్రున కిట్లనియె. ధర్మపుత్త్రా! నాకు సంతోషముగాని, యాశ్చర్యము గాని, దర్పము గాని యేనాఁడును గలుగదు. నీ విట్లీయరణ్యమున నుండు టఁ జూచి నాకు దశరథసుతుండు శ్రీరాముండు స్మరణమునకు వచ్చె. సత్యశీలుండగు శ్రీరాముండు పితృవాక్యపరిపాలననిమిత్తము తమ్ముఁడగు లక్ష్మణుఁడును, భార్య యగు జానకియు వెంట రాఁగఁ దొల్లి వనవాసం బాచరించె. ఇంద్రసమానుఁ డైన యాపుణ్యాత్ముని నేను బూర్వకాల మున బుశ్యమూకపర్వతప్రాంతములఁ గ్రుమ్మఱుచుండఁ జూచియుంటి.

మహాపరాక్రమశాలియుఁ, దేవోపమతుఁడును నగు నామహాసింహుండును
విధిప్రేరణమున భోగములం ద్యజించి యరణ్యములఁ గ్రుమ్మరిగెను. నాభా
గుఁడు, భగీరథుఁడు, అలర్కుఁడు మున్నగువారు సకలమహీరాజ్యములను
నెదురు లేక యేలి, కొట్టకొనకు రాజ్యభోగంబులు తుచ్ఛంబులని యున్ని
త్యజించి విపినంబులయందు నంత్యకాలములం గడపిరి. సుఖదుఃఖములు
కలిమిలేములు కావడికుండలవంటివి. అయ్యవి దైవచోదితంబులై
మనుజులచే ననుభవింపఁబడు సప్తర్షిలోకసంబున వెలయుటకు దైవ-
బలమే యాధారము సుఖదుఃఖములు దైవాధీనములు. కాన మనుజుం
డెల్లప్పుడు ధర్మచింత గలిగి ధర్మచరణముఁ గావింపవలయును. కాని,
యహంకరించి యధర్మంబు జేయరాదు. అష్టదిగ్గజంబులు మహాబల
సమన్వితంబు లయ్యు దైవవశంబులై కట్టువడియున్నయవి. కావున సత్య
మునకు ధర్మమునకు లోపము రానీయక యుచితవృత్తినుండి సమయ
మునం జేసి వనవాసపరిమితిం గడపుము. నీధర్మబలముచే సూర్యునివలెఁ
బ్రకాశించుచుండుము. నీరాజ్యలక్ష్మి తనకుఁ దాన నీచెంతఁ జేరు. నీవు
సుఖివగుదువు. కష్టములు జీవరాసు లన్నింటిచేఁ గర్మాధీనములుగ ననుభవింపఁబడుచుండు. ఇందులకుఁ గుందకుము. నేను బోయి వచ్చెద నని
యనుజ్ఞ వడసి మార్కండేయుం డుత్తరాభిముఖుండై చనియె. పాం
డవులు ద్వైతవనంబున నుండ నమ్మహారణ్యం బెల్లప్పుడును మునిజనసం
కీర్ణంబును, విప్రులు పఠించు ఋగ్యజుస్సామములఘోషములచే విరా
జితంబును పాండవులధనుష్టంకారనినాదములతోఁ గూడినదియునై యొం
తయు మనోహరంబై యుండె.

అంత నొక్కనాఁడు ధర్మజుండు కాలనియతిం దప్పక యాహ్ని
కక్రియలం గావించుచుఁ దన్నుఁ బరివేష్టించియున్న విప్రులు సాయం
కాలమున హోమాదిక్రియ లాచరించునిమిత్త మగ్నిదేవునిఁ బ్రజ్వ
లింపఁజేయ నాదీప్తికి వనం బెల్లఁ గాంతిమంతంబై వెలయుచుండ నారా
మణీయకమునకు మనంబున సంతసించి బకదాల్భ్యుం డను మునీశ్వరుండు
ధర్మజుని సమీపించి యారాజచంద్రునితో నిట్లానతిచ్చె. రాజా!
ఈవిప్రవరు లెల్లరును నీయాదరణంబునఁ గాదె యీఘోరారణ్యం
బున యథేచ్ఛగా వన్యమృగంబులబాధ లేక సాయంసమయాగ్ని

హోత్రకార్యములను జరుపుచుండు నీవేళను జూడుము. ఓనృపో
త్తమా! పావనం బైన యీద్వైతవనంబున మునిజనశ్రేష్ఠులును, దృఢ
వ్రతులు నైన భార్గవులు, నాంగిరసులు, కాశ్యపులు, వాసిష్ఠులు, మహా
తపస్సంపన్నులగు నగస్త్యులు, సత్తమవ్రతు లయిన యాత్రేయులును
నీపరిపాలనంబున నుండు నాశ్రమంబుల వసించుచు, నీవు పరికించుచుండఁ
బుణ్యకర్మముల నాచరించువారు. ఓకౌంతేయా! నీవును దమ్ములును నేఁ
జెప్పెడి పలుకు లాలకింపుఁడు. బ్రాహ్మణసహితుఁడయిన క్షత్రియుఁడు,
క్షత్రియపాలితుఁడయిన బ్రాహ్మణుఁడు నొండొరులుంగూడి, వృద్ధి
నొందిన యగ్ని మారుతంబులు వనంబులం బోలెఁ బగతురఁ బరిమా
ర్తురు. ఇహపరంబుల సాధింపఁగోరు క్షత్రియుఁడు బ్రాహ్మణునితోడ్పాటు
లేక చిరకాలంబు మనలేఁడు. కావున ధర్మార్థరహస్యవేదియు, మోహ
రహితుఁడు నైనద్విజునిమంతసంబునంజేసి క్షత్రియుఁడు శత్రువుల
సంహరించు. తొల్లి బలిచక్రవర్తి ప్రజారక్షణంబువలనఁ బుణ్యం బొం
దఁగోరి, యితరసాధనంబులు పరికించియు, బ్రాహ్మణునికంటె మించిన
సాధనంబు గానక యట్టిద్విజునిసాహాయ్యముచేత సకలసంపత్సమృద్ధ
మగు మహీరాజ్యంబు వడసి యక్షయసంపదలతోఁ దులఁదూగుచుం
డియుఁ దుదకు వారికే కీడు రోసి రాజ్యంబును బోనాడి, తానును
నశించెను. కనుక విప్రునిసాహాయ్యము నొందనినృపాలుని సకలసంపత్సం
పన్నంబగుమహీరాజ్యము చిరకాలము వరించియుండ నేరదు. ధర్మజ్ఞుఁ
డగు బ్రాహ్మణునిచే శిక్షితుఁడయి, వినయవివేకసంపన్నుఁడైన నృపాలుని
చతుస్సముద్రవలయితం బగు భూమండలంబు తనంతన వరించు.
యుద్ధరంగంబున నంకుశంబుపోటుపడసిన కుంజరమువోలె విప్రరహితుఁ
డయిన క్షత్రియుఁడు బలహీనుఁ డగు. బ్రాహ్మణునం దసమానబుద్ధియు,
క్షత్రియునందు సాటిలేనిమగటిమియుఁ గలవు. ఇవి యొండొంటిఁ గలసె
నేని, పుడమి సుఖంబు నొందును. వాయుసాహాయ్యమునఁ గాఱుచిచ్చు
తృణరాశిని దహించుమాడ్కి బ్రాహ్మణశిక్షితుఁ డయిననృపాలుఁడు
శత్రునిర్మూలనం బొనరించు. దొఱకిన రాజ్యంబు గాపాడను, లేనిదానిని
సమకూర్పను, నార్జితధనంబును సత్పాత్రమున వినియోగింపను, కీర్తిమం
తుండు వేదవేదాంగపారగుఁడు నై లోకానుభవంబు నెఱిఁగిన విప్రుని

మంత్రినిగఁ బడయవలయును ఓయుధిష్ఠిరా! నీ వెల్లప్పుడు విప్రులం దసమానభక్తి గలిగియుందువు. కావున ముజ్జగంబులందు సాటిలేని కీర్తి నొందుదువు.

అని యిట్లు బకదాల్భ్యమునీంద్రుఁడు యుధిష్ఠిరుం బొగడుచుండ ద్వైపాయన, నారద, జామదగ్న్య, పృథుశ్రవ, ఇంద్రద్యుమ్న, వాలుకి, సహస్రపాద, కృతచేతస, కర్ణశ్రవ, ముంజ, లవణాశ్వ, హారిత, స్థూణకర్ణ, అగ్నివేశ, శౌనక, కృతవాక్, సత్యవాక్, బృహదశ్వోర్ధ్వరేతసులును, విభావసు, వృషామిత్ర, సుహోత్ర, హోత్రవాహానులును దక్కుంగల మహర్షులును దేవేంద్రుని దేవత లెల్లఁ బోలె నయ్యుధిష్ఠిరుం బరివేష్టించి యతనిం బ్రశంసించుచుండిరి.

పదపడి యొకనాఁడు వనవాసంబునఁ గడు నిడుమలఁ బడుచున్న పాండవులు ద్రౌపదీసమేతులై యొక్కచోట నిష్టకథాగోష్ఠులఁ జలుపుచుండఁ బ్రియురాలును, రూపలావణ్యవతియు, వివేకసంపన్నయుఁ, బతివ్రతయు నైన ద్రౌపది యుధిష్ఠిరుం గాంచి యిట్లనియె. నాథా! దురాత్ముఁడును, క్రూరుఁడును, పాపాత్ముండు నగు దుర్యోధనుఁడు మనయెడ నించుకేనియుఁ గూర్చువాఁడు గాఁడు. అతనికి మనయెడఁ గరుణ లేదు. కాకున్న మనల నతఁడు దుష్టమతియై యడవికిఁ బంపునప్పుడు మనకు నారబట్టల నొసంగి మనలఁ బంపుటయె కాక, యనరానిమాటలను గూడ ననెను గదా? ఆపాపుండు డెట్లొనర్చియుఁ బశ్చాత్తాప పడఁడుకదా. వానిహృదయంబు నిక్కముగ నినుముతోఁ జేయఁబడి యుండును. ఆపాపాత్ముండు మనల నడవికిఁ బంపునాఁడు సుఖోచితుండవు, దుఃఖానర్హుఁడవు నగుధర్మిష్ఠుఁడవైన నిన్నును ననిర్వాచ్యములు కొన్ని పలికి మనంబున సుప్పొంగుచున్నాఁడుగదా! మన మిట్లు నారచీరలఁ గట్టి, యరణ్యములకు వచ్చునప్పుడు దురాత్ములగు దుర్యోధన, దుశ్శాసనశకునికర్ణులు తక్కఁ దక్కినవా రందఱు కన్నీరు మున్నీరై పాఱ విలపించిరి గాదె? ఓమహారాజా! నీవు తొల్లి కొలువుకూటంబున నవరత్నఖచితంబైన కనకసింహాసనమున సామంతపరివేష్టితుండవై కూర్చుండి యుండి, యిప్పుడు దర్భాసనంబునఁ గూర్చుండియుండుట చూడ నామనంబు శోకానలదందహ్యమానమై యున్నది. నే నెట్టు

నిడుమలఁ బడి కుందుచున్న నిన్నుఁ జూచి వగవక యుందును. తొల్లి చందనరూషితాంగుఁడవై, మేలిమి పట్టుబట్టలం దాల్చి యమూల్య వస్త్రాభరణములు గట్టిన నిన్నుఁ దనివి తీరఁ గాంచిన కన్నులతో నిపుడు నారబట్టలఁ గట్టి దర్భాసనంబునఁ గూర్చుండియుండు నిన్ను నీపాడుకన్ను లతోఁ జూడవలసివచ్చెఁ గదా? ముందు గృహస్థులకును, వానప్రస్థ సన్న్యాసులకును బసిండిపళ్లెరంబులందు వారివారి కాంక్షలకుఁ దగినట్లు రస వంతంబుగఁ బక్వపఱచిన మృష్టాన్నంబుల వడ్డించి యారగింపఁజేసి వారి సకలమనోరథములఁ దీర్చిన నీ విప్పు డరణ్యముల నూరకుండుట చూడ నామనంబున కించుకేనియు శాంతిగలుగలేదు. మునుపు రత్నకుండల ధారులైన ప్రాయంపువంటవాండ్రు రుచిమంతముగాఁ బరిపక్వంబులు చేసిన వివిధములగు నన్నంబులు వడ్డింప నారగించిన నీతమ్ము లిప్పుడు వన్యకందమూలఫలములతోఁ గాలంబు పుచ్చుచుండ నామనం బెట్లుప శాంతి నొందఁగలదు! ఇట్లీభీమసేనుఁ డడవులం దుండి కడు నిడుమలఁ బడుచుండ నిట్టి యదనున నైతము నీవెట్లు రోషంబు పూనవు. అద్భుత కృత్యంబుల నొనర్చుచుఁ దా నొక్కరుండ యన్నికార్యము లొనర్పఁ జాలిన సుఖార్హుఁడగు భీముఁ డడవుల వనటలపాలై యుండ, నీమనం బెట్టు లోర్చియుండు. ఏల యిట్టియసమానపరాక్రమవంతుని నుపేక్షిం తువు? మునుపు వివిధవస్తువాహనంబులతో గారవింపఁబడిన యీ భీముఁ డిపు డడవుల నాయాసంబు నొందుచుండ నాశత్రువులనాశంబునకై యేల రోషంబు పూనవు? ఈవృకోదరుఁడు దా నొక్కరుండ శత్రువులను బిలుకుమార్పఁ జాలియు నీయాజ్ఞకు బద్ధుఁడై యున్నవాఁడు. తాను రెండుచేతులవాఁడయ్యుఁ సహస్రబాహుండగు కార్తవీర్యార్జునుని మించినవాఁడై, బాణప్రయోగంబున నంతకునికి సాటియై స్వభుజపరాక్ర మంబున దిగ్విజయంబుఁ గావించి యందఱురాజులను వశపఱచికొని, వారివలనఁ గప్పంబులను గొనివచ్చి, నీయొనర్చిన రాజసూయకాలమున వారినెల్ల నీకు భృత్యులట్లు సకలోపచారంబులఁ జేయునట్లొనర్చిన వాఁడును, దేవదానవపూజితుండును నైన యర్జునుం జూచి నీవు శత్రు నిర్మూలనంబునకై యేల క్రోధంబు పూనవు? దుఃఖార్హులు గానివీర లిట్లు కుందుచుండఁ జూచుటకు నామనం బోర్వకున్నది. నేను దుఃఖపరవశు

రాల నయ్యెదను. ఆశ్చర్యకరంబులగు వివిధాయుధంబులఁ దాల్చి యొ-
నెక్కటియె శత్రువులతోఁ బోరి తనగాండివమునుండి యేనూటేసి
బాణంబు లేసి, వారిని వశపఱచుకొని కప్పంబులు కొని తెచ్చియిచ్చిన
మేటివిలుకాఁ డగు నర్జునుఁ డిపుడు వనంబున నిడుమలఁ బడుచుండ నీవు
రోషము పూనక యుందు వేల? మానవేంద్రా, కవచంబు దొడిగి, ఖడ్గము
చేఁబట్టి శత్రువులతోఁ బోరఁగల ప్రాయంపువాఁడగు నకులుఁడును,
జూపరియు, మొనగాఁడు నైన సహదేవుఁడును దుఃఖము లొందఁ దగిన
వారు కారు. అట్టి వీరిడుమలఁబడుట చూచి నీవు క్రోధంబు పూన వదేమి?
ద్రుపదునివంశంబున జనించి, పాండురాజుకోడలనై, ధృష్టద్యుమ్నునికిఁ
జెలియలనై, వీరు లగు మీకుఁ బత్నినై, పతివ్రతనై, సుఖోచిత నగు నేను,
వనంబునఁ బడరానిపాట్లు పడుచుండ నీవు శత్రువులపై నలుక వహింపక
యూరకుందు వదేల? నిక్కముగా నీకు రోష మనునది లేదనియె తలఁ
చెద. లేకున్న మే మిందఱ మింత కష్టపడుచుండ నీవు కన్నులారఁ జూచి
యూరకుందువా? లోకంబున రోషములేనిక్షత్రియుఁడు లేఁడందురు.
ఆవార్త నీవిషయమున వ్యర్థమయ్యెను. అదనునఁ బరాక్రమము పూనని
రాజుం జూచిన సకలభూతంబులు సరకుగొనవు. కావున నీవు సర్వదా
శత్రువులపై రోషము పూనకుండుట తగదు. తేజఃక్షమలను సమయో
చితంబుగ నుపయోగింపవలయును. ఎల్లప్పుడు రోషంబు పూనుటయును,
సంతతము క్షమతో నుండుటయు క్షత్రియునకుఁ దగవు. అట్లు రోష
సమయంబునను క్షమఁ బూనువాఁడు సర్వలోకములవారిచేఁ దిరస్కృతుఁ
డయి యిహపరంబులు రెంటికిఁ గాక చెడును.

ఓమానవేంద్రా, యివ్విషయమున బలిప్రహ్లాదసంవాదరూపంబైన
యొక పురాతనేతిహాసము గలదు. దాని నెఱింగించెద నాలకింపుము.
తొల్లి యొకప్పుడు బలిచక్రవర్తి ధర్మరహస్యవేదియు, మహావిద్వాంసుఁ
డునైన తనతాత యగు ప్రహ్లాదుం గాంచి యిట్లనియె. తాతా, క్షాంతి
పరాక్రమములలో నేది శ్రేయస్కరము? నామనంబున సంశయము
పొడముచున్నది తమనిర్ణయంబు చెప్పిన నేఁ బ్రవర్తింపఁగలవాఁడను.
అని యడుగ సకలధర్మసంశయాపనోదనదక్షుఁ డగు ప్రహ్లాదుఁడు బలికి
ని ట్లనియె.

ఎల్లప్పుడు ప్రతాపంబు శ్రేయస్కరంబు గాదు. అట్లే సంతతక్ష
మయుం దగదు. ఓరీ నాయనా, యివి రెండును నిట్టివె యని నీవు నిస్సంశ
యముగ నెఱుంగుము. ఎవఁడు నిరంతరక్షమయ పూనునో, వాఁడు పె
క్కుదోసంగుల నొందును. సంతతక్షమావంతుఁ డగునృపాలునిఁ దదీయ
భృత్యపుత్రమిత్రపరివారములును సరకుగొనరు. వే యేల? సకలభూతంబు
లును నతని నలుసు చేయును. కనుక బుద్ధిమంతులయిన నృపాలు రనయ
ము క్షమపూనరు. సంతతక్షమాశాలిం దదీయభృత్యులు సైతము సరకు
గొనక, యాతనిధనాదులను నాచికొనఁ దలఁతురు మఱియు నిరం
తరక్షమాశాలియధికృతు లాతఁ డనుభవించు ధనధాన్యవస్త్రాభరణ
యానాసనవాహనంబులను నన్నపానాదిసకలభోగ్యవస్తువులను దామ
యనుభవింపఁజూతురు. రాజొరుల కిచ్చినవిగాని యీయ నానతిచ్చినవి
గాని వారి కొసఁగక రాజాజ్ఞ మీఱి నడతురు. కొన్నివేళలందు రాజ
భృత్యాదులు క్షమాశాలి యగు రాజునంతఃపురస్త్రీలను సైతము మపే
క్షింతురు. అట్టివానియంతఃపురాంగనలును దామ యొరుల వలతురు.
దుష్పథప్రవృత్తులగు జను లొక్కవేళ రాజుచేఁ జిక్కినను నతనిదండనకు
లోఁగక, రాజద్రోహమునకే కడఁగుదురు.అనయము క్షమ దాల్చు రాజున
కివియ కాక యింక ననేకంబులు దోషంబులు వాటిల్లు.

ఓవైరోచనీ! యిఁకఁ గ్రోధమె యెల్లప్పుడు పూనువారిదోష
ములఁ దెలిపెద వినుము. స్థానాస్థానముల విచారింపక మానవుఁడు నిరంత
రము కోపమే పూని వివిధదండనమును జేయఁ గడంగునేని, యతఁడు చెలి
కాండ్రతో విరోధంబును బొందును. లోకు లందఱును దుదకు బందుగు
లును విరోధు లగుదురు. మానవుండుగ్రదండమును సదా యాచరించుట
వలనఁ బరులవలన నవమానితుండై ద్రవ్యహానిని, బహుజనదూషణం
బును, నలక్ష్యభావమును బొందును. దాన మనోదుఃఖము జనించు. అది
ద్వేషమును, నయ్యది మోహమును గలిగించును. దానివలన బహుజన
విరోధంబు గలుగును. మనుష్యులం దుగ్రదండము ప్రయోగించువాఁడు
వేగ నధికారభ్రష్టుఁడై ప్రాణనాశము బంధునాశమును బొందును.తనకు
నపకర్తలను నెవఁడు దండముచే లోఁబఱచుకొనఁజూచునో యట్టి వానికి
నింట నున్న పామునకుంబోలె నందఱు వెఱతురు. ఎవనిఁ జూచిన జనులు

వెఱతురో వాని కెట్టి యైశ్వర్యము గలుగును? తఱివేచియుండి యతని బందుగులే యతనికిఁ గీడొనరింపఁ గడఁగుదురు. కావున నో నృపాలు. డతికఠినుఁడును, నతిమృదువుఁ గాక సమయోచితంబుగఁ గాఠిన్యమును, మృదుత్వమును బూనునో వాఁడిహపరంబులందు రెంటను సౌఖ్యంబుల బడయును. ఓబలీ! ఏయేసమయంబులందుఁ దప్పక క్షమయవలంబింపవల యునో, యట్లుశాంతివహింపవలసిన యదనుల సవిస్తరంబుగ నెఱిఁగిం చెద.ఆలింపుము. తొలుత నీ కుపకృతియొనరించినవాఁ డానల నీకు మహా. పరాధంబు నొనర్చినను నతనియపరాధంబును మన్నించి యుపకారము నొనరింపవలయును. తెలియక నేరమొనర్చినవారినేరములను మన్నింప వలయును.కావున కిన్ని సంగతులు తెలిసియుండవగదా? ఒకఁడు వరి యు నని నేరము నేసి, తెలియక చేసితి నని మఱచెనేని,యట్టివాని యా నేరమునుమన్నింపక దండనముచేసియే తీరవలయును కాని వానిని మన్నిం పరాదు. కావునగాంధ్రను క్షమింపఁ దగదు. ప్రతిమానవునియు ప్రథమా పరాధము కొలఁదిదైనను మన్నింపఁదగదు. ఒకఁడు తెలియక నేర మొనర్చెనేని, యతఁడు తెలియక చేసెనా యని శోధకులచేఁ బరి కించి, యాతనినేరము మన్నింపఁదగు నంట్రు. సామమునసే కఠినుని జయింపవచ్చు. సామమునసే మెత్తనివానినిగూడఁ జయింపవచ్చును. సామ ముచే సాధింపరాని దొక్కటియు లేదు. కావున సామమే కడు వాఁడి దైయునది. దేశకాలములను, దనబలాబలములను, గార్యకారణము లను బరికించి క్షమయో తేజమో ప్రయోగింపవలయును. దేశకాల ములకు మించినది యొండు లేదు. కావున నీవును దేశకాలములను నిరీ క్షింపుము. లోకమునకు వెఱచియు నేరగానిని సైతము మన్నింపవలసి యుండును. ఇవి యెల్ల క్షమకు సమయంబు లని పేర్కొనఁబడినవి. ఇవి తప్పఁ దక్కినవి మగటిమిఁ జూపఁ దగునవి ములు. అని ప్రహ్లాదుఁడు బలికి నెఱిఁగించె.

నరాధిపా! ఇది నీకుఁ బరాక్రమము చూపఁ దగునంబు. ఇప్పుడు నీపగతు రగు ధార్తరాష్ట్రులు రాజ్యలోభులై నీకుఁ గీడే రోయు చుందురు గాన కౌరవులపై క్షమ వహింపఁదగిన యద నిపుడు రాదు.

ఃది పరాక్రమము చూపఁ దరుణము కావునఁ బరాక్రమమునకే కడఁ
కము. ప్రతాపసమయంబున క్షాంతిగలవాఁ డవమానంబు నొందును.
తీక్ష్ణునివలన జను లెల్లరు వెఱతురు. కావున నే మహీపాలుఁడు సమ
యంబున వీని రెంటి నెఱుఁగునో వాఁడు భూమి నెల్ల నేలువాఁడు. అని
యిట్లు యాజ్ఞసేని పలుకఁగా యుధిష్ఠిరుఁ డామె కిట్లనియె.

ద్రౌపదికి యుధిష్ఠిరుఁడు క్రోధంబు దగ దనుట

పాంచాలీ! మానవులను జంపునది క్రోధంబు. క్రోధంబు జితమై మేలొనర్చు ఓమహాప్రాజ్ఞురాలా, సుఖదుఃఖములు రెండును క్రోధ మ్మూలము లని యెఱుఁగుము. ఓశుభాంగీ! ఎవఁడు క్రోధంబు జయిం చునో, వానికి సుఖంబు గలుగును. ఎవఁడు క్రోధం బుపసంహరింపఁడో, వానికి దుఃఖము కలుగు. కావున దుఃఖకారణంబు క్రోధం బని యెఱుఁ గుము. ఓ తన్వంగీ! ఏమానవుఁడు జనులపై నలుకం బూనునో, యట్టి పరమఘాతుకమైన క్రోధము దుఃఖమునకే యగును. క్రోధము ప్రజ లకు వినాశకారణము గావున నావంటివాఁ డట్టిలోకనాశకంబైన క్రోధంబును జనులపై నెట్లు ప్రయోగించును? క్రుద్ధుఁడైన మానవుఁడు పాపం బొనర్చు. గురువులను సైతము సంహరించు. క్రుద్ధుఁడైనవాఁడు పరు షపుమాటలాడి తనమేలు గోరు పెద్దల నైనను ధిక్కరించును. క్రుద్ధునకు వక్తవ్యావక్తవ్యములు తెలియవు. క్రుద్ధునికిఁ జేయరాని దొక్కటి లేదు. అనరాని దొక్కటిలేదు. క్రుద్ధుఁ డవధ్యులను గూడ వధించు. వధ్యులనుగూడఁ బూజించు. ఆత్మహత్యను సైతము చేసికొనును. ఇహపరంబులందు రెండింటను మే లొందఁగోరిన జ్ఞానులు క్రోధదోష ముల నెల్ల నెఱిఁగి క్రోధంబును బాఱఁదోలిరి. ఇట్లు జ్ఞానులు విడిచిన యట్టి క్రోధమును మాదృశుఁ డెట్లు పూనును? ఓ ద్రౌపదీ! దీనినెల్లఁ బరి కించిన నాకుఁ గ్రోధము పొడమదు. క్రోధిపైఁ గ్రోధంబుపూననివాఁడు తన్ను నొరులను మహాభయంబునుండి కాపాడును. ఈతఁడు తనకును నొరుని కినిఁ జికిత్సకుఁడు. మూఢుఁడైనవాఁడు శ్రమ లనుభవించి తాను శక్తిహీ నుఁడయ్యు బలవంతు లగువారిపైఁ గ్రోధంబు పూనెనేని వారితోఁ బోర లేక జీవితంబుఁ బాయును. అట్లు బుద్ధిహీనుండై బలవంతులమీఁది కేఁగి,

ప్రాణపరిత్యాగంబు చేయువానికి సత్తమలోకంబులు లేవు కావున సత్పు
రుషుండు కోపమును బూనకుండుట యుత్తమ మని చెప్పంబడు. ఏబలి
ష్ఠుండు పలువలువ గష్టము లొందిన బుద్ధిహీనుండై పరులపై నలుక
పూనడో, యతండు శత్రువులం బరిమార్చియుఁ బరలోకంబున సుఖముఁ
బడయఁడు. కనుక బలవంతుఁడేని, దుర్బలుఁడేని జ్ఞానసిద్ధుఁడైనవాఁడు
తా నిడుములఁ బడియు నలుకఁ వహింపకుండుట లగ్గు. ఓకృష్ణా! సాధువులు
కోపనిగ్రహంబు మేలని కొనియాడుదురు. ఓర్పు గలసాధువునకే యిహ
లోకంబునఁ దప్పక జయంబు గలుగు నని పెద్ద లందురు. అసత్యమున
కంటె సత్యంబును, క్రౌర్యమునకంటె దయాళుతయు శ్రేయంబు. ఇట్లు
బహుదోషాస్పదంబును, సజ్జననిందితంబును, లోకమునకు నాశకరంబు
నైన క్రోధంబు నావంటివాఁడు విడువవలయును. దూరాలోచనంబు గల
విద్వాంసు లెవనిని బరాక్రమశాలి యందురో, యట్టివానికి మనంబునఁ
గ్రోధమన్న మాట యుండ దనుట నిక్కము. ఎవఁడు తెలివిమాలిన తనకుఁ గల
గిన కోపంబును జ్ఞానమునం జేసి పరికించి యడఁచుకొనునో, వాఁడే
ప్రతాపశాలియని తత్త్వవేత్తలగు విద్వాంసులందురు. క్రుద్ధుండు కార్యస్వ
రూపమును జక్కఁగ నెఱుఁగఁడు. ఏది యకార్యమో యెఱుఁగఁడు.
మర్యాద యతనికిఁ దెలియదు. క్రుద్ధుండు చంపఁదగనియట్టివానిని
నైతము చంపును. గురువులను గూడఁ బరుసనిమాటలాడి నొంచును.
కావునఁ బ్రతాపంబు చూపవలసినతఁడు క్రోధంబు దవ్వున విడువ
వలయును. ప్రతాపవంతునకు నేర్పును, రోషంబును, శౌర్యంబును,
జాలుకుఁదనంబును లక్షణము లని పెద్ద లందురు క్రోధంబు పూనినవాఁ
డీగుణముల నాలుగింటినిఁ బడయఁజాలఁడు. పురుషుఁడు క్రోధంబు వీడి
ననే లెస్సగాఁ బ్రతాపంబు వడయును. క్రుద్ధులైనచో సుపరిపాలులయి
నను తేజంబు నొందఁ జాలరు. వివేకహీనులు క్రోధమే నిత్యతేజం బని
యందురు. రజోగుణపరిణామమైన క్రోధము లోకనాశమునిమిత్తమే
మానవులకుఁ గల్పితంబైనది. కనుక లోకముల మేలుగోరు వివేకి
క్రోధంబును బొత్తుగా విడువవలయును. క్రోధికంటె స్వధర్మపరిత్యాగి
యైనను మేలని పెద్ద లందురు. బుద్ధిహీనులగువారు క్షాంత్యార్జవాదిగుణ
ముల నుల్లంఘించినను, నాబోటి యగువాఁడు మేటికర్మముల నుల్లం

సించునే. మానవులలో బ్రధ్వీసములగు క్షమావంతులు భూలోకంబున నుండరేని, మనుష్యులకుఁ బరస్పరస్నేహమే యుండదు. కలహామునకు మూలము క్రోధమేకదా! ఒకనిచే బాధితుఁడు తన్ను బాధించిన వానిని గొట్టును. గురువులను సైతము బాధింపఁజూచును. ఇట్లెఱుఁగునఁ బ్రాణు లలో నధర్మంబు ప్రసిద్ధమగును. తిట్టఁబడినవాఁడు దిట్టినవానిని క్రోధముచే మఱలఁ దిట్టును. కొట్టఁబడినవాఁడు కొట్టినవానినిఁ గొట్టును. నొంపఁబడినవాఁడు నొంచినవానిని నొంచును. కోపంబు ప్రబలెనేని, తండ్రులు కొడుకులను, కొడుకులు తండ్రులను, భర్తలను భార్యలును, భార్యలను భర్తలును జంపుకొందురు. ఓ కృష్ణా, లోక మిట్లు క్రోధావిష్టమై యుండ, సృష్టియె యుండదు. భార్యాభర్తల కనురాగమేకదా యుత్పత్తికారణము. కావునఁ గ్రుద్ధులగువారు శీఘ్రమ నశింతురు. కనుకఁ గ్రోధము ప్రజలకు దారిద్ర్యమునకును జేటునకును గారణంబు కావున ప్రజావృద్ధి గోరునతఁడు క్రోధంబు వహింపఁ జనదు. క్షమావంతులు భూమితోఁ దుల్యులు గాన క్షమవలనఁ బ్రజలకు నుత్పత్తియు సుఖంబును గలుగదు. బలవంతుఁ డొక్కవేళఁ దిట్టినను నెవఁడు బదులు సేయఁజాలియుఁ గ్రోధం బణఁచికొనియుండునో, వాఁడు లోకంబున నుత్తమపురుషుఁ డనఁబడును. దేహాంతమున వానికి శాశ్వతములగు పుణ్యలోకంబులు గలుగును.

బుద్ధిహీనుఁ డగు క్రోధనుం డిహపరంబులందు రెండింటను జెడును. తొల్లి మహాత్ముఁడగు కాశ్యపుఁడు క్షమావంతులమధ్యమున క్షమావంతులమహిమంబును 'క్షమయె తపస్సు, క్షమయె యజ్ఞము, క్షమయె వేదములు, క్షమయె శాస్త్రములు' అని పెక్కుతెఱఁగులఁ బొగడెను. ఎవఁడు క్షమాప్రభావం బెఱుఁగునో, వాఁ డన్నియుఁడును లోర్చును. క్షమయ బ్రాహ్మణత్వము. క్షమయ శౌత్రము. క్షమయ భూతభవిష్యత్తులు. క్షమచే నీజగం బెచ్చుతక్కువగాక నిలిచియున్నది. క్షమావంతులు యజ్ఞవేత్తలు పొందులోకంబులకంటెను, బ్రహ్మవేత్త లొందు లోకంబులకంటెను, తాపసు లొందులోకంబులకంటెను, త్రేతాగ్నిసాధ్యకర్మము లాచరించువారు పొందులోకంబులకంటెను, వాపీకూపతటాకారామప్రతిష్ఠాదు లొనర్చువారు పొందులోకంబులకంటెను మించిన

లోకంబు లొందుదురు. క్షమావంతులకుఁ బరమపూజితంబులగు బ్రహ్మలోకాదులు గలుగును. తేజోవంతులకు క్షమయ తేజము; తపస్సు చేయువారికి క్షమయ బ్రహ్మము; సత్యవంతులకు క్షమయే సత్యము. క్షమయే యజ్ఞమును శమంబు నగుచున్నది. అట్టి క్షమను నాబోటివాఁ డెటు విడుచును? క్షమయందె వేదములు, సత్యము, యజ్ఞములు, సర్వ లోకములును గూడియున్నవి కావున నట్టి క్షమతో నొక్కఁడును విడువ రాదు. ఎవఁడు క్షమతో నన్నిటి నోర్చునో వాఁడు బ్రహ్మ మగు చున్నాఁడు. క్షమావంతులకే యిహలోకంబును బరలోకంబును రెండును గలవు. క్షమావంతు లిహలోకంబున సన్మానంబును, బరలోకంబున నుత్తమ గతులను బొందుదురు. ఓద్రౌపదీ! ఏమనుష్యులు కోపమును క్షమచే నడఁచిన వారలో, వారుత్తమలోకంబుల నొందుదురు. కనుక క్షమయ యుత్తమ మనఁబడును. ఇట్లని కాశ్యపుఁడు క్షమాప్రభావంబులను బొగడెను ఈ క్షమాప్రభావంబులను నాలకించితివి గదా! ఓయాజ్ఞసేనీ! ఇఁక, నీవు తనివినొందుము. కోపమందకుము. పితామహుండగు భీష్ముఁడు శాంతినె కైకొనును. కృష్ణుఁడును శాంతినే గౌరవించును. ద్రోణాచార్యవిదురు లును శాంతినే యుక్త మందురు. సోమదత్తుఁడు, యుయుత్సుఁడు, అశ్వత్థామ, పితామహుండగు వ్యాసుఁడు శమమే ముఖ్య మందురు. వీరి యాలోచనలు సూడ శమమే రాజ్యంబొసఁగుఁ గాని క్రోధంబు గా దని నే నెంచెద.

భరతవంశీయుల నాశనమునకై గొప్ప చేటుకాలంబు సంప్రాప్తం బయ్యె. ఓభామినీ! ఇప్పుడు మాత్రమే గాక యెల్లప్పుడు నీ విదియ నిశ్చితంబు. సుయోధనుండు తగఁడనిఁ నేనే తగుదు నని క్షమ నన్నే వరించినది. కాన నేను క్షమ వహించితిని. క్షమాదయాళుతలు రెండును సజ్జనుని గుణంబులు. ఇవియె శాశ్వత ధర్మంబులు. కావున నీక్షమా దయాళుతలను నేను తప్పక పూనితి నని ధర్మజుండు ద్రౌపదికిఁ జెప్పఁగా నామె వెండియు నతనికి ని ట్లనియె.

ఓయుధిష్ఠిరా, నీ కిట్టి మోహము గలిగించిన యీశ్వరునకును బూర్వకర్మమునకును వందనములు. పితృపితామహులవలనఁ బ్రాప్తంబై, నీచే వహింపఁదగిన రాజ్యంబున నీ కిట్టి యన్యథాబుద్ధి గలిగినది. ఈ లోకంబునఁ బురుషుఁ డెన్నఁడును ధర్మదయాశాంతులచేఁ గలిమి

నొందఁడు. ఋజుభావముచేతను నొందఁడు. కారుణ్యముచేతను నొందఁడు. ఓభారతా! ఓర్వరాని యిట్టి కష్టము నీకు రానున్నది. అది నీకు రాఁదగదు. ఈపరాక్రమశాలురగు నీతోఁబుట్టువులును నిట్టి దుఃఖంబునకుఁ దగరు. వారింతకుము న్నిట్టిదుఃఖమును బొంద లేదు. ఇఁక నిపుడును బొందరు. ఓమహారాజా ! నీకుఁ బ్రాణమునకంటెను, ధర్మమునకంటెను మించినది యించుకంతయు వేఱొక్కటి లేదు. అట్టి దేది యున్నను, నది ధర్మంబునకే. నీప్రాణంబును, నీరాజ్యమును ధర్మమునకే యని బ్రాహ్మణులు, గురువులును, దేవతలును నెఱుంగుదురు. ఒకతరుణమున భీమార్జునులను, నకులసహదేవులను, నన్నును వీడుదువుగాని ధర్మంబును వీడ వని నే నెంచెదను. ధర్మమును సంరక్షించు రాజును నతనిచే సంరక్షితమైన ధర్మము గాపాడు నని పెద్దలు చెప్పఁగా విని యుందును. అట్టి ధర్మము నిన్ను మాత్రము గాపాడదు. తననీడ పురుషుని వెంబడించుచందంబున నీబుద్ధి తక్కినయన్నింటిని బాసి ధర్మమునే వెంబడించెడిఁగా. నీవు నీసాటివారిని, దక్కువవారిని నలుసుసేయవు. ఇఁకఁ బెద్దల నవమానింతువే? ఓపార్థా ! సకలభూమండలాధిపత్యంబుఁ బడసియు నీవు గర్వపడవైతివి. నీవు పితరులను దర్పణాదులచేతను, దేవతలను జన్నములచేతను, నతిథులను సత్కారములచేతలు నిరంతరము పూజింతువు. ద్విజులను సకలమనోరథములచే నర్చింతువు. తొల్లి నేను బరిచర్యలు చేయుచుండ, గృహస్థులను వానప్రస్థసన్న్యాసులను బంగరుపళ్లెరంబులందు మృష్టాన్నంబుల నిడి యర్చించితివి. ఇప్పు డరణ్యవాసులగు తాపసులను వన్యములగు కందమూలఫలంబులచే లోహపాత్రములందు భోజనంబు లిడవలసెను. నీకు బ్రాహ్మణుల కొసఁగక దాఁపఁ దగినది యొండు లేదు. సాయంప్రాతఃకాలంబులందు వైశ్వదేవానంతరంబున నతిథిభృత్యులకు భోజనంబు లిడి తచ్ఛేషంబు గుడుతువు.

ఓమహాత్మా ! నీవు రాజ్యభారము వహించియుండ ననేకములైన యిష్టులును, బశుబంధములును నింకను బెక్కులు కామ్యనైమిత్తికములగు కర్మములును నెల్ల నొనరించితివి. ఇప్పుడును బాకయజ్ఞములను, నిత్యయజ్ఞములను దప్పక యొనర్చుచున్నాఁడవు. రాష్ట్రంబు గోలుపోయి, చోరకంటకబహుళంబై యుండు నీనిర్జనమహారణ్యమున నుండియు నీవు

ధర్మమును దప్పక జరుపుచున్నాఁడవే కాని, యది కొఱఁతపడదు. మహారాజా! అశ్వమేధము, రాజసూయము, పౌండరీకము, గోసవము, నింకను ననేకములగు యజ్ఞములు బహుళదక్షిణలతోడఁ జేసితివి. కౌంతేయా! ఇంతధర్మిష్ఠుండవయ్యుఁ జెడ్డదైన దుర్ద్యూతమున నోటుపడుచున్నను విపరీతబుద్ధిచే బంధుమిత్రులను, మమ్మును, సకలధనములను నోడితివి. సన్మార్గప్రవర్తకుఁడవు, మృదుస్వభావుండవు, వదాన్యుఁడవు, బుద్ధిమంతుఁడవు, సత్యవాదివినైన నీకీ దుర్ద్యూతంబున నెట్లు బుద్ధి గలిగెనని? ప్రాజ్ఞా! నీకుఁ గలిగినకడుదుస్సహంబయిన దుర్ద్యూతవ్యసనంబును దలంచిన నేను గడు మోహము నొందెదను. మనంబున నోర్వరాని సంతాపము గలిగెడి. ఈవిషయంబునఁ బెద్దలు చెప్పిన పురాతనేతిహాసం బొక్కటి గలదు. దాని నెఱిఁగింతు నాలకింపుము. లోక మెల్లనీశ్వరాధీనత నున్నదే కాని, స్వవశంబున నుండ లేదు. అయ్యీశ్వరుఁడు జంతువుల పురాతనకర్మముల నుబట్టి వానికి సుఖదుఃఖములను, నిష్టానిష్టములను నింక నన్నిటిని నొసంగుచుండును. ఒక్కయైంద్రజాలికుఁడు బొమ్మలను జేతఁబట్టుకొని, వానికరణచరణాద్యంగముల నెట్టు లాడించునో, యట్లే యీశ్వరుఁ డీభూతముల నాడించుచుండును. మఱియు నీశ్వరుఁ డాకసంబుమాడ్కి సర్వాంతర్యామియై యాజీవులకు స్వకర్మానుబంధముగాఁ బుణ్యపాపంబుల నొసఁగుచుండును. పంజరమున నుంపఁబడిన చిలుక మొదలగు పక్షులు స్వతంత్రములుగాక యెత్తికొనిపోయినచోటికెల్లఁబోయినట్టు లీజీవుఁ డీశ్వరుఁడు పొమ్మన్నచోటికెల్లఁబోవుచుఁ దనకుఁగాని యొరులకుఁగాని ప్రభువుగాక యస్వతంత్రుండయి ప్రవర్తించుచు, దారంబునందు గ్రుచ్చఁబడిన మణిమాడ్కియు, ముక్కునఁ ద్రాడువేసిన యెద్దువలెను నీశ్వరుని యానతి ననుసరించును. లోకంబున భృత్యుఁడు యజమానునియుత్తరువుచొప్పున నడచును గాదా. నదీవేగంబునకుఁ గొట్టుకవచ్చిన యొక మహావృక్షమ్ము నదీప్రవాహము నొంది యెట్లు వేగము ననుసరించునో యట్లే యాత్మాధీనుఁడు కాని మనుష్యుఁడు కాలమును నిరీక్షించిపోవుచుండును. బుద్ధిహీనుఁ డయిన మనుజుఁడు తన సుఖదుఃఖములకుఁ దాన కర్త కాక యీశ్వరుని యాజ్ఞానుసారము సుఖమో, లేక దుఃఖమో పొందుచుండును. వడిగా వీచుగాలికి లోఁబడిన గడ్డిపోచలవలె నీభూతము లీశ్వరాధీ

-నంబు లై యాతనిమార్గము ననుసరించుచున్నవి. ఈశ్వరుఁ డన్ననో ప్రాణిజాతమును గర్మానుబంధమున సత్కర్మమునో, యసత్కర్మమునో చేయించుచుఁ దాను దేనితోను జేరక, సాక్షిమాత్రుఁ డై యన్నిటిని బరికించుచున్నాఁడు. పురుషునిచేఁ బుణ్యపాపకర్మములను జరిపించుటకు నీశ్వరునకు క్షేత్ర మనెడి శరీరము కేవలనిమిత్తమయియున్నది. ఓమహారాజా! చూడు మీ యీశ్వరునిమాయాప్రభావము! ఈశ్వరుఁ డీమాయాప్రభావంబున సకలభూతములను మోహింపఁజేసి యొకభూతము నితరభూతముచేఁ జంపించుచుండును. మాయాప్రభావము దురూహ్యము. తపస్సంపన్నులగు మహర్షులు కూడ దీని నెఱుఁగఁజాలరు అట్టి తత్త్వవేత్తలగు మహర్షు లొకవిధంబున జరుగు నని తలఁచినవి కూడ మాయాప్రభావంబున నదీవేగములమాడ్కి వేఱువిధముగాఁ బర్యవసానమొందును. పురుషుఁ డెట్టెట్టులు కార్యములను సమకూర్ప నెంచునో యీశ్వరుఁడు తనమాయచే నాయాయికార్యములను నట్లు జరుగనీయక వేఱువిధముగా జరుపును. కొన్నివేళలందు నాకార్యములను జరుగనీయక పోవును. ఓయుధిష్ఠిరా ! మానవుఁడు చేష్టలు దక్కినది, చేతనారహితంబునైన కాష్ఠమును గాష్ఠముతోను, ఱాతిని ఱాతితోను, ఇనుమును నినుముతోను భంజించుతెఱంగున నీశ్వరుఁడును నేదేని నెపంబును గల్పించి, భూతంబులను భూతంబులచేఁ బోరిపుచ్చును. స్వేచ్ఛాప్రకారము ప్రవర్తించువాఁడయిన యీశ్వరుఁడు భూతములకుసంయోగవియోగంబులఁ గల్పించి, బాలుఁడు బొమ్మలతో నాడుకొనుచందంబున భూతంబులతో నాడుకొనుచున్నవాఁడు. నృపాలా! ఈశ్వరుఁడు తల్లిదండ్రులమాడ్కి భూతంబులయెడ దయతోఁ బ్రవర్తింపఁడు. మఱి సామాన్యజనునిమాడ్కి రోషంబుతో నున్నట్టులే ప్రవర్తించుచున్నాఁడు. లోకంబున సదాచారసంపన్నులగు సజ్జనులు జీవికి లేక, లజ్జాభరితులై యుండుటను దుర్జనులు సుఖులై యుండుటను గాంచి కడు జాలిఁ గొనియిట్టు లెంచెదను. ఓపార్థా! ధర్మతత్పరుఁడవయిన నీవిట్టు లిడుమలఁ గుడుచుటను, నధార్మికుఁడైన దుర్యోధనుఁడు ధనధాన్యాదిసమృద్ధిగలిగి సుఖియై యుండుటను గాంచి, యీశ్వరుఁడు పక్షపాతి యని తలఁచెద. సజ్జనులను దిరస్కరించి, శాస్త్రమర్యాదలను మీఱి, క్రూరుఁడై, లోభముచే

ధర్మమును దప్పి యధర్మముల నాచరించి గొప్ప మిాఱి యున్న దుర్యోధనునకుఁ గలిమి యొసఁగి యాయీశ్వరుఁ డేమిఫలం బనుభవించఁగలఁడు. చేసినకర్మము కర్తను బొందుఁగాని, యొరునిఁ బొందదు. అట్లు కాక యది వేఱువిధంబుగ జరుగునేని యాపాప మీశ్వరునే పొందును గాని, వేఱెవ్వనిఁ బొందదు. చేసినకర్మఫల మగు పాపము కర్తను బొందదేని, దీనికిఁ గారణము బలముగాని వేఱుగాదు. ఇట్లు బలహీనులైన జనులఁ గూర్చి వగచెద." అని యిత్తెఱంగున ద్రౌపది ధర్మనందనునితోఁ జెప్పఁగా నతఁ డాద్రౌపదికి వెండియు నిట్లనియె.

### యుధిష్ఠిరుండు ద్రౌపదికి ధర్మము సఫల మని చెప్పుట

ఓ యాజ్ఞసేనీ! నీవు మృదుమధురపదంబులతోఁ జిన్నగఁ బలికిన పలుకులు మేము వింటిమి. వేదవిరుద్ధమైన నాస్తిక వాదములఁ జేయుచున్నావు. రాజపుత్త్రీ! ఫలాపేక్షతో నేను గర్మములను జేయను. మానవునకు దానము చేయఁదగినది యనియు, యజ్ఞము లవశ్యానుష్ఠేయము లనియుఁ జేయుచున్నానే కాని వేఱువిధమునఁ గాదు. ఫలము కలుగనీ, కలుగక పోనీ; ఫలాపేక్షారహితుఁడై గృహస్థుఁడు కర్మములను జేయవలయును. కావున శక్తికొలఁదిని దానయజ్ఞములను జేయుదును. సుశ్రోణీ! వేదములందువిశ్వాసబుద్ధితోను సజ్జనులయాచారములను బరికించి ఫలాపేక్ష లేకయే ధర్మములను జేయుచున్నాను. స్వభావముననే నాకు ధర్మాచరణమునందు బుద్ధి గలదు. ధర్మవ్యాపారము చేయువాఁడు ధర్మాత్ములలో నధముఁడుగను, హీనుఁడుగను నెన్నఁబడును. ఎవఁడు ధర్మము నొనర్చి, దానినుండి ఫలమును బిదుకఁగోరునో, యేపాపాత్ముఁడు ధర్మము నొనర్చి నాస్తిక్యబుద్ధివలన దీనికిఫల మున్నదో, లేదో యని తలఁచునో, వాఁడును ధర్మమువలని ఫలము నొందనేరఁడు. ధర్మవిషయమున సంశయపడు మూఢుఁడు పశ్వాదితిర్యగ్యోనులందు జన్మించు. శూద్రుఁడు వేదములనుండి తొలఁగినచందమున జరామరణంబులు లేని బ్రహ్మమునం దైక్యము నొందలేక దానికి దూరుఁడగుచున్నాఁడు. ఓబుద్ధిమంతురాలా! వేదాధ్యాయియు, ధర్మపరుఁడును, సత్కులమునఁ బుట్టినవాఁడును వీరు ముగ్గురును జ్ఞానవృద్ధు లని ధర్మవిదు లగు

రాజులు పలికిరి. ఏమూఢబుద్ధిగలవాఁడు శాస్త్రములను మీఱి, ధర్మ మునుగూర్చి సందియపడునో, వాఁడు శూద్రతస్కరులకంటె గడుఁ బాపాత్ముఁడు మార్కండేయ మునీంద్రుఁడు గొప్పతపం బొనర్చి చిరంజీవి త్వమును బొందె ననుట నీవు ప్రత్యక్షముగా నెఱుఁగుదువు గదా! మఱియు వ్యాస,వసిష్ఠ,మైత్రేయ, నారద,లోమశ,శుకమహర్షులును నింక జ్ఞానులగు ననేకమహర్షులును దివ్యజ్ఞానసమన్వితులై, శాపానుగ్రహ సమర్థులై యుండుటను దేవతలకంటె హెచ్చుగ మెలఁగుచున్నారుగదా. వీరిమహిమను గొంత పరికింపుము. వేదములందుఁ బ్రమాణబుద్ధిగల దేవ సమానులగు నీమహర్షులందఱు ధర్మమునే ముఖ్యకర్తవ్యముగాఁ జెప్పుచుం దురు. ఓకల్యాణీ! నీవును నప్పరమేశ్వరుని, ధర్మమును నహంకారపూరిత మగుమనంబుతోఁ దిరస్కరించుటగాని,తద్విషయమున సందియపడుటగాని తగదు. ధర్మవినిశ్చయము నందినమహాత్ములను మూఢుఁ డేమియు నెఱుఁ గని వెఱ్ఱివాండ్రనుగ నెంచును. ధర్మమును నమ్మనివాఁడు వేఱొక్కదానిఁ బ్రమాణముగఁ గొనఁడు. తానే ప్రమాణ మని యెంచి గర్వితుఁడై మేలొందక చెడును. ఏది యింద్రియములకుఁ దనివి గలిగించి,యింద్రియ గోచరమైనదో దానినిమాత్రమే మూఢుఁడు నమ్మునుగాని తక్కినవాని యందుఁ బ్రమాణబుద్ధి నుంపఁడు. ఎవఁడు ధర్మమునఁ బ్రమాణబుద్ధి నుంపఁడో వానికిఁ బ్రాయశ్చిత్తము లేదు. ఆనీచుఁ డగుపాపుఁ డుత్తమ లోకంబులను బొందఁడు. వేదాదిప్రమాణములను నమ్మనివాఁడై, వేద శాస్త్రాదుల యర్థములను నమ్మక, కామలోభములకుఁ బరవశుఁడైన మూఢుఁడు తప్పక నరకము నొందును. ఏమానవుఁడు సతతము వేదాది ప్రమాణములందు నసత్యబుద్ధినూని బుద్ధిరహితుఁడై ధర్మమును బాలింపక, శాస్త్రముల నెల్ల మీఱినవాఁడో, వాఁడు పెక్కుజన్మములెత్తి నను మోక్షసుఖంబు నొందఁడు. ఓభామినీ! ఎవఁడు ఋషులవాక్య ములు ప్రమాణముగ నమ్మఁడో, యెవఁడు పెద్దలయాచారములను బట్టు కొనఁడో,వాని కిహపరంబులు రెండును లేవు. ఇయ్యది సిక్కంబు.సర్వతం త్రజ్ఞులైనసర్వజ్ఞులగు ఋషులు చెప్పినవి శిష్టు లాచరించినవి యగు ధర్మం బులందు సంశయంబు పడవలదు. నరకముదాఁటి స్వర్గముఁ జెందఁగోరు వారలకు ధర్మమే తేఁపయై యున్నది. దేశాంతరంబున కేగువర్తకునికిం

బోలె స్వర్గగాములకు సాధర్మ్యమే సోపాన. ఓ యనిందితురాలా! ధర్మజ్ఞు
లగు ధర్మాత్ము లాచరించిన ధర్మమే నిష్ఫలమైనచో, సనాతనమైన కాఱు
చీఁకటిగం దీలోకం బెల్ల మునిఁగిపోవును. ధర్మమును నమ్మినివారు
మోక్షసుఖంబును నొందరు. నికృష్ట మగు పశుజీవిక నాదరువుగాఁ గొం
దురు. వారి కార్యముల కాటంకములు గలుగుచుండును. వారిహామున
నొక్క పురుషార్థంబు నేనియు నొందరు. తపోయజ్ఞ స్వాధ్యాయ
ములును, దానార్జవాదులును నిష్ఫలంబు లగుట నిక్కంబగు నేని ముం
దటివారును వారి వెనుకటివారును ధర్మంబు నాచరింపకయే యుండరు.
ఇది కేవలము బూటకమే యయినపక్షమున వారొనర్చిన కార్యము లెల్ల
నిష్ఫలంబు లేయగును. దేవర్షిగంధర్వాసురహస్సులు దాము సర్వకామ
సమృద్ధులయ్యు నెవరికై ధర్మము నాచరించుచుందురు? జేయుదురు?
శ్రేయస్సునం దున్నవానికి భగవంతుండు పుణ్యఫలంబుల నొసం
గును గావున వా రెల్లరు లోకహితార్థము ధర్మము నాచరించిరి.
ధర్మము సనాతనమైనది కనుక ధర్మము నిష్ఫలమగునా. ధర్మమెప్ప
టికి నిష్ఫలంబు గాదు. ఓపాంచాలి! సకలధర్మంబులును, సకలతపం
బులయు ఫలంబులు నీయందె కనఁబడుచున్నవి. నీజన్మమే ధర్మ మున్న
దనుటకు నిదర్శనము. ప్రతాపవంతుండగు నీతోఁబుట్టు వైనధృష్ట
ద్యుమ్నుఁ డెట్లుపుట్టెనో యిది యొల్ల ధర్మసత్త్వంబునకు నిదర్శనంబు
గాదా? జ్ఞాని యగువాఁ డించుకంతఫలము గలిగినను గర్మములకు
ఫల మున్న దని సంతసించును. జ్ఞానహీనులు బహు
ఫలంబు గలిగినను ధర్మమునం దాస్థ గలుగదు. బహుదుఃఖమునకఁ బర
లోకమునఁ బుణ్యకర్మము గాని సుఖంబు గాని నిలుగదు. ఓభామినీ!
పుణ్యకర్మములకేని, పాపకర్మములకేని ఫలము గలుగుటయును నుత్పత్తియు
లయంబును దేవరహస్యంబులు. ఈ దేవరహస్యములను నొక్కఁడు
నెఱుఁగఁడు ఈరహస్యములను దెలియుటకు మానవులకు శక్తి చాలదు.
దేవతల కివి గోప్యములు. వారు మాయారహస్యములను వెలి
పుచ్చరు. జితేంద్రియులై, వ్రతంబుల నాచరించి, తపోబలంబునఁ బాపం
బులఁ దొలఁగించుకొన్న నిర్మలమానసంబు గల ద్విజులు మాత్రమే
యీ దేవరహస్యముల నెఱుఁగఁగలరు. ఫలము గలుగనంతమాత్రమున

కర్మము లేదనియు, దేవతలు లేరనియు శంకపడవలదు. అసూయమాని, కర్మఫలాపేక్ష లేక యాగంబులొనర్ప వలయును. దానంబు లొసంగవలయును. కర్మములకు నిహపరలోకంబుల ఫలంబు గలదు. అట్టిదే యీ ధర్మశాసనంబు. తొల్లి కశ్యపబ్రహ్మ తనపుత్రుల కుపదేశించినయుపదేశ మిదియే. ఓకృష్ణా! కనుక నీమనంబున నుండు సందియము మంచువలెఁ దొలఁగిపోవునుగాక. నీవు సర్వమును నున్న దని పరికించి నాస్తికభావంబును వీడుము. భూతంబులకెల్ల నీశుఁడయిన భగవంతునిఁ, గర్మమును దూఱకుము. ఈశ్వరునకు మ్రొక్కుము. కర్మమునకు మ్రొక్కుము. ఇఁక నీ కిట్టి చెడుబుద్ధి గలుగకుండును గాక. ఓకృష్ణా, ఏకర్మముల యనుగ్రహమునం జేసి భక్తుఁడయిన మర్త్యుఁ డమర్త్యత్వము నొందునో, యట్టియుత్తమదేవతను నెట్టకేని దూఱకుము. అని యిత్తెఱఁగున యుధిష్ఠిరుఁడు ద్రౌపదికి నీశ్వరునియొక్కయుఁ, బూర్వకర్మముయొక్కయుఁ బ్రభావంబు నెఱిఁగించెను.

### ద్రౌపది యుధిష్ఠిరునకు బ్రాహ్మణులు చెప్పినబృహస్పతినీతి నెఱిఁగించుట

అప్పలుకులు విని ద్రౌపది యుధిష్ఠిరున కిట్లనియె. ఓపార్థా! ఎట్టకేని ధర్మముఁ దిరస్కరింపను. దానిని నిందింపను. ఓభారతా! నేనార్తురాలనై యింత పలవించితినిగాని, వేఱు కారణమునం గాదని యెఱుఁగుము. ఇంకను గొంత పలవించెదను. నీవు మంచిమనంబుతో నాలకింపుము. ఓయమిత్రసూదనా! జన్మించినజంతువులు కర్మముచేసి తీరవలయును. కర్మము లొనర్పక స్థావరంబులు జీవించుచున్నవి. ఓయుధిష్ఠిరా! జంగమంబులన్నో తల్లిపాలు గుడుచుచు నుయ్యెలలోఁ బరుండియుండునంతవఱకు కర్మము చేయకున్నను, నావల కర్మమువలననే జీవిక నొందుచున్నవి. అట్టి జంగమములందును మానవులు కర్మచేతనే యిహపరములందు వృత్తి నొందఁ గోరుచున్నారు. నీటియందలి కొంగ ప్రయత్నముచేతనే నీటిలో నుండు మీలను గ్రహించుచందమున జంతువులు తమ ప్రయత్నములను జేయుచుఁ దత్ఫలంబులను బొందుచున్నవి. కర్మమొనర్పనివానికి నొకవృత్తియు జరుగదు. ఓకౌంతేయా! నీవును స్వకర్మమును వీడకుము. కర్మ మనుకవచమును దొడుగుము. ఎవఁడు చేయవలసిన స్వకర్మము నెఱుఁగునో యట్టివాఁడు నూటికో వేయింటికో యొక్కఁ డుండును. అట్టి ప్రయత్నపరునికి

యోగక్షేమములు రెండును జరుగును. హిమవంతమైన నూరక కూర్చుండి భక్షింపఁబడుచున్నచోఁ గరఁగిపోవును. జనులు కర్మము చేయ రేని, నశింతురు. కర్మములకు ఫలము గలుగుటఁ జూచి కార్యములం బ్రవర్తిం చెడిజనులను జూచుచున్నాము. జనులు కర్మములను జేయక వేఱువిధంబున నెప్పటికిని జీవిక నొందరు. లోకంబున దైవపరుఁడును, హఠవాదియు నీ రిరువురు మూర్ఖులనఁబడుదురు. ఎవఁడు కర్మము లొనర్చుటయందు దలంపు గలవాఁడో, వాఁడు త్తముఁ డనఁబడును. ఎవఁడు దైవము తన కంతయు నొసఁగు నని నిష్ప్రియత్నుఁడై హాయిగ నిద్రించుచు నూరకుండునో, యట్టిబుద్ధిహీనుని బుద్ధి నీట వేసినపచ్చికుండవలె దినదినమున నశించిపోవును. ఎవఁడు కర్మమునందు శక్తుఁడయ్యుఁ గర్మము చేయక యుండు, నట్టివాని హఠబుద్ధి దిక్కులేనియనాథునివలె నశించు. ఎవనికి నేది యేని యొకపని తనప్రయత్నము లేకయే యకస్మాత్తుగా సిద్ధించెనేని, యతఁడు దానిని తనబలముచే సిద్ధించె నని యనుకొనును. కాని యది యొక్కని ప్రయత్నముచేతను గాదు. దైవమునే నమ్మి దైవసంకల్పముచే నంతయు నెఱవేఱు నని నమ్మియుండుట దైవదిష్ట మని యందురు. ఎదియేని యొకకార్యమును బ్రయత్నముచేసి, యాకార్యఫలమును దనకంటితోఁ జూచెనేని యది పౌరుషలబ్ధ మనఁబడును. ఓ పురుషశ్రేష్ఠా! ప్రయత్నముచేఁ గాక, దైవాధీనతను గాక స్వాభావికముగా నొకకార్యమొకనికి సిద్ధించె నేని యది స్వాభావిక మనంబడును. ఇట్లు హఠమునఁ గాని దైవమునఁగాని, స్వభావమునఁగాని కర్మమునకు ఫలముల నేమానవుం డొందునో, యట్లు పొందుట జన్మాంతరకర్మములఫలము గాని వేఱు గాదు. ఈశ్వరుఁడును జంతువుల యర్థ్యైకర్మములంబట్టియే జన్మాంతరములను గలిగించి యాయాజన్మములకుఁ దగినఫలములను నొసఁగును. మానవుఁ డిహలోకంబున శుభాశుభములలో నేదేది పొందునో, య య్యది యీశ్వరుండు వానివాని జన్మాంతరమునకుఁదగినట్లు గలిగించిన పూర్వపుణ్యపాపముల ఫల మని యెఱుఁగుము. ఈశ్వరుండు జీవునికి జన్మాంతరకర్మానుసారముగ ఫలంబు లొసఁగుటకు నీదేహ మాధారమై యున్నది. ఈశ్వరుఁడు జీవుని నెట్లెట్ల పురికొల్పునో యట్ల ట్లీ యస్వతంత్రుం డయిన జీవుఁడు నడచుచుండును. ఓ కౌంతేయా! మహేశ్వరుఁడు

స్వతంత్రములు కాని సకలభూతంబులను నయ్యయ్యి కార్యములందు వినియోగించి, బలవంతముగా నయ్యయి కార్యములను జేయించు చుండును. బుద్ధిపూర్వకంబుగ మనంబునఁ గార్యములను నిశ్చయించి యావల నాయాకార్యములను జేయుచుఁ బురుషుఁడు వాని ఫలములను బొందును. ఓపురుషశ్రేష్ఠా! పురుషుఁ డిట్లెన్న నలవికాని కార్యములను నొనర్చును. గృహనగరము లేర్పడుటకును బురుషుఁడు కారణము. నూగులందు నూనెయు, గోవులందుఁ బాలును, గాష్ఠ మందు నిప్పు నున్నను, వానిని బడయుటకుఁ బురుషుఁ డుపాయమును యోజించి యావల నట్లు ప్రయత్నము లొనరింపవలయును, అట్టిప్రయ త్నములచేఁ బురుషులకుఁ గార్యములు సిద్ధించును. ఇట్లె జంతువు లెల్లఁ దమకార్యములఫలమును బొందును. సమర్థుఁడైనవానిచేఁ జేయఁబడిన కార్యము చక్కఁగాఁ జేయఁబడిన దందురు. ఈపురుషుఁడు కర్మలచే సాధింపవలసినపనులందుఁ దాను గారణంబు గాఁడేని, యాగాదులకు ఫల ములు సిద్ధింపకపోవలసి వచ్చునుగదా! శిష్యుఁడు గురువు గాఁజాలఁడు గదా! పురుషుఁడు కర్మలయందుఁ బ్రయత్నముచేతనే ప్రసిద్ధి కెక్కును. కార్యనాశంబందు నతఁడు దూషింపంబడఁడు. అట్లు పురుషుఁడు కార్య సిద్ధికి గారణంబు గాదేని, వీనివలనఁ గార్యముచెడిన దని యేల యాతని, నిందింతురు? కార్యము లన్నియు యోగముచే సిద్ధించు నని కొంద అందురు. దైవముచేత నని మఱికొంద అందురు. ప్రయత్నముచేతనే యని వేఱుకొందఱు పలుకుదురు. దైవమే ముఖ్యమని కొంద,అందురు. పురుషప్రయత్నమే ముఖ్య మని మఱికొందఅందురు. స్వభావముచేతనే కార్యము సిద్ధించెడి నని వేఱుకొంద అనెదరు. కొంతఫలము ప్రయత్న ముచేతను కొంత ఫలము దైవముచేతను వేఱుకొంతఫలము స్వభావము చేతను పురుషుఁడు పొందును గాని దీనికంటె నాలుగవకారణము వేఱొక్కటి లేదు తత్త్వవేత్త లగు పండితులయిన జనులు చెప్పినతెఱఁ గున నీశ్వరుఁడు భూతములకుఁ గర్మానుసారముగ నిష్టానిష్టఫలప్రదుఁ డగును. దయాళుఁడగు భగవంతుఁడు భూతములకుమీఁదుగ నొక్కఁడును లేఁడేని, పురాకృతమనునది యొక్కటిలేదేని మానవుఁ డొనర్చునాయా కార్యము సఫలముగాకతప్పదు. ఏమానవులు పైనిదెలిపిన ముత్తెఱఁగుల

యర్థసిద్ధి నందఁగోరుదురో, యట్టుల నర్థఫలము నందఁగోరరు. వారియిష్టమ్ము
చొప్పున వలసినవానిని బొందుదురు. అక్కఱలేనివి విడుతురు. అట్లు కాదు
కావున నరుఁడు కర్మము చేసియే తీరవలయునని మనువునిశ్చయము. ఈ
యీశ్వరుఁడు పూర్తిగాఁ బ్రయత్నహీనులమైయుండు మనయందు దయ
లేక యున్నాఁడు. యుధిష్ఠిరా, ప్రయత్నపరుం డయినవానికి నిహమునఁ
గార్యసిద్ధి గాక తప్పదు. సోమరిపోతగువాఁడు నియతమైన కార్యసిద్ధినిఁ
బొందనే పొందఁడు. ప్రయత్నము చేయమిచేఁ గార్యము గాలేదనియుఁ
గార్యము చేయఁగడఁగవలయుననియు, గార్యముసిద్ధింపమికి హేతువును
బ్రాయశ్చిత్తమును దెలియుచునేయున్నవి. జనుఁడు ప్రయత్నము
చేసినచో, వీనిపై నేరము లేకపోవును. పరుండినిద్రించుచున్న సోమరి
పోతులను బెద్దమ్మ వరించును. నేర్పరియైనవాఁడు ప్రయత్నము నొనర్చి
సందియము లేక ఫలమును బొంది యైశ్వర్యవంతుఁ డగును. సంశ
యావస్థనుబొందినవారు తలఁచినకార్యమగునో కాదో యని సంశయిం
పుచుఁ దుదకు ననర్థమునే పొందుదురు. ధీరు లగువా రెల్లపుడు కర్మ
నిరతులగుదురు. గాని, సంశయావస్థ పొందనేపొందరు. ఇప్పుడు మనము
దైవమునే నమ్మి యప్రయత్నులమై యున్నాము. నీవు కర్మపరుఁడవై
యుండుదు వేని, యిట్టియనర్థము నీకు సంప్రాప్తించి యుండదు. అట్లొ
క్కవేళఁ గార్యసిద్ధి కలుగకున్నను నది నీకుఁగాని భీమార్జునులకుఁగాని,
నకులసహదేవులకుఁగాని యపకీర్తి కలిగింపదు. ఇతరులకుఁ గార్యసిద్ధి
కలుగనీ, మనకుఁ గార్యసిద్ధి గలుగనీ, ప్రయత్నపరుఁ డపుడు కాకున్నను
కొన్ని దినములకైనను గార్యమగు నని యెఱుఁగును. కాఁపువాఁడు
పొలమును నాఁగలితోఁ జక్కఁగా దున్ని విత్తనము విత్తి యూరకు
న్నాఁడు. ఆవరిచేను పండుటకు వర్షమే కారణము. వర్షము కురిసెనా,
యాచేను చక్కఁగఁ బండును. వర్షము కురియమి నాచేను పండక పోయి
నను, నా కాపువానిపై నేరము లేదు. లోకంబున నితరులు చేయునట్లే
నేనును ప్రయత్నము చేసితిని. అట్లు నేను చేసియు, నాకుఫలంబు గలుగ
దేని, నాయందు నేర మేమియు లే దని బుద్ధిమంతుఁడు తలఁచి యా
కార్యము ఫలింపమికై తన్నుఁ దా నిందించుకొనఁడు. ప్రయత్నపరునికిఁ
గార్యము సిద్ధింపకున్నను, వాఁడందులకై విచారపడ నక్కఱలేదు. కార్య

మునకునగుటయుఁ, గాకుండుటయు నను రెండుగతులు గలుగును. కాని కార్యప్రవృత్తియే లేనివానికి నీరెండును లేవు. దైవానుకూల్యము, ప్రయత్నము, దేశకాలములు ఇవియన్నియు సమకూడినప్పుడు కార్యసిద్ధి యగును. గుణములు లేనప్పుడు కార్యమునకు ఫలము స్వల్పముగనైనఁ గలుగును. లేదా, కార్యము నిష్ఫలముగనైన నగును. ప్రయత్నమే లేకయుండునపుడు ఫలమును లేదు. దైవానుకూల్యాదిగుణములు లేవు. బుద్ధిమంతుఁడు కార్యసిద్ధికై దేశకాలములను, నుపాయములను, పూర్వపుణ్యమును తనబలమునకుఁ దగినట్లును, సహాయసంపదకుఁ దగినట్లును బరికించి బుద్ధితో యోజించును. ఉపాయముచేఁ గార్యము సిద్ధింపవలసినను దాని నుపదేశించునది పరాక్రమమే కార్యచింతనములందు ముఖ్యముగా నంతయుఁ బరాక్రమమే. పరాక్రమము లేనిది యొక కార్యము నెఱవేరదు. ధీమంతుఁడు పెక్కుగుణములలోను మేలయినదగు పరాక్రమమును నేకార్యమునందుఁ బ్రయోగించునో వానికాకార్యము సామోపాయముచేతనే సిద్ధించును. అప్పుడు దైవమును వీని కనుగూలమగును. ఓయుధిష్ఠిరా, సముద్రముగాని, పర్వతముగాని చింతను, నాశమును కోరరాదు. సముద్రపర్వతములస్థితియే యిట్టు లుండ సామాన్యుఁడగు మనుష్యుఁడు విచారనాశంబులు గోరవచ్చునా? మానవుఁడు సర్వదా ప్రయత్నపరుఁడై శత్రురంధ్రాన్వేషణపరుఁడై యుండవలయును. అట్లుండెనేని, పురుషుఁడు తనవిషయమునను, శత్రువువిషయమునను ఋణములేనివాఁ డగును. పురుషుఁ డెల్లప్పుడు 'తన దేమియు లేదు. అంతయు నీశ్వరాధీనము అతనియాజ్ఞ లేనిదియు నేమియు జరుగదు' అని తనుఁ దగ్గుపఱచికొని యూరకుండరాదు. అట్లు దన్నుఁ దాఁ దగ్గించికొని దైవమునే నమ్మియుండువానికి సంపద యెన్నఁడును గలుగదు. ఓభరతవంశోత్పన్నుఁడా! లోకమునఁ గార్యసిద్ధి యిట్టియేర్పాటు గలదై యున్నది. కార్యసిద్ధి కాలనియమముల ననుసరించి పరిపరివిధంబులుగ నున్నట్లు పెద్దలచేఁ జెప్పఁబడినది తొల్లి మాతండ్రియొకప్పు డొకవిద్వాంసునిఁ దనకడ నుంచికొని రాజనీతులఁ జెప్పు మనఁగా, నతఁడు మాతండ్రికి నీరాజనీతినిఁగూర్చి సవిస్తరంబుగాఁ దెలిపెను. బృహస్పతిప్రోక్తమైననీతి నంతయు మాతోఁబుట్టువులకుఁ జెప్పించెను. అప్పుడు నేనును మాతండ్రి

తోడఁ బ్రైఁ గూర్చుండి యీ నీతిశాస్త్ర విషయమును విని యుంటిని గాన నీకుఁ దెలిపితి నని చెప్పెను.

భీముఁడు ధర్మరాజుతో యుద్ధముచే రాజ్యముఁ గైకొనవలయు ననుట

వైరిదుర్నిరపరాక్రముఁ డగుభీముఁడయ్యాజ్ఞసేనిపలుకులు విని వేఁడినిట్టూర్పులు నిగిడించుచుఁ గోపమున యుధిష్ఠిరు నిట్లనియె. నృపాలా! ధర్మము దప్పనిదియు, సత్పురుషులకుఁ దగినదియు, నైన సన్మార్గమును ననుసరింపుము మనము ధర్మార్థకామహీనులమై యిటఁ దపోవనంబున నుండ నేల? దుర్యోధనుఁడు మన రాజ్యమును నీతిచేఁగాని ఋజుమార్గముచేఁగాని పరాక్రమముచేఁగాని కైకొనలేదు. మఱి మోసపుజూదమును బూని మనరాజ్యము నపహరించెను బలహీనమగు నక్క బలవంతములగు సింహము లనుభవింపఁదగిన యామిషమును గైకొనుచందమున నీదురాత్ముఁ డగు దుర్యోధనుఁడు మనరాజ్య మపహరించెను గాదే! ఓరాజా, ప్రతిజ్ఞాపరిపాలన మనెడి యించుకంతధర్మముచేఁ గప్పఁబడి, ధర్మకామములకుఁ గారణమైన రాజ్య మనెడి యర్థమును విడిచి యేల యిట్లు వగతువు? గాండీవధన్వునిచేఁ గాపాడఁబడుటం జేసి దేవేంద్రునికైన నపహరింపరాని మనరాజ్యమును మనయైశ్వర్యమును మన మెల్లరము చూచుచుండఁగానే, నీమూలమున నీదుర్యోధనుండు మొండివాండ్ర సొత్తులవలెను కుంటివాండ్ర గోవులవలెను నపహరించెను. ధర్మమునందే విశ్వాసము గల నీ కిట్లుండుట ప్రియం బనియె. ఈలాటిగొప్పవ్యసనంబుల కేము పాల్పడవలసివచ్చెనుగదా! ఓభరతశ్రేష్ఠా, నీశాంతివచనములకులోఁబడినవారమై మిత్రులు దుఃఖింప శత్రువులను సంతసింపఁ జేయుచున్నారము. నీశాంతివచనములకులోఁగి మేమే యపు డాధార్తరాష్ట్రులను విడిచితిమి. దానిదోషము మమ్మింతబాధించెడి. శూరసేవ్యముగాక, భీరువులచేనసుష్ఠింపందగిన మృగచర్యవంటిదగు నీవనవాసముఁగూర్చి యించుకంత యాలోచింపుము. ఇట్టి వనవాసమును గృష్ణుఁడేని సృంజయాభిమన్యు లేని, నర్జునుఁడేని, నకులసహదేవులేని నేనేని సమ్మతించితి మనుకొంటివా? ఓరాజా! నీవు ధర్మము ధర్మము అని వ్రతములచేఁ జిక్కి దీనతఁ గుంది, వనవాసరూపం బగు షండవృత్తినిఁ బొందియున్నాఁడవుగదా! శక్తిహీను లగు నీచమానవులు తమసంపదం గోలుపోవునిమిత్తము ఫలరహితము, సర్వనాశక

ఘునైన యీ యధైర్యమును దమకుఁ బ్రియముగాఁ గొందురు. జ్ఞాన
వంతుఁడవును శక్తుఁడవు నైన నీవు మాయందలి పరాక్రమము నెఱుఁ
గక, యివ్విధంబున జాలి గొని స్వకార్యము నెఱుఁగకున్నావు.
శత్రువులపై నోర్పునం జేసి హింసకుఁ బూనకుఁడు మనలం జూచి యాధా
ర్తరాష్ట్రులు పిఱికివాండ్రని బలహీను లని తలఁచుచున్నారు. ఇట్లు వీరిచేఁ
దలఁపఁబడుట యవమానకరముగా నున్నది. యుద్ధమున పథం
బట్టిదిగాదు. యుద్ధమున ధైర్యముతోఁ బోరుచు నచ్చటినుండి మఱలక
శత్రువులను బ్రహారించుచు నొకవేళ మరణించితిమేని, స్వర్గము మున్నగు
పుణ్యలోకములను బొందుదుము. అట్లుకాక యుద్ధమున గెలుపునొందితి
మేని, శత్రునాశమువలని సంతోషము ననుభవించుచు, భూవలయము
నెల్లఁ బాలింతుము. ఓభరతశ్రేష్ఠా! అట్లయినను మేలే యగును. విస్తా
రకీర్తిఁ బడయఁగోరి, శత్రువులపై మత్సరంబుఁ దీర్పఁదలఁచియు, స్వధర్మ
మును నడుపుకొనువారలమగు మన కిప్పు డన్నిభంగుల యుద్ధమేచేయఁ
దగినది. కార్యరూపమయినజీవితముననాత్మార్థముయుద్ధముచేయు నపు
డొకవేళ మనరాజ్యము శత్రువు లపహరించినను, మనకుఁ గీర్తియే
కలుగునుకాని మనల నెవరు నిందింపరు. బ్రాహ్మణులకు నేర్పడిన శాంతి
యేది కలదో, యది క్షత్రియులకగుమనకు ధర్మ్యముకాని నింద్య
మార్గము. ధర్మము పూని స్వధర్మమునందుఁ బూనికి లేనివాని నన్ని
తెఱఁగుల శవంబును సుఖదుఃఖములవలె ధర్మార్థములు రెండును విడు
చును. ఎవఁడు ధర్మమునిమిత్తము స్వధర్మమును విడుచునో, యట్టివాఁడు
మూర్ఖుఁడే కాని పండితుండు కాఁడు. మఱియు నట్టివాఁడు గ్రుడ్డివాఁడు
వెలుఁగును నెఱుఁగనట్లు, ధర్మముయొక్క యర్థము నెఱుఁగడు. ఎవని
కార్యము కేవల మర్థమునిమిత్తమైనదో, వాఁ డర్థస్వరూపము నెఱిఁగిన
వాఁడు గాఁడు. పరులనిమిత్తము ధనము వహించినభృత్యునివలె వాఁడు
వ్యర్థుఁడగు. ఎవఁడు కేవలకామార్థియై, తక్కిన ధర్మార్థములను రెంటిని నను
ష్ఠింపఁడో, వాఁడు బ్రహ్మహత్య నొనర్చినవానివలె సకలభూతములకును
వధ్యుఁడగు. వానికిఁ జెలికాం డ్రుండరు. ధర్మార్థములు లేకపోవును. ధర్మా
ర్థహీనుఁడు నీటియందు రమించెడుమీనము నీ రింకినతర్వాత నశించునట్లు
కామానుభవమునకుఁ బిదప నాశము నొందును. కనుకఁ దత్త్వజ్ఞులు ధర్మార్థ

ములనుండి యెప్పుడును దొలఁగరు. అగ్నికి నరణి కారణమైనట్లు కామము నకు ధర్మార్థములే కారణము. మేఘమునకు సముద్రమును, సముద్రమునకు మేఘమును గారణమైనట్టులన్ని తెఱఁగులను ధర్మ మర్థమునకును, నర్థము ధర్మమునకును గారణములగుచుండును. స్రక్చందనవనాదులస్పర్శము, సువర్ణాదిలాభమనఁనియెడి వీనిచేనెట్టి ప్రీతిగలుగునో, యట్టి చిత్తసంకల్పమే, కామము. దానికి స్వరూపంబు లేదు. నృపాలా, అర్థము గోరువాఁడు ముఖ్యముగ ధర్మమును గోరును. కామార్థియగువాఁ డర్థమును గోరును. కాని కాముకుఁ డితరపురుషార్థమును దేనిని గోరఁడు. కామము చేత వేఱొక కామము జనింపదు. కామ మొక్కఁడాని ఫలమే కాని, దేనికిఁ గారణము కాదు. కట్టెను గాల్పఁగా, నది కాలి బూది యగుచందంబునఁ గామ మనుభవించుటవలననే క్షయించు నని పండితుఁ డెఱుఁగుదురు. వ్యాధుఁడు పక్షులనుంబోలె, గామము సకలభూతములను సంహరించును. సకలభూతములను హింసించుటయే యీకామమునకురూపము. అధర్మమే యీకామము. ఎవఁడు కామలోభములనుబట్టి ధర్మప్రవర్తన నెఱుఁగఁడో, యట్టిమూఢుఁ డిహపరంబులందు సకలభూతములకువధ్యుఁ డగును. ఓమహారాజా, అర్థమువలననే సంపదలు గలుగుటను, నర్థకారణమును, దానివినాశమును విస్తారముగా నెఱుఁగుదువు. అట్లనర్థనాశము జరామరణములవలనఁ గలుగు ననర్థమునుగాఁ బండితులు తలంతురు. అట్టియనర్థము మనయం దున్నది. పంచేంద్రియములకును మనస్సునకును బుద్ధికిని దగువిషయములం దున్నవారికి నేయానందము గలుగునో, యదియే కామమని నేఁదలఁచెదను. ఇది జన్మాంతరకర్మములకు నుత్తమఫలము. ఇట్లు ధర్మార్థములను, కామమును జక్కఁగాఁ బరికించి మానవుఁడు కేవలధర్మముఖ్యుఁడుగఁగాని, కేవలార్థముఖ్యుఁడుగఁగాని, కేవలకామముఖ్యుఁడుగఁ గాని యుండరాదు. అన్నిటిని నెల్లప్పుడు సేవింపవలయును. పూర్వాహ్ణమున ధర్మమును, మధ్యాహ్నమున నర్థమును రాత్రియందుఁ గామమును సేవింపవలయు నని శాస్త్రవిధి. పూర్వవయస్సునఁ గామమును మధ్యవయస్సున నర్థమును, నంతిమవయస్సున ధర్మమును సేవింపవలయు ననియు శాస్త్రవిధి. మాటకారులలో నేర్పరీ! కాలముల నెఱిఁగినజ్ఞాని కాలమును విభజించి, ధర్మార్థకామము

లను మూటిని నాయాయికాలములందు సేవింపవలయును. ఓరాజా! సుఖార్థు లగువారికి మోక్షమయినను, లేదా బుద్ధియందు నుపాయములను జక్కఁగాఁ బరికించి రాజ్యముఁ బడయుట యయినను శ్రేయము. నృపాలా! మోక్షముగాని లేక యర్థప్రాప్తి కాని యేదియో యొక్కటి సంపాదింపుము. అట్లుకాక రోగియొక్క జీవితంబువోలె రెంటికి మధ్య నుండుట దుఃఖప్రదము. నీ వెల్లప్పుడు ధర్మమునే యాచరింతు వని నే నెఱుఁగుదు. నీమిత్రులు నిన్నుఁ గర్మమును జేయుటకై పురికొల్పుచున్నారు. దానయజ్ఞములు, సజ్జనసత్కారము, వేదాధ్యయనము, ఋజుత యను నీధర్మము లిహపరంబులందు రెండింటియందును శ్రేయస్కరము లని పెద్దలు పలుకుచున్నారు. ఇతరగుణములు పెక్కులున్నను పైఁ జెప్పిన యజ్ఞాదు లర్థహీనుఁడు సేయఁజాలఁడు. ఓరాజా! జగత్తు ధర్మమూలమయినది. ధర్మమునకంటె నుత్తమపురుషార్థము వేఱొక్కటి లేదు. అట్టి ధర్మము ముఖ్యమయిన యర్థముచేతనే పొందఁదగును. నృపాలా! కేవలము ధర్మబుద్ధి గలవాఁడు భిక్షాటనముచేతఁ గాని, దేవురింపుచేతఁ గాని ధనంబు సంపాదించుట యుక్తముగాదు. బ్రాహ్మణునికి యాచన విధింపఁబడినదే కాని క్షత్రియునకుఁ గాదు. కావున, పురుషోత్తమా! పరాక్రమముచేతనే యర్థసంపాదనమునకుఁ గడఁగుము. విప్రునిధర్మమైన యాచన గాని, వైశ్యశూద్ర ధర్మములు గాని క్షత్రియునికి విహితములుగావు. క్షత్రియునకు స్వాభావికమైన బలమే ముఖ్యధర్మము. కనుక స్వధర్మము నుబూని, నిన్నెదిరించిన శత్రువులను సంహరింపుము. ఓకౌంతేయా! ధార్తరాష్ట్రులనెడివనంబును నాయొక్కయు నర్జునునియొక్కయు సాహాయ్యమున ఛేదింపుము. బుద్ధిమంతులగువారు పరాక్రమమును క్షత్రియ ధర్మముగాఁ గీర్తింతురు. నీవును పరాక్రమమునే కైకొనుము. హీనమైన యాచనను బూనకుము. ఓరాజేంద్రా! చాతుర్వర్ణ్యమునకు విహితములైన నిత్య ధర్మంబులను నవలంబింపుము. సకలభూతలంబులను వెఱపించునట్టి క్రూరకర్ముఁడయిన క్షత్రియుఁడవుగ జన్మించితివి. శత్రుసంహారము నేసి రాజ్యమును వశపఱచుకొని ప్రజాపరిపాలనంబు గావించుట నీకు నింద్యమైన వృత్తిగాదు. ఇది నీకు బ్రహ్మచే విధింపఁబడిన నిత్య ధర్మము. అట్టిధర్మమునుండి చలించి లోకమునఁ బరిహాసపాత్రుఁడవు

గాకుము. మానవులకు స్వధర్మభ్రంశము ప్రశస్తము గాదు. కావున నృపాలా! నీ దీనమనంబును వీడి క్షాత్రహృదయమును బూనుము. ఓ కౌరవ్యా! ధైర్యమును బూని, బరువు మోయు నెద్దుమాడ్కి క్షత్రధర్మభారముఁ బూనుము. కేవలము ధర్మపరుఁడగు రాజెప్పుడును రాజ్యము నేలఁడు. వానికి రాజ్యసంపదలును గలుగవు. లోభులగు నీచులకుఁ బెక్కండ్రకు లంచములు మొదలగునవి యొసఁగి, బోయఁడు మాటువెట్టి మృగంబులను వశపఱచుకొనుచందంబున రాజు రాజ్యముఁ బొందవలయును. ఓపాండవశ్రేష్ఠా! తమకంటె ముందుఁ బుట్టినవారును, సంపత్సమృద్ధులును నైన యసురలను దేవతలు సైతము వంచనచేతనే లోఁబఱచుకొనిరి. ఓమహీపాలా! బలవంతునికే సకలసంపదలు గలవని యెఱిఁగి, యధికవంచనాపరులగు శత్రువులను బరిమార్పుము. అర్జునునిఁ బురడించు యుద్ధవీరుఁడు గాని, నాతో సాటి యగు గదాధరుఁడు గాని పుడమిని లేఁడు. నృపాలా! బలవంతుఁడగు రాజు, తనబలముచేతనే శత్రువులతోఁ బోరాడి రాజ్యమును సంపాదించునుగాని సంధిమూలమున రాజ్యమును బడయఁగోరఁడు. కనుక నీవును బలమును గడింపుము. బలమే యర్థమునకు మూలకారణము. బలమునకంటె మించినది యెల్లను వ్యర్థము. హేమంతమునందలి చెట్టునీడవలె బలము స్థిరమై యుండునది కాదు. కృషికుఁడు ఫలమును బడయఁగోరి విత్తనములను జల్లినట్లు, శ్రేష్ఠమైన యర్థమును బడయఁ గోరువాఁడు శత్రుపక్షమువారికి నర్థము నొసఁగి వారిని లోఁబఱచుకొనవలసియుండును. నీకు దీన సందియము వలదు. అర్థసదృశమైన యర్థము వేఱొకటి లేదు. ఆయర్థముననే గొప్ప పెంపును గలుగును. అర్థవిషయమున జేర మాడఁదగదు. అది గర్దభమును గోకుటవంటిది. గర్దభము గోకునప్పు డూరకుండిన నుండును. లేదా, వెనుకటికాళ్లతోఁ దన్నునైనఁ దన్నును. దానివంటి యర్థమునను జాగ్రత్తతో మెలఁగవలయును. ఓమానవేంద్రా! ధీమంతుఁడగు నృపాలుఁడు కొండొకధర్మోల్లంఘనము గావించి గొప్పధర్మమును బొందును. అట్టివాఁడే బుద్ధిమంతుఁ డని నిర్ణయింపఁబడినది. నీతిజ్ఞు లగువారు మిత్రులతోఁగూడి బలవంతుఁడై యున్న శత్రురాజు మిత్రులను భేదోపాయములచే జీలఁదీసి, దుర్బలుఁ డయిన యాశత్రురాజును లోఁబఱచుకొనవలయును,

క్షమబలిమి కలవాఁడగు నృపాలుఁడు బలసంపదచేతనే శత్రువును వశ పఱచుకొనును. కాని సంధిప్రయత్నముచేతను,తిన్ననిమాటలచేతను ప్రజ లెప్పటికిని రాజునకు లొంగరు. తేనెపట్టును గదలింపఁబోయినవానిని తేనెటీఁగలు గలిసి కుట్టి పాఱఁదోలునట్లు బలహీనులగు రాజులొక్క టిగఁగూడి బలవంతుఁడైనశత్రురాజును బరిమార్పఁ జూతురు.సూర్యుఁడు తనకిరణములచే సర్వజనులను రక్షించును. వానిచేతనే మాడ్చును. నీవును సూర్యసదృశుఁడవు గమ్ము. ఓనృపాలా! ఈప్రతాపమును క్షత్రి యులకుఁ దపంబువంటి దని పెద్దలవలన వినియుందును. తొల్లింటి మన పెద్దలును న్యాయమునఁ బ్రజాపరిపాలనము సేయుటయే గొప్పతపం బని దానిం జేసిరి. క్షత్రియుఁడు శత్రువుతోడి యుద్ధమునందలి జయముచేఁ గాని, యచటమరణముచేఁగాని పొందులోకములఁ దపంబుచేఁబొందఁడు. ఓయుధిష్ఠిరుఁడా! నీవిట్లు వ్యసనంబులఁ జిక్కుటఁ గాంచి, సూర్యునినుండి వెలుఁగును, చంద్రునినుండి కాంతియుఁ దొలఁగు నని లోకులునిశ్చయిం చిరి. ఓరాజా, జను లిప్పుడు గుంపులుగాఁగూడి నిన్నుఁ బొగడుచు,శత్రు వులను దూషింపుచు వనమునకు వచ్చిరి. మీఁదు మిక్కిలి యిచ్చటి పురులును, కౌరవులును గలిసి సంతసము మీఱ నీసత్యసంధతను గొనియాడుచుందురు. నీవింతకుమున్ను మోహామునఁ గాని, దీనతవలనఁ గాని, పేరాసవలనఁ గాని, భీతిచేఁ గాని, కామముచేఁ గాని, యర్థాపే క్షవలనఁ గాని యనృతమాడి యెఱుఁగవు. రాజొక్కప్పుడు రాజ్య లాభమున్నకై యించుక పాపం బొనర్చినను, నావల విస్తారదక్షిణలతోడి జన్నంబులు చేసియు, బ్రాహ్మణులకు వేలకొలఁది గోభూదానంబు లొన ర్చియుఁ, జంద్రుఁడు చీఁకటినుండి తొలఁగునట్లు పాపములనుండి విడు దల నొందవచ్చును. ఓకురునందనా! పట్టణములవారును, పల్లెలవా రెల్ల ర్లును గుమిగూడి యాబాలవృద్ధము నినుఁ గొనియాడుచుందురు. కుక్క తోలుతిత్తియందుఁ బోసినపాలవలెను, వృషలునియం దున్న వేదము వలెను, జోరునందలి సత్యమువలెను, నబలయందలిబలమువలెను దుర్యో ధనునందలి రాజ్యము నింద్యార్హమైన దని లోకప్రవాదము గలిగి యున్నది. రాజ్యమున స్త్రీలు, బాలురు, వృద్ధులు వేదవాక్యమువలె దీనిని వల్లించుచున్నారు.

ఓయరిందమా! నీమూలమున మేము నీతోడ నిట్టియిడుమలం జిక్కి, నష్టప్రాయులమైతిమి. నీవు సకలసామగ్రులను సన్నద్ధపఱచికొని రథము నెక్కి, జితధనమును బ్రాహ్మణుల కిచ్చువాఁడవై శత్రువుపైకిం దరలుము. ఇప్పుడ విప్రులవీవనలం బడసి, మేటివీరు లగు మమ్ముం దోంబుట్టువులను దోడుకొని దేవేంద్రుఁడు మరుద్గణసమేతుఁడై వృత్రాసురుని; బోదివి యసురుల మడియించి స్వర్గముం గొనినట్లు ధార్తరాష్ట్రుల ముట్టడించి, వారిని సంహరించి రాజ్యసంపదను గొనుము. అర్జునుండు గాండీవమునఁ దొడిగి ప్రయోగించిన గృధ్రఱెక్కలు గట్టినయిమ్ముల నల్లత్రాచులకాటులంబోలె నోర్చువాఁ డొక్కఁడును లేఁడు. యుద్ధరంగమునఁ గోపముతో నేను బ్రయోగించు గదాప్రహారం బోర్వఁగలవీరుఁడేని, గజాశ్వము లేని లేవు. కౌంతేయా! క్రుద్ధులైనసృంజయుకైకయవృష్ణివృషభులు మనకు సాయపడియుండ మన మేల రాజ్యముం బడయక పోదుము. నీవు మహాబలసమన్వితుఁడవై, పూనికిచే శత్రుహస్తములం జిక్కిన రాజ్యమును దప్పక హరింతువు. సందియము వలదు. అని భీముఁడు ధర్మరాజుతోఁ జెప్పెను.

## యుధిష్ఠిరుఁడు భీమునితో సమయోల్లంఘనము దగ దనుట

భీమసేనుఁ డిట్లు పలుకఁగా, సత్యము దప్పనివాఁడును, మహానుభావుఁడు నైన యజాతశత్రుఁడు భీమునిమాటలకు కధైర్యపడక యతనితో నిట్లనియె: ఓభరతర్షభా! నీవు నీవాగ్బాణములచే నన్ను నొంచునట్లు మాటలాడుచున్నవాఁడవు. నీవు నన్నిట్లు ప్రతికూలముగ మాటలాడి నిందించినందులకై నిన్ను నే నేమి యనను. వాస్తవముగా మీకు వచ్చినయీయాపద నాదుర్నీతివలననే సంభవించినది. ఇది నిక్కము. దీని సందియము లేదు నేను ధృతరాష్ట్రపుత్రునికడనుండి రాజ్యంబు లాగికొనఁ దలఁచి పాచికలాటకు నియ్యకొంటిని. అట్టిజూదమున దుర్యోధనునికి బదులు సుబలపుత్రుఁడగు మోసగాఁడయిన శకుని నాతో నెదురాటకు వచ్చెను. మోసగాఁడును,ధర్మదూరుఁడు నగు నాశకునిసభామధ్యమునఁ బాచికలు వేయుచు,మోసముచే నే నొడ్డినపందెములను గెలుచుచు మోసము నెఱుఁగని నన్ను జూదమున నోడించెను. జూదమున శకునికిం దనయిష్టముచొప్పున బాచికలు సరిగను బేసిగను బడుట చూచి, పురు

షుని ధైర్యమును లొంగఁజేయు రోషము నాకుఁగలుగకుండు నేని యప్పుడు మనస్సును జూదమునఁ జొరనీయక నిలుపుకొని యుండుదు. పాడు రోషము ననీ్నగతికిఁ దెచ్చినది. ఓరీ నాయనా! అహంకారదర్పములకుఁ గట్టు వడినవాఁడు ప్రయత్నముతో మనస్సును గట్టఁజాలఁడు. భీమసేనా! నీమాటలకు నేను రోషపడను. కాఁగలకార్య మట్టులాయెను. ధృతరాష్ట్ర పుత్త్రుఁడు మనరాజ్యము స్వీకరింపఁగోరి, మనలను దాస్యమునఁ ద్రోచెను. అట్టిసమయమున ద్రౌపదియే మనకు శరణమయ్యెను. మనము పునర్ద్యూతమునకై పిలువఁబడి సభకు వచ్చితిమి యనుట నీవును ధనంజయుఁడును నెఱుఁగుదురు గదా. అప్పుడు దుర్యోధనుఁడు నన్నుఁ జూచి యిట్లనియెగాదే! "ఓరాజపుత్త్రా, మన మిప్పు డొకయాట యాడుదము. దానియందు మీరోడితి రేని, మీరు వనంబులందుఁ బండ్రెండేండ్లు సర్వజనులకుఁ దెలిసి వనవాసంబును, మఱొక్క యేడు మాఱువేసములతో నజ్ఞాతవాసంబును జేయవలయును. అట్టి యజ్ఞాతవాససమయమున మీరు మావేగులచే నెఱుఁగఁబడితి రేని, మఱల నిట్లె పండ్రెండేండ్లు వనవాసంబును నొకయేఁడజ్ఞాతవాసంబును జేయవలయును. అట్లు కాక మే మీద్యూతంబున నోడితి మేని, పంచనదులమధ్యమున నుండు దేశము మీదే. మేమును సకలసంపదలను బాసి, యంతియకాలము వనవాసాజ్ఞాతవాసములను జేయువారము" ని యట్లు సమయప్రకారంబు సెప్పఁగా నే నందులకు నియ్యకొంటిని. అప్పుడు మన కీహీనమైన జూదంబు ప్రవర్తిల్లె. అందు మన మోడి, యిట్లడవులపాలై నారబట్టలను గట్టి వనంబులందుఁ గందమూలఫలంబులఁ గుడుచుచు సంచరించుచున్నారము. సుయోధనుఁడును నంతట శాంతిని గోరక మఱింత రోషపరవశుఁడై కౌరవుల నందఱను నింక నతనికి లోఁబడినవారిని మనపైకిఁ బురికొలిపెను. మున్ను పెద్దలయెదుట నట్లు ప్రతిజ్ఞ నేసి యిప్పుడు రాజ్యలోభముచేత నాసమయోల్లంఘనము నెవఁడు చేయును? భీమా, ఎపుడు ద్యూతసమయమున నేనా చేతులను నీవు గదయెత్తి కొట్టవచ్చితివో, యప్పు డర్జునుఁడు నిన్ను వారింపకుండెనేని, నీవేమి పాపము నొనర్చియుందువో. సమయము నేర్పాటు చేసికొనుటకు ముందే పరాక్రమము చూపఁగోరిన, నేల నాతోఁ జెప్పవైతివి. ఇప్పుడు కౌరవవీరులమధ్య సమయము నంగీకరించి, వెనుక దానిని నుల్లంఘించి

యుద్ధంబునకుఁ గడఁగుమని పలుమారు నెప్పుచున్నావు. ఇదియు క్తమా! భీమసేనా, యడవుల నిడుమలఁ బడుచుండు నీయాజ్ఞనేనిం జూచి యెట్లు లోర్చియున్నా నని నన్ను దూటితివి. ఆమాట విషము త్రాగిన వానికింబోలె నాకును మిక్కిలి వేదనను గలిగించుచున్నది. భరతవంశ ప్రవీరుఁడా! కురువీరులనడుమఁ జెప్పినమాట నిపుడు తప్పుటకు శక్యముఁ గాదు. కర్షకుఁడు నారు నాటి, ఫలకాలమునకయి నిరీక్షించు చందంబున సుఖకాలమునకై నిరీక్షించియుండుము. పూర్వాపకృతుఁడైనవాఁడు తన శత్రువు వైరవృక్షము పుష్పములు పూచి కాయలు కాచునంతకు నిరీక్షించియుండి యావల దానిని నఱికివైవ నెంచెనా, యపు డాతఁడు తన పురుషకారఖడ్గముచే దానిని సులభముగా ఖండించి పాఱవైవఁగలఁడు. అట్లు ఖండించి శూరుఁడై రాజ్యలక్ష్మిని బొందును. శత్రువులతనికి లొంగుదురు. దేవతలు దేవేంద్రునింబోలె మిత్రులు వానిం గడుఁ బ్రీతితోఁ జేరి యాతని నాశ్రయించి యుందురు. ఓభీమసేనా! నాసత్యప్రతిజ్ఞను బరికింపుము. నాకు మోక్షమునకంటెను, ప్రాణమునకంటెను బ్రతిజ్ఞ హెచ్చైయున్నది. రాజ్యము, పుత్రులు, కీర్తిధనము నివి యెల్ల సత్యసంధతయొక్క కళాంశమును బోలవు. అని యుధిష్ఠిరుఁడు సమయోల్లంఘనము దగ దని భీమునికిఁ బలుతెఱఁగుల బోధించెను.

భీమసేనుఁ డీపలుకులు విని యుధిష్ఠిరునితో వెండియు నిట్లనియె. మహారాజా! బాణమువలె తెక్కలు గట్టుకొని పాఱునదియు, నాయుస్సును దఱుగఁజేయునదియు, నదీప్రవాహంబుమాడ్కిఁ బ్రవహించునదియు నై యనంతము నప్రమేయమునై సర్వస్వహారి యగు కాలముతో సంధిచేసికొని యట్టికాలమునకులోఁబడినవాఁడవయి, యాకాలము ప్రత్యక్షముగా నెంచున ట్లున్నాఁడవు. మనుష్యుని యాయుఃకాలము నురుగువంటిదియు, ఫలమువంటిదియునై నిమిషనిమిషమునకుఁ గాటుక వలెఁ గరఁగిపోవుచున్నది. అట్టియాయువు నెవఁడు నిరీక్షించియుండును? ఎవఁ డపరిమితాయువు గలవాఁడో, లేక తనయాయు వింత యని యాయుఃపరిమితి నెఱిఁగినవాఁడో, సర్వప్రత్యక్షదర్శి యగునతఁ డట్టికాలమును నిరీక్షించియుండవచ్చును. మన మీపదుమూడేండ్లకాలమును నిరీక్షించుచు నుంటిమేని మనయాయువు నానాటఁదగ్గిమరణ మొందుదుము.

మానవులకు మరణము నిత్యసన్నిహితమై యున్నది. అట్టి మరణము రాకమున్నే మనము రాజ్యము సాధింపఁ గడఁగుదము. ఏనృపాలుఁడు విస్తారకీర్తిని గడింపక, భూమికి బరువై శత్రువులపై వైరమును దీర్పక పోవునో, వాఁడడుసున దిగఁబడి లేవలేనియెద్దువలె క్షీణించును. ఏపురుషుఁడు బలోత్సాహములు లేక శత్రువును సరకుసేయకుండునో, యట్టిహీనుఁ డయినవానిజన్మము వ్యర్థ మని నే నెంచెదను. ఓయుధిష్ఠిరా! శత్రువును నీబాహుబలముతోఁ బరిమార్చి, బాహుజితంబైన ధనమును బొందుము. శత్రుసంహారముచే నీబాహువులు సువర్ణాధివతులు గాఁగలవు. నీవును పృథుచక్రవర్తికిఁ బోలె లోకవిఖ్యాతకీర్తి గలుగఁ గలదు. నృపాలా! రాజు వంచకుఁ డయిన శత్రువును జంపి నరకమును బొందినను, నానరకము స్వర్గతుల్యమే యగును. రోషమువలని దుఃఖము నిప్పుమంటకంటె వెలుఁగునది. అట్టి రోషదుఃఖములచే నేను రేలుంబగళ్లు నిద్దుర లేక పరితపించువాఁడను. విలుకాండ్రలో మేటియు శత్రుభీకరుఁడు నైన యర్జునుఁడును, వనవాసముచేఁ గడు వగచుచు, గుహాయందలి సింహమువలె నున్నవాఁడు. ఇతఁ డొక్కఁడే ధనుర్ధరుఁడై ముజ్జగంబులను జయింపఁగలుగు. అట్టి యామహాధనుర్ధరుఁడు కట్టివేయఁబడిన మదపుటేనుఁగుంబోలె వేఁడినిట్టూర్పులు నిగుడించుచున్నాఁడు. ఈనకులసహదేవులును, వీరలకుఁ దల్లియగుకుంతియు నీకుఁ బ్రియంబు గోరి జడులవలెను, మూఁగలవలెను నున్నారు. సృంజయాదులగు బంధువు లందఱును యుద్ధమునే కోరుచున్నారు. నేనును ప్రతివింధ్యునితల్లి యగు నీ ద్రౌపదియు దుఃఖములపాలై యుద్ధమునే కోరుచున్నాము.

ఓధర్మనందనా! నే నిపుడు చెప్పునది యందఱకు సమ్మతంబు. అందఱు వ్యసనమును బొంది యుద్ధమే కొనియాడుచున్నారు. బలశాలుర మగుమనము చూచుచుండ బలహీనులగు తుచ్ఛులు మనరాజ్యమును లాగుకొని యేలుచున్నారే! ఇంతకంటెఁ బాపిష్ఠ జీవిక యిం దెక్కడేనిఁ గలదా! నృపాలా! నీస్వభావదోషంబునను, దీనతవలనను నీ విట్టియిడుమలోర్చుచున్నాఁడవే కాని యితరుఁ డిట్టికష్టముల నోర్చునే? మఱి యెవ్వఁడును నీనడతను మంచి దని కొనియాడఁడు. అర్థజ్ఞానశూన్యుఁడై, స్వ

బుద్ధిలేక గురువు సెప్పునది చెప్పునట్టి మూఢుఁడయిన కేవల వేదాధ్యాయి బుద్ధివలె నీబుద్ధియుఁ దత్త్వార్థము నెఱుఁగకున్నది. జాలిగలిగిన బ్రాహ్మణుఁడుగ జన్మింపవలసిన నీ వెట్లు క్షత్రియవంశమునఁ బుట్టితివి. ఈక్షత్రియజాతియందుఁ దఱచుగాఁ గఠినప్రవర్తనగలవారు పుట్టుదురు. మనువు పలికిన రాజధర్మముల నెల్ల వింటివిగదా. మహారాజా! క్రూరులును, వంచకులును, నసూయాగ్రస్తులును విరోధులును నైన దురాత్ములగు ధార్తరాష్ట్రులను నీ వేల యోర్చియున్నావు? ప్రకృతకర్తవ్యము నెడ నజగరమువలె నీవేల యుపేక్షించుచున్నాఁడవు? కౌంతేయా, నీవు బుద్ధిపరాక్రమము శాస్త్రజ్ఞానము సజ్జనత్వము మొదలగునవి గలిగియు హిమవంతము సు గడ్డితోఁ గప్పిపుచ్చిన చందమున బలపరాక్రమసంపన్నులగువ మ్ముఁ గప్పిపుచ్చఁ జూచుచున్నావు. ఓకౌంతేయా! మింట వెలుఁగు సూర్యుఁడు మఱుగుపడియుండఁజాలనట్లు లోకప్రసిద్ధుఁడ వగు నీవు కులశీలములు దెలియకుండ నిన్ను మఱుగుపఱచుకొనియుండఁజాలవు. కొమ్మలు ఆకులు పువ్వులు పండ్లు వీనితో నిండిన తడినేలయం దున్న గొప్పమ్రానువలె నుండు నీ యర్జునుం డైరావతంబుమాడ్కి సుప్రసిద్ధుఁడు గాక యెట్లు మఱుగుపడియుండును. సింగపుఁగొదమలవలె నొండొరులు గదిసియుండు నీ నకులసహదేవు లెవ్విధంబున మఱుఁగుపడియుండఁగలరు? పవిత్రకీర్తి గలదియు, వీరమాతయు, సుప్రసిద్ధయునగు నీద్రౌపది యెట్టులజ్ఞాతకుల శీలరాలై మనఁగలదు. ఈ ప్రజ లెల్ల రాబాలవృద్ధము నన్నెఱుఁగనివారు లేరు. నేనజ్ఞాతపరాక్రముఁడనై యెట్లుండఁగలను. అట్లు నేనుండుట మేరుపర్వతమును గప్పిపుచ్చినయట్ల యగును. దిగ్విజయసమయంబున మాచేఁ దఱుమఁబడిన పెక్కురు రాజులును, రాజపుత్త్రులును ధార్తరాష్ట్రులననుసరించియున్నారు. వారిలో మాచే నవమానితులు గొందఱు, విదేశములకుఁ దఱుమఁబడినవారు కొందఱు. వా రెల్లరు దుర్యోధనునికిఁ బ్రియంబు సేయువారై మనకు నెగ్గులు సేయ నెంతురు. వారందఱు పెక్కండ్రు వేగులను బంపి మనసంగతుల నరయుచుందురు. వా రెల్లరు మనలను గని పెట్టి శత్త్రురాజులకుఁ దెలుపుదురు దాన మనకు గొప్పముప్పు వాటిల్లును. మన మిపుడు పదుమూఁడు నెలలు వనంబున నుంటిమి. వీనిని నన్నిసంవత్సరములుగ లెక్కింపుము. శాస్త్రజ్ఞులు యజ్ఞములందు సోమలతకు బదు

ల్బుగఁ దృణమును గైకొనునట్లు సంవత్సరమునకు బదులుగ నొకనెలను లెక్కింపుము. కాదేని, చక్కఁగా బరువులు మోయునట్టి సాధు వయిన యెద్దునకుఁ గడుపునిండుగ గడ్డివేసిన నీసమయాతిక్రమణదోషంబు ద్రొలఁగు నని పెద్ద లందురు. ఆప్రకారము చేయుము. క్షత్రియునకు యుద్ధమునకంటె మించిన ధర్మంబు వేఱొండు లేదు. కావున యుద్ధము పూనుమనిన ధర్మరాజు భీమునికిట్లనియె. అల్పకార్యములు సాహసముచే ఫలవంతము లగును. మహాకార్యములు సాహసముచేఁ జెడును. కాఁబట్టి బలగర్వితుఁ డిట్టి మహాకార్యములయెడ సాహసముం బూనరాదు. దుర్యోధనాదు లందఱును కేవలాతతాయులే కాక, యస్త్రవిద్యను నేర్చి బలవంతులై యున్నవారు. వారికి సైంధవుఁడు, కర్ణుఁడు, శకుని, అశ్వత్థామాదులు మహాశూరులు తోడ్పడి తమ ప్రాణముల నైన నిచ్చుటకు సంసిద్ధులైయున్నవారు. మఱియు రాజసూయమునకు మున్ను మనము గావించిన దిగ్విజయమప్పుడు మనచే నోటువడినరాజు లెల్లరును దుర్యోధనునకు సాయపడుదురు. భీష్మద్రోణకృపులు మువ్వురును మనయెడ మైత్రిగలవారయ్యుఁ వారికడ బహుకాల మునికింజేసి వారికే తోడ్పడుదురు. అభేద్యకవచముతోను, సహజకుండలములతోను వెలయుచుండు కర్ణునియొక్క శౌర్య మపారము. వానిశౌర్యమును దలఁచినప్పుడు నాకు గుండెలు వీడిపోవుచుండును. వీరెల్లరును దుర్యోధనునకుఁ గాను బ్రాణములను దారవోయుటకు సంసిద్ధులైయున్నారు. వీరి బలపరాక్రమములు దేవతలనైనఁ జెనకుటకుఁ జాలిన వని యెఱింగి యీయుద్యమమునకుఁ బ్రస్తుతము తఱి గా దని చింతిల్లుచుండుదు. అనఁగా భీముఁడు మాఱుపలుక నేరక యూరకుండె.

## వ్యాసుఁడు ధర్మరాజునొద్దకు వచ్చి ప్రతిస్మృతి యను విద్య నుపదేశించుట

ఇట్లుండ నొకనాఁడు వేదవ్యాసుఁడు పాండవులం జూచుటకు వారియునికిపట్టయిన యరణ్యమున కేతెంచెను. వేదవ్యాసు దర్శింపఁగానే పాండవు లేవురును లేచి నమస్కరించి యర్చితుంజేసి యాతని సంతసింపఁ జేసిరి. సత్కారములచే సంతసించినవ్యాసుండు ధర్మరాజున కిట్లనియె: ధర్మనందనా! నీమనస్సునందలియాలోచనం బెఱింగి శీఘ్రగమనం

బున నిన్నుఁ జూడవచ్చితి. భీష్మద్రోణకృపాశ్వత్థామకర్ణాదులబలంబునకు భీతిల్లనలదు. ధైర్యము నవలంబింపు మని యేకాంతస్థలమునకుఁ దోడ్కొనిపోయి ప్రతిస్మృతి యను విద్య నుపదేశించి, దానిని నర్జునునిచేఁ బునశ్చరణ చేయింపు మనియు, దానిమహిమమువలన నింద్రయమవరుణకుబేరాదులును మహాదేవుఁడును బ్రత్యక్షులై యుద్ధమప్పుడు వలసిన శస్త్రాస్త్రము లన్నియును నర్జునునకు నొసఁగుదు రనియు, నాదేవతలను దర్శించుటకాతనిఁ బంపు మనియు నాజ్ఞ నొసంగెను. అంతియగాక, యర్జునుఁడు మనుష్యమాత్రుఁడు గాఁ డనియుఁ బూర్వజన్మమున నారాయణ ఋషితోఁ గూడి మహాతపము నాచరించిన నరుఁ డను మహర్షి యనియు, నీజన్మమున తపస్సుచేతను శౌర్యముచేతను దేవతలను మెప్పించి వారి మూలమున దివ్యాస్త్రములను బడయఁగలఁ డనియుఁ జెప్పెను. మఱియు నాయరణ్యమునందు వారు బహుకాల మనేకబ్రాహ్మణులతో నుండుటం జేసి, ఫలమును, సమిత్తులు వారికి వలసిన వన్నియుఁ దఱిగె ననియు, మృగములు యథేచ్ఛగా నిందు తిరుగులాడుట కాటంకము గలిగె ననియు, తాపసు లొక్కచోట చిర నివాస మేర్పఱచుకొన రాదనియు, వేఱొకవనమునకుఁ బోవలయుననియుఁ జెప్పి ప్రతిస్మృతివిద్యను విధ్యుక్తముగ నుపదేశించి వ్యాసుం డదృశ్యుం డయ్యె.

అట్లు వ్యాసానుగ్రహంబు వడసి యాధర్మజుఁ డచ్చోటు వాసి సరస్వతీతీరమునఁ బుష్పఫలవిరాజితం బగు కామ్యకవనంబునకుఁ బోనెంచి దనవెంబడి ననుజులును, భార్యయు, విప్రగణంబులును రాఁగాఁ జొచ్చి యందు వేఁటవలన సంపాదించినమాంసాదులచేతను ఫలములచేతను బితృదేవబ్రాహ్మణులకు దనివి దీఱ మృష్టాన్నంబులిడి సుఖంబుండె. ఆసమయమున వేదవ్యాసోపదిష్టం బైన ప్రతిస్మృతివిద్యను జక్కఁగా జపించి యర్జునునిం బిలిచి యేకాంతమునకుఁ దోడ్కొని పోయి యిట్లనియె. ఓ యర్జునా! అస్త్రబలసంపన్నులగు భీష్మద్రోణకర్ణాదులు తమకు దుర్యోధను నెడఁగల విశ్వాసముచే, మన కెదురై పోవుదురనియు, వారిని దేవతలు గూడ జయింపలేరనియు,నెంచి వారిని గెలుచు నుపాయమును జింతించుచుండ వేదవ్యాసుఁడు నాకుఁ బ్రత్యక్షంబై యీమంత్రరాజమును నా

కుపదేశించి వీనిచే నీపూర్వజన్మసుకృత సంస్కారమునం జేసి దేవతలు నీకుఁ బ్రత్యక్షమై యుద్ధమునందు భీష్మాదివీరులను సాధింపనేర్పుగలయస్త్రములను నీ కొసంగుదు రనియు, యుద్ధమగుచో వారిని వానిమూలమున గెలిచి రాజ్యమును బొందగల మనియు, న న్నీ మంత్రరాజమును నీకుపదేశింపు మనియుఁ జెప్పి యరిగెను. ఈమంత్రమును నీవు గొనుటకు నిది దగినసమయము. దానిని నీవు నావలన గ్రహింపుము. తత్ప్రభావమున నీవు మిక్కిలి తేజస్వివై దేవతానుగ్రహమును బడయుదువు. పూర్వ మింద్రుని విశ్వసించి దేవత లెల్లరును వృత్రాసురునకు వెఱచి తమతమయస్త్రములను నింద్రునియొద్ద నుంచిరి. 'ప్రతిస్మృతి' పునశ్చరణచే నింద్రుండు నీకుఁ బ్రీతుండై యాయస్త్రముల నెల్ల నీకిచ్చును గావున నీవు గాండివంబును, నమ్ములపొదులను, ఖడ్గాదిసాధనంబులను గైకొని దారిఁ దొలంగక యీ దినమే వెడలి యుత్తరాభిముఖుఁడవై పొమ్ము. ఇది వ్యాసునియానతి యని చెప్పి ప్రతిస్మృతివిద్యను యథాశాస్త్రంబుగ నుపదేశించెను.

అర్జునుం డన్నచే ననుజ్ఞాతుండై కామ్యకవనమునందుండి తఱలువాఁ డగ్నిని ప్రజ్వలించి వేల్చి, యతని నారాధించి ప్రదక్షిణంబు గావించి విప్రుల సత్కరించి కవచముం దొడిగి, గాండివమును నక్షయతూణీరయుగమును గొని, దుర్యోధనాదులవధమును దలంచి నిట్టూర్పు వదలి యాకసమును జూచెను. అంతట భూతంబులు "అర్జునా! నీమనోభీష్టంబు సిద్ధించు. గెలుపును బొందుదువు" అని యదృశ్యంబులై పలికివవి. వారిఁ బంప వచ్చిన ద్రౌపది "నీవు పుట్టినకతంబునఁ గుంతీదేవి గోరిన ఫలమును, నీయభిమతంబును గలుగుఁగాక. ఇఁక నెవ్వఁడును వీర కులమునఁ బుట్టకుండును గాక! బిచ్చమెత్తి జీవించు విప్రుఁడే మేలు. వాఁడే సుఖి. వాని కంజలి గావించెద. దుర్యోధనుఁ డానాఁడు సభలో నాడిన ములుకులవంటిపలుకు లెవరిగుండెలను బ్రద్దలుసేయవు ? అంతకంటె నొండొకదుఃఖ ముండునా ? నీవు మాకడ నుండమి నీవియోగము మాకు దుర్భరము. నీపరాక్రమమును నుతింపుచు నీవు మరల మమ్మును జేరునంతవఱకును నీ క్షేమమును సదా కోరుచుండెదము. నీవు మావద్ద లేమింజేసి మాకు సంతోషమే యుండనేరదు. మాసుఖదుఃఖము లెల్ల నీయందే కుదుర్పాటుగొని యున్నవి. కార్యార్థముగ నరిగి విఘ్నము

లేక ఫలసిద్ధిని బొంది రమ్ము. బలవంతులతోడి భేదమును మానుము. ధాత, విధాత, హ్రీ, కీర్తి, ద్యుతి, పుష్టి, ఉమ, సరస్వతి, వసువులు, రుద్రులు, ఆదిత్యులు, మరుద్గణములు, విశ్వేదేవులు, అశ్వినులు, సాధ్యులు, సకలభూతములును నీకు శుభములఁ జేకూర్తు" రని మనస్సున నిష్టదేవతను స్మరించి యర్జునుఁడు తమ్ము వీడిపోవుటకై చెదరిన మనస్సును గుదుటపఱచికొనెను.

## అర్జునుఁడు దివ్యాస్త్రములకై తపంబునకుఁ బోవుట

అంత నర్జునుండు తనపురోహితుఁ డగు ధౌమ్యునకును, నన్నయగు ధర్మరాజునకుఁ బ్రదక్షిణం బొనర్చి, వారికి నమస్కరించి వారిసెలవు గొని ప్రయాణమై మహారణ్యమార్గమునం బడి వేగంబ పోవుచుండ దారి కడ్డమైయుండు ననేకపర్వతపంక్తులను దాఁటి, యందు ముఖ్యముగా హిమవంతమును, గంధమాదనమును నతిక్రమించి యింద్రకీలపర్వతమును జేరెను. ఇట్లర్జునుఁడు వేగమునఁబోవుచుండ నొకచో నతనివీనులకు "నిలు నిలు" మని యొకయశరీరవాక్కు వినఁబడెను. ఆధ్వని యెచ్చోట నుండి యీనిర్జనారణ్యమున వచ్చుచున్నదో యనియతఁడు నలుదిక్కులు గలయం బరికింపఁగా నందొక చోట నొకచెట్టునీడను మహాతపస్వియు, బ్రహ్మతేజస్సుతోఁ గూడినవాఁడును, బింగళవర్ణుఁడును, నతికృశదేహుఁడును నగు నొక మహనీయుఁడు గానంబడియెను. ఆతనికడ కర్జునుం డేగి నిలువఁగా నామహనీయుఁ డర్జును నిట్లనియెను. "నాయనా! నీ వెవ్వండవు? ధనుర్బాణంబులను, నమ్ములపొదిని ధరించి, కవచమును దొడిగి, క్షత్రధర్మపరుఁడవై యీవనమునఁ గ్రుమ్మఱుచున్నావు. ఈవనము సర్వసాధారణముగ శమదమాదులు గల విప్రుల కునికిపట్టు. ఇందుఁ జరించువారలకుఁ గ్రోధహర్షములు లేవు. యుద్ధోపకరణముల నిటకుఁ గొనిరా నేల? నీ తేజోబలములసాయమునం జేసి యీవనమునకు రాఁగల్గితివి. అన్యుల కియ్యది చొరఁ నశక్యంబు. ధనురాదియుద్ధసాధనములవలన నిచ్చోటఁ బ్రయోజనము లేదు. కావున వానిని వీడు" మని యెంత చెప్పినను నర్జునుండు తనగాండీవమును, నక్షయతూణీరములను దొడిగియున్నకవచమును నెంతమాత్రము వదలఁ డయ్యె. అర్జునునిట్టుదల కాతాపసి సంతసించి,

"శ్వరీ! ఏ నింద్రుండను. కోరినవరముల నొసంగెదను. వేఁడుము" అనఁగా నర్జునుండు దేవదేవునకుఁ బ్రణమిల్లి నిలిచి, "దేవా! నాకు సక ల్తాస్త్రముల నొసంగుము" అనెను. అందులకుఁ బాకశాసనుఁడు "నీకింక నస్త్రము లేల? పుణ్యలోకములఁ గోరుము. నిరాటంకముగ నొసంగెద. మహనీయు లపవర్గమునఁ గాదె సుఖింతురు. నీ వాయానందము ననుభవిం పుము" అనఁగా నర్జునుం డిట్లనియె. "నాయన్నలు దమ్ములు వీరెల్ల రర ణ్యావాసము సలుపుచుండ నే నొక్కఁడను మాత్రము సుఖించు టేటి ధర్మవు? దేవత్వముగాని దేవాధిపత్యముగాని సిద్ధించినను వానిని స్వార్థ పరుఁడనై యనుభవింప నేరను. నాకు దుర్యోధనాదులు పరమశత్రువులు. వారిపైఁ బగఁ దీర్పక మున్ను నే నెట్టిసుఖమును వాంఛింపను. లోభినై సుఖముల కాసించితినేని యపకీర్తిపా లగుదును. నేను క్షత్రియుండను. మరణానంతరమునను సైతము కీర్తిని సుప్రతిష్ఠితముఁ జేయ వాంఛిం తును. అని చెప్పఁగా నాఖండలుం డర్జునునియుత్తమగుణంబులకు మెచ్చి ప్రసన్నుండై యిట్లనియె. అర్జునా! నీకార్యసిద్ధినిమిత్తము నీకుఁ బ్రథమమున ఫాలాక్షుదర్శనంబు కావలయును. ఆమహనీయుని సందర్శించినవెంటనే నీకు సకలాస్త్రముల నే నొసంగుదు. ఉమాపతిని వీక్షించుటకు యత్నముఁ గావింపు మని యుపదేశించి పురందరుం డదృశ్యుం డయ్యె.

ఈ వృత్తాంతము నంతయును జనమేజయుండు విని వైశంపాయ నునితో నిట్లనియె. "మునీశ్వరా, నాముత్తాత యగు నర్జునుండు దివ్యాస్త్రముల నెట్లు సాధించె? భవానీపతితో యుద్ధము గావించె నని విందు. ఈ సకలవృత్తాంతములను వీనులకు విందగున ట్లానతీయవే" అనఁగా వైశంపాయనుం డతనితో నిట్లు చెప్పఁదొడంగెను.

## కిరాతవేషధారి యగు శంకరుం డర్జునునిఁ గాంచుట

అర్జునుం డీతీరున నింద్రునియనుజ్ఞఁ గొని, యీశ్వరారాధనము నకుఁ దగు సన్నాహముతోఁ బోవుచుండువాఁడు ముం దొక్కదివ్యవన మును గాంచెను. ఆవన మనేకశృంగారంపుఁజెట్లతోను, గాలితాఁకున రావి చెట్లయం దుండు దివ్యకుసుమపరాగములతోను, బరాగములయం దుండి పలుదెసల విసరుచుండు దివ్యసుగంధములతోను, సుగంధయు

తనువులైన మకరందపముల నానుటకు వచ్చు తుమ్మెద గుంపులఝుంకార ధ్వనులతోను, చెట్లమూఁకుల నీడలలోఁ గిలకిలారావము పలుకు వన్నెలచిలుకల తోను, వీనుల కింపుగా ధ్వనించు పికకూజితములతోను, నాఁడు నెమిళ్ళ నాకర్షించి యానందపరవశలఁ గావించునిమిత్తము తమకుం చెలవిప్పి మనోహరముగా నాడెడు నెమళ్ళగుంపులతోను గూడి మనోహరమై నిర్విఘ్నముగఁ దపస్సు చేయుట కనుగూలముగ నుండెను. అర్జునుఁ డవ్వనము ఈశ్వరసాక్షాత్కారమున కర్హమైన దని నిశ్చయించి జడలు దాల్చి నారచీరలు గట్టి, కొన్నాళ్లు రాలినయాకు లాహార ముగను, మొదటినెలలో మూఁడుదినములు మాత్రమును, రెండవ నెలలో నాఱుదినముల కొకపరియుఁ బండ్లను దినుచును, మూఁడవ నెలలోఁ బదునైదు దినముల కొకనాఁ డాహారముఁ గొనుచు, నాల్గవ నెలలో నిరాహారుఁడై బొటనవ్రేలిని నేలపై మోపి నిలిచి మహేశ్వ రాయత్తచిత్తుఁడై తీవ్రమగుతపస్సును జేయుచుండెను. అర్జునునిఘోర తపస్సుచే నావనమున నలుదెసలు పొగలు గ్రమ్ముకొనెను. దానం జేసి వనమున నుండు నానాజంతుజాలముల కునికి దుస్సహ మయ్యెను. ఆవన మున నుండు తపస్వులు వెంటనే పరమేశ్వరునికడ కేఁగి యర్జునునియభీష్ట ము నెఱవేర్చ వేడఁగా నీశ్వరుం డర్జునుఁ డపవర్గమును గోరఁడు. వానిసంకల్ప మే నెఱుంగుదు. ఎట్టకేలకు వానివాంఛ తీర్చి మీకు సుఖంబుఁ జేసెదను. వెఱచుటకుఁ గారణము లేదు. మీయాశ్రమంబు లకుఁ జనుఁ డని మునుల కనుజ్ఞ నొసంగి పంపెను. అటు లనిపి, వెంటనే యీశ్వరుండు తాను బంగారువన్నె గల కిరాతునివేషమును దాల్చి పార్వతిని తన కనుగుణమైన స్త్రీరూపమును దాల్ప నియోగించి యితర ప్రమథగణములను వారివారి యిష్టానుసారముగఁ దన కనుచరవేషములఁ దాల్ప నియమించి యర్జునుఁడు తపస్సుచేయుచున్న వనమునందు విహరింపసాగెను. ఇది యిట్లుండ, మూకుఁ డను రాక్షసుఁడు పందిరూపమును దాల్చి నిరాహారుఁడై జితేంద్రియుఁడగుచు నీశ్వరసాక్షాత్కారముఁ గోరి తపముఁజేయుచున్న యర్జునునిఁ జంప రాఁగా నాశబరుండు వింటినిఁ బూని పంది నెదిర్చెను. అంత మాయా కిరాతుఁ డర్జునునితో "ఓరీ! ఈపందిని నే నేసెదను. నీవు దానిపై బాణము

ప్రయోగింపకుము" అనఁగాఁ గిరాతునిమాటల నాదరింపక సవ్యసాచి పందిని బాణముచేఁ గొట్టెను. కిరాతుఁడును నంతటఁ బోక తానును వాఁడిములుకులచేఁ బందిని బాధించెను. ఇట్లియ్యిరువురిఘోర బాణంబు లొక్కతేపగనే పందిపైఁ బడఁగా నా యమోఘబాణంబుల దెబ్బల కోర్వ లేక యా వరాహంబు నిజరాక్షసస్వరూపంబు బయలు పఱిచి గ్రక్కున గిరగిరం దిరిగి చచ్చెను.

వెంటనే యర్జునుండు, నెమిలిపింఛముఁ ధరించిన మాయాకిరాత వేషుఁడగు పరమేశ్వరుని వీక్షించి, "నిర్జనంబైన యీవనంబున స్త్రీల తోడం గూడి నిర్భీతుఁడవై తిరుగుచుండు నీవెవండవు? రాక్షసుం డొకం డు పందివేషంబున వచ్చి నన్నుఁజంపుటకుఁ జూచుచుండ వానిని వధించు నిమిత్తము నేనమ్ముల నేయుచుండఁగ నడ్డంబు సొచ్చి యాపందిపై నీవేల ములుకుల నాఁటితివి? ఇది వేఁటకానిధర్మము కాదు. కావున నాతీవ్రనారా చంబులచే నిన్నుఁ బొరిగొనియెద" అని చెప్పఁగా నా కుహనాకిరాతుం డందులకు నవ్వి సవ్యసాచి కిట్లనియె "ఈయరణ్యమునందు నేను స్త్రీలతో నెట్లు చరింతు నని నాకై నీవు పరితపింపవలదు ? అడవిజాతులవార మగు మాకిది సహజవృత్తి. మనుష్యసంచారమే లేని యీఘోరారణ్య మునందు నీయంతటి నాగరకుఁడు వసించుట యసాధ్యము. నీయాకారం బతిరమ్యము.మిక్కిలి సుకుమారము.ఇందుఁ గోమలగాత్రుఁడవగు నీవంటి పురుషుఁడు వసించుట యనర్థంబు" అనఁగా నర్జునుండు 'నేను గాండీవ మనఁబడు ధనుస్సును, నక్షయబాణంబులు గల నాజంటయమ్ములపొదిని ధరించి తేజస్వినై రెండవయగ్నిహోత్రునివలె నీవనమున వెలుంగు చుండుదు. నన్నుఁ జంప వచ్చిన కుహనాక్రోడం బగు నీరాక్షసుని నేన వధించితి" ననఁగా నామాయాకిరాతుం డిట్లనియె. "ఈపందిని మున్న నాబాణమునకు గుఱి గావించియుంటి. కావున దాని నేయ కే నుడుంగు దునే ? ఇయ్యది నాబాణప్రహరణంబులచేతనే చచ్చినది. బలముగల వాఁడ వని పొంతరించి నీతప్పుల నితరులపై నారోపింప నేల ? నాబాణెం బడి యసువులతో నావలికిఁ జననేరవు. పోటుగలమానిసివైతేని జక్కగ నెదుఱ నిలిచి యుద్ధముఁ జేయుము" అని యుద్రేకంబుఁ బురి కొల్పుమాటలకు నర్జునుండు కనలి, రోషముతోఁ గను లెఱ్ఱనేసి

కిరాతునిపైఁ బుంఖానుపుంఖములుగ బాణపరంపరలఁ గురిపించెను. కిరాతుం డందులకు భీతిల్లక యర్జునుని "ఓరీ! ఇవే నీవాడిములుకులు? ఇంత కంటె వాడివి లేవా? నీబాణప్రయోగకౌశలమును జూపుము." అన్న గానే యర్జునుండు కిరాతునిపై నంపవానఁ గురిపించెను. దాని నంతయు మాయాకిరాతుం డనాయాసముగ వారించి పదంపడి ఫల్గునునిపై వేన వేలుగ బాణముల వైచెఁగ నమోఘము లగు తనబాణము లన్నియు వమ్ములై పోయినందులకుఁ బార్థుఁడు వగచి యీతం డెవ్వండో మాయా వేషంబున నుండుమహనీయుఁడు కాఁబోలు. కాఁడేని, నాదివ్యశరంబు లన్నియు వృథ లగునా! ఇది నా కత్యాశ్చర్యమును గొల్పుచున్నది. నాశరముల నన్నింటిని నీమహాత్ముఁడు దిగమ్రింగుచున్నాఁడు. ఈతండు పరమేశ్వరుండే యగు నేమో? కాకున్న నాబాణములతీవ్రతకు వేఱొకం డిట్లు చలింపకుండు నే? ఈపర్వతము దేవతల కునికిపట్టు. ఏదేవుండేని విలాసంబున నిట్టీవనంబున సంచరించుచుండు. అయినం గానిమ్ము. అని నారి సారించి వాఁడితూఁపు లనేకంబులతోఁ గిరాతుఁ గొట్ట, కిరాతుండు వాని నన్నింటినిఁ దొలఁగంద్రోచి యర్జునునితూణీరంబులలోని బాణంబుల నన్నిటిని క్షయింపఁజేసె అప్పు డాసవ్యసాచి యిట్లని వితర్కించి, నాకీ గాండీవంబును, నీయక్షయతూణీరంబులును ఖాండవదహనకాలంబున నగ్ని దేవునిచే నొసంగంబడినవిగదా! అట్టియమ్ములపొది యీకాలమునకు శరవిరహితమయ్యె. ఈతం డెవ్వండో యెఱుంగఁజాల కున్నాను. అయి నను వింటికొప్పున శూలాగ్రంబునంబోలెఁ బొడిచి యీతనియసువులఁ బొరిగొనియెద నని వింటికొనతో నర్జునుం డాకిరాతుం బొడువ, నాకిరాతుండు తనదైవమహిమచే నావింటిని మాయ గావించె. వెంటనే యర్జునుండు ఖడ్గంబుచే నీశుని మార్కొన నయ్యది యతనిశరీరంబు తాఁకగనే వ్రక్కలై నేలఁబడియె. ఇట్లర్జునుండు నిరాయుధుఁడై సమీపమున నున్న చెట్లకొమ్మల విఱిచి, వానితోఁ గొంతసేపు పోరాడెను. పిదపఁ గిరాతునిపై ఱాల నువ్వెను. ఎట్లు పోరినను కిరాతుండు నొవ్వఁడయ్యె. తుదకుఁ గిరాతుని మార్కొని పిడికిళ్లతో గ్రుద్దఁజొచ్చెను. కిరాతుండును వెనుదీయక యర్జునుని మార్కొని దారుణ ముష్టిప్రహారణంబులఁ గావించెను. ఇట్లిరువురకును సమరంబు ఘోరంబై యింద్రవృత్రులపోరాటంబు ననుకరించె,

ఈసంగరంబు కొంతసేపు జరుగఁగా ఫల్గునుం డీశ్వరముష్టిప్రహారం బులచేతను, నతనిగాత్రసంస్పర్శముచేతను గొంతవడికి మూర్ఛిల్లి పడం పడి మూర్ఛదేరి యొడ లెల్లఁ గడిగికొని, కృతస్నానుండై శుచియై శివలింగము నొకదానిని మృత్తికతో నిర్మించి యందు మహేశు ధ్యా నించి కుసుమములతోఁ బూజించెను అట్లతఁడు పూజించి యాసమర్చ ముగియ లేచి చూచునప్పటికిఁ దా నాయారాధనసమయమున శివలింగ ముపై నిడినపుష్పమాలిక యాకిరాతుని శిరమునఁ గానవచ్చెను. అందుల కపు డయ్యర్జునుఁ డచ్చెరువడి సంతోషసముద్రమున మునిఁగినవాఁడై తానింతవఱకు పోరుచుండినవాఁ డీశ్వరుఁడ యని నిశ్చయించి మాయా కిరాతవేషధారి యైనయప్పరమేశ్వరునియడుగులకుఁ బ్రణమిల్లెను. అంతఁ ద్రిపురాంతకుండు ద న్నెంతయు భక్తితో వినుతించునక్కౌంతేయున కత్యంతప్రీతచిత్తుఁడై 'అర్జునా! నీవంటిశూరు లీముల్లోకంబులఁ గాన రారు. నీనిశ్చలభక్తికి మెచ్చితి. తేజస్సునందును నాకు సమానుండవు. మఱియును పూర్వము నీవు నరుఁ డని పేరొ్కనఁబడు మునీంద్రుఁడవు. నీవాంఛితంబుమేరకు నాదివ్యాస్త్రంబు నీ కొసంగెద. దానిం బ్రయోగిం పను; గ్రహింపను నీవ కాని యన్యుం డర్హుం డగునే? దానిమహిమచే నీవు శత్రుపులను జయించుదువు. నీకు నాదేహంబుఁ జూచునిమిత్తము దివ్యనేత్రముల నిచ్చెద.''అని పచించి యాతనికి దేవతలు సదా చూడఁ గోరు తనదివ్యమంగళవిగ్రహము నుమాసహితుండై ప్రత్యక్షంబు గావించె. మఱియు మేఘగంభీర మగువాక్కున నర్జునుని సమాశ్వాసిం పఁగాఁ నర్జునుం డాదివ్యదృష్టిప్రభావంబున నుమాసహితుఁడగు మహా దేవుని వీక్షించి భయభక్తులు పెనంగఁగా, చేతులు రెంటిని జోడించి శిరస్సున నుంచుకొని సాష్టాంగముగా నేలఁబడి మ్రొక్కి లేచి, మరలఁ గేలు మోడ్చి యీశ్వరు నిట్లు వినుతించె. ఓసర్వదేవేశా! భగనేత్ర ధ్వంసీ! నీలకంఠా! జటాధారీ! కారణంబుల కెల్ల కారణంబ వని నేఁ దలంతు. దేవత లందఱు నిన్నుఁ బొందఁగోరుచుందురు. వారికి నీవ గతివి. త్రిలోచనుండవై భూమ్యాకాశమధ్యవర్తివై యుండుదువు. చరాచరాత్మకంబైన యీవస్తుజాల మంతయు నీయం దుండి యుద్భవిల్లి నది. దేవాసురులతోను మానవులతోను నిండియుండుప్రపంచము

నంతయు నీవు జయించినవాఁడవు. బ్రహ్మవిష్ణుశివాత్మకుఁడవు. రుద్ర రూపముతో దక్షాధ్వరధ్వంసంబు గావించినవాఁడవు నీవ. అణువులకంటె నీ వణువ. గురువులకంటె గరిష్ఠుఁడ వీవ. మహానుభావా! నీమహిమను మావంటివారు నుతింపఁగలరా? దేవాదిదేవా! శితికంఠా! కపాలధారీ! శూలపాణీ! ఫాలనేత్రా! ప్రమథగణాధినాథా! భూతేశా! కైలాస వాసీ! ప్రధానపురుషాతీతుఁడవు నీవ. శంకరా! మహేశా! శివా! వృషధ్వజా! చంద్రమౌళీ! మృడ! మృత్యుంజయ! నీస్వరూపంబు నేఁ దెలియలేక, నీతోఁ బోరాడిన బాలిశుఁడను. నన్ను క్షమింపుము. మహాత్మా, ఈఘోరారణ్యంబున నీపర్వతముల నడుమ నీనిర్జనప్రదేశమున నిన్నారాధించి నీదర్శనంబు గావించుకొని కోరిక లీడేర్చుకొనఁగోరి యిందువచ్చితిని. నాయజ్ఞానంబున నిన్ను ధిక్కరించి నీతో సమరమును జల్పితిని. అజ్ఞానకృతములను మన్నింప నీవ యర్హుండవు. నీయండ నన్నుఁ జేర్చి కొనుము. నా కభయదానం బిమ్ము.

> క. మ్రొక్కెదఁ గృప రక్షింపుము
> మ్రొక్కెదఁ గృపతోడఁ జూడుము నిరంతరముఁ
> మ్రొక్కెదఁ గృపఁ గైకొను మే
> దిక్కున సెదిక్కె మాకు దిక్కు శరణ్యా.

ఇట్లు స్తోత్రము చేసి ప్రణామంబులతోడఁ బ్రార్థింప మహాదేవుండు కౌంతేయుఁ గౌఁగిలించి చేయిపట్టుకొని నవ్వుచు మన్నించితి నని యూఱడిల్లఁ బలికి పిదప ని ట్లనియె. పూర్వము నీవు బదరికాశ్రమంబున నారాయణఋషితోఁ గూడి యనేక సహస్రవర్షంబులు తపం బొనర్చిన పురాణమునివి. మీయిద్దఱి తేజంబులు గదా జగంబులు ప్రకాశించుటకుఁ గారణంబులు. దుష్టరాక్షసులను మీ రిద్దఱుఁ జంపి యింద్రునకు స్వర్గాధిపత్యము నొసంగితిరి. అప్పటి ధనుస్సే యిప్పుడు నీచేత వెలయు గాండీవంబు. నామాయచే నీగాండీవమును, నీయక్షయతూణీరంబులును నదృశ్యములైనయవి. నాచేఁ గొట్టఁబడి నొచ్చియున్న నీశరీరక్లేశముఁ బాయుదువుగాక. నీయందు మిక్కిలి ప్రీతిగలవాఁడ నైతి. కోరిన కోర్కు లొసంగెద. వేఁడు మనఁగా నర్జునుఁ డి ట్లనియె.

—అర్జునునకు నీశ్వరుండు పాశుపతాస్త్ర మొసంగుట—

భవానీపతీ! నాయందుఁ గరుణ గల దేని నాకుఁ బాశుపతాస్త్రము నొసంగుము. అదియు, బ్రహ్మశిరోనామకం బను నస్త్రంబును నీచేఁ బ్రయుక్తములై యుగాంతమునందు లోకంబుల నెల్ల భస్మరాశి గావించు. మహాశూరులగు భీష్మద్రోణులతోను, కర్ణదుర్యోధనులతోను, నాకు సంగ్రామంబు పొసఁగ నున్నయది. ఆకడిందివీరుల గెలుచు నిమిత్తము నా కాయస్త్రము మిక్కిలి యావశ్యకంబు. ఇంతేకాక వారికి సహాయులై యనేక రాక్షసపిశాచగంధర్వులు యుద్ధసన్నద్ధులు కాఁగలరు. వారి నెల్లరను జయింపవలయు. నీయస్త్రమును బ్రయోగించినమాత్రమున నందుండి శూలంబులు గదలు మున్నగు నానాయుధములు జనించి శత్రుమర్దనంబుఁ గావించు నని విందు. అప్పరమాస్త్రంబు నొసంగి నన్నుఁ గృతార్థుం జేయుము. మహాత్మా! అదియ నావాంఛితంబు. అనఁగా మృత్యుంజయుండు ధనంజయునితో నిట్లనియె. పరమపవిత్రంబైన పాశుపతంబును నీ కొసఁగెద. దాని యుపక్రమోపసంహారంబులకు నీవ తగుదువు. దిగ్గధిపతు లెవ్వరును దీని నెఱుంగరు. మానవు లెవ్వరును దీని నెఱుంగ రని వేఱుగఁ జెప్పవలయునే? ఆయస్త్రముయొక్క తాఁకుడుచేఁ జావనిప్రాణి వేఱొం డీముల్లోకంబులందు లేదు. తలఁచినప్పు డెల్లఁ దెంపు చేసి దీనినిఁ బ్రయోగింపరాదు. అల్పునిపైఁ బ్రయోగించిన నిది లోకంబులకుఁ జెట్టు సేయు. దీనిని జింతించినను, వీక్షించినను, ధనస్సున సంధించినను నయ్యది యుద్దిష్టకార్యమును నెఱవేర్చు. పవిత్రుఁడవై యేకాగ్రబుద్ధితో దీనియుపదేశమును గొనుము" అనిచెప్పఁగా నర్జునుండు శుచియై పరమేశ్వర సన్నిధానంబున నిలువఁగా బాశుపతాస్త్రముయొక్క ప్రయోగోపసంహారంబులను మంత్రపురస్సరంబుగ మృడుం డర్జునున కుపదేశించెను. ఆ యుపదేశమహిమవలన నస్త్రము సాకారమై యర్జునుని పార్శ్వంబునకు వచ్చి నిలిచె. ఈసమయమున భూమి గడగడ వణంకెను. దెసలు బీఁటలువాఱెను. దేవతలు శంఖము లూఁదిరి. కిన్నరులు పాడిరి. కింపురుషు లాడిరి. పార్వతీపతిమాయచే నదృశ్యంబైన పార్థుని గాండీవంబును, నక్షయతూణీరంబులును మరలఁ బార్థున కొసంగఁబడెను. ఇట్లు ఈశ్వరకృపాకటాక్షవీక్షణంబులకుఁ బాత్రుఁడైన ఫల్గునుం డమిత

తేజోవంతుఁడై విరాజిల్లెను. అంతట నర్జునుండు చూచుచుండఁగనే పార్వతీసహితుండై మహేశ్వరుండు నాపర్వతశిఖరంబువదలి యాకసంబున కెగిరి యదృశ్యుండయ్యె. అర్జునుండు తనపట్టినకార్యము సఫలంబుకాఁగా మనంబున హర్షము జెంది యీశ్వరసందర్శనముచేఁ బావనమూర్తియై పరమేశ్వరగాత్రసంఘర్షణంబుచేఁ బులకితగాత్రుండై, తన్ను సామాన్యులగు మానవులకంటె నధికునిఁగా నెఱింగి, పాశుపతాస్త్రసిద్ధికిఁ గందళితహృదయుండై తన్ను ధన్యునిఁగాఁ దలంచుచు, భీష్మద్రోణాదివీరుల నవలీలఁ గెలుతు నని యుబ్బి, మనోభీష్టంబు పండె నని యపరిమితానందంబున వర్ధిల్లుచుండె.

పదంపడి లోకపాలురగు నింద్రయమవరుణకుబేరులు నిజవాహనారూఢులై దేవీసహితులై యప్పర్వతశిఖరంబున నున్న యప్పార్థునికడ కరుదెంచి వెంటనే యముండు కరుణించి యర్జునునకుఁ దనదండము నొసంగె. వరుణుండు పాశము నిచ్చె. కుబేరుం డంతర్ధానాస్త్రము నుపదేశించె. ఇంద్రుండు పార్థు నుపలాలించి "కుమారా! నీవు దేవకార్యార్థివై భూలోకంబున బ్రహ్మయనుజ్ఞచే నీమానుషావతారం బెత్తినపురాణమునివి. నావెంట స్వర్గంబున కరుగుదెమ్ము; నీకు దివ్యాస్త్రంబు లొసంగెద. ఈయస్త్రములచేఁ బుష్టుఁడవై రాఁగల ఘోరసంగ్రామమున నీవు భీతిల్లక, వసువులయంశంబునఁ బుట్టిన భీష్ముని, భరద్వాజాంశంబున జనించిన ద్రోణుని, భానువంశంబునఁ బుట్టిన కర్ణుని, నివాతకవచు లనురాక్షసులను, మఱియును దేవతలయంశంబునను, దానవుల యంశంబునను జనించి భూమికి భారభూతులైనవారిని పెక్కురను సమరంబున వధింప బలిష్ఠుండవైతివి. వారిని గెలిచి యశంబు సంపాదింపుము. మహాదేవునితో ముష్టాముష్టిగను బాహాబాహిగనుఘోర మహాతపోధనుండ వగు నీకుఁదక్క లాతివారికి నలవియే? కావుననే నీపరాక్రమమునకు సంతసిల్లి యీ లోకపాలుర్షు తమతమదివ్యాయుధంబుల నుపక్రమోపసంహారంబులతో నెఱింగించి నీ కొసంగిరి. మాతలిసారథికంబైన నారథంబు నంపెద. నీవు స్వర్గంబునకు విచ్చేయవలయును" నని యానతిచ్చి యింద్రుండు తనలోకంబునకరిగె. వెంటనే యమవరుణకుబేరులును కిరీటిచే సత్కృతులై తమతమ లోకంబుల కరిగిరి.

## అర్జునుఁ డమరావతి కేఁగుట

అంతట నర్జునుండు తనకు లోకపాలు రొసంగినదివ్యాస్త్రంబులకు సంతుష్టాంతరంగుఁడై, తాను ధన్యుఁడయ్యె నని తలంచుచు నింద్రరథా గమనమునకై నిరీక్షించుచుండ, మాతలిసారథికంబును, శక్తి, గద, వజ్రము, చక్రము, ఖడ్గము మున్నగు యుద్ధోపకరణములతో సమ కూడినదియు,భయంకరమైన సర్పములచే సంరక్షింపఁబడినదియు, బంగారు సొమ్ములతో నలంకరింపఁబడి వైజయంత మను టెక్కెము గలదియు, వాయువేగమును బురడించువేగముతోఁ బరువెత్తఁగల పెక్కులు గుఱ్ఱములు పూన్చినదియు,నాకసంబును నలుదిక్కులను నేమిస్వనంబుచేఁ బూరింపుచు మేఘపటలమును పగులఁదీయునదివోలె మహాఘోషంబు నేయునదియునై, తనసహజకాంతిచే నాకసంబులోని చీఁకటుల నావలికిఁ ద్రోయు బంగారువన్నె గల సుత్రాముురథ మాతనికిఁ గానవచ్చెను. అపు డర్జునుఁ డారథము నొగలపై నున్న మాతలిం గాంచి యాతండు దేవతామూర్తియో యని వితర్కింపుచుండ మాతలి తనరథంబు నంతరిక్షంబున నిలిపి, డిగ్గి భూమిఁ దాఁకక నిలిచి వినయముతో నప్పార్థున కిట్లనియె. సుత్రామసుతుఁడా! పురుహూతుండు స్వర్గలోకమునకు నిన్నుఁ దోడ్కొని రమ్మని యాన తిచ్చి యీరథంబు నంపె. దేవతలు, గంధర్వులు, ఋషిసత్తములు, అప్సరఃస్త్రీలు మున్నగువారితో నిండుకొలువున దేవేంద్రుండు నీరాకకు వేచియున్నవాఁడు. ఇంద్రుని యాజ్ఞచొప్పున స్వర్గలోకమునకు విచ్చేసి యందు దివ్యాస్త్రలాభంబుఁ బడసి, కొన్నాళ్లచ్చటిముచ్చటల ననుభవించి మరల భూలోకంబునకుఁ జేరుమని చెప్పుమనియె. అంత నర్జునుండు "మాతలీ! రాజసూయాదిమహాయజ్ఞంబులొనర్చినరాజర్షిపుంగవులకును నెక్కుటకు దుర్లభంబై తపోబలహీనుల కదృశ్యంబై, తాఁకఁగూడని దగు నీదేవరథంబును మున్ను నీవధిరోహింపుము. ఇంద్రుని యానతిచొప్పునఁ బిదప నేఁ దేరెక్కెద" ననఁగా మాతలి వల్లె యని రథారోహణంబుఁ జేసి గుఱ్ఱములపగ్గములం బట్టి నిలిచెను. అంతఁ గౌంతేయుండు తనకు స్వర్గమును జూడ నబ్బెఁగదా యని యానందాబ్ధిని మునిఁగి, గంగయందు జలకమాడి, శుచియై, వార్చి దేవతలకును బితరులకును దృప్తిగాఁ దర్పణంబు గావించి తొలిలి మందరపర్వ

తంబు వీక్షించి యిట్లనియె. "కొండలఱేఁడా! స్వర్గమును వీక్షింపఁగల మహాత్ములకు సాధువులకు నీ వాశ్రయంబవు. నీయందనేకనదు లుత్పన్నము లగుచున్నవి. వానియందు జలకమాడి, యానిర్మలశీతోదకంబులఁ బానంబు చేసి, నీయం దుద్భవిల్లిన తరులతాదులలోని కుసుమముల పరిమళగంధముల నాఘ్రాణించి మత్తిల్లి మహాదేవు సంకీర్తనంబులఁ బాడుచు, నృత్యంబులు సలుపుచున్న యప్సరస్త్రీలకంఠధ్వనుల చేతను, సదా వేదపాఠంబులధ్వనుల చేతను, వీనులకు విందు సేయు బ్రహ్మర్షిగణంబుల నిష్కపటవార్తలను వినుచు, నీసానువులయందు నేను బహుకాలంబు వినోదంబుతోఁ గ్రీడింపుచుంటి. ఇప్పటికి నా కింద్రునాజ్ఞ యనుల్లంఘనీయంబు గావున స్వర్గంబునకుఁ బోవుచున్నవాఁడ. నాకనుజ్ఞ నిమ్మని మంధరనగంబు వేఁడి యింద్రురథంబు నెక్కఁగా, నయ్యది యాకసంబున నెగసి మనుష్యుల కగోచర మయ్యెను. అంత వియత్తలంబున స్వప్రకాశమున వెలుంగు రాజర్షులయు, రణనిహతు లగు శూరులయు, సిద్ధులయు, దివ్యవిమానంబులను, గుహ్యకులను, గంధర్వులను, నప్సరోగణంబులను వేర్వేఱ మాతలి నడిగి తెలిసికొనుచు వారిదివ్యమహిమల కాశ్చర్యము నొందుచు సిద్ధమార్గమున దేవేంద్రురథంబునఁ బోవుచుండుపార్థుం డమరావతిం దవుదవ్వులం గనియె. దానిబహిర్ద్వారంబున నెత్తైన గోపురం బొకటి దూరమున లోచనముల కుత్సవంబు గావించె. అందు నందనవనములో నప్సరోగణంబులు విచ్చలవిడి విహరింపుచుండిరి. ఆవనమునందలిసరస్సున నయనానందంబుగను, ఘ్రాణేంద్రియతర్పణంబుగను బొల్పారుకమలములును, గల్హారములును, బారిజాతసుమములును, వెలయ నందుండి వీచు నింపుగులుకు చల్లని పిల్లతెమ్మెరల కతఁడు మనస్సున బ్రహ్మానందముం బొందసాగెను. తపస్సుఁ జేయనివారును, నగ్నిహోత్రునియం దాహుతుల వేల్వనివారును, దీర్ఘసేవాపరాఙ్ముఖులును, సుకృతమును జేయనివారును, నియమవ్రతముల నాచరింపనివారును, దాతలుగానివారును, బ్రాహ్మణులయ్యు వేదపాఠరహితులును, యజ్ఞవిఘాతులును, కల్లుద్రావువారును, గురుతల్పగులును, మాంసభక్షకులును, నాప్రదేశంబుఁ జొరలేరు. అయ్యది సిద్ధచారణసేవితంబై యెల్లప్పుడును సర్వర్తుపుష్పములచే విలసిల్లు వృక్షరాజంబులు గలిగి పరమాహ్లాద

ఘున కిర వగు పట్టణరాజంబై యమరావతి నాఁ బేర్కొనంబడి శతమ
ఖుఁడు పాలింప వెలయుచుండెను. అట్టిదాని మహనీయుండైనయర్జు
నుండు రథారూఢుఁడై ప్రవేశించెను. పార్థుండు పురప్రవేశము చేయఁ
గానే కామగమనవిమానములయందు దేవత లింద్రునాజ్ఞ చే నతనికి నెదు
ర్కొలు గావించిరి. దేవతలు మఱికొందఱును, గంధర్వులు, సిద్ధులు,
సాధ్యులు, నప్సరోగణంబులు మంగళోపచారంబు లొనర్చిరి. నారదుఁడు
మున్నగు దేవర్షు లతిథియగు సవ్యసాచికి శుభాశీర్వచనంబు లొసంగిరి. ఇట్లు
దేవతావీథి దాఁటి యమరావతీనగరంబు మొగసాలరథంబు ఫల్గునుండు
డిగి పిదప దేవేంద్రునగరులోని కక్ష్యాంతరంబులు దాఁటి చని,గంధర్వుల
స్తుతులను, విప్రులవేదఘోషములను నాలింపుచు, సిద్ధులు, చారణులు
మరుత్తులు, విశ్వేదేవతలు, అశ్వినులు, ఆదిత్యులు, వసువులు, రుద్రులు,
బ్రహ్మర్షులు, రాజర్షులు నిండుకొలువున నుండఁ దెల్లనిగొడుగు, వింజామ
రులు మున్నగు వివిధోపచారములతో వెలయుచుఁ బెద్దకొలువున సుధ
ర్మ యనుతనసభలో సుఖాసీనుండై యున్న శునాసీరుం జేరి సవ్యసాచి
సాష్టాంగప్రణామంబుఁ జేసె. అంత నద్దేవదేవుండు ఫల్గునుంగ్రుచ్చి యెత్తి
యాలింగనంబునేసి సమీపంబునకుఁ జేరఁదీసి తొడపై నిడుకొని, శిరంబు
మూర్కొని, తనతోడ సింహాసనంబునఁ గూర్చుండఁ బెట్టుకొనియె. తనయ
నుంగుఁబుత్త్రుం డగునాధనంజయుని, పాకశాసనుండు మాటిమాటికిం
జూచుచు, వానియందంబును, నాయతబాహుద్వయమును, దివ్యదేహం
బును గన్నులారఁ దనియఁజూచి స్పృశింపుచు నానందాబ్ధి నోలలాడుచుండె.
శుక్లపక్ష చతుర్దశినాఁడు దివంబు నలంకరించుసూర్యచంద్రులపగిది సింహా
సనాధిష్ఠితు లగు నింద్రార్జునులయెదుట నారదుఁడు వీణ వాయించెను.
తుంబురుండు పాట పాడెను. అప్సరోగణంబులు నృత్యమును సలిపిరి.
గంధర్వులు గానము గావించిరి. అట దేవగంధర్వాదులు సురేంద్రుకను
సన్న ఫల్గునున కర్ఘ్యపాద్యాదుల నొసంగి యొక్క రమ్యమైన విడిది
గృహంబుఁ జేర్చిరి. కుంతీపుత్త్రుండును, స్వర్గంబునఁ గ్రమంబున సకలా
స్త్రములయొక్క ప్రయోగోపసంహారముల నింద్రువలనం గ్రహించి తన
యన్నలం దమ్ములం దలంచుచు నింద్రునియుత్తరువుచొప్పునఁ దనకు సక
లోపచారములు జరుగుచుండ స్వర్గంబున నైదేండులు గడపె. అప్పు

డొక్కనాఁ డింద్రుం డర్జునుం జూచి, 'పుత్త్రా! భూలోకంబున లేని దివ్య గానంబును, నృత్యంబును, జిత్రసేనుం డను గంధర్వునివలన నేర్చికొను' మని చిత్రసేనుని నియోగింప, నాచిత్రసేనార్జునులిరువురును పరమమైత్త్రిం జరించి చిత్రసేనునివలన యథాశాస్త్రముగ నయ్యర్జునుఁడు నృత్యవాద్య గీతముల నేర్చియు, దుర్యోధనాదిదుష్టచతుష్టయదుష్కృతంబులఁ దలపోయుచు, నన్నదమ్ముల వనవాసంబునకుఁ జింతిల్లుచుఁ దల్లి నెడబాసియుంటకు రోయుచు, స్వర్గమునం దుండుట కంతగ సంతోషింపకుండె.

అంత నొక్కనాఁడు దేవేంద్రుండు చిత్రసేనుం జూచి యిట్లనియె. గంధర్వపతీ! పార్థున కూర్వశియందు మనంబు తగులంబు గలిగినట్లూహించెద. ఊర్వశిని బార్థమనోరథంబు తీర్చుటకు నియోగింపుము. అస్త్రముల నెల్ల గ్రహించిన ఫల్గునుండు కొంతకాలము యువతీసంగమమున నుంట మేలు. అనఁగా దేవేంద్రునాజ్ఞఁ గొని చిత్రసేనుఁ డూర్వశి పాలికిం బోయి యాపాకశాసనునిశాసనం బావరారోహకుం దెలుపుచు నిట్లనియె. ఊర్వశీ! కుంతీనందనుం డర్జునుఁ డిన్నాళ్లు దేవలోకంబున నుండి సకలాస్త్రవేది యయ్యె. అధీతవేదశాస్త్రమర్మజ్ఞుఁడు, భూలోక దేవలోకములలో విఖ్యాతపురుషుం డనఁబరగినవాఁడు, గురువును సేవించి యమిత ప్రజ్ఞను బొందిన మహనీయుండు, శ్రీశీలరూపవ్రతసత్యదమములును, వీర్యతేజశ్శాంతినైపుణ్యాదీర్ఘసూత్రతాప్రియోక్తసత్యవచనములు వానిని సదా యనుసరించియుండు. ఆపుణ్యమూర్తి మాత్సర్యరహితుండు, అహంకారదూరుండు, ఆత్మస్తుతివిముఖుండు, మిత్త్రులను బెద్దలను దద్దయు నర్చించువాఁడు, మానవులు ప్రవేశించుట కలవి కాని యీలోకంబును దనతపోమహిమచేఁ బ్రవేశించి దేవదేవునకు బాసటయై యుండువాఁడు. వనితల నాకర్షించునవమన్మథాకారుండు కాన వాని చెంతఁ గొంతఁ జేరి వానిమనస్సును సుఖాబ్ధి నోలలాడించునది. అని చెప్పఁగా నూర్వశి యొయ్యారంబు మెఱయఁ బైట సైరించి మందస్మిత మొనర్చి, 'చిత్రసేనా! గంధర్వరాజా! నీచెప్పినగుణము లెల్ల నవ్వార్థివపుత్త్రునొద్ద నునికి యే నెఱుంగుదు. సకలసద్గుణరాశి యగునట్టి సుకుమారుని వరింపక లాఁతివాని వరింతునే? పాకశాసనునినియోగమునను, నీవంటివానిప్రేరణమునను, మహనీయుం డగుపార్థగుణసముదయ్యం

ఘనను మన్మథబాణజాలములకు గుఱిసైనైతి. పురుహూతునాజ్ఞను శిరసా వహించి యటు గావించెద ననఁగా చిత్రసేనుండు ధన్యుఁడై తా వచ్చినకార్యము సఫలమయ్యె నని సంతసించుచుఁ జనియె.

## ఊర్వశి యర్జునునొద్దకుఁ బోవుట

పిదప నొకనాఁటిసాయంసమయమున నామచ్చకంటి యర్జునుం జేరు మనంబుతో జలకమాడి మెఱుంగు లీనునూతనవస్త్రముల నలంకరించుకొని, నొసటఁ గస్తూరితిలకంబు దిద్ది, సుగంధం బలంది, సర్వభూషణములం దాల్చి, నెత్తావి వెదఁజల్లుపూలసరులం దురిమి, కోమలమగు పాన్పుఁ జేరి, మన్మథుబాణంబులచేఁ గొట్టఁబడి, మనస్సునందుఁ బార్థు గవయ గమకించియుండ, రాత్రి యగుటం జేసి యుదయాద్రిఁ జంద్రుండు దోతెంచెను. స్వర్గ మంతయుఁ బిండారఁ బోసినట్లు నిండువెన్నెల లెల్లెడల నెఱయఁజొచ్చెను. విరహిణీస్త్రీల బాధించుటకు మారుండు పూల బాణంబులఁ జెఱకువింటియందు వేవేగ సంధింపుచుండెను. అపుడాయూర్వశి యగ్గలంబగు వలపు సైపలేక యెట్టకేలకు మనంబు కుదుటఁ బఱచుకొని యర్జును సదనంబుఁ జేర గమకించి, తనవిడిదిఁ బాసి యమరావతీవీథులం బడిపోవుచు నాకసంబునఁ దేజరిల్లుచుండుచంద్రునిఁ దనమోమునందమ్ముచేఁ జీరునదియుం బోలెఁ గనుబొమల మాటిమాటికి నెగుర వేయుచుఁ, దనలోఁ దాను సరసంపుమాటల నాడుచు,శృంగారంపులీలలఁ జేతులుసాచుచు, నల్పముగఁ ద్రావినతేనె సువాసన నలుదిక్కుల గుబులుకొనఁ జొక్కపునడతోఁ దళుకుం బుక్కాగుమగుమలు తట్టుపునుఁగు గుబులు నల్గడల నిండఁ, బైటసవరింపుచు, గజ్జెలయొడ్డాణంబు నడుమున విరాజిల్ల, నిండుతావుల వెదఁజల్లుపుష్పములతో నలంకరింపఁబడినసింగారపుకీల్జడ వీపు రాయ, పాదంబులయందలి యందెలు గల్లుగల్లు మన, మెల్లనినడకతో నువ్విళ్లూరుకోర్కు లప్పటప్పటికిఁబై కెగయుచుండ, నర్జునునివిడిదిం జేరి యావలపుకానిం గనుంగొనుటయు నంత నూర్వశిరాక కదిరిపడి పార్థుండు తనయాసనంబుననుండి దిగ్గనలేచి యెదుర్కొని యాచిన్నెలదాని యడుగులకు మ్రొక్కి గురుభావంబునఁ బూజించి "దేవి!

నీరాకనుం గతం బేమి? నేను మీదాసుండ నేమి చేయవలయు?" ననవిని యూర్వశి యదురుపాటున నతని కిట్లనియె.

అయ్యా! ఇంద్రునియనుమతింగొని చిత్రసేనుండు నాతోఁ దెల్పిన వృత్తాంతంబు నీకు విన్నవించెదను. సావధానుండవై వినుము. నీవు స్వర్గమునకు వచ్చుటంజేసి నీవినోదార్థంబు మహోత్సవంబులు జరుగుచున్నయవి గాదే! ఆయుత్సవములను వీక్షించుటకు దేవేంద్రుండు పిలువంగా దేవతలు, దేవర్షులు, బ్రహ్మర్షులునుజేర, గంధర్వులు వీణవాయించిరిగదా! అప్సరసలు నృత్యము చేసిరిగదా! అట్టిసమయంబున నీవు రెప్ప వాల్పక నన్నుఁ జూచుచుంటంజేసి నీకు నాపైఁ దగులుగలదని యూహించి స్వర్గాధిపతి నిన్ను మన్మథుకేళిం దనియ సౌఖ్యించుటకు నన్నుఁ బనిచెనఁట. నేనును నిన్నుఁ గన్నులారఁ జూచి యున్నదాన. నీగుణంబుల వినియున్నదాన. నీపై వలపు గొనియున్నదాన. కావున నిపుడు గూడి మనసిజాకేళిం దనివి తీర నీయొద్ద కేతెంచితి. నాకుం బ్రియంబుగా నీకార్యంబునందు సాయపడి సుఖం బనుభవింపుము." అనఁగా నర్జునుండు సిగ్గునఁ జెవులు మూసికొని "హరి హరీ" యని దాని కిట్లనియె. "తల్లీ, నీ విట్లాడుట దగదు. నీవు నాకుఁ గుంతీశచీదేవులవంటిదానవు. మిక్కిలి పూజ్యురాలవు. మావంశమునకు మూలపురుషుండగు పురూరవునకు నీవు భార్యవగుటంజేసి నీయందలిగౌరవబుద్ధితో మాకుఁదల్లివని పూజ్యభావంబుచేఁ బలుమారులునాచూపులను మీపైకిఁ బ్రసరింపఁజేయుచుంటిఁగాని మనంబున నన్యభావంబునఁ గానేరదు. ఇట్టిసూచనలు గల యోచనలను మనస్సునకు రానీయకుము." అని చెప్పఁగా నూర్వశి యిట్లనియె. "విజయా! మేము దేవలోకమునందలివారాంగనలము. భూలోకమున ననేకపుణ్యకార్యములను జేసి స్వర్గమును సాధించినమహనీయులకు ననేకోపచారములం గావించి వారిని సంతసింపఁజేయుచుంట మాకు విధ్యుక్తధర్మము. స్వర్గమునందు వావివరుసలు లేవు. ఇచ్చోటిధర్మ మిట్టిది. పూరువంశమున జనించినరాజు లెందఱో సుకృతులై స్వర్గముఁ జేరి నాతోఁ గ్రీడించిరి. ఆసంశయములనెల్ల విడనాడి నన్నుఁ బొంది విహరింపుము. కందర్పునిబాణనుండి నన్నుఁ దొలఁగించి నాయభీష్టమును దీర్చి నన్నేలుము. నేను నీయధీనురాల." అన్నమాటల నర్జునుం డాలకించి "తల్లీ! నీమా

టులు నిక్కంబు పెద్దలును మహనీయులును నగు వారిచేఁతలకుదోషము బులేదు. ఇట్టికార్యంబులు నాఁబోటివానికిం దగవు. నలుదెసలు సాక్షులుగా నీతో నాడెద. నీవు నాకుఁ గుంతీశచీదేవుల వోలెఁ దల్లివి. నీయందిట్టియనుచితకార్యం బొనరింప నామనస్సు జాలి గొనుచున్నది. నీవు నాకుం గూర్చుపూజ్యురాలవు. తల్లివి. నీపాదంబులకు మ్రొక్కెదు. మన్నించి నాపైఁ బుత్రవాత్సల్యము నెఱపుము." అని వికారము లెవ్వియు లేక ధైర్యముతో నూర్వశికోరికను నిరాకరించెను.

## ఊర్వశి యర్జునుని నపుంసకుఁ గా శపించుట

అంత నూర్వశి, తనమనోభీష్టంబు నెఱవేఱకపోవుటచే నింతులకు సహజ మగు క్రోధంబునఁ గను లెఱ్ఱ చేసికొని, రోషంబున నర్జునున కిట్లనియె. "అయ్యా! నేను వనితను. అందును బరాధీనురాలను గాని వార కాంతను. నేనై నిన్ను వలచితిని. నన్నుఁ జుల్కనసేసితివి. నావలపును నిరాకరించితి. న న్నేల నంటివి. ఇందులకు బదులు నీ కీ శాపం బొసంగుదాన. నీవు మానరహితుఁడవై స్త్రీలమధ్యమునఁ గన్యల కాటపాటలనేర్పుచుఁ బేడివై యుందువుగాక!" యని రూక్షవీక్షణంబులతోఁ బెదవు లదరఁ బలికి గిఱుక్కనం దిరిగి తనయునికిపట్టున కేఁగెను. అంత నారాత్రియంతయు నర్జునుం డెట్లో కడపి, వేకువను దను సేవింపఁ జిత్రసేనుండు రాఁగా వానితో నూర్వశిరాకయు, దానిమనోరథంబు విఫలం బగుటయు, నందుల కాయచ్చరలేను తన్ను నపుంసకుఁ డగునట్లు శపించుటయు మున్నగువృత్తాంతముల నెల్లఁ బూసగ్రుచ్చినట్లు వచింపఁ,జిత్రసేనుండు సమాచారము నంతయును సురపతికి నివేదించెను. పిదప నాఖండలుం డర్జునుం జేరి "వత్సా! నీధైర్యంబునకును, నియతికిన్ని మెచ్చితిని. ఇంత నిశ్చలుండ వని నే నెఱుంగ నైతి. నిన్నుఁ గని కుంతీదేవి జన్మసాఫల్య మందినది. మహర్షులందును నిట్టి మనోధైర్యము గలవా రరుదు. ఊర్వశిశాపంబునకు భీతిల్ల వలదు. నీకు నొక యేఁ డజ్ఞాతవాసంబు చేయవలసియున్నయది. ఆ కాలమునం దొరులు నిన్నెఱుంగకుండుటకై యీనపుంసకత్వము నప్పు డనుభవింపుము. ఇదియు మేలు సేయును. ఒక్కయేఁ డీశాపం బనుభవించి పిదప బాసిం బాయు

దువు" అనఁగా సవ్యసాచి యింద్రు పలుకులకు సంతసిల్లెను. తదనంతరంబు చిత్రసేనునితో నిష్టగోష్ఠిని జేయుచు నాకలోకసౌఖ్యంబు ననుభవింపు చుండె. "ఈయుపాఖ్యానంబు విన్నవారు మన్మథుబారిం బడరు. రాగ-ద్వేషములనుండి ముక్తు లగుదురు. నాకలోకంబుఁ గాంతురు" అని వైశంపాయనుండు జనమేజయునకుఁ జెప్పి మఱియు నిట్లనియె.

జనమేజయా ! అవధరింపుము. నాకలోకసుఖంబు నీముత్తాత తండ్రి యనుభవింపుచుండ నచ్చోటికి లోకముల నెల్లఁ దిరుగుచుండు రోమశుం డను మునీంద్రుండు విచ్చేసెను. ఆసంయమీంద్రుం డర్జునుండు దేవసభలోఁ బురందరునితో సమానుఁడై సింహాసనార్థంబున నాసీనుండై యుండఁ గాంచి, యర్జునునితపోమహిమ కచ్చెరువడి వీక్షింపుచు మనస్సున నిట్లు వితర్కింపుచుండె. ఇతం డెంత తపం బొనర్చెనో? కాకున్న గొప్పదైన యీపదవిని సాధింపఁ గలుగునే ? యని తలంచుచుండ నమ్మహామునిహృదయం బెఱింగి దేవేంద్రుండు ముసిముసినగవును నగుచు నాతని కిట్లనియె.

"మునీంద్రా! ఆలోచింప వలదు. ఈతండు కేవల మనుజుఁడు కాఁడు. పూర్వభవంబున నీతండు నరుం డని పేర్కొనఁబడిన పగమ మునీంద్రుండు. ఈఋషీశ్వరుండు నారాయణఋషిసమేతుండై పెక్కు వేలేండ్లు బదరికావనంబునఁ దపంబు గావించియుండె. సగరపుత్త్రుల భస్మీభూతులఁ జేసినకపిలుండు. పరజన్మమున నారాయణఋషియై ప్రర్తిల్లె. వీరిరువురును లోకానుగ్రహముకొఱకు జన్మము లెత్తుచు దుష్టులను శిక్షించుచు, శిష్టులఁ బూజింపుచు బ్రహ్మాయనుమతిననుసరించి ప్రర్తిల్లుదురు. ఈకాలంబున వారిరువురును భూలోకభారంబుఁ దగ్గించుటకై యవతరించియున్నారు. నారాయణుం డిపుడు దేవకీవసుదేవులకుఁ బుత్త్రుండై యాదవులలో జనించి వాసుదేవుఁ డను పేరఁ బరగుచున్నవాఁడు. నరుఁడు కుంతీదేవిగర్భమున నాయంశమునం డర్జునుఁడై జనించెను. ఆ నరుండే యీతండు నాయర్ధాసనాసీనుండై యున్నవాఁడు. పాతాళంబున నివాతకవచు లను దానవులు పొగరెక్కి దేవతల కెల్లప్పు డహితంబు నాచరింపుచున్నవారు. నారాయణునిదృష్టిమాత్రమున వా రెల్లరును నశించువారైనను, నీయల్పకార్యంబున కామహానీయు నేల నియో

గ్రింపవలయు ననీ, యితని నప్పనినిమిత్త మిటకు రావించితి. వా రెల్లరును నీమహానీయునిచేఁ జచ్చువారు. నీవు భూలోకంబునకుం జని కామ్యక వనంబున నుండు ధర్మజుం గాంచి యర్జునుని క్షేమంబు సెప్పి యాతండు దివ్యాస్త్రములను బడసినవృత్తాంత మంతయు నాతనికి వినిపింపుము. భీష్మద్రోణాదులు దుర్యోధనునకు సమరంబున బాసటయై నిలిచినను, వారిని నర్జునుండు సాధింపఁ గలఁ డనుము. నాకలోకమునం దర్జునుండు నృత్తగీతాదుల నేర్చుచు సుఖ మున్న వాఁ డనుము. వానియెడ వంత లేకుండు మనుము. మఱియును ధర్మజుఁ దీర్థసేవకుం బురికొల్పుము. అద్దాన మనోరథం బీడేఱును. దుస్సాధ్యప్రదేశంబులయందు రక్షోఘ్న మంత్రముల జపించు రాక్షసులచే వారి కపాయంబులు గలుగనీయక వారివెంబడి నీవును సకలతీర్థములయందుఁ గ్రుమ్మఱుచుండుము. ఆయా తీర్థములయందుఁ బాండవులచేఁ దగినదానములఁ జేయింపుము" అనఁగా రోమశుం డింద్రునాజ్ఞ శిరసా వహించి ధర్మజుపాలికి భూలోకంబున కరిగె నని వైశంపాయనుండు జనమేజయునకుఁ జెప్పఁగా నారాజ చంద్రుం డత్యద్భుతావహంబైన మామున్తాతతండ్రియస్త్రలాభంబును ధృతరాష్ట్రుండు వినియెనా? విని యందుల కమర్షంబుఁ బొందెనా? వగచెనా? సంతసించెనా? యని యడుగ జనమేజయునకు వైశంపా యనుం డిట్లు చెప్పఁదొడంగెను.

## అర్జును నస్త్రలాభంబు విని ధృతరాష్ట్రుండు దుఃఖించుట

హస్తినాపురంబున నున్నధృతరాష్ట్రుని వేదవ్యాసుం డొక్కనాఁడు సందర్శించి యాతనితో నర్జునుండు నాకంబున కేఁగుటయు, దివ్యాస్త్రం బులఁ బడయుటయుఁ జెప్పఁగా ధృతరాష్ట్రుండు విని సంజయుం బిలిచి, "సూతపుత్రా! వినుము. అర్జునుండు నాకలోకంబున కేఁగి దివ్యాస్త్రంబులఁ బడసెనఁట. నీవును దీని వినియుందువు. సుయోధనుని పాపబుద్ధిచే నెంత కీడు మూఁడ నున్నదో యెవ్వ రెఱుంగుదురు? ప్రజల కెట్టి యాపదలు రా నున్నవో తెలియరాదు. ఆలకింపుము. ధర్మజుఁడు నవ్వులాటలకుఁ గాని, పరిహాసమునకుఁ గాని యసత్యమాడ నేరఁడు. అట్టి మహావ్రతునకు ధర్మపరునకు ధనంజయుండు సహాయుండై నిలువ వానికి

ముల్లోకములును వశములు గాకయుండునా? ఆసవ్యసాచి యక్షయతూ ణీరంబులలోని బాణంబుల గాండీవంబున సంధించి శత్రువులపైఁ బ్రయో గింప సాగినచో వాని కీరేడులోకములయందు నెదుర్కొనువార లిత రులు గలరే? భీష్మద్రోణకర్ణులు బలపరాక్రమశాలురు. వాని నెదుర్కొను శక్తిగలవారయ్యును వాని గెలువ లేరు. ఖాండవవనదహనకాలము నందుఁ జూపఁబడిన వానియమానుషశక్తి నేమనవచ్చు? ఇంద్రునంతటి వాఁడు వారించినను వాఁడు నిలువం డయ్యె. ధర్మరాజుచే రాజసూయ యాగం బుపక్రమింపఁజేసి పుడమిఁ గలరాజుల నెల్ల వైశ్యులఁ బోలె వశ్యులఁగావించికొనియె. నాఁ డాఖండలునస్త్రాయుధమునకుం దప్పిన కొండలయినను గొన్నిలోకంబుల నచ్చటచ్చటఁ గాన్పించునుగాని వాని బాణంబులబారిం బడి మడియక బ్రతికినవారు లేరు. వానిరథధ్వనియే కౌరవులగుండెలను జల్లు మనిపించును. వేసవికాలమునందలి సూర్యకిరణ ములు సకలజంతువులఁ దపింపఁ జేయునట్లు వాని వాఁడిబాణంబులు నాకొడుకులఁ దపింపఁజేయుట యాశ్చర్యమా! వాఁడు జగత్సంహార నిమిత్తముగనే బ్రహ్మదేవునిచే సృజింపఁబడెనేమో! దుష్టాత్ము లగు దుర్యో ధనాదులు కాలవశంవదులు మృత్యుముఖము నీకఁజొచ్చినవారే! ఏమి చేయవచ్చును?నాకిఁక దిక్కెవ్వరు? అనివందురుచుండఁగా సంజయుం డిట్ల నియె. "నరేంద్రా! నీమాటలు సత్యంబులు. ఆనాఁడు ద్రౌపదిని గొప్పు వట్టుకొని సభలోనికీడ్చి తెచ్చి యనరానిమర్మభాషల నాడుటం జేసి దుర్యో ధనదుశ్శాసనకర్ణాదులపై వారు కినుకఁ బూనియుండుట యనృతంబు కాదు. అర్జునునిపరాక్రమ మరయఁగోరి యీశ్వరుండు కిరాతవేషంబుఁ దాల్చి రాఁగా తనతపోమాహాత్మ్యంబున విజృంభించి శూలపాణితోఁ బోర నద్దేవుండు మనయర్జునుని ధైర్యసాహసంబులకు, శౌర్యంబునకు మెచ్చి తనపాశుపతంబు నిచ్చె. ఇంద్రుండు మున్నగులోకపాలు రెల్లరును వాని తపస్సునకు సంతసించి తమతమయస్త్రంబులను దివ్యంబులైనవాని, వాని కొసంగిరి. అట్లు మహనీయదివ్యాస్త్రసమన్వితుండైనవానిం గెలుచు టేరితరము? మఱియును జూదంబునాఁడు దుర్యోధనుండు పోతరించి ద్రౌపదిని సన్నసేసి తొడలు సూప వానిం భీమసేనుండు దూరంబున నుండి చూచుచు నగ్రజుధర్మపాశబద్ధుండై యప్పు డేమియుఁ జేయలేక

ప్రసమూఁడేఁడులసమయము తీఱినవెంటనే తనగదచే సుయోధనుతొడలు తెగవేయువాఁడ నని ప్రతిన నట్టియుండు టంద ఱెఱింగినదేగదా. వారందఱు శూరులు. తపోబలసంపన్నులు. ధర్మపాశబద్ధులు. నీపుత్త్రుల యెడఁ గడుఁ గనలియున్నవారు. నీపుత్త్రులందఱును వారిని మార్కొని కదనంబున మడియఁ గలరని తలంచెద" ననగాఁ బుట్టుగ్రుడ్డి సంజయునకు మఱియు ని ట్లనియె. "సంజయా, దుర్వాగ్వృఁబలుకులాడుట యటుండ నిమ్ము. నాఁడు ద్రౌపదిని సభ కీడ్చినదియే యతిఘోరంబు. దాన నేరికి వైరంబు గల్గదు? ఆవైరంబు సాధింప నున్న పాండవులతో నింక నైన సఖ్యంబునేసి యాసుయోధనుఁడు బ్రతుకంగోరుట యుచితము కాదే? వానికంటెయవినీతునే నెందును గని విని యెఱుంగ. నే నెయ్యది హితంబుసెప్పినను వానిని బెడచెవి నిడి నన్ను ముసలియనియు, బుట్టుఁ గ్రుడ్డియనియుఁ, దెలివి లేనివాఁడనియు దుర్భాష లాడి కులంబును గ్రుంకుడువ్రేళ్లతో నుస్మూలింప నున్న శకునియాలోచనంబునం బడి చెడుచున్న వాఁడు. అర్జునుండు బాహాబాహి యుద్ధమున గైలాసనాథుని మెప్పించి, పాశుపతం బనుదివ్యాస్త్రంబుఁ బడసెను. అగ్నికి వాయువు సహాయపడి నట్టులు వానికి జగన్నాథుండును జనార్దనుండు మంత్రి, రక్షకుండు, చెలి కాఁడు నయ్యె నిట్టివాని కజయ్యం బెయ్యది? మఱియును నాగాయుత బలసంపన్నుం డగు భీముండు సదా నాపుత్త్రులయెడఁ గ్రుద్ధుండు. వాని కిట్టిసహాయసంపత్తి గలుగఁగా నాకొడుకులపై కెత్తి విడియకుండునే? దుర్యోధనాదు లగునాపుత్త్రుల కందఱకు మృత్యుముఖప్రవేశం బాసన్న మయ్యె" ననిన విని జనమేజయుండు వైశంపాయనునితో, "మునీంద్రా! పాండవులనరణ్యవాసంబున కనిపి గ్రుడ్డిరాజెంత యేడ్చినను ఫలం బేమి? ప్రప్రథమమునఁ దా జూదమును హరింపఁ డయ్యె. దాన నింత యనర్థంబు వాటిల్లె. అది యట్లుండ నిమ్ము. మాప్రప్రపితామహులు వనవాసంబు సలుపుచుఁ దాముండినవనమునందలి మృగాదులనే యాహారంబులుగాఁ గొనుచుండిరా? అరణ్యమున కృషి సలిపి జీవించుచుండిరా? ఆనతీయవే' యనఁగా నావేదవ్యాసశిష్యుం డమ్మహారాజున కి ట్లనియె.

ధర్మరాజు వనవాసమునకుఁ బోవుచుండ నాతనిని వెంబడించి పదివేవురు విప్రు లరిగి యుండిరి. వీ రెల్లరును భుజించుట కాహారము నిమిత్తమై తాను దూర్పునకు,భీముఁడు దక్షిణమునకు, నకులసహదేవులు పశ్చిమోత్తరములకుం బోయి వేటాడి వన్యమృగంబులను దెచ్చి యందు ముఖ్యముగ చెడు వన్నెలు లేనివి, రోగములు లేనివి, చిక్కకుండునవి యగు లేళ్లను బ్రాహ్మణసమారాధనకై యుపయోగించి మిగిలినవానిని తాము భుజింపుచుండిరి. అట్లుండ నట నర్జునుఁ డింద్రపురికిఁ బోయి నదిమొదలైదేండ్లు గడచినయవి. దాని నటుండ నిమ్ము. ధృతరాష్ట్రునిదుఃఖమును మనోవేదనమును దెలిపెద నవధరింపుము. అమానుషం బగు నర్జునునిపరాక్రమంబును, దపోమహిమను, దివ్యాస్త్రలాభంబును మనస్సునఁ దలంచి తలంచి ధృతరాష్ట్రుం డుమ్మలికం బోవుచు, సంజయునితో నింక నిట్లనియె సంజయా! వినుము. జూదమప్పుడు నాఁటినాపుత్త్రులచెడువర్తనంబుఁ దలంచిన రాత్రిందివములు నొక్కక్షణమైనను నాకుఁ జిత్తశాంతి లేదు. సుయోధనాదు లెల్లఁ దమమే లెఱుంగరు. పాండవు లమానుషవర్తనులు. శౌర్యధైర్యయుతులు. తమలోఁ దమకు భేదకారణం బిసుమంతయేని లేనివారు, తపస్సంపన్నులు, సత్యసంధులు. అట్టివా రేకమై విజృంభించి పోరునకుం గడంగుచో మనవారిమాయలు మంతనంబులు నప్పుడు పనికి రావు. ఇంతేకాక బలరాముండును, వాసుదేవుండును సర్వయాదవులును దోడ్పడుదురు. ఇట్టిసహాయసంపద గలవారు మనపై కెత్తి విడిసినఁ బోరు దుర్భరం బగు. ఇదియంతయు నిపుడు నన్నేచుచున్నది'' యనిన సంజయుం డిట్లనియె. “రాజేంద్రా! తఱి యగునప్పు డుపేక్షించి యిపుడు చింతించుట గతజలసేతుబంధనము నేర్పరి వయ్యును మోహంబునంజేసి పుత్త్రుని వారింప వైతివి. జూదమున నోడి ప్రతిజ్ఞను బరిపాలించునిమిత్తము పాండవులు వనవాసంబుఁ జేయుచుండ వారిపాట్లు యాదవపతి వాసుదేవుండు విని తనవెంట యాదవులం గొందఱం దోడ్కొనివారిం జూడఁ గామ్యకవనమునకుఁ బోయె. వాసుదేవుం డచ్చోటికి వచ్చునప్పటికి ధృష్టద్యుమ్నాదిపాంచాలురును, విరాటకైకయశిశుపాలపుత్త్రాదులును నచ్చోటికి వచ్చియుండిరి. జగన్నాథుం డగు జనార్దనుండు ధర్మరాజాదులవనవాసంబునకు వగచి, నీ

కొడుకులయకృత్యంబునకుఁ గినిసి "ఇపుడె నేను హస్తినాపురంబుపై దాడి వెడలి దుర్యోధనాదిదుష్టచతుష్టయంబును, వారికి సహాయులుగ వచ్చువారల నందఱను వధించి రాజసూయంబునాఁటి సంపదకంటెను మిక్కిలి యెక్కుడైన సంపదను ధర్మరాజున కొసంగెద. ఇప్పుడ సమస్త దేశాధీశులగు రాజులుగొల్వ ధర్మరాజునకు హస్తిపురరాజ్యంబు నభిషేకించెద" నని యచ్చట మూఁగియున్న యనేకక్షత్రియుల సమక్షంబున వెనుదీయక పలికియుండె. వాసుదేవునియప్పటికోపమును ధర్మరాజు శాంతింపఁజేసి "జనార్దనా! నాపదుమూఁడేఁడుల ప్రతిజ్ఞ ముగియఁగనే యిప్పు డన్నమాట నెఱవేర్తువు గాక! అప్పుడు తటస్థ మగు యుద్ధము నందు నీవు పార్థునకు సారథివై మాకు హితంబుగోరుచుండుము. నీరక్షణ గలమా కేనాటికిఁ గొఱంతలేదు" అని సాంత్వనపూర్వకంబుగఁ బ్రార్థింప జనార్దనుండు ధర్మపుత్త్రువచనంబుల మెత్తపడి యట్ల కాక యనెను. అంత నచ్చోఁ జేరినరాజు లందఱు మాధవుండు వినునట్లు ద్రౌపదిం జూచి, "దేవీ! నీయాగ్రహంబునం జేసి దుర్యోధనుండు మీప్రతిజ్ఞా కాలము ముగియఁగనే పోరునం దవశ్యంబు వధింపఁబడు. ఆనాటిసభకు నిన్నీడ్చితెచ్చిన యప్పాపాత్ముకళేబరంబులఁ గాకులు, గ్రద్దలు, తోడేళ్లు మున్నగునవి చీల్చి నెత్తురు ద్రావి మాంసముల భక్షించు. వనవాస కాలము చెల్లవలయును." అని రోషమున నెఱ్ఱవాఱిననేత్రములతో నుడివి రఁట. నీకొడుకునకుఁ బ్రాణంబులపై నాస గలుగు నేని సర్వ సహాయసంపన్ను లగు వారితోడిపోరాటమునకుఁ దలపడఁడు. మృగ రాజుం గదిసినయేనుంగుగుమియుఁ బోలె నీకొడుకులు భీముం జూచి వెనుదీయుదురు." అను సంజయవాక్యముల విన్నైతి. తనంత చేటు వాటిల్లె ననిన జనమేజయుండు వైశంపాయనునితో "మునీంద్రా! పార్థుం డస్త్రగ్రహణార్థము నాకలోకమున కేఁగ నిఁట ధర్మరాజాదు లేమి చేసి రస్సీయదుగ నమ్మునిచంద్రుం డారాజచంద్రున కిట్లనియె.

రాజేంద్రా! వినుము. కిరీటి యావిధమున నాకలోకంబున కస్త్రార్థం బేఁగఁ గొన్నినాళ్లకుఁ బాండవులు నలువురు ద్రౌపదీసమేతులై యావనం బున నొకపచ్చికబయలునం దాసీనులై యుండ వారిలో భీముండు ధర్మపుత్త్రునితో నిట్లనియె. నరేంద్రా! అర్జునుఁ డస్త్రార్థం బరిగి యిప్పటికి

బహుకాలం బయ్యె. వాని క్షేమంబులు తెలియుగావు. వానిబలంబునం
గాదే మనము ధార్తరాష్ట్రుల జయింపవలయును? వాఁడు ధర్మపాశబద్ధుం
డనై నీయానతి జవదాఁట లేక దుర్యోధనాదులఁ బొరిగొన నూరకుంటి.
మఱియు నర్జునశౌర్యంబు రాజ్యప్రాప్తికారణం బని నమ్మి యుందుము.
మన ప్రాణంబులు వానియఱచేతిలోనివి. వాఁడు బ్రదికియున్న పాంచాలు
రకును యాదవులకు జీవనము కలదు. వానిశౌర్యమునే మన మెల్లరము
నమ్మియున్నాము గాదే? మనకు సకలదుఃఖములు నాజూదంబున కాదే
కలిగెను. జనార్దనునిసాహాయ్యంబున మేమిప్పుడ తఱలి శత్రుసంహారంబు
గావించి వచ్చెదము. ప్రతిజ్ఞాతవత్సరములు ముగిసినపిదప నీవు రాజ్యాభి
షిక్తుఁడవు గమ్ము. ఇట్లు జరుపుటచే దోషము కలుగ నేరదు. క్షాత్రధర్మంబె
యియ్యది. మోసగాండ్రను మోసగించియే వధింపవలయును. ముల్లు
ముల్లునఁ గాని దీయరాదు. సామోపాయంబున కిది తగినసమయము.
సాంతపనాదివ్రతాచరణమున నొక్కరేయుంబగలును సంవత్సరసమాన
మగు నని వేదములు సెప్పుచున్నవి. వేదములు నీ కేల ప్రమాణములు
గావు? ఈపక్షము నవలంబించితివేని మున్నెన్నఁడో సమయంబుదీఱెను.
గౌణపక్షావలంబనంబు సరి కాదంటేని యనుకొన్న మేరకు నజ్ఞాతచర్య
దుష్కరంబు. అజ్ఞాతవాసకాలమున గూఢచారుల నేర్పఱచి మనసడి
దుర్యోధనుండు తెలియఁగలఁడు. అట్లు తెలిసినచో మనకు మరల నీ
యరణ్యావాసంబు వదలదు. ఇట్టి చేఁతకుఁ దుది యెయ్యది? క్రమంబున
సమయంబుఁ బూర్తిచేసినను దుర్యోధనుండు మనలను మరల జూదంబు
నకుఁ బిలుచు. నీ వప్పు డట్లాహూతుండవై పోకుండ నేరవు. పోయి జూద
మాడి యోడుదువు. కావున నే నిప్పుడ మనయర్జునుండు రాఁగనే వాని
సాయముంగొని హస్తిపురంబుపై దండెత్తి దుర్యోధనాదిశత్రుసంహారంబు
గావించి వచ్చెద" నని శౌర్యంబున నుద్రేకించి పలుకుభీముని ధర్మజుండు
చేరఁదీసి శిరంబు మూర్కొని, "తమ్ముఁడా! నీవింతటివాఁడవే యగు నే
నెఱుంగుదు. పైని నీ కర్జునుండు సాయపడుచో నగ్నికి వాయువు సాయ
పడిన ట్లగుఁ గాని పరాక్రమమున కిది సమయంబు గాదు. సమయాబ్దం
బులు గడచనినవెనుక మీకు ధార్తరాష్ట్రవధం బేపాటి?" అని
యనునయింపుచుండ బృహదశ్వుం డను మునిచంద్రుండు ధర్మజు సంద

ర్భింప నేతెంచె. అంత నామునిచంద్రునకు రాజశ్రేష్ఠుం డగుధర్మరా జర్ఘ్యపాద్యాదు లిచ్చి యథావిధి నర్చించి యామునిసేద దేర్చెను. బృహదశ్వునకును గొంతవడికి మార్గాయాసంబు దీరియుండ నమ్మునితో ధర్మజుం డిట్లనియె. మునిచంద్రా! మాయర్జునుం డస్త్రార్థంబు తపంబు సేయం బోయె. వాం డిప్పటికి బహుసంవత్సరంబు లయ్యు రాం డయ్యె. వానిరామిచే మే మెల్లరము తేజస్సు తఱిగియున్నవారము. మాప్రాణ ధనంబులు వానిహస్తగతంబులు. ఎన్నండు వానిం జూడం గల్గుదుమో? మఱియు రాజ్యమును గోల్పోయి, బంధువుల వీడి, వనములయందు మృగావలులతోం గలసి, మావలెం గష్టించుకష్టాత్ము లేకాలములందైన నను గలరా? దుష్టాత్ము లగు జూదరులతో జూదమాడి ధనకనకవస్తువాహనంబులను గోల్పోయి, సర్వమహీరాజ్యము నోడి, ధర్మపత్ని యగు ద్రౌపదిని శత్రువులు తలపట్టి యీడ్చుకొని సభ కేతేర సకలావమానంబులను బడిన మావంటివారు లోరు లెందేనియుం గలరే? మీ రట్టి రాజుం గని, వినియుంటిరే?" అను ధర్మరాజునకు బృహదశ్వుం డిట్లనియె. ధర్మరాజా! వినుము. తొల్లి నిషధాధిపతి యగు నలుం డనువాండు సకలమహీరాజ్యంబును జూదమున నోడి భార్యతో నొంటరిగ వనమున బహుబాధలం గుడిచె. అప్పుడు వానికి బంధువులు గాని, యన్నదమ్ములు గాని, భృత్యులు గాని, రథములు గాని యెవ్వియును దోడు లేవయ్యె. నీ వట్లు గాదు. వినుము. నీవెంబడి దేవసమానులగు తమ్ములును, బ్రహ్మర్షు లగువిప్రోత్తములును, భృత్యులును, రథములును నీయరణ్యవాసంబున నీకుం దోడై యుండ నీకు వగవం బని యేమి? "అనిన ధర్మరాజమ్మునీంద్రునిం దనకు నలునిచరిత్రంబు సాంతంబుగ విన్నవింపుమని వేండ నతనికి బృహదశ్వుం డిట్లానతిచ్చె.

## నలోపాఖ్యానము

పూర్వకాలమునందు నిషధ మను దేశమును వీరసేనసుతుండు నలుం డను రాజు యేలుచుండెను. ఆతండు మిక్కిలి రూపవంతుండు. అశ్వశాస్త్రరహస్యములను దెలిసినవాండు. వేదవేదాంగములను లెస్సగాం జదివినవాండు. విలువిద్యయం దాకాలపురాజులలో మేటి. మిక్కిలియూదా

ర్యము గలవాఁడు. యథార్థమును బలుకువాఁడు. జితేంద్రియుఁడు. అతఁడు బ్రహ్మణ్యమూర్తియై యాదిత్యులలో విష్ణువుంబోలె రాజులలో మిక్కిలి తేజస్వియై వెలుంగుచు మనువుమార్గంబునఁ బ్రజలఁ బాలించుచుండె. ఈతని కనేకాక్షౌహిణులసేన గలదు. ఇతఁడు మిక్కిలి శౌర్యవంతుఁడు. బలపరాక్రమశాలి. ఇట్టి నలుఁడు రాజ్యము నేలుచుండఁగా నాకాలముననే విదర్భాధిపుఁడు సుగుణములరాశి భీముం డనువాఁడు బహుకాలము బిడ్డలు లేక చింతిల్లుచుండ నప్పు డొక్కనాఁడు దమనుం డనుమహర్షి భీమునినగరునొచ్చుటయు నారాజు భార్యాసమేతుఁడై యనేకోపచారములను జేయఁగా,నమ్ముని మిక్కిలి సంతుష్టుఁడై యాతని కొకకుమార్తెయు ముగ్వురు కొమాళ్లను గలుగున ట్లనుగ్రహించెను. దమమహర్షి ప్రసాదంబునఁబుట్టినవారు గనుక కొడుకులను దమ, దాంత, దమను లనియుఁ గూఁతును దమయంతి యనియు నతఁడు పేరొ్కని యెను. లేకలేక కలిగినబిడ్డలను భీమరాజును నాతనిభార్యయు నల్లారు ముద్దుగఁ బెంచుచుండిరి. అందుఁ బుత్రికామణి యైన దమయంతి సురసిద్ధసాధ్యకిన్నరగంధర్వమనుష్యులలోని సుందరాంగులకంటె సౌందర్యవతియై సంపద తుల తూఁగ, రూపరేఖావిలాసములు తళుకొత్త, తేజస్సౌభాగ్యములు సంపూర్ణముగఁ దొలుకాడ, వన్నెకత్తెయై, నిండుజవ్వనంపుపొఁడుము లతిశయింప, కోమలవిలాసములఁ జెన్నుమీఱి యెల్లప్పుడు తన్ను నూర్వురు సుందరాంగు లగు చెలికత్తెలు పరివేష్టించి కొలువ విలాసవతియై, విహరింపుచు నిషధేశ్వరుం డగునలునిరూపరేఖావిలాసంబులను, సద్గుణంబులను విని వానియం దనురక్త యయ్యె. ఇవ్విధంబున దమయంతియత్యంతకాంతిరూపాభిజాత్యవిమలగుణసమృద్ధులను నలుండు విని దానియందె బద్ధానురాగుఁడయ్యె. ఇ ట్లయ్యిరువురకును బరస్పరానురాగంబు వర్ధిల్లుచుండ నలుండు దమయంతీగుణబద్ధచేతస్కుండై యాయిందువదన తన కబ్బువిధంబు నాలోచింపుచు, దానియందలితమకంబున నేమియుఁ దోఁపక తనయంతిపురమునకు సమీపమున నున్నప్రమదావనంబున విహరింపుచు నేకాంతంబున నుండ నాకాశలక్ష్మియొక్క హారమో యన్నట్లు బంగారుహంసలసమూహ మాకసమునుండి భూప్రదేశమున వాలి నలునియుద్యానవనంబున మెలంగు

చుండె. అంత నవ్వీరసేనసుతుం డా బంగారుహంసలనడ బెడంగును జూచి మెచ్చి పొంచియుండి వానిలో నొక్క రాజమరాళము నెగుర లేనిదాని నతివేగముగఁ జేఁ జిక్కించుకొనియెను. ఆహంస యిట్లు నలునిచేఁ బట్టువడి, యా రాజు తన్నేమి చేయునో యని వెఱచి దీనాననయై మనుష్యవాక్కులతో నిట్లనియె. "రాజా! నే నల్పజంతువను. నామాంసంబు నీ కేపాటిది ? ఒకవేళ నాబంగారు వెండ్రుకల కాసపడితి వేని చక్రవర్తివగు నీ కిది యొకలక్ష్యమునఁ జెరినది కానేరదు. నావృత్తాంతంబు వినుము. నేను నాతల్లి కొకేపిల్లను. నసుఁ గన్నతల్లి కన్నులు కానరానిముసలిది. భార్య గ్రుడ్ల నిడి పొదుగ నున్న యది. కావున మాతల్లిదండ్రులకు నాహారసంపాదనార్థము నే నిటకు వచ్చితి. నే నెఱ్ఱ గ్గొనిపత్తునని నా కెదురుచూచు నాపిల్ల లాఁకట నలమటఁ గొని యుందురు. ఇట్టిసంసారి నైననన్నుఁ గరుణించి విడువుము. వధింపకుము. నేను సకాలమునకు బోవకున్నచో ముసలిది యగు తల్లియుఁ బతివ్రత యగు నాయిల్లాలును, బసికూన లగు పిల్లలును నిందఱును మ్రందుదురు. నాయొక్కనిపై నింద ఱాధారపడియున్నారు. తోడిహంస లెల్ల నన్ను విడిచి పోలేక యాకసంబున గాలిచే నెగురఁ గొట్టఁబడిన తెల్లనిమబ్బుతునుకలవలె నిటటు పఱచుచున్నయవి. నన్ను విడువుము. నీమనోవేదనం బాపెదను. నీవు భీమరాజపుత్త్రిక దమయంతి యనుదానిపై వలఁపుగొనియున్నావు. నీవు నన్ను వదలుచో నే నా యిందువదనను సమీపించి నెయ్యంపుమాట లాడి నీగుణంబులు దానికి వర్ణించి యక్కన్య యన్యుల నపేక్షింపక నీయంద కూర్మిగలిగి యుండఁజేసెద." అనిన విని హంసపలుకులు తనహృదయంబున కాకస్మికామృతధారాపాతంబు వోలె నైన, నమ్మహీకాంతుం డెంతయు సంతస మంది దానిని విడిచిపుచ్చె. అట్లు హంస విడువఁబడి తనతోడిరాయంచలతోఁగూడఁగా నవియెల్ల నుప్పరంబున నెగసి పోఁజు తీరి వేగమ విదర్భను జేరి యం దుపవనంబున సురసిద్ధకన్యలట్టిసఖులతోఁ గూడియున్న దమయంతిసమీపంబున నడయాడుచుండ వానిపసిండివన్నెను చెలువంబును జూచి పరమకౌతుకంబున నొక్కొక్కసఖిమణి యొక్కొక్క హంసను బట్టికొనెను. వానిలో నలుచేత విడువఁబడినహంస దమ

యంతిచేఁ బట్టువడియెను. ఇట్లు నలదమయంతులకు సంగమకారణ మగు కలహంస యింపగుమనుష్యవాక్కులతో దమయంతి కల్లన యిట్లనియె. 'దేవీ! నేను నీహృదయేశ్వరుం డగు నలమహారాజు నొద్దనుండి వచ్చినవాన. ఈభూలోకంబున నేను జూడనిరాజు లెవ్వరును లేరు. సర్వగుణసౌందర్యముల నలు నెవ్వరుం బోలరు. ఆరాజ చంద్రుం డశ్వినులపోలెసుందరాకారుండు. దేవసమానుండు. నీవా రాజు నకు దేవివైనఁగాక నీరూపకాంతివిభవసౌభాగ్యభద్రలక్షణములు వ్యర్థములు. నీవు నారీరత్నంబవు. ఆతండు పురుషరత్నంబు. మీయిద్దఱకల యిక యన్యోన్యశోభాకరంబు. అనిన విని దమయంతి మిక్కిలి సంతసిల్లి యామరాళంబు గారవించి దాని కిట్లనియె. 'రాజహంసమా, నాహృదయేశ్వరుండయిన యారాజుగుణములు నా కెఱింగించినటులు నన్ను నారాజున కెఱింగించి దయచూపుము. ఇంత మేలొనఁగూర్చి పుణ్యముఁ గట్టికొనుము. అని హంసను వదలెను. అంత మరాళంబును నిషధదేశమునకుంబోయి వీరసేనసుతునితో దమయంతిగుణరూపవిభవముల నన్నిటిని బూసఁగూర్చినట్లు చెప్పెను. ఇట్లు నలదమయంతు లిరువురు నన్యోన్యరూపగుణములను వినుటచే నొకరిపైనొకరు మరులుగొని మన్మథుని బాణంబులచేఁ గొట్టఁబడి రేలుంబగళ్లును బ్రొద్దుపోక తీరనిమనోవేదనం బడుచుండిరి. అందు దమయంతి నలునిపై వల పతిశయింప వాని నెప్పుడు కూడఁ గల్గుదునా యని మనోవేదనం బడుచు వివర్ణవదనయై, వేఁడినిట్టూర్పులు పుచ్చుచుఁ గంటికి కూరుకు రాక, యాహారంబు భుజింపక, కృశించుటను సఖీజను లెల్ల రెఱింగి యకార్యమువృత్తాంతం బంతయు భీమున కిట్లని చెప్పిరి. రాజేంద్రా! కొన్నిదినముల క్రిందట మనయుద్యానమున మేమును, దమయంతియు విలాసంబునఁ దిరుగుచుండ నక్కడకుఁ గొన్నిహంస లేతెంచినవి. వానిలో నొక్కదాన్నిని దమయంతి పట్టుకొనఁగా నయ్యది, దమయంతితోఁ దా ననేకరాజులఁ జూచినట్లును వారియందఱిలో నలుం బోలువా రెవ్వరు లేరనియుఁ వానిఁ జేపట్టినచో, నీవు ధన్యురాల వగుదు వనియుఁ దెల్పఁ దన్ను నలమహారాజు వలఁచునట్లొనర్చుట కాహంసనే దమయంతికోరెను. ఆహంస యందులకియ్యకొని యాకసంబున నెగిరిపోయెను. అప్పటినుండి దమయంతి

యూహాంసధోరణయందుఁబడి యెల్లప్పుడునుదానిపలుకులనేగణియింపుచు
నది పోయినదారినే చూచుచు నుండె. సఖులముగుమాతో ముచ్చట
లాడదు. ప్రతిదినంబు నలయుచు నుండును. మేలైనతొడవులఁ దొడు
గదు. ఆహారమును భుజింపదు. నిదురింపదు. భోగము లొల్లదు. ఓర్పు
వట్టదు. నలుఁ డను రాజునే ధ్యానింపుచుండును. ఇఁక నెంతటివారిఁ జెప్పి
నను విన నొల్లదు. అనఁగా భీమరాజు దమయంతీస్వయంవరమును జాటిం
చుట కదియ సమయ మని తలంచి, భూలోకమునందలి రాజుల నెల్లర
నాస్వయంవరవ్యాజమున విదర్భకు రావించెను. దమయంతీస్వయంవర
మునకు సమస్తదేశాధీశులు బోరన వచ్చుచుండ వారియేనుంగులయొ
క్కయు గుఱ్ఱములయొక్కయు రథములయొక్కయు ఘోషములచే
భూతలము గడగడ వణఁకెను. అట్లు వచ్చినరాజులకు భీమరాజు వారి
వారిగౌరవములకుఁ దగిన విడిదలలఁ జూపి వారి నుచితసత్కారముల
గారవించెను.

అయ్యవసరమునఁ బర్వతనారదు లను ఋషీశ్వరులు భూలోక
మంతయు సంచరించి నాకలోకంబున కేగఁగా నింద్రుండు వారల నర్చించి
భూలోకవిశేషముల నడుగుచు నిది యేమి నాకలోకవాసమునకు
భూలోకమునందుండి రణనిహతులైన శూరులు వచ్చి పెద్దకాల మయ్యె?
ధర్మపరిపాలనపరు లగురాజులకు భూలోకంబున యుద్ధము లేవియుఁ
గలుగవా? భూలోకవీరు లిచ్చోటిసుఖ మనుభవింపరామికిఁ గతం బేమి
యని యడుగఁగా నారదుం డిట్లనియె. సురేంద్రా! ముల్లోకముల
యందలి కన్యకలందఱిలో విదర్భాధిపతి యగుభీమరాజునకుఁ గూతురు
దమయంతి సుందరి. ఆకన్యారత్నమునకు స్వయంవరము వర్తిల్లు
చున్నయది. దానంజేసి రాజనందనులు యుద్ధములఁ జాలించి యా
స్వయంవరోత్సవమునకు ముదంబునఁ బోవుచున్నారు. అని చెప్పఁగా
నగ్ని యమ వరుణు లేతెంచి నారదువచనములను విని యింద్రు
నితో నాస్వయంవరోత్సవమునకు మనముం బోవుద మనఁగా నిం
ద్రుండు వల్లె యని యందఱు తఱలి భూలోకమునకుఁ బోవుచుండ
మార్గమున నాస్వయంవరమునకుఁ బోవువాని నాదిత్యులలోఁ దేజో
వంతుఁ డగు విష్ణువుం బోలువాని, రూపసౌభాగ్యంబున రెండవమన్మథుం

బోలువాని నలుం గని యంతరిక్షంబున విమానంబుల నిలిపి భూతలం బునకు వచ్చునప్పుడు వానిరూపరేఖాలావణ్యంబులవితర్కించుచు నాసుం దరి యీరూపవంతుని వరింపక మనల వరించునే యనుచు వానిం జేరం జని 'నిత్యసత్యవ్రతుఁడా! నిషధాధిపా! మాకు దూతవై యొక్క కా ర్యంబు సాధింపవలయు" నని యింద్రుండు ప్రచ్ఛన్నుండై యడుగ, నలమహారా జందుల కియ్యకొనుచు నిట్లనియె. "అయ్యా! మీర లెవ్వారలు? మీ కెయ్యది యభీష్టంబు? నేను దూతనై యేమి మీ కొనర్పంగలను ?" అనఁగా నింద్రుఁడు నలున కిట్లనియె. నైషధుఁడా! నే నింద్రుండను; వీరు దిక్పాలురగు నగ్నియమవరుణులు. భూలోకమున దమయంతిస్వయంవరమహోత్సవము కానున్నయది. మే మావేడ్కను జూచునిమిత్తమును, మాలో నొక్కరిని దమయంతి వరించుటకును ప్రయత్నము సేయఁగోరియున్నాము. నీవు మాదూతవై మునుపు దమ యంతియొద్ద కేఁగి మాప్రభావముల దాని కమరంగఁ జెప్పి మాలో నొక్కరుని వరించునట్లు చేయవలయు. మమ్మును మావేళ్లను నాకోమలి మున్న యెఱింగినచో మాయందుఁ దనవలచినవారి వరించు నసఁగా నింద్రునకు మ్రొక్కి నలుం డిట్లనియె. సురపతులారా! మీరు పోవుకార్య మునకే నేనును బోవుచున్నాను. కావునఁ దెలిసి తెలిసి యేకార్థసంస క్తుఁడ నగు నన్ను మీ రిట్టిప్రయోజనము నపేక్షింపఁ దగునా? ఈకార్యమునకు నన్ను నియమింప వలదు. అనఁగా నింద్రుండు మున్నగు దేవతలు నైషధా! మిక్కిలి తమకమునఁ జేయుదునని మున్నొప్పుకొని యింక నిప్పుడు వలదు కా దనుచున్నావు. ఇంక చేయకుండ నగునా? నీవుసత్యవ్రతుఁడవని యెఱింగి యీకార్యమునకు నీవ యర్హుఁడవనినిన్ను దూతభావమునకపేక్షించితిమి ఇయ్యది దేవకార్యము. దీనిఁ దీర్పవలయు. కావున నెడసేయ కరుగు" మనుటయు, నలుం డాయుధపాణులగుభృత్యు లచే రక్షింపఁబడునంతిపురము నే నెట్టు చొరనేర్తు నని యడుగ, నీవు దమయంతీనివేశంబు చొచ్చునపుడు ని న్నెవ్వరు నెఱుంగకుండుదురు. మాప్రభావంబున నీవెవ్వరికిన్నలకుఁ గాన్పింపవు. అరుగుము" అనఁగా నలుండు శంకింపక, తా మున్నాడినమాటనుబాలించుటకు బద్ధుండై వేగ మున భీమరాజునగరుఁ జొచ్చి యొక్కరుండ దమయంతి యంతఃపుర

ప్రవేశంబుఁ జేసి తా మున్ను హంసచే వినినంతకంటె సౌందర్యాతిశ యముతో నొప్పారుచున్నది, చక్కని యనేకకన్యకల నడుమ నుండునదియు లు, సదా తన్నే ధ్యానించుచుండునదియును, స్వశరీరకాంతిచే వెన్నెలను సైతము తిరస్కరించునదియును నగు కన్యకాలలామ యగు దమయంతిం గని కామవశుఁడయ్యెను దేవకార్యసముద్ధరణార్థమై యెట్టకేలకుఁ దాల్మి వహించియుండెను. అంత దమయంతి యతనిం జూచి యీమనుజుం డెప్పుడు నీయంతఃపురమునకు వచ్చినవాఁడు గాఁడు. అపూర్వుఁడు. ఎందుండి యిచ్చటికి కేలవచ్చెనో? యనుచుఁ దత్తరపడి చెలికత్తెలెల్లరతో దిగ్గన లేచి సిగ్గాటంకపెట్టఁగా మాటాడనేరక మనంబున 'వీనిరూపు వర్ణింప నలవి గాదు. తేజస్సు కన్నుల మిఱుమిట్లు గొల్పుచున్నది. ధైర్య మన్ననో శూరులకు మించినది. ఈతండు దేవతయా? లేక గంధ ర్వుఁడా?' అని తలపోయుచుఁ గొంతసేపటికి ధైర్యముఁ దెచ్చుకొని ముసిముసినవ్వులతో నుండు నలు నుద్దేశించి భీతిల్లక తిన్ననిపలుకులతో ని ట్లనియె. అయ్యా! నీ వెవ్వండవు? మహానుభావుండవై యున్నావు. ఇందుల కేమి కారణమున నొంటరిగా వచ్చితివి? ఈయంతఃపురము నొక్కపోతుటీఁగకైనఁ జొచ్చుటకు శక్యము కాకుండునట్లు భయంకర రక్షకభటుల నుగ్రశాసనుం డగు నాతండ్రి కాపుంచియున్నాఁడు. ఇట్లు సురక్షితముగా నుండు ప్రదేశము నెవ్వరు నెఱుంగకుండ నెవ్విధంబునఁ జొచ్చితివి? నీకారణంబున నాకు మనోవేదన వృద్ధియగుచున్నది. నీతెఱం గెఱింగింపు మని లేఁతనవ్వు పెదవులపై మెఱయ నడుగుటయు నలుఁ డిట్ల నియె. శుభాంగీ! నేను దేవదూతను; నలుం డని నన్నుఁ బేర్కొందురు. ఇంద్రుఁడు, అగ్ని, యముఁడు, వరుణుఁడు వీరు నలువురును నీస్వయంవ రోత్సవమునకు వచ్చుచున్నవారు. వారు ముందు నన్ను నీయొద్దకుఁ బంపిరి. వారిలో నొక్కరుని నీ వుత్సవకాలమున వరించుట వారి యుద్దేశము. అట్లు చేసి వారికిఁ బ్రీతి గావింపు మనిరి. వారి మహి మచే నే నన్యుల కగోచరుండనై యీకాంతాజనశుద్ధాంతమునకు రాఁ గలిగితి. దేవతలకుఁ బ్రీతి సేయుము. అనఁగా దమయంతి తల వంచు కొని సిగ్గు గదుర నారూపమును దొల్లి హంస చెప్పఁగా వినియుండి తద్గుణబద్ధచేతస్క యగుటచేఁ గృశించుచున్నయది, వాని నలుంగా

నెఱింగి వానిమాటలచే దుఃఖితయై యి ట్లనియె. అయ్యా! నే నేడ? ఇంద్రాదు లేడ? వారు దేవతలు, నే మనుజకాంతను. వారు నాకుఁ బూజ్యులు. వారి కిట్లెప్పుడును మ్రొక్కుదు. నేను నీధనమును. రాజేంద్రా! నీగుణమును హంసచే విన్ననాటంగోలె నామనంబు నీయందు తగులము గలదై యున్నయది. నిన్ను రావించునిమిత్తే మాస్వయంవరమహోత్సవము నాతండ్రిచేఁ జాటింపఁబడినది. నలుదెసల వ్యాపించిన కీర్తిగలవాఁడా! నాయందుఁ బతిబుద్ధి గావింపుము. ఇందులకు నీవొడంబడవైతేని యురిత్రాటిచేఁగాని, విషపానమునఁగాని, నిప్పులఁ జొచ్చి కాని, నీళుల మునింగి కాని ప్రాణములఁ గోల్పోవుదాన నని తెగఁ బలుకుచున్న దానిం జూచి నలుం డిట్లనియె. కోమలీ! వినుము. మహనీయులు, మహైశ్వర్యవంతులు, తేజోమూర్తులు, దేవోత్తములు నగు లోకపాలురు నిన్ను వరించుచుండ వారిపాదధూళికి సమానుఁడనుగాని, మనుజుఁడను సంసారిని జననమరణములకు లోఁబడినవాఁడ నగు నన్ను నీవు వరించుట వెఱ్ఱితనము. వారు నీకుఁ బ్రసన్నులుగ నున్నారు. అంతే కాక వారి కప్రియం బొనర్చినఁ గీడు మూఁడును. కావున వారిలో నిష్టమైనవానిని వరించి నన్ను రక్షింపుము. దేవతలనే వరించి సర్వకాలములయందు దివ్యవస్త్రములను భూషణములను గుసుమమాలికలను ధరించి సుఖింపుము. అగ్ని దేవుఁడు లోకము నంత నొక్కపెట్ట దహింప శక్తిగలవాఁడు. యముండు సర్వభూతములను ధర్మప్రవర్తనంబునకుఁ బురికొల్పుచు సమవర్తి నాఁబడును. వరుణుఁడు సర్వగుణముల రాశి. ఇంద్రుండు ముల్లోకముల కధినాథుండు. ఇట్టివారిని వరింపక లాతి వాని నరుని వరింతువే? కావున నామాటలు సుహృద్వచనములుగఁ దలంచి, సంశయము వీడి వారిలో నొక్కని వరింపు మన్న నలువచనంబులు దమయంతివీనులకు ములుకులై తగులుటయుఁ గన్నీరు గార్చుచుఁ గొంత యాలోచించి నలునితో 'రాజేంద్రా! నీయభిప్రాయమున కపాయము లేనియుపాయముం గంటి. ఇంద్రాదులు నాస్వయంవరమునకు వచ్చెద రేని వారిసన్నిధిన నే నవశ్యంబు నిన్నే వరించెద. అట్లయ్యె నేని నీకు దోషము సంభవింపదు. నీచే నైనంత దూతకృత్యంబు గావించితివి. వలపు లేక వారి నే నెట్లు వరింతు? నే వరింపకున్న నందు నీ తప్పేమి

గలదు? అనిన విని నలుఁడు మగిడి యింద్రాదులయొద్ద కేతెంచి జరిగినవృత్తాంత మంతయు సవిస్తరముగ వారికి విన్నవించెను.

## దమయంతీస్వయంవరము

అంతఁ బుణ్యతిథినక్షత్రయుతసుముహూర్తంబున దమయంతీ స్వయంవరము భీమసేనుండు ప్రవర్తింపఁజేయఁగా రాజు లనేకులు నానావిధభూషణములచే నలంకృతులై పరిమళగంధముల నలంది దివ్యవాసనల వెదఁజల్లుకుసుమమాల్యంబులం దాల్చి బంగారుస్తంభములతోను, పచ్చలతోరణంబులతోను ముత్యాలముగ్గులతోను వెలయుచున్న స్వయంవరశాల నలంకరించుటయు, నింద్రాగ్నియమవరుణులును నలానురక్తయగుదమయంతి తమ్ము వరింప దనురూఢితో నలరూపధారులయి, యెటుచూచినను భూపతులసమూహముతో నిండియుండు స్వయంవరశాలను జేరిరి. అంతఁ గొంతసేపునకు సర్వాభరణభూషితయై, యలంకరించుకొన్న రతీదేవియో యన్న ట్లచ్చోట మూఁగియుండు రాజులెల్లరను దనపైఁ జూడ్కులు నిగిడించి మనస్సులను నిలుపనేరక చిత్రపుఁబ్రతిమలంబోలె నివ్వెఱఁ గంది యుండఁ దెల్లనిపూలమాలిక నొక్కదానిని చేతఁ గొని, స్వయంవరరంగమునఁ బ్రవేశించెను. అంత నొక్క కాంతాలలామ దమయంతికి రాజులను వేర్వేఱఁ జూపి వారేయే దేశాధిపతులైనదియుఁ జెప్పుచు వారినామగుణశౌర్యములను వర్ణించి వక్కాణింపుచుండ నందఱం గలయం గనుఁగొనుచు రాజమండలమున నుండువారిలో నిసుమంతయేని విభేదమును జెప్ప వీలుగాక, యందఱును రూపరేఖావిలాసంబుల నొక్కటిగ నుండునలునితోఁ గూడి యైదుగురునలరాజులం గాంచి వారిలో నిజమగు నలు నేర్పరింపంగ నేరక, తనమనస్సు యథార్థనలునిపై నుంటంజేసి లోకపాలురు నల్వురును నలరూపధరులై రని తలంచి, మనంబున వేల్పులగుర్తులు మిథ్యానలులయం దేవైన నున్నవా యని పరికించి పలువిధముల నాలోచించి, ఇంద్రాదులను, యథార్థనలుని నెఱుంగునుపాయ మెద్దియుంగానక, వ్యాకులచిత్తయై, యిందుల కుపాయ మూదేవతలను శరణుచొచ్చుటకంటె నింకేదియు లే దని నిశ్చయించి వారి కంజలి

గావించి "మహనీయులారా! భూరిసత్త్వులారా! మీరు సర్వలోకవిభు
లరు. యోగాద్యైశ్వర్యసంపన్నులరు. దిగంతవిశ్రాంతకీర్తులరు. నామనః
పూర్వకంబుగ నేను నిషధనాథుం డగు నలుఁ గోరియున్నదాన. ఆమహా
రాజుం దప్ప నన్యుల వరియింప. నా కాయధినాథుఁడే పతిగా నిర్ణయించు
కొన్నదాన. నా కెవ్విధమునన్నైనను యథార్థనలు నెఱింగింపరే. మిమ్మును
శరణుఁజొచ్చినదానను. నాయందుఁ గరుణించి నాయభీష్టంబుఁ దీర్పరే"
అని దీనాననయై మనంబునఁ బరిదేవనము సేయుచున్న దమయంతిం
గరుణించి నలరూపులగు దేవతలు తాము తెప్పలు వాల్చనినేత్రముల
తోను, జెమట లేని శరీరములతోను భూప్రదేశమునఁ బాదంబుల
నిలుపక యంతరిక్షంబున నిలిచిరి. దమయంతి యాసన్న లెఱింగి దేవత
లనుగ్రహించిరని తెలిసి యాలోకపాలురయొక్కయు, స్వయంవరము
నిమిత్తముగ వచ్చిన యితరరాజన్యులయొక్కయు సమక్షమునఁ బుణ్య
శ్లోకుని నలుని ధర్మయుక్తముగ వరియించి చేత నున్న సుగంధకుసుమ
మాలికను నాతనికంఠమున వైచెను. అంత నాశ్చర్యము నొంది దేవతలు
సాధువాదంబు లాడిరి. విప్రులామె నాశీర్వదించిరి. ఇతరరాజులు
హాహారవంబులు గావించిరి. మంగళవాద్యములు మ్రోఁగినవి. అంత
నలమహారాజు దమయంతి నుద్దేశించి, కోమలీ! నీరమ్యవాక్యల నమ్మిన
నన్ను నీవు దేవతలసన్నిధానముననే వరించుటంబట్టి నా ప్రాణములుండు
నంతవఱకు నేను నీవాఁడనై యుండెద. నమ్ముము. అని యామరదఁ
బలికె. ఆసుందరాంగియు నలమహారాజున కంజలి గావించి తలవాంచి
యట్ల యొడంబడెను. అవ్విధమున నపూర్వస్వయంవరమునందుఁ బొందిన
దమయంతిని నలుం డత్యంతవిలాసముతోఁ బెండ్లాడఁగా నాదంపతులకు
లోకపాలు రీక్రిందివరముల నిచ్చిరి. దేవేంద్రుండు నలమహారాజు
గావించు యజ్ఞములందుఁ బ్రత్యక్షుండై హవిర్భాగంబులఁ గొనెద
నని యుత్తమగతి ననుగ్రహించె. అగ్నిదేవుండు నలుఁడు గోరినచోటఁ
బ్రకాశింపను, దివ్యకాంతులుగల లోకములను బ్రసాదించుటకు నియ్య
కొనె. యముం డన్నపుష్కలత్వమును ధర్మమునందు వానిబుద్ధి వర్తిల్లు
టకును గరుణించె వరుణుండు జలసమృద్ధిని, దివ్యపుష్పమాల్యములను
దయచేసె. ఇట్లానల్వురును వేర్వేఱ రెండేసివరంబులుగా నెనిమిదివర

ములను నలమహారాజునకు నొసంగి తమతమలోకములకుం జనిరి.స్వయం వరమున కేతెంచినరాజులును దేవతల సైతము గోరక దమయంతి నలుని వరించినందులకు విస్మితులై తమతమదేశములకుం బోయిరి. తదనంతరంబ నలుండు భీమరాజువేడికోలున విదర్భయందుఁ గొన్నాళ్లుండి భీముని సెలవుఁ గొని దమయంతీసహితుండై శచీదేవితోఁ గూడిన యింద్రునిమాడ్కిఁ దేజరిల్లుచు నిషధకుం బోయి ధర్మమున బ్రహ్మోత్తరంబుగాఁ బ్రజాపాలనంబు చేయుచు ననేకాధ్వరంబుల నొనర్చుచు విప్రులకు భూరిదక్షిణల నిచ్చుచు దేవతల సైతము మెచ్చక తన్నే వరించిన యక్కుసుమకోమలితో విలాసియై రమణీయప్రదేశములలో విహరించుచు నింద్రసేనుండను కుమారుని నింద్రసేన యను కూఁతుం బడసి మనస్సంతోషముతో మెలఁగుచుండె.

## కలిసమావేశమున నలుండు రాజ్యభ్రష్టుఁ డగుట

అట లోకపాలురు దేవలోకంబున కరుగుచు రెదుర ద్వాపరముతో వచ్చుకలిం గని యెందుకుం బోయెద వని యడిగిన వారికిఁ గలి. యి ట్లనియె. భూలోకంబున దమయంతీస్వయంవరము వర్తిల్లుచున్న దని విని మిక్కిలి వేడ్కతో నేను దమయంతిచే వరింపఁబడుదు నని యాశతోఁ బోవుచున్నాఁడ ననఁగా వారు నవ్వి నీ వందుల కేలపోయెదవు? స్వయంవరంబు పూర్తియైనయది. అం దాకన్నియ నొరుల నెవ్వరి వరింపక మాసమక్షమున నలుఁ డనురాజేంద్రుని వరించె ననఁగా విని కలి కోపముతో నిట్లనియె. తనస్వయంవరమునకు దేవతలు తాము వరింపఁబడుదు రన్న యాశతో వచ్చినను వారి నొల్లక దమయంతి సామాన్యమనుజుని వరించెనే! అయ్యది సురల కవమానకరంబు కాదే? కావున నానలభూపాలుని నవశ్యంబు దండింపవలయు ననఁగా సుర లి ట్లనిరి. ఆకన్నియ మాయనుమతంబున నామహీపాలు వరించె. నలరాజు సామాన్యమనుజుండు గాఁడు; ధర్మముల నెఱుంగును; దేవతలను సంతతము పూజించును; అహింసాపరాయణుఁడు; సత్యసంధుఁడు; నియతవ్రతాచరణుఁడు; తపోమహిమగలవాఁడు; శౌచనిరతుఁడు; జ్ఞాని; శూరుఁడు; ఇంతేకాక యనేక సుగుణములకు రాశి; లోకపాలాంశసమన్వితుఁడు; ఆదిత్యులలో విష్ణువుంబోలెఁ దేజోవంతుఁడు, అట్టివానినివరించి యన్యులను

వరింపకుండుట తప్పే? అట్టిమహానుభావుని శపింపఁ బూనుట యాత్మ వధంబు గావించుకొనుటవంటిది. తెలివిలేక వానిని శపించువాఁడు తప్పక ఘోరనరకమును జెందు నని చెప్పి వారు యథేచ్ఛముగాఁ బోయిరి. అంతటఁ గలి ద్వాపరునింగని 'నాకోపంబు సైరింపఁజాల. నేను నలునియం దుఁజొచ్చి వానిచే జూదం బాడించి, వాఁ డం దోడునట్లుచేసి, యతనికి రాజ్యభ్రంశముం గలిగించి, వానికిని దమయంతితోడ వియోగంబు గలి గించెద. నీవు నాకు సహాయుఁడవు గమ్ము' అని నిషధపురముఁ జొచ్చి నలు నాక్రమించుటకు వీలు లేక పండ్రెండేండ్లు కాచియుండెను. నల మహారాజు నియతవ్రతపరాయణుం డగుటచేతను ననేక సత్కార్యనిర్వ హణగరిష్ఠుఁ డగుటచేతను దుర్మార్గుఁడగు కలి యతనింజొర సందుఁగానఁ డయ్యె. ఇట్లుండ నలభూపాలుం డొక్కనాఁడు మూత్రవిసర్జనముచేసి యేమఱి కాళ్లుగడిగికొనకయే యాచమనముసేసి సంధ్య వార్చెను. కలి యది సందుగఁ గొని యశుచియై నలరాజుఁ జొచ్చె. పదంపడి యొక బ్రాహ్మణవేషముధరించి పుష్కరుఁ డను నలరాజు జ్ఞాతియొద్దకు నేఁగి, పుష్కరా! నీవు పాచికలం గొని నలరాజును జూదమాడఁ బిలువుము. ఆతండు ద్యూతకలాభిరతుండు తప్పక నీతో జూదమాడును. నేను నీకు సహాయుఁడనై యుండెద. ఆతని సకలమహీరాజ్యము నీవోడిచికొనుము. రాజాధిరాజువై సర్వమహీప్రజల నొడ్డోలగంబున నేలుము. నిన్ను నేను గెలిపించెదనని పుష్కరు నందుల కియ్యకొలిపి వానితోఁ దా నలునొద్దకుఁ బోయి నలునితో రాజా! మారాజుతో జూదమాడు మనఁగా జూద మనుచిత మని యెఱింగియు. గితవాహ్వానాతుఁడైన నృపుఁడు కలిసమావే శంబుచే మతి చెడి జూదమాడఁ గడంగి కలధనముల నెల్ల నొడ్డి యోడు చుండె. ఇట్లోడుచున్న నలరాజుమనస్సు నాతనిమిత్రులు త్రిప్ప లేక మం త్రులు, పురజనులతో దమయంతియంతఃపురంబునకుఁ బోయి యాదేవి తోఁ దమవచ్చినకార్యంబు విన్నవించి నలమహారాజుదర్శనమునకు వారు వేచియుండునట్లు జూదమాడుపతితో విన్నవింపు మనిరి. ఆదేవియు ద్యూతశాలఁ బ్రవేశించి యావేశంబున జూదమాడుచుండుభర్తను సమీపించి వెలవెలనైనవదనముతోఁ దా వచ్చిన కార్యమును నలున కెఱింగించెను. కాని, యాదేవి భర్తచే ననాదృతయై విధిచోదితంబున

నైన రేమిచేయఁగలరని వెనుదిరిగి వచ్చె. పౌరులును మంత్రులును 'రాజు ఉచితం బెఱుంగఁడు. మేలు సమకూఱుకాలము గానట్లున్నది.' అని లజ్జా విషాదంబులతోఁ జేయునది లేక తమతమనెలవులకుం బోయిరి. ఇట్లనే కమాసంబులు జూదమాడి కలధనముల నెల్ల నోడుచుండ దమయంతి మంత్రులఁ బిలుచుక రమ్మని తనదాది బృహత్సేన యనుదానిఁ బంపఁగా వారు వచ్చిరి. వారిమూలమున నోడినధనము పోఁగా నిలువయుండు దాని నెఱుంగఁగోరి వారి నంపుటయు వారు రాజద్వారమునఁ గాచియున్నట్లు నలరాజుతోఁ దాముగఁ జెప్పఁబోఁగా కలిసమావిష్టుఁ డగునప్పటి నలుండు తనకుఁ బ్రియభాజనమైనదియు, సహధర్మచారిణియు నగు నద్దేవికిఁ జెవియొగ్గి పలుకకుండఁగా నామెయు లజ్జితయై తనయంతఃపురము నకుంబోయె. పిదపఁ గొన్ని నాళ్లకు సకలధనమును, వస్తువాహనములను, రాజ్యమును నోడ్డియోపుచుండు కితవుఁ డగు భర్తను విరమింపఁ జేయ లేక దూరదృష్టియు నింగితము నెఱింగినయంగన గావున మరల బృహత్సేనను బిలిచి తమసారథి వార్ష్ణేయుండనువానిని నలునసుజ్ఞయైనది,తోడ్తెమ్మని పంప వాఁడును దేవిసదనంబున కరుదెంచె. అప్పు డద్దేవి యతనితో నలరాజు జూదంబున నోడుచుండుటయు, బాచికలు పుష్కరునికి వశములుగ నుండుటయు వాఁడు వైవఁగా వానికి జయము గల్గుచుండుటయు, నలమహారాజునకు విపరీత మగుచుండుటయు, గలధనము లెల్లఁ బుష్కరుని వగుచుండుటయు మున్నగు మహీపాలుద్యూతవృత్తాంతంబంతయు నివేదించి తానును మంత్రులును నెంత వారించినను దమపల్కు లనాదృతంబు లగుచుండుటఁ జూడ దీని కేదేని కారణం బదృశ్యంబై యుండ వలయు ననియుఁ దనమనంబు కలఁక పాఱుచుండుటయుఁ జెప్పి రాజునకుఁ జేటు మూడ నున్న దనియుఁ జెప్పి, రాజపుత్త్రుఁడును రాజపుత్త్రికయును నగు ఇంద్రసేనుఁడు, ఇంద్రసేన యనువారలను వేగవంతములగు గుఱ్ఱములు పూన్చినరథము నెక్కించి కుండిననగరమున మాతల్లిదండ్రులయొద్దకుఁ జేర్చు మని కొమరుని కుమార్తెను వానికి వశపఱచెను. అంత వార్ష్ణేయుం డాసంగతిని మంత్రులకుం దెలిపిరథం బాయితంబు గావించి యాకొండికల నం దెక్కించుకొని విదర్భ కరిగి వారిని భీమరాజునకు

వశపఱిచి రథమును గుఱ్ఱములను నచ్చటనే వదలి వారియనుజ్ఞఁ గొని నలునిదుర్దశకుఁ జింతిల్లుచు నయోధ్య కరిగి ఋతుపర్ణునొద్ద సారథియై యుండె. ఆట నలుండు కలధనములను రాజ్యము నెల్ల నోటువడఁగాఁ, బుష్కరుండు నీవు సర్వస్వము నోడితివి. ఇంక దేని నొడ్డెదవు. అలనాఁడు స్వయంవరలబ్ధ యగు దమయంతి యొక్కతె నిలువయున్నది. దానిని నొడ్డుము. అనఁగా నలుని మొగము వెలవెలనై తల్లడమందెను. అంతనొడ్డు టకు మేన నిలువయున్న భూషణములను, పై యుత్తరీయమును నొడ్డి యోటువడి భృత్యులును, మిత్రులును, నమాత్యులును విషాదముతోఁ జూచుచుండ మహీరాజ్యమును నిషధదేశమును వదలెను. అట్లు వదలి పోవుచుండు భర్తను దమయంతి దీనాననయు, నేకవస్త్రయునై యను గమించెను.

## నలుఁడు దమయంతితో నరణ్యమున కరుగుట

ఇట్లు పురము వెడలి యూరివెలుపట మూఁడహోరాత్రము లుండిన నలునిఁ బుష్కరుశాసనంబుచేఁ బూర్వభృత్యులు గాని, ప్రజ లుగాని సత్కరింపరైరి. ఇట్లగుటకును కలికృతద్యూతవిద్వేషమును నొకకారణ మయ్యెను. ఆమూఁడుదినములు నాహారంబు లేక నీరు ద్రావి యాదంపతులు కాలము గడపిరి. అవ్విధమున సత్కారార్హుండైన నల మహీకాంతుం డాహార మెద్దియుం గానక యాఁకలిచేతఁ బీడింపఁ బడి లభించినఫలములను వేళ్లను దినుచు నరణ్యావాసముం జేయుచుండ నొకనాఁ డాఁకట నకనకలాడుచు బంగరువన్నె పులుఁగులు కొన్ని యాకసంబునఁ దనసమీపమున నెగురుచుండ గాంచి వానిం బట్టికొని యప్పు డాహారంబుగాఁ గొనఁ దెంపునేసి వానిం బట్టికొనఁ దన కట్టిన పుట్టంబు విసరివైచెను. అంత నాపులుఁగు లాపై వఁబడినవానివస్త్రంబుతో బైకెగిరిపోవుచు 'నోరీ! తెలివిలేనివాఁడా! నీవు జూదమాడునప్పటి నీచేతిపాచికలము మేము నిన్ను రాజ్యభ్రష్టుం గావించినంతన తనియక నీకట్టుపుట్టంబును నైత మపహరించుటకై పక్షిరూపులమై వచ్చినవారము. ఇదే మాయభీష్టంబు తీరిన'దని యాకసంబున నెగిరిపోవుచుండఁ గనినలుం డు దమయంతితో నిట్లనియె. 'దేవీ! జూదమప్పటిపాచికలే యిప్పుడును

న్నా కట్టినపుట్టమును నాచికొనిపోవుచున్నవి ఇవియే నాకు రాజ్య భ్రంశంబు గావించినవి. కావున్న నింతకష్టము గలుగునే. వీనినిమిత్తము న్ననే పౌరు లెవ్వరు పురము వెలుపట మూఁడుదినములుగ నున్నమనలను సత్కరింపరైరి. మన కీదురవస్థ దాఁపరించినది, యనుభవించి తీరవలయును. ఈమార్గము లవంతిని ఋక్షవంతమును దాఁటి దక్షిణాపథమునకుఁ బోవును. ఇది వింధ్యపర్వతము. ఇయ్యేఱు పయోష్ణి యనఁబడును. ఇయ్యది సముద్రగామిని. దీనియిరుదరులలోఁ దియ్యనిపండ్లతో నొప్పారుచెట్లతోఁ గూడిన ఋష్యాశ్రమము లనేకము లున్నవి. ఇది విదర్భకుఁ బోవుమార్గము ఈదారి కోసలమునకుం జనును. ఇట్లు పోఁగాఁ బోఁగా దక్షిణదేశమునకుఁ బోవు నని యనేకమార్గములఁ జూపుచుండఁ బరేంగితావగాహిహృదయ యగు నద్దమయంతి కన్నీరు గార్చుచు దీనతతో భర్త కిట్లనియె. భూపాలా! నీవట్లు పలుమాఱువాళ్లకు దారుల నాకుఁగను పఱచుట సూడ నన్ను వదలి యొంటరిగఁ బోవ నూహించుచుండునట్లు నాకుఁ దోఁచెడి. ఈనీమాటలునావీనులకు ములుకులుగ నున్నవి. గుండెల క్రదిరుపా టొనర్పుచున్నవి. అంగములకుఁ గంపము గలిగించుచున్నవి. సర్వమహీంరాజ్యమును గోలుపోయితివి. కట్టుబట్టునుసైతము దారవోసి కొంటివి. పేరాఁకటఁ దూలెదు. ఇట్టితఱి నిన్ను నిర్జనమైన యీ కాఱడవిని విడనాడి పోవ నాకుఁ గాల్లాడవు. ఇప్పు డీయరణ్యమధ్యమున నీవెంబడి నా కునికి నీకుఁ గొంత యూరట గలిగించును. అలయు నపుడును, డస్సియుండునపుడును, నాఁకలి గొనియుండునపుడును, దప్పిగొని యుండునపుడును జిత్తమును జల్లపఱచునది భార్య యని పెద్దలు నుడువుదురు. అని చెప్పఁగా నందులకు నలమహీపాలుఁ డిట్లనియె. కోమలీ! నీచెప్పినమాటలచొప్పున నరునకు భార్యవంటి వేఱొకసాధనము లే దని నే నెఱుంగుదు. గుణవంతురా లగుభార్య నెచ్చెలి యనఁబడు. సంశయంబులేదు! నాదేహమునైన వదలుదుఁ గాని నే నిన్ను వదలను. అనఁగా నలునకు దమయంతి వెండియు నిట్లనియె. మహీపాలా! నన్ను వీడ నీకుఁ దలంపు లే దేని యిపు డీదేశముల కిత్రోవల నాకుఁ జూప నేల? ఇంతేకాక నీవు న న్నెప్పుడును విడువ నని తెలిసియు, గలిసమావిష్టుఁడవై యుండుటంబట్టి యింత సంశయింపవలసె. మఱియు నూళ్లకుఁ

బోవుమార్గములను జూపుట జేసి గుండె గాదరుచున్నయది. విదర్భదేశ
మునకు దారిఁ జూపితివి. విదర్భకు నేను బోవలయు నని తలంపుఁ
గొంటివేని నీవును నావెంబడి రమ్ము. ఇరువుర మచ్చోఁ గొన్నినాళ్లు
సుఖముగ నుండుదము. నిను మాతండ్రి మిక్కిలిగఁ బూజించు. నీకుఁ
గొఱంత సేయఁడు. అనఁగా నలుండు దమయంతి కిట్లనియె. దేవీ! నీ
తండ్రి రాజ్యమును నాయదియ. అందు నుపచారములకుఁ గొఱంత
యుండదు. నాఁడు నీస్వయంవరమప్పుడంత యోలగంబున నన్నుఁ బెండ్లాడి
మేలిపదవితో నన్ను నిషధకుం గొనివచ్చితి. ఇప్పుడు నారాజ్యమును
సర్వమును గోలుపోయి పదభ్రష్టుఁడనై దీనాననముతో నచ్చోటికే
పోవ మనంబు కొలుపదని చెప్పి దేవి నూరడింపుచుఁ దనవస్త్రమును
బక్షు లపహరింపఁగా దమయంతి కట్టినచీరనే దానుం జుట్టుకొని యాఁకలి
కిని, దప్పికిని నలయుచుఁ దనతోఁ బేరాఁకటను బెనుదాహమునను
నవయుచుండు దమయంతితో దారితెన్ను లరయక పలుదారులఁ బోవుచు
నాయరణ్యమధ్యమున నొకమంటపముం గని యం దలసి విశ్రమించి
నిదురించె. నలునికోమలియును నెన్నఁడును మార్గపరిశ్రాంత కాదు
కావున నీయలమటచే నామండపమందు భర్తతోఁ బరుండి యలసి గాఢ
నిద్రం జెందెను. ఆకోమలి నిదురించుచుండ నలుఁడు మేల్కాంచి తన
మనంబున నిట్లని వితర్కించె. నాకారణంబున నీసుకుమారి యీయెడ
ననుభవింపవలసె. దీనికష్టముల నేఁ జూడనేర. ఏమి సేయుదు? శరీరమును
విడుతునా? అయ్యది శ్రేయస్కరంబు గానిచో దీని నిట విడనాడి
నే నొక్కండ నెక్కడికైనఁ బోదునా? అటులగుచో నిద్దేవి నను వెద
కుచు, నలసి మార్గంబు లరయుచు నెట్టకేలకుఁ దనపుట్టింటిదారిఁ దెలిసి
కొని యచ్చోటి కేఁగి కొంతయూరటం జెందు. నావెంబడి నుంటం జేసి
యిది యనేకాపదలకుఁ బాలగు. తేజోవంతురాలును, మాహాత్మ్యము
గలదియుఁ గాన దీని నెవ్వరును జెనకరు. కావున నిప్పట్టున దీనిని
విడనాడుట లగ్గని పలుతెఱంగుల నాలోచించి కలిసమావిష్టతం జేసి
విడువ నిశ్చయించి, తనకుం గట్టికొనుటకు వేఱుపుట్టంబు లేమిం జేసి
యద్దేవికట్టినపుట్టమునందుఁ దనకు వలసినంత చించికొనఁగ నూహించి,
చప్పుడు కాకుండ దేవి నిదుర మేల్కొనకుండఁ జూచుచు నామండపము

ష్టలుదిక్కు లొంటరిగ నిటునటు తిరుగులాడి యందొక్కచో నొరలేనిక త్తి నొకదానిం గని దానం దనదేవికట్టినపుట్టంబున నర్ధముం జించికొని తాను ధరించి, యలసి నిదురచేఁ బరవశయగు భార్యనువిడనాడి కొంతదూరము చని, దమయంతీగుణబద్ధచేతస్కుండు గావున దాని విడువఁగా నోపక క్రమ్మఱ నందులకు వచ్చి, "అయ్యో! శుద్ధాంతమున నుండు నాసహధర్మ చారిణి నాదౌర్భాగ్యంబున నీకటికిఁబాలినేలఁ బేరాఁకట నవయుచు నీయ రణ్య మధ్యంబున నొంటరిగా నిదురింపవలసివచ్చె. తటాలున మేలుకొని తనకట్టుచీర తఱిగియుండుటకును, నాకానమికి నెంతవగఁ గుందునో? క్రూర వన్యమృగముల కునికిపట్టయిన యీ కాఱడవియం దొంటరిగఁ జరించుట కేమి భీతిల్లునో యని కొంత చింతించి, ధర్మమునే నమ్మియుండు దీని నాది త్యులు, వసువులు, రుద్రులు, అశ్వినులు, మరుత్తులు కాపాడుదురుగాక యని కలిప్రేరణనష్టబుద్ధియై ప్రాణసమానయు, ననువ్రతయు నైన పత్ని నెడఁబాసి పోవఁ బయన మయ్యెను. కాని, భార్యయందలిమోహామును స్నేహమును నను త్రాటిని త్రెంపనేరక, కలి యొకతట్టు గట్టిగ లాగ ముందుకు వెనుకకు నుయ్యేలవలె నూఁగులాడు చిత్తంబును నిలుప లేక యామంటపమునకు వచ్చుచు మరలి పోవుచుఁ గొంతకాలయాపన చేసి తుట్టతుదకుఁ దుంటరియై యాదేవి నొంటి విడిచి పోగలుచుం జనియె.

అంత దమయంతి మేల్కాంచి నలుం గానక యొంటరిగఁ గాన నంబునఁ జిక్కుటచేతను నబలయగుటచేతను భయమును, శుద్ధాంతకాం తాజనంబులతో నుల్లాసమునఁ గాలముం బుచ్చుచుండి, యిప్పుడు నిర్జనార ణ్యంబున సంచరింపవలసినవిధి తటస్థించుటచేత శోకంబును తన్నెప్పుడును బాయ నని దేవతలు సాక్షులై యుండగాఁ బలికినమనోనాథుఁడు దన్నెడఁ బాసినందులకు వ్యాకులతను, జెందినదై హామహారాజా! హామనోనాథా! నన్నేల విడిచిపోయితివి? ఈజనశూన్యమగు కాననమునందు భీతి గదురు చున్నయది. దిక్కులేనిదాననైతి. అనురక్తనైన భార్యనగు నన్ను నట్టడవి పాల్సేయుట ధర్మవేత్తయగు నీకుం దగునా? నిన్ను లోకపాలురవంటి మహనీయులు సత్యసంధుఁడ వని యనలేదా? వారియెదుట నాడిన పల్కులను మృష గావించుట న్యాయమా? చత్తు నన్న మరణము నావ శమే? మనుజుల కిట్టి యాపదలు గల్గునే? నీ కెప్పు డేయడరు గల్గునో

యని నిన్ను నీడవలె ననుసరించియున్న నన్నిట్లు మోసగించిపోవుదువే? ఒకనిమిషమైన నిన్నెడఁబాసి జీవింప నాకుఁ దరమే? నీయందు దోషము లెన్నరాదు. నవ్వుటాల కేడ నైన డాగియున్నావే? కాని, దయమాలి నన్నొంటరిగ విడిచి చనుదే? ఇకనైనను నాదీనాలాపంబులు విని నాకు శరణ మగుము. హానాథా! హతనైతి. మిక్కిలి భీతిల్లియున్నదాన. వేవేగ వచ్చి నాకు నేత్రోత్సవము గావింపుము. పొదరిండ్లలో డాగియుండి నామాటలను వినుచు నా కేల మాఱు పల్కవు? దరిగానని దురవస్థలో మునిఁగియుండు నన్నేల తేర్పవు? నన్నోదార్పకునికి క్రౌర్యము గాదే? నాదుఃఖ మంతయు స్వపోషణమునకుఁ గాదు. తీరనివేదనాభరంబున నీ వెట్లయ్యెదవో యనియే నాతలంపు. ఆఁకలిదప్పుల కోర్వలేక సాయంసమయము కాఁగానే నన్నుఁ దలంచి యెంత కుందుదువో యని వగచుదాన. అని దమయంతి తమకింత యిక్కట్టు లెవ్వాని మోసమువలనఁ గలిగెనో వాఁ డీబాధల ననుభవించుఁగాక యని పలుమాఱు లాక్రందించుచు ఘోర కాననమునఁ గడు నెండయెక్కునంతకుఁ బాదములు వేడిమి సహింపలేక పురపురఁ బొక్కఁగా, ముండ్లను ద్రొక్కుచు నడుచుటచేతను, సూదులవంటి ఱాలుసోకుటచేతను నదరుచు వెలవెలనై క్రిందఁబడుచు లేచుచు, బిత్తరిచూపులు సూచుచుఁ గన్నీరు మున్నీరుగఁ గార్చుచు వేడినిట్టూర్పులు విడుచుచు వెఱ్ఱిమాటలాడుచు 'హామనోనాథా! హా మహారాజా! హాధరణిపాలా!' యని పరిదేవనంబు సేయుచు నక్కాననమునఁ బలు తెఱంగులఁ బ్రలపించుచు మగని వెదకుచున్న యాదమయంతిని బెద్దశరీరము గల కొండచిలువ యొకటి పట్టికొనఁగా నాపరమ సాధ్వి యప్పుడును నిజనాథుని సంబోధించి "ఓనాథా! దుర్గమమైనగహనము నందొక పెనుఁబాము నన్ను వాతఁ గొనియె. ఇప్పుడైనను నామాట లాలించి నాకు శరణ మగుమని యాక్రందించుచుండ నెఱుక యొకఁడు కాననంబునఁ దిరుగుచుండువాఁడు వేగమున నేతెంచి తనచేతి సురియచే నాచిలువగొంతుక తెగ నఱుకఁగా నది గతాసు వయ్యెను. అంత నాదమయంతి రాహువిముక్త మగు చంద్రబింబమువోలెఁ జిలువనోటినుండి వెలువడఁగా నాబోయ దానికాళ్లు గడిగి, యూరడించి కొన్ని పండ్లను, కందమూలముల నాహారంబుగా నిచ్చి కొంత

త్తడవుండి, "ఓ లేడికంటిదానా! నీ వెవ్వతెవు ? ఈఘోరారణ్యం బున నేల భ్రమ్మయుచున్నదానవు ? ఈ నీకష్టమునకుఁ గారణం బేమి? యని యడిగి యాసాధ్వివలన దానివృత్తాంతమంతయు సవిస్తరముగా నెఱింగెను

దమయంతిశాపంబునఁ గిరాతుండు సచ్చుట

అట్లు కిరాతుఁ డెఱింగి యాయిందువదనసౌందర్యమున కాశ్చర్య పడి తనతో 'నిట్టి నల్లనికురులుగలస్త్రీ లుందురే యనియు, నామెపై నుండివీచుగాలి యింత సుగంధి యగునే యనియు, నద్దిరా! దీనిచక్కఁదన మెంత యనియు,బలారే యిది రాజసుత యనియు, భళిరే యిది తామర సాక్షి' యనియుఁ దలంచి యాపరమపతివ్రతను మోహించి మోహంపు మాటలతో నామెకుఁ దనహృదయము నెఱింగింప నాసతీమణి తనయిలు వాసి, భర్తనెడఁబాసి, యతిదుఃఖితస్వాంతయై యుండునది. వానిచెడు తలంపు నెఱింగి కోపించి యగ్నిశిఖవోలెనంటను డాయను జూడను గాని ఘగుటయు, నప్పాపాత్ముండు కన్నులెఱ్ఱనేసి యాశుభచరిత్రఁ జెనకం దలంచె. అంత నప్పరమపవిత్ర వాని రోషముతోఁ జూచి నామనో నాథు నలునిం దప్ప వేఱొక్కని నే నెన్నఁడైన మనంబునఁ దలంపని దాన నైతినేని యీనిర్జనారణ్యంబున నబల యగునన్నుఁ జెనకం దలంచునిద్దురాత్ముండు వేగంబ మడియుఁగాక యని శాపం బిచ్చిన, వెంటనే యా దురాత్ముండు నిప్పుచేఁ గాల్పఁబడిన మహావృక్షమువోలె నేలఁ గూలె. వాఁ డట్లు కూలుటయు నాసాధ్వి యచ్చోటినుండి చనుచు, సింహములు పెద్దపులులు నడవిదున్నలు నేదుపందులు మున్నగాఁ గల క్రూరమృగములతోను, మ్లేచ్ఛులు తస్కరులు మున్నగువారిగుంపుల తోను, సరస్సులు నడబావులు కోనేరులు నదులు సెలయేళ్లుమున్నగువాని తోను నిండినదియు, పలుగుహలతోను పలురంగుల పక్షిసమూహముల తోను గూడుకొన్నదియు నగు నాఘోరారణ్యమునందు నా దమయంతి సంతతచింతాక్రాంతయై యంతటం బతిని వెదకుచున్నయది యొక్క తిప్పను జేరి " హా నిషధేశ్వరా! న న్నేకాంతంబున వదలి యెట కేఁగి నాఁడవు ? ఆహితాగ్ని వైన నీకు నాయెడ నిట్టి యథార్థముకాని

ప్రవర్తనంబు తగునే ? 'నిన్నెప్పుడు విడువను. నీకంటె నా కొండొ
క్కర్తు ప్రియురాలు 'గాదు' అని యాడినమాటను, హంసపలుకులను
మన్నింపవలదా ? సాంగోపాంగముగా, నాల్గువేదములను జదువుటయు
సత్యవాక్కు నొక్కరూపే కదా ? ధర్మమూర్తి వైన నీకు సత్యము
విడుచుట తగునా ? భయంకరరూపముతో నోరు దెఱచికొని యీ
సింహము నన్ను మ్రింగ నున్నది. కరుణించి నన్నిపుడు కావ వేల ?
నీవియోగంబునం జేసి వెఱ్ఱినై, చిక్కియున్నదాని, నీప్రాణప్రియ
యైనదాని, చింపఁగా మిగిలినసగముచీరగట్టినదాని, తనగుంపును వీడి
యొంటిమైఁ జిక్కి బెదురుచూపులఁ జూచు లేడివలె బిత్తరిచూపులఁ
జూచుదాని నూరడింప వేల ? శ్రవణానందముగా నామాటకు
మాఱు పలుక వేల ? ఈఘోరారణ్యమునందు సర్వసౌందర్యయుతుఁ
డవును, కులీనుఁడవును, సంపన్నుఁడవును నగు నిన్నుఁ గన్నులపండువుగా
నే నెన్నఁడు చూచుదానను ? ఏమహనీయుఁడు 'నీనాథుం డిదిగో నల
మహారాజిట నున్నవాఁ' డని నాకుఁ జూపునో ? ఆయింపైనమాటల
నెప్పుడు నే విందునో?" యనుచు నొక్క పెద్దపులిం జూచె. చూచి
దానిని ఓవ్యాఘ్రరాజమా! ఈయరణ్యమునందు మృగములకు నీవు
రాజవు కదా? నేను నల రాజుభార్యను. ఆరాజు నన్నొంటి విడిచి
యెటకుఁ జనెనో యతని వెదకుచున్నదాన. నీ వారాజుం జూచితే?
యనుచుఁ బోవుచుండ మార్గమధ్యమున నొకమహానది రాఁగా దానిఁ
దాఁటి, దానిసమీపమునఁ దరులతాగుల్మములతో నొప్పారుచు, నున్నత
శిఖరములతో వెలయుచుండు నొక్కమహాపర్వతముం జేరం జని,
యోగిరిశ్రేష్ఠమా! శరణన్నవారిని రక్షించుమహానుభావమా! నీకంజలి
గావించెద. నేను విదర్భరాజుతనయను. నిషధేశ్వరుఁడగు వీరసేనునికోడ
లను. పుణ్యశ్లోకుఁడగు నలమహారాజుభార్యను. ఐశ్వర్యముం గోల్పోయి
పతి నెడఁబాసి యతనిని వెదకుచున్నదానను. ఈయరణ్యప్రాంతములలో
ధీమంతుని, ధైర్యవంతుని, మహాశూరుని, బలపరాక్రమశాలిని నాక
సంబు ముట్టునున్నతశృంగములతోఁ జూచితే, యని యడుగ నందుల
నాయచలము మాఱుమాటాడ నందులకుఁ జిన్నవోయి, యయ్యో! నేనింత
యలుస నగుదునే! నామగం డెన్నండు నన్ను "నోవైదర్భి" యనిపిలుచు

పేలుపును శ్రవణానందముగా వినఁగాంతునో? యని పనవి యాకొండ దాఁటియుత్తరమున మూఁడహోరాత్రములు సంచరించెను. ఇట్లుపోఁగా నాదమయంతి కొకఋషాశ్రమము గానవచ్చెను. అందు వసిష్ఠుఁడు మున్నగుసప్తర్షులతో సములును, నియమనిష్ఠాపరులును, జితేంద్రియులును, శీలసంపన్నులును, వాయుభక్షకులును, పర్ణభక్షులును, జటలు దాల్చి నారబట్టలు గట్టువారును నైన మును లుండిరి. వారిం జూచి, యిది ఋషాశ్రమంబు. ఇది సంతసము గొల్పుచున్నది. ఇందలి ఋషుల సేవించినచో నాపతివర్తమానభవిష్యత్తులను దెలుపుదు రని కొంత యూఱడిల్లి, యాశ్రమముఁ బ్రవేశించి తపస్విశ్రేష్ఠు లగు ఋషులకు మ్రొక్కి వినయముతో నిలిచియుండ, వా రాసాధ్విని స్వాగతం బడిగి సత్కరించి యామెకుఁ దమవలనికర్తవ్యము నడుగఁగా వైదర్భియుఁ దోలుదొల్త వారియగ్నిహోత్రధర్మాచరణములు లోపము లేక ప్రవర్తిల్లుచుండుట యడిగి, వారియాశ్రమమృగపక్షులనేమం బరసెను. అంతటను వారు సమయోచితంబుగ సదుత్తరంబు లొసంగి యప్పరమ పతివ్రత నప్పావనమూర్తు లవ్వా! నీ వెవ్వరిదానవు? ఎచ్చోటినుండి యీయరణ్యమున కరుగుదానవు? నీరూపకాంతులు మా కెంతయు వింతఁ గొల్పుచున్నయవి. నీ విప్వనదేవతవే? ఈనదీదేవతవే? ఎఱుఁగఁ జెప్పుము. ఏల వగచెదు? నీచెన్నుఁ జూడ నీ వీదుఃఖమున కనర్హురాల వుగ నున్నావు. ఊరడిల్లుము. అనిన వారి కవ్వైదర్భి యిట్లనియె.

మునిచంద్రులారా! నేను మీ రూహించినవారిలో నెవ్వతెను గాను. నేను మానవకాంతను. క్షత్రియాంగనను. తపోధనుల రగుమీకు నావృత్తాంతమంతయు విదితముగాకుండునే? అయినను మహర్షులు మీ రడుగఁ బ్రత్యుత్తరము నీకుండుట తగ దని తనవృత్తాంత మంతయు వారియాశ్రమంబుచేరునప్పటికిఁ బూస గ్రుచ్చిన క్లైకరువుఁ బెట్టెను. అంత నావృత్తాంత మంతయు విని యమ్మునులు దమయంతితో 'ఓకల్యాణీ! వంత వలదు. మేము యోగదృష్టిం జూచితిమి. కొన్నినాళ్లలో నాపదలు తొలంగి శుభములతో నుండువానిని నలుని నీవు సూడఁగలవు. నీకు మేలు చేకూఱెడు శోకం బుడుగు' మని చెప్పి యామునులు తమ యగ్నిహోత్రాదు లుండు నాశ్రమముతో నదృశ్యులైరి. అందుల కా

సాధ్వి నివ్వెఱఁ బొంది యిది కలయా? కాదేని, యిచ్చటి యాశ్రమం బేది? మును లేరి? వారియగ్నిహోత్రాదు లెచ్చోటి సున్నవి? ఆశ్రమ వృక్షములును మృగంబులు నేడ? అని వితర్కించుచు నాయరణ్యమునఁ బోవంబోవ నం దొక్కయశోకవృక్షముం గని ఓయశోకమా! నీవు వీతశోకమవు. పలుపువ్వులగుత్తులతో నొక్క పెనుఁగొండంబోలె విరాజిల్లు చున్న దానవు. నాపతి నలభూపాలుం జూచితే? ఆతండును నీవలె వీతశో కభయుండు. శత్రువులను మర్దించువాఁడు. సుకుమారాంగుఁడు. సగము చీరగట్టికొని యివ్వనంబునఁ దిరుగాడుచున్నాఁడు. నీపేరు సార్థకంబుగా నాతనిపోకను నాకుఁ దెలిపి నాశోకంబు వారింపవే' అని డగ్గుత్తికతో నాక్రందించుచుఁ గన్నీరు మున్నీరై పాఱుచుండ నాచెట్టు చుట్టును ప్రదక్షిణంబుచేసి పిదపఁ బెక్కుకొండలను, పలుమెకములను బక్షులను బూలగుత్తులుగల చెట్లను జూచుచుఁ దనప్రియుని వెదకుచు బహు దూరం బరుగుచున్నంతఁ గొంతదూరంబున నిర్మలోదకముతోను, హంసలు జలకుక్కుటములు మున్నగు జలపక్షులతోను మనోహర మగు నొక్క మహానదిని దాఁటుచున్నదియు, నేనుఁగులు, గుఱ్ఱములు, రథములు మున్నగువానితో సంకీర్ణమైనదియు, నగు నొక్క బిడారుం గని దానిని సమీపింపఁబోయెను. అప్పుడు దుఃఖావేశమునఁ జిక్కి సౌందర్యము తఱిగి వెఱ్ఱిరూపుగలదియు, దుమ్ముదుమారములతోఁ బెనఁగొనిన ముంగురులు కురులు గలదియు, సగముచీరను గట్టి నదియు నగు నా దమయంతిం జూచి యా బేహారులు గొందఱు వెఱ చఱచి పాఱిరి. కొందఱు వగచిరి. కొంద అసూయపడిరి. మఱికొంద 'అవ్వా నీ వెవ్వతెవు! ఈవనంబున నేల దిరుగుచున్నదానవు? ఇవ్వనదే వతవో? రాక్షసివో? దివ్యాంగనవో? గిరిదేవతవో? కాని కేవల మనుజాంగన వని తలంపరాదు. సత్యమెఱిఁగింపుము. నిన్ను మేము శరణు చొచ్చెదము. మమ్ము రక్షింపుము. ఈబిడారు సేమంబున నీవనమును దాఁటి నిజదేశముఁ జేరున ట్లనుగ్రహింపు మనఁగా దమయంతీదేవి వారికి స్వవృత్తాంతము నెఱింగించి తనభర్తయానవాళ్లు సెప్పి వస్త్రార్థ ముం దాల్చిన యామహనీయు నలరాజుం గంటిరే? మీచనుప యెటకుఁ బోవుచున్నది?' అని యడుగ నావణిగ్జనాయకుండు శుచి యను

వాఁడు 'అవ్వా! నలుఁ గాన మివ్వనమునందు మేము సింహాదిక్రూ
రమృగములఁ జూచుచున్నాము. నిన్నుఁ దక్క నీకాననమున వేఱొండు
నరరూపమును మేము చూచి యెఱుంగము. ఈబిడారు చేదిదేశరాజు
సుబాహు వనువానిపురమునకుఁ బోవుచున్నది. బేరము సాగించి లాభ
మును బొంద నుద్దేశించినది. యక్షనాథుఁడు మణిభద్రుఁడు మాకు
క్షేమలాభములను బ్రసాదించుఁగాక' యని చెప్పఁగా విని దమయంతి
యాసాతువెంబడిఁ బోవుచుండెను. ఇట్లు దమయంతి కతిపయప్రయాణ
ములు సాతుసాహాయ్యమునఁ బోవుచుండ నాసా తొక్కనాఁడు కడు
నెండ యెక్కినంతకు నుగ్రాటవిలో నడవి డస్సినదై పూలతోను బండ్ల
తోను సొంపుగూర్చుచెట్లతో నొప్పారు గొప్పకట్టతోను జల్లనితేట
తియ్యనినీటితోను పీనుల కింపుగాఁ బాడుపక్షులకిలకిలధ్వనులతోను
బచ్చనిపచ్చికతో రమణీయంబైన చుట్టుపట్లప్రదేశములతోను నుండు
నొకచెఱువుం గని నాఁ డెల్ల దానిపడమటిగట్టునందు విడిసెను.
ఆనాఁటినడురేయి చనుప యంతయు దూరమార్గము నడచుటను
బడలి యచ్చోట నిదురించుచుండ నడవిమదపుటేనుంగులు కొన్ని యా
తెరువున నీరు ద్రాగవచ్చి చనుపలో నున్నయేనుంగులం జూచి వానిని
వధింపఁబూని,కొండలపై నుండి దొఱలుశిఖరములవలె వెలయు తమపాద
ఘట్టనధ్వనుల దెసలు పీటలవాఱునట్లుండ వేగమునఁ బరువెత్తివచ్చి దమ
మార్గమున కాటంకముగాఁ బరుండి నిదురించుచున్న సాతులోనివారిని
గాంచి కొందఱఁ గొమ్ములఁ గుమ్మి, కొందఱ వేదండముల మొత్తి,
కొందఱం గాళ్లరాచి నేలఁ ద్రొక్కుచుండఁ గొందఱు వానికి భయంపడి
చిందరవందఱలై పాఱిరి. కొందఱు పొదరిండ్లను దూరిరి. మఱికొందఱు
పాఱువా రొకళ్లొకళ్లం దాకి వికలాంగులైరి. వేఱొకకొందఱు భయ
ముచే నఱచుచు నేలఁ గూలిరి. కొందఱు చెట్ల నెక్కువా రవసరమునఁ
గ్రిందపడి చచ్చిరి. కొంద ఱీయేనుంగులగుంపు ప్రళయాగ్నివోలె
దహించుచున్నయది. ఎటకేనియుంబాఱి ప్రాణములం గాచుకొందమనిరి.
కొంద 'ఱయ్యో యిది రత్నాలమూట. ముడి వదలి క్రింద రతనాలు
రాలుచున్నయవి. ఊలినవాని నేఱుఁ' డనుచుండిరి! కొంద 'ఱెట్లైనఁ
గానిండు. దీని వదలి పోవలదు. ఇది యందఱకును బొత్తైన ధనము' అని

కేకలు వేసిరి. ఈతీరున నాసార్థసమూహమంతయుఁ జెల్లాచెదరై యేనుంగులను నగస్త్యమునీంద్రుచేఁ ద్రాగఁబడెను. దమయంతీదేవి యేనుంగులబారి నెట్లోకో తప్పించుకొని నిదుర మేల్కొని భయభ్రాంతయై భయంకరములగు నేనుంగులచేష్టలకు వెఱచి వెలవెలనై నిట్టూర్పులు నిగిడించుచుండె. ఆవనుపయందుఁ జావఁగా మిగిలిన వర్తకు లొక్కచోఁ జేరి పుత్రమిత్రభార్యాదులవినాశమునకు దుఃఖించిరి. కొంద ఱీకష్టమేల కలిగెననిరి. కొందఱు మనము యక్షేశు మణిభద్రునిఁ గుబేరునిఁ బూజింపమైతిమి. దానిఫలమును దోడ్తో ననుభవించితి మనిరి. కొందఱు బిడారము వెడలునపుడు శకునములఁ జూడమైతి మనిరి. పుణ్యతిథివారనక్షత్రముల నాలోచింప లేదని కొంద ఱనిరి. కొంద ఱీయేనుఁగులగుంపుచే బంధుమిత్రుల కీయపాయంబు గలుగుటయు, ధనముపోకడయు మన వెంబడి వెట్టిదై వచ్చుచున్న వనిత కారణంబునఁ గలిగినది. అది యక్షియో? రాక్షసియో? లేక, పిశాచియో కావలయు. ఇయ్యది దానిమాయయే యనియు నప్పాపాత్మురాలెందుఁ బోయె? దానిని గఱ్ఱలతో బాదుదము, మట్టిపెళ్లల దానిపై రువ్వుదము. బురద నెత్తి దాని నెత్తిని రాయుదము. పిడికిళ్లచే గ్రుద్దుదము. ఎట్లైన దానిని నశింపఁ జేయుదము. అని సాహసించి పలుకుచుండిరి. వారిదారుణంపుమాటలను రాజపుత్రి విని సిగ్గునను విషాదమునను భయమునను నయ్యరణ్యమధ్యముం జొచ్చి తనలో నిట్లనియెను. అయ్యయో! నే నెంత నిందలపాలైతిని! ఇయ్యది యేకర్మములఫలమో? పుట్టిననాటంగోలె నెప్పుడైన నొక్కరి కెంతమాత్రము చెఱుపు గోరినదానను గాను. నిరాపనిందకు నే నెంత పాలైతిని! ఈయాపదకు దరి యెయ్యదియో! భర్త రాజ్యమును గోల్పోయినవనట, మనోనాథు నేఁడబాసినచింత, బంధుజనము లాడికొనుమాటలవలని యవమానము, కన్నబిడ్డలకు దూరురాల నగుట, యీకాననంబున సంచరించుట యనునివియే నన్ను వేదనపఱుపం జాలియున్నవి. నాకుఁ దుద కీనింద మోయవలసి వచ్చె. కట్టా! ఈబిడారున నిందఱికి నేనుఁగుగుంపుచేఁ బొలియుట తటస్థించెను. నా కేల యీమరణంబు రాదు. నాదౌర్భాగ్యమునం జేసి యిది నాకుఁ దటస్థింపదయ్యె. నేను దుఃఖసాగరమున మునిఁగియున్న దాన

కాలము దీరనిది మానవులకు మరణము గా దను లోకో క్తి యనృతంబు గాదు. ఇందఱఁ గాల రాచి నేలఁ ద్రొక్కి చంపినయేనుంగులకు నేఁ గాన రాకపోయితినే? మనుష్యులు సుఖదుఃఖములను విధిప్రేరితులై యనుభ వింతురు. పసిదాననై పుట్టింట నుండఁగా నే నొకపాపము నెఱుంగను. స్వయంవరమునాఁడు నేను దేవతలను వరింపక నామనోనాథు నలరాజును వరించుటచే వా రీకష్టములకు నన్నుఁ బాల్సేసియుందురు కాఁబోలు నని వాపోవుచుండె.

## దమయంతి చేదిపురమును బ్రవేశించుట

అంత మఱునాఁడు హతశేషులగువర్తకులును చనుపవెంబడి వచ్చిన విప్రులును బ్రయాణముకాఁగా వారివెంబడి నావైదర్భి కతిపయదిన ప్రయాణములు సలిపి యొక్కనాటిసాయంకాలమునందుఁ జేదిరాజగు సుబాహువుపురముఁ బ్రవేశించి రాజవీథిఁ బోవుచుండ, నామె మలిన దేహముం జూచి పౌరులు, "ఆహా! నివురు గప్పినయగ్నిఁబోలె నున్న దీని రూపసౌందర్యములు బహుదినప్రయాణాయాసంబునఁ దఱఁగియున్నవి. కాకున్న నిట్టిరూపముతో నుండునిది కాల్నడకతోఁ బో నర్హురాలే యని విస్మితులయిరి. పౌరబాలురు దాని వెన్నంటి పోవుచుండ దమయంతి రాజ మార్గమునందుఁ బోయి రాచనగరిని సమీపించె. ఆదారిని వెలవెలనై సౌందర్యము గొంతతవడినదియు, సగముచీరఁగట్టినదియుఁ జిక్కినశరీ రము గలదియు, ముడి వీడి విరియఁబడి యుండుతలవెంట్రుకలు గలదియు, వేఁదుఱుగొన్నదియుఁబోలె నున్న యన్నలమహీపాలుకాంతం గనుం గొని మేడపై నుండి రాజమాత తనసేవకురాలి నొక్కతెఁ బిలిచి చూచితే యీవనిత యెవ్వనిదియో యాపదలపాలైనట్లు గాన్పించు చున్నది. రూపసౌందర్యముల నాలోచించి చూడ మంగళదేవతయుం బోలె మననగరునంతయుఁ బ్రకాశింపఁజేయుచు నున్నది. పరికింపఁగా నిది దుఃఖావస్థ యగు నంగనామణిగాఁ దోఁచుచున్నయది. దారిఁ బోవు వారు దాని నొకవిచిత్రవస్తువుఁగాఁ జుట్టుకొని 'మోర లెత్తి చూచుచు నున్నారు. అవ్వనితను మననగరునకుఁ దోడ్తెమ్మనుటయు, 'రాజ మాతయాజ్ఞ యైనది. అవ్వా! నీవు నగరునకు రమ్మని యాదాది దమ

యంతికి నివేదించి వెంటనే యామెను దోడ్తెచ్చె. రాజమాత నైషధు భార్యరూపమును నాపాదమస్తకము చూచి 'అమ్మా, నీ వెవ్వరిదానవు? మేఘములమధ్యఁ గ్రొక్కారుమెఱుంగుచాడ్పున నీజనసమూహము నందు నీయుత్తమదేహకాంతిఁ బ్రసరింపఁజేయుచున్నదానవు. వనట్లు కాస్పదంబయి, సొమ్ములు లేకుండినను సుకుమారతేజోవిరాజిత మైన నీరూపు మనుజవనితలకసామాన్యమై యున్నది. మఱియును నొంటికత్తెవయ్యు జనసమూహము చుట్టుకొన్నను భీతిలేక పోవుచున్నదానవు. ఆలోచింప నీవు దేవభామినివో యనునట్లు తోఁచుచున్నయది.' అని చెప్పఁగా సందులకు భైమి యిట్లనియె. 'రాజ్ఞీ! నేను మానవ వనితను. నామగఁడు గుణములప్రోవు; నాకుఁ గూర్చువాఁడు. విధిప్రేరేపితుఁడయి జూదమాడి సకలధనరాసుల నోడి యొంటిబట్టతో నడవులకుఁ బోయెను. అతఁ డేయాపదపాలగునో యని నేను నాతనివెంట నీడయుం బోలె నమ్మహనీయు ననుసరించుచు నరిగితి. అంత నొక్కనాఁ డరణ్యంబున నాఁకలిదప్పుల కోర్వలేక నకనకలాడుచుఁ దనకట్టినవస్త్రమును సైత మొకకారణంబునఁ బోఁగొట్టుకొని వెట్టివానివలె సంచరించుచుండ నేను కంటికి ఱెప్పవోలె నాతని చర్యలఁ బరికించుచుంటి. అంత నొక్కనాఁ డాఘోరారణ్యమున నొకపగలు దారిం బోవఁబోవ నొక్క సభం గని బడలి యందు మేము పరుండి నిదురించుచుండ నాపతి విధిప్రేరణంబున నాకట్టినవస్త్రార్థంబు చించికొని యనువ్రతను నిరపరాధను నగు నన్ను విడనాడి యెటకేనియుం బోయె. సౌందర్యవంతుఁడును, సదాచారపరుఁడును నగుటచే దేవతుల్యుం డగు నానాథుఁ బాసి వందురుచు నడవులఁ గాయలను గడ్డలను దినుచు సాయంకాలమైన తావునందుఁ బరుండుచుఁ బతిఁ గానక సైరంధ్రీవేషధారినై తిరుగాడుచున్నదాన' నని కన్నీరు మున్నీరై కార్చుచు నేడువఁగా రాజమాత దాని నూరార్చి సుందరీ! నీయెడ నాకుఁ దెలియరాని ప్రియము జనించెను. ఇట నుండుము. నీమగని వెదుక మాసేవకుల నియోగించెద. నీవు చెప్పలాగునఁ దనయిచ్ఛమైఁ దిరుగాడు నీపతి యొకవేళ నిందులకు రాఁగలఁడు. ఇచ్చోటనే వానిఁ గలిసికొందువు. అనఁగా నలరాజపత్ని రాజమాతతో నిట్లనియె. నన్ను నిం దుంచుకొనఁ గోరుదేని, కొన్ని నియమ

షులకీ వాడంబడుము. అట్టులైన నుండెద. అవి యెవ్వి యనిన విను. నే నెంగిలి గుడువను. ఇతరులకాళ్లు గడుగను. వెఱమగవారితోఁ బలుకను. ఎవ్వఁడేని యీనగరునందు నన్నుఁ గామించినచో వానినిమీరు దండింపవలయును. పతి నన్వేషించుపొంటె వచ్చు విప్రులతోఁ బలుకుదు. ఈనియమముల కిష్టపడియెదవేని నే నిం దుండుదు ననఁగా రాజమాత సంతసిల్లి యందుల కియ్యకొని తనకూఁతు సునందను రావించి భైమిం జూపి, 'యమ్మా! ఈపతివ్రత నీకు సైరంధ్రియై సేవలఁ జేయుచుండు. ఇది నీయీడుది. దీనియందు విశ్వాసముతో మైత్రి నెఱపుమని యన్నలుభార్య నప్పగింపఁగా నద్దేవి యాసునందతో దానియంతఃపురంబునకుఁ బోయి దాని చెల్లెలిపూపుల మెలఁగుచు భర్తృసందర్శనలాలసయై యచ్చో వసించియుండె.

అంత నిట నలుం డామొండవమున నొంటి నిదురించుచుండిన దమయంతివస్త్రంబు సగముచించి తాఁ గట్టుకొని యద్దేవినెడఁబాసి ఘోరారణ్యంబున సంచరించుచుండ ముందట నరణ్యంబు నెల్ల దహించుచున్న కార్చిచ్చుం జూచుచుఁబోవుచుండ నక్కడ యెలుంగు వినఁబడెను. ఓపుణ్యశ్లోకుఁడా! నలరాజా! వేగ రమ్ము. అను దీనధ్వని పలుమాఱు వినఁబడఁగా పరమకృపాళుఁడగు నా నరవరేణ్యుం 'డిదిగో వచ్చితి. భీతిల్లకు' మని మాఱుపల్కి యాకార్చిచ్చుం జొచ్చి యందుఁ గదలక మెదలక శరీరము నంతయుఁ జుట్టచుట్టుకొని పయుండియున్న పాఁపఱేనిం జూచిన నతఁడును నృపాలునకు మ్రొక్కి యేను కర్కోటకుఁడను వాఁడ. నారదమహర్షికి నేఁ జేసినయపరాధంబున నామహానీయుండు నన్నొకస్థావరముపోలెఁ గదలకుండు మని శపింపఁగా శాపాంతంబు నేను బ్రార్థింప నాయం దనుగ్రహించి, యేనాఁడు నలభూపాలుం డీయరణ్యమున నీప్రదేశమునకు వచ్చి నిన్ను వేఱొకస్థలమునకుఁ గొంపోవునో యానాఁడు నీ కీయచలత్వము తొలఁగు. నిజరూపము వచ్చు ననియె. ఆశాపంబునం జేసి నే నిచ్చోటినుండి యొక్కయడుగేనియుఁ గదల నేరకున్నవాఁడ. ఈకార్చిచ్చుమధ్యనుండి నన్నుఁ గొంపోయి యొక్కజలాశయమునందుఁ జేర్చి పుణ్యముం గట్టికొమ్ము. నీవు నన్నెత్తికొనిన నేను బరువు తగ్గి మిక్కిలి చులకనయ్యెద. అట్లొనర్చితి వేని నీకు శ్రేయస్సుఁ

గలుగఁ జేసెద. నేను పాములలో నుత్తముండను. నీకు హితుఁడనై యుండెద” నని చెప్పఁగా నలుండు బోటనవ్రేలిమాత్రమైన యాకర్కోటకు నెత్తికొని కొంతద వ్వరిగి కార్చిచ్చు లేనియొకసరోవరతీరంబున విడువఁ బోగా నప్పాము “ మహానుభావా! ఇంక నెంచుచుఁ బదియడుగు లరుగుము. నీకు శ్రేయఃప్రాప్తియగు” ననెను.

## నలుండు కర్కోటకునిచేఁ గఱవఁబడి విరూపుఁ డగుట

సరోవరంబు సమీపించెను. త న్నెట్టులైన నలుండు మున్ను దాను గోరినట్లు వదలు నని కర్కోటకుం డూహించి మేలు చేసిన యా మహీపాలున కుపకృతిఁ జేయం దలంచి తనవిషము నలరాజుదేహమునఁ జొచ్చిన, దానివలన నతనికపకారము గలుగనేర దనుకొని, తన్ను దవాగ్నిమధ్యమునుండి తప్పించిన యాపరమోపకారిని గఱచుట వివేకకృత్యము కాదని తలపోసియును నెట్లైనను దాఁ గఱచుటచేతనే ప్రత్యుపకారము చేసినట్లగునని నిశ్చయించుకొని పదియడుగులు లెక్కించుకొనిపోయి వదల మనెను. అప్పుడు నలుండు గీర్వాణమున ఏకం(ఒకటి), ద్వే(రెండు) త్రీణి(మూఁడు), చత్వారి (నాల్గు), పంచ (అయిదు), షట్ (ఆఱు), సప్త (ఏడు), అష్టౌ (ఎనిమిది), నవ (తొమ్మిది), దశ (పది, కఱవుము), యని యడుగు లెన్నికొని దశ యని పలికి, తత్క్షణ మా కర్కోటకుచేఁ గఱవఁబడి యాతనిని వదలెను. మహోపకారిచేతనే దశ-(కఱవుము) యని యాజ్ఞాపింపఁబడినట్లెంచి కఱవఁగా నలుండు వికృతరూపముం దాల్చె. దానికి నలుండు విస్మయం బంది తనరూపును జూచుచుండఁ గర్కోటకుండు వాని నూరార్చి, రాజా! ని న్నెరు లెఱుంగకుండ నీసహజరూపమును మార్చితి. నీకు నపకృతి నెవ్వఁడు చేసెనో వాఁ డీవిషవేగమున నుడుకు చుండు. ఈవిషవేగమును సహింపఁజాలక నిన్నుఁ జొచ్చిన యాపరమదుష్టుండు తాన యావిషమును గ్రక్కుచుఁ గొంతకాలమునకు నిన్ను వదలి వచ్చువాఁడు. నీవు నిరపరాధుండవు. ఇట్టి కష్టములపాల్పడుట కనర్హుండవు. నిన్నాపుర్మతి యడలించుటం జేసి యీాసున నాచేసిన యీాయెగ్గు వాఁడ యనుభవించు. నిష్కారణంబుగ నిన్నుఁ గఱవనేరక దశ యనినీచేతనే యనిపించితి. దీన నీకు

రక్ష యగును. నాయనుగ్రహమునఁ జేసి నిన్నుఁ బెద్దపులులుగాని, యింక నీకాననంబునఁ దిరుగుక్రూరమృగములు గాని, నీశత్రువులుగాని, యితర విషాదులు గాని నీకు భయముఁ గలిగింపవు. నీ వెవ్వనితోఁగాని యుద్ధం బుచేసినచో నీకు జయ మవశ్యంబు గలుగు. ఇఁక నిచ్చోటినుండి తఱలి దీనికి సమీపమున నుండునయోధ్యకు జేరుము. దానిని ఋతుపర్ణుండను రాజర్షి యేలుచున్నాఁడు. బాహుకుం డనుపేరు వహించి వానికి సారథ్యమును జేయుచుండుము. ఆమహనీయుండు ప్రఖ్యాతిఁ గన్న యిక్ష్వాకువంశమువాఁడు. నీనేర్చినయశ్వహృదయం బను విద్య నారా జున కుపదేశించి యాతనియొద్ద నుండునక్షహృదయం బనువిద్యను నీ వుపదేశంబుగొనుము. వాఁడు సకలగుణసంపన్నుండు. వానితోఁ జెలిమి నెఱపుము. అక్షహృదయవిద్యామహిమచే నీవు క్రమ్మఱ నీదార పుత్త్రాదులను జేరి సుఖ ముండుదువు. మఱియు నీవస్త్రద్వయం బొసంగెద. నీవు నిజరూపంబుఁగోరునాఁడు నన్ను స్మరించి యీవస్త్రముల ధరింపుము. నిజరూపప్రాప్తి యగు నని చెప్పి వస్త్రములజత నొకదాని నిచ్చి కర్కోటకుం డదృశ్యుం డయ్యె.

## నలుం డయోధ్యకుఁ బోయి ఋతుపర్ణుని సేవించుట

పిదప నలుండు పదిదినములు ప్రయాణంబునేసి యయోధ్యఁ జేరెను. చేరి యొకసుముహూర్తంబున రాజదర్శనంబు గావించి ఋతుపర్ణుతో నిట్లనియె. నరేంద్రా! నేను బాహుకుం డనువాఁడ. అశ్వశిక్షానిపుణుండ. నావలె రుచ్యంబుగ నెవ్వం డన్న పానంబులను జేయలేఁడు. నాయాలోచనంబు సదర్థంబుఁ జేయు. శిల్పవిద్యాదులఁ బెక్కు నేర్తు. పెఱవారలు సాధింపలేని యెట్టిదుష్కరకార్యములనైన సాధింతు. నీయొద్ద సేవకుఁడనై కొన్నినాళ్లుండెద. నన్ను భరింపుము. అనఁగా ఋతుపర్ణుం డందుల కియ్యకొని బాహుకా! నాయొద్దన యుండుము. నేను వేగంబునఁ బ్రయాణము సలుపఁ గోరుచుండు నాగుఱ్ఱములను బాగుగ శిక్షించి వానికి గమనవేగము నేర్పుము. నీకు నెలజీతము నూఱు గద్యాణంబు లిచ్చెద. నాయొద్ద నుండువార్ష్ణేయజీవలు లను నశ్వశాలాధ్యక్షులు నీకు హితులై నిను సేవింతురు. వారితోఁ జెలిమివాటించి

కార్యంబునఁ దోడుపడుచుండు మని సమ్మానపూర్వకంబుగ నధికారము నిచ్చె. అంత నలుఁడు బాహుకనామముతో ఋతుపర్ణునియొద్ద గుఱ్ఱముల శిక్షింపుచు, వానికిగమనవేగంబు నేర్పుచు, రుచ్యము లైనయన్నములఁ గావించుచు వార్ష్ణేయజీవలులతోఁ గూడికొని దమయంతీదేవిఁ యనుదినము సాయంకాలమునఁ దలంపునకు రాఁగా నయ్యది యాఁకలిచేత నవయుచు బడలి వెతలఁ బడుచుఁ దన్ను వీడిపోయినయా నిర్భాగ్యునిఁ దలఁచుచు నెవని నండగాఁ గొని యున్నదో యని వాపోవుచుండె. దీనిని జీవలుండు నిత్యము వినుచుండి యొక్కనాఁడీబాహుకవేషమున నుండువాఁడు, 'నలమహారాజా యేమి యని వితర్కించి బాహుకునితో బాహుకా! నీయాత్మగతంబెట్టిది? నీవనుదినంబు స్మరించు వనిత యెవ్వతె? ఏల యిట్లువాపోయెదవు?' అని యడుగఁగా "పూర్వ మొకతెలివిలేనివాఁ డొకానొకఁ డరణ్యమున నడవులకుఁ బోయి తన యం దనురక్తయైన సహధర్మచారిణి తనవెంట రాఁగా దాని నాకాననంబున మోసపుచ్చి విడనాడెను. పిదప వాఁడు దేశభ్రష్టుఁడై యొకానొక స్థలముం జేరి యెల్లప్రొద్దు తనధర్మపత్నిఁ దలంపుచు నిట్లు వాపోవుచుండు. పాపము! ఆదౌర్భాగ్యవంతుఁ డాయబలను విడిచి రాఁగా నది శరీరమునఁ బ్రాణముల నిలిపియున్నదో, లేక, ప్రాణత్యాగంబుం గావించికొనినదో? అనేకక్రూరమృగములచే నిండియుండు నరణ్యమున దారి నరయ లేక యే మయ్యెనో? ఇది వానివృత్తాంతంబ కాని, జీవలా! నాయుండురూపుఁ జూచి యెవరైనను నవ్వరా! నలినాక్షి నా కేల? విప్రయోగము నామదిఁ జొరునా? వానిసమాచార మాత్మగతంబునకు రాఁగా దానిన యనువదింపుచుండును. అంతియకాని వేఱొక్క యాలోచనము లేదు" అని నలుండు జీవలున కావృత్తాంతము సెప్పి ఋతుపర్ణునింట వంటలవాఁడై యజ్ఞాతవాసంబునఁ బ్రవర్తిల్లుచుండె.

### సుదేవుం డను విప్రుండు చేదిపురంబున దమయంతి నెఱుంగుట

అంత విదర్భరా జగు భీముండు నలవృత్తాంతం బంతయు నెఱింగి తనయల్లుండును కూఁతురును కాననంబున కేగినవా రెచ్చోట నున్నారో, యేరూపమున నుందురో యని వారికి విధి గాంచినపాటునకు వాపోయి

పలువుర విప్రుల రావించి వారికి వలసినంతధన మొసంగి తనకూఁతు నల్లుని నెఱింగి రమ్మని యాజ్ఞ సేయఁగా వా రనేక దేశములకుఁ బోయిరి. అన్వేషణార్థము పోయినవారిలో వారివెంటఁ బెట్టుకొనివచ్చువారికి గో సహస్రంబును, ననేకాగ్రహారంబులను, విదర్భ కెనవచ్చు గొప్పపట్టణము నిచ్చెద ననెను. మఱి వారిపోఁబడి మాత్రము దెలిసివచ్చువారికి వేయి పాడియావుల నిచ్చెద ననెను. బ్రాహ్మణు లనేకులు ధనాశచే ననేకరాజ్య ములను పట్టణములను దిరిగి వేసారి నలునిఁ గాని, దమయంతీదేవినిఁ గాని తెలియక మరలి విదర్భకుం జేరిరి. కాని, వారిలో సుదేవుం డను వాఁడు పెక్కాళ్లుం దిరుగుచు, నానారాష్ట్రముల నాదంపతుల నెమ కుచు నొకనాఁడు చేదిరాజధాని యగు సుబాహునిపురమున కరిగి కొందఱు విప్రులు పుణ్యాహవాచనము నగరునందు జరుగుచున్న దని వెళ్లిచూడఁగా వారివెంబడిఁ దానును నగరు సొచ్చి నివురు గప్పిన యగ్నివోలె మందగించియుండు రూపముగలది యగు రాజపుత్త్రి సునందచెంగటఁ గూర్చున్నదాని దమయంతిం గాంచెను. చూచుచునే సుదేవుండు తనయాత్మగతంబున, 'నీసుందరిని నే నెచ్చటనో చూచి యున్నట్లు తలంచెద. ఈవనితారత్నంబు మన్మథురాణివోలె మోహ నాంగి యయ్యు, మంగళదేవత వోలె నిజనిర్మలతేజంబుచే నలుదెసలఁ జీఁకటులఁ జెదరఁగొట్టునదియు నిండుపున్నమచందురుని వెన్నెలవోలె సర్వజనసంతోషకారిణియయ్యు మగనిని విడనాడిన విషాదంబున రాహువు గ్రసించినచంద్రుఁడు గల పున్నమరేయివడువునను, వేసవి కాలంబున నిర్జలంబైన యేటిచందంబునను, నేనుఁగుతొండంబునం జిక్కి ఱేకులు రాలి, హంస లూఁగులాడుటచే నల్లకల్లోల మగుకమలిని విధమునను, తమనెలవుం దప్పించి బైటవేయఁబడి యెండవేడిమికి వాడినతామరతూఁడు రీతిని తొలకరిమబ్బులచేఁ గప్పఁబడిన నెల భాతి నందంబు దఱిగి, సొమ్ముల ధరింపమి భోగరహితయై నిజ బంధుజనదూరయై విదర్భ యనుకొలను విడనాడి బురదతోఁగూడిన తామరతూఁడో యనఁదగి, పతిం జూచునాసం జేసి యెట్లో మేనఁ బ్రాణం బులఁ దాల్చి యున్నయది. ఆనవాళ్ళం బరికింప నిక్కంబ యిద్దేవి భీమురాజతనయయే. దీనిం గని ధన్యుండ నయితి. సతులకు మేలి

తోడవు పతియకాదే? వానిఁ దొరంగిఁగుంటంజేసి యిట్టేవి చెన్ను తఱుంగకున్నె? నైషధుం డీపూఁబోఁడిని విడనాడుటచే నడలి యూర్పు మారక యేవిధమున బ్రదుకుచున్నాఁడో పూలపాన్పులయం దెల్లప్పుడు సుఖవతినై యుండిన యీ యంగనామణికష్టముఁ జూడంజూడ నామనస్సు కటకటంబడుచున్నది. ఈపరమపతివ్రతకు రోహిణికిఁ జంద్రసమాగమంబునుం బోలె భర్తృసమాగమం బెన్నం డయ్యెడినో? నలభూపాలుఁడును తనరాజ్యమును మగల సాధించుకొని తన కనురూప యగు నియ్యింతిఁ గలిసి యెన్నఁడు సుఖి యగునో? ఉచితరీతిగ నీయంగనను సమీపించి పలుకరించి యోదార్తుఁ గాక' యని నిశ్చయించి సుదేవుండు విప్రమధ్యమునందుండి యల్లన కదలి లేచి దమయంతియొద్దనకూర్చుండి, 'వైదర్భి! నేను సుదేవుండను విప్రుండ, నీసోదరుని చెలికాఁడను. భీమరాజునాజ్ఞఁ జేసి నీపోఁబడి యరయుచు బహుదేశములఁ దిరుగులాడి వెదకి సౌభాగ్యవశంబున నిన్ను నేఁడిచ్చోటఁ బొడగాంచితి. విదర్భయందు నీబిడ్డలు, నీసోదరులు, నీతలిదండ్రులు నింకను నీబంధువులు సుఖమున నున్నవారు. వారెల్లరు మీపోఁబడి యెఱుంగక వనరుచు నున్నారు. మీతండ్రి నిన్ను వెతకు నిమిత్తము విప్రులనేకులను బహుదేశములకుఁ బంపియున్నవాఁడు. నేను చేదిదేశంబునకు వచ్చితి. ఇట నిన్నుఁ గాంచి కృతార్థుండ నైతి' ననెను. అంత నాకల్యాణి సుదేవునిఁ దనయూరివానిఁగ గుర్తించి వేర్వేఱ కడమవారి క్షేమంబు లరసి స్త్రీజాతికి సహజ మగు విషాదమునఁ బరవశయై, కంటఁ దడిఁ బెట్టె. దాని నంతయు సునంద చూచుచుండి రాజమాతయొద్ద కేఁగి, 'అమ్మా, ఎవఁడో యొకవిప్రునితో మనసైరంధ్రి కొంత సంభాషించి కన్నీరు గార్చుచున్నయది. నాకుం జూడఁగ నయ్యది తనబంధుజనుల నెడఁబాసి వచ్చిన రాచవనితగాఁ దోఁచెడి. నీవు నెఱుంగఁగోరు దేని వేగ ర'మ్మనఁగా విని రాజమాత వెంటనే దమయంతి యున్నచోటి కేఁగి సుదేవునితో "అయ్యా! ఇవ్వనిత యెవ్వతె? దీనికిఁ దలిదండ్రు లెవ్వరు? నాథుం డెవ్వఁడు? బంధువులఁ దొఱంగి యుండుటకుఁ గారణం బేమి? దుఃఖమున విరూపిణియైయుండు దీని నీ వెట్లానవాలు పట్టితివి? సకలంబుఁ దెలుపవలసిన'దని యడుగ సుదే

వృందు సుఖోపవిష్టుండై రాజమాత కిట్లనియె. ఈపతివ్రత విదర్భరాజగు భీమమహీపాలునికూఁతురు; నైషధుఁ డయిన నలరాజుభార్య, దమయంతి యని పేర్కొనఁబడిన సుందరాంగి. ఆనలుండు సోదరుఁ డగు పుష్కరునితో జూదమాడి సకలమహీరాజ్యమును సంపదలను నోడ్డియోడి కానలకుం జనఁగా వానివెంట ననువ్రతయై యీయిల్లాలుం జనియె. వీరిరువురపోఁబళ్లు తెలియమి నాభీమరాజు వీరి నన్వేషించునిమిత్తము విప్రుల ననేకులను నానాదేశంబులకుం బంప నాభాగ్యవశంబున మీానగరునం దుండు నిప్పతివ్రతను జూడం గంటి. ఈమెకు సరివచ్చు సౌందర్యవతులు భూలోకమున మనుజాంగనలలో నెవ్వరు ను లేరు. ఈదేవికిఁ బుట్టుకతోడనే భ్రూమధ్యమునందు విభవసూచక మగు మచ్చ యొకటి గలదు. పతి నెడఁబాసియుండుటంబట్టి దేహసంస్కారంబు లేమిం జేసి యిపు డాగుర్తు మబ్బుచే నాచ్ఛాదింపఁబడిన ప్రతిపచ్చంద్రరేఖవడువునఁ గాన రాకున్నను గుర్తించి యాసుందరి వైదర్భియే యని నిర్ణయించితి'నన సునంద యుదకములఁ దెప్పించి భ్రూమధ్యమును జక్కఁగఁ గడిగెను. అంతటఁ దన్నాచ్ఛాదించిన మేఘము తొలఁగినతోడనే చక్కఁగాఁ బ్రకాశించు శీతాంశునివడువునఁ బ్రకాశించుగుర్తుం గనుంగొని యథార్థముగ నద్దేవి భీమరాజుపుత్రికయే యని నిశ్చయించి సునందయు రాజమాతయు దానిం గౌఁగిలించుకొని ముహూర్తకాలం బద్దేవిదైన్యంబునకుఁ గన్నీరుగార్చిరి. వెంటనే ధైర్యము నుబూని రాజమాత యప్పరమపతివ్రతఁ గని'కూఁతురా! మీాతల్లియు నేనును దశార్ణరాజైన సుదామునికూఁతులము. మీాతల్లి వైదర్భుని జెట్టపట్టె. నేను చేదిపతి యగు వీరబాహునిసతి నైతి. నీవు మాపుట్టినింట జనింపఁగాఁ జూచి యుంటి ఇదియు నీకుఁ బుట్టినయిల్లె. ఈసంపద యంతయు నీయదియ. నీవు గొఱంత లేక యనుభవింపనగు.' అనఁగా నద్దేవి తనతల్లితోఁబుట్టువునకు మ్రొక్కి 'యమ్మా! అజ్ఞాతనై, యిన్నినాళ్లు మీాచే సురక్షిత నైతి. ఇది నాకును బుట్టినయిల్లే. కావున నెంతకాలంబైన నుండ నగు. కాని, నాకన్నబిడ్డలం జూచి దీర్ఘకాలమైనది. వారలం జూడ మనం బువ్విళ్లూరుచున్నయది. తల్లిదండ్రులను వదలి వారెట్లుందురో? కావున, నాయందుఁ బ్రీతిగలదాన వేని నన్ను విదర్భాపురము

నకుం బంపుము. అదియే నా ప్రార్థన.' అని నలురాణి ప్రార్థించుటయు రాజమాత కరుణించి సుబాహువున కెఱింగించి వానిసెలవుఁ జొంది రక్షణార్థమై మహాసైన్యంబును గూర్చి ప్రయాణమునకు వలసిన పదార్థంబుల నాయితపఱచి దమయంతీదేవి నొక్క పల్లకియందుఁ గూర్చుండఁ బెట్టి విదర్భకుం బంపెను.

దమయంతియుఁ గతిపయదినప్రయాణంబుల వేగంబ విదర్భఁ జేరి తనుఁ బాసినయనుంగుబిడ్డలను, తల్లిదండ్రులను, బంధుజనులను జూచి యానందించి దేవతలకు నమస్కరించి భూదేవతలను బూజించె. భీమరాజు తనసూనుం దోడ్తెచ్చినందులకు మెచ్చి సుదేవునకు గోసహస్రంబును నగ్రహారంబులను నపరిమితధనము నొసంగె. ఇట్లు భైమి యనపహార్యమై, తేజోవంతమును, సర్వగుణముల కలంకారమును, శ్రేష్ఠము నగు తనపాతివ్రత్యమును గాపాడుకొనుచు జీర్ణమై కడుమాసినచీరఁ గట్టి ధూళిధూసరము లగు వెండ్రుకలతో స్త్రీవేషము గలదివోలె దీనముగఁ బుట్టినింటఁ గొన్నాళ్లుండి తనతల్లిం జేరి నలభూపాలు వరయుటకు విప్రులఁ బంపు మని ప్రార్థించుచుఁ 'తల్లీ, కొన్నినాళ్లలో నాపతిఁ గానరాఁ డేని నేను శరీరము తొఱంగెద. నీకు నాయెడఁ బ్రీతి గలదేని నాభర్తను దోడితెచ్చుటకుఁ దగువారినిఁ బంపుము.' అనఁగా భీమునిదేవి కూఁతునిశ్చయము నెఱింగి యడలుచుండ నావృత్తాంతము నంతయు విన్న యంతఃపురకాంతల హాహానినాదంబు లెసఁగఁ రాజపత్ని ధైర్యము నవలంబించి భర్తయొద్ద కేఁగి కూఁతువేదనఁ జెప్పి పుణ్యశ్లోకు నలు నన్వేషింప నానాదేశములకుఁ దెలివి గల విప్రులఁ బంపునట్లు చేసె. అప్పు డాదమయంతి నిజనాథాన్వేషణపరు లగు విప్రులను దనయొద్దకు రావించి వారలతో నిట్లనియె. మీరు నాపతి నన్వేషించునపుడు నలువురు గూడియుండుచోట్లనైన నీమాటలను జెప్పుచుఁ బొండు. "జూదరీ! భార్య గట్టుకొనియుండుచీరలో సగము చించికొని యది నిదురవోవుచుండ దాని నొంటిగ నడవిలో విడిచిపుచ్చి యెచ్చటికిఁ జనితివి? అనురక్త యగుసతిని బతి వదలునే? అది నీరాకయే నిరీక్షింపుచు నానాఁటఁ గడుమాసిన చింపిచీరనే కట్టుకొనుచు నీవియోగముచే వగలం బొగులుచున్నయది. ఎల్లప్పుడును భార్యను భర్త

భరింపపలయుఁగదా ? ధర్మమును నీవు తలక్రిందుచేసితివి. లోకప్రసిద్ధుఁడవు. పండితుఁడవు. కులీనుఁడవు. ధర్మవేత్తవునగు నీవును దానిత్యాగమున నకారుణికుఁడవైతివి. అన్నిధర్మములలోఁ గరుణగలిగియుంటమేలని నీవలననే తొల్లి వినియుంటి కావున నామెను గరుణింపు'' మని. ఇంతేకాక యతండు నాపైఁ గరుణించునట్లు పలుమాటలు వినయమున నాడుఁడు. గాలిచేఁ బ్రజ్వరిల్లు నగ్నివలె నీమాటలు పెక్కింటిచే నాతండు నాయెడఁ గరుణించు. ఈమీామాటల కెవండు ప్రత్యుత్తర మిచ్చునో యాతఁ డెవండనియు, నెచ్చోట నేపనిమీాఁద నున్నాఁడనియు లెస్సగఁ దెలిసి రండు. వాఁడు ధనవంతుఁడై యుండినను, కష్టబీదయై యున్నను, సమర్థుఁడుగ నున్నను, అసమర్థుఁడుగ మీాకుఁ దోఁచినను నేమఱక యాప్రత్యుత్తర మొసంగినవానిని లెస్సగ నారసి రండు. వానికి మీారు నాపంచినవా రని తెలియనీయక వేగంబ మరలిరండు.'' అని చెప్పి పుత్తెంచె. అంత నాపోయిన విప్రు లందఱును నానాదేశంబులు తిరిగి దమయంతీదేవి చెప్పినపలుకులు పలికి యెచ్చటను నలుంగానక విదర్భకు మరలి వచ్చిరి.

పిదపఁ గొంతకాలంబునకుఁ బర్ణాదుం డను బ్రాహ్మణుండు దమయంతియొద్దకు వచ్చి యిట్లనియె. దేవీ! నేను బహుదేశములను దిరిగితిని. పోయినస్థలములలో నలువు రుండుతావులయందు నీవు చెప్పిన మాటలను జెప్పుచుంటిని. ఎందును బ్రతివచనంబు విననైతి. కాని, యయోధ్యకుం జని ఋతుపర్ణుసభలో నీపలుకుల వచించితి. అందల కా రాజు గాని, యాసభలోనివారలు గాని యెవరును బ్రతివచనంబుఁ జెప్పరైరి. అంత నే నానృపాలుసెలవుం గొని యతనికొలువుకూటము వెడలి వచ్చినపిదప నారాజుసారథి గుఱ్ఱముల శిక్షించుటయందు నేర్పరి, పాకవిద్యయందు నైతను నిపుణుఁడు, సగముగూనివాఁడు, కుఱుచ చేతులవాఁడు, వంకర దేహముతోఁ గూడి చూచువారికి రోఁత పుట్టించువాఁ డొక్కరుండు బాహుకుఁ డనుపేరం బిలువఁబడు వాఁడు న న్నేకాంతమునకుఁ బిల్చి నిట్టూర్పు వదలి పలుమాఱులు పలవించి నాక్షేమమును విచారించి యి ట్లనియె. "విషమావస్థను జెందినపుడు సాధ్వీమణులు దమసంరక్షణమును దామ చేసికొనుదురు. పతుల

యెడఁబాటు గలిగినను ధర్మసంచరణంబునం జేసి ప్రాణములఁ గాపాడు
కొందురు. కలిసమావిష్టుఁడై యాపదలపాలై యాహారమునిమిత్తము
పక్షులఁ బట్టునెపంబునఁ గట్టినవస్త్రంబును బోఁగొట్టుకొని యేమియుం
దోఁపక జీవయాత్రఁ గావింపుచున్నయతండు తన్ను విడనాడిపోయె నని
నిందించి కినుక వహించుట భార్యకుఁ దగదు. భర్త తన్ను సత్కరించినను,
లేకున్నను నాఁకలిదప్పులచే బాధితుఁ డగునతనివలనఁ గోపింప భార్యకుఁ
దగ'' దనఁగా విని నేను వేగంబ యిచ్చటికి నేతెంచితి. తగినట్లు చేయుము.
భీమరాజునకు విన్నవింపు మని చెప్పి పర్ణాదుండు పోఁగా దమయంతి
కంట నీరు గార్చుచుఁ దల్లిం బిలిచి యిట్లనియె. అమ్మా! నేఁ జెప్పునభిప్రా
యములను రహస్యముగ నుంచుము. సుదేవుఁడు నన్నుఁ దోడితెచ్చిన
టులు నైషధుని నైత మవశ్యముగఁ దోడితెచ్చు. కావున సుదేవు నయో
ధ్యకు నీయెదుటనే చెప్పి పంపెద. నాయందు విశ్వసింతు వేని యీసం
గతిని నాతండ్రి కెఱుకపఱుపకు మని తల్లి నందుల కొడంబఱచి పర్ణాదుని
సత్కరించి వేగమే నాకుఁ బతిసమావేశ మగునట్లు దీవింపు మనఁగా,
పర్ణాదుం డందులకు సంతసించి దమయంతికోరిన మంగళాశీర్వచనము
నొనర్చి తనయునికిపట్టునకుం బోయె. వెంటనే దమయంతి సుదేవుని
రావించి కుదుర్పాటులేనిమనంబుతో, "విప్రోత్తమా! నీ విప్పుడ యయో
ధ్యకుం బోయి ఋతుపర్ణునసభలో నారాజర్షిం జూచి 'నలమహీపాలు
పోక తెలియమి, నయోధ్యయందు రేపే దమయంతికి ద్వితీయస్వయం
వరంబు ప్రవర్తిల్లు ననియుఁ బుడమిఁ గల రాజు లెల్లరు విదర్భకుఁ
జనుచున్నారు. నీకుం గోర్కి కలదేని వేగంబ పొమ్మని చెప్పునది' "
యని తల్లిసమక్షమునఁ జెప్పుటయు నందులకు సుదేవుం డుచితం
బెఱింగి వల్లె యని యయోధ్యకుం బోయి రాజర్షి యగు ఋతుపర్ణున
కంతయు సవిస్తరంబుగఁ జెప్పెను.

### ఋతుపర్ణుఁడు దమయంతీద్వితీయస్వయంవరనిమిత్తము విదర్భకుం జనుట

ఋతుపర్ణుండు సుదేవునివలన నంతయు నెఱింగి స్వయంవరో
త్సవముఁ జూడ వేడ్కపడి బాహుకునిఁ బిలిచి వానికుత్సాహంబు వొడ
మునట్లు మాటలు పల్కుచు నోబాహుకా! విదర్భలో దమయంతికి

ద్వితీయస్వయంవరము రేప జరుగ నున్నదఁట. మన మందులకుఁ ద్వరిత గతి నరుగవలయు. నీయశ్వహృదయవేదిత్వం బెఱింగింప నద నయ్యె. నాకోర్కి నీకుఁ దీర్ప నుత్సాహం బేని యొక్కదినంబున నన్ను విదర్భకుం గొనిపొమ్ము. అనఁగా బాహుకుండు కొంత చింతించి "నాకసుర క్తయు, శోకాకులచిత్తయు నగు నా దేవిని బాపమనక మందప్రజ్ఞుఁడనై యడవి పాల్సేసి విడిచివచ్చితి. క్రూర మగు నీ నా కార్యముచే నాయందలి ప్రేమను వదలి రెండవస్వయంవరమున కుద్యుక్తురా లయ్యె నేమో? అంతియే కాక యంగనలచిత్తంబులు చపలంబులు. లేక నన్ను రావించునిమిత్తమున నే యీయుపాయము నూహించె నొక్కో? ప్రజాపతియైనవనిత యిట్టి కృత్యంబున కియ్యకొను నొక్కో? ఆలోచింపఁగా నిదియే నిశ్చయంబై యుండ నోపు. ఇంద్రాదులను వరింపక నన్నే పారిసమక్షమమున వరి యించి ధన్యం గావించిన కోమలి యెన్నఁడైన నిట్టియపవాదమున కేని పాల్పడఁ గలదే? ఇంత యేల? కుండిననగరంబునకుఁ బోయి సత్యముఁ దెలిసికొనియెద. ఆత్మార్థముగనే రాజునభిప్రాయము ననుసరించి నడతు"నని నిశ్చయించి ఋతుపర్ణునకు నమస్కరించి నీకోరిన యట్లు చేసెద. ఒక్క దినమునకే కుండిననగరమునకుఁ జేరఁగలము. అని చెప్పి గుఱ్ఱపుశాలకుం బోయి చక్కఁగఁ బరిశీలించి తేజో బలములు గలవియు, సమర్థములును, వేగవంతములును, నుత్తమ జాతివియు, లక్షణవంతములును, దశావర్తములతోఁ గూడినవియు నగు మంచిగుఱ్ఱములం దెచ్చినఁ జూచి ఋతుపర్ణుండు బాహుకునిఁ గొంతకోపంబున వీక్షించి 'యిప్పెదగుఱ్ఱంబు లొక్కదినంబున విదర్భకుం బోనేర్చునే? నాయిష్టమును నెఱవేర్తు నని చెప్పి నన్ను వంచింప నేల?' అని పలుక, బాహుకుండు రాజేంద్రా! ఇవి యుత్తమాశ్వంబులు, సలక్ షణంబులు, దశావర్తసమంచితంబులు. నీ కివి నీకోర్కెఁ దీర్పవని యున్నచో నీకోరినవానిఁ బూన్చెద ననఁగా రాజు 'బాహుకా! అశ్వతత్త్వము నీకంటె నే నెఱుంగువాఁడనా? కానిమ్ము. నీయిచ్చవచ్చిన ట్లొనర్పుము.' అనఁగా బాహుకుండు తాఁ దెచ్చిన గుఱ్ఱములు నాల్గింటిని రథంబు నకుఁ బూన్చుటయు, ఋతుపర్ణుండు వేగమున రథారోహణము సేసె. అంత నాగుఱ్ఱములు మోకటిల్లఁబడుటయు బాహుకుండు వానిఁ దట్టి

యోదార్చి, లేవనెత్తి పగ్గములఁ బిగియించి వార్ష్ణేయుండును దనతో
నొగ లెక్కి రాఁగా యరదముం బఱపుటయు నాగుఱ్ఱములు రాజున
కాశ్చర్యము గదుర వాయువేగమునఁ బోవుచుండె. ఋతుపర్ణుండు
బాహుకునశ్వవిద్యావేదిత్వమును, రథఘోషలక్షణమును గమనించి
'యీతండు మాతలియో? నలుఁడో? శాలిహోత్రుఁడో? కాకున్న నితరుల
కిట్టిసామర్థ్యంబు గలదే?నలువిద్యలనన్నింటెసి బాహుకుండు నేర్చియుండెఁ
గాఁబోలు? అట్లు గాదు. వయోవిద్యాగుణముల నితండు నలుం బోలెడి.
కురూపి యగుటకు హేతు వెద్దియో? మహనీయులు గూఢముగా
సంచరించుచుందురు వారి నొరు లెఱుంగనగునే?' అని తలపోయుచుండె.
బాహుకుసామర్థ్యంబును, రథవేగమును ఋతుపర్ణుఁడు పలుమాఱు
మెచ్చుచుండె. అంత రథంబు వాయువేగమున ననేకనదీనదములను,
నున్నతపర్వతములను, ఘోరారణ్యములను క్షణమాత్రమున దాఁటి
పోవుచుండ ఋతుపర్ణునియుత్తరీయము జాఱి క్రిందఁబడుటయు నతఁడు
బాహుకునితో, 'సారథీ ! రథగమనం బించుక సడలింపుము. నాయుత్తరీ
యంబు జాఱి క్రిందఁబడినది వార్ష్ణేయుండు పోయి తీసికొని రాఁగలఁ'
డనఁగా బాహుకుఁడు రాజేంద్రా ! నీయుత్తరీయంబు పడినచోటుఁ గడచి
యిపుడు యోజనంబు వచ్చితిమి. దానిని వార్ష్ణేయుం డెట్లు తేఁగలఁ
డన రాజు విస్మయం బందుచుఁ గొంతదూరంబు చని దారియం దొక్క
చోట నాకులం బండుల నిండిన యొక్క విభీతకవృక్షంబుఁ బొడఁగాంచి
యతిరయంబున బాహుకున కిట్లనియె.

సారథీ! నీసామర్థ్యముం జూపి నాకు మెప్పు గలిగించితివి. నాసామ
ర్థ్యమును జూడుము. ఎల్లవార లెఱుఁగ రెల్లవిద్యలను, విద్యలయందెల్ల
వారును భిన్నవిషయులుగ నుందురు. ఎవ్వండును సర్వజ్ఞుండు గానేరఁడు.
ఇవ్విభీతకవృక్షంబు నెన్నిఫలము లున్నవో, యెన్నియాకు లున్నవో
లెక్కింపకయే చెప్పెదను. అందు రాలినయాకులు నూటునొక్కటి.
పండ్లు రాలినవి నూఱు. చిన్నకొమ్మలతోఁ గూడినయీరెండుగొప్పకొమ్మ
లలోనియాకు లైదుకోట్లు. ఫలములు రెండువేలుందొంబదియైదున్నవి.
నమ్మవేని గణించుకొమ్మనిన, నలుండు రథమును నిలిపి, 'రాజేంద్రా! దీని

'నిట్లొక్కరునకు లెక్కింపఁబోలునా? నీగణనమును నమ్మనేరను. కావున నే
నిప్పుడ యీకొమ్మల నఱికి క్రిందవైచి లెక్కించెద. ముహూర్తకాలము
మాత్రము వార్ష్ణేయుండు పగ్గముల బిగఁబట్టుకొని యుండునుగాక.
అనఁగా ఋతుపర్ణుం డిక్కార్యంబు మనప్రయాణమునకు జాగగు
ననుటయు, బాహుకుండు రాజా! కొంతసేపాగుము. ఇదె వచ్చెద. ఇంత
తడ వీయకున్కి నీకుఁ బాడియే ? కాదేని యీదారిన వార్ష్ణేయుఁడు
సారథ్యంబు చేయుచుఁ బోవుచుండు నే నీగణన గావించి నీగణనాయా
థార్థ్యం బరసికొనివచ్చెద. విదర్భ కిదియే తెరు వనఁగా ఋతుపర్ణుండు
బాహుకా! సారథ్యమున నీకు సమానుఁ డింకొకఁ డుండఁడు. నీవలన
విదర్భ నొక్కనాఁడ చేరుదు నని నమ్మి నిన్ను శరణుఁ బొందితి. దీని
కంతరాయము వలదు. ఈనాఁడ స్తమించుటకుఁబూర్వము నన్ను విదర్భను
జేర్చితి వేని నీకోరినదాని నే నొనర్చువాఁడ. ఈచెట్టునందుఁ గొంత
లెక్కించి యంత నావచనంబు నిక్కం బని తలంతు వేని క్రమ్మఱ నరదం
బెక్కి సారథ్యంబు నడుపుము. అని శాంతిపూర్వకముఁగ నుడివెను.
అప్పుడు బాహుకుండు ఋతుపర్ణునితో రాజేంద్రా! నీకోరినకోర్కెను
స్మరించినిన్ను సూర్యాస్తమయసమయమునకుమున్న కుండినపురంబుఁ జేర్చు
భారము నాయది మఱియు నీకొమ్మలయందలి యాకుల గణింపకున్నను
ఫలములను మాత్రము లెక్కించి యాథార్థ్యం బరసెద నని బాహు
కుండు రథమునొగ డిగ్గి విభీతకమును సమీపించి యాకొమ్మల నఱికి
క్రిందవైచి గణించి ఋతుపర్ణుమాటలు యథార్థంబు లగుట కాశ్చర్యము
నొంది ఋతుపర్ణునితో నోరాజర్షి ! నీసామర్థ్య మద్భుతంబు. దీని నెట్లు
చెప్పం గలిగితివి ? ఆవిద్యను నా కనుగ్రహింపవే. నానేర్చిన యశ్వ
హృదయంబు నీ కుపదేశించెద ననిన ఋతుపర్ణుండు బాహుకుని
మాహాత్మ్యము నెఱింగి యక్షహృదయం బుపదేశంబుగొనుట కర్హుం
డనియు, సత్పాత్ర మనియుఁ దలపోసి బాహుకా ! నీకోరినయక్ష
హృదయమును నీ కిప్పుడ యుపదేశించెద. నీయశ్వహృదయము నీయొద్ద
నుండ నిమ్ము. వలసినప్పు డుపదేశముగొనియెదనని చెప్పి, 'వేగంబ విదర్భ
కీతండు నన్నుఁ గొనిపోవుట కితని నిప్పుడు మెప్పింపవలయును. ఇదియు

మేలి వేరవని నిశ్చయించి విధ్యుక్తముగ నలున కక్షహృదయము నుపదేశించెను.

## నలుఁడు కలివిముక్తుఁడై విదర్భాపురంబుఁ జొచ్చుట

అట్లు నలుఁ డక్షహృదయము నుపదేశముగొనుచుండఁగనే దాని ప్రభావమున నలు నాశ్రయించియున్న కలి కర్కోటకవిషమును గ్రక్కుచు నలుని విడిచి స్వస్వరూపము నొందెను. అట్టివానిఁ జూచి వీనియొక్క దుర్మతంబునఁ గదా తన కీయాపదలు సంప్రాప్తములైన వని నలుం డతనిని శపింపఁ బూనుడు, వాఁడు గడగడ వడంకుచుఁ గేలు మొగిచి నలభూపాలా! కోపమును దూలంగి ప్రసన్నుండవు గమ్ము. నే నింతకాలము కర్కోటకవిషంబునను, నిన్నెడఁబాయుటంజేసి రోసిన నీదేవిశాపమునను మిక్కిలి వేదన ననుభవించితి. నిన్ను శరణు చొచ్చెద. శరణార్థి నగునన్నుఁ గావవే. ఆశ్రితరక్షణంబు మహనీయులకు సహజగుణంబ కాదె? నాకు శాపంబీయక రక్షించి పొమ్మంటివేని నిన్నుఁ గీర్తించినవారు నావలనిబాధఁ బొందరు. ఈకారుణ్యంబున నీ కెంతయు నాచంద్రార్కస్థాయి యైనకీర్తి గలుగును. అనఁగా నలుండు శాంతుఁడయ్యె. కలియు నితరుల కెవ్వరికిఁ గానరాక నలునితో మాత్రము ప్రత్యక్షమున మాటలాడి యావిభీతకము నాశ్రయించి వెనుకఁ దనయునికిపట్టునకుంబోయె. అప్పటినుండి కలిసంశ్రయ మగుటచే విభీతకపుఁజెట్టు లోకమున నప్రశస్తమాయెను. నలుఁడును కలివిముక్తుఁడై యంగవికారము దప్పఁ దక్కిన వికృతులు లేక తనపూర్వతేజముతో వెలయుచుఁ బరమహర్షమున రథము నెక్కి గుఱ్ఱములపగ్గముల సడలించి సారథ్యంబుఁ జేయుచు నతివేగంబ సాయంకాలమునకు మునుపే విదర్భను బ్రవేశించెను. ఋతుపర్ణురాక నెఱింగి భీముండు తగుమానుసులతో నెదుర్కోలుగావింప ఋతుపర్ణురథఘోషంబుచే దిక్కులు ప్రతిధ్వను లీన, మేఘగర్జనమువంటి యారథఘోషమును వినినంతనె నగరులోనినెమళ్లెను, నేనుంగులును నలరాజుతొల్లింటియశ్వంబులును గడు నుత్సుకంబులై కూఁతలిడినవి, ఘీంకరించినవి, సకిలించినవి. నలురథఘోషము నెఱింగిన దమయంతియు నలుఁ డరుదెంచె నని యూహించె. తనవారితో నేలకో

'నామనస్సు సంతోషమునఁ బొదలుచున్నయది. నలభూకాంతుండు నన్నుఁ జూడఁ రాఁడేని, నే నాయిందుముఖునిఁ గాంచ నేని, వాఁడు నన్నుం జాఁకి సుఖినిఁగాఁ జేయఁడేని, యానాఁడగ్ని ప్రవేశంబుఁ జేసెద. ఆమహా క్షీయుండు నా కెగ్గెన్నఁడును జేయలేదు. నాతోఁ గాని, యన్యులతోఁ గాని యనృతంబు నెన్నఁ డాడి యెఱుంగఁడు. సమర్థుఁడు; శౌర్యమహితుఁడు; ఉదారుండు; సకలమహీపాలమండనాయమానుండు. విహారముల యందును నాడినమాటఁ దప్పనివాఁడు; తనమహానుభావముచే నేకార్యమున నైనను నా కింపుఁ బుట్టించుచుండు. ఆరాజేంద్రుగుణంబు లపారంబులు. వానిని రేలుంబవళ్లును గీర్తించుచుండినను తనివి దీఱ' దని తలంచుచుఁ గొంత సేపటికి నాపుణ్యశ్లోకుని దర్శింప నిచ్ఛగించి యొక్కమహాసౌధము నెక్కి నగరుయొక్క కక్ష్యాంతరమున రథస్థుఁడైనఋతుపర్ణుఁడును, సారథు లగువార్ష్ణేయబాహుకులును గానరాఁగా నలుండు వారియందుఁ గానమికి వగఁజెందె. అంత ఋతుపర్ణుండు రథావతీర్ణుఁడయి నగరునందుఁ బ్రవేశించె. వానికి మున్న రథమును దిగినవార్ష్ణేయబాహుకులు రాజు దిగుచుండఁగనే యశ్వంబుల సడలించి యశ్వశాలకుం గొనిపోయిరి. ఆకస్మికముగ వచ్చినఋతుపర్ణుని భీముండు గాంచి స్వాగతంబడుగ ఋతుపర్ణుండు పురంబున స్వయంవరసన్నాహంబు లేవియుఁ, గానరామిఁ గాంచి 'భీమరాజా! నేను నీకు మ్రొక్కంగ నేతెంచితి' నన భీముం డింతయు రాజు లుండ నిప్పు డీయయోధ్యాపతిమాత్రము నాకు మ్రొక్క రా నేల యని స్త్రీమంత్రణం బెఱుంగమి వితర్కించి యైనను మార్గాయాసమున ఋతుపర్ణుఁడు బడలియుండుఁ గాన విశ్రమించుట మేలని పలుమా ఱుపచారవచనములు పలికి, యుచితసత్కారములు గావించి,విడిదలకుఁ బంపుటయు నయోధ్యాధిపతి వార్ష్ణేయుండు సహాయుఁడయి రాఁగా తనకు నియమిత మగు నొక్కసౌధమును జేరె. అట బాహుకుఁ డశ్వశాలయందు గుఱ్ఱములఁ గట్టి యథావిధిగ వానికిఁ జేయవలసినపరిచర్యలఁ జేసి రథసమీపమున సుఖోపవిష్టుం డయ్యె. అంత నంతిపురంబున దమయంతి మనంబునఁ గొందలపాటు గదుర 'ఈరథఘోషము నలురథఘోష మని తలంచితి. నలుఁడు గానరాఁ డయ్యె.

ఈఘోషమునం జేసి ఋతుపర్ణుఁడు నలసమానుఁడయి యుండవలయు. లేకున్న వార్ష్ణేయుఁడు నలశిక్షితుఁడు గాన నలరాజుసామర్థ్యంబు వానిం జేరియుండు. కాకున్న నితరులరథముల కిట్టి మ్రోఁతయుండునే?' యని తలపోయుచు నిశ్చయము నరయవలయు నని యూహించి తనదాదికేశిని యనుదానిం బిలిచి 'కేశినీ! నీవు ఋతుపర్ణురథసమీపమునఁ గూర్చున్నవానిని, వికృతాంగునిఁ గుఱుచచేతులవానినిఁ జూచితివా? ఆతనిం గాంచుటచే నామనస్సు కొంచెపు లమందుచున్నది. ఈతండు నలుండ కాఁబోలు. అంగవికారము కలుగుట కేమి హేతువో? కావున నీ వతనిపాలికిం బోయి యల్లన యాతనియోగక్షేమములను దెలిసి యాతనికలరూపెఱింగిరమ్ము. అంతయు నెఱింగిన పిదపఁ బర్ణాదువచనంబు వివరించి దానికి వాఁ డిచ్చుప్రతివచనము నారసిరమ్ము.' అనియానతిచ్చె.

## కేశిని నలునొద్దకేఁగి వచ్చుట

అంతఁ కేశిని దమయంతి చూచుచుండఁగనే బాహుకు సమీపించి 'యోనరశ్రేష్ఠా! నీకు సేమంబె. దమయంతి పంపఁగా నే నిటకు వచ్చితి. మీరయోధ్యనుండి యెపుడు తరలితిరి. ఇటకు రాఁ గతం బేమి?' యని యడుగ నందులకు బాహుకుఁ డిట్లనియె. విననమ్మ నేఁ జెప్పెద. 'దమయంతీస్వయంవరం బెల్లి యని నిన్న మాయయోధ్యలో నొకవిప్రుని వలన విని నూఱుయోజనములును వేగమ పోఁగల గుఱ్ఱములను రథమునకుఁబూన్చి దానినెక్కి ఋతుపర్ణమహారాజరు దెంచె. నే నారాజుసారథి' ననఁగా కేశిని "అయ్యా! మీరిద్దఱు కాక మఱిమూఁడవవాఁ డెవ్వఁడు? ఏల వచ్చె? అతఁ డెవనివాఁడు? నీ వెవనివాఁడవు? ఈపని నీ కెట్లుకలిగె" ననఁగా బాహుకుఁ డిట్లనియె. వాఁడు పుణ్యశ్లోకుఁడగు నలమహీపాలు సారథి వార్ష్ణేయుండను వాఁడు. నలుఁడు రాజ్యభ్రష్టుఁడై కానలకుంబోఁగా ఋతుపర్ణు నాశ్రయించి వాని సారథియయ్యె. నే నశ్వవిద్యను నేర్చిన వాఁడను. మఱియు ఋతుపర్ణువంటలవాఁడను. అన్నపానాదుల రుచ్యంబులుగా నొనర్చు సామర్థ్యంబు నాకుఁ గలదు. అనఁగా కేశిని బాహుకునితో 'నయ్యా! వార్ష్ణేయునకు నలుపోక తెలియునే? ఈవృత్తాంత మెల్లవాఁ

డెట్లు నీకుఁ దెలిపె?" ననియడుగ బాహుకుండు వెండియునిట్లనియె. వార్ష్ణే యుండు నలు రాజ్యభ్రంశంబు నెఱింగి దమయంతీదేవిపంపున వారికూఁతుం గొడుకును విదర్భరాజునొద్దవదలి యథేచ్ఛఁ జనియె. కాని వాఁడు నేఁడు నెఱుంగఁడు. ఎవ్వడును నలు నివ్వ డెఱుంగరు. ఆతఁడు రూపు మాఱి గూఢవర్తనుఁడుగ నున్నాఁడు. ఆనలుని నాతఁ డొండె, వాని భార్య యొండె యెఱుంగుదురు కాని యన్యు లెఱుంగ లేరు. తనయాన వాళ్ల నేరికి నాతండు సెప్పండు. అనఁగాఁ గేశిని యిట్లనియె. తొలుత నయోధ్యకు వచ్చినవిప్రుండు "జూదరీ! భార్య కట్టుకొనియుండుచీరలో సగము చించికొని నిదురవోవుచున్నదాని నడవిలో విడిచిపుచ్చి యెచ్చటికేఁ జనితి? అనురక్తయగు సతిం బతి వదలునే? నీరాకనే నిరీక్షించుచు నానాఁటికి గడుమాసినచీర జీర్ణమయ్యును, దానినే కట్టికొనుచు, నీవియోగముచే వగలం బొగలుచున్న నను దయఁజూడుము" అను మాటలకుఁ బ్రత్యుత్తర మొసఁగినవాఁడవు నీవ కావే? ఆప్రత్యుత్తరమును మా దమయంతీదేవి విన వేడుచున్న దని పలుక, వినిన బాహుకుండు వెల్లువగలఁ బొగలి కనుదోయి బాష్పజలంబులు గ్రమ్ముకొన డగ్గుత్తికతో నిట్లనియె. "విషమావస్థఁ జెందినపుడు సాధ్వీమణులు దమసంరక్షణమును దామ చేసికొందురు. పతులయెడఁబాటు కలిగినను ధర్మాచరణంబునం జేసివారు ప్రాణములఁ గాపాడుకొనుదురు. కలిసమాపెష్టుఁడగుచు నాపదల పాలై యాహారమునిమిత్తము పక్షులఁబట్టు నెపంబునఁ గట్టినవస్త్రముం బోఁగొట్టుకొని యేమియుం దోఁపక జీవయాత్రఁ గావించుచున్న పతి దన్ను విడనాడిపోయె నని నిందించి కినుక వహించుట భార్యకుం దగదు. భర్త తన్ను సత్కరించినను లేకున్నను, నాఁకలిదప్పులచే బాధితుండగు నతనిపయిఁ గోపింప భార్యకుఁ గర్తవ్యము గాదని చెప్పితి" నని పలికి కన్నీటిని నిలుపఁజాలక యతండు విలపింపఁగాఁ గేశిని యట నిలువక దమయంతిపాలికిం బోయి యెల్ల వృత్తాంతములను వినిపించె. భైమియు నాపలుకుల నెల్ల నాలకించి వ్యాకులితస్వాంతయై బాహుకుని నలునిఁగా నూహించి, 'కేశినీ! నీవు వెండియును వానియొద్ద కేఁగి వానిలక్షణములనెల్ల నరసి ర' మ్మనఁగా నట్లుపోయి వానివర్తనంబుల నెఱింగివచ్చి దమ

యంతితో నిట్లనియె. దేవీ! వానియందు దైవసములు నమానుషములు
నగు ప్రవర్తనంబు లున్నయవి. వానిచరిత్రంబు లోకోత్తరంబు. నే నెచ్చ
టను గని విని యెఱుంగను. ఆతండు కుఱుచనిద్వారంబులఁ జనునపుడు
తల వంపఁడు. తాను వంగఁడు. వంటనిమిత్త మగ్నినిగాని జలమునుగాని
దెచ్చుకొనఁడు. వాఁడు జలకుంభములను జూచుచు వలసినంతజల మా
కుంభములలో సంపూర్ణముగ నగును. వంజాళ్లు గడుగ జల మపేక్షించి
నచో నయ్యది తనంత యుద్భవించు. పిడికెడుగడ్డిని జేతఁ బట్టికొని
సూర్యున కెదురు నిలిచి విసరఁగనే యం దగ్ని యద్భుతముగఁ బ్రజ్వ
రిల్లు. వాఁడు సకలపదార్థములను నితరసాధనముల నపేక్షింపకయే
వండును. ఈవర్తనం బంతయు నాకె వింతఁ గొల్పినది. ఇంతేకాక
వాఁ డగ్నిం దాకినను దహింపఁబడఁడు. జలకుంభమును వంపఁగా నందుండి
వానికి వలసినంతజలమె స్రవించు. వాఁ డఱచేతిలోఁ గుసుమములు
నలిపినను నవి వాఁడవు వెండియు వికసించి పరిమళించు. ఈవిచిత్రముల
నెల్ల వానియొద్దఁ గంటిని. నీకు వీని నివేదింప వేగమె యరుదెంచితి
ననఁగా దమయంతి బాహుకునిఁ గర్మచేష్టావిశేషంబులచేఁ నలునిఁగా
నెఱింగి మఱియు వానియింగితమును బరిశీలింపఁ దలంచి కన్నీరు
సంతతధారగాఁ గాఱుచుండఁ గేశినితో 'నీ వీమాఱటకుఁ బోయి వాఁ
డేమఱియుండునపుడు వండియుండునంజుడుం గొని' రమ్మనఁ గేశిని
మాఱుపలుకక పోయి యపుడే వండఁబడియుండు వేడిమాంసముఁ దెచ్చి
దమయంతి కందియ్య నా దేవి దాని నాస్వాదించి దానికమ్మనిరుచిఁ గని
యింత రుచిమంతంబుగఁ బాకము సేయుటకు నలేతరు లెవ్వరు నేరరు.
బాహుకుని నలునిఁగా నిశ్చయించి చాలసేపు విలపించి శోక ముడిగి
కొంత ప్రొద్దునకు, గొడుకుం గూఁతుం గేశినితో బాహుకునొద్దకుఁ బంపె.
అంత బాహుకుండును గేశినివెంబడి వచ్చినబిడ్డల నెత్తి ముద్దాడి,
లాలించి సంబరమునఁ గౌఁగిలించికొని విషాదపరవశుఁడై కేశినికిఁ దెలియ
నీయక కొంత దుఃఖించి దానితో నీ బిడ్డలు నాబిడ్డలం బోలియుండుటం
బట్టి యమ్మా! నే నిట్లొనర్చితిం గాని యన్యంబు గాదు. నీ విచ్చటికిఁ
బలుతడవలు రావలదు. మేము దేశాంతరాగతులము. మీరాజున కతి
థులము. నీ విట్లిచ్చోటికి వచ్చుచుఁ బోవుచున్కి నెవరైనను శంకిం

తును. ఇచట నీ వుండవలసు పొమ్మనినఁ గేశిని దమయంతియొద్దకు వచ్చి వానిప్రవర్తనమును, వాఁడు చెప్పినమాటల నన్నింటిని జెప్పెను. అంత దమయంతి తనతల్లియొద్దకుఁ బోయి 'యమ్మా! బాహుకునిచేతలనువాని పలుకులను బరిశీలింపఁగా నతండు నలుంబోలువాఁడు. నలుఁడే. రూపము నందు మాత్రము సంశయ మున్నది. నేను దర్శింప నా సందియముం దీఱుఁ గావున వాని నిటకు రప్పించుట యొండె, కాక న న్నటకుఁ బంపు టొండె నిర్ణయింపు' మనఁగా నావృత్తాంత మంతయు నాభీముదేవి రాజున కెఱింగించి యతనియానతిఁగొని బాహుకు దమయంతియంతిపురమునకు రప్పించె. అంత నలుండుజీర్ణమై కిడుమాసినచీరఁ గట్టి జడలఁ దాల్చి వంత నలరుచున్న నిజపత్నిం జూచి దుఃఖాకులమానసుండై బాష్పములఁగార్చె. అయ్యవస్థలో నున్న భర్తం గాంచి భీమరాజతనయ యెంతయు విలపించుచు, హామహారాజ! క్రూరమృగనిబిడంబైన కాననంబునఁ గూర్కుచున్న వనితను విడిచి పోయిన యొకానొకధర్మాత్ముం గాంచితే? నిరపరాధినియు, ననువ్రతయు, పుత్రవతియు నగు ననుంగుఁబ్రియురాలిని నలేత రుఁడు వీఁడునే? అట్లొనర్చుటకు నామె యేమి నేర మాతనికిఁ గావించెను? ఆకాంత స్వయంవరకాలమున దేవతలు దన్నుఁ గోరఁగా వారిం గాదని వారిసమక్షమునఁ దన్నెవరించినయది. అక్కాలమున దేవతలు సాక్షిగ నిన్ను విడువ నని బాసఁజేసి యగ్నిసాక్షికంబుగ నన్ను వివాహమాడిన యా నలుఁ డానాఁటియాథార్థ్యము నీనాఁడు మఱచునే? యని పలుకుచుండఁగాఁ గన్నీటితో నలుం డిట్లనియె. వైదర్భి, నారాజ్యభ్రంశంబు, భవత్పరిత్యాగము నాయొనర్చినవి గావు. ఇవి యదృశ్యుండైన కలిసమావేశంబునం గలిగె. నావియోగంబును సహింపక వియోగకారకుఁ డగు వాని నీవు శపించితివి. ఆశాపకారణంబునఁ గలి పెక్కుబాధల ననుభవించి యింతకాలము నన్నుఁ జొచ్చి యుండి నాతపఃకారణంబున నిప్పుడు నన్ను విడిచి చనియె. ఆకారణమున నిపు డిచ్చటికి నీనిమిత్తము వచ్చితి. ఇటనాకుఁ గార్యాంతరము లేదు. అది యట్లుండె. దమయంతికి రెండవస్వయంవరము వర్తిల్లు నని నానాదేశములలో దూతలు చాటుచున్నారు. ఇది తెలిసి కాదే యిప్పు డిచటికి కీబుతుపర్ణుం డయోధ్యాపతి యేతెంచె. ఇది తగునే? నీవు దక్క వేఱొక్కరులకాంత

యెవ్వతె యేనియు ననురక్తుండౌను, ననుప్రేమించును నగు పతిని వదలి వేఱొక్కరుని వరించునే? అనఁగా నామాటలకు దమయంతి యదరిపడి భయకంపితయై కేలు మోడ్చి పతి కిట్లనియె. భూపాలా! నాయెడ సందియమువలదు. దేవతలను వరింపక నేను నిన్నే వరించినదాన. నీజాడ దెలియుటకు నాతండ్రి సకలదేశములలో నిన్ను వెదకిరమ్మని విప్రులఁబంపి యుండె. అందుఁ బర్ణాదుండను బ్రాహ్మణుండయోధ్యంజేరి రాజసభలోఁ గొన్నిపలుకు పలికిన నందులకుఁ బ్రత్యుత్తరము నీవలన నెఱింగి నీవర్తనమును, నీరూపును, నీహావభావములఁ బ్రత్యక్షముగఁ బరిశీలించి యిచ్చోటికి వచ్చి మాతండ్రి కావృత్తాంతము నంతయుఁ జెప్పె. ఆమాటలకుఁ బ్రతిచెప్పినవాఁడు నీవ యని నిశ్చయించి నిన్నిటకు రప్పించుటకుఁ గావించిన యుపాయముగాని యిది యన్యము గాదనియు, నీవు దక్క వేఱొక్కఁడు శతయోజనంబులదూరము నొక్కదినము రాలేఁడని తెలిసియున్నదాన నగుటయు,దీనిసూహించి 'దమయంతీద్వితీయస్వయంవర మెల్లి' యని ఋతుపర్ణుసభలో నాడు మని సుదేవు నేన పంపితి. నీపాదములాన; యింతియ యథార్థమగు సకలవృత్తాంతము. కాని వేఱొండు గాదు. కలనైన నే నన్యపురుషుఁ గోరి యుండు నేని నన్నిప్పుడ వాయు సూర్యచంద్రాగ్నులు నశింపఁజేయుదురు గాక! ఈ నలువురు దేవతలు యథార్థము నిప్పుడు పరీక్షించి నన్నుఁ గాపాడుదురు గాక! యని పల్కుచుండ నాకసమున వాయు విట్లనియె. నలభూపాలా! దమయంతిని సందేహింపవలదు. ఇమ్మూఁడేఁడులు నీయెడఁబాటునకు సాక్షులము. ద్వితీయస్వయంవర మెల్లి యని నిన్న ఋతుపర్ణునిసభలో సుదేవుండు చెప్పినది నిన్నొక్క దినములోపల నిటకు రప్పించుసుపాయమే కాని వేఱొండు గాదు. మీ రిరువు రొండొరులకుఁ దగినవారు. సందేహము దక్కి దమయంతిం బరిగ్రహింపుము. అనఁగాఁ బూలవాన గురిసె. దుందుభులు ధణధణమ్మ్రోఁగె. చల్లనిగాలి వీచె.

### నలుండు నిజరూపమును గ్రహించి దమయంతిం గలిసికొనుట

అందుల కాశ్చర్యపడి నలుండు దమయంతియందు శంకను దొఱంగి కర్కోటకుం డొసంగినవస్త్రములజంటను ధరించి యా నాగ

శాఖుం పలంచి నిజస్వరూపముఁ బొందెను. వైదర్భియుఁ దేజస్వంతుఁడై తన ముందట వెలయుచుండు నాపుణ్యశ్లోకుఁ గాంచి వానిం గౌఁగిలించికొని వానియురంబునఁ దనయిందువదనముం జేర్చి 'వియోగాంతముం గంటిని గదా' యని నిట్టూర్పులు నిగుడించుచు నానందపరవశయై భర్తను నిష్టు రంబు లాడుచుండె. నైషధుండును గొడుకుం గూఁతుం గౌఁగిలించు కొని యప్పరమపతివ్రత నూరడించుచుఁ దనపడినపాట్లకు శోకింపు చుండె. ఈవృత్తాంతంబు నంతయు భీమరాజు సతీమణి వైదర్భున కెఱింగింప, రాజు తనకూఁతునల్లునిసమాగమంబున కెంతయు సంతసించి వారినిం జూచువేడ్క రేపకడ యగుదెంచెద నని వచించె. ఆతీరున దాఁటఁగూడని వియోగసాగరమును దరించి, నీరు పాఱినందునఁజిగిర్చినయెండుపైరువోలె, వియోగఖిన్నయైన దమయంతి తన్నుఁ బొంది తనిసి నిశాపతిం గూడిన నిశీథినియుంబోలె నెంతయుఁ దేజోవతియై యుండ నైషధుండును దనప్రియురాలిం గలిసికొని పరమానందసాగరమునం దేలియాడుచుండె. ఆదంపతు లిరువురు నాతీరునఁ గలిసికొని తమవియోగకాలమునగుమూఁడేండ్లఁ బడరానిపాట్ల ననుభవించినముచ్చట లన్నియుం జెప్పికొనుచు నారేయి నొక్కముహూర్తముగఁ గడపిరి. అట్ల మఱునాఁడు నలుఁ డుదయంబునఁ గాల్యకృత్యంబులఁ దీర్చికొని యలంకృతుండై దమయంతితో భీమరాజుకొలువుకూటంబునకుఁ జని యభివాదనంబు లొనర్ప నారాజు కూఁతున కల్లునితోఁగల్గిన సమావేశంబునకు మిక్కిలి సంతసించి వారి నాశీర్వదించి యథార్హంబుగ సత్కరించి యూఱడించె. అంత విదర్భేశ్వరుండు వారిసమాగమోత్సాహద్యోతకంబుగఁ బురము నలంకరింప నియోగించెను. దేవతాపూజలఁ గావించె. విప్రులకు దానాదుల నొసంగి సంతుష్టస్వాంతులం జేసె. నలుండును భీమరాజు గావించిన సత్కారమును గ్రహించి భక్తితో మెలఁగె. దీని నెల్ల ఋతుపర్ణుండు విని యపరిమితానందంబు నొంది తనవిడిదికి నలు రావించి నిజస్వరూపముతోఁ బ్రకాశించుచున్న యామహీనాథుం జూచి విస్మయ మంది 'నలభూపాలా! ఆపదలఁ బోనాడితివి. సౌభాగ్యమును జెందితివి. ప్రియురాలిం గూడితివి. మాయింట నజ్ఞాతుండవై యుండ నీ కేమి యె గ్గయ్యెనో, దాని నాబుద్ధిపూర్వకంబుగ నే

నొసర్చినవాఁడను గాను. జ్ఞానముననఁగాని, యజ్ఞానముననఁగాని యెట్టినేరములు జరిగియున్నను నన్ను మన్నింపవలయు' నని ప్రార్థింప నలుం డిట్లనియె. నీవు నాకుఁ బొల్లింటిచెలికాఁడవు. బంధుజనుండవు. నీయింట నమరినసుఖము నాకు నాయింట నైన నమరియుండదు. నీనీడ సుఖమున్న నాకు నీమీఁదిప్రేమకు మితి గలుండునా? అక్షహృదయం బుపదేశించిన నీ కశ్వహృదయం బుపదేశించి కృతజ్ఞుఁడనయ్యెద. అనిచెప్పి ఋతుపర్ణున కశ్వహృదయంబు విధ్యుక్తముగ నలుం డుపదేశించె. ఆకోసలేశ్వరుం డావిద్యను గ్రహించి నిజరథారూఢుండై వెంటనే యయోధ్యకుఁ జనియె.

## నలుఁడు పునర్ద్యూతంబునఁ బుష్కరు నోడించి నిజరాజ్యమును సాధించుట

ఇట్లు ఋతుపర్ణుం డయోధ్యకుఁ బోఁగా నలుండు విదర్భను గొన్నిదినము లుండు భీమునసుజ్ఞ నొక్కరథంబు, పదునాఱేనుంగు, నేబదిగుఱ్ఱంబు, లాఱునూర్వురు కాల్బలంబు తనన్నుఁ బరివేష్టించి రాఁగ నాటోపంబున నిషధకుం బోయి పుష్కరు వీక్షించి 'పుష్కరా! నాయొద్ద ద్రవ్యము మెండుగా నున్నది. దీని నంతయు నొడ్డి జూద మాడ వచ్చినాఁడ. మఱియు నిప్పు డీధనమును, దమయంతిని, ప్రాణముల నొక్కయెడ్డుగా నొడ్డియాడెద. నీవు నీసకలమహీరాజ్యమును, బ్రాణముల నొడ్డుము. జూదమునఁ బరులధనమును, రాజ్యమునుం గెలిచి తెచ్చి ప్రతిపణంబుగ నొడ్డియాడుట ధర్మము. జూద మొల్లవేని యుద్ధద్యూత మాడుదము. నీకుఁ గాని, నాకుఁగాని పరిహారంబు వలదు. మన మిరువురమును చెఱియొకరథము నారోహించి యుద్ధము గావింతము. ఏవిధముననైన వంశక్రమాగతంబై నాచే దూరవోయఁబడిన రాజ్యంబు సాధింపవలయు నని పెద్దలు శాసించియున్నారు. ఆలోచించి జూద మొండె, యుద్ధ మొండెఁ గావింపవలయు ననఁగాఁ బుష్కరుండు తనలోఁ దాను ముందు జూదమాడి నలు నోడించియుండుట నిప్పుడు నట్లే యోడింతు నని తలంచి నలున కిట్లనియె. కితవా! మా ఱొడ్డుటకు ద్రవ్యసంపాదనము గావించితి నంటివి. దమయంతి తొలిజన్మంబునఁ గావించియుండినపాప క్షయం బయ్యె. నీకోరినయట్లు పునర్ద్యూతము నాడు

దము. అచ్చరకాంత వేయికన్నులవానిం బోలె నీ వార్జించినద్రవ్యము చే నలంకరింపఁబడిన యీదమయంతి నన్నుఁజెందుఁగాక. శత్రువులతో జూదమాడరాదు. కాని, యిప్పుడు నీతో జూదమాడి నిన్నోడించి యాస్వయంవరమునాఁడు దేవతలను వరింపక నిన్ను వరించిన యాపూఁబోఁడిని నే నాఁచికొనియెద. అప్పటికి నేను ధన్యుండను. ఆపుణ్యాదిన మీనాఁటికి సమకూడినది. దమయంతిని పణముగ గెల్చి పురమున మహోత్సవము గావించెద.' అని పుష్కరుఁ డాడుచున్న వెఱ్ఱిమాటలకు నలుండు కినిసి కృపాణమున వానితల నఱుకుటకుఁదలంచి మగిడి యూఱడిల్లి శాంతుఁడై 'యోరీ కులపాంసనుఁడా! యేల యిట్లు వదరెదవు. నీ కలధనముల నెల్లను, బ్రాణంబులను బణంబుగా నొడ్డుము.' అని చెప్పి పునర్ద్యూతంబాడి పుష్కరు నోడించి యిట్లనియె. 'ఓరీ పుష్కరా! నే గెలిచితి. నీ వొడ్డిన యీరాజ్యమును నీ కలధనము లెల్లను నాయవియ. ఇప్పుడు రాజ్యము శత్రురహితమైనది. నీకు నాదేవిని గన్నెత్తిచూడ నైన రాదు. తొలుత నాడినజూదంబునందు నే నోడుట ద్యూతవిద్య యందు నీకుఁగల నేర్పునఁ గాదు. అయ్యది కలిపురుషుచేష్ట. దాని నీ వెఱుంగవు. నే నెఱింగి కలి యొనర్చిన నేరమును నీపై నారోపింపను. ఇపుడు నీ కుండుసకలమహీరాజ్యమును, గలధనములను, బ్రాణములను బణంబుగా నొడ్డియోడితివి. తండ్రితోఁబుట్టినవానికొడుక వగుటం జేసి నీభాగమును నీ కిచ్చి ప్రాణములతో నిన్ను వదలెద. పెక్కేండ్లు సుఖివై జీవింపుము. నీపై నా కుండుస్నేహమునకుఁ గొఱంత లేదు.' అని యూరార్చి పంపెను. పుష్కరుండును జావునకు దప్పి కన్ను లొట్టవోయె నన్నట్లు ప్రాణములను దనభాగమును నలుండు కరుణించి యీయఁగా దీనవదనుఁడై కైకొని, నలభూకాంతు నుద్దేశించి 'పుణ్యశ్లోకా! నీయౌదార్యంబునకు ముదం బందితి. ఆచంద్రతారార్కము నీకీర్తి వెలయుఁగాక!' యని మనవిచేసి యచటఁ గొన్నినాళ్లుండి నలరాజుసెలవుఁ గొని గొప్పసేనతోఁ దననగరమునకుం జనియె.

వెంటనే నలభూపాలు నెదుర్కొనుటకు నిషధ నలంకరించి, పురజనులు మంత్రులు సేనాపతులు నొడ్డోలగంబున నరుదెంచి దండప్రణామంబు లాచరించి యామహీపాలుఁ డధిగతరాజ్యుండయినందులకు సంత

సమంది, యమరులు దేవేంద్రు నుపాసించువిధంబున నారాజుం గొలి చిరి. అంత నైషధుండు వారి నూరడించి శాంతముగ రాజ్యమును గ్రహించి యేల సాగెను. వెంటనే వైదర్భుండు నలరాజుగెలుపును విని తనకూఁతు దమయంతిని, నాదేవిబిడ్డలను మహాసేనతోడఁ బంప, వారు మహోత్సవమును నూరేగింపుతోఁ బురప్రవేశముచేసి, నగరు చేరిరి. అంత నలుండు పరమపతివ్రతయగు దమయంతితోఁ గూడి యపరిమితా నందంబున రాజ్యమేలుచు భూరిదక్షిణలతోడఁ గూడి మంత్రఘోషమ్మే దురంబైన యజ్ఞములఁ బెక్కింటి నొనర్చి మహేంద్రవైభవంబున నిషధరాజ్యమేలి జగద్విఖ్యాతకీర్తియై యుండెను.

కావున నో ధర్మరాజా! నలుఁడు జూదముననే యోడి భార్య వెంబడింపఁ గానల కేఁగి పడరానిపాట్లఁ బడి చివరకు సర్వసంపదల నంది సుఖియయ్యె. నీవో వేదవేదాంగముల నెఱింగినవిప్రులతోను, ముజ్జగ ముల గెలువఁ గలతమ్ములతోను, ఎడఁబాటెఱుంగని భార్యతోను గూడి యడవులయందు సుఖముగ నున్నవాఁడవు. నీవు దుఃఖింపనేల ? ధర్మార్థ కామము లస్థిరములు. వానియుదయాస్తమయములకుఁ జింత సేయ కుము. దైవవైపరీత్యంబునఁ జేసి పురుషకారము ఫలరహిత మగుచోఁ బెద్ద లందులకు విషాదంబును జెందరు.

ఈనలోపాఖ్యానమును జదివినవారును, వినినవారును, వ్రాసిన వారును సర్వసంపదలఁ బొందుదురు. సత్సంతానమును బడయుదురు. నరులలో శ్రేష్ఠత్వంబుఁ గాంతురు. ఎవరు నాగేంద్రుఁడగు కర్కోటకునిఁ బరమపతివ్రతయగు దమయంతిని, బుణ్యశ్లోకుఁ డగునలభూకాంతుని, రాజర్షియగు ఋతుపర్ణునిఁ గీర్తింతురో వారిని గలి సమీపింపఁడు. అట్లు సమీపించినను వేగ వర్జించును.

శ్లో. "కర్కోటకస్య నాగస్య దమయంత్యా నలస్య చ,
ఋతుపర్ణస్య రాజర్షేః కీర్తనం కలినాశనమ్."

రాజా! నీవును ద్యూతకారణంబునఁ జెడితివిగదా యని వాపోవు చుందువు. నా కక్షహృదయము దెలియును. నీకు దాని నుపదేశింతు. దానివలన నీ కీభయము తొలఁగును. అని చెప్పి బృహదశ్వుండు ధర్మ

రాజున కక్షహృదయం బుపదేశించి తానశ్వసర స్థ్రంబునకుం బోయె. అట నర్జుననితపోవిధానమును విని ధర్మరాజు వాని క్షేమములను బ్రాహ్మణులమూలమున నరయుచుండె నని వైశంపాయనుండు సెప్పఁగా జనమేజయభూపాలుండు విని సంతసిల్లెను.

గద్యము.

శ్రీమదాంధ్రవచనమహాభారతమునం దారణ్యపర్వంబునఁ బాండవులయరణ్యప్రవేశమును ధర్మరాజు సూర్యు నారాధించుటయుఁ గిమ్మీరవధయును, కృష్ణపాంచాలాభిగమనంబును, సౌంభకాఖ్యానమును, వేదవ్యాసోపదేశమును, కిరాతార్జునీయమును, నర్జునుండు పాశుపతాస్త్రమును మహేశ్వరునివలనఁ బొందుటయును, లోకపాలు రర్జునునకు దర్శనము నిచ్చి తమతమదివ్యాస్త్రముల నాతనికి విభ్యుక్తముగా నొసఁగుటయు నర్జునుం డమరావతి కేఁగుటయు, యుధిష్ఠిరుం డర్జునుండు బహుకాలము తమ్మెడఁబాసినందులకుఁ బరిదేవనము నొందుటయు, నలోపాఖ్యానంబును, నక్షహృదయవిద్యాగ్రహణంబు నన్నది ప్రథమాశ్వాసము.

---

## ద్వి తీ యా శ్వా స ము

తదనంతరమున జనమేజయభూపాలుఁడు వైశంపాయనముని వరుం జూచి యిట్లనియె. భూసురవర్యా! మాముత్తాత యగు సవ్యసాచి యాదిత్యులలో విష్ణువుంబోలెఁ బాండవులలో నుత్తముఁడు గదా? అట్టిమహనీయుఁడు తపం బాచరించునిమిత్త మరిగినపిదపఁ బాండవులు కామ్యకవనమునం దేతీరున వర్తించిరి? యని యడుగ మునినాథుఁ డాభూనాథున కిట్లనియె. రాజా! కామ్యకవనమును ధనంజయుఁడు వీడినపిదపఁ బాండవులు దుఃఖనిమగ్నులై తెక్కలు తెగినపక్షులవలెను, దారము పెరిగిన మణులవలెను నుండిరి. అర్జునుఁడు లేని కామ్యకవనము కుబేరుఁడు లేని చైత్రరథమువలె నుండె. పాండవులు కామ్యకవనమునం దర్జునవిరహమున నెమ్మదిదప్పినమనస్సుతో నుండిరి. ఆవనమందలి యాహా

రయోగ్యమగు మృగములను వేఁటాడితెచ్చి వానిమాంసమును రుచ్యములుగ వండి విప్రులకిడిరి. తా మెల్లప్పుడస్జునునివియోగవ్యథచే మరల నెప్పుడు వానిం జూతుమా యని వానిచరిత్రములను, వాని సద్గుణములను జెప్పికొనుచు, తమయాపత్సముద్రమును దాటుటకుఁ బార్థుఁడేకదా తెప్పకొయ్య యనుచుఁ దదాగమనమును నిరీక్షించుచుండిరి.

ఇట్లుండ, స్వకీయ తేజంబునంజేసి దెస లెల్ల వెలుంగుచుండ నారదమునీశ్వరుండు పాండవులయొద్దకు రాఁగా ధర్మరాజు తనతమ్ములతో నామహర్షిని నర్ఘ్యపాద్యాదులఁ బూజించెను. ఆఋషీశ్వరుండు వారొనర్చినపూజల నంది వేదములను సావిత్రియుంబోలె సూర్యప్రభ మేరువుంబోలె వారి నెప్పుడు నెడఁబాయనియాజ్ఞసేనిని గృపాకటాక్షమున నాదరించి ధర్మరాజు నుద్దేశించి 'ఓధార్మికశ్రేష్ఠుఁడా ! నీయొనర్చిన సపర్యలకు మెచ్చితి. నావలన నీ వెద్దాని వినఁగోరెద' వనఁగా ధర్మరాజు మునీంద్రా! నీవు నాయొనర్చినపూజలంజేసి సంతసించితి నంటివి. నేను ధన్యుండనైతి. నాయందుఁ బ్రీతి గలదేని తీర్థయాత్రాఫలమును వివరముగఁ జెప్పుము. అనఁగా నారదుం డిట్లనియె.

### ధర్మరాజునకు నారదుండు తీర్థయాత్రాఫలము చెప్పుట

రాజా! తొల్లి భీష్ముండు గంగాతీరంబునఁ బైతృకవ్రత మవలంబించి గంగలో స్నాన మాచరించి పితృదేవతలకుఁ దృప్తిగా జలంబులిడి పవిత్రుండై యుండ నాతనికడకుఁ బులస్త్యుండు రాఁగా నమ్మునిని భీష్ముండు యథావిధిగాఁ బూచించి మునీంద్రా! ఏను భీష్ముండను, నీ దాసుఁడను, భవద్దర్శనంబునంజేసి నాపాపములన్నియు సూర్యతేజంబున మంచు గరఁగి పోవునట్లు తొలఁగిన వని చెప్పి చేతులుజోడించుకొని యుండఁగా బులస్త్యుండు శాంతనవా! వినయము, శమము దమము మున్నగు నీ సుగుణవిశేషంబులకును, నీ యపారపితృభక్తికిని మెచ్చితి. నీపితృభక్తిప్రభావముంజేసి నే నిచ్చోట నీకు సందర్శనము నొసఁగితి. నాదర్శన మమోఘము. నీకు వలసినదాని నడుగుము. చెప్పెద ననఁగా భీష్ముండు నీ విడిగిన తీర్థయాత్రాఫలమును జెప్పు మని కోరఁగాఁ బులస్త్యుం డిట్లనియె. ఇంద్రియనిగ్రహముగలవారు, నహం

కారరహితులు, ప్రతిగ్రహముగొననివారు,సర్వభూతములను దామగనే భావించువారు, నెల్లప్పుడును దృష్టిఁజెంఁదియుండువారు, నల్పాహారులు, నిరారంభులు, సత్యదృఢవ్రతులు వీరందఱును సర్వయజ్ఞములఫలములను, దీర్ఘయాత్రాదులు సలిపి యనేకపుణ్యతీర్థములయందు స్నాతులైనవారు పొందుఫలములను బొందుదురు. తీర్థయాత్రలను జేయని వారును దానాదులు సలుపనివారును బీద లగుదురు. యజ్ఞముల ననేకములను జేసినవారును బహుతీర్థములను సేవించినవారును సమానఫలములను బొందుదురు. యజ్ఞముల నాచరించుటకు సంభారముల ననేకములను జేకూర్చుకొనవలయును. దానికి విస్తారద్రవ్యము వలసియుండును. దరిద్రుల కవి సుసాధ్యములు గావు. అగ్నిష్టోమము వాజపేయము మున్నగు యజ్ఞఫలములకంటెఁ దీర్థసేవాఫలంబత్యధికంబు. దాని విధానమంతయుఁ జెప్పెద వినుము. ప్రపంచమునందు మూఁడులోకములందును బ్రఖ్యాతి గాంచిన పుష్కర మనుతీర్థరాజ మొక్కటి యున్నది. ఆతీర్థమున నెల్లప్పుడు పదికోట్లతీర్థోదకములును మూఁడు సంధ్యలందును గూడుకొని యుండును. బ్రహ్మదేవుఁ డా తీర్థమునఁ గాపుర ముండును. అష్టవసువులు, నేకాదశరుద్రులు, ద్వాదశాదిత్యులు, సప్తమరుత్తులు, సిద్ధులు, సాధ్యులు గంధర్వులు, కిన్నరులును, యక్షులు, నప్సరోగణములు నాచోటు నెప్పుడును బాయరు. మహర్షు లనేకు లాతీర్థమునకుఁ బోయి వానిని దర్శించి యందుఁ గృతావగాహులై దేవర్షితర్పణంబు లాతీర్థోదకంబులఁ గావించి యందుఁ గొన్నాళ్లుండి స్థితప్రజ్ఞు లైరి. ఆతీర్థమున నేపురుషుండు స్నాన మాచరించి పితృదేవతల నారాధించునో యామహనీయుం డశ్వమేధ యాగఫలమునకంటె నెక్కుడుఫలముం జెందు. ఆచోటఁ దనకు లభించిన కందమూలఫలపర్ణములతోఁ బ్రాణయాత్ర గడపుచుఁ బితృప్రీతిగ నొక విప్రునకు నైనను దాన మొనర్చినవాఁ డుభయలోకములయందును సుఖించు. అట్టిదానము నసూయ లేక, శ్రద్ధతో నొసంగి తనకుఁ గలపదార్థములను గుడువం బెట్టినమహనీయునిపుణ్యవిశేషం బింతిం తనరాదు. వాఁ డశ్వమేధఫలముం జెందు. ఆతీర్థమునఁ గార్తికపౌర్ణమినాఁడు స్నానముచేసినవాఁడు నూఱేం డ్లుపాసనాదికార్యముల జేసినవానిఫల

మును బొందును. వానికి మోక్షము కరస్థము. అందు స్నానమాత్రము గావించినవాఁడు సర్వతీర్థములయందును గ్రుంకులిడినవానిఫలమును బొందును. దేవతలలో విష్ణువుంబోలె, తీర్థములలోఁ బుష్కరమ్ము మిక్కిలి శ్రేష్ఠమైనది. అట్టి పుష్కరములు మూఁడున్నవి. మూఁడును సమానమాహాత్మ్యముగలవి. పుష్కరములలోఁ దపము గాని, దానము గాని, వాసముగాని యొనర్చుట దుష్కరము. ఉదయకాలమునందును సాయంకాలమునందును బ్రతిదిన మీమూఁడుపుష్కరముల నెవఁడు ధ్యానించునో వానికిఁ బుణ్యలోకము లరచేతిలోని వైయుండు. వానిలో నెద్దాని చెంతను ద్వాదశవత్సరంబులు నియతాహారుఁడయి,నియమముతో వసించినవాఁడు పుణ్యాత్ముఁడై సర్వయజ్ఞములఁ గావించినఫలమును, బ్రహ్మలోకమును జెందును. పండ్రెండేండ్లు పుష్కరముల వసింప లేకున్నను బండ్రెండుదినములైనను శుచియై, నియతవ్రతుండై యచ్చోటి నుండి ప్రదక్షిణముగ జంబూద్వీపమార్గమునకు వెళ్లి యైదుదినము లచ్చట నున్నచో, వానికి నశ్వమేధయాగఫలంబును, నరకరాహిత్యమును, బుణ్యలోకములును సిద్ధించు. వెనుక నగస్త్యసరస్సునందుఁ బితృతర్పణంబు గావించి యందు మూఁడు రాత్రు లుపవసించినమనుజసత్తముఁ డగ్నిష్టోమము గావించిన విప్రసత్తమునిఫలముఁ బొందును. కణ్వాశ్రమము, ధర్మారణ్యము వీనిఁ బ్రవేశించిన మానవుఁడు సర్వపాపవిముక్తుఁ డగును. మిక్కిలి నియమముతోఁగూడి శుచియై యాస్థలములలోఁ బితృదేవతలను నర్చించిన శ్రద్ధాళువునకు యజ్ఞఫల మంతయుఁ జేకూరును. అచ్చోటికిఁ గుడితట్టున నుండు యయాతిపతనమనుస్థలము, మహాకాళము కోటితీర్థములను సేవించిన మహనీయునకు నశ్వమేధయాగ ఫలము సిద్ధించు. దానికి సమీపముననే రుద్రవట మను తీర్థరాజము గలదు. దానియందు మహాదేవుని నర్చించినవానికి వేయిగోదానములు నేసినంతపుణ్యము లభించు. వాఁడు ప్రమథగణములలో నుత్తమత్వమును బొందును. నర్మదయందును, దక్షిణసింధువునందును, జర్మణ్వతియందును గృతావగాహుండై జితేంద్రియుఁడు, నియతాహారియునై, పితృదేవతర్పణంబులు గావించి భజించినపుణ్యాత్మునకు నశ్వమేధఫలంబు కలుగును. దేవతల కందఱకు నగ్ని దేవుఁడు

షుఖ మనఁబడును. అగ్నియం దేది వేల్చినను సర్వదేవతలం జెందును గాదే! ఆయగ్నిదేవుఁడు ప్రభాసతీర్థంబున నెల్లప్పు డుండు నని ప్రసిద్ధి. అందు మునిఁగినవానికి నగ్నిష్టోమము నతిరాత్రము నొనర్చినసుకృతుల ఫలము సిద్ధించు. భూమిమీఁద మొట్టమొదటఁ గాన్పించిన వివరము వసిష్ఠాశ్రమము. దానిని నర్బుదమని పేర్కొందురు. ఈబిలము పర్వతమువలన నేర్పడినది. ఇచ్చోట నేకరాత్రి వసించియుండినచో సహస్రగోదాన ఫలము గలుగును. పింగతీర్థమున మునింగినవారు కపిలధేనువులు వేయింటిని దానము చేసినవానిసద్గతిఁ గాంతురు. సరస్వతీనది సముద్రమునఁ గలియుచోట స్నానమొనర్చి యచ్చోట దేవపితృదేవతల నర్చించి మూఁడు రాత్రులు వసించినవాఁడు స్వర్గలోకవాసనుఖమును,నశ్వమేధయాగఫలంబును, గోసహస్రదానఫలమును బొందును. ద్వారవతియందుఁ బిండారకమున స్నానమాడినవానికి విస్తారమైనబంగారము లభించును. సలిలరాజమనుతీర్థమున మునిఁగినవారును, నచ్చోట జితేంద్రియులై పితరుల నుద్దేశించి బలిదానాదుల నొసంగువారును చంద్రికాసమ మగుదేహకాంతితో నొప్పి వాజమేధము నొనర్చినవానిపుణ్యములఁ బ్రాపింతురు. పిండారకతీర్థమున నిప్పటికిని గమలములవంటి ముద్రలును, మహాదేవుని యాయుధమగు త్రిశూలముయొక్క గుర్తు గల కమలములును గలవు అచ్చోట శూలి ప్రత్యక్షుండై తపస్వులకు గోచరించుచుండు. సింధునది సాగరముతో సంగమమగుచోట స్నాన మొనర్చి దేవపితృతర్పణములఁ జేసినవారు వరుణలోకమును బ్రాపింతురు. వరదానతీర్థమున నవగాహితుఁడైన శ్రీమహావిష్ణువునకు లోకపావనుఁ డగు దుర్వాసుండు వరములు పెక్కింటి నిచ్చి ధన్యుం డయ్యె. శంకుకర్ణ క్షేత్రమునకుఁ బోయి శంకుకర్ణేశ్వరుం బూజింప నశ్వమేధయాగము నొనర్చిన సుకృతమునకంటెఁ బదిమడుఁగులు సుకృతము గలుగు. అచ్చోటునుండి ప్రదక్షిణముగ యాత్ర చేయుచుం బోఁగా దమి యని పేర్కొనంబడు తీర్థము గానవగును. ఆతీర్థమునఁ గృతస్నానుండై పరమేశ్వరుని బ్రహ్మాది సేవితుండైనవానిం బూజించుచో జననము మొదలుకొని చేసినపాపములు క్షయించును. అశ్వమేధయాగ మొనర్చిన పుణ్యము లభించును. వసుధార మను తీర్థ మొండు గలదు. తొల్లి విష్ణుండు దానవులసంహా

రించి యాతీర్థమున స్నానముం జేసి పూజితుం డగును. ఈతీర్థంబున స్నా
నము చేసిన సుకృతి యశ్వమేధము నొనర్చినవాని సద్గతిఁ గలుగు.
ఇచ్చోట దేవపితృదేవత లర్చితులైరేని వానికి యజ్ఞఫలంబుగ విష్ణులోక
ప్రాప్తి యగును. వసుతీర్థమున మునింగి సజ్జలపానంబు గావించిన
మహనీయుండు వస్తుసమృద్ధుం డగును. ఉత్తమమగు సింధునదియందు
స్నానమాచరించినవానికి బహుసువర్ణప్రాప్తి యగు. భద్రతుంగతీర్థమున
స్నానము చేసినవారు బ్రహ్మలోకమున కేగుదురు. శక్రకుమారీతీర్థమునను,
రేణుకాతీర్థమునను మునింగినవారు స్వర్గగాము లగుదురు. పంచనద
మును జేరి యాతీర్థములయందు స్నానమొనర్చినవారు పంచమహాయజ్ఞ
ఫలములను బొందుదురు. ఆవల యోనితీర్థమునకుం జని యచ్చోట
స్నానమొనర్చినవారు దేవ్యనుగ్రహమున దివ్యపుత్త్రులఁ జక్రకుండల
ములను సహస్రగోదానఫలము ననుభవింతురు. శ్రీకుండతీర్థమునుం జేరి
బ్రహ్మదేవునకు నమస్కరించినవారు జగద్విఖ్యాతకీర్తు లగుదురు. బం
గారు, వెండివన్నె విమానములు గలవిమలక్షేత్రమగు తీర్థమును దర్శించి
యందు స్నానమొనర్చినవాఁ డింద్రలోకముఁ జెంది సకల పాపవిము
క్తుఁ డగును. ఆవల వితస్తానదిని దర్శించి యందు స్నానమొనర్చి దేవ
పితృప్రీతిగ నుదకముల నర్పించుచో వానికి వాజపేయయాగఫల సిద్ధి
గలుగును. వితస్తాతీర్థము కాశ్మీరమునం దున్నది. అచ్చోట వితస్త
యను పేరితోఁ దక్షకభవనం బొండు గలదు. ఆ భవనరాజమును దర్శించి
యచ్చో స్నానమొనర్చిన వారు మును పేర్కొన్న యాగఫలముం
బొందుదురు. అచ్చోటునుండి తరలిపోఁగా బడబాతీర్థముం జేరుదురు.
ఈతీర్థమున సాయంకాలమున స్నానముం జేసి యగ్నియందు వేల్చినవాని
పితరుల నయ్యది సంతుష్టిపఱచు. ఈతీర్థమునందుఁ బూర్వకాలమున దేవ
తలును, వసువులును, గంధర్వులును, యక్షులును, సిద్ధులును, సాధ్య
లును బరస్పరవైరములు వీడి బ్రహ్మను ముందుంచుకొని విష్ణు
ప్రీతిగ ఋగ్వేదఋక్కులను బఠించుచు హోమ మాచరించిరి. దానం
జేసి నారాయణుండు ప్రీతుండై వారికిఁ బ్రసన్నుండయ్యె. వారల కష్టై
శ్వర్యంబుల నొసంగి నారాయణుం డంతర్హితుఁ డయ్యెను. వీరందఱు
చరుహోమము గావించి విష్ణుదేవుని సంతృప్తిచేసిరి గాన నాతీర్థము

వస్తు సప్తచరు వని నాపురాంతరము వెలసె. అందుఁ జరుహోమము గావించినచో సమస్తయాగములు గావించినదానికంటె నుత్తమఫలము గలుగును. రుద్రపదంబున భవానీపతిని నారాధించు యాత్రికు లశ్వమేధఫలమును బొందెదరు. మణిమంతమునం దెవ్వ డేని నొక్కదినము బ్రహ్మచర్యవ్రతమును నిష్ఠతో నాచరించినచో వాఁ డగ్నిష్టోమఫలంబు నొందును. మణిమానతీర్థమున నైతమిస్లే స్నానమాచరించిన నిదే ఫలము గలుగును పిదప దేవికాతీర్థమునకు యాత్రికు లేగవలయును. ఇచ్చోటనే తొలుత బ్రాహ్మణవర్ణమునకు వ్యాప్తి జనులలోఁ గలిగె నందురు. ఇచ్చోట శూలపాణియై మహాదేవుఁడు భక్తులకుఁ బ్రత్యక్షంబై యుండు. ఈతీర్థమున నాడి మహాదేవప్రతిగా బలులను సమర్పించుచో సర్వఫలసిద్ధి గలుగును. పిదప రుద్రదేవ మను తీర్థరాజ మున్నది. దానినే కామాఖ్యమందురు. ఇచ్చోట దేవతలు వసింతురు. ఇచ్చోట స్నానమొనర్చి జితేంద్రియుండై, తపమాచరించుసిద్ధుఁడు మహాదేవునిఁ బుష్పములతో నర్చించి, యుదకములతో నభిషేకము గావించినవాఁడై ప్రపంచవాసనను వీడి పునర్జన్మము లేనివాఁడగును. అర్ధయోజనము వెడల్పును నైదు యోజనములనిడివియుంగల దేవికానదీతీరంబునఁ ద్రిశూలపాణిస్థానమును, మున్ను పేర్కొన్న కామాఖ్యంబను రుద్రదేవతీర్థమును, యాజనతీర్థమును, బ్రహ్మవాలుకమును, బుష్పాంభస్తీర్థంబును నున్నయవి. వీనిని దర్శించి వీనియందుఁ గృతావగాహనులై సర్వమంగళాపతి నారాధించి బలు లర్పించినవారికి వెంటనే సిద్ధి గలుగును. బ్రహ్మ మున్నగు దేవతలును, సిద్ధులును, ననేక బ్రహ్మర్షులునుం గూడ నిష్ఠమెయి దీర్ఘసత్రముల నెందుఁ గావించిరో యాదీర్ఘసత్రతీర్థమునకుఁ జని యందు స్నానమొనర్చినవాఁడు రాజసూయాశ్వమేధయాగఫలములను బొందును. సరస్వతీనది యెచ్చోటఁ గానరాక పోయెనో యావినశనతీర్థరాజంబున మునింగినవాఁడు కృతార్థుండగును. మఱియు నాసరస్వతి మఱలఁ బ్రకాశమగుస్థలము లైన యాచమసోద్భేద, శివోద్భేద, నాగోద్భేదము లను తీర్థములయందు స్నాతుఁడగుపుణ్యమూర్తి క్రమమున నగ్నిష్టోమఫలమును, గోసహస్రదానఫలమును నాగలోకవాసుకృతముం బొందు. పిదప శశతీర్థమును యాత్రి

కుఁడు గాంచవలయును. ఇచ్చోటఁ గార్తికశుద్ధపూర్ణిమనాఁడు స్నాతుఁడగువాఁడు చంద్రునివలెఁ బ్రకాశించును. కుమారకోటితీర్థమున మునిఁగినవాఁడును, నచ్చోట దేవపితృదేవతల నర్చించువాఁడును, వంశమును గులమును నుద్ధరించు. పిదప రుద్రకోటితీర్థము సేవ్యంబు. తొల్లి కోటిసంఖ్య గలఋషులసమూహ మహంపూర్వికమై శివునిఁ జూడ నటకుఁ బోయిరి. అప్పు డాఋషుల కందఱకును బినాకపాణి తాను గోటిరూపములఁ బ్రసన్నుండై యేక కాలమున వారికి దర్శన మీయఁగా వారు "శివుని నేను మున్ను దర్శించితి. నేను మున్ను సేవించితి" ననుచు సంతుష్టిస్వాంతులు కాఁగా వారిపూజలకు మెచ్చి యీశ్వరుండు నానాఁట ధర్మము వృద్ధిఁగాంచుఁగాక యని వరమును బ్రసాదించెను. కావుననే యీతీర్థమును రుద్రకోటితీర్థ మనిరి. దీని యం దవగాహన మొనర్చిన వారికి నశ్వమేధయాగఫలము సిద్ధించు. ఎచ్చోటఁ జైత్రశుద్ధచతుర్దశినాఁడు విష్ణువు బ్రహ్మాదిదేవతలచేతను, ఋషులచేతను నారాధితుఁడై దర్శన మిచ్చెనో యట్టిసరస్వతీసంగమ మనుతీర్థమునందు స్నానము చేయఁగనే విశేషమైన బంగారమునుబొంది యంతమున బ్రహ్మలోకమును యాత్రికుఁడు పొందును. అవసానతీర్థమునందు ఋషులు సత్రముల సమాప్తిం గావించిరి. దానిని సేవించినపుణ్యపురుషుఁడు గోసహస్రదానఫలముఁ జెందును. పిదపఁ దీర్థయాత్రాపరుండు సర్వపుణ్యములకుఁ బుట్టినిల్లైన కురుక్షేత్రముం దఱియవలెను. ఈకురుక్షేత్రముయొక్క యుత్తరపుదిక్కున సరస్వతియు, దక్షిణమున దృషద్వతియు విరాజిల్లుచుండును. మఱియు నీమహాక్షేత్రము రామహ్రదములకును మచక్రుకమునకు మధ్యయందుఁ దరంతుకారంతుకంబుల కంతర్గతంబై వెలయు. దాని దర్శించినంతనే సకలజంతువులకును బాపక్షయం బగును. ఇంతే కాక యెవ్వండేని తనమనంబున 'కురుక్షేత్రమున కేఁగుదును. అందు వసింతును' అని తలంచినంతమాత్రముననే యాతఁడు సర్వపాపములనుండి విముక్తుఁ డగును. కురుక్షేత్రమునందలి ధూళి మేన సోఁకినను దుష్కృతము లుడుగును. అందు నివసించువారు స్వర్గలోకసుఖమును జెందుదురు. అచ్చోట నొక్కమాసంబు నివసించువానికి రాజసూయాశ్వమేధఫలములు సిద్ధించు. బ్రహ్మ మున్నగు దేవత

లచ్చోటి కొక్కకాలంబున నేతెంచుటంజేసి దానినే బ్రహ్మక్షేత్ర మనియు, బ్రహ్మోత్తరవేది యనియు, శమంతపంచకం బనియుఁ జెప్పుదురు. అచ్చోట మంకణకుం డనుద్వారపాలుఁ డున్నాఁడు. వానికి నమస్కరించు తీర్థయాత్రాపరులకు గోసహస్రదాతలకుఁ గల్గు సిద్ధి గల్గును. పిదప విష్ణుస్థాన మనుపుణ్యదేశంబు గలదు. ఇందు హరి సర్వదా నివాసమేర్పఱచికొనియుండు. ఈపుణ్యతీర్థమున స్నాన మాచరించి దేవపితృదేవతల నర్చించినతపస్సిద్ధునకు విష్ణులోకము సిద్ధించు. పారిప్లవతీర్థమున మజ్జనంబుఁ గావించినమహనీయుం డగ్నిష్టోమాతిరాత్ర ఫలము నందును. పృథివీతీర్థమునందును శాలూకినీతీర్థమునందును, దశాశ్వమేధతీర్థమునందును స్నానమాడినయోగిపుంగవుండు గోసహస్ర దానఫలము నందును. సర్ప దర్వియందు మజ్జనంబుగావించి, యందు దరం తుకుఁ డనుద్వారపాలుని దర్శించిన తీర్థసేవాపరుం డగ్నిష్టోమఫలమును, గోసహస్రదానఫలమును గ్రమముగాఁ బొందును. పంచనదమునకుఁ బోవుటచేతను, గోటితీర్థమున మజ్జనం బాడుటచేతను నశ్వమేధఫలమును బెందఁగలఁడు. అశ్వితీర్థమును సేవించుటచేఁ దీర్థయాత్రాపరుఁడు సురూ పమును ధరించు పిమ్మటివి యగు వరాహతీర్థము జయంతియందలి సోమతీర్థము, ఏకహంసతీర్థము, కృతశౌచతీర్థము, ముంజవటంబునందలి శివస్థానంబును దర్శించుటచే గ్రమముగా నగ్నిష్టోమ, రాజసూయ, గోసహస్రదాన, పౌండరీకయజ్ఞముల నాచరించినవారిసుకృతములు పడ యనగును. అందుముఖ్యముగ ముంజవటమున శివదర్శనము నేకరాత్రో పవాసంబును జేసినమహాత్మునకుఁ బెక్కండ్రపై నాధిపత్యము సిద్ధించు. యక్షిణియందు జలకమాడినమునికి సర్వకామసిద్ధి యగు. పిదపఁ బంచ హ్రదంబులు మహిమాన్వితంబులు. తొల్లి పరశురాముండు సకలక్షత్రి యులను నిర్మూలించి వారిరక్తప్రవాహమున నైదుమడుఁగులు నిర్మించి పితృతర్పణం బొనర్చెను. దానిచేఁ బితరులు సంతసిల్లి యారామునకు దర్శన మొసంగి యాతండు వేఁడగా నాతనికి రాజులఁ జంపినపాపము క్షయ మగునట్లును, నామడుఁగులకుఁ బుణ్యతీర్థత్వమును బ్రసాదించి యచ్చోట వా రంతర్హితులైరి. కావున నాతీర్థములు పంచహ్రదంబులని పేర్కొనఁబడియె. వానియందు మజ్జనమాడి శుచియై పితృదేవతల

నర్పించినవానికిఁ బితృప్రీతియు మిక్కిలి బంగారమును గలుగు. పదం
పడి వంశమూలతీర్థము, కాయశోధనతీర్థము, లోకోద్ధారతీర్థము,
శ్రీతీర్థము, కపిలాతీర్థము, సూర్యతీర్థము, గోభవనతీర్థము, శంఖినీతీర్థము
వీనియందు దనగాహనము గావించినపుణ్యాత్ముండు క్రమముగా వంశోద్ధా-
రణము, శుద్ధదేహము ప్రాప్తించి యుత్తమలోకములును, బ్రహ్మలోక
ములును, శ్రీయును, గోసహస్రదానఫలమును, నగ్నిష్టోమఫలంబును,
సూర్యలోకప్రాప్తియు, నుత్తమరూపమును సిద్ధించును. యక్షేంద్రతీర్థ
మున స్నానముంజేసి తరండకుం డను ద్వారపాలకసందర్శనంబుం జేసినవాని
కగ్నిష్టోమఫలము గలుగును. బ్రహ్మావర్తమున స్నానంబు సేసి బ్రహ్మలోక
ములకుం బోవును. సుతీర్థకంబునఁ బితరుల నర్చించి యశ్వమేధఫల
మును బొందు. పితృలోకముఁ బ్రాపించు. పదంపడి యంబుమతి, సుతీర్థ
కము, కాశీశ్వరము వీనియందు మునిఁగి నసేవాపరులు సకలరోగముల
నుండి నివృత్తులై బ్రహ్మలోకమును జనకుఁ బ్రాపింతురు. మాతృతీర్థమున
మునింగిన యాత్రాపరులు సంతతిఁ బొందుదురు. శీతవనతీర్థ, శ్వావిల్లో
మాపనయనతీర్థముల సేవించి యాజలములను శిరస్సునఁ బ్రోక్షించు
కొన్నవాఁడు పావనుం డగును. దశాశ్వమేధతీర్థావగాహనమున నరుండు
బరముం జెందును. పదంపడి మానుషతీర్థంబు గలదు. ఇందు వేఁటకాని
బాణములచేఁ గాయపడినమృగము స్నానమాచరించి మనుష్యాకృతిం
దాల్చినది. ఇట్టిమానుషతీర్థమున నేపురుషుండైనను జితేంద్రియుండై
స్నానమొనర్చి బ్రహ్మచర్యవ్రతాచరణంబు సలిపినచోఁ సర్వపాపములం
బోనాడును స్వర్గముం బొందును. ఈతీర్థమునకుఁ గ్రోసెడుదూరమున
నాపగాతీర్థ మున్నది. అందు జలకమాడి పితృతర్పణంబుఁ జేసి వారినుద్దే
శించి బ్రాహ్మణుల కన్నమిడినవాఁడు కోటివిప్రులకు సంతర్పణమును జేసిన
వాఁ డగును. అగ్నిష్టోమయాగఫలము నందును. కొన్నితీర్థములయందు
స్నానముచేయుటకుఁ దటస్థించినమహాత్ము లంతర్ధానశక్తి గలిగి చివరకు
బ్రహ్మలోకముఁ జెందుదురు. అవి యెవ్వి యనిన బ్రహ్మోదుంబరమును,
సప్తర్షికుండమును, కపిజలకేదారమును ననునవి. కోటితీర్థసన్నిధియం దుండు
సరకతీర్థమున స్నానమాడి కృష్ణపక్షచతుర్దశినాఁడు వృషభవాహనుం
బూజించినచోఁ గోరిన కోరిక లన్నియు, స్వర్గప్రాప్తియు నగును.

రుద్రకోటికూపప్రాదశుద్ధాస్పదతీర్థములయందుఁ గృతస్నానులై పితృదేవతల నారాధించి సద్గతి బొందుదురు. వాజపేయయాగఫలము నొందుధురు. కిందానతీర్థమజ్జనంబున విశేషదానములం జేసినవాఁడు పుణ్యపురుషుండగు. కింజప్యతీర్థస్నానముచే విస్తారతపఃఫలముఁ జెందనగు. కలశీతీర్థస్నాన మగ్నిష్టోమఫలము నిచ్చు. సరకతీర్థమునకుఁ దూర్పున నంబాజన్మమనుతీర్థ మొక్కటి గలదు. అది నారదతీర్థ మని పేర్కొనఁబడును. దీనియందు స్నానముగావించినమహానీయుఁడు శరీరత్యాగముచేయుచుండఁగనే నారదునిసెలవుఁ బొంది యుత్తమలోకములను బొందును. పుండరీకతీర్థమునందు శుక్లపక్షదశమినాఁడు మునిఁగినవాఁడు పౌండరీకయాగఫలమును బడయును. త్రివిష్టపతీర్థమున వైతరణి యనుతీర్థరాజం బొండు గలదు. అందు స్నాతుఁడై శూలి నర్చించినవాఁడు పాపవినిర్ముక్తుఁడై పుణ్యలోకముల కేఁగును. దేవతలు ఫలకీవనతీర్థమునందును, దృషద్వతియందును, పాణిఖాతమునందు ననేకవత్సరంబులు దపము సల్పిరి. వానియందు స్నానమాచరించినవారల కగ్నిష్టో మాతిరాత్రయాగఫలము గలుగును. సర్వదేవతీర్థమజ్జనంబున గోసహస్రదానఫలమగును. బ్రాహ్మణులనిమిత్తమై వ్యాసుఁడు సర్వతీర్థోదకముల నిందుఁ గలిపినందుల మిశ్రతీర్థ మని దీనికి పేరు గలిగెను. అందు స్నాతులై నియమముతో వ్రతములు సల్పువారికి గోసహస్రదానఫలము గలుగును. మధువటియం దుండు దేవీతీర్థమునఁ గృతస్నానులై పితరులకు జలాంజలి గావించినవారు దేవీప్రసాదంబున గోసహస్రదానఫలముం జెందుదురు. కౌశికీదృషద్వతులు సంగమించుస్థలమున స్నాన మాచరించువారు సర్వపాపవిముక్తు లగుదురు. పదంపడి వ్యాసస్థలీతీర్థమున్నది. అందుఁ దీర్థమాడినవారు గోసహస్రదానఫలమును బొందెదరు. ఇందు శుకమహర్షి తానద్వైతభావంబున సర్వభూతములయందును దా నున్నా నని స్థితప్రజ్ఞత్వమును జెంది ప్రత్యేకరూపమునఁ గానఁబడకుండుటం జేసి వేదవ్యాసుండు పుత్త్రుంగానక పుత్త్రమోహంబున దేహత్యాగంబు గావింపఁబూని, దేవతలు ప్రేరేపింపఁగా వారిసదాలోచనమును విని తనయుద్యమమును మానెను. కిందత్తకూపమనుతీర్థమునమునుంగువారలుతిలప్రస్థదానమును జేసినచో ఋణత్రయవిముక్తు లయి పరమగతిం బొందుదురు. దేవీతీర్థము

యందును, సహస్రతీర్థ, సుదినతీర్థములందును స్నానమాచరించిన పుణ్యపురుషుఁడు గోసహస్రదానఫలమును సూర్యలోకమును జెందును. మృగధూమతీర్థస్నాతుఁ డగుతీర్థసేవాపరుండు మహాదేవునిఁ బూజించి యశ్వమేధఫలమును బొందును. వామనక్షేత్రమునందు విష్ణుపదతీర్థావగాహనులైనవారు వామను నారాధించి సకలపాపములఁ బోనాడి విష్ణుసాయుజ్య మొందుదురు. కులంపునమున నవగాహితులైనవారు కులపావనతను గావింతురు. పవనహ్రద మని పిలువఁబడు మరుత్తీర్థమున మజ్జనమాడినపుణ్యాత్ముండు వాయులోకంబు ప్రాపించు. అమరతీర్థమునందు స్నానమాడి పవిత్రుఁడైన పుణ్యమూర్తి యింద్రుని నర్చించి స్వర్గమున మర్యాదం జెందు. శాలిహోత్ర, శాలిసూర్యతీర్థస్నాతులు గోసహస్రదానఫలములను బడయుదురు. శ్రీకుంజ మను నామాంతరమున వెలయుసరస్వతీతీర్థమున జలకము లాడినపావనమూర్తి యగ్నిష్టోమఫలముఁ బడయు. నైమిశారణ్యమున నసించి యుండినమునులు కురుక్షేత్రయాత్రకుఁబోయి సరస్వతియందుఁ గుంజముఁ గావించిరి. కావున నైమిశకుంజంబు నాఁ బరఁగిన తీర్థమునందు మునింగినవా రగ్నిష్టోమఫలము నొందుదురు. కన్యాతీర్థమున మజ్జనమాడి గోసహస్రదానఫలము లభ్యపఱచుకొనును. బ్రహ్మతీర్థమునందు స్నానముఁ జేసిన బ్రాహ్మణేతరుఁడు బ్రాహ్మణుఁ డగును. బ్రాహ్మణుఁడు సద్గతిం జెందు. సోమతీర్థస్నానము సోమలోకంబుం బొందించు. అనంతరంబ సప్తసారస్వతతీర్థ మున్నది. శంతనునందనా! దీనివృత్తాంతంబు వినుము. తొల్లి మంకణకుం డను మునిచంద్రుండు తనచేతికి దర్భవాడిమొన చేతఁ గ్రుచ్చుకొనఁగా నందుండి శాకరసము స్రవింపఁగా నా ఋషిసత్తముం డా విచిత్రమున కత్యంతోల్లాసియై మహానృత్యంబు గావింపఁదొడంగెను. ఆ నృత్యంబుఁ జూచు వేడ్క జను లందఱును ఋషి యున్నచోటగు సర్వసారస్వతతీర్థమునకుఁ బోవువారే కాని, నృత్యమందలి యభిరుచిం జేసి మరలువా రెవరుం గానరారు. లోకప్రవర్తనం బంత నిలివఁగా బ్రహ్మాదు లీశ్వరుపాలికిం జని "పినాకీ! ఏమనఁగలము? మంకణకునినృత్యముచే లోకము సమ్మోహితమైయున్నయది. ఈమోహముం బాపవే" యని వేడ నమ్మహానటుఁడు మంకణకుని యాశ్రమమున

కేతెంచి, "ఓమునిచంద్రా! నృత్య మేల చేసెద' వనఁగా నమ్ముని సత్తముండు 'చూడవే నాకరంబున శాకరసము ప్రవహించుచున్నది. అయ్యది నా కపరిమితానందముఁ గలిగించుచున్నది. కావున స్వానందసూచకముగ నృత్యము సలుపువాఁడ' ననఁగా మహాదేవుం డింతమాత్రమునకే నృత్యము చేయవలయునా? ఇదిగోఁ జూడు మని తనకొనవ్రేలం బొటనవ్రేలిని దాడించి భస్మముచే గాయపడిన బొటనవ్రేలినుండి స్వర్ణరసమును వెలువరించెను. దాని కామునీశ్వరుం డాశ్చర్యపడి మహాదేవునియద్భుతకార్యమును గొనియాడె. అందులకు మహేశ్వరుండు మెచ్చి మంకణకునితపోభివృద్ధికిని నా యాశ్రమంబునఁ దనయునికికిని, నాతీర్థమున స్నానముగావించిన పుణ్యాత్ములకు సర్వాభీష్టసిద్ధినిం బ్రసాదించె. అట్టి సప్తసారస్వతతీర్థమున స్నానము త్రిపుర దహనుపూజ యనువీనిచేఁ దీర్థసేవాపరునకు దుర్లభార్థసిద్ధియు, సారస్వత లోకప్రాప్తియుఁ గలుగు. తదనంతరమునం దౌశనసతీర్థరాజంబు గలదు. దానియొద్ద బ్రహ్మ మున్నగు దేవతలు, కార్తికేయుఁడు, సమస్తఋషులును శుక్రునకుఁ బ్రీతి గలుగునట్లు మూఁడు సంధ్యలయందును సన్నిహితు లగుదురు. కావున దానిని నౌశనసతీర్థ మందురు. దీనియందును, గపాల మోచనతీర్థమునందును స్నానమాచరించినతీర్థసేవాపరుఁడు పాప వినిర్ముక్తుం డగును. అగ్నితీర్థమునఁ గ్రుంకులిడిన మహనీయుఁడు కులము నుద్ధరించి యగ్నిలోకమున కేఁగును. విశ్వామిత్రతీర్థస్నాతుఁ డగు బ్రాహ్మణేతరుఁడు బ్రాహ్మణ్యంబుఁ జెందు. బ్రాహ్మణుఁ డన్నేనో తనవంశము వారి నేడుతరంబులు తరింపఁజేసి తాను బ్రహ్మలోకావాసి యగును. పృథూదకం బని పేర్కొనఁబడు కార్తికేయతీర్థరాజమునందు స్త్రీపురుషు లెవ్వారైనను స్నానమాడి పితరుల నర్చించుచో వారు తమకుఁ దెలిసి కాని తెలియక కాని యొనర్చినట్టి సకలపాపమునుండి విముక్తులై యశ్వమేధయాగపుణ్యమునుసాధించి యింద్రలోకమున కేఁగెదరు. మఱియును లోకమునఁ గురుక్షేత్రము పుణ్యక్షేత్రము. అందును సరస్వతీతీర్థంబు మేలైనది. అందునుం బృథూదకం బతిశ్రేష్ఠంబు. ఈపృథూదకంబున దేవార్చనాహితపరుఁడై తపస్వియై నిజశరీరమును విడిచినవానికి జనన మరణరూప మగు సంసారంబు క్రమ్మఱఁ గలుగనేరదు. అతఁడు

మోక్షసామ్రాజ్యముం జెందునని బాదరాయణుండును, సనత్కుమారుండును బల్కుచుండిరి. అదియె సర్వతీర్థరాజం బనిన నయ్యదియు యథార్థంబు కానేరదు. మధుస్రవతీర్థమునందు స్నానము చేయు పుణ్యాత్ముండు గోసహస్రదానఫలమును బడయును. సరస్వతీనదియును నరుణానదియును సంగమించుచోట స్నానము చేసిన పూతచరిత్రుండు త్రిరాత్రోపవాస మచ్చోటఁ జేసి బ్రహ్మహత్య వాయును. అగ్నిష్టోమమును నతిరాత్రమును వీని నొనర్చినంత ఫలమును జెందును. ఇంతే కాక కులమున నేడుతరముల వారిని సుకృతులఁ జేయును. పదంపడి యవతీర్ణతీర్థరాజం బొకండు గలదు. దర్భి యను ఋషీశ్వరుండు బ్రాహ్మణులమీఁద గృపాళుండై చతుస్సముద్రోదకంబుల నత్తీర్థమునందు సన్నిహితంబులఁ గావించె. ఇందుఁ గృతస్నానుండై వ్రతముల నాచరించి, యుపవాసంబులఁ జేసి, యుపనయన సంస్కారమును బొందినవాఁడు బ్రాహ్మణుం డగు. జ్ఞానిష్ఠుండైనవాఁడు స్నానమాత్రమున ననేకవ్రతముల నాచరించినవాఁ డగును. ఆవల శతసహస్రకంబు, సాహస్రకంబు నను తీర్థద్వయంబు గలదు. వీనియం దవగాహనం బాచరించినవాఁడు సుకృతియై యనేకగోదానఫలమును బొందును. అచ్చోట దానాదులఁ గావించియు నుపవసించియు ముందటిదానము యొక్క వేయిమడుంగులఫలమును బడయును. రేణుకాతీర్థమునను మజ్జన మాడినమహనీయుం డచ్చోటఁ బితరుల నర్చించి సకలపాపవినిర్ముక్తుం డయి యగ్నిష్టోమఫలముఁ గాంచును. విమోచనతీర్థస్నానము ప్రతిగ్రహపాపము లెల్లఁ బాపు. పంచవటియందు మహాదేవు నర్చించి పవిత్రుండైన మనుజుండు సద్గతిఁ జెందు. తైజసతీర్థ మని ప్రఖ్యాతిఁ గాంచిన వారుణతీర్థమునందుఁ బూర్వము దేవతలు కుమారస్వామికి సర్వసేనాధిపత్య మొసంగి యచ్చో నభిషేకము గావించిరి. ఆతీర్థమునందును దత్పూర్వదేశమునం దుండు కురుతీర్థమునందును, స్వర్గద్వారతీర్థమునందును మునుంగు పావనమూర్తి పాపముల నెల్లఁ బాసి బ్రహ్మలోకవాసి యగు. పదంపడి యనరకతీర్థ మున్నది. ఇందు బ్రహ్మాదిదేవతలు, నుమామహేశ్వరులును నిత్యసన్నిహితులయి యుందురు. కావున నిందు మజ్జన మాడినమహనీయుండు పాపంబులఁ దొఱంగి దుర్గతికిదూరుఁ డగును. విష్ణుతీర్థమున విష్ణువుఁ బూజించి విష్ణులోకమును బొందు. మఱియుఁ దీర్థ

యాత్రాపరుం డగుబుద్ధీశ్వరుండు సర్వదేవతీర్థంబున స్నానమాచరించి సుకృతియై సర్వసుఖములం దేలుచు స్వస్తిపురమును సేవించి పితృులకు జలాంజలి యర్పించినచో నగ్నిష్టోమఫలముం బొందు. గంగాహ్రదమున మూడుకోట్లతీర్థములు సన్నిహితంబు లయియుండు కూపమొండు గలదు. దాన నేమహనీయుండు మజ్జన మాడునో యాతండు స్వర్గగామి యగు. స్థాణువటంబునందు స్నానము గావించి, మహాదేవు నర్చించి, యొక్కరాత్రి వసించినచో నా తీర్థసేవాపరుండు స్వకులము నుద్ధరించి మహాదేవుగణముల కధిపతి యగు. బదరీకాననమున వసిష్ఠాశ్రమము గలదు. అందు మూడు రాత్రు లుపవసించి బదరీఫలభక్షణంబుం జేసిన ద్వాదశసంవత్సరములు బదరీఫలములభక్షణమాత్రముగం గలుగు ఫలంబు లభించు. ఇంద్రమార్గమును నొంది తీర్థోపవాసంబు సేసి యొకయహోరాత్రము వసించినవాఁడు బ్రహ్మలోక మొందు. ఏకరాత్రతీర్థము నొంది, యచట నియతుఁడు, సత్యవాదియునై యేకరాత్ర మున్నవాఁడు బ్రహ్మలోకమునం బూజితుఁ డగును. ఆదిత్యాశ్రమతీర్థమున స్నానమాడి యాదిత్యు నర్చించువారు కులోద్ధారకులై యాదిత్యలోకమున కేఁగుదురు. సోమలోకముల కేఁగఁ దలఁపుఁ గొన్నవారు సోమతీర్థమున స్నాతు లగుదురు. దధీచితీర్థమునందు సారస్వతసిద్ధినిమిత్తము మంగిరసుం డవగాహనంబు గావించె. కావున నందు జలకమాడినవారు సారస్వతసిద్ధిని నశ్వమేధఫలముం జెందుదురు. కన్యాశ్రమమునందు మూఁడునా ళ్ళుపవసించినవారికి గన్యాశతంబును, స్వర్గలోకమును గలుగు. సన్నిహతతీర్థమునందుఁ బ్రత్యమావాస్యయందు బ్రహ్మ దొట్టినదేవతలు, మహాపుణ్యభరితులయిన తపోధనులగు ఋషు లందఱు నెలనెల కిట కేతెంతురు. మఱియు నిట భూమియందును నంతరిక్షంబునందును నుండు తీర్థంబులుం గూడ సన్నిధిం గాంచు. ఇందు సూర్యగ్రహణకాలమున స్నానముఁజేసి పితరుల నుద్దేశించి శ్రాద్ధముం జేసిన పుణ్యాత్ముండు సర్వయజ్ఞఫలమును బొందును. సర్వపాపవిమోచనంబుఁ గాంచు. పద్మవర్ణవిమాన మెక్కి బ్రహ్మలోకమున కేఁగును. గంగాహ్రదతీర్థమునందు మునింగిన మహనీయుండు రాజసూయాశ్వమేధయజ్ఞములను జేసినసుకృతముం బడయు. పైని

జెప్పిన సన్నిహతీతీర్థమునందు మచక్రకుఁ డను ద్వారపాలునకు దండ
ప్రణామంబు లాచరించి కోటితీర్థమజ్జనము గావించినచో విస్తార మగు
సువర్ణలాభముం జెందు. భూలోకంబున నైమిశతీర్థమును, స్వర్గమునం
బుష్కరంబును, ముజ్జగంబులందుఁ గురుక్షేత్రమును శ్రేష్ఠములు.
కురుక్షేత్రమునుండి గాలికిఁ గొట్టుకవచ్చిన దుమ్ము రేణువులు పాపముల
నొనర్చిన మానవునిపాపంబులఁ బోకార్చి యాతనికి సుత్తమలోకం
బులఁ గలిగించును. సరస్వతీనదికి దక్షిణంబునను, దృషద్వతీనదికి నుత్త
రమునను నెవరు గురుక్షేత్రమున నివసింతురో, వారు స్వర్గలోక
వాసులే. 'ఏను కురుక్షేత్రమున కేఁగెదను. కురుక్షేత్రమున నుండెదను'
అని యనువాఁడు సర్వపాపములనుండి విముక్తుఁ డగును. దేవర్షు లుండి
నట్టి పావనంబగు కురుక్షేత్రము బ్రహ్మవేది యనఁబడు అచ్చట నేమాన
వులు వసింతురో, వారి కెన్నఁటికిఁ జింత లేదు. తరంతుకారంతుకతీర్థముల
నడిమిభాగ మేదియో, రామహ్రదమచక్రుకములకు నేది మధ్యభాగమో,
యాకురుక్షేత్రశమంతపంచకము బ్రహ్మకు నుత్తరవేది యనఁబడును.

ఆ కురుక్షేత్రమునందలి తీర్థములను సేవించినతర్వాత ధర్మతీర్థ
మునకుఁ బోవలయును. అచ్చట యముఁడు తపంబు గావించుటంజేసి
యా తీర్థము ధర్మతీర్థ మనఁబరఁగు. అందు స్నాన మాచరించిన
వాఁడు తనపూర్వుల నేడ్వుర నుద్ధరించు. జ్ఞానపావనతీర్థస్నాన
మగ్నిష్టోమఫలమును, మునిలోకమును సిద్ధింపఁజేయు. బ్రహ్మాదిదేవతలు
సేవించుసౌగంధికవనంబును మానవులు సొచ్చి పాపవిముక్తు లగు
దురు. ప్లక్షానదియందు స్నానముచేసి పితరుల నర్చించినచో నశ్వ
మేధఫలముం బొందును. కవేరాధ్యుషితతీర్థసేవవలన కపిలగోసహస్ర
దానఫలమును నశ్వమేధఫలమును జెందు. తీర్థ శ్రేష్ఠములగు సుగంధ,
శతకుంభ, పంచయక్షములయం దవగాహనంబు గావించిన తీర్థయా
త్రాపరాయణుండు స్వర్గలోకసుఖముల ననుభవించు. త్రిశూలఖాత
తీర్థసేవనంబుం జేసినవాఁడు గణాధిపత్యంబు నొందు. పదంపడి శాకంభ
రీతీర్థ మున్నది. దీనినే దేవస్థానతీర్థమని వాడుదురు. ఇందు మూఁడురాత్రు
లుపవసించి శాకభక్షణంబుఁగావించినచో ద్వాదశవర్షములు శాకాహార

ఘ్నుని మాత్రము చేసినవానిసుకృతముం జెందు. ఈతీర్థంబునఁ దొల్లి పార్వతి శాకాహారిణియై తపస్సుఁ జేయుచు నభ్యాగతు లగుమునులకు శాకముల నాహారముగా నిచ్చుచుండె. కాన నీతీర్థమునకు శాకంభరీతీర్థ నామ మమరె. తదనంతరంబు సువర్ణతీర్థమును యాత్రికులు సేరుదురు. ఈతీర్థరాజంబునఁ దొల్లి నారాయణుండు మహాదేవునిఁ గూర్చి తపం బాచరించె. ఆతపస్సునకుఁ బరమేశ్వరుండు మెచ్చి ప్రత్యక్షంబై విష్ణుని సర్వదేవతలకు ముఖ్యునిగాను, లోకమెల్లనతనికి ముఖంబుగాను జేసి యింకను దుర్లభంబులైన యనేకవరములను నొసఁగె. కావున నీతీర్థం బునఁ గ్రుంకు లిడుమహాత్ముండు మహాదేవుం బూజించి యశ్వమేధఫల మునుబడసి తుదకుఁ బ్రమథగణములలోనివాఁడై శివలోకముం జేరును. ధూమావతీతీర్థమును సేవించి యచ్చోట మూఁడురాత్రు లుపవాసము చేసినచో మనోరథము లెల్లఁ బ్రాపించు. దేవీదక్షిణార్ధంబునందు రథావర్తంబు నెక్కి ప్రదక్షిణం బొనర్చిన సద్గతి గలుగు. దుర్గతి తొలఁగు. ధారాఖ్యతీర్థమునం దవగాహనముఁ జేసి మహాపర్వతనమ స్కారము జేయువారు దుఃఖములఁ బోఁగొట్టుకొందురు. గంగా ద్వారము స్వర్గద్వారమునకు సమానము. అందుఁ గోటితీర్థమున మజ్జనం బొనర్చిన పావనమూర్తి కులంబు నుద్ధరించు. పౌండరీకఫలముం గాంచు. ఒకరాత్రి యచ్చో వసించినచో గోసహస్రదానఫలము లభించు. సప్త గంగ, త్రిగంగ, శక్రావతారము లను తీర్థముల సేవించి వానియందుఁ బితరుల నర్చించినవారికిఁ బుణ్యలోకములప్రాప్తి యగు. కనఖలతీర్థమజ్జ నము, నచ్చోటి త్రిరాత్రోపవాసము నను నివి యశ్వమేధఫలమును, స్వర్గలోకావాసము నొడఁగూర్చు. కపిలావటతీర్థమున మునింగి యక్కడ నొకరాత్రి యుపవసించినసుకృతికి వేయియావులదానఫలము గలు గును. కపిలుఁ డను నాగరాజుయొక్క తీర్థమున స్నానముచేసిన పుణ్య పురుషుఁడు వేయికపిలగోవులదానముచేసిన ఫలమును జెందును. లలి తక మనుశంతనుతీర్థావగాహనము చేయువారికి దుర్గతి తొలఁగు. గంగానదియు, యమునానదియు సంగమించుస్థలమున మజ్జనమాడు పుణ్యమూర్తి కులోద్ధారకుఁడై దశాశ్వమేధఫలమును జెందును. సుగంధతీర్థమున కేఁగుమహనీయుఁడు సర్వపాపవిముక్తుఁడై బ్రహ్మలోకా

వాసముఁ బడయు చక్రావర్తతీర్థమున మునిఁగి స్వర్గముఁ జెందు. గంగా సరస్వతీసంగమస్నాన మశ్వమేధఫలము, స్వర్గప్రాప్తి నొడఁగూర్చు. భద్రకర్ణమునందు భద్రకర్ణేశ్వరు దర్శించినవాఁడు నరకములను దూరుఁడగును. స్వర్గలోకమున దేవత లితని బూజింతురు. కుబ్జావతీ తీర్థావగాహనంబు వేయి గోదానములఫలము నొసంగు. స్వర్గమును గలుగఁ జేయు. అరుంధతీవటమునందు సాముద్రకతీర్థ మున్నది. అందు స్నానము చేసి, త్రిరాత్రోపవాసము గావించినవాఁడు కులంబు నుద్ధరించును. అశ్వమేధఫలము నొందును. వేయియాగ్రులదానమువలని ఫలమును బ్రాపించును. బ్రహ్మావర్తతీర్థమునకుఁ బోవువాఁడు సోమలోకమున కేఁగును. అశ్వమేధయాగకర్తృఫలముఁ జెందును. యమునాప్రభవమును, దర్వీసంక్రమణమును, బలిమద్గమ వేదిని సేవించి పూతాత్ముఁడయినవాఁ డశ్వమేధఫలప్రాప్తి నందును. వానికి స్వర్గలోకావాసము చేకూరును. సింధుప్రభవతీర్థమునఁ బంచరాత్రము లుపవసించిన సుకృతికి బహుసువర్ణలాభము గలుగును. ఋషికుల్య, వాసిష్ఠము లను క్షేత్రములను సేవించి పితృప్రీతికై పూజలు సలిపినవారును, నందు నెలదినములు శాకాహారమును మాత్రము గొని యుపవసించినవారును మహర్షిలోకమున కేఁగుదురు. వాసిష్ఠము నతిక్రమించినవా రెల్లరును ద్విజన్ము లగుదురు. భృగుతుంగమును సేవించినవాఁడు వాజిమేధయాగ ఫలముఁ బడయును. వీరప్రమోక్షతీర్థమునందు, కృత్తికామఘానక్షత్ర తీర్థములందు నవగాహనము గావించినవారికి నగ్నిష్టోమమును అతిరాత్రమును చేసినవారిఫలమును జెందును. విద్యాతీర్థమును సేవించిన వారు విద్యావంతు లగుదురు. మహాశ్రమంబున నొకపూట నిరాహారుండై యున్నవాఁడు సద్గతిం జెందు. మహాలయక్షేత్రమునందు షష్ఠకాలోపవాసముం జేసి సకలపాపవిముక్తుండై తనకు ముందుఁ బదితరములవారిని, వెనుకటిపదితరములవారిని నుద్ధరించును. బహుసువర్ణమును బడయును. వేతసికాక్షేత్రమును దర్శించి యశ్వమేధఫలమును, శుక్లగతినిం బొందును. సుందరికాతీర్థమున స్నానమాడినవాఁడు సురూపి యగు. బ్రాహ్మణీతీర్థమున మజ్జనముగావించినపుణ్యపురుషుండు కమల వర్ణవిమానము నెక్కి బ్రహ్మలోకమున కేఁగును. బ్రహ్మ మున్నగు

దేవత లుండు నైమిశంబును స్మరించినమాత్రమున సగముపాపములం బోనాడుదురు. నైమిశమును బ్రవేశించినచో సకలపాపవినిర్ముక్తుండగును. ప్రపంచపుణ్యతీర్థము లన్నియుం దామ సన్నిహితంబులై యుండును. ఆతీర్థమున నెలదినములు మునింగినవారు తమపెద్దల నేడుతరములవారిని నుద్ధరింతురు. అగ్నిష్టోమఫలమును బొందుదురు. నిరాహారవ్రతమును బూని యం దసువులం ద్యజించినవాఁడు సర్వపుణ్యలోకములయం దర్చితుం డగును. గంగోద్భవమునందు మూఁడురాత్రు లుపవసించినచో వాజపేయఫలప్రాప్తి యగు. తుదకు బ్రహ్మలోకమునకుం బోవును. సరస్వతీనదియం దవగాహనము గావించినవారు సారస్వతలోకముం బ్రాపింతురు. బాహుదానదీమజ్జనముం గావించి యం దొకరాత్రి వసించువానికి దేవయజ్ఞఫలమును గలుగు. దేవలోకమునం బూజితుం డగు. క్షీరవతీనదీస్నానము గావించి పితరులం బూజించిన పుణ్యాత్ముండు వాజపేయఫలమును బొందు. విమలాశోకతీర్థమున నొక్కరాత్రి వసించినవాఁడు పావనమూర్తి యై స్వర్గలోకమున మాననీయుం డగు. సరయూతీరమున గోప్రతార మను తీర్థ మొకటి యున్నది. ఈతీర్థమునందుం దొల్లి శ్రీరామచంద్రుండు భృత్యామాత్యాదిబలసహితముగ శరీరత్యాగము గావించెను. ఆతీర్థమును సేవించినపుణ్యపురుషుండు శ్రీరామప్రసాదమును బొంది పుణ్యాత్ముండై స్వర్గగామి యగు. గోమతియందు రామతీర్థసేవాపరుండైనవాఁడు కులోద్ధారకుండై యశ్వమేధఫలముం బొందు. శతసహస్రతీర్థమునస్నానమాడినమహనీయుఁడు గోసహస్రదానఫలమును బొందును. భర్తృస్థానతీర్థమును సేవించినవాఁడు పూతాత్ముండై యశ్వమేధఫలముం బడయు. కోటితీర్థమును సేవించి షణ్ముఖు నర్చించినవాఁడు తేజోవంతుఁడై సహస్రగోదానఫలము నందును. వారాణసియందు విశ్వేశ్వరునిఁబూజించి కపిలాహ్రదమున నవగాహనము గావించి రాజసూయయాగఫలమును బొందును. అవిముక్తమునం దీర్థమాడినవానికి బ్రహ్మహత్యాదోషము నశించు. ఇచ్చట దేహత్యాగముం జేసినచో వానికి జననమరణములు లేవు. గంగాగోమతీసంగమమున మార్కండేయతీర్థమున్నది. ఈతీర్థమును సేవించినవారు కులోద్ధారకు లగుదురు. అగ్నిష్టోమఫలము వారికి లభించు. ధర్మారణ్యమునందు బ్రహ్మసర స్సున్నది.

ఇందుస్నానము చేసినవాఁడు బ్రహ్మలోకావాసమును బడయును. మహానదీస్నాతుఁడై పితరులఁ బూజించినపుణ్యాత్ముండు కులోద్ధారకుఁడై శాశ్వతలోకములఁ బొందు. ధర్మారణ్యమున నున్న బ్రహ్మసరస్సు సమీపమున బ్రహ్మప్రతిష్ఠితంబైన యూపస్తంభము కలదు. దానికి నుషఃకాలమునఁ బ్రదక్షిణంబు చేసినవానికి వాజపేయఫలం బగు. ధేనుకక్షేత్రంబున నేకరాత్రము వసించి తిలదానమును, గోదానమును జేసినచో సర్వపాపవిముక్తియు, సోమలోకప్రాప్తియు నగు. అందలి పర్వతమునందుఁ గపిలధేనువు సవత్సంబుగ సంచరించు. దానియడుగులగుర్తు లిప్పటికిని నగపడుచున్నవి. ఆయడుగులఁ దాఁకినవాఁడు సర్వపాపవిముక్తుఁ డగును. గృధ్రవటంబున మేన బూది పూసికొనినచో బ్రాహ్మణుఁడు ద్వాదశవార్షికవ్రతఫలము నొందును. ఇతరులు పాపవిముక్తు లగుదురు. ఉద్యత్పర్వతమున సావిత్రి సంచరించినగుర్తు లున్నవి. అం దొకసారి సంధ్యనుపాసించినచోఁ బండ్రెండేండ్లు సంధ్యోపాసన గావించినఫలమును విప్రులు పొందుదురు. యోనిద్వార మని యొకతీర్థ మున్నది. దానియందు మజ్జనముఁ జేసినపుణ్యాత్ముండు మరల జన్మింప నేరఁడు. సాధారణముగ గృహస్థులు తమపుత్త్రు లెవరైనను గయకుఁ బోవుదురా? గయావర్జన మను అసితవృషోత్సర్జనముఁ (నల్లయాంబోతును ముద్రవేసి వదలుటఁ) జేయుదురా యని కోరుచుందురు. అట్టి గయాక్షేత్రదర్శన మశ్వమేధయాగఫలము నొసంగు. ఒకనెల గయాక్షేత్రవాసమునందుఁ దనకుఁ బూర్వపుసప్తపురుషుల నుద్ధరించు పుణ్యము నాతీర్థసేవారతుండు పొందు. అచ్చోట నక్షయవట మనువృక్షరాజ మున్నది. ఆవట సమీపమునఁ బితరులఁ దలపోసి పిండోదకదానము నొసంగుచో క్షయింపని ఫలముఁ బడయు. ఫల్గుతీర్థస్నాన మశ్వమేధఫలము నిచ్చు. ధర్మప్రస్థము ధర్ముఁడుండుచోటు. అచ్చోట మహాకూప మొండుగలదు. తత్కూపోదకస్నానముఁ గావించి పితరులకు దేవతలకు నుదకదానంబు చేసినవాఁడు సకలపాపరహితుఁడై స్వర్గగామి యగు. మతంగాశ్రమమును ద్రొక్కుచుండఁగనే గవామయనయాగఫలంబు తప్పక సిద్ధించు. ధర్మక్షేత్రవాతావరణమునం దుండినవాఁడు వాజిమేధయాగఫలముఁ జెందు. బ్రహ్మస్థానమును మెట్టినవాఁడు రాజసూయాశ్వమేధయాగఫలంబులఁ

బొందును. రాజగృహతీర్థావగాహనంబునఁ గాక్షీవంతునివలె మనస్సం తుష్టిఁ బొందును. యక్షిణీతీర్థసేవఁ జేసి బ్రహ్మహత్యాపాపవిముక్తుఁ డగును. ఎవరు మణినాగతీర్థమున స్నానపానముల నాచరింతురో వారికి సర్పవిషబాధ లుండవు. మఱియు నందొక్కరేయి వసించినచో వేయి యావులదానముచేసినఫలము సిద్ధించు. గౌతమవనమున నహల్యా హ్రద మున్నది. దానియుదకముల జలక మాడినచో నుత్తమగతి లభించు. ఉదపానతీర్థసేవకు లశ్వమేధఫలమును బొందుదురు జనకరాజకూపము దేవసేవితము. దీనియుదకములందు స్నానమొనరించినవారు విష్ణులోకా వాసముం గాంతురు. ఆవల వినశనతీర్థసేవనంబునకుఁ బోవవలయును. దానివలన సోమలోకప్రాప్తి యగు. ఆవల గండకీనదీతీర్థస్నానముచే వాజపేయఫలమును, సూర్యలోకంబునుం గలుగు. విశల్యానదీసేవనం బున నగ్నిష్టోమఫలమును స్వర్గలోకప్రాప్తియు నగు. అధివంగం బనువన మును మెట్టి, గుహ్యకులతోఁ జేరి సుఖి యగు. కంపనానదిని సేవించి పౌండరీకఫలమును స్వర్గలోకమును బ్రాపించు. మహేశ్వరధారను జేరిన వాఁడు యగ్నిష్టోమఫలముం బడసి కులము నుద్ధరించినవాఁ డవును. దేవ పుష్కరిణి, సోమపదము ననియెడి తీర్థములం దవగాహన మొనర్చినవాఁ డశ్వమేధఫలప్రాప్తిఁజెంది దుర్గతులఁ బాయు. ఆవల మహేశ్వరపదతీర్థా వగాహనంబున నశ్వమేధయాగఫలమును పౌండరీకయజ్ఞఫలమును విష్ణు లోకావాసమును గలుగు. పూర్వము కూర్మరూపధరుఁడైన రాక్షసుఁ డొకఁడు తీర్థకోటులలోనిజలముల నెల్ల నింకునట్లు చేయుటంజేసి తీర్థసేవా పరుల కవగాహనార్థమై తీర్థరాహిత్యము గలుగఁగా ఋషు లందఱును బోయి శ్రీమహావిష్ణునిఁ బ్రార్థించిరి. అంత నారాయణుం డీమహేశ్వర తీర్థమునం దాకోటితీర్థములలోని యుదకములను సన్నిహితము గావించి ఋషులకానందంబుఁ గల్గించె. సాలగ్రామతీర్థమునందు బ్రహ్మాదిదేవతలు విష్ణునిఁ గొలిచిరి. ఆతీర్థరాజమున విష్ణుం డెల్లపుడును సన్నిహితుండై యుండు. ఆతీర్థమును సమీపించి శ్రీమన్నారాయణు నం దారాధించిన వారు విష్ణులోకమును బొందుదురు. ఆసాలగ్రామతీర్థమున నుదకపానం బను కూపరాజం బొండు గలదు. ఈకూపజలములో నాల్గుసముద్రముల జలములు సన్నిహితంబులై యుండు. ఇందు స్నానమాచరించివారును

నచో వేయిగోదానములఫలమును బొందు. లంపేటికకు వెడలి వాజపేయఫల
మును, దేవతలచే గౌరవింపఁబడుటయుం గాంచు. మహేంద్ర పర్వతంబునఁ
బరశురామతీర్థ మాడిన నశ్వమేధఫల మగు. మతంగ కేదారస్నానమున్ఁజే
వేయిగోదానముల ఫల మగును. శ్రీపర్వతంబున శర్వాణీసమేతుం డగు
శంభువు నుపాసించినను, దేవహ్రదస్నాన మాచరించినను నశ్వమేధఫల
మును, నుత్తమసిద్ధినిఁబడయును. సముద్రతీరంబునఁ గన్యాతీర్థమాడి పాప
ములనెల్లఁ బోనాడును. సముద్రమధ్యమున గోకర్ణ క్షేత్ర మున్నది. అం
దీశానుండు బ్రహ్మాది దేవతలచేతను, తాపససిద్ధచారణగంధర్వులచేతను,
నరకిన్నరోరగములచేతను, భూతయక్షపిశాచగణములచేతను, సరిత్సాగర
శైలములచేతను సేవింపఁబడుచుండును. నక్తాహారియై నారాధించి యందుఁ
త్రిరాత్రము లుపవసించి, పండ్రెండుదినములు నుండినచో నశ్వమేధఫల
మును, బ్రమథగణములయాధిపత్యమునగును. పావనుండగును. గాయ
త్రీస్థానమున మూఁడురాత్రులుపవసించిన వారు వేయియావులదానఫలముఁ
బడయుదురు. ఈ క్షేత్రమునందు బ్రాహ్మణసమక్షమున సంకరజాతిపురు
షుండు గాయత్రిని బఠించినచో వానికి జన్మదుఃఖములు లేవు. అబ్రాహ్మ
ణునెదుట జపించినవాఁడు నశించు. సంవర్తుఁడనుఋషియొక్క వాపియం
దాడి సురూపుఁ డగును. వేణుతీర్థము (పెన్న) నకుఁ బోయి మూఁడు
రాత్రు లచ్చోట నుపవసించి యుండినచో నెమిళ్లు హంసలు వీనిచే
నొప్పారువిమానమున విహరించు. గోదావరీస్నానమున దశాశ్వమేధ
ఫలము వడయును. వేణాసంగమస్నాన మశ్వమేధఫలమును, వరదా
సంగమస్నానము వేయియావుల దానఫలమును, బ్రహ్మస్థానమున
త్రిరాత్రోపవాసము గోసహస్రదానఫలమును, స్వర్గలోకప్రాప్తిం
గల్గించు. కుశప్లవమున మూఁడురాత్రు లుపవసించినచో నశ్వమేధఫల
మగును. ఆవలఁ గృష్ణవేణాజలోద్భవయగు జలహ్రదమం దింద్రుఁడు
నూఱుక్రతువులు సేయుటంజేసి స్వర్గము నొందెను. అందు దేవహ్రద
మందు స్నానమాడిన జాతిస్మరత్వంబు నొందును అతనికి సర్వపాపవినా
శంబు నగు. అగ్నిష్టోమఫలము నెనయు. సర్వహ్రదస్నానముం జేసి వేయి
యావులదానఫలమును నెనయు. పయోష్ణీనదిని, దండకారణ్యమును
సేవించి సకలపాపవిముక్తుఁ డగును. శరభంగాశ్రమంబు, శుకాశ్ర

షంబు, జమదగ్ని సేవితమైన శూర్పారకము, సప్తగోదావరతీర్థము వీని యందు నాడినపుణ్యపురుషులు సంకటవిముక్తు లగుదురు. కులపావను లయ్యెదరు. వారు బహుసువర్ణలాభు లగుదురు. మఱియును వీరు పుణ్యాత్ములై దేవలోకమునఁ బూజితు లయ్యెదరు. దేవపథమును బొందిన ప్రతి దేవసత్ర మొనర్చిన సుకృతాత్ముని ఫల మొందు. తొల్లి రాక్షసులభయముచే వేదము లదృశ్యములైనవి. అప్పుడు దేవగురువు ఋషులయుత్తరీయములలో సుఖముగఁ గూర్చుండియుండి వారి కోంకారము నుపదేశించెను. దాని నాఋషు లుచ్చరించిరి. దానంజేసి వేదము లన్నియు లెస్సగా వారిచే నధీతము లయ్యె. మఱియు నొకకాలమున భృగుమహర్షి బ్రహ్మ, విష్ణువు మున్నగు దేవతలయనుజ్ఞఁ గొని ఋషులకు ఋత్విజుఁడయి విస్తారమైన యాజ్యధారల నగ్నిని సంతృప్తిపఱచె. ఈ రెండుమహా కార్యములును దుంగకారణ్యమున జరిగెను. ఇట్టి పుణ్యదేశమును మెట్టినపూతాత్ముండు దురితకర్మముల నెల్లఁ బాయు. ఆయరణ్యమున నొకనెల వసించినవాఁడు లోకోద్ధారకుం డగు. వానికి బ్రహ్మలోకము ప్రాప్తించు మేధావిక తీర్థముం జేరి స్నానము చేసినమహనీయుఁడును, నందు దేవతలకు బితరులకు జలాంజలులచే సంతృప్తిఁ గావించినవాఁడును బూతాత్ముఁడై స్మృతిమేధాభివృద్ధిం గాంచి, తుదకు స్వర్గమును బొందు. కాలంజరపర్వతమునందు దేవహ్రదతీర్థ మాడి యభిమతములు వడయుదురు. మఱియుఁ జిత్రకూటంబున మందాకినిని సేవించి, భర్తృస్థానంబునఁ గుమారస్వామి నర్చించి, కోటితీర్థములఁ గృతస్నానుండై జ్యేష్ఠమాసమున రుద్రు నర్చించి, శృంగిబేరపురంబున గంగాస్నాతులై గంగాధరుం బూజించి సర్వపాపవిముక్తు లగుదురు. వాజపేయఫలము నొందుదురు. ఈస్థలములయందుఁ బితృదేవార్చనంబులం జేసి యుత్తమగతుల నందుదురు. ముంజవటంబునందు మహాదేవునిఁ బ్రదక్షిణనమస్కారపూర్వకముగ నారాధించినవారు ప్రమథగణాధిపతు లగుదురు. అచ్చో గంగాస్నాతుఁడై సర్వపాపములను బోఁద్రోలు సర్వతీర్థములలోఁ బ్రయాగతీర్థ ముత్తమము. బ్రహ్మ యజ్ఞము గావింప నదియజ్ఞవేదియై యుండె. అందు మూఁడగ్నికుండము లున్నవి. వానిమధ్యమందు భాగీరథి యమునతో సంగమించును.

అది భూమికి జఘనస్థాన మనఁబడును. తన్నివాసము యాగశతంబుల కంటె విశిష్ట మని సురలు, మహాయోగులు, సిద్ధులు, సాధ్యులు, నాగులుఁ బ్రయాగ నునికిపట్టుఁ గావించికొని యుందురు. దేవతల కది యజ్ఞభూమి. మఱియు నందు వేదములు యజ్ఞములు మూర్తిమంత్రములై ప్రకాశించు. బ్రహ్మ, విష్ణువు, సనత్కుమారుఁడు మున్నగువారం దుందురు. అఱువదికోట్లుపది వేలతీర్థములు నిందు సన్నిహితంబులై యుండు. ప్రయాగను బ్రవేశించినను, దానినామసంకీర్తనము గావించినను, దానిమృత్తికను నొసట దిద్దుకొన్నను, శిరస్సున గ్రహించినను మహా పాతకంబు లెల్ల సూర్యరశ్మిఁ గాంచినహిమంబుకరణిఁ బలాయమాన మగును. అందు దత్తమైనపదార్థ మల్పమైనను మహాఫలద మగును. ప్రయాగయందు మరణించినవాఁడు పుణ్యలోకవాసముఁ గాంచు. సర్వమానవులు నందు శరీరత్యాగమం జేయుట యవశ్య మని వేద వచనము, లోకవచనము ప్రమాణములై యున్నవి. అట్టి ప్రయాగ యందు నరుఁడు తీర్థమాడు నేని రాజసూయాశ్వమేధఫలంబును, నాల్గు వేదములం జదివినవానిసుకృతమును, సత్యవచను పుణ్యమును బొందును. అందుభోగవతియనువాసుకితీర్థము, హంసప్రపతనమనుతీర్థములుగలవు. వీనియందు స్నానముఁ జేసి యశ్వమేధఫలమును బుణ్యాత్ములు పొందు దురు. అగ్ని యింధనములనట్లు గంగాజలముపాపముల భస్మీభూతములం గావించు. కృతయుగమునందుఁ దీర్థము లన్నియుఁ బవిత్రంబులు. త్రేతా యుగమునందుఁ బుష్కరము పవిత్రము. ద్వాపరమునఁ గురుక్షేత్రము పావనంబు. కలియుగంబున గంగ పుణ్యరాశి. మఱియుఁ బుష్కర మునఁ దపస్సు, మహాలయమునందు దానము, మలయమున నగ్న్యా రోహణము, భృగుతుంగమున నుపవాసము పుణ్యప్రదములు. పుష్క రాదిక్షేత్రములయందలి తీర్థములయం దవగాహనమునఁ బురుషుండు తనపూర్వుల నేడ్గురను, వెనుకటివారల నేడ్గురను దరింపఁజేయును. గంగను గీర్తించిన సర్వపాపక్షయ మగును. గంగను జూచినమాత్ర మున సంపద లొనఁగూడును. ఎవనియస్థులు గంగాజలమునం దెంతకాల ముండునో వాఁ డంతకాలము స్వర్గమునందుఁ బూజ్యుఁడై యుండును. గంగకు సాటియగుతీర్థమును, కేశవునకుఁ బరుఁడైనదేవుఁడును, బ్రాహ్మ

ఋన కంటె వేఱగుపూజ్యపదార్థమును నెందును లే దని తొల్లి బ్రహ్మ దేవుండు వాక్రుచ్చెను. గంగ పాఱుచుండు దేశ ముత్తమము. అయ్యది మునిశ్రేష్ఠులకుఁ దగినతపోవనము. అదియే సిద్ధక్షేత్రము.

ఈతీర్థమాహాత్మ్యమును సాధువులును బుణ్యాత్ములును నగు విప్రులకును, గుమారునకును, మిత్రులకును, విధేయుఁడైనశిష్యునకును గోప్యముగ వినిపింపవలయును. ఇది పవిత్రంబు, పుణ్యంబు, ధన్యంబు, స్వర్గసాధనంబు, ధర్మ్యంబు, మహర్షిరహస్యంబు, సర్వపాపములను దొలఁగించునది, శత్రువినాశనకరంబు. దీనిని బ్రాహ్మణమధ్యమందుఁ బఠించినవిప్రుండు సమస్తవిద్యలను నేర్చినవాఁ డగును. క్షత్రియుఁడు గెలుపొందును. వైశ్యుఁడు ధనవంతుఁ డగును. శూద్రుఁడు కోరినకోర్కులు పడయును. ఈతీర్థమాహాత్మ్యము ననుదినంబును జదువుపుణ్యాత్ముండు పూర్వజన్మజ్ఞానముఁ బొంది మరణానంతరము స్వర్గలోకమున కేఁగును. ఈచెప్పినతీర్థములలోఁ గొన్ని యగమ్యములు. కావున నన్నింటిని మనోగమనముచేఁ బొందుట శ్రేయస్కరము. దేవత లెల్లరును, మహర్షులందఱును నీతీర్థముల నన్నింటిని సేవించిరి. శాస్త్రజ్ఞు లగుమహానీయులు భగవంతుఁ డొకఁ డున్నాఁ డని వేదార్థములమూలమునఁ దెలిసి జితేంద్రియులై తీర్థయాత్రలను సలుపుదురు. దృఢవ్రతులు కానివారును, చిత్తస్వాస్థ్యము లేనివారును, నపవిత్రులును, మోసగాండ్రును, దెక్కలికాండ్రును, మూర్ఖులును దీర్థయాత్రలఁ జేయరు. గాంగేయా ! నీవీతీర్థముల సేవించి పూతశరీరుండ వగుము. నీకు దివ్యలోకములు ప్రాప్తించును. పుణ్యము వృద్ధి యగును. బ్రహ్మ మున్నగు దేవతలును, మహర్షులును నీతీర్థసేవాధర్మమున నెంతయు సంతసిల్లుదురు. వారికి వసులోకప్రాప్తియగు. కలకాల ముండు నీకీర్తి లోకములందు విస్తరించును. అని చెప్పి పులస్త్యుండు భీష్మానుజ్ఞఁ బొంది తనయిచ్చవచ్చినచోటి కేఁగెను.

ధర్మరాజా ! సర్వశాస్త్రములను, దత్త్వముల నెఱింగినభీష్ముఁడు పులస్త్యునివచనమున సర్వతీర్థాభిగమనముఁ గావించె. ఇంత చెప్పనేల? పైఁజెప్పిన నియమముతోఁ దీర్థయాత్రసలిపినపుణ్యాత్ముండు నూఱశ్వమేధములఫలమును బడయును. మహర్షు లనేకులు నీవెంటఁ దీర్థాభి

గమనమునకుఁ గాచియున్నారు. వారిం దోడ్కొని నీవును బైత్తీ
ర్థముల సేవింపుము. మహానుభావు లగు మహర్షులు నీవెంట వచ్చు
టం జేసి భీష్మునకుఁ దీర్థయాత్రవలన వచ్చిన ఫలమునకంటె నెన్నిమ
డింత లెక్కువప్రయోజనంబు నీ కగు. రోమశమహర్షి శీఘ్రమునన్ని
యిట కేతెంచును. ఆమహర్షిం దోడ్కొని సకలతీర్థములు సేవించిరమ్ము.
నీవు, మహాభిషుఁడు, యయాతి, పురూరవుఁడు, భగీరథుఁడు, శ్రీరామ
నృపాలుఁడు, మనువు,ఇక్ష్వాకువు, పూరుఁడు, పృథుచక్రవర్తి మున్నగు
మహారాజులకు సమానుండవు. ఇంద్రుండు రాక్షసులసంహరించి స్వర్గము
నేలునట్లు నీవు నీశత్రువుల నాజిని సంహరించి, గెలుపుగొని సర్వమహీ
మండలమును బాలించి యశస్సు నొందుదు వని చెప్పి నారదుండు
స్వేచ్ఛంబోయె. అంత ధర్మజుండు నారదునివచనములం దలంచుచుఁ
దీర్థసేవవలని పుణ్యమును వెంట నున్న ఋషిసంఘములకుఁ దెల్పి కొంత
సేపటికి ధౌమ్యునితో ట్లనియె.

ఋషివర్యా! మనయర్జును నస్త్రసంపాదనమున కంపితిమి, వాఁడు
వాసుదేవున కెనవచ్చువాఁడు; సమర్థుండు; కృష్ణార్జునులు మహనీయు
లనియు, దొల్లింటి నరనారాయణఋషు లి ట్లవతరించి రనియు నాకు
నారదమహర్షియు, వేదవ్యాసమహర్షియు నక్కాణించిరి. ఇంద్రుని
కుమారుం డగుటను, మనయర్జునుం డింద్రుం జూచి యెవ్విధమున
నైన నస్త్రముల సాధింపఁగలఁ డని యతనిం బంపియుంటిమి. భీష్ముఁడు,
ద్రోణుఁడు, కృపుఁడు, అశ్వత్థామ మున్నగు మహాశూరులయినవారు
తనపక్షమునఁ బోరు నడపింప దుర్యోధనుఁడు నిశ్చయించియుండుటంబట్టి
వా రందఱును నర్జునునితోఁ బోరుటకు సంసిద్ధులై యున్నవారు.
అర్జునుండు వారల నందఱం గెలుచు నని నాతలంపు. మఱియు సుయో
ధనుఁ డనుగాలిచే విసరఁబడిన కర్ణుఁ డనునగ్నిహోత్రము బాణపరం
పర లను జ్వాలలతో నా సైన్య మను నెండుగడ్డినిఁ బ్రవేశించి దానిని
గాల్ప నారంభించినపుడు వాసుదేవుఁ డనుగాలిచే వీఁచఁబడిన గొప్ప
దివ్యాస్త్రములనెడి వెలుఁగు గలిగి తెల్లవారువంబు లను కొంగలబారుతో
నొప్పి గాండీవ మనెడి యింద్రాయుధము మీఱి బాణధార లను జడి
గురిపించి కర్ణుఁ డనునగ్నిని నర్జునమేఘము చల్లార్చు నని తలంచెద.

దివ్యాస్త్రములను బడసి యాయర్జునుండు మాయొద్ది కెప్పుడు రా నున్నాఁడో? అతండు మాయొద్ద లేమింజేసి యిచ్చోటనుండుటకు మా కిచ్చలేదు. పుష్పఫలభరితవృక్షములుగల మఱియొకవనమున వసింపఁ దలంచెద. సమీపమున నట్టివన మున్నచోఁ జెప్పుము. అనఁగా ధౌమ్యుండు ధర్మజు నూఱడింపుచు నిట్లనియె.

ధౌమ్యుఁడు ధర్మరాజునకుఁ దీర్థములఁ జెప్పుట

రాజేంద్రా! పుణ్యతీర్థములను, నాశ్రమంబులను జెప్పుచున్నాను. సావధానుఁడవై వినుము. వానినామములను విన్నంతనే మీరు పవిత్రులగుదురు. పుణ్యము గలుగు. వానిని జూచుట నూఱింతల మేలుఁగూర్చు. మొదటఁ దూర్పున నుండు తీర్థములఁ జెప్పెదను. గోమతీనదీతీరమున నుండు నైమిశారణ్యము, గయపర్వతము, బ్రహ్మసరస్సు, అక్షయవటప్రదేశము, ఫల్గునదీతీరమున వెలయు గయాక్షేత్రము, కౌశికి, గంగ, పాంచాలమునందు విశ్వామిత్రయజ్ఞప్రదేశము, జామదగ్న్యగీత మనఁబడు నుత్పలావనంబు, విశ్వామిత్రుం డెచ్చోట నింద్రునితో సోమపానముఁ జేసి బ్రాహ్మణుఁ డాయెనో యట్టికన్యాకుబ్జము, ప్రయాగము, అగస్త్యాశ్రమము, కాలంజరమున హిరణ్యబిందువు, మహేంద్రము, బ్రహ్మశాల, మతంగకేదారము, దప్పిఁ దీర్చుకొనునిమిత్తమై నలుం డే ప్రదేశమున జలము నుత్పాదించుకొని దాహముఁ దీర్చుకొని సుఖయయ్యెనో యట్టి కుండోదపర్వతము, దేవవనము, బాహుద, నంద యనునవి జగద్విఖ్యాతములు. దేవారణ్యక్షేత్రమున బాహుద, నంద యను రెండు నదులు నుత్పన్నములు.

ఇఁకను దక్షిణమున నుండు తీర్థరాజములను, క్షేత్రములను నుడువుచున్నాను. వినుము. గోదావరి, వేణ, భీమరథి, పయోష్ణి యను నదు లున్నవి. ఇందు పయోష్ణీనదీతీరంబున నృగమహారాజు తనచేసిన యాగమునందు నింద్రుని సోమపానముచే మైమఱపించె నని మార్కండేయుండు గీతము పాడెను. శివపురము, మాఠరవనము, వరుణస్రోతస పర్వతమునందుఁబ్రవేణి కుత్తరమునఁ గణ్వాశ్రమముంగలదు. అందుండు యూపము వేదీశూరార్పకమున నుండు జమదగ్న్యాశ్రమమునందలి

పాషాణతీర్థము, పూర్ణచంద్రతీర్థము, అశోకతీర్థము, అగస్త్యతీర్థము; పాండ్యదేశములో నుండు వారుణతీర్థము, కుమారతీర్థము, దేవతలు తపంబుచేసిన తామ్రపర్ణీతీర్థము, గోకర్ణక్షేత్రము, అగస్త్యశిష్యాశ్రమము, సురాష్ట్రములయందలి చమసోద్భేదనము, ప్రభాసము, పిండారకము, నారదమహర్షిచే స్తుతింపఁబడిన యుజ్జయంతపర్వతము, ద్వారావతియను మహాక్షేత్రముగలవు. ఈద్వారావతియందు దేవదేవుఁడు మధుసూదనుఁ డుండును. ఆతనినే వేదవిదు లగువిప్రులు పరాత్పరుఁడనియు, పరమపురుషుఁ డనియు, పురుషోత్తముఁ డనియు, పరబ్రహ్మమనియుఁ, బవిత్రులలోఁ బవిత్రుఁడనియు, నాత్మకుఁ బరమాత్మ యనియు, నవ్యయుఁ డనియు, క్షేత్రజ్ఞుఁ డనియు, నిత్యుఁ డనియు, ననిర్వాచ్యుఁ డనియు నందురు.

పడమట నుండువానిం జెప్పెద. అవంతిదేశమున నర్మదానది పావనము. ఈనది పడమరమొగంబై పాఱును. దీనియిరుపార్శ్వములయందు రసాలప్రియంగువృక్షములును, కీచకవనంబులును, వేత్రగుల్మములును గలవు. పవిత్రస్థలములు పుణ్యతీర్థోదకములు నర్మదయందు సన్నిహితములు. బ్రహ్మ మున్నగుదేవతలు, నారదాదిమహర్షులు నీనదియందుఁ గ్రుంకు లిడుదురు. ఇచ్చోటన పావనం బగువిశ్రవసునియాశ్రమము వెలయుచుండు. ఇచ్చటఁ గుబేరుఁడు జన్మించెను. వైడూర్యశిఖరపర్వతము, విశ్వామిత్రనదియుఁ గలవు. దానిగట్టున యయాతిపతనము, పుణ్యహ్రదము, మైనాకపర్వతము, అసితాచలము, కక్షసేనాశ్రమము, జంబూమార్గము, కేతుమాలము, గంగాద్వారము, సైంధవారణ్యము గలవు. పుష్కరనామకమగు పితామహసరస్సు గలదు. వైఖానసాశ్రమము, త్రిపుష్కరములు ప్రఖ్యాతములు.

ఉత్తరమునందలి తీర్థక్షేత్రములఁ జెప్పెద. సరస్వతి, ప్లక్షావతరణతీర్థరాజము, అగ్నిశిరస్తీర్థము గలవు. ఇయ్యవి యమునానదీతీరమున నున్నవి. ఇందుఁ దొల్లి సహదేవుఁడు యజ్ఞము చేసెను. ఈయజ్ఞమున కింద్రుం డాహ్వానింపఁబడి యేతెంచెను. అప్పుడు యాగప్రవర్తనమునకు సంతసిల్లి యింద్రుండు గీతము పాడెను. ఆగీతమును విప్రులు పాడెదరు. ఇచ్చోట సహదేవుఁడు చేసినయాగము లసంఖ్యాకములు. ఇచ్చోటనే

భరతుఁడు మున్ను మున్నూఱు పదియైదుజన్నములు చేసి కృతార్థుఁ డయ్యె. శరభంగునియాశ్రమము దీని కుత్తరమున నున్నది. ఈమహర్షి విప్రుల కపరిమితాన్నదానము గావించెను. ఈయాశ్రమముననే వాలఖిల్య ఋషులు తపస్సుల నొనర్చిరి. దృషద్వతి, దాల్భ్యాశ్రమము మున్నగు నవియు విశాఖయూపమును శ్రేష్ఠములు. జమదగ్ని యజ్ఞవాటికయైన పలాశకములందు నాతనిమహిమచే నదు లెల్ల నొక్కచో సమావేశమై యాతనియజ్ఞమున కేతెంచినవిప్రులకుఁ బానార్థము మధువు నొసంగెను. సనత్కుమారుఁడు సదా ధ్యానించుగంగాద్వారము, కనఖలము, పురూరవోయాగస్థానము భృగుతపస్స్థానము నగు పురుపర్వతము భృగుతుంగాశ్రమముం గలవు. సకలదేవతలకును మహర్షులకును మాననీయుఁడును బూజ్యుఁడును నైనవాఁడును, నాదియోగీంద్రుఁడును నగు నారాయణఋషీశ్వరునకుఁ దపస్స్థానమగుట నిది సర్వతీర్థరాజమును, సర్వక్షేత్రశ్రేష్ఠమును నైనది. శ్రీమన్నారాయణునిమహిమచేఁ బూర్వమయ్యది యుష్ణోదకమును స్వర్ణసికతను గలిగినది. గంగాతీరంబున వెం యు బదరీవనమును, లోకపావనమైన తీర్థక్షేత్రములు. దేవర్షులు మున్నగు మహనీయు లీతీర్థముల సేవించి, క్షేత్రముల దర్శించి పుణ్యమూర్తు లయిరి. పరాత్పరునిసన్నిధానమును బడసిరి. కావున నో ధర్మరాజా! ఈక్షేత్రములను దర్శించి, తీర్థములయందు స్నానము చేసి నీవును మనోవాంఛలను బొందుము. చింత దక్కియుండుము. దీనిచే దుఃఖము లెడఁబాయును. అభీష్టములు సిద్ధించు నని ధర్మరాజునకుఁ దీర్థయాత్రయందు ధౌమ్యుండు మనస్సును గల్గించెను.

## ధర్మరాజునొద్దకు రోమశమహర్షి యేతెంచుట

అంత ధౌమ్యువచనములయందు గౌరవబుద్ధి నుంచి ధర్మరాజర్జునుఁడు దివ్యాస్త్రములం బడసివచ్చునంతకుఁ దీర్థసేవ సేయుద మనినం గరంబు లగ్గగు నట్లు చేయుదమని ద్రౌపదియు, భీమనకులసహదేవులును, దనవెంటనున్న బ్రాహ్మణులు నను చుండఁ దేజోవంతుండును, నిర్మలకీర్తియును, మహనీయుండును నగురోమశమహర్షి విచ్చేసెను. అంత ధర్మజుం డిట్లువచ్చిన మహామునిని వేల్పులు దేవేంద్రునింబోలెనతిభక్తిదమ్ములయు బ్రాహ్మణులయుఁ దోడునఁబూజించి, మునీంద్రా! ఎందుండివచ్చితిరి?

తమ రాకకుఁ గతం బేమి యనఁగా నాతనికి రోమశుం డిట్లనియె. నేను సకలలోకములను సంచరించుచుండుదును. అంత నొక్కనాఁడు నాకంబున కేఁగితి. అందు సుధర్మం బొడఁగాంచితి. ఆసభయందు దేవతలును మహర్షులును బరివేష్టించియుండ నింద్రుం డొడ్డోలగంబునఁ గొలువు సేయుచుండె. అప్పు డింద్రునితో నేకాసనంబున నీయనుజుం డర్జునుం డుండుటను గని మనంబున విస్మయంబు నొందితి. నాయాశ్చర్యపడిన మనస్సును దెలిసికొనినయాశతక్రతుండు నా కర్జునునిమహిమను దెల్పి నావిస్మయమును మాన్పెను. ఇంద్రుం డంతటితో నిలువక నన్ను భూలోకంబున కేఁగి మీసందర్శనంబు గావించి యర్జునునిరాకకై తహతహపడుచున్న మీతో నర్జునుని క్షేమములను జెప్పుమనియు నాతనివృత్తాంతమును మీ కెఱింగింపు మనియు నా కాజ్ఞాపించె. నీవును నీతమ్ములును ద్రుపదరాజసుతయు నాచెప్పినమాటలు నవశ్యంబుగ వినుఁడు గాక. అస్త్రగ్రహణార్థం బర్జునుండు నీచే సెలవుగొని పోయినపుఁ డింద్రకీలపర్వతమున నింద్రుం గాంచి యాతనియనుజ్ఞ మెయి హిమశైలశిఖరముప్రాపించి బహువిధకుసుమఫలభరితములైనవృక్షములతో నొప్పు నిర్మలనిర్ఝరోదకములతోను గూడి కమలకుముదకల్హారశోభితమై కలహంసనినాదములతోఁగూడియున్న పెక్కుతామరకొలఁకులచే నొప్పుమీఱు నొక్కతపోవనమునం దాసీనుండై మహాదేవు నుద్దేశించి తపం బొనర్చి యామహనీయునను గ్రహంబున నేరికిం బడయ రానిసర్వలోకసంహారసాధనమగు పాశుపతాస్త్రమును సంపాదించి, లోకపాలురచే వారివారి దివ్యాస్త్రములను బడసి, శతక్రతువువలన దివ్యాస్త్రంబుల ననేకములను బొంది, విశ్వావసుకుమారుఁ డగు చిత్రసేనుం డనుగంధర్వువలన నృత్యగీతముల నేర్చి నాకలోకమున సుఖస్థుఁడైయున్నవాఁడు. దేవతలకు హితముపొంటె నొక మహాకార్యమును జేసి యతిరయమున భూలోకమునకు రానున్నవాఁడు. అర్జునుఁడు పడసిన దివ్యాస్త్రసామర్థ్యంబుచేఁ గర్ణుని సరకుగొనఁడు. నీకుఁ గర్ణునివలనిభయంబు వలదు. కర్ణుఁ డర్జునుని పదునాఱవయంశమును బోలలేఁడు. వానిమహత్త్వమునంతయు నింద్రుండు నాకుఁ జెప్పి యీవృత్తాంతము నంతయు మీ కెఱుకపఱుపు మనెను. నీమనస్సు తీర్థయాత్రయందు సక్తమైయున్నది. అయ్యది యవశ్యం బను

శ్రేయంబు. దానిచే ధర్మార్థకామమోక్షములు చేకూఱు. తీర్థయాత్ర మీరు సలుపుచుండ నింద్రుండు మీకు సహాయుండై యుండునట్లు నన్నా జ్ఞాపించె. నీసోదరుఁడు, మీరు తీర్థసేవాపరులై యుండ మీకు రాక్షసాద్యరణ్యవాసులచేతను క్రూరవన్యమృగములచేతను భయం బాపాదిల్లకుండ రక్షఁ గావింపుమని నన్నుఁ బ్రార్థించె. కాఁబట్టి నారాక యింద్రుని నియోగమునను నర్జునునివేడికోలునను సంభవించినది. ఇంతకు మునుపు నేను దీర్థములసేవ రెండుమాఱులు గావించితి. ఇది మూఁడవ సేవ. తీర్థసేవాపరులకును, శాంతాత్ములకును, దపస్వులకును దుష్కరము లేవాఁడును లేవు. కావున నీవు తీర్థసేవ గావించి మహాసుకృతములఁ బొందుము. నీవు భగీరథయయాతిమన్వాదిపూర్వరాజులఁ బోలినమహానీయచరిత్రుఁడవు. దురాత్ములకుఁ దీర్థయాత్రాఫలము సిద్ధింపదు, నీవు సుకృతివి. కావున నీయుద్యమమునం దనేకులు నీకు సాయపడెదరు. ఈకార్యము నిర్విఘ్నముగ నెఱవేఱు. అనఁగా ధర్మరాజు రోమశుం జూచి మునివర్యా! నేను పరమానందమున నున్నాఁడ. ఈమాటల కుత్సాహకరంబు లగుబదులుమాట లాడనేరకున్నవాఁడ. నాకుఁ దీర్థయాత్రయందు మనం బాసక్తమగుటయు, దేవతల కధిపతి యగు పాకశాసనుండు నిన్నుఁ బంపి నన్నందుల కియ్యకొనునట్లు చేయు మనుటయు, నీ వందులకు నాకుఁ దోడ్పడెద ననుటయు నంతయుఁ బరమాహ్లాదకరములు. అర్జునుండు నాకుఁ దోఁబుట్టువగుటంగాదే యిట్టి వృత్తాంతంబు విన నయ్యె. అవశ్యంబు తీర్థముల సేవించెద. పుణ్యక్షేత్రముల దర్శించెద నని రోమశునకుఁ బ్రత్యుత్తరము నిచ్చె. అంతఁ దనవెంటనున్న పరిజనమునందు దప్పికిని నాఁకలికిని, జలిబాధకు నెండవేడిమికి నోర్వలేనివారలను, విప్రులను, నశనార్థులఁ గొందఱను హస్తినపురమునకును, గొందఱ ద్రుపదుపురికిని బంచెను. హస్తినాపురమునకుఁ బంపఁబడినవారు ధృతరాష్ట్రపోషితు లగుచు సమ్యక్ప్రకారంబుల విచారింపఁబడుచుండిరి. అట ద్రుపదుఁడును ధర్మరాజు భృత్యులఁ గడు గారవించి సత్కరించుచుండెను. ఆతీరునఁ దనతో నున్నవారిని నయ్యయిచోట్లకుఁ బనిపి కామ్యకవనమునందు ధర్మరాజు మూఁడు రాత్రు లుండి తీర్థయాత్రకుఁ దరలియుండఁ, గామ్యకవన

సమీపపుఁబల్లెలలో నుండువిప్రులు కొందఱు ధర్మరాజును జూచి యిట్లు
నిరి. రాజచంద్రా! నీవెంటఁ దీర్థయాత్రకు మేమును వచ్చెదము;
మమ్ముం దోడ్కొనిపొమ్ము. సంతతదురంతక్రూరమృగములసంచారముం
జేసి దారుణకాంతారములయందుండు తీర్థములు మాదృశులకు సేవిం
చుట దుర్లభమైయుండు. మీరు ధనుర్ధరులరు. శూరులరు. మీసాహాయ్య
మున మాకును బుణ్యతీర్థసేవ, పుణ్యక్షేత్రసందర్శనము సులభముగ
లభించు. సుకృతము ప్రాపించును. బహువచనంబులాడ నేల? మీకు విప్రుల
యందుఁ బ్రీతి గల దేని మాపలుకుల మన్నించి మమ్ము మీవెంట
రానిండు. రోమశమహర్షిసాహాయ్యమున మీరు మాతో సకలతీర్థముల
సేవించి పుణ్యాశ్రమంబుల దర్శించి సర్వపాపవిముక్తుల రగుఁ డనఁగా
ధౌమ్యుఁడును రోమశమహర్షియును వారికోరికకు సమ్మతింపఁగా ధర్మరా
జును ననుజ్ఞ యొసంగెను. ద్రౌపదియుఁ బ్రయాణసన్నాహమునం
దుండెను. అంత దివ్యమునులు పర్వతనారదవేదవ్యాసులు ధర్మరాజు
నొద్ద కేతెంచిరి. వారల మువ్వురి నంచితసత్కారములఁ బూజింపఁగా
వారు పాండవులతో నిట్లనిరి. శారీరనియమములు మానసవ్రతములును
మనస్సును బుద్ధిని శుచిగానుంచుట దేవవ్రతములనంబడును. ఇట్టిసౌమ్య
వ్రతనియమములను జలుపుచు ఋజుమార్గులరై తీర్థసేవం గావించి,
మీరు సర్వభూతములయందు మైత్రిం జరిపి తీర్థాభిగమనంబున మహా
భిషనాభాగ భగీరథ భరతముచుకుంద మాంధాతృసగరసార్వభౌ
మాష్టకరోమపాదులయట్లు శత్రుజయంబును సర్వలోకసుఖంబులును
బొందుదు రని చెప్పి మునివరులు మువ్వురు నరిగిరి. అంత నజాతశ
త్రుండు రోమశమహర్షి కిట్లనియె. మునీంద్రా! మావెంట నున్నభృత్యు
లను విప్రులను బెక్కండ్రను వారివారియుచితస్థలంబులకుఁ బంపితిని.
ఆత్మసంరక్షణార్థము మావెంట వల్కలాజినధారులు, ఖడ్గాద్యాయుధ
పాణులునై కవచములను దొడిగియుండు నింద్రసేనాదిమూలభృత్యులు
కొందఱును బరిచారకు లల్పసంఖ్యాకులును గొలిచి వచ్చుచున్నవారు.
ఇంతదనుక నే నరణ్యవాసము సలుపుచుండినను నావెంట ననేకు లుం
డిరి. ఇప్పుడు భృత్యవర్గమునైతము సన్నగిల్లె. ధరణియందుఁ గాపురు
షులు నధార్మికులును, నగువారి పెంపును సుచారిత్రమున నెగడు. ధార్మి

కులు దుర్భరమైనకష్టంపుఁబొట్లంబడుటయుఁ దగునె? మఱియు నచేతన ములయ్యును బర్వతప్రాంతములు సరోవరతీరములు, సరిత్పరిసరము క్షేమికతంబున జనులకు దురితాపహారకంబు లయినవి యని యడుగఁగా నందులకు రోమశుం డిట్లనియె.

## రోమశుండు ధర్మరాజునకు ధర్మవిశేషములు సెప్పుట

ధర్మనందనా! నీ విందులకు శోకింపవలదు. అధర్మపరులైనవారి యభివృద్ధి దీర్ఘకాల ముండనేరదు. అది వేగంబ తఱుగును. రాక్షసులు దొల్లి యెంతో యభివృద్ధిం గాంచి తుదకుఁ బొలియలేదా? ప్రథమ మున ధర్మవర్తనులు గొంతకష్టములకుఁ బాలయ్యును దుది మేలు నను భవింతురు. దేవతలు దైత్యులచే మితిలేనిబాధలం బడి తుదకు క్షేమ ములం బొందిరి. అదియెట్లనిన, వినుము. అధర్మవర్తనులయందు దర్పము పుట్టు. దర్పమువలన మానముపుట్టును. మానమువలనఁ గ్రోధముపుట్టు. క్రోధమువలన లజ్జాత్యాగ మగు. లజ్జాత్యాగమువలన శీలము చెడు. లజ్జలేనివారలను శీలహీనులను లక్ష్మి విడనాడు. లక్ష్మితో క్షమాధైర్య ములు తమంతటఁ దామే తొలఁగును. కావున లక్ష్మి వీడఁగనే యలక్ష్మి యావహించు. అలక్ష్మితోఁ గూడినవారిఁ గలి యాశ్రయించు. అట్లు దైత్యులు కలిచే నాశ్రితులై ధర్మములను ఎదలిరి. తీర్థసేవల మానిరి. పుణ్యాశ్రమదర్శనంబుల నుజ్జగించిరి. ఇట్లు క్రమంబున మానమోహితు లై క్రియాశూన్యులయిరి. అపకీర్తిపరులై కొనకు లయించిరి. దేవత లిట్లు గాక పుణ్యాశ్రమంబుల దర్శించియుఁ దీర్థసేవలఁ జేసియు, యజ్ఞముల నాచరించియుఁ బెద్దల సేవించియు, మహర్షులయాశీర్వచనములఁ బడ సియు, ధర్మ ముత్తరోత్తరాభివృద్ధి నొందించుటంజేసి సర్వపాపవిముక్తు లయి యుత్తమపదవిం బొందిరి.కావున మీరును దీర్థయాత్రాదిసుకృతము లంజేసి సర్వపాపవిముక్తులయి యమరసదృశు లగుదురు. ధర్మారంభవిశిష్ట మతుల రగుదురు. మిమ్ముఁ దిరముగ లక్ష్మిపొందును. శత్రువులను దప్పక జయింతురు. పూర్వరాజులగు నృగశిబిభగీరథేక్ష్వాకుముచుకుందమాం ధాత్రాదులంబోలె సద్యశస్సును బొంది శుభములఁ బడయుదురు. అధ ర్మప్రవర్తకు లగుదుర్యోధనాదులు వేగంబ నశింతురు. నావచనంబులు

సత్యములు. అని పలుక, ధర్మరాజూఱడిల్లెను. అంతలోఁ బాండవులు నైమిశారణ్యంబుఁ బ్రవేశించిరి. ఆయరణ్యమునందునఁ బ్రవహించు గోమతీనదియందును నితరములగు పుణ్యక్షేత్రములలోని తీర్థముల యందును స్నానమాడి యచ్చోట దేవపితృయజ్ఞములం జేసి వారిని సంతుష్టులం గావించి, పిదప నచ్చోటనుండు కన్యాతీర్థములు గోతీర్థము సేవించి కాలకోటియందును విషప్రస్థమునందును, గొన్నినాళ్లుండి యచ్చోటనుండి బాహుదాతీరమున కేఁగి యం దవగాహనంబు గావించి, ప్రయాగముం జొచ్చి గంగాయమునాసంగమస్థానమునందు స్నాతులై యచ్చోటఁ గొన్ని దానములను గావించి నన్నాహారములచే బ్రాహ్మణులకు మృష్టాన్నంబుఁ బెట్టుచు నచ్చోటఁ గొన్నినాళ్లు తపస్సుఁ జేయుచుండిరి. పిదప మహానదిని సేవించి యచ్చోటనుండి తరలి సమస్తనదులకుపుట్టుచోటును సదా మహాదేవునికిఁపట్టును నగుగయాక్షేత్రమునందలి బ్రహ్మసరస్సునందు మజ్జనమాడి శుచులై యక్షయవటంబునందు ఋషు లాచరించు తెఱఁగునఁ జాతుర్మాస్యదీక్షను జలిపి జితేంద్రియులయి యుపవసించి వేదపాఠకులగు విప్రులవలనఁ బుణ్యకథల నెఱుంగ నుండఁగా శమనుఁ డనుఋషి వారల కిట్లనియె.

అథూర్తరజసుఁడను రాజునకుఁ బుత్రుఁడయిన గయుఁడను రాజర్షిసత్తముఁ డొకఁ డుండెను. ఆ రాజర్షి జన్నములందు విప్రుల కొసర్చిన యన్నదాన మపారంబు. విప్రసమారాధనమునకుఁగా నా రాజర్షి యొసర్చినయసంఖ్యాకములైన యన్నపర్వతములును, నేతికాల్వలును బరుగుఁ జేరులును,వ్యంజనప్రవాహములును వేలకొలఁదిగనుండెను. ఆసమారాధనమునందు విప్రులకు బహుళదక్షిణల నొసంగి యతఁడు వారిని సంతృప్తులం జేసె. అతఁడు గావించినయాగము లన్నింటియందును దక్షిణాకాలమున బ్రహ్మఘోష మాకాశమంటెను. సర్వప్రాణులును వాని యజ్ఞమున సంతృప్తము లయ్యెను. వాఁడు గావించిన యన్నదానమునఁ బ్రాణిసంతృప్తి గలుగఁగాఁ బర్వతాకారములుగ మిగిలిన యన్నరాసుల పరిమితిని గణించుట దుష్కరము. ఏటియిసుక నెంచవచ్చును. ఆకసంబున నుండు నక్షత్రముల నెన్నవచ్చును. కాని యాగకాలములందు నాతఁ డొసఁగిన దక్షిణలసంఖ్య నెన్న నలవికాదు. అట్టిగయునామమున

నీక్షేత్రము గయ యనంబడె. అప్పటినుండి యిది పుణ్యక్షేత్రం బయ్యె. పితరుల నుద్దేశించి యిందుఁ బిండప్రదానంబుఁ జేసినవా రిష్టార్థసిద్ధిఁ బొందుదురు. అని చెప్పిన శమనువలన గయాక్షేత్రమహిమ విని ధర్మరాజాదు లగస్త్యు నాశ్రమంబునకుఁ జని దుర్జయాతీర్థంబుం జేరి యందుండఁగా ధర్మజుండు రోమశమహర్షిని జూచి వాతాపి యనువాఁ డగస్త్యుచే నశింపఁబడె నని వింటిమి. మానవనాశకుఁడయిన వాతాపి యెట్టిప్రభావము గలవాఁడై యుండె? వానిపై మహాత్ముఁడగు నగస్త్యునకుఁ గోప మేల చెలరేఁగె? వీని నెల్ల వినఁ గోర్కె యున్న దనఁగా రోమశుం డిట్లనియె.

## అగస్త్యుఁడు లోపాముద్రను వివాహమాడుట

మణిమతి యని ప్రఖ్యాతిఁ గాంచిన పట్టణం బొకటి పూర్వకాలమునం దుండెను. అందు నిల్వలవాతాపు లనువా రన్నదమ్ము లిరువురుండిరి. వారిలో నిల్వలుండు తపోధనసంపన్నుం డైనయొక్కవిప్రునిఁ బూజించి యిట్లనియె. మునీంద్రా! నా కింద్రసముఁడగు పుత్త్రుని ననుగ్రహింపు మని వేఁడఁగా నావిప్రుం డలిగి రాక్షసాధమా! నీపోతర మెట్టిది? ఇంద్రునితో సమానుఁ డగుకుమారుఁడు నీకుఁ గావలయునే? యని కసరెను. అంత నిల్వలుండు విప్రునికలిగి కామరూప మెత్తి వాతాపిం బిలిచి వానిని మేషరూపమును దాల్ప నియోగించె. పిదప నాతఁ డామాయామేషమును వధించి దానిమాంసమును వండించి యావిప్రుని కాహారముగా నొసంగెను. పదంపడి యిల్వలుండు 'వాతాపీ! ఇటురా' మ్మనఁగా నామాయావి యావిప్రుకడుపు చీల్చుకొని వెలుపలికి నిజరూపముతో వచ్చెను. అంత నావిప్రుఁడు సచ్చె. అదిమొదలాయన్నదమ్ము లిరువురును దమకడ కతిథులై వచ్చువిప్రుల నిట్లు వధించుచుండిరి. ఆకాలమునం దొక్కమహనీయుండగు విప్రుం డగస్త్యుం డనువాఁడు బ్రహ్మచర్యం బతితీవ్రముగ నడుపుచు మిక్కిలి తపస్వియై చరించుచుండఁగా నొకనాఁ డాతనియాశ్రమంబునకుఁ జేరువ నొకయందుగుచెట్టుకొమ్మను దలక్రిందై వ్రేలాడుచుఁ దపంబు సలుపుచున్న మునులం గాంచి 'యయ్యలారా! మీ రిట్లేల తలక్రిందై వ్రేలుచున్నా' రని యడుగ నందులకు వా రిట్లనిరి. మునివర్యా! అగస్త్యుఁడా! మేము

నీపితరులము. నీవు బ్రహ్మచర్యాశ్రమమునందే యుండి యపత్యములను బడయమి మాకూర్ధ్వగతులు లేవు. కాన మే మిట్లున్నవారము. నీవు వివాహమై సంతానవంతుఁడ వగుచో మాకుఁ బుణ్యలోకములు పొందుటకు వీలగును. కావున నీ వతివేగముగ సంతానముఁ బడయుటకై వివాహము చేసికొనుము. అన నగస్త్యుండు నట్లే యని కన్యక నన్వేషించుచుఁ బోవఁగా నెందును దనకుఁ దగినకన్యక లభింపకుండె. ఇట్లుండ, విదర్భరాజు పుత్త్రార్థము బహుకాలము విప్రవరులఁ బూజించుచున్నాఁడని యెఱింగి యగస్త్యుండు వానియొద్ద కేగి తనతపోమహిమంబున సురుచిరలావణ్యయగు నొక్కకూఁతు లోపాముద్ర నాఁబరఁగు దానిం గలిగించి వాని కొసఁగ నది తనసౌందర్యవిలసితంబున నానాఁటికి శుక్లపక్షచంద్రునిఁ బోలి ప్రవర్ధమాన యగుచుండె. ఇంకఁ గొన్నాళ్లకు లోపాముద్ర యౌవనవంతురాలై యనేకదినంబులు దన్నుఁ గొలుచుచుండ సరస్సునందలి కమలంబువోలె, వినీతునందలి లక్ష్మియుంబోలె, సుధ్యస్తునందలి విద్యయుం బోలెఁ బ్రవర్ధమాన యగుచుండఁగా లోకమునందలి రాజకుమారులెవ్వరు నగస్త్యభయంబున లోపాముద్రను వరియింప నోడిరి. వైదర్భుఁడును సుందరి యగుతనకూఁతునకుఁ దగినవరు నన్వేషించుచుండ నొక్కనాఁ డగస్త్యుం డారాజునొద్ద కేతెంచి యిట్లనియె. 'నృపాలా! నాకు వివాహాపేక్ష జనించె. నీకూఁతు నా కిమ్ము. నే వివాహము చేసికొనెద' ననఁగా వైదర్భుం డీముని నారచీరలం దాల్చువాఁడు అరణ్యమునందుఁ దపస్సు చేసికొనుచుఁ గాలయాపనం గావించుచుండు. అరణ్యమునందుఁ జిక్కు కాయలు గడ్డలు తిని జీవించు. అట్టిపురుషునకు నాకన్య నిచ్చినచో దీనిచేత నారచీరలఁ గట్టించి, కందమూలములను దినిపించును. ఉగ్రవనవాసము నీకోమలి చేయవలసిన దగును. ఎఱిఁగియెఱిఁగి భోగయోగ్యయైన యీలావణ్యవతిని నీముని కెట్లొప్పగింతు నని భార్యతో వేదనంబడుచుండఁగా వానిభార్యయును దోఁచునది గానక మన మేమి చేయవచ్చు. మునీంద్రుండు తపస్సంపన్నుండు. వానికోర్కె తీర్పనినాఁ డతఁడు మనల శపించునేమో? యని దిగులొందుచుండెను. అంతట వారి ముద్దులమూటయు, మోహనాంగియునైన లోపాముద్ర వారి యొద్దకు నేతెంచి మీ కీవంత యేల? నన్నామునిచంద్రున కొసఁగి వివా

హము చేయుఁడు. దీన మే లగు ననఁగా నా రాజదంపతులు కూఁతుమాటకు సంతసిల్లి దాని కొడంబడి యా సురుచిరాంగి నాతపోధనున కిచ్చి వివాహముఁ గావించిరి. ఇట్లగస్త్యుండు విధ్యుక్తముగ లోపాముద్రను బెండ్లియై భార్యను దనయాశ్రమమునకుఁ గొంపోవువాఁడు మున్న దానిపై నుండు నాభరణముల నన్నింటిఁ దీయించి యుత్తమభామలకు సమర్పించి దానికిఁ గట్టుపుట్టముగ నారచీర నొకదాని నిచ్చి కట్టించి సమానవ్రతగాఁ జేసి, గంగాతీరమున నొకతపోవనంబున నాపరమపతివ్రతామణి తనకు సకల పరిచర్యలం జేయుచుండ నుగ్రతపంబు గావించుచుండె. అంత నొక నాఁడు తపంబు పెంపున ద్విగుణీకృతతేజయు ఋతుస్నాతయు నైన దాని సురుచిరాకార మమ్మునికి గోచరింపఁగా నతఁడు దాని సంతానార్థము గవయఁ దమకించె. లోపాముద్రయు సంగమం బపేక్షించుపతిమనోరథం బెఱింగి లజ్జావనతవదనయై పతిం జూచి కేల్మోడ్చి యిట్లనియె. మునీంద్రా! లోకమునందుఁ బతి పత్నిని వరించుట సంతానార్థము. నేను నీవలన బిడ్డలం గనుట కుత్సాహముతో నున్నాను. నీసంగమమును నిషేధింపను. ఎట్టివారును భార్యను గవయుటకుఁ బూర్వము దాని కుల్లాసంబుఁ బుట్టింతురు. నా కొక కోర్కి యున్నది. దానం గాని నే నుల్లాసంబుఁ బొంద నేర. అది యెయ్యది యంటివేని, వినుము. తొల్లి నేను నాతండ్రి యింట నుండఁగా, దివ్యాభరణభూషితురాలనై దుకూలములను, చీనిచీనాంబరములను గట్టుచు నుత్తమప్రాసాదంబున సొంపగు మంచముపైఁ బాన్పునందుఁ బరుండఁగోరుదాన. నాయందు నీకుఁ గోర్కి కలదేని నా కట్టితొడవుల నొసఁగి, పలిపంపుచీరఁ గట్ట నిచ్చి, నీ వీ తపస్సునఁ గృశించిన దేహమును వివిధభూషణములచే నలంకరించికొని సుగంధముల నలంది, సువాసనగల వగుపుష్పమాల్యాదులచే నలంకృతుఁడవై నాకు మనోహరుండవై కోమలినైన నాతో భోగించి నీయిష్టానుసారంబున నపత్యంబుఁ బొందుము. ఇంతయు సమకూర్చుటకు ధనము వలదే యందువేని, నీవు చిన్ననాఁటంగోలె దపోధనము నార్జించియున్నావు. దానం బడయరాని దెయ్యదియు లేదు. కావున నైహికధనంబులు దానిచే సులభముగఁ బొంద నగు నని యమ్మునిని వేఁడఁగా నగస్త్యుం డాచిన్నారిపలుకుల కలరి యట్లు కావించెదఁ గాని తపోబల

మున ధనంబు సుసాధ్యంబైనను పపోష్యసంబునను మనసు గొలుప దనఁగా నాపతివ్రత పతితో 'నయ్యా! నీతపస్సు ధనంబునకై వ్యయపఱుప నాకును నసమ్మతంబు. అయినను, నాకుఁ బోడవుల పై నాస యున్నయది. చిన్ననాఁడు రాజసుతనై పెరిగినదాన. నాకోర్కె నిపుడు పతివైన నీవంటిమహానీయుండు తీర్పకున్న నేను బ్రతుకను. నాకోర్కె దీర్చి నన్ను భోగింపుము. ధన మార్జింప నొండొద్దేని యుపాయంబూహింపుమనఁగా, నాతపోధనుండు దానిశమదమాదిగుణములకుఁ గడు మెచ్చి దానియభీష్టంబు నెఱవేర్ప రాజులయొద్దకుఁ బోయి ధనము తెచ్చెద నని పత్నికి మనఃప్రియంబులు పచించి యాకాలపురాజులలో శ్రుతపర్వుఁ డను వాఁడు ధనవంతుఁ డగుట యెఱింగి వానిపట్టణమున కరిగె. శ్రుతపర్వుండు మునీంద్రుం డగు నగస్త్యునిరాక నెఱింగి యెదురేఁగి యర్ఘ్యపాద్యముల నొసఁగి యర్చించి యాగమనకారణం బడుగ ద్రవ్యార్థంబు నీయొద్ద కరుదెంచితి. నీభృత్యులపోషణంబునకు, నీరాజ్యపరిపాలనంబునకడ్డుగాక నీయాయంబున కొంత మిగులు గేని యాధనంబు నా కిమ్మని యమ్మునివర్యుఁ డడుగఁగా నారాజవర్యుండు మంత్రులం బిలిపించి కరణములమూలమునఁ దన యాదాయవ్యయపరిశీలనము చేసి నాజ్ఞ సేయఁగా వా రాకార్యము నిర్వహించి యారాజునాదాయవ్యయములు సమములుగ నుండుటను దెలిపిరి. అంత నగస్త్యుండు మిగులు లేమి నెఱింగి యారాజును దనతో ధనము తన కొడఁగూడునంతకు నరుదెమ్మనఁగా నాయిరువురును బ్రధ్నశ్వుం డను రాజుపాలికిం జనిరి. అంత నారాజు వారి నిరువుర నతిథిసత్కారమునఁ బూజించి వారియాగమనకారణమడుగఁగా నగస్త్యుండు వానితో 'నయ్యా! నీపోష్యజనపోషణంబునకడ్డుగాక నీయాయమున మిగిలియుండు ధనము గోరి వచ్చితి' ననఁగా నందుల కారాజు తనయాదాయవ్యయంబులఁ బరికించి యవియును సమంబులుగా నుండుట వారి కెఱిఁగింప నంత నగస్త్యుఁడు వారి నిరువురఁ దోడ్కొని త్రసదస్యుఁ డను వేఱొకరాజుపాలికిం జన, నాజనాధిపుఁ డర్థితోఁ దమ్మునందఱఁ బూజించి యాగమనకారణం బెఱింగి తనయాదాయవ్యయపరిశీలనముం గావించి యవియుఁ దొల్లిటియిరువురరాజుల వంటివిగా నుండు టెఱింగించెను. అంత నగస్త్యుండు వారలతో మీయా

డాయవ్యయములు సమానములుగా నున్నయవి. మీధనంబును గ్రహించిన మీభృత్యులును, మీచేఁ బోషింపఁబడు నాశ్రితులును, గష్టములపా లయ్యెదరు. కాన నాకుఁ బాపం బాపాదిల్లు. పుష్కలధన మార్జింపవలయును, వేఱొక్క యుపాయం బూహించి చెప్పుం డనఁగా వారు మణిమంతం బను ప్రాంతంబున నిల్వలుం డనురక్కసుఁడు ధనవంతుఁ డొక్కం డున్నవాఁడు. తనతమ్ముఁడు వాతాపి యనువానితోను నుండును. అతండు మనకు వలసినధనము నియ్యఁగలవాఁ డనఁగా నారాజర్షులు మువ్వురు దోడ రా నాఋషిసత్తముం డిల్వలుపాలికిం జనిన నయ్యిల్వలుండు వారి నందఱ నతిథిసత్కారంబుల నర్చించి వారల నందఱం దనయింటఁ గుడువ వేఁడెను. అంత నారాజులు వాఁ డెప్పటియట్ల వాతాపిని మేషముఁ గమ్మని వానిమాంసమును వండిచుచుండు టెఱింగి వానిద్రోహకృత్యము నగస్త్యునకుఁ దెలిపిరి. అగస్త్యుండు వారివలన సంగతి నంతయు నెఱింగి యాలోచించి రాజులతో వెఱవకుఁడు. వాతాపిని గబళించి నేను జీర్ణముఁ గావించుకొనియెద ఊరడిల్లుఁడ నెను. అంత నిల్వలునియింట వాఁడొసంగినయాసనమున నగస్త్యుఁడాసీనుండై యుండ నాకృతక మేషమాంసంబునంతయు నగస్త్యున కిడఁగా నగస్త్యుం డామాంసము నంతయు మెసవి మ్రింగి యొక్క త్రేఁపు త్రేఁచె. అంత వాతాపి విప్రునుదరంబున జీర్ణుఁ డయ్యెను. ఇల్వలుండు దాని నెఱుంగక యెప్పటియట్ల వాతాపీ! యని పిలిచి వెలుపలికి రమ్మన నగస్త్యుఁడు నవ్వుచు నోయిల్వలా! వాతాపి యిం కెందుఁ గలఁడు? వాఁడు నాజఠరాగ్నిదగ్ధుండై యుదరమునందు జీర్ణుఁ డాయెను. అనఁగా నిల్వలుండు చిన్నవోయినమోముతోఁ జింతఁ గొన్నవాఁడుగఁ గాన్పింపక యమ్మునివరుతో ఋషిసత్తమా! ఇమ్మువ్వురు రాజర్షులతోఁదమ వచ్చిన కార్యమును జెప్పుఁ డని యడుగ, నగస్త్యుండు వానితో నిట్లనియె. ఇల్వలా! ఈరాజపుంగవులతో నేను ధనార్థినై నీకు ద్రవ్యము గలుగు టెఱింగి వచ్చితి. నీపోష్యజనపోషణమున కడ్డు లేనిచో నావెంట వచ్చిన యీరాజు లొక్కొక్కరకును బదివేలావులు, పదివేలబంగారుగద్యాణంబులును నిమ్ము. నాకువారిలో నొక్కొక్కని కొసంగినదానికి రెండింత లొసఁగి వేగవంతములైన యుత్తమాశ్వంబులఁ బూన్చిన బంగారు

రథము నిమ్మనఁగా నిల్వలుండు తత్క్షణంబున నగస్త్యుండు కోరినధనము
నారాజులు మువ్వురకును నగస్త్యునకు వినయమునొసఁగుచు లనుగుత్తము
లతోఁ బూన్చినబంగారుతేరుతో నిరువదివేలగుఱ్ఱములను నిరువదివేల
పసిండిగద్యాణంబుల నొసంగెను. అంత నగస్త్యుం డారాజులతోఁ గూడి
సంపాదించిన గోధనసువర్ణములను గొని యిల్వలుండు పూన్చిన రథంబు
నారోహించి వేచని రాజులకు వారివారిపురంబుల కేగుటకు సెలవొ
సంగి తనసతీమణి కోరినవాని నన్నిటిఁ గల్పింప లోపాముద్రయుఁ
దనయభిమతముఁ దీర్చినపతికై సంతోషించి యార్యా! నీవర్తనంబున
సంతుష్టనైతి. నాకోరినవాని నెల్ల నా కొసంగితివి. ఇఁకయుం దపత్య
ముల నుత్పాదించుట కేయాటంకమును లేదనఁగా నమ్ముని లోపా
ముద్రం జూచి యిట్లనియె. శుభాంగీ! నీవర్తనమునకుఁ గడు మెచ్చితి.
నే నొక్కటి నిన్నడిగెదను నీయభిమతంబు నుడువుము. పదుగురం
బోలెడు నూర్వురకొడుకులు గావలయునా? నూర్వురం బోలెడు పదుగు
రుసుతులు గావలయునే? లేక వేవురనుసమానబలులగు సుతులతో? కాకున్న
వేవురం బోలెడు నుత్తము నొక్కసుతు నలతో? యనఁగా లోపాముద్ర
పతిప్రశ్నలకు ముదితహృదయయై తనకుఁ బ్రసన్నుఁ డగుమునీంద్రునితో
వేవురకు సమానుఁడును, మహావీర్యగుణాఢ్యుఁడును నగు నొక్కసుతుం
బడయంగఁ గాంతుఁ గాని నుగుణవంతులు కాని వేవురు నా కేల?
యనఁగా నగస్త్యుండు పత్నికోరికఁ దీర్చునిమిత్త మొకశుభముహూ
ర్తంబునఁ దనచిత్తముచొప్పున వర్తించుభద్రమూర్తి యగు లోపా
ముద్రకు గర్భాధానంబు గావింప నాపతివ్రత యామహర్షి వీర్యంబు
తనగర్భమునం దేడేండ్లు దాల్చి యొకశుభముహూర్తమున సాంగవేద
ములను బఠింపుచు, వేదరహస్యమును జపించుచు, దృఢస్యుఁ డనుపేరితో
సూర్యతేజంబుతో వెలయుచుండు నుత్తమతనయుం గాంచె. వాఁడును
దినదినప్రవర్ధమానుండై విఖ్యాతిం జెంది యొక్కమునికన్యకఁ బెండ్లాడి
తేజస్వి యను ఋషిసత్తముం గనెను. ఆతేజస్వి యగ్నికార్యమునకు
విస్తారమగు నిధ్మములను మోయుటచే వాఁ డిధ్మవాహుం డని ప్రసిద్ధ
నామముఁ బడసెను. ఇట్లగస్త్యుండు పుత్త్రపౌత్త్రులం బడసి మహాకుటుంబి
యగుటం జేసి తత్పూర్వ మీఋషి యనపత్యుం డగుటం జేసి తనపిత

షలయధోగతిం బాపి, పుణ్యలోకగతులఁజేసి ధన్యుం డయ్యె. నాఁటం గోలె నీయాశ్రమం బగస్త్యాశ్రమము నాఁ బరగె. అని రోమశమహర్షి చెప్పి, 'ధర్మనందనా! ఇయ్యది భాగీరథీనది. దక్షిణదిక్కు నెల్లఁ దల్లివలె నిది రక్షించు. ఈతీర్థమునందు స్నానము చేయుము. తొల్లి పరశురాముఁడు తన తేజంబు నంతయు శ్రీరామునిచేఁ గోల్పోయి యీతీర్థావగాహనంబునఁ గ్రమ్మఱఁ దనతేజస్సు నార్జించె. ఇట్లు నీవు నిందు సుస్నాతుఁడవై దుర్యోధనాపహృతరాజ్యమును మరలఁ జెందుదువు సుఖవగుదువు. అనఁగా ధర్మజుండు తాను, భీమనకులసహదేవులును, ద్రౌపదియు నందు విధ్యుక్తముగా స్నానముఁ జేసిరి దేవపితృయజ్ఞములను గావించి విప్రులకు సమారాధనంబు నేసి మిక్కిలి తేజము నొందిరి. అంత ధర్మజుండు రోమశమునీంద్రుతో 'ఋషివర్యా! తొల్లి పరశురామునితేజస్సును శ్రీరాముం డేల యపహరింపవలయును? క్రమ్మఱ పరశురాముం డాతేజస్సు నెట్లు వడసె? ఈవృత్తాంతం బంతయు నానతియ్యవే యనఁగా నారాజచంద్రున కమ్మునిచంద్రుం డిట్లనియె.

తొల్లి శ్రీమన్నారాయణుఁడు రావణువధార్థమై లోకంబున శ్రీరాముం డనుపేరితో నయోధ్యాపురం బేలు దశరథుఁ డను రాజునకుఁ బుత్త్రుండై యవతరించియుండ, శ్రీరాముండు మిథిలయందు జనకరాజ చేసియుండిన ప్రతిజ్ఞకు శివధనుస్సును విఱిచి సీతను బెండ్లాడి నిజపుర మగునయోధ్యకు నేతెంచెను. పదంపడి శివకార్ముకమును శ్రీరాముఁడు విఱిచె నని జమదగ్నిసుతుఁడు, మహావీర్యపరాక్రమశాలి యగు పరశురాముఁడు విని శ్రీరాముని నెదుర్కొనునిమిత్తమై యయోధ్యకుఁబోయి నిజవీర్యమునుజూప శ్రీరామునితో మల్లచఱచఁగాఁ బరశురాముని యాటోపమునకు దశరథుండు వెఱచి వానిపైకి శ్రీరామునిఁ బంపఁగా నప్పరశురాముఁడు శ్రీరామునిపరాక్రమముఁ దెలియనివాఁడై 'ప్రాఁతశివధనుస్సును విఱిచితివి. కాని, యీవైష్ణవధనుస్సును మోపెట్టు'మని తనవింటిని శ్రీరామున కొసఁగఁగా దాని నశ్రమంబున శ్రీరాముండు మోపెట్టి 'యింకను పరశురామా! ఏమి చేయవలయు' ననఁగా 'నంతమాత్రమున శ్రీరామా! పౌరుషశాలివైతివె? ఇదిగో! ఈ యమ్మునిచ్చెద. దీని నందు సంధింపు' మని సక్రోధముగఁ బరశురాముఁడు

పలికెను. శ్రీరాముం డమ్మును వేగంబ సంధించి పరశురామునితో జామదగ్న్యా! భూసురులు శాంతు లని లోకవిశ్రుతము. నీయందు శాంతి గానరాదు. క్షత్రియులకంటె నెక్కుడు తేజము బూనియుందువు, నీ కుండు బ్రహ్మవరముచే నిట్లు నన్నధిక్షేపించితివి. నీ కింతగర్వ మేల? నన్నుం జూడుము. నీకు దివ్యదృష్టి నొసంగెదను. అని చెప్పఁగాఁ బరశురాముం డంతట శ్రీరామునిశరీరమున నష్టవసువులును, నేకాదశరుద్రులును, ద్వాదశాదిత్యులును, సాధ్యులును, నారదాదిదేవర్షులును, దైత్యులును, దేవతలును, యక్షులును, రాక్షసులును, గుహ్యకులును, మరుద్గణంబులును, గంధర్వులును,ఆదిత్యాదినవగ్రహములును, ఎల్లనక్షత్రములును, వాలఖిల్యాదిమహామునులును, దేవర్షులును, భూర్భువరాద్యూర్ధ్వలోకములును, అతలాద్యధోలోకములును, సప్తసముద్రములును, సకలసరిత్సరోవరములును, నిఖిలపర్వతములును, సర్వతీర్థరాజంబులును, బుణ్యాశ్రమంబులును, స్వరూపంబులు ధరించి వెలయుసర్వవేదములును, వేదాంగములును, యజ్ఞవషట్కారంబులును, మేఘబృందములును గాంచి యద్భుతదర్శనుండై విస్మయంబంది భయకంపితాంగుఁడై యొడ లెఱుంగక వీక్షించుచుండ శ్రీరాముం డాతం డొసంగినబాణము నాతనిపైఁ బ్రయోగించిన నాబాణము నలుప్రక్కల దుమ్ముదుమారములను వర్షించుచుఁ బ్రచండవాయువును వీచుచు, నంతటం గొఱవుల విసరుచు భూమి గడగడ వడంక నాపరశురామునితేజస్సు నపహరించి యాతని నిర్వీర్యుం జేసి చనియె. అంతఁ బరశురాముండు తేజోహీనుండై మూర్ఛవోయి నేలఁబడి కొంతవడికిఁ జేతనంబుఁ బడసి లజ్జాభయములతో శ్రీరామునకు మ్రొక్కి, తనయవజ్ఞతకుఁ జింతిల్లి, తననిస్తేజస్కతకు లజ్జించి, శ్రీరామాజ్ఞఁ గొని మహేంద్రపర్వతంబుపై నుండ నొకసంవత్సరకాలమున కాతనిపితరు లాతనిని సందర్శించి, 'శ్రీరాముని గర్వోద్రేకంబున నెదుర్కొనరాదనియు, నాతండు శ్రీమన్నారాయణుఁ డనియు, దుష్టసంహారార్థము లోకమున మనుష్యరూపమునుందాల్చిన పరమపురుషుఁ డనియు, నాతని నెదిరించుటచే నిస్తేజస్కుండ వైతి వనియుఁ జెప్పి వధూసర యనునదీతీరంబున దీప్తోదం బనుతీర్థమున సుస్నాతుండ వగుము. నీప్రపితామహుండైన,భృగుమహర్షి యందు తపంబు బహు

కాలం బొనర్చి మహిమాన్వితుం డయ్యె. నీవును నీతొల్లింటి తేజమును బొందెద' వని చెప్పిరి. వారిచే బోధితుండై పరశురాముం డీతీర్థమున స్నానము సేసి స్వతేజస్సును గ్రమ్మఱ నధిగమించెను. అని చెప్పఁగా ధర్మరాజు విని యగస్త్యచరితంబును సవిస్తరంబుగ రోమశునిఁ జెప్పుమని వేఁడుటయు నమ్మునిచంద్రుం డా రాజచంద్రున కి ట్లని వచించెను.

## అగస్త్యచరిత్రము

ధర్మజా! పూర్వకాలమునందుఁ గృతయుగధర్మము ప్రవర్తిల్లు చుండ నెల్లప్పుడును యుద్ధమునం దాసక్తులును, నతిదారుణకార్య ముల నొనర్చువారును, మదోద్రిక్తులును నగు కాలకేయులను రాక్షసులు వృత్రుని నాశ్రయించి యనేకాయుధములతో దేవతల కపాయంబు సేయుచున్నంత వారిబాధలకు సుర లోర్వ లేక యింద్రునిఁ బురస్క రించుకొని బ్రహ్మపాలి కేఁగి యామహనీయునితో నిది విన్నవించు కొనఁగా నజుఁడు 'వేల్పులారా! సరస్వతీతీరంబునఁ దపోనిష్ఠుండై యుండు దధీచి యనుమునినాథుకడ కేఁగి యాతని మీరు వేఁడ నాతఁడు తన యెముకలను మీ కొసంగును. వానిచే వివిధాయుధంబులు గావించికొని, యాతనివెన్నెముకచే వజ్రాయుధమును నిర్మించికొనుఁడు. ఆవజ్రముచే నింద్రుండు వృత్రునిఁ జంపు. అంతఁ గాలకేయు లనద లై మిమ్ము బాధింప' రనఁగా సురలు బ్రహ్మయాజ్ఞను శిరసావహించి నారాయణుని మున్నిడుకొని మహాఘోరమృగసంచారంబును, సామగానమువంటి తుమ్మె దలఝుంకారనినాదమును, ననేకలతావృక్షములును, గలిగి, భయమును, మహిమను, రామణీయకమును గొల్పుదధీచియాశ్రమంబునకుం బోయి యందు సూర్యునితేజస్సుతో సమాన మయినతపఃకాంతిచేఁ బ్రకాశించు చున్నయమ్మునివర్యుం జూచి బ్రహ్మదేవువచనంబుల నతనికిఁ జెప్పి ప్రార్థిం చిరి. వారివేఁడికోలును దధీచి యందుకొని, 'దేవతలకు హితకార్య మాచరించుటకంటె దేహి కన్యంబు మే లెద్ది? అవశ్యంబు వారికి నాశరీ రము నిత్తు' నని నిశ్చయించి యోగమహిమచే నసువులఁ దొఱంగెను. అంత సురలు సంతుష్టస్వాంతులై యామునియస్థులను గ్రహించి దేవ శిల్పి యగువిశ్వకర్మ కొసఁగఁగా నాశిల్పి వజ్రము మున్నగునాయుధ ములు పెక్కింటిని నమ్మునియస్థులతోఁ గావించి వజ్రాయుధమును దేవేం

ద్రున కొసంగెను. ఇంద్రుండును వజ్రపాణియై దేవతలు తోడునడువఁ గాలకేయులం దాఁక వారికిఁ బోరు ఘోర మయ్యె. ఇంద్రుండు వృత్రాసురునితోఁ బెనఁకువకుఁ గడంగఁ గొంత కాలమునకు వృత్రుండు బలాధికుఁడు గను, నింద్రుండు క్షీణబలుఁడును గాఁగా, విష్ణుమూర్తి వారి తారతమ్యముల నారసి తన తేజస్సు నింద్రునియం దావహింపఁజేసి యింద్రునకుఁ దేజోవృద్ధిఁ గావించుటయు నప్పుడింద్రుండు మహర్షులకు సంభ్రమ మొనఁగూర్చుచు వృత్రునితోఁ బోరుచుండ వృత్రుం డాకస్మికముగ నొక్క సింహనాదంబుఁ జేసె. ఆభయంకరారావంబునకు భూమి దిర్దిరం దిరిగె. దెసలు బీఁటలువాఱె. ఆకసంబు చలించె. అంత నింద్రుండు భీతిల్లి వజ్రాయుధమును వృత్రునిపై విసరె. అది వృత్రుం దాఁకినంతనె వాఁడు ఱెక్కలు దెగిన యచలంబుమాడ్కిఁ గ్రింది కొఱఁగె. వాఁడు నిహతుండైన వృత్తాంతము దెలియక యాసంకులమునం దింద్రుండు కాందిశీకుఁడై యొకకొలను సొచ్చె. కొంతవడికి వృత్రుండు హతుఁ డయ్యె నని తెలిసి యింద్రుండు హ్రదంబు వెలువడి వచ్చి, సురలం బురికొల్పి కాలకేయులఁ జెండాడుటయు, వారు యథాయథలై నాథు మ్రింగినవృకావలి చుట్టుముట్టిన లేళ్లు వోలె విభ్రాంతులై వెఱచఱచి పరువులెత్తి సంద్రంబుఁ జొచ్చిరి. అంతటితో వారు వోక విద్యాతపోరాజితు లగు విప్రులయాశ్రమంబులను రాత్రికాలములందుఁ బ్రవేశించి విప్రులవినాశంబు గాంచువారై, "వీరు సచ్చిరేని జగంబు నశించు. మన మితరులకుఁ జొఱరానిసముద్రమును జొచ్చి యున్నారము." అని వితర్కించి బ్రాహ్మణుల వధింప నిశ్చయించిరి. ఆవిప్రప్రళయమునందు వసిష్ఠాశ్రమంబున నూటతొంబదియేడ్వురును, చ్యవనాశ్రమంబున నూర్వురును, భరద్వాజాశ్రమంబున నిరువదుగురును, నిట్లనేకాశ్రమంబులయందు విప్రులు హతు లగుడు, హతబ్రాహ్మణ మాంసపర్వతములును, నెత్తురుటేఱులును, వ్రేవుల ప్రోవులును, విఱిగి పెంకులైన కమండలువులును, బగులఁగొట్టఁబడిన కొయ్యగరిటెలును, (స్రుక్స్రువములును) చిందఱవందఱలైన యగ్నిహోత్రములును, త్రెంపఁబడినయజ్ఞోపవీతంబులును గా నొనర్చి పలువురు బ్రాహ్మణులను బ్రహ్మణ్యమూర్తులను భక్షించి యఖిలమునిగణాశ్రమం

బుల. కుపద్రవము సేయుచున్నంత నందఱును బ్రాణముల రక్షించు కొనునిమిత్తము పాఱిరి. శూరులు కొంద ఱాయుధపాణులై కాలకేయు లను వధించునిమిత్తము యత్నించిరి. కాని, వారు సముద్రముఁ జొఱజాలక యసురులకుఁ బ్రత్యపకృతి గావింపఁజాలరైరి.

{ దేవతలు భూలోకమునందలి విప్రులవధను విష్ణునితోఁజెప్పి కాలకేయులనిర్మూలనోపాయంబు వేడుట. }

అంత విప్రనాశంబున భూలోకమునందు వేదము లనధీతము లయ్యెను. యజ్ఞము లనాచరితములయ్యె. సత్క్రియలు లోపించె. ఈకారణముచే లోకములకు వినాశ మాసన్నమయ్యె. ఇందులకు దేవతలు వెఱచి యింద్రుఁ బురస్కరించికొని యాదిమూర్తియగు శ్రీమన్నారాయణునితో మొఱలిడుటకు వైకుంఠంబున కరిగి యాపరాత్పరునకు నమస్కరించి, "దేవా! నీవు జగంబులసృష్టిస్థితిలయములకు హేతుభూతుండవు. సకలచరాచరభూతజాలంబుల కాధారంబవు. జగంబు లన్నియు నీయందు సుప్రతిష్ఠంబులు. భూమి జలంబులలో మునుఁగఁగా నీవు వరాహరూపముతో దానినుద్ధరించితిగావే. కనకకశిపు నుద్ధృతి యణంచుటకు నరసింహావతారం బెత్తియుంటివి బలి నణఁచుటకై వామనుఁడ వైతివి. జంభుఁ డనువాఁడు యజ్ఞవినాశం బొనర్పఁగా వాని వధించి యజ్ఞసంరక్షణఁ గావించితివి. అండజములు, జరాయుజములు, స్వేదజములు, నుద్భిజ్జము లనంబరఁగిన చతుర్విధజంతుజాలంబుల రక్షించుచున్న లోకారాధ్యుండవు నీవు కావున నిప్పుడు లోకమునకైనయుపద్రవమును నీకు విన్నవింపవచ్చితిమి. మామనవి చిత్తగింపుము. కాలకేయు లను రాక్షసులు పగ లెల్ల సముద్రమునందు డాగియుండి రాత్రికాలములయందు వెలువడి మునీశ్వరాశ్రమములఁ జొచ్చి తపోధనులును, జితేంద్రియులును, దపస్స్వాధ్యాయపరులును, యాగదీక్షితులును నగు విప్రవర్యుల వధించి నిర్మూలముగావించుచున్నారు. విప్రులు నశించిన విశ్వంబు నశించు, విశ్వంబు నశింపఁగా స్వర్గమును క్షయించు. విప్రక్షయంబు సర్వక్షయమునకు హేతుభూతం బయ్యె. సర్వంబు నశించుచో నకాలప్రళయము సిద్ధమయ్యె. మమ్మును సకల లోకములను నుద్ధరింపను, రక్షింపను నీవ కాదే? జగన్నాథా! కరు

ణింపుము. రాక్షసులవలని బాధ నపనయింపుము. విప్రకులోద్ధారణము గావింపుము. యజ్ఞచక్రమంతయు వారే కదా ప్రవర్తింపం జేయుచుండువారు! వారియజ్ఞాచరణంబునం గాదే సర్వభూతములును మేమును సంతృప్తుల మగుచున్నాము. మాసంతుష్టిచేం గదా భూలోకంబున మేలు కలుగు ఇట్లన్యోన్యోపకారములచే జగచ్చక్రము వర్తిల్లు చున్నది. కావునం బ్రస్తుత మీరాక్షసులవలన భయం బుడిపి యందఱం గావనే పరమకారుణికా!" యనంగా వారిని గరుణించి యాదిదేవుం డిట్లనియె. ఇంద్రునివజ్రాయుధముచే వృత్రుండు నిహతుండు కాంగాం గాలకేయులు వెఱచఱచి సముద్రముం జొచ్చిరి. అటం గొంతకాలముండి పిదప భయ మేది యిప్పుడు లోకాహితం బొనర్చుచున్నవారు. వారు సముద్రము దుర్గముగాం గలవారై యుండునంతవఱకును వారు మీకజయ్యులు. వేఱొకయుపాయ మూహించెద. అట్లు కావించి భయంబుం దక్కి సుఖం బుండుండు. అది యెయ్యది యంటిరేని, సావధానులరై వినుండు. సముద్రమును వారాశ్రయించియుండువఱకు వారలను మీరు వధింపలేరు. సముద్రమును శోషింపఁజేసిన, వారు నిరాశ్రయులై మీచేం జిక్కుదురు. అప్పు డుపాయంబున వారిని మీరు వధింపంగలరు. సముద్రజలమును మిత్రావరుణతనూజుం డగు నగస్త్యుండు వీర్యవంతుండై త్రావనోపు. కావున మీర లందఱు పోయి యమ్మహాత్ముం బ్రార్థింపుండు. సముద్రజలంబుల నామహనీయుకరుణచే శోషింపంజేసి యాదుష్టరాక్షసుల వధించి విప్రుల నుద్ధరించి వారు గావించుయాగముల మీరు తనియుండని యాజ్ఞాపింప నాదేవత లగస్త్యాశ్రమంబునకుం జని యనేకఋషిగణసేవితుండును, లోపాముద్రచే నుపచరింపంబడువాడును నగు నమ్మైత్రావరుణిమునీంద్రుం గాంచి యిట్లని నుతించిరి.

దేవతలు సముద్రజలంబులం ద్రావుట కగస్త్యుం బ్రార్థించుట

లచేఁ గలిగిన విప్రులనాశంబు నపనయింప నీవే శక్తుండవు. విప్రవినాశంబున దేవత లగుమాకు వృద్ధి లేదు. మమ్ముఁ గరుణింపుము. భయాతురులమైన మాకభయ మిమ్ము. నిన్ను శరణము వేడెదము. అని స్తుతించి రని ధర్మజునితో రోమశుం డనఁగా ధర్మజుఁడు వింధ్యం బేకారణంబునఁ బ్రవర్ధమానమై సూర్యగమనము నడ్డగించె. అగస్త్యుం డద్దాని వృద్ధి నెట్లడంచె నని యడుగఁగా రోమశుం డిట్లనియె.

అగస్త్యుండు వింధ్యంబు వృద్ధికాకుండ వారించుట

పూర్వ మొకకాలమునందు వింధ్యపర్వతము సూర్యుం జూచి 'నీ వేల నిత్యంబు మేరువుచుట్టును బ్రదక్షిణంబు సేసెదు ? పర్వతరాజ మనగు నాచుట్టును బ్రదక్షిణంబు సేయ వేల ?' యనఁగా సూర్యుఁడు నే నాత్మేచ్ఛచే మేరువు చుట్టిపోవుట లేదు. ఇది నాకు విధిచోదిత మార్గము. ఇట్లొనర్చుటంజేసి లోకప్రచారం బగును. అని చెప్పఁగా వింధ్యం బందులకుఁ గినిసి యిట్లగు నేని నేను గ్రహములమార్గమున కడ్డుగాఁ బెరుఁగుదు నని చెప్పి పెరుగసాగెను. దానంజేసి సూర్యచంద్రాదులగతు లడ్డగింపఁ బడినవి. లోక మంధకారబంధురం బయ్యె. కర్మలు చెడినవి. అంత నమరు లగస్త్యుపాలికిం జని ఋషివర్యా ! నీశిష్యుండగు వింధ్యునిచేఁతలు గంటివే! వానిని నిజోద్యోగంబునుండి వారింప నీవ శక్తుండవు. తక్కటివా రెవరును నేరరు. కరుణించి దాని పెంపు నణంచి లోకహితం బాచరింపుము. అనఁగా నక్కుంభసంభవుండు లోపాముద్రాసహితుండై వింధ్యుని సమీపించి 'పర్వతరాజా! నే నొకకార్యముం దలంచి దక్షిణదేశయాత్ర వెడలుచున్నాను. తెరువు వదలు' మనఁగా వింధ్యం డతివినయమున స్వశిరంబు భూమిఁ దాఁక వంపఁగా మైత్రావరుణుం డందులకు సంతసిల్లి క్రమ్మఱ నది లేచునో యని శంకించి నావచ్చునంత కిట్లె యుండుము. ఆవలఁ బెరుఁగుదు వని వచించి దక్షిణదేశంబునకుఁ బోయె. ఇప్పటికి నగస్త్యుండు దక్షిణదేశమును వదలి రాఁడు. ఇట్లగుటంజేసి వింధ్యుండు నాఁటినుండి పెరుఁగ కున్నవాఁడు. సూర్యచంద్రాదులగతులు విధ్యుక్తముగా మేరువుం జుట్టి నానాఁటికినిఁ బ్రవర్తిల్లుచున్నవి.

## అగస్త్యుండు సముద్రజలమును బానంబొనర్చుట

అది యట్లుండ నిమ్ము. ఇంక నగస్త్యసముద్రోదకపానముఁ జెప్పెద వినుము. ఆతీరున దేవత లక్కుంభసంభవు నుతింప నాముని యాకర్ణించి నిర్జరులారా! మీరాకకుఁ గతం బేమి? నాచే మీ కొనర్పంవగిన కార్య మెద్ది? యానతిండు. అనఁగా దేవతలు కాలకేయులను రాక్షసులు సముద్రమును దమకు దుర్గముగాఁ జేసికొని పగళ్లు వెలుపటికి రాక రాత్రించరులై విప్రులను వినాశంబుగావించుచున్నవారు. భూసురుల క్షేమంబుపైఁ గాదే మీయభివృద్ధి యాధారపడియున్నది. కావున వారు పగటిపూట బయల్పడుటకు నీవు సముద్రోదకమును బానంబు గావింపవలయు ననఁగా నగస్త్యుండు దేవహితార్థం బెట్టికార్యమునైనఁ జేసెద నని వారి కభయం బొసంగెను. అపుడు దేవతలు సముద్రోదకంబులు నీచేఁ ద్రాగఁబడఁగా దివ్యశస్త్రాస్త్రములచే నాభయంకర రాక్షసులను మేము వధింతు మనిరి. అంత నగస్త్యుం డమరవరుల కానంద ముప్పొంగ వారిఁ దోడ్కొని యలలచే నాట్యమాడుదానివలెను, వాయువుచే నభినయించుదానివలెను, నురుగుతెట్టెలచే నవ్వుదానివలెను, గుహాలందుఁ దొట్రిలు తిమితిమింగిలాదిమహామీనములచేతను, నాగమకరములచేతను క్షోభించుచు, దద్బాధ కోర్వనిదానివలెను, నుండునదియు, నుచ్చైస్స్వనంబున మహాభయంకరధ్వానము నుప్పతిలఁజేసి నభోవీథిని ఘోషింపుచున్నదియు నగు సముద్రమునొద్దకు మహర్షులతోను, గరుడ గంధర్వ ఖచర సిద్ధ పన్నగ యక్షగణములతోను నరుగుదెంచి యందఱు చూచుచుండఁగ దేవతల కానందము వొడము నట్లుగ నగస్త్యుం డమ్మహాబ్ధిజలంబులఁ ద్రావెను. అట్లమ్మహానీయుం డబ్ధిజలంబుల నొక్కగ్రుక్కగాఁ ద్రావుటయు నింద్రాదిదేవత లాతనిమహిమంబున కచ్చెరువడి నీవుమాకు రక్షకుండవు, లోకపావనుఁడవు, నీకారుణ్యంబున లోకోపద్రవంబు తప్పె నని పెక్కువిధంబుల నుతించిరి. గంధర్వులు పాడిరి. అప్సరస లాడిరి. విద్యాధరులు పుష్పవర్షములను గురియించిరి. అవ్విధమున నగస్త్యుచే సముద్రోదకంబులు పీతంబు కాఁగా నుదధి శుష్కంబయి యుండ నందు డాఁగియున్నకాలకేయు లాశ్రయరహితులై బయల్పడిరి. ఇంద్రాదిదేవతలు వారిని శస్త్రాస్త్రములచే నొంచిరి.

అనేకుల వధించిరి. హతశేషులు పూచినమోదుగులవలె క్షతాంగులై దిక్కు గానక భీతిల్లి భూగర్భము భేదించి పాతాళంబున డాగిరి. ఇట్లు కాలకేయులను నిర్వీర్యులఁ గావించి దేవత లక్కుంభసంభవునితో 'మునీంద్రా! నీకరుణం జేసి శత్రువులను గెలిచితిమి. యజ్ఞకార్యములు నిర్విఘ్నముగా విప్రులు గావింపఁ గలరు. వారిహవిర్భాగంబులచే మేము వర్ధిల్లెదము. మ మ్మానందింపఁ జేసితివి. నీమహిమ మపారంబు. నిన్ను నుతింప నశక్తులము. ఐన నింకొక విన్నపంబు గలదు ఆలకింపుము. సముద్రజలము నాధారముగాఁ గొన్ని యనేకజీవరాసులు బ్రతికియుండు. అయ్యది శోషింపఁగా నీజీవములు నిల్చుట కాధారము లేదు. కావున నీచేఁ బీతమైనసముద్రోదకము మరల విసర్జింపఁబడుఁగాక యనఁగా నమ్ము నీంద్రుండు, 'నిర్జరులారా! ఆయుదకం బింతదనుక నాగర్భమునం దుం డునే? అయ్యది నాశరీరమున నపుడె జీర్ణమయ్యెను. మరల సము ద్రము నుదకముచేఁ బూరింపవలయు నన్న మీరొండొకయత్నమును జేయవలయు' ననఁగా నమ్మునిప్రభావమునకు విస్మితులై దేవత లాతని నెలవుం గొని తమలో నీసముద్రము మరల నెట్లు జలపూరితమగు నొక్కో యనుచు విచారించుచు శ్రీమన్నారాయణుండు ముందు నడువ బ్రహ్మపాలికిం బోయి నమస్కరించి 'యబ్జభవా! యగస్త్యపీతంబై సముద్రము శుష్కించె. మఱల నది జలపూరిత మగుట కుపాయంబుఁ జెప్పవే' యన బ్రహ్మ వారిం గరుణాకటాక్షమునఁజూచి కొంతకాలము నకు దాయాదుల నూర్ధ్వలోకగతులఁ జేయునిమిత్తము భగీరథుఁ డను రాజు సముద్రమును జలపూరితంబుగావించు. మీరు యథేచ్ఛం జనుఁ డనఁగాఁ బనివిని బృందారకులు కాలమును నిరీక్షించుచు వచ్చినదారిఁ జని రనిన నాలకించి ధర్మజుండు జ్ఞాతినిమిత్తమున భగీరథుం డెట్లు సము ద్రమును మఱల జలపూరితంబు గావించె నని రోమశమహర్షి నడుగఁగా నామునిశ్రేష్ఠుం డారాజశ్రేష్ఠున కిట్లనియె.

## భగీరథుండు సముద్రమును జలపూరితం బొనర్చుట

పూర్వ మొక్కకాలమున నిక్ష్వాకువంశమునందు సగరుఁ డను వాఁడు పుట్టి యతిశూరుండై హైహయులను, తాలజంఘులను జయించి మహావిభవంబున వంశక్రమాగతంబైన రాజ్యమును బాలించుచుండెను.

వాఁడు శూరుం డనియు, నైష్ఠికుం డనియుఁ, బ్రజారంజకుం డనియుఁ గీర్తిఁ జెంది పాలించుచుండినను, వైదర్భి, శైబ్య యనునిరువురు భార్యలు గలవాఁడైనను, సంతానము లేక వగచుచుఁ గైలాసమునకుఁ జని యం దీశ్వరుని బహుకాలము వేయినామములతో నర్చింప నాలోకపూజ్యుండు వశాద్వయమధ్యగతంబయిన గజేంద్రునింబోలెఁ దన్నారాధించు నాభక్తునకు దర్శన మొసంగెను. అంత నా సగరుం డాస్వామిని 'నోపినాకపాణీ! శశిశేఖరా! సాంబశివా! మహాదేవా! శంకరా!' యని యనేకనామములతో సంబోధించి నుతింప భక్తార్తిభంజనుండు 'సగరా! నీవు సంతానార్థివై తపం బొనర్చితివి. నీయిరువురిభార్యలలో నొక్కదాని యం దఱువదివేవురు పుత్త్రులు బలాఢ్యులును నతిశూరులు నైనవారు జనించి నీవు చూచుచుండఁగనే యచిరంబున నశింతురు. రెండవ దానికి వంశకరుఁ డగు పుత్త్రుఁడు వొడము. నీతపంబునకు మెచ్చితి. తపంబు చాలించి పురంబున కేఁగుము. అని చెప్పి భగవంతుఁ డదృశ్యుం డయ్యె. అంత సగరుండు కొడుకులం బొందియుఁ బొందనివానికైవడి నసంతుష్టుండై పురంబుఁ జేరె. పదంపడి మహాదేవువరమున వానిభార్యలు చూలుఁ దాల్చిరి. అంత వైదర్భి కొకసొరకాయ పుట్టె. శైబ్య కొకపుత్త్రుఁడు జనించె. వైదర్భి గర్భమున జనించిన యాతుంబీఫలమును సగరుఁడు పరిహరింపఁ దలంపఁగా నొక్క యశరీరిణి వాని కిట్లనియె. 'నృపాలా! ఈఫలమును బాఱవైవకుము. ఫలమును వ్రచ్చి యందలి బీజములను నేతిపాత్రమున నుంచి కాపాడుము. అవి యొక్కొక్కటి నీ కొక్కొక పుత్త్రుఁడుగ నగు' ననెను. ఆమాటలయాథార్థ్య మరయ సగరుఁ డట్లు చేసి యొక్కొకఘృతపాత్రము నొక్కొక్కదానివశము గావించి దానిని రక్షింపు మనెను. అంతఁ బెద్దకాలమునకుఁ బినాకివరమున నఱువదివేవురు కొడుకులు జనించిరి. వారు క్రమమున వర్ధిల్లి పెద్దవారై మత్తిల్లి దేవగంధర్వాదులను సైతము సరకుసేయక యాపదలపాల్సేయుచుండఁగా వారు వీరిహింసలను సహింపనోపక కమలాసనుపాలికిం జని వారి దుర్మార్గప్రవర్తనమును దెలుపఁగా బితామహుండు 'సగరు కొడుకులు వేగమ యొక్కకారణమునఁ జత్తురు. మీరు మీస్థలములకుఁ బొం'డనఁగా సురలు పితామహునాజ్ఞఁ గొని తమ యునికిపట్లకుఁ దరలిరి.

## సగరపుత్త్రులు కపిలమహర్షి కోపాగ్నిచే దగ్ధు లగుట

పిదపఁ గొంతకాలమునకు సగరుఁ డశ్వమేధయాగదీక్షితుండై యశ్వంబును దేశములపై వదలఁగా నయ్యది కావలివాండ్రగు సగరుపుత్త్రులరక్షణమునం దుండియు నుదకరహితంబైన సముద్రమునం దెచ్చోటనో డాఁగెను. సగరుపుత్త్రు లఱువదివేవురును దానిని వెదకి వేసారి యెందుం గానక వచ్చి దానికానమిని యాగదీక్షితుఁ డగు తమతండ్రి యగు సగరునితోఁ జెప్పిరి. సగరుఁ డెవ్విధముననైన దానిని వెదకి తెండని యాజ్ఞాపింపఁగా వా రందఱును సముద్రమునం దున్న ద్వీపముల లోను, బర్వతగుహలలోను నెమకి గుఱ్ఱమును గానక మరలఁ దండ్రి పాలికిఁ బోయి తాము భూలోకమంతయు నెంత వెదకినను దాని పోక తెలియరా దని పల్కిరి. అంత సగరుఁడు విధిప్రేరణమునఁ గ్రోధ వ్యాకులుఁడై కొడుకుల బిలిచి "మఱలఁ బోయి గుఱ్ఱమును వెదకి తెండు. గుఱ్ఱము తేకుండ మీరు రావలదు" అని యాజ్ఞాపింప వారును దండ్రియాజ్ఞను వల్లె యని భూమండలమంతయుఁ గ్రుమ్మఱి నెమకి కానక యాపుత్త్రు లఱువదివేవురును నిర్జలంబైన సముద్రమును ద్రవ్వ నారంభించి యందుండుజంతువులు తలలు, డొక్కలు, పిక్కలు, చెక్కలు, చెదఱి మడియుచుండ దయావిహీనులై పారలతోఁ ద్రవ్వి యాసముద్రపు టీశాన్యభాగంబునఁ బాతాళంబు సొచ్చి యందు నారాయణావతారపురుషుం డగు కపిలాచార్యునియాశ్రమముపొంతఁ దిరుగుచుండు తమయాగాశ్వముం గాంచి సంతసించి తపంబువెంపున మహిమాన్వితుఁడై పావకుంబోలెఁ బ్రకాశించువాని నారాయణాంశ సంభూతుఁడైనవానిం గపిలాచార్యుం గని కాలచోదితులై యుక్తా యుక్తతల నెఱుంగక యామహర్షిపై నశ్వతస్కరత్వ మారోపించి యితండె యీగుఱ్ఱము నపహరించి యిం దుంచుకొనియున్నాఁడు. కపటవేషమున నిమీలితనయనుండై చూపఱకుఁ దపస్వివోలె నేమి యెఱుంగనట్లున్నాఁ డని పాపమాన మాటలాడుచుఁ గపిలు నపహసించిరి. కపిలుఁడు తనతపోభంగమును గావింప యత్నించుచున్న వారి నందఱి రూక్షవీక్షణముల భస్మీభూతులం జేసెను. సగరపుత్త్రులందఱు

నొక్కపెట్ట కపిలునినేత్రాగ్నిచే దగ్ధు లగుట నారదునివలన సగరుఁడు వినికొంతతడవు శోకవ్యాకులుఁడై యీశ్వరాజ్ఞ యట్టిది, అది యేల నెఱవేఱకుండు నని మరల మనస్సును ఱాయి సేసికొని మనుమఁ డగునంశుమంతుం బిలిచి "కుఱ్ఱా! నాకొడుకుఁ బుత్త్రుల నఱువదివేవురను గార్యార్థమై పంపిన, వారు తమయవజ్ఞతచే మడిసిరి. నీతండ్రి యసమంజసుఁడు ప్రజల బాధింపఁ దొడంగఁగా వానిదుండగముల నోర్వలేక వానిని దేశము వెడల నడచితి. కొడుకు లనేకు లుండియు నాకుఁ గొడుకులే లేక పోయిరి విధికృత మట్టి" దని చెప్ప ననిన విని ధర్మరాజు సగరుఁడేల కొడుకు నసమంజసుని విడిచిపుచ్చె? కొడుకులను దేశము విడిచి పొమ్మనువారు లోకమునం గలరే? యని యడుగ రోమశుం డిట్లనియె.

సగరునకు శైబ్యయం దసమంజసుఁడను కొడుకు జనించి దుష్టుండై పౌరబాలకులం దెచ్చి యకారణంబుగ వధించి వారిశవంబులను మహానదిలోఁ బడవైచుచున్నంతఁ బౌరులు భయవిషాదములతో సగరుం జేరి యసమంజుదౌష్ట్యమును విన్నవింప సగరుండు పౌరజనాక్రోశంబు విననేరక కొడుకునందలి ప్రేమాతిశయంబున వాని శిక్షింప నేరక కొంత కాలంబు జాగుచేయఁ గొడుకుతుందుడుకుఁదనంబు మితిమీఱుటచే సగరుండు మంత్రుల రావించి వారితో నాలోచించి ధర్మంబు పరికించి పౌరబాలుర వధించునట్టి దుశ్శీలు నసమంజుఁ దనకుఁ బ్రియంబుగాఁ బురంబు వెలువరించునది యనియాజ్ఞాపింప వా రట్లు చేసిరి. ఇది సగరుకొడుకసమంజునిఁ బురమునుండి వెడల నడుచుటకుఁ గారణంబు. అది యట్లుండ నిమ్ము.

సగరుం డంశుమంతుఁడను తన మనుమనితో నాయనా! కొడుకులవియోగమున కంత శోకింప. పౌరబాలుర నిష్కారణంబుగ వధించి యేటఁ ద్రోయుచుండిన యసమంజునిఁ బురము వెలువరించి యుండుటకును జింతింప. నాయజ్ఞకార్య మసంపూర్ణ మగుట నేమి చేటు వాటిల్లఁగలదో యింక ననుభీతి నామదికిం దత్తఱపా టొనర్చుచున్నయది. నీ వెట్లైన నేగి నాయజ్ఞాశ్వంబు మరలించుకొని రమ్మనఁగా నంశుమంతుండు వల్లె యని కతిపయపరిజనసమేతుం డై పాతాళంబున కరిగి యశ్వంబుఁ గనుఁగొని పురాణఋషి యగు కపి

లున్నకు సాష్టాంగదండమ్ము లర్పించి వినమ్రుండై యుండఁ, గపిలుం డా కుఱ్ఱనివినయమునకు సంతసిల్లి, 'వరముల నొసంగెదం గోరికొనుము.' అనఁగా నంశుమంతుండు యజ్ఞసంపూర్తికొఱకు నాయశ్వమును, మహర్షికోపానలంబున భస్మరాసులైన తండ్రులకుఁ బావనత్వంబును గోరఁగాఁ గపిలుండు వాని కిట్లనియె. పుణ్యరాశీ! నీకోరినవరముల నిత్తు. నీవు శాంతాత్ముండవు. సత్యశీలుఁడవు. నీమూలమున సగరుఁడు ధన్యుఁ డయ్యె. నీమహిమచే నీతండ్రులు పుణ్యలోకంబులఁ గాంతురు. నీపౌత్రుఁడు వియద్గంగను బ్రార్థించి భూలోకమునందు గంగాపతనమును ధరించుటకు మహాదేవు నొప్పించి మీయయ్యలఁ దరింప మందాకినిని భూలోకంబునకుఁ దెచ్చువాఁడు. గుఱ్ఱమును గొనిపొమ్ము. మీతాత సంకల్పించియుండుజన్నమును బూర్తిగావింపు మనఁగా నంశుమంతుండు కపిలునాజ్ఞ నశ్వమును గ్రహించి పురంబు సేరి తాతయడుగులకు మ్రొక్కి యావృత్తాంత మంతయును సగరునకు విన్నవింప నతండు మనుమని కార్యసాధనంబుకు మెచ్చి పుత్త్రశోకం బుడిగి సురలు మెచ్చునట్లుగా యజ్ఞసమాప్తి నొనర్చి సముద్రుం దనకుఁ బుత్త్రుఁగా భావించె. అది మొదలు పారావారము సాగరంబు నాఁ బరఁగె. ఇట్లు సాంతముగ నశ్వమేధం బాచరించి సగరుండు పదంపడి బహుకాలము రాజ్య మేలి మనుమం డగునంశుమంతునందు రాజ్యభారంబు నిలిపి పెద్దలు వోవు లోకంబున కేఁగెను. అంశుమంతుండును ననేకసంవత్సరములు జనరంజకంబుగా రాజ్య మేలి తనపుత్త్రుం డగు దిలీపునకు రాజ్యసమర్పణము గావించి దివంగతుఁడు కాఁగా దిలీపుఁడు తనతాతలగతికి దుఃఖించి గంగను భూమికిఁ దేఁ దలంచి విశ్వప్రయత్నములం జేసియుఁ దేఁ జాలక పుత్త్రుం డగుభగీరథునియందు రాజ్యపాలనము సుప్రతిష్ఠితముఁ జేసి తపోవనంబునఁ దపమాచరించుచుఁ గొంతకాలంబునకు శరీరత్యాగము చేసి స్వర్గలోకమున కేఁగెను.

## భగీరథుఁడు భూమికి గంగను దెచ్చుట

అంత భగీరథుండు తనతండ్రి తాతలమనోరథంబు తన్నావహించుచుండుఁ గపిలాచార్యకోపాగ్నిచే భస్మరాసులైన పెద్దల కూర్ధ్వలోకం

బులు కలిగించునిమిత్తముంజేసి మనంబు రాజ్యపాలనమునందు స్థిరంబు గాకుండుటయు, మంత్రులయందు రాజ్యభారము నుంచి హిమవత్ప్రాంతములకుఁ దపం బాచరింపఁబోయెను. ఆహిమవంతంబు నానాధాతువులచేఁ జిత్రవిచిత్రశిఖరములతోనుగూడి సింహవ్యాఘ్రాదిక్రూరమృగములకు నెలవయి భయంకరములగు గుహలతోను గుహాంతరములతోను, నడిబెడంగు గలహంసకారండవము లుల్లాసముతో విహరించుటకు వీలైన తామరకొలఁకులు నేరులు మొదలగువానితోను, చిలుకలు గోరువంకలు కోకిలలు తుమ్మెదలు మున్నగువానిమనోహరారావములతోను, కిన్నరులు దేవవేశ్యలు మున్నగు విలాసవతుల కాటపట్టగు విశాలశిలాతలములతోను గూడియొక్కచోట బంగారువన్నెయు, మఱియొకచోట రజతవర్ణమును, వేఱొక్కచోట నంజనాద్రిచ్ఛాయయుం గలిగి యీశ్వరసృష్టివైచిత్ర్యమున కచ్చెరువు గొల్పుచు, దానిమహిమనుం దొల కాడించుచు, మహేశ్వరధ్యానంబున కుచితంబై యొప్పారుచుండెను. అట్టిప్రదేశమున భగీరథుఁడు గంగాదేవింగూర్చి తపం బాచరింప నుద్యమించి కొంతకాలము పర్ణభక్షుఁడును, గొంతకాలము వాయుభక్షణుఁడును, వేఱొకకొంతకాలము ఫలభక్షణుఁడును, మఱికొంతకాలము నిరాహారుండును నై దివ్యవర్షసహస్రము తపంబు సలుపఁగా నప్పావని వానిఘోరతపస్సునకు మెచ్చి ప్రత్యక్షమై 'రాజా! నీకోరిక యెద్ది? యానతి' మ్మన, భగీరథుఁడు త్రిలోకపావనికి సాష్టాంగముగ మ్రొక్కి యెదుట నిలిచి యిట్లనియె. జగజ్జననీ! నాముత్తాతలు సగరుని పుత్త్రులు సగరుయజ్ఞార్థమై వదలిన యశ్వమువెంటఁ జని దానిం గొంత వడికిఁ గానక యన్వేషించుచుఁ బోయినవారు పాతాళంబున నాయశ్వంబు కపిలునాశ్రమంబున సంచరించుచుండుటను గని యామహనీయునిపై నశ్వచోరత్వ మారోపించి యాతనితపోభంగము గావింప, నమ్మహర్షి యల్గి నిజరూక్షవీక్షణంబులఁ జూచుడు, వారందఱు భస్మరాసులైరి. ఇదివఱకు వారికి సద్గతిఁ గానను. నీపవిత్రజలముల వారిభస్మరాసులం దడుపుదువేని వారి కక్షయపుణ్యలోకములు గలుగు. ఇయ్యది నాకోరిక. కృపాళురాలవై నాయభీష్టంబు నెఱవేర్ప భూతలంబునకు విచ్చేయు మనఁగా నప్పావని సంతసిల్లి నీయిష్టార్థసిద్ధిఁ గావించెద. నేను

స్వర్గము నుండి భూమికి నవతరించునపుడు నా వేగమును భరింప నాజ
టాజూటధరుఁడు మహేశ్వరుండు దక్క నింకొకరు వలంతులు గారు,
కావున నన్ను భరించునిమిత్తము మహేశ్వరు మెప్పింపుము. తపంబు
చేసి యామహనీయుని వేఁడుము. నీకుఁ గార్యసిద్ధి యయ్యెడు మని గంగ
యదృశ్యయయ్యె. అంత గంగావచనంబున భగీరథుండు కైలాసంబున
కరిగి యంతకాంతకుఁ డగు భగవంతు నీలకంఠుంగూర్చి ఘోరతపంబుఁ
జేసెను. పినాకపాణి యాతనితపస్సునకు మెచ్చి యతనికిఁ బ్రత్యక్షుండై
"భగీరథా! నీవు ప్రార్థించినచొప్పున నుత్తమాంగమున గంగ దాల్చెద"
నని చెప్పి పార్షదగణంబుతో హిమవంతమును జేరి "ఇఁక గంగను
బ్రార్థింపు" మనఁగా భగీరథుం డేకాగ్రచిత్తుండై మరలఁ ద్రిలోకపావని
గంగను బ్రార్థించె. వెంటనే యాసురనది భగీరథునితోఁ దా నుడివినట్లు
స్వీయదీర్ఘోన్నతతరంగంబులు నక్షత్రమండలంబుఁ దాఁకు చుండ,
సురమునిసిద్ధఖేచరవరు లచ్చెరువడి చూడఁగ, స్వర్గలోకమునం
దుండి యతివేగమునఁ బింగంబైన మహానటునిజటాజూటంబు
సొచ్చి ముత్తెపుదండయో యనునట్లు పినాకిఫాలదేశమునఁ ద్రిపథ
గయై యాకసంబునందుండి పడునప్పుడు జనించిన నురుగు లామహా
దేవిముసిముసినగవుల ననుకరింపఁ గొండొకచో నాయభ్రగంగా
కుటిలప్రచారము స్త్రీసహజలజ్జావిలాసముఁ దోపింపఁ దోయపాతవే
గంబున జనించిన నిస్వాన మాదేవిమృదుమధురాలాపంబులం బోలి
యుండ జవరాలు వోలె మహానటజటాజూటంబునం దుండి యవనీ
తలంబునకు డిగి వచ్చి భగీరథుం జూచి "యోనృపాలవరా! నీకు
మెచ్చు పుట్టింప నిట కేతెంచితి. నే నెటు పోవలయునో నాకు దారి
సూపు" మనఁగా భగీరథుండు మున్ను నడుచుచుండ గంగాస్రవంతి
వానివెంట సకలభూములఁ బవిత్రంబులఁ జేయుచు సాగరములోని
సాగరులభస్మరాసులం దడిపెను. అంత నాయఱువదివేవురును దమ
మునిమనుమనియెడ తెగనిపట్టుదలచేఁ బుణ్యలోకములం జేరిరి. భవానీ
పతియు భగీరథుప్రార్థనను నెఱవేర్చి మరలఁ గైలాసంబున కేఁగె.
అ ట్లగస్త్యపరిపీతమైన సరిత్పతిని గూడి ముత్త్రోవలముత్తెదువు
తనయుదకంబులచే సగరజులకు హితముగా నిండియుండెను. ఈతీరున

సాగరులకు సద్గతి కలిగెను. సాగరము మఱల సలిలసంపూర్ణ మయ్యెను.
భూగతయైనభాగీరథి భగీరథునికీర్తిని భువనమున నాచంద్రార్కస్థాయిగా
నిలిపెను. భగీరథుండు సంతసంబు తోఁ గాడ మందాకినిం దనకూఁ
తుగాఁ జేసికొనియె. దానిజలంబులచే మృతపితరుల కుదకదానంబు
చేసె. యభీష్టసిద్ధిఁ బొందెను. నాఁటంగోలె మందాకిని భాగీరథి యన్
పేర్కొనఁబడి యాతనినామంబున భూలోకమునందు విఖ్యాతయై
వెలయుచున్నయది. అని యిట్లు గంగావతరణంబును, భగీరథు
మాహాత్మ్యంబును రోమశుండు ధర్మరాజునకుఁ జెప్పినవిని యచ్చోటినుండి
పాండవు లరిగి నంద, అపరనంద యనునదులలోఁ దీర్థమాడి హేమ
కూటపర్వతముం జేరిరి. అచ్చోట నెల్లప్పుడును ఱాలు పడుచుండును,
మారుతంబు వీచుచుండును. అనిశము మేఘము వర్షించుచుండును. చదు
వువారు గాన రాకయున్నను వేదాధ్యయనఘోషము వినవచ్చుచుండును.
సాయంకాలమునందును, ప్రాతఃకాలమునందును నగ్ని తనంతట నాహే
మకూటంబునఁ బ్రజ్వరిల్లుచుండును. పోతుటీఁగలు మానవులను గఱచి
బాధించును. ఈయద్భుతంబులం గని ధర్మరాజు రోమశుం జూచి యేమి
కారణంబున నిం దిది యిట్లుండు నని యడుగఁగా రోమశుం
డిట్లనియె.

### రోమశుండు ధర్మరాజునకు ఋషభుఁ డను ఋషిచరిత్రంబు సెప్పుట

హేమకూటపర్వతమునందు ఋషభకూట మను నాశ్రమం
బొండు గలదు. తొల్లి యచ్చోట నూఱులకొలఁదియేండ్లు బ్రదికిన
వాఁడును, నతికోపియు నగు ఋషభుం డనుమహర్షి తపంబు సేయు
చుండె. ఆతఁడు తపం బొనర్చునపు డితరు లెవ్వరైనను దనయొద్ద
కేతెంచి తన్ను మాటలాడించి తపంబునకు విఘ్నము గావింపకుండుట
కీపర్వతముతో నిట్లనియె. 'ఓపర్వతరాజమా! ఈయాశ్రమమున నెవ
రైననుమాటలాడిరేని నీవు వారిపై నీఱాల ఱువ్వుము." అని నియ
మించె. పదంపడి వాయువుం బిలిచి శబ్దము చేయకుండు మనియు,
మేఘములతో నందు మాటలాడినవారిమాటలు తనకు వినరా
కుండ ననిశము వర్షించుచుండు మనియు నియమించెను. మఱియు

న్లొల్లి దేవత లిచ్చోట నందానదీతీర్థముల నాడి దానితీరంబుల బహు యాగము లొనర్చి, దీని నతిదుర్గముగ నొనర్చిరి. ఆకారణమున నిచ్చోట జాలుపడుట సదా సంభవించుచుండు. ఇచ్చోట దూర్వాలు దర్భలుగాను, నీప్రదేశ మంతయు యజ్ఞవేదిగాను, నిందలి వృక్షములు యూపాకారములుగాను నుండుట యిందు దేవతలు తొల్లి యనేకయజ్ఞము లొనర్చినవా రనుటకు గుర్తులు. దేవతలును మహర్షులును నిప్పటికిని నిందుఁ జరించుచుందురు. ప్రతిదినము సాయం ప్రాతఃకాలములయందుఁ గానఁబడు నగ్నిజ్వాలలకాంతులు వారియగ్ని హోత్రక్రియలే యని యెఱుంగుము. తపోనిష్ఠులు కానివారు దీనిని జూచుటకైనను శక్తిమంతులు గారు. ఈపర్వతరాజము నెక్కుట వారికి సాధ్యపడ దని వేఱుగాఁ జెప్ప నవసరము లేదుగదా? నీవును నిచ్చోట మౌనమును ధరించి సంచరింపుము. అనఁగా ధర్మనందనుండును రోమశుమాటలచొప్పున వాఙ్నియమముతో నందానదియం దవగాహనముచేసి శుచియైయుండ నాతనికి రోమశుం డిట్లనియె. రాజా! ఇది కౌశికీనది. దీనితీరంబున విశ్వామిత్రునాశ్రమంబు గలదు. పదంపడి కాశ్యపుఁడగు విభాండకునియాశ్రమం బున్నది. విభాండకునికుమారుఁడు ఋశ్యశృంగుఁడు మహనీయచరిత్రుండు. విభాండకున కీతండు మృగియందుఁ బుట్టినవాఁడు. తొల్లి రోమపాదుం డనురాజు తనదేశంబున ననావృష్టి సంభవింపఁగా ఋశ్యశృంగునిఁ దనరాజ్యమునకుఁ దోడ్కొనిపోయెను. అంతట దేశ మెల్లెడలను వాన కురిసి దుర్భిక్షము తొలఁగి సుభిక్షమయ్యెను. ఇట్లు ఋశ్యశృంగుండు వాన కురియించి ప్రజల రక్షించె. ఋశ్యశృంగునిమహిమ కారాజు సంతసించి యాతనికిఁ దనకూఁతు శాంత యనుదాని నతి శాంత నిచ్చి వివాహము గావించె. అనఁగా ధర్మరాజు రోమశుం జూచి యిట్లనియె. "మునీంద్రా! విభాండకుండు మానవజాతిలోనివాఁడు. ఈతండు విజాతియగు మృగియం దపత్యం బెట్లు వడసె? ఆ కుమారుఁడగు ఋశ్యశృగుం డింద్రునకు భీతి వొడమున క్లిష్టవ్రతమగుతప మాచరించె? పుట్టిననాటంగోలె మృగములతో వసించుచు మృగప్రాయుండైన యా ఋషికుమారునివలన రాజసుతయగు శాంత కెట్లు సుఖము

చేసూతె? వీని నెల్ల వినఁగోరుచున్నాను. వివరింపవే" యనఁగా రోమశుం డిట్లని ధర్మరాజుతోఁ జెప్పెను.

### రోమశుండు ధర్మజునకు ఋష్యశృంగుచరిత్రంబు సెప్పుట

ధర్మసుతా! ఆలకింపుము. పూర్వకాలమునఁ గశ్యపుఁ డను ఋషీశ్వరునకు విభాండకుం డనుమునివర్యుండు పుట్టి బ్రహ్మచర్యమును బూని యచ్చోట నియతవ్రత మాచరించుచుండెను. ఇట్లుండఁగా నొక్కనాఁ డాఋషిసత్తముండు నదీజలంబుల సూర్యున కర్ఘ్యంబొసంగఁ బోయి యపుడు దేవవేశ్యయగు నూర్వశిం బొడఁగాంచి దానిసౌందర్యాతిశయముం దలపోసె. అంత నమ్మునికి రేతంబు స్ఖలితమైన నయ్యది యేటినీటఁ బడియె. అది ప్రవాహమిశ్రమై పోవుచుండఁ జెంత దప్పి దీర్చుకొనుచుండిన యొకపెంటిలేడి రేతోమిశ్రజలమును ద్రావెను. ఆమృగీగర్భమున మునివర్యునియమోఘవీర్యంబు చొచ్చుటయు నది చూలు ధరించె. ఈమృగియును బూర్వ మొకదేవకన్యక. అయ్యది యొండుకారణంబున బ్రహ్మచే శపింపఁబడి మృగాకృతిం దాల్చియుండె. దీనికిఁ బ్రసవాంతము శాపవిమోచనముగ బ్రహ్మ యనుగ్రహించె. కావున దానిగర్భమున శిరస్సున నొక్కకొమ్ముతో ఋశ్యశృంగుండు జనించి విభాండకునియాశ్రమంబున మృగంబులతోఁ బ్రవర్ధమానుండై మనుష్యులనే యెఱుఁగక తండ్రితోఁ గూడి కఠినమైన బ్రహ్మచర్యవ్రత మాచరించుచు ఘోరతపస్సుఁ గావించె. ఈతనిచరిత్రం బిట్లుండ నాకాలమున రోమపాదుం డను రా జొకం డంగదేశమును బాలించుచుండె. ఈతఁ డయోధ్యాధిపతి దశరథుని చెలికాఁడు. ఈతఁడు తనపురోహితుని వంచించుటంజేసి విప్రు లీరాజుం జేరరైరి. ఆకారణంబున నీతని రాజ్యమునందు యజ్ఞములు ప్రవర్తిల్లవయ్యె. యజ్ఞాచరణంబునంగాని దేవతలు సంతసింపరు. దేవతలు సంతసిల్లినఁగాని కాలవర్షములు గురియవు. వర్షములు గురియనంతట దేశమున దుర్భిక్ష మయ్యెను. ప్రజల కాహారంబు లేనికారణమున హాహాకారంబు లెసఁగె. అంత రోమపాదుండు మంత్రుల రావించి తనదేశము దుర్భిక్షముపా లగుటకు వగచి వాన గురియునుపాయంబు చెప్పుఁ డని వేఁడెను. అప్పుడు మంత్రులలో

నొక్కండు ధైర్యముతో రాజున కిట్లనియె. నీవు నిష్కారణంబుగ నీపురోహితున కపకృతిం జేసితివి. అంత నా బ్రాహ్మణాపరాధం బొనఁగూడె. కావున విప్రు లందఱును నీయెడఁ గినిసి దేశత్యాగంబుఁ జేసిరి. వారియజ్ఞాచరణంబులం గాదే దేవతలు సంతసించి పర్జన్యమూలమున వర్షంబుఁ గురిపింప నీదేశము సుభిక్షయుత మైయుండె. కావున నీవు విప్రాపరాధమునకుఁ బ్రాయశ్చిత్తము గావించుకొని పిదప విభాండకసుతుండును దదాశ్రమవాసియు,మహనీయుండు నగుఋశ్యశృంగునిటకు దేరఁ బంపుము. ఆమహాత్ముండు నీరాజ్యమునఁ గాలిడిన వెంటనే పర్జన్యుండు వర్షించును. ఆతఁ డుండుచోట నెలకు మూఁడువానలు గురియున ట్లింద్రుం డాతనికి వర మొసంగెను. కాన నీరాజ్యము చల్లనై సస్యములు పండి ప్రజల కామోదం బాపాదించును. ఋశ్యశృంగుండు బ్రహ్మచర్యవ్రతనియమనిష్ఠుండు. జితేంద్రియుండు. వానిరాకచే నీదేశమునందు నుండు దుర్భిక్షము తొలఁగు ననఁగా రోమపాదుండు బ్రాహ్మణాపరాధముఁ దానొర్చినందులకుఁ బశ్చాత్తప్తుండై ప్రాయశ్చిత్తము గావించుకొని నిజపురంబుఁ బ్రవేశింపఁగా విప్రులు ప్రసన్నులయిరి. అంగదేశపుఁబ్రజ లెల్ల సంతసించిరి; రాజు తెలివిం గొనియాడిరి. అంతట రోమపాదుండు మంత్రులను జేర్చి ఋశ్యశృంగు నంగదేశమునకు రప్పించు నుపాయ మడుగ వారమ్మహనీయుఁడు స్త్రీలఁ జూచి యెఱుంగఁడు. మఱియును రూపవతు లగు వేశ్యల నలంకరింపించి మునివేషధారులం గావించి వారిచే వీణాదివాద్యములఁ గర్ణపేయములుగ వాయింపించుచు వారిని విభాండకునాశ్రమసమీపమునఁ జరించున ట్లాజ్ఞాపింపు మనిరి. అంత రాజు వేశ్యలఁ బిలిచి మీ రెవ్విధనంబుననైన ఋశ్యశృంగుని లోఁచి యాతని మనరాజ్యమునకుఁ దేరవలయు ననఁగా నావేశ్య లనాగరకుఁడును, మృగప్రాయుఁడును నగు నమ్ముని తమకృత్యములచే నానందింపక తమ్ము శపించునేమో యని యొకవంక భీతిల్లి రాజాజ్ఞ నుల్లంఘించిన రాజు దండించు నని వేఱొకవంక దిగులు నొంది యుండ వారిలో నొకవృద్ధవారవనిత రాజున కిట్లనియె.—"నా యేలికా! భవదాజ్ఞానువర్తినినై చరించెద. నాకోరినవాని నొనర్చుట కనుజ్ఞ నిమ్ము. అట్లు గావించితి వేని నే నా మునికుమారుం దే నేర్తు"

ననఁగా రోమపాదుండు దానియుపాయంబునకు సంతసిల్లి కోరినధనము నొసఁగి దానిం గారవించి పంపె. ఆవేశ్య రాజొసంగినధనమున నొకనావను నిర్మింపించి, దానిని నదీప్రవేశంబుఁ జేయించి యందుఁ జతురశృంగారవతు లగు కొందఱు వేశ్యాంగనలతో సుందరాకృతి యగు తనకూఁతు నుంచి వీణాదివాద్యంబులను, మృదుమధురభక్ష్యవిశేషంబులను నుంచి, నావను విభాండకాశ్రమసమీపమునఁ బాఱుచుండు నేటిదరియందు నిలిపియుంచి, విభాండకుండు ఫలాహరణార్థము వనమున కేఁగుతఱిఁ బొంచియుండి యప్పుడ యాశ్రమంబునకు వారకాంతలతోఁ దనకూఁతుం బంపెను.అదియు, ఋశ్యశృంగుం గాంచికుశలవార్తల వాని మదిఁ దేలించి యిట్లనియె. "ఋషివరా! ఈయరణ్యమునందు మీకు వలసినఫలమూలాదులు సమృద్ధములే? అవి మీకు రుచ్యములే? తపస్సు నిరాతంకముగ సాగుచుండునే? వేదపాఠంబు నిర్విఘ్నమే? పూజ్యుఁ డగు నీతండ్రి విభాండకుండు నీయెడ సుప్రీతుఁడే? నినుం జూచి పోవచ్చినారము" అని లలితవచనముల నాతపోధనుని హెచ్చరించె.

ప్రపంచవాసననే యెఱుంగని ఋశ్యశృంగుం డావేశ్యాంగనను మునికుమారుంగా భావించి దాని సౌకుమార్యమునకు రమణీయంబైన తేజఃపుంజమున కానందించి దానియాశ్రమము పేరు నడిగి యర్ఘ్యపాద్యాదులను, వన్యఫలములను, మృగచర్మావృతంబైన దర్భాసనమును నొసంగఁబోవ నామాయలాడి యాయమాయికుం డగు ఋషిసత్తమునితో నిట్లనియె. విభాండకసుతా! మాయాశ్రమం బిచ్చోటికి మూఁడుయోజనములదూరమున నక్కొండ కావల నున్నది. నే నితరులొనర్చువందనములను, నర్ఘ్యపాద్యములను ఫలములను గ్రహింపనని నియతవ్రతమున నున్నదాన. కాని, నే మాత్ర మొరుల నాలింగనములను వందనములను జేయుదును. ఇయ్యది నావ్రతం బన ఋశ్యశృంగుండు వ్రతోల్లంఘనంబు గావింపరాదు. కాని, మాయాశ్రమమున నుండు జీడిపండ్లు, నెల్లిపండ్లు మున్నగువాని నొసంగెద. ఆరగింపుమన నావేశ్యాంగన వాని నటుండనిచ్చి తాఁదెచ్చిన భక్ష్యములను వాని కొసంగిన వాఁడు వానిని ఫలము లని మెసవి వానిమాధుర్యమున

కచ్చెరువోయి, యంతలోఁ జెండాట లాడుచుండు నారూపాజీవచే నాకృష్యమాణమానసుండై యావినోదంబు సూచుచుండ, నయ్యది యాంటనెపంబున మాటిమాటికి ఋష్యశృంగునాలింగనంబు నేసికొనుచు, విలాసమునఁ జెంత నున్న చెట్లసుమంబులను గోయుచు, సుకుమారమైన తనయంగవిన్యాసమున లజ్జను గాన్పించుచు, నొకొ్కకపరి యాతని మోమునందుఁ దనమోము నేర్చి మోవి నదుముచుఁ, దారుణ్యమును విజృంభింపఁ జేయుచు, వానికి మదనవికారంబు గలిగించి, సాయం సమయపుటగ్నికార్య మాచరింపవలయు ననుసాకున నతని వీడ్కొని వనంబునకుఁ జనియె. అంత ఋశ్యశృంగుండు దానివిలాసములం దగిలి వీడిపోయినదానివలను జూచుచు, నిట్టూర్పు నిగుడ్చుచు, నుస్సు రనుచు దీనవదనుం డై చేయునది లేక దానివర్తనంబుల ధ్యానించుచుండె. అంతఁ గొంతవడికి ఫలాహారణార్థమై యరిగినవిభాండకుం డాశ్రమ మున కేతెంచి చిత్తవిభ్రమమున వికారముం జెందియున్న పుత్త్రుని వీక్షించి యగ్నికార్యంబు నేసితివే? ఇంధనముల సమకూర్చితివే? సుక్స్రివంబులఁ గడిగితివే? దూడను వదలి హోమధేనువుపాలు పితి కితివే? నీచందంబు సూడ వేఱువిధమున నున్నది. ఇచ్చటి కెవ్వరేని వచ్చియుండిరే యని యడుగఁ గొడుకు తండ్రి కి ట్లనియె. ఫలాహార ణార్థముగ నీవు వనమున కరుగఁగా మనయాశ్రమమున కొక బ్రహ్మ చారి సుందరాకారుఁడు, చిత్రవిచిత్రమైన చీరఁ దాల్చివచ్చియుండె. వానిమేనిచాయ బంగారరఁటిచెట్టు గర్భగౌరవర్ణము ననుకరించియున్నది. వానికన్నులు తామరఱేకులవలె విశాలములై యున్నవి. వాఁడు దాల్చి యున్నజడ లతినీలంబులు. వానిమోము తగులంబు గొల్పుచున్నయది. వానికంఠధ్వని కోకిలరుతమువంటిది. వానినడుముప్రదేశం బతిసూక్ష్మము. పిఱుఁదులు ఘనంబులు. వానిమోమున ముంగురులు రెండుపాయ లుగఁ దీయఁబడి శృంగారము నీనుచున్నవి. కంఠమునకుఁ గ్రిందివైపు ఱొమ్మునందుఁ జర్మావృతములై రోమరహితములైన రెండు మాంసపిండ ము లతిమనోహరములై యొప్పాఱుచున్నవి. నడుమునందు బంగార ముతో వెడల్పుగఁజేయఁబడిన కటిబంధ మొకటి వెలయుచున్నది. నడ చునప్పుడు హంసవోలె ధ్వనించుభూషణద్వయంబు గన్పడెడును. వాఁ

దూపిరివిడుచుచో పరిమళవాయువు వెలువడును. ధరించినవస్త్రములు వింతలై యున్నవి. వాఁడు చేత నొకఫలముఁ ధరించియున్నాఁడు. ఆఫలముసు వాఁడు క్రిందం బడవైచును. అది మరల వానిహస్తగతం బౌను. దానిని వాఁ డందుకొనునప్పు డతిమనోహరంబుగ నొడలిని వంచును. అప్పు డాశరీరము చల్లగావీచు గాడ్పునకు వంగు వృక్షంబుఁ బోలియుండును. నన్నుఁ బలుమాఱులు గౌఁగిలించెను. వాఁడు హస్తవిన్యాసంబున నాచుబుకంబు స్పర్శించెను. నాజడలఁ బట్టికొని నావదనముసు దనవదనముకోఁ జేర్చి లలితధ్వనిఁ జేసె. ఆవానిచేఁతలచే నే నానందించితి; వాఁడు నామదియందుఁ జిక్కియున్నాఁడు. వానిం బలుమాఱు చూడఁ గోరుచున్నాను. నే నిచ్చినయర్ఘ్యపాద్యములను గొన ననెను. ఇతరుల యొద్దనుండి యర్ఘ్యపాద్యాసులను, ఫలములను గొనకుండుట వానివ్రతమఁట. నాకు మాత్రము గొన్నిఫలములను వాఁడిచ్చెను. అంతటి తీపైన ఫలములు మనవనమునందుఁ గానరావు. వానిది పుణ్యాశ్రమము. ధూతకల్మషము, మహాతేజము గలది. వాఁ డతిమధురమైన పానీయంబు నా కొసంగె. దానిమాధుర్యము నే నేమందును ? అంతటి మధురపానీయము లిన్నినాళ్లీవనమధ్యమున నా కెందును గానరావు. పరిమళములనిను నీమాల్యములను నీవస్త్రములను వాఁడు నా కిచ్చి సాయంసమయ మగుడు నన్నిఁ బ్రణయించుట కరిగె. వానినడకను వీక్షింప నాకు వికారము గలుగుచున్నది. అట్టిబ్రహ్మచర్యవ్రతంబు లోకమునందుండునే. వానియాశ్రమవృక్షములలోని ఫలములవంటి ఫలములు మనయాశ్రమమునం దేవృక్షమునందును గానరావు. నాయనుంగుఁదండ్రీ ! నేను వానితోడ నుండఁగోరుదు. వానిం జూడకున్న నామనస్తాపంబు శాంతింప దనిన విభాండకుం డంతయు సావధానుండై విని పుత్త్రున కిట్లనియె. నాయనా ! కామరూపులయిన రాక్షసులు ఋషుల తపోవిఘ్నములు గావించునిమిత్త మనేకమాయలు పన్నుదురు. చిత్తచాంచల్యముంగలుగఁ జేయురూపములఁ దాల్తురు. దానివలన మనము తపోభగ్నులమై యధోగతులపాలగుదుము. ఉత్తమలోకంబుల నపేక్షించువా రీమాయలకు లోఁబడరు. పరిమళగంధమాల్యాదిధారణములను మునులు విడనాడుదురు. అవి సత్పురుషులు గ్రహింపరు. అని

చెప్పి కొడుకుమనం బెటు వోవునో యని మూఁడహోరాత్రములు ధ్యానిం గట్టికాచియుండెను. పదంపడి నాలవనాఁడు ఫలాహారణార్థము వనమునకు విభాండకుండు చనెను.

### వేశ్యకాంత ఋశ్యశృంగు రోమపాదునొద్దకుఁ దోడ్తెచ్చుట

అంత నానాగవాసము వానియాశ్రమమున కేతెంచి యొంటి నున్న ఋశ్యశృంగుం గాంచి విలాసములచే నయ్యమాయికుని వంచించి తమయోడయందలి కృత్రిమవనమునకు మెల్లన తోడ్తెచ్చి వానితో వంచనగా మాటాడుచునే నావను నడిపించి రోమపాదునిరాజధాని చంపాపురిం జేర్చిరి. విలాసినులసహాలాపములు, సహాసనములు, సహయానములు బంధనములు గావా? అంత యాయంగాధిపతి యాఋషివర్యునిఁ దనయంతఃపురంబునఁ బ్రవేశపెట్టి సకలోపచారములుసేసె. ఆమునియంగరాజ్యముఁ బ్రవేశింపఁగనే దేశమునఁ బ్రబలవర్షము కురిసి సుభిక్షము పొడసూపె. ఆమునిమహిమమునకు రోమపాదుండు మెచ్చి తన పెంపుడుఁగూఁతు శాంత నాతని కిచ్చి సుముహూర్తమున వివాహము గావించె. అంత రోమపాదుండు వంచించి ఋశ్యశృంగునిఁ దనపురమునకుఁ దీసికొనివచ్చుట విభాండకుం డెఱింగి తన కేమి శాప మిచ్చునో యని వెఱచి వానికోపము నపనయించునిమిత్తము చంపాపురమునుండి విభాండకుని యాశ్రమమువఱకనేకగోష్ఠంబులఁ గట్టించి యందు గోవుల నించి గోపాలకులచే వ్యవసాయవ్యాప్తిఁ జేయించెను. అప్పు డాగోపాలకులతో రోమపాదుం డిట్లనియె. ఎన్నఁడేని యొకమఱి విభాండకుం డను పేరివాఁడు కొడుకు ఋశ్యశృంగుని వెదకుచు వచ్చి తనపుత్త్రు నెందేని గంటిరా యని యడిగినచో మీ రమ్మహానీయునకుఁ గృతాంజలులై వినయము గదుర "ఋషివర్యా! యీగోవులు, గోష్ఠంబులు, వ్యవసాయము లన్నియు ఋశ్యశృంగునివి యనుఁ" డని నియమించె. అట విభాండకుండు ఫలాహారణార్థము వనంబునకుఁ బోయి యాశ్రమమునకు మరలి రాఁగా పుత్త్రుం డందుఁ గానమిని యోగదృష్టిం జూడఁగా, కొడుకు చంపాపురమునందు రోమపాదుగృహంబున నున్నాఁ డనియు, నాతఁడు వంచితుఁడై కొనిపోఁబడెననియుఁ దెలిసి కోపారుణితలోచనుండై

రోమపాదుని భస్మంబు గావింతునని తలపోసి చంపాపురమున కేఁగువాఁడు ముందట గోష్ఠంబులఁ బెక్కింటినిం గని యందలి గోపాలురం జూచి తుష్టపరీతుండై యాఘోషంబులఁ జొచ్చి యివి యెవ్వరి వని గోపాలుర నడుగ వారు రోమపాదునాజ్ఞచే నతనిభక్తిమెయి నర్పించి యన్నియు ఋశ్యశృంగమహాముని వని యనిరి. అంత విభాండకుండు శాంతుండై యారేయి యచ్చో నుండి మఱునాఁ డుదయమున జంపాపురముం జేరి రోమపాదుం డొనర్చినసపర్యల నందికొని కొడుకుం గోడలిం గాంచి ముదితస్వాంతుండై పుత్త్రునికిఁ బుత్త్రుండు గలుగునందాఁక నందయుండు మని యాజ్ఞాపించి చనియెను. ఋశ్యశృంగుండును దండ్రిమాటచొప్పునఁ బుత్త్రజనన మగునందాఁకఁ జంపాపురమునందు రోమపాదునకు మనః ప్రియంబుగా నుండి వెంటనే తండ్రియాశ్రమంబునకుఁబోఁగా శాంతయు నమ్మునివరు వెంబడి యరుంధతి వసిష్ఠుని వెంబడించినట్లు లోపాముద్ర యగస్త్యుని ననుసరించినచందంబున, దమయంతి నలు ననుగమించినమాడ్కి, శచి యింద్రు నంటియున్నట్లు నాలాయనియైన యింద్రసేన ముద్గలుని వెంట నున్నట్లు చని యాతని కుపచారములు గావించుచుండెను. ఆఋశ్యశృంగ మునియాశ్రమం బిది. ఈతీర్థరాజమున స్నాన మాచరించి యితరతీర్థములకుఁబోవుద మనఁగా ధర్మరాజట్ల కావించి, కౌశికీనదీతీరముం జేరి వరుసగ నందుండు తీర్థములయం దెల్లఁ గ్రుంకు లిడి యర్ధసహస్రనదులకు సంగమస్థాన మైన గంగాసాగరసంగమంబునఁ గృతావగాహుండై సముద్రతీరంబున నుండు కళింగదేశములం జొచ్చెను.

అంత రోమశుండు ధర్మనందనున కిట్లనియె. నృపాలా! ఇవి కళింగదేశములు. ఈదేశములలో వైతరణీనది ప్రవహించును. ఈ నదీతీరమునఁ దొల్లి ధర్ముండు, ఋషు లనేకులును యాగములను జలిపిరి. అందు మహాదేవుండు యాగపశువును దాఁగొనిపోయి యీయాగమునం దియ్యది నాభాగంబు, నేను దీనిని విడిచిపుచ్చ ననఁగా దేవత లందఱు రుద్రుని నుతించి, యన్నిటికంటె నుత్తమమైనభాగమును యాగములలో దేవత లెల్ల నిచ్చోట రుద్రునకుఁ గల్పించిరి. ఈరుద్రభాగచరిత్రమును జెప్పుచు నీనదీస్నానము గావించినవారు దేవయానగతు లగుదురు. అనఁగా ధర్మరాజు తమ్ములును, ద్రౌపదియుఁ, దానును నందుఁగృత

స్నాను లై దేవర్షి పితృతర్పణంబులం జేసెను. వెంటనే ధర్మజుండు వైతరణీస్నానమహిమమునుగూర్చి రోమశునితో నిట్లనియె. మునీంద్రా! ఇందుఁ గృతావగాహనుండ నగు చుండఁ గొన్ని యమానుషవిషయములు మనంబునకు గోచర మయ్యెడు. సర్వలోకములను నిప్పుడ చూడఁ గల్గితి. వైఖానసులవేదాధ్యయనఘోషములు వినఁబడెను. అనఁగా రోమశుం డిచ్చోటికి వైఖానసులనివాసంబు ముప్పదియోజనముల దూరమున నున్నది. సాధారణజనుల కావేదఘోష వినంబడునే? నీవు పుణ్యమూర్తివి. దివ్యుండవు. కాన దానిని నీవు వినఁగలిగితివి. అని చెప్పి ముం దరుగుచుండఁగా ననవరతఫలాలంకృతం బైనదాని నొక్క-వనంబుఁ గని యిందు స్వాయంభువుండైన విశ్వకర్మ తొల్లి యాగముం గావించి యం దధ్వర్యుం డగుకాశ్యపునకు దక్షిణభూభాగము నెల్లనశేషపర్వతములతోను వనములతోను నొప్పుదానిని యజ్ఞదక్షిణగా నొసంగి దక్షత్వముం జూపె. అందులకు భూదేవి కినిసి త న్నొకమనుష్యమాత్రున కిచ్చినందులకు రోసి, పాతాళవాసిని నయ్యెద ననఁగాఁ గశ్యపుం డాదేవిని మిగుల స్తుతించెను. అందులకు భూదేవత ప్రసన్నవదనయై నిజరూపముతో సముద్రమధ్యమునం దొకవేదికపై నిల్చుండినం దుషలనఁ గానఁబడెను. కాశ్యపునకు భూదేవి దర్శన మొసంగినవేదిక యియ్యది చూడుము. దాని నెక్కి-నవారు వీర్యవంతు లగుదురు. మానవులు దాఁకినచో నావేది నీట మునుంగు. సముద్రమును దలంచి దీనిం దాఁకరాదు. కావున నాయుపదేశించుమంత్రములఁ బఠించుచు నామంత్రప్రభావమున నీవేదికను శూరుండవై యెక్కు-ము. అని చెప్పిన ధర్మనందనుండు రోమశునాజ్ఞ చొప్పున నట్ల చేసి యధికతేజస్వియై వెలసెను. అంత నచ్చోటిం బాసి దేవసేవితంబును, వియచ్చరనివాసంబును, సుందరకందరమును నగు మహేంద్రపర్వతమునకుం బోయి యచ్చోట నుండు తపోధనులకు దండప్రణామంబు లాచరించి వారికి మనఃప్రియంబు గావించుచుండ రోమశుం డమ్మునులం జూపుచు వేర్వేర వీరు భార్గవులు, వీరు వాసిష్ఠులు, వీ రాంగిరసులు, వీరు కాశ్యపులని వివరింప వారిలోఁ బరశురామశిష్యుం డగు నకృతవర్ణుం జూచి ధర్మనందనుండు మునీంద్రా! ఇచ్చోటికిఁ బరశురామభగవత్పాదు

లెప్పు దేతెంతురు. మీకు వారిదర్శన మగుచో వారిని మాకుం జూపి పుణ్యముం గట్టుకొనుఁ డనఁగా నకృతవర్ణుండు ధర్మనందనున కిట్లనియె. నృపాగ్రణీ! భగవానుఁ డగు పరశురాముండు నీరాక నెఱింగియే యుండు. ఆతఁడు నీకుం గడుఁ గూర్చు. కావున వేగమే నీకు దర్శన మిచ్చు. తాపసుల కెల్లరకును నష్టమియందును జతుర్దశియందును దర్శన మిచ్చుట యాచారము. ఎల్లి చతుర్దశి. కావున నవశ్యంబు రేపు వారిదర్శనముం జేయ నగు. అనఁగా ధర్మజుండు మునిశ్రేష్ఠా! పరశురాముచరిత్రం బెల్ల వినఁ గుతూహలినై యుందు. ఆతనిచరిత్రమంతయు మీకుఁ బ్రత్యక్షంబ కదా? ఆమహానీయుం డేమికారణంబున నన్నిమారులు క్షత్రియవినాశంబు గావించె? విపులముగా నాతని సచ్చరిత్రముఁ జెప్పు మని వేఁడఁగా నకృతవర్ణుండు ధర్మరాజున కిట్లని వచించె.

### అకృతవర్ణుండు పరశురామమహిమను ధర్మనందనునకుఁ జెప్పుట

పూర్వకాలమునందు హైహయవంశమునందుఁ గార్తవీర్యుం డనురాజు పుట్టి యనేక సపర్యలచే దత్తాత్రేయుని మెప్పించెను. అంత నాదేవుం డాతనికి వేయిభుజములును, బంగారువిమానమును, సకలైశ్వర్యముల నిచ్చెను. అంత నాపరగర్వంబునఁ గార్తవీర్యుండు కామగమనమైనయావిమానము నెక్కి యెదురు లేక యాకసంబునఁ దిరుగాడుచు దేవతలకును, మునులకును, యక్షగంధర్వాదులకును, వీరికి వారికన నేల, సర్వభూతములకు నుపద్రవంబు గావించుచుండ వానివలన భయము నోర్వలేక దేవర్షులు వైకుంఠంబున విష్ణునిపాలికిఁ జని వాని దుండగముల విన్నవించి వానివధోపాయము నాలోచింపు మని ప్రార్థించిరి. అంత నారాయణుఁడు వారి కభయం బొసంగి తనయాశ్రమ మగు బదరీవనంబునకుఁ జనియె.

ఆకాలముననే యిటఁ గాన్యకుబ్జమును గాధి యనురాజేలుచుండెను. వాఁడనేకదినము లనపత్యుఁడై యుండి తీవ్రవ్రతముల దానును బత్నియుఁ జలుప వారి కత్యంతరూపాభిజాత్యవిమలగుణసమృద్ధిచే వెలుఁగుచు దేవాంగనంబోలుకన్య యొక్కర్తు జనించె. అధి

దినక్రమంబున శుక్లపక్షచంద్రునింబోలెఁ బ్రవర్ధమాన యగుచుండ నాగాధిరాజునొద్దకు భృగుమహర్షి కుమారుఁ డధికతపస్సంపన్నుండును, సంతతవేదాధ్యయనసముద్భూతతేజోవిరాజితుండును నగు ఋచీకుం డను బ్రహ్మర్షి కన్యార్థియై వచ్చి వానికూఁతుం గామించి యడుగుటయు గాధి తన యాత్మగతంబున నిట్లాలోచించె. ఈఋషి తనకోరిన యీ నాకన్యను నే నీకున్న నన్ను శపించిపోవును. నగరవాసంబున సుకుమారియై పెరిగిన నాకూఁతురు సత్యవతి వీనిపొందుఁ గోరదు కావున నసాధ్యంబైనశుల్కముం గోరి దానినెపంబున నీమునిబెడదఁ దప్పించుకొనియెద నని యమ్మునివరేణ్యుం జూచి 'మునీంద్రా! నాకన్యకను నీయట్టితపోధనున కిచ్చి ధన్యుండ నగుటకంటె వేఱు సుకృతమొక్కటి గలదే? అయిన మాకుఁ గులపరంపరాగతంబైనశపథం బొండు గలదు. దానిని విడువ నగునా?' యని సందేహించెద. మాకూఁతు వివాహమాడఁ దలఁచువారు నల్లనైనయొక్కకర్ణంబు ధవళదేహమునుంగల గుఱ్ఱములు వేయింటిని శుల్కముగా నొసంగవలయును. ఈయసాధ్యంపుఁ బనిని మునీంద్రుండవైన నీ వెట్లొనర్తువు? సంపన్నులగురాజుల కియ్యది సుసాధ్యము. అనఁగా ఋచీకుం డీశుల్కమును నేఁ దెచ్చి యిత్తు నని పోయి వరుణుని వేఁడి వానియనుగ్రహంబున నట్టి యశ్వంబుల వేయింటి నొడఁగూర్చి గాధియొద్ద కేతెంచి 'యయ్యా! ఇదిగో నీకోరిన యశ్వరాజంబు లని వానిని గాధికి నొప్పగించె. ఆయశ్వంబులు వేయియును వరుణలోకాగతములు గావున కాన్యకుబ్జమందలి యాగంగ నుండి వెడలి వచ్చుటంజేసి యాతీర్థమున కశ్వతీర్థ మని నామము గలిగె. అంత గాధి యశ్వముల గ్రహించి చేయునది లేక కూఁతు సత్యవతిని ఋచీకున కొక్కసుముహూర్తమున నిచ్చి వివాహము గావించి యల్లునిఁ గూఁతును సుఖమున నుండ నియోగించె. ఇట్లుండ భృగుమహర్షి కొడుకుం గోడలిని జూచువేడ్కఁ గాన్యకుబ్జపురంబునకు రాఁగా నా దంపతులు భృగుమహర్షికి మ్రొక్కి సేవించియుండిరి. అంత భృగుమహర్షి కోడలిం బిలిచి 'సత్యవతీ నీసచ్చరిత్రంబునకు మెచ్చితి. వరములఁ గోరుము, ఒసఁగెద' ననెను. మామ మహాత్త్వమునకుఁ దనయందలియనురాగమునకు సత్యవతి సంతసిల్లి తనకును దనతల్లికిని బుత్త్రుల వేఁడెను.

భృగుండును వల్లె యని 'మీ రిరువురును ఋతుస్నాతలై నపుడు నీవు మేడి చెట్టును, నీతల్లి యశ్వత్థమును గౌఁగిలించుకొనుఁడు. నే నీ రెండుకొయ్య పాత్రలయం దభిమంత్రించిన పరమాన్న మొసఁగెద. వీనిలో నీపాత్ర యందలి పరమాన్నమును నీవును, మఱొకదానియందలిదానిని నీతల్లియు భుజించునది మీ కిరువురకును వంశప్రదీపకు లగుపుత్త్రులు జనింతురు' అని చెప్పి తపోవనమున కేగెను. అంత నాతల్లియుం గూఁతురును ఋతుస్నాతలై భృగువు చెప్పినదానికి వ్యత్యస్తముగాఁ దల్లి మేడి చెట్టును గూఁతు రశ్వత్థమును గౌఁగిలించికొని తల్లికొసఁగినపాత్రములోని పరమాన్నమును గూఁతురును, గూఁతునకు నియమించినపాత్రములోని పరమాన్నమును దల్లియు భక్షించిరి. ఈవ్యత్యాసముచే ఋచీకునిసతి సత్యవతిగర్భమునం దతిక్షాత్త్రసహితుం డైనశిశువును, దానితల్లిగర్భంబున బ్రహ్మతేజస్సుతోఁ బ్రకాశించుశిశువును వర్ధిల్లుచుండిరి. ఈవ్యత్యాసమును భృగువు తనదివ్యదృష్టిచే నెఱింగి తనయాశ్రమమునుండి కాన్యకుబ్జపురమున కేతెంచి కోడలిం బిలిచి మీవిపరీతచర్యను నాదివ్యదృష్టిచే నెఱింగితి. తన్నిమిత్తమున నీకు క్షత్త్రియవృత్తిగలబ్రాహ్మణుఁడును, నీ తల్లికి బ్రాహ్మణాచారుండైన క్షత్త్రియుండు నుదయింతు రనఁగా సత్యవతి మామను పలుమాఱులు వేఁడి తనకు సాధువృత్తుఁ డగు బ్రాహ్మణుఁడే జనించు నట్లనుగ్రహింపు మన, భృగువు నావచనంబమోఘంబు. ఐనను నీకు బ్రాహ్మణాచారుండైనపుత్త్రుండు జనించినను, వాని కతిక్రూరకర్ముం డగుకుమారుండు జనింపక మానఁ డని చెప్పి తనయాశ్రమంబునకు వెళ్లెను. అంతఁ గొన్నాళ్లకు సత్యవతి నీళ్లాడి బ్రహ్మతేజస్సమన్వితుం డగు జమదగ్నిం గాంచెను. అతఁడును దినదినప్రవర్ధమానుండై సాంగవేదాధ్యయనము గావించి ప్రసేనజిత్తునురాజుకూఁతు రేణుక యనుదానిం బెండ్లాడి దానివలన రుమణ్వంత, సుషేణ, వసు, విశ్వావసు, రాము లను నేవురుపుత్త్రులం గాంచె. అంత నొక్కనాఁడు రేణుక స్నానార్థ మేటికిఁ బోయి యచ్చోట సతులతోడ జలక్రీడ లాడుచున్న శృంగారపురుషుని, మార్తికావతదేశరాజుఁ జిత్రరథునిఁ జూచి తదీయసౌందర్యమోహితయై, యతనిఁ గామించి, మానసవ్యభిచారదోషంబున నాకసంబునుండి నీటఁ బడి స్నాతయై యాశ్రమంబుఁ జేరె. అంత జమదగ్ని

ధైర్యంబు వీడి బ్రహ్మతేజంబుఁ దరిగి యున్నసతింగాంచి దానియకృత్యం బ్బెఱింగి బహుప్రకారంబులఁ దూలనాడి తుదకుఁ గోపోన్మాదపరవశుండై దాని వధించుట మే లని నిశ్చయించి యప్పు డాశ్రమంబున నున్న కొడుకులు నలువురం బిలిచి వారితల్లి దుశ్చరితమును వారికిఁ జెప్పి యట్టిపాప కారిణి జీవించి యుండుట దగ దని యామెను జంపుట కాజ్ఞనొసంగెను. వారు తల్లియందలి ప్రేమాతిశయంబునఁ దండ్రియాజ్ఞ చొప్పున నేమియుం జేయకుండిరి. జమదగ్ని వారితిరస్కారమునకుఁ గోపించి మీరివనమున నజ్ఞానులై మృగపక్షులవలెఁ జరింతురు గాక యని వారిని శపించెను. కొంతతడవునకు నాశ్రమమునకుఁ బరశురాముం డేతేర వానిం బిలిచి జమదగ్ని వానితల్లిదురాచారం బుగ్గడించి యట్టి దాని పొత్తు పనికిరా దని దాని వధింప నియోగించెను. వెంటనే రాముండు తల్లి యని శంకింపక దానితల నఱకుటయు, జమదగ్ని శాంతించి కుమారుచర్యకు సంతసపడి వానివలనఁ బ్రసన్నుండై 'పుత్త్రా! రామా! నామాట జవదాఁటక దెంపునేసి దుష్టయగు నీతల్లిని వధించితివి. నీయెడం గడుం బ్రీతుండ నైతి. నీ కిష్టమైన వరములఁ గోరికొమ్ము, ఒసంగెద; ననఁగాఁ బరశురాము డంతటఁ దల్లికిఁ బునర్జీవంబును, సోదరులకు జ్ఞానప్రాప్తియుఁ, దల్లికి వ్యభిచారపాపరాహిత్యంబును, దనకుఁ జిరంజీవిత్వమును, యుద్ధములయం దప్రతిహతశక్తిని గోరికొని తండ్రివలనఁ దన యభిమతంబులఁ బొంది యుండునంతఁ గొండొకకాలంబున జమదగ్ని కొడుకులను ఫలములను సమిత్తులను దేఱ నడవికిఁ బంపి తాను భార్యాసమేతుండై యొక్కఁడ యాశ్రమమున నుండఁగా హైహయుండైన కార్తవీర్యుం డయ్యాశ్రమమున కేతెంచెను. జమదగ్నియు వానికి నతిథిసత్కారంబుల నన్నిటి నొసంగెను. కాని, యామదాంధుం డందులకు మెచ్చక యాశ్రమవృక్షముల విఱిచి, మృగములఁ జెఱచి, యమ్మునివర్యుండు ఘోరాక్రందనంబు నేయుచుండ నాతనిహోమధేనువుం బట్టికొని పోయె. అంతఁ గొంతసేపటికిఁ బరశురాముండు ఫలముల గ్రహించి యాశ్రమంబు చొచ్చుడుఁ దండ్రివలనఁ గార్తవీర్యార్జునుదుండగముల విని క్రోధతామ్రాక్షుండై వానివెంబడిఁ జని తఱిమిపట్టికొని వానితోఁ ఘోరయుద్ధమును జలిపి వానివేయిచేతులను దనపరశువుతోఁ దఱిగి

వధించె. అంతఁ గార్తవీర్యకొడుకు లీసునం జేసి రాముం డాశ్రమంబున లేనిసమయంబున వానియాశ్రమంబు సొచ్చి తపోనిష్ఠుండును నతి శాంతుండును నగు జమదగ్నిం బట్టికొని యాముని 'హారామా!' యని యాక్రందనంబు సేయుచుండ మిడుకుమిడుకునఁ దలఁదరిగి చనిరి. అంతఁ గొంతవడికిఁ బరశురాముం డాశ్రమంబున కేతెంచి మృతపితృకళేబరమును గాంచి, తల్లివలన హైహయులదుశ్చరితంబును దండ్రిఘోరమరణంబును విని 'యయ్యో నాతండ్రీ! నాతప్పుం జేసి నీవు కార్తవీర్యార్జునునిపుత్త్రులచేఁ జంపఁబడితివి. నీవు సకలధర్మముల నెఱింగినవాఁడవు. సదాచారసంపన్నుండవు. తపోధనుండవు. శాపానుగ్రహనిగ్రహసమర్థుఁడవు. సర్వభూతసముఁడవు. నిన్ను నిష్కారణంబుగఁ జంపినయాదుష్టులకాలమృతి నొంది ఘోరనరకంబునఁ బడుదురు గాక. దొంగలై, నే లేకున్నతఱి నాయాశ్రమంబున లజ్జ లేక చొచ్చి కడు వృద్ధుండై, తపస్వియై యున్నమాయయ్యను జంపి తమయూర నేమి ప్రల్లదంబు లాడుచు నున్నారో యని విలపించి తండ్రికిఁ బ్రేతసంస్కారములఁ గావించి లోకములయం దుండు క్షత్త్రియుల నెల్లర వధింతు నని ప్రతిజ్ఞ పట్టెను. అంత రాముండు పరశుపాణియై యిరువదియొక్కమాఱు భూమి నెల్ల నెమకి కంటికిఁ గాన్పించిన రాచపురుషు నేఱి క్షత్త్రియవినాశంబు గావించెను. తాఁ జంపినక్షత్త్రియులరక్తప్రవాహము నేడుమడువులుగాఁ జేసి పితృతర్పణంబుఁ జేయఁగా వానిపితరు లగు ఋచీకాదులు నిజస్వరూపంబులఁ బరశురామునకు దర్శన మొసంగఁగాఁ, బరశురాముండు వారిం బొడఁగాంచి రెండువరముల వేఁడెను. అందొక్కటి పావనత్వంబును, రెండవది తా నొనర్చిన క్షత్త్రియవధవలనిపాపరాహిత్యమును నైయున్నవి. వారలు వానియభీష్టసిద్ధి నొసఁగి యదృశ్యులైరి.

పిదప జామదగ్న్యుఁడు వేదోక్తవిధానమున ననేకయాగములఁ గావించి యాజకుల కెల్ల భూమండలము నంతను, నధ్వర్యుం డగు కశ్యపునకుఁ బదిబారలనిడివి తొమ్మిదిబారలవెడల్పును గల బంగారు యజ్ఞవేది నొకదాని నొసంగెను. అంత ఋత్విజు లందఱును భాగములుగా దానినిఁ బంచికొనిరి. ఈతీరునఁ బరశురాముండు భూమిని క్షత్త్రియరహితము గావించి, దాని నంతయు బ్రాహ్మణార్థంబు సేసి యాము

హేంద్రపర్వతంబున నున్నవాఁడు ఇది యామహనీయుచరిత్రం బనఁగా
ధర్మరా జమ్మునికృత్యంబులకు వెఱపును, నాశ్చర్యమును జెంది వానిమహి
మమును మెచ్చుచు నారాత్రి యంద యుండి మఱునాఁడు సన్నిహితుం
డైన జామదగ్న్యునిఁ దమ్ములుం దానును ద్రౌపదియు నెల్లవారును దర్శించి,
యాతని సేవించి, యచ్చోటిమునివర్యులఁ బూజించి వారియనుజ్ఞం
గొని యచ్చోటనుండి తరలి సముద్రతీరస్థతీర్థములయందు స్నానమా
చరించుచుఁ బోవఁబోవఁ బుణ్యనది గోదావరిని దర్శించి యం దవగా
హనంబుఁ జేసి దేవపితృతర్పణంబు లొనర్చెను. విప్రులకు దక్షిణ లపరి
మితముగ సమర్పించెను. పిదప నగస్త్యతీర్థసేవ గావించెను. మున్ను
తీర్థసేవాపరుండైన యర్జునుండు స్నానమాడుటచేఁ బవిత్రములైన నారీ
తీర్థములయం దవగాహనము చేసి యచ్చటి మునులవలన నర్జునుసచ్చ
రిత్రం బాలకించి మెచ్చి వేయియావులదానము విప్రుల కిచ్చెను. పదం
పడి జామదగ్న్యవేదిం బూజించెను. ఇయ్యది దేవతలకుఁ బుణ్యాశ్ర
మంబు. ఇందు దేవతలు తొల్లి తపం బాచరించిరి. రాజు లనేకుల
కియ్యది యజ్ఞశాల. దీనినుండి ప్రయాణమై సముద్రతీరంబునందలి సర్వ
పుణ్యతీర్థములను సేవించుచు శూర్పారకంబునకుఁ జని యందుఁ గృత
స్నానుండై ప్రభాసతీర్థముం జేరి యందు భీమ నకుల సహదేవులును
ద్రౌపదియుఁ దానును స్నానమాచరించి పితృదేవతర్పణంబు సేసి పండ్రెం
డుదినంబులు ధర్మనందనుం డచ్చోటఁ బంచాగ్నిమధ్యమం దాసీనుండై
జలభక్షణమును వాయుభక్షణమును గావించుచుఁ దపం బాచరించుచు
న్నంత నచ్చోటికి వారిరాక నెఱింగి బలరామకృష్ణులు, ప్రద్యుమ్నుఁడు,
సాత్యకి, సాంబుఁడు, అనిరుద్ధుఁ డాదిగాఁగల యదుముఖ్యులతోఁగూడి
యచ్చోటి కేతెంచిరి. ధర్మరాజు వారి నందఱును విధ్యుక్తముగఁ
బూజించి, వారితో నరణ్యవాసాయాసంబును జెప్పికొని, యర్జును
డస్త్రార్థము దేవలోకమున కరిగియున్నవాఁ డనెను. ఇంద్రుండును,
లోకపాలురును, మహాదేవుండును వానికిఁ గడుంగూర్చి దివ్యాస్త్రముల
నొసఁగి రనెను. వానినాకలోకవర్తనంబును లోకసంచారులగు ఋషుల
మూలమున నరయుచున్నా మనెను. అంత నీ వృత్తాంతమునంతయు
సవిస్తరముగా జనమేజయుండు వ్యాసశిష్యుఁడైన వైశంపాయనునివలన

విని, తదనంతరవృత్తాంత మే మని యడుగఁగా నమ్మునీంద్రుం డాజనమే జయున కిట్లని వచించెను.

## యాదవులు పాండవులను జూడవచ్చి వారితో సంభాషించుట

జడలు దాల్చి, నారచీరలు గట్టి మునివేషధరులై చిక్కిన యొడళ్లతో నుండు పాండవులను యాదవులు చూచిరి. అలనాఁడు రాజ సూయయాగమునందు మహావిభవముతో మహేంద్రుపార్శ్వస్థితయగు శచీదేవివలెనొప్పారిన ద్రౌపదియరణ్యావాసముం జేయుచుఁగడునిడుమలఁ బడుచున్న దానింగనుంగొని మిక్కిలి దుఃఖితులై యాదేవి నూరార్చి యుదారహితమృదూక్తులతో వారిదెసఁ జూచుచుండఁగా బలరాముండు శ్రీకృష్ణమూర్తి కిట్లనియె. "కృష్ణా ! ధర్మమార్గమునఁ జరించువారు సుఖమును, నధర్మమార్గమునఁ జరించువారు దుఃఖమును బొందవల యు నని కదా యున్నది. అది యీపాండుపుత్త్రులయెడ నేల విపరీత మయ్యెను? పుట్టిననాటంగోలెఁ బరమధార్మికుండై నధర్మరాజునకు రాజ్య భ్రంశమును వనవాసదుఃఖంబును వాటిల్లె. అధర్మపరులలో నగ్రేసరుఁ డగు దుర్యోధనునకు సర్వసుఖములును సమకూఱి యున్నవి. ఇట్టి వ్యత్య స్తస్థితి యొప్పునే? దీనిం జూచి ప్రజ లధర్మప్రవర్తనంబె సుఖ మాపా దింపఁ జేయు నని తలంచి మీఁద నెల్ల రట్లే యాచరింతురు కాఁబోలు. ధృతరాష్ట్రుండు మతిచెడి దుర్మార్గు లగు తన సుతులపల్కు లాలించి, పాపభీరువు లగు పాండుపుత్త్రుల నరణ్యావాసంబునకుఁ బంపె. ఇది ధర్మ్యమా? భీష్మాదివృద్ధులహితోపదేశంబులు చీకురాజు వినఁడయ్యెనే? తులువ లగు తనకొడుకులమతంబునే యనుసరించెనే? ఇది చేయరానిదని తెలిసియు నిట్టియకార్యం బేల చేసెనో ? తూర్పున నుండురాజుల నెల్ల నణంచి తనపరాక్రమమున విజృంభించినట్టి మహాబలుండు భీమసేనుం డీయరణ్యములయందు దప్పికి నీరు, నాఁకలికిఁ దగునాహారము లేక వసరు చుండవలసినయవస్థ నంతయుఁ దలపోసి సమయాంతమున దుర్యోధనా దుల నెల్ల నొక్కుమ్మడి నాజి నిర్దయుఁడై బోయవాలె వధింప కున్నె ? అట్టి యతిరథుల కేటి యరణ్యవాసముం జేసి బక్కచిక్కియున్నవాఁడు. పాశ్చాత్యరాజుల నెల్ల నేలఁ బెట్టి కాలరాచినమహాబలుఁడు నకులుఁ డడ వులఁ బడి యిడుమలఁ గుడుచుచున్నవాఁడు. దక్షిణదేశపురాజులఁ నెల్ల

జయించినసహదేవుం డీవిపినావాసభరం బోర్వలేక బోనునఁ బడ్డ బెబ్బులి చాడ్పున నున్నవాఁడు. పాంచాలుఁ డగు ద్రుపదుయజ్ఞకుండమునందుఁ బుట్టి యయోనిజ యైన ద్రౌపదికి నాగర్భశ్రీమంతురాలికిఁ గాననమున ఘనికి సంభవింప నామె యెట్టిపడరానిపాట్లనుభవించుచున్నదో? కట్టా! వీరికష్టములఁ జూడలేము. వీరిని నీవు గతైశ్వర్యులనుగావించి కష్టాత్ముం డాకురుకులపాంసనుండు దుర్యోధనుండు సుఖానుభవునిగఁ జేయుట కోర్వ నని బలరాముఁ డనఁగా నతనికిసాత్యకి యిట్లనియె. మహానుభావా! ఈపాండుపుత్త్రుల కెప్పుడును నపారబలాఢ్యులును లోకారాధ్యులును నగునీవును భగవంతుఁ డగువాసుదేవుండును నాథులు. మీ రిరువురుండ వారికెట్టిలోపములుఁగలుగవు. కావున మీరిప్పుడు మహాశూరులగుసాంబసారణుల నాహవోన్ముఖులఁ గావించి యాదవరణభేరిని హస్తినాపురద్వారంబున మ్రోగింపుఁడు. దుర్యోధనాదిదుష్టులగుండెలు వ్రక్కలై యపారమైన మనసైన్యమును వీక్షించినంతనే యే మయ్యెడునో కనుంగొనుము. పరిదేవనమునఁ బ్రయోజనంబు లేదు. తగినపని వేగంబ చేయుదము. ధర్మరా జెద్దియుఁ జెప్పఁడు. తమ్ము రక్షింపను నీవును వాసుదేవుండును నున్నా రని మిమ్ము నమ్మియున్నాఁడు. మీ రిరువురు వారికిఁ బ్రాపు. కావుననే మేలొనఁగూర్చినను, మీరే యొనర్పవలయును. తొల్లి యయాతి స్వర్గపతితుండు కాఁగా శైబ్యాష్టకాదులు వానికిఁ బునస్స్వర్గప్రాప్తి గల్పించుట వినమే? కావునఁ బాండవులకు సహాయులముమనమే. వారిశత్రువులవధఁ గావింపవలయును. నీ వలిగిన నానీచు లవని నుండ నేర్తురే? ఇంతప్రతాపశాలివైన నీవును ఘటింప రానిదానిని ఘటింపఁజేయు సామర్థ్యము గల వాసుదేవుఁడును, బ్రద్యుమ్నానిరుద్ధసాంబసారణచారుదేష్ణ గదాదులును, నేను నుండ దుర్యోధనకులక్షయంబు త్రుటికాలమునఁ గావింపఁబడదే? అర్జునునకుఁ బ్రియశిష్యుండ నగుటచే నే నవశ్యంబు పాండవులకుఁ గూర్తు. మనము సర్వసేన నాయితంబు గావించి యిప్పుడ దండు వెడలి హస్తినాపురముపై నెత్తిపోవుదము. దుర్యోధనాదిసమస్తదుష్టులం బరిమార్చి రాజ్యము ధర్మరాజునధీనంబు సేయుదము. ధర్మరాజు ప్రతినచొప్పున వనవాసకాలమును, నజ్ఞాతవాసకాలమును బూర్తియగు

టకు మున్నే మనము దుర్యోధనాదుల ననియందు నిర్జించి ధర్మరాజు సోదరసహితుండై వచ్చులోపుగా నభిమన్యునకుఁ బట్టముగట్టి కౌరవ రాజ్యమును వానియందు సుప్రతిష్ఠితముఁ గావింతము. సమయాంతమున మహానీయుండు యుధిష్ఠిరుండు హస్తిపురిసింహాసనము నెక్కి నిష్కంటకమైన రాజ్యము నేలుఁగాక! అనఁగా వాసుదేవుండు సాత్యకి కిట్లనియె: సాత్యకీ! నీవు చెప్పినట్లు చేయనగును. కాని, ధర్మనందనుండు నిజభుజార్జిత రాజ్యమును దప్ప నితరు లిచ్చినరాజ్యము నొల్లఁడు. కామభయాదులచే ధర్మమును విడువఁడు. ప్రతిన పూర్తికాఁగానే ధర్మజుండు తనరాజ్య సంపాదనమునకుఁ దాన యనికిఁ జొచ్చు. అప్పుడు పాంచాలకేకయాదులును మనమును ధర్మనందనునకును వానితమ్ములకును దోడ్పడి వానిపగతుర గెలిచి రాజ్యమును వారివశము గావించి ధర్మజుని హస్తినాపురపుగద్దె నెక్కింతము. అనునామాటలను ధర్మరాజు విని వాసుదేవుని యుచితవాక్యముల కభినందించి తనయభిప్రాయమును బూర్తిగ నెఱింగినందులకుసంతసించి సాత్యకితో 'ఓరీ వాసుదేవుండు భగవంతుండు గాని సామాన్యుండు గాఁడు. కావున వానివచనముచొప్పున నెల్లవారు నడుచుట యుక్తము. దాన మేలు చేకూఱు' నని చెప్పి వార్ష్ణేయాదుల నెల్లరఁ గలయం జూచి మీదర్శనంబు నాకానందంబు గల్గించె. ధర్మమునఁ బ్రమాదము పొరయఁగూడదు. మిమ్మందఱఁ జూతును. అని చెప్పఁగా యాదవు లెల్లరును ధర్మరాజును వీడ్కొని రామకృష్ణులతో ద్వారావతికిఁ జనిరి. అంత ధర్మరాజు తమ్ములతో సోమమిశ్రిత పయోష్ణీనదియందుఁ గృతస్నానుఁడై యుండ ధర్మనందనునకు రోమశుం డిట్లనియె. ధర్మపుత్త్రా! ఈనదీతీరమునఁ దొల్లి ధూర్తరజసుఁ డను రాజు కొడుకు గయుఁ డనేకయాగములఁ గావించెను. వానియాగముల యందు యాగోపకరణములగు *చషాలము, యూపము, †చమసము,

* చషాలము = ఇయ్యది యాగపశువును గట్టుయూపస్తంభముయొక్క పై కట్టువర్చఁబడు దారుమయమైన కడియము. యూపస్తంభముయొక్క అడుగునఁ దగిల్చెడి ఖురసకడియ మని కొందఱు.

† చమసము = చచ్చౌకమైన యజ్ఞపాత్రము.

*స్రుక్స్రువములు మున్నగువానినన్నిటిని బంగారముతోఁ జేయించియమర్చెను. వీనియాగములయందు యాగోపకరణము లగు యూప, చషాలములను సురలు స్థాపించిరి. అశ్వమేధముల నేడింటి నీతం డొనర్చెను. ఈ మహనీయుఁడు యాగములయందు దేవతలను సోమపానతృప్తులం జేసెను. భూసురులను హిరణ్మయగోదానములచేతను భూరిదక్షిణలచేతను సంతుష్టులనుగ నొనర్చెను. ఇట్టిమహాకార్యంబులు భూలోకమున నాచరించి యామహనీయుండు పుణ్యలోకముల కేఁగెను. ఏటిగట్టునందలి యిసుకనైనను, నాకసమునందలి రిక్కలనైనను, వర్షధారలనైనను లెక్కింప వచ్చును గాని గయుఁడు విప్రుల కొసఁగిన భూరిదక్షిణలను లెక్కించుట సాధ్యము కానేరదు. ఈపయోష్ణినదియందు స్నానమాచరించిన పుణ్యాత్ముండు గయునింబోలెఁ బుణ్యలోకము లందును. అనఁగా ధర్మజుండు తమ్ములును ద్రౌపదియును దానును నానదియందు మఱల స్నానమాడి యచ్చోట దేవపితృతర్పణంబులు గావించి యచ్చోటినుండి తరలి వైదూర్యపర్వతమును వీక్షించి నర్మదాతీరమును జేరెను. ఆతీరమునందలి పుణ్యాశ్రమములను, దివ్యతీర్థములను సేవించుచు నచ్చటచ్చట విప్రులకు భూరిదానంబు లొసంగుచు, మునిజనశరణ్యుండై యుండు ధర్మజునితో రోమశుం డిట్లనియె. ఓరాజా! ఈజనపదంబు త్రేతాద్వాపరసంధి నాఁబడు. మున్నిచోట చ్యవనుఁ డనుఋషీశ్వరుండు శర్యాతికూఁతు సుకన్య యనుదానిం బెండ్లాడెను. అంతియకాక మామ యగు శర్యాతి గావించినయాగమునందుఁ బాకశాసనుపై నలిగి యతని నాదరింపక స్తంభితుం గావించి యాశ్వినులకు సోమంబు నిప్పించి శర్యాతి యాగమును బూర్తిగ నొనర్చినఋషీశ్వరుం డాచ్యవనుం డనఁగా నాచ్యవన మహర్షి చరిత్రను సవిస్తరముగాఁ జెప్పు మని ధర్మజుఁ డడుగుటయు రోమశుండు సౌకన్యాఖ్యానము నిట్లు వినిపించె.

### రోమశుండు ధర్మజునకు సౌకన్యాఖ్యానము జెప్పుట

తొల్లి భార్గవుండైన చ్యవనుం డిచ్చోటికి సమీపమున నుండు కొలనిగట్టునఁ బెద్దకాలము జితేంద్రియుఁడును, నిరాహారుఁడును, నిశ్చల

* స్రుక్స్రువములు=ఆజ్యాహుతిఁ గావించుటకుఁగా నుండు కొయ్యగరిటెలు—వీనిని కూడ యజ్ఞపాత్ర లందురు.

చిత్తుండును నై తపం బాచరించుచుండెను. ఆతఁడు నిష్ఠతోఁ దపంబుఁ జేయుచుంట నాతనిశరీరము లతావృతమై చీమల కాస్పదమై కొన్నాళ్లకతని చుట్టును జీమలు పుట్టలుపెట్టిన నవి క్రమముగ వానిచుట్టును బెద్దవై కొంత కాలమున కాతనిశరీర మాపుట్టలోఁ గాన రాకుండెను. తన్ను లతలును, బుట్టలును నావరించినను నిశ్చలుఁడై చ్యవనుండు తపోనిష్ఠ గావించుచుండఁగాఁ గొంతకాలమునకు శర్యాతి యను నృపాలుఁడు తననాల్గు వేలమందిభార్యలతో నాయాశ్రమంబు కొలనికి విహారమునిమిత్తము రాఁగా వానియేకపుత్త్రిక సుకన్య యనునది దివ్యాభరణభూషితురాలై సుగంధికుసుమమాలికల ధరించి విలాసమునఁ దనచెలికత్తియలతోఁ గ్రీడించుచు నాఋషిపైఁ బెట్టియుండుపుట్టసమీపమున యౌవనంపు శోభనఁబూగుత్తులఁ జిదుముచుండెను. తొలికాఱు మెఱుపుఁబోలినది, నానావిధభూషణాలంకృత, చిత్రాంబరధారిణి, లావణ్యవతి, జవ్వనియును నగు నాసుకన్యను రాజపుత్త్రింగాను నవివాహితఁగాను బుట్టలోనున్న చ్యవనుండెఱింగి యెట్లయినను దానిఁ బరిగ్రహింపఁదలంచెను. ఇట్లుండ నాసుకన్య పుట్టలో మిడుఁగుఱులు వోలె మెఱయుచున్న యమ్మునివరు నేత్రములం జూచి యివి యే మగు నొక్కొ యని వాని నొక ముంటితోఁ గ్రుచ్చె. అంత నాపోటునకు మునివరుండు కినిసి తనతపోమహిమచే నారాజును వెంబడించినపరివారమంతటికిని మూత్రపురీషనిరోధము కలిగించెను. అంత నాతనిపరివారమంతయుఁ గడు దుఃఖిత మయ్యె. అంత శర్యాతి తనపరివారమున నెవ్వారైనం దెలియక యచ్చోటఁ దపస్వియై కాలముం గడపుచున్న చ్యవనున కేదైనఁ గీడుగావించిరా యనియుఁ,గాకున్న నిట్టినిరోధమెట్లు కలుగ నేరదనియు నిశ్చయించి తనపరివారములోని యందఱ వేర్వేర పిలిచి భార్గవున కెవ్వరేని యపరాధముఁ గావించితిరా యని యడిగిన నెవ్వరు నెఱుఁగ మని చెప్పఁగా వగఁ గూరియుండె. పిదప సుకన్య తండ్రిపాలికిం జని, 'నాయనా! నే నిచ్చటఁ బుట్టలో మిడుంగుఱులు వోలె నేవో మెఱయుచున్న వని యొక్క కుశాగ్రంబున నాపుట్టను గ్రుచ్చితి. అది యేదైన నొకపురు గని తలంచి యట్లు కావించియుంటి ననఁగా శర్యాతి యదరిపడి యయ్యో! నాబిడ్డా! యన్నేల చేసితివి. అది భార్గవుండైనచ్యవనమహర్షి నావరించియుండు వల్మీ

కము అందు చ్యవనుండు తదేకనిష్ఠతో బహుకాలమునుండి తపం బాచ రించుచున్న వాఁడు.అని చెప్పి యాపుట్టసమీపంబున కేఁగి దానిని మెల్లగఁ ద్రవ్వించి యందుఁ దపస్సుచేతను, వయస్సుచేతను వృద్ధుఁ డైనచ్య వనుం జూచి, 'మునీంద్రా ! నాకూఁతు రజ్ఞానంబున నొనర్చినకర్జంబు సహింపవే, నన్ను రక్షింపవే' యని వేడ నాచ్యవనుండు నీకూఁతు నా కిచ్చి వివాహము గావింపుము. నీసైనికులకును, బరివారమునకును సంభవించినయాపదఁ దొలఁగింతు; ఈతప్పు సైరింతు ననియె. అంత శర్యాతి మునివచనంబులకు వెనుదీయక వానియభిమతంబు నెఱ వేర్చె. వెంటనే శర్యాతిసైన్యమునకు బాధ నివారణమయ్యెను.శర్యాతి నిజపరివారముతోఁ దనపురమునకుఁ జనియె. అంత సుకన్య పతి వయో వృద్ధుఁ డని యేవగింపక వానిమనస్సున కింపు వొడమునట్లు వర్తించుచు నసూయ లేక చ్యవనాశ్రమమున కరుదెంచునతిథుల నిమ్ముగా విచారిం చుచుఁ జ్యవనునకు మోదావహయై యుండె.

అట్లుండ నొక్కనాఁ డశ్వినులు చ్యవనాశ్రమమున కేతెంచి యాసరస్సున స్నాతయై యొంటరిగాఁ దిరుగుచుండు నా సురుచిరా కార, లావణ్యవతి. యువతియు నగుసుకన్యం గాంచి 'యవ్వా! నీ వెవ్వరి దానవు? ఎవ్వనికూఁతురవు? ఎవనిఁ జేపట్టియున్నావు?' అని యడుగఁగా నాయిందువదన 'నేను శర్యాతియను రాజుకూఁతురను. చ్యవనమహర్షి భా ర్యను. ఇయ్యది వారియాశ్రమంబు' అని చెప్పఁగావారు ముసిముసి నగ వులు నగి సుకన్య కిట్లనిరి. ఇంతలావణ్యవతివి; జవ్వనివి; శోభనాంగివి; నీ వీబడుగుముసలి నెట్లు వరించితివి? నీతండ్రి యింతటిముదుసలికి ని న్నెట్లొ సంగె? అచ్చరలు సౌందర్యమున నిన్నుఁబోలరు. నీకుసొమ్ములుగాని,దివ్య వస్త్రములుగాని లేకున్నను నీమేనికాంతి యీావనము నెల్ల మెఱపువలెఁ బ్రకాశింపఁ జేయుచున్నది. నీవు ద్రవ్యవంతునిఁగాని, రాజపుత్త్రునిఁగాని చేపట్టియుండినచో వాఁడు నిన్ను సర్వభూషణాలంకృతఁ గావించి, నీకుఁ జీనిచీనాంబరములఁ గట్టనిచ్చియుండును. అప్పుడు నీసౌందర్య మిం కెట్లుండునో ? ముదుసలితనముం జేసి మేన ముడుతలు వడ, నిన్నుఁ బోషింపలేని యీముదుసలిపాఱుని వదలి మాలో నొక్కరుని గోరు కొనుము. ఏల వెఱ్ఱివై యౌవనము నడవిం గాచినవెన్నెల సేసెదవు!'

అనఁగా వారిమాటలు సుకన్యవీనులకు ములుకులై సోఁక, 'నయ్యలారా! మీ రెవ్వరో! మీమాటలు చాలింపుఁడు. నియతులై నతపోధనుల నిట్లాడ నగునే!' యన వారు వెండియు నిట్లనిరి. 'కోమలీ! మామహిమచే నీమగనిని దరుణవయస్కుం జేసెదము. మామువ్వురిరూపములొక్కటై కాన్పించు. అప్పుడు మామువ్వురిలో నీ కిష్టమైనవాని వరింపవే' యనఁగా సుకన్య యావృత్తాంతం బంతయు భర్త యగుచ్యవనునకు నివేదించె. అంత చ్యవనుం డందుల కొడంబడు మనఁగా నాదేవి యశ్వినులకడ కేతెంచి యట్ల చేయుదు ననెను. అంత నశ్వను లిరువురను చ్యవనుండును మువ్వు రాసరస్సుఁ జొచ్చిరి. అం దొక్కముహూర్తకాలం బుండి మువ్వురు నేకాకారులై సుకన్యమ్రోల నిలిచి తమలో నొక్కనిని వరింపుమని యడుగుటయు సుకన్య పరమపతివ్రత గాన మనస్సునందు చ్యవనునిఁదప్ప నన్యునిఁగోరనిదగుటచేఁ బతినేధ్యానించి వారిలోఁ జ్యవనునేర్పఱచి యతనినెవరించె. అంతచ్యవనుం డశ్వినుల మహోపకారమునకు సంతసిల్లి దేవతలతో యజ్ఞములయం దింద్రుండు సూచుచుండఁగనే వారికి హవిర్భాగమును, సోమపానమును గల్పింతు ననిన విని యశ్వినులు పరమానందభరితులై తమకుఁ జ్యవనువలన దేవత్వసంప్రాప్తియగు నని యరిగిరి. చ్యవనుండు తరుణుండై సుకన్యతోఁగూడి తనతపోమహిమంబునఁ దదిచ్ఛానువర్తియై సకలభోగముల ననుభవించుచు విహరించుచుండె. శర్యాతి దానిని విని, కూఁతును నల్లునిం జూచువేడ్కఁ జ్యవనాశ్రమంబున కేతెంచి వారిసుందరాకారంబులకు సంతుష్టుండై సర్వమహీధరములతో వెలయుసర్వాంసహను సాధించినవాఁడువోలె మెలఁగుచుఁ గూఁతునకభిమతకథల నుడువుచుండె.

### చ్యవనుండు శర్యాతియజ్ఞంబున నశ్వినుల సోమపీథులఁ జేయుట

ఇట్లల్లునియాశ్రమంబునఁ గూఁతుతో నిష్టాగోష్ఠి నున్నశర్యాతిని చ్యవనుండు మిక్కిలి మర్యాదతో నాదరించుచుండఁగా నొక్కనాఁడు మామతో నల్లుఁ డిట్లనియె. రాజచంద్రా! నీకు సర్వార్థంబులు సమకూఱున ట్లొకయాగంబు నీచేఁ జేయించెద. సమస్తవస్తువులును సమకూర్చుకొను మనఁగా శర్యాతి సంతసిల్లి పురంబున కేఁగి యాగము

నకు వలసినపదార్థముల నన్నిటిని సేకరించికొని చ్యవనునకుఁ జెప్పి పుచ్చఁగా నామహర్షి యతిసంభ్రమంబున భార్యం దోడ్కొని మామ యూరికిం బోయి మామను యజ్ఞదీక్షితుం జేసి తత్ప్రయోగమును విధ్యుక్తముగ నడపుచు, దేవతలకు సోమం బిచ్చుతఱి నం దశ్వినులకు సోమం బీఁబోఁగా దేవేంద్రుఁడు వారించి, 'చ్యవనమునీంద్రా'! వీ రశ్వినులు, దేవలోకభిషగ్వరులు. వీరికి సోమమున భాగము లేదు. అనఁగా చ్యవనుండు 'పాకశాసనా! నన్ను జరాభారపీడితుండైనవానిని తరుణునిఁ జేసిన యోగిపుంగవులు వీరు. వీరును నితరదేవతలవలె సోమభాగార్హులే' యన, వీరు వైద్యులు సోమపానమున కర్హులు గారు; సోమం బీవల దనుచుండఁ జ్యవనుం డింద్రుమాటల నాదరింపక యశ్వినుల శర్యాతియాగంబునందు సోమపీథులఁ జేసె. అంత నింద్రుండు మునిపైఁ గినిసి తనమాట నాదరింపని చ్యవనునిపై వజ్రంబు లేయఁ జేతని మీఁది కెత్తుటయుఁ జ్యవనుండు వజ్రాయుధసహితమగు నింద్రునిచేతిని దనమంత్రప్రభావంబున స్తంభింపఁ జేసె. అంత నిలువక చ్యవనుం డింద్రుం జంపఁ దలఁచి యాగాగ్నియం దభిచార హోమముఁ జేసె. దానికి ఫలముగ నాయగ్నికుండంబునందుండి ఘోరాకారముగల యొక రాక్షసుం డింద్రవధార్థముద్భవిల్లెను. వానిబాహువులు పదివేలయోజనములనిడివి గలవి. వానికిఁ గోఱలు నాలుగు నూఱుయోజనములనిడుపు గల్గి యుండెను. ఇతరదంతములు పదియోజనములనిడివి గలవి. వానికన్నులు సూర్యచంద్రమండలములంతటి విశాలములు. వానిఘోరశరీరము భూనభోంతరాళంబులెల్ల నిండి సురాసురులకుం గూడ నిర్దేశింపరానిదిగ నుండెను. ఒక పెదవిని భూమిపైఁ జాచియు, వేఱొక పెదవిని నాకసమునఁ జాచియు నోటిని దెఱచికొనియుండెను. ఈరాక్షసుఁడు జగత్తు నంతటి నొక్కపెట్ట మ్రింగు నేమో యని కరాళ మగు తననాలుకను నాడించుచు నోరు తెఱచికొని, నాలుకచేఁ బెదవుల నాకుచు. భయంకరారావంబున లోకమును పెటిల్లుపెటిల్లు మని శబ్దింపఁజేయుచుఁ బైఁబడివచ్చుచున్న యారాక్షసువలన నింద్రుండు భీతిల్లి చ్యవనుని పాదములమ్రోలఁబడి "మీమహిమముఁ దెలియక నేఁ జేసినయపరాధము నోచ్యవనమహర్షీ! మన్నింపుము, నీవచనప్రకార మశ్వినులకు సోమభాగము నేఁడు మొదలు లోక

మున జరుగుయాగము లన్నింటిలోను గలుగుంగాక! నీ ప్రయత్నము విఫలమౌతునే? నీమహత్త్వమును, సుకన్యాప్రభావమును, నీ శర్యాతిరాజేంద్రునికీర్తియు లోకవిశ్రుత మగుచు గాక! నాయెడం బ్రసన్నుండవగుము" అని యింద్రుండు రాజసభయందునం జ్యవనునిం బ్రార్థింప నవ్యనవనీతసమానమగునిండుమనంబుగల చ్యవనుండు శాంతుండై యారాక్షసు మధునామధేయుని మద్యమును, స్త్రీలను, వేంటను, జూదములోని పాచికలను నాశ్రయింపు మని యాజ్ఞాపించె. అనిమిషపతి వజ్రముతోడి మహాభుజస్తంభనము వెంటనే యుడిగెను చ్యవనుండు సోమము నశ్వినుల కింద్రునియెదుట నిచ్చెను. మఱియు నింద్రుని సోమపానంబున సంతోషింపంజేసెను. శర్యాతియజ్ఞంబు చ్యవనరక్షితమై సమాప్తినొందె. ఇట్లు చ్యవనుండు తనమహత్త్వమును నలుదెసల వ్యాపింపంజేసి సుకన్యతో యథేచ్ఛావిహారంబున నుండె. ఇదే యాచ్యవనునికొలను. ఇదియే త్రేతాద్వాపరసంధి యనంబడును. దీనియందు స్నాతులై దేవపితృతర్పణంబులు సేయువారు సుకృతముం బడయుదురు. నీవును భ్రాతృద్రౌపదీయుతుండవై స్నానమాచరింపుము. ఇది సికతాక్షము. ఇది సైంధవారణ్యము. దీనియందు నివసించి స్థాణుమంత్రోచ్చారణము గావించి యచ్ఛోటం బుష్కరములయందు సుస్నాతుండు సిద్ధుం డగును. అదిగో! మునినివాసంబైన యార్చికపర్వతము. అందు మరుత్తు లుండుటచే నయ్యది మరుత్స్థాన మనంబడును. అచ్ఛోట నదు లీకాల మాకాల మనక సదా ప్రవహించుచుండును. దేవాయతనంబు లనేకము లున్నవి. వానిని సేవించువారు సత్ఫలములంగాంతురు. ఈపర్వతమునకుశిఖరములుమూండు గలవు. వానినుండి సెలయేళ్లు మూండు పాఱుచుండును. ఇందే వాలఖిల్యములు లనేకు లున్నవారు. మఱియును నాదిఋషీశ్వరు లగు నరనారాయణులు కొంతకాల మిందుం దపస్సుం గావించుచుండి పిదపం దమయునికి యగు బదరికాశ్రమముం జేరిరి. తొల్లి పితృదేవతలు, దేవతలు, మహర్షులు, శంతనుం డాదిగం బ్రఖ్యాతరాజర్షు లిందుందపోయజ్ఞముల నాచరించిరి. ఇంక మనకు యమునాతీరంబు గోచరించును. యమునాతీరమునందు ధాత, విధాత, వరుణాదిదేవతలు తపస్సులం జేసి యోగసిద్ధు లయిరి. దానితీరముననే తొల్లి మాంధాతయు, సోమకుం డను రాజర్షియు భూరి-

యజ్ఞములం గావించి నాకలోకమర్యాదం జెందిరి. అని రోమశుండు చెప్పఁగా ధర్మరాజు విని మాంధాతృచరిత్రంబును వానిజన్మంబును, వాని కావే రెట్లు గలిగె ననుటను వినవలతుం జెప్పవే మునీంద్రా! యను టయు రోమశుం డిట్లనియె.

## మాంధాతృచరిత్రము

పూర్వము ప్రసిద్ధికెక్కిన యిక్ష్వాకువంశమునందు యువనాశ్వుం డనుదొడ్డరాజు జనించెను. అతం డనేకాశ్వమేధయాగములను గావించి భూసురులను భూరిదక్షిణలచే సంతృప్తులం జేసి బహుకాలము రాజ్య మేలుచుండెను. ఇట్లుండ నాతనికెంతకాలమునకు సంతతిలేని యాచింత యాతని వేధించుచుండెను. కావున నొకప్పుడు రాజ్యభారము నంతను మంత్రులపై మోపి వ్రతియై కాననములకుఁ బోయి తపం బాచరింప నాలోచించుచుఁ బోవుమార్గమున భృగుమహర్షి యాశ్రమమునకుఁ జని యం దామునీంద్రునితోఁ దనవంత యంతయుఁ జెప్పెను. తన్ను సంతా నార్థము ప్రార్థించినయువనాశ్వునిచేఁ బుత్రకామేష్టి భృగుమహర్షి గావిం చెను. ఆయాగమందు రాజునకుఁ బుత్రోత్పత్తినిమిత్తము మంత్రపూత జలపూర్ణంబైనకలశము నొక్కదానిని రక్షించుచుండె. నియమితకాలము కాఁగానే యాజలమును రాజపత్నిచేఁ ద్రాగింప భృగుమహర్షి యుద్దే శించెను. నియమితకాలము పరిసమాప్తి యగుడు రేపకడ నాకలశోద కమును రాజపత్ని కీనగు నని యుండ నారాత్రి యాగోపవాసదీక్షి తుండైన యువనాశ్వుండు నీరువట్టుచే హీనస్వరంబునఁ దనయొద్ద నున్న ఋత్విక్కులను జలము నడిగె. వానిమెల్లనికంఠధ్వనిని నచ్చటివా రెవ్వ రును వినమిం జేసి యతఁడు పుత్రోత్పాదనార్థమభిమంత్రింపఁబడిన యాక లశోదకంబు సంపూర్ణముగఁ ద్రావి సుఖియయ్యె. మఱునాఁ డందఱును మేల్కాంచి కలశము జలశూన్యంబయి యుంటఁ దెలిసి యిది యెవని కార్య మని విచారించుటయు, యువనాశ్వుం డంతయు రాత్రి జరిగిన దాని సవిస్తరముగఁ జెప్పె. అంత భృగుమహర్షి, రాజా! నీకుఁ బుత్రో త్పాదనమునిమిత్తమై యీపవిత్రకలశమునఁ బూతజలము నుంచితి. ఆనీటిని నీభార్యచే నీదినము ద్రావించియుండినచో నీకు నింద్రతుల్యుం

డైనపుత్త్రుండు గల్గును. విధి యన్యథా తలంచియున్నది. దైవకృతము నెవరు తప్పింపఁగలరు? ఆజలము నెవరు త్రావినను వారిగర్భమునం దట్టి కుమారుఁ డుద్భవిల్లుట నిస్సంశయము. కావున నాపుత్త్రుండు నీశరీరమున జనించు. గర్భధారణాదులవలన నీశరీరమునకొండొకయపాయము లేకుండ మఱియొకయిష్టిఁ గావింతు నని చెప్పి యాయిష్టిఁ జేయించె. అంతే నూఱేండ్ల కయ్యువనాశ్వుగర్భమున వామభాగమును భేదించి యొక శిశువు సూర్యుఁబోలినవాఁ డుదయుంచె. భృగుమహర్షి కావించినయిష్టి మహిమచే యువనాశ్వుశరీరమున కెట్టి యపాయము సంభవింపదయ్యె. ఆతేజోరూపవంతుండైన కుమారుం జూచుట కింద్రుండు నాకలోకంబు నందుండి రాఁగా వానితోడ వచ్చిన యమరు లీశిశు వేమి త్రావి వర్ధిల్లు ననఁగా నింద్రుండు మాం (నన్ను) ధాతా (త్రావును) అని చెప్పియమృత మయంబైన తనరెండవవ్రేలిని వానినోట నుంచెను. దేవతలకార్యకారణం బున వానికి మాంధాత యని పేరుఁబెట్టిరి. ఆశిశు వింద్రునిచూపుడువ్రేలి యందలి యమృతంబుఁద్రావి క్రమంబుగాఁబ్రవర్ధమానుండై పదుమూఁడు జేనలంతవాఁ డయ్యెను. వాఁడు ధ్యానమాత్రమున వేదములను, విలువిద్యను, నస్త్రవిద్యను నేర్చి యజగవం బనువిల్లును, శృంగవంత ములగు బాణములను, నభేద్యకవచంబును బొంది యొక్కదివసంబున జగంబుల నన్నింటిని వశపఱచుకొనెను. మాంధాతృఁడు ఇట్లు సకల భూమండలమున కంతటికిని బ్రభువు కాఁగా నింద్రుండు వానిని భూమం డలమునకుఁ జక్రవర్తినిఁగాఁ జేసెను. ఇట్లు ముల్లోకములకును బూజ్యుం డైనమాంధాతృఁ డనేకయజ్ఞములను గావించి విప్రులను భూరిదక్షిణల తోను, నసంఖ్యాకగోదానములు పెక్కింటితోను సంతృప్తిపఱచెను. ఇంద్రునియర్ధాసనమునం దాసీనుండై జగద్విఖ్యాతుం డయ్యెను. మాం ధాత రాజై జగంబు నేలుచుండ లోకమునఁ బండ్రెండేండ్లనావృష్టి సంభ వించి జనులు క్షామపీడితులైరి. అంత నమ్మహీకాంతుం డింద్రునిసమ క్షంబున మేఘములను దనబాణములచే భేదించి వానఁ గురియించి ప్రజలఁ గాపాడెను. మాంధాతృచక్రవర్తి కురుక్షేత్రమున ననేక యాగములం జేసి లోకము లెల్లఁ దనతివ్రతపములచేఁ దపింపఁజేసెను. ఈమహనీయునిచరిత్రం బట్టి దనిన విని ధర్మరాజు 'మునీంద్రా!

మాంధాతచరిత్రమును వింటిని. సోమకచరిత్రముం జెప్పు మనఁగా రోమశుం డిట్లనియె.

## సోమకచరిత్రము

పూర్వకాలమున సోమకుం డనురాజు భూమి నేలుచుండెను. అతండు నూఱుగురు భార్యలఁ బెండ్లియాడి పరమధార్మికుఁ డని ప్రఖ్యాతి గాంచెను. కాని, ఈతని కిందఱు భార్య లున్నను సంతానము లే దనువంత యాతనిని వదలదయ్యె. ఇట్లు సంతతి లేకయే యతనికిఁ బూర్వవయ స్సతిక్రమింపఁగాఁ గొంతకాలమున కొక్కభార్యయందుఁ బుత్త్రుం డొకఁ డుద్భవిల్లె. వాఁడు జంతు వని పేరొక్కనఁబడెను. వానిని సోమకుని నూర్గురుభార్యలును దమబిడ్డను గాఁ జూచుచు మిక్కిలి గారాబముతోఁ బెంచుచుండిరి. అంత నొకానొకదినమునం దాశిశువును జీమ కుట్టఁగా వాఁడు రోదనము చేయ నారంభించెను. వానియేడ్పును నివారింప లేక నూర్గురు తల్లులును నేకకాలమున నంతఃపురమునం దేడ్వసాగిరి. అంత సోమకుం డంతఃపురమునకు దాది నంపి వార్తఁ దెలిసి తా నచ్చోటికిఁ బోయి శిశువు నోదార్చి యేడ్పుడిపి యందఱ నూఱడింపఁజేసి మరల సభామంటపమున కేతెంచి మంత్త్రులతోను ఋత్విజునితో నిట్లనియె. మంత్త్రులారా! ఋత్విగ్వరా! వినుండు. ఈయేక పుత్త్రవిషయమునకంటె నపుత్త్రకుఁ డగుట మేలు. నాకు లేక లేక వృద్ధాప్యమునందు నూర్గురు భార్యలలో నొక్కతె కెట్లో యొకకుమారుండు జనించెను. వానిపై నందఱును బ్రాణములఁ బెట్టియున్నారు. శరీర మనిత్యము. ఏకపుత్త్రత్వము శోకకారణముగ నున్నది. బహుభార్యలను బెండ్లాడియు నొక్కతె కీకుమారుఁడు తప్ప వేఱెవ్వతెకు సంతానము లేదు. ఒక్కకొడుకు కొడుకు గాఁడు. ఒక్కకన్ను కన్ను గాదు గదా? కావున మీరూహించి నాకు శతపుత్త్రులు గలుగున ట్లుపాయముఁ జెప్పుఁడనఁగా సోమకునితో ఋత్విజుఁ డిందులకుపాయమున్నది. అట్లు చేయుదువేని నీకు నూర్వురు పుత్త్రులు పుట్టుదురు. ఒక్కయాగంబు సేయుము. అందు నీకొడుకు జంతువును బశువుగా వధించి వానివపను నీనూర్గురు భార్యలును వపాహోమకాలమునఁ దద్ధూమము నాఘ్రాణింతు రేని నూర్గురును బిడ్డలను గందురు. అంత నీకు మనశ్శాంతి యగు. జంతువు

మరల నీతల్లిగర్భమునందే పుట్టును. అందులకు నిదర్శనముఁ జెప్పెద, వినుము. వానివామభాగమునందు బంగారువన్నె గలపుట్టుమచ్చ యొకటి యున్నది. వాఁ డాజన్మమందు సైత మామచ్చతోనే పుట్టు. అనఁగాఁ బుత్త్రకామంబున నీయాగముఁ జేయుటకు సోమకుఁ డీయకొనెను. రాజభార్య లందఱును నీయజ్ఞమునకు విముఖులైరి. కాని, రాజాజ్ఞచే యాగసంభారమంతయు ఋత్విజులు సమకూర్చి యజ్ఞవేదిని నిర్మింపించి రాజును సోమయాజినిగా శాలాప్రవేశముగావించిరి. పశుపిశసనవేళ యైనది. తల్లులయొద్దనుండి బిడ్డను దెచ్చుట బహుకష్ట మయ్యెను. ఒకతట్టు వా రాక్రందించుచుండ శిశువును బలాత్కారమున లాగికొనివచ్చి విశసనముసేసి వానివపను హోమకుండముపైనఁ గంపకుఁ దగిల్చి దానితో నాజ్యాహుతుల వేల్చిరి. ఆవపాగంధము నప్పుడందఱు భార్యల నాఘ్రాణింపుఁడని రాజాజ్ఞఁ జేసెను. అందులకు వా రెల్లరుం గుందుచు నావపాగంధం బాఘ్రాణించిరి. వెంటనేసూర్ధురనుగర్భిణులై పదవమాసమునఁ బుత్త్రులం గనిరి. జంతుఁడు ఋత్విక్కుచేఁ జూపఁబడినగుర్తుతోఁ దనతొల్లింటితల్లిగర్భమునందుఁ బుట్టెను. అందఱునువానియెడఁ గడుఁ బ్రేమ గల్గియుండిరి. ఆసూర్ధురిలో జంతుఁడు సర్వగుణముల నొప్పినవాఁడై మేలిమిఁ జెందెను. ఇట్లు సోమకుఁడు శతపుత్త్రులం బడసి యుల్లాసంబుతో నుండ వానిఋత్విజుఁడు కాలధర్మము నొంది నరకావాసమునం గష్టించుచుండెను. అంతఁ గొన్నాళ్లకు సోమకుండుం బరలోకగతుండై స్వర్గలోకమున కరుగువాఁడు ముందు నరకగతుఁడగు తనఋత్విజుం జూచి 'యిది యేటిన్యాయము? నీ వేల నరక మనుభవించెద' వనఁగా వాఁడు నేను నీకు యాజకుఁడ నగుట నా కీదుర్గతి ప్రాపించిన దనెను. అంత సోమకుఁడు యమధర్మరాజుపాలికిఁ బోయి "ఓధర్మ దేవతా! నాకారణంబున నాపురోహితుండు నరకము ననుభవించుచున్నాఁడు. న న్నానరకము ననుభవింప నెలవిమ్ము. వానిని వదలు" మనఁగా ధర్ముం డి ట్లనియె. రాజా! ఒకఁడు చేసినపుణ్యాపాప ఫలములను వేఱొకం డనుభవింప నగునే? నీవు పుణ్యాత్ముండవు. నాకలోకము నీపుణ్యఫలము లనుభవించుచోటు. కావున నీ వచటికేఁగుము. అనఁగా సోమకుఁడు ఋత్విజు వదలి నేను బుణ్యఫలము ననుభవింపను.

మే మిరువురముఁ బుణ్యఫలము సమముగాఁ బంచి యనుభవించున ట్లొనర్పు మనిన ధర్మం డి ట్లనియె. సోమకా! నీయభిప్రాయం బట్లుండెనేని యితనితోడ నీవును నరకము ననుభవించి పదంపడి నీపుణ్యఫలమును మీా రిరువురును సమముగా ననుభవింపుఁ డనెను. సమవర్తివచనము చొప్పున ఋత్విజునిపాపఫలమును దాసుం బంచి కైకొని యిరువురును మున్ను నారకము ననుభవించి పదంపడి యిరువురును సోమకుపుణ్యములను సమముగాఁ బంచికొని నాకలోకసుఖమును బొంది క్షీణపుణ్యులు కాఁగా మరల మర్త్యలోకమున జనించిరి. ఇయ్యది యాఁసోమకునియజ్ఞప్రదే శము. ఇం దాఱురాత్రులు వసించినవారు సుకృతు లగుదురు. నీవును నిం దాఱురాత్రులు వసింపుము. అనిన, వారందఱు నచ్చోటినుండి తరలి వేఱొకచోటి కేఁగుచుండ నందొక్క ప్రదేశమును ధర్మనందనునకుఁజూపి రోమశుం డిట్లనియె. ఇందుఁ దొల్లి ప్రజాపతి సహస్రవార్షికంబైనయిష్టా పూర్తం బను పేరితో వెలయు సత్రయాగం బొనర్చెను.-ఈయమునాతీరం బున నాభాగుం డైన యంబరీషుండు యజ్ఞములఁ బెక్కింటిని జలిపి సదస్యులకు విస్తారధనము దక్షిణగానొసంగి పరమసిద్ధికిఁ జనియె.మఱియు నీచోటనే యయాతి యజ్ఞము లనేకముల నాచరించెను. ఇవే యయాతి యజ్ఞమందలియగ్నికుండంబు లగపడుచున్నవి. దర్శింపుము ఇది నరకుక్షే త్రంబు. ఇది రామహ్రదతీర్థము. ఇది నారాయణాశ్రమంబు ఇది నహు షుయజ్ఞప్రదేశంబు. నహుషుం డిచ్చోఁ బదిపద్మములసంఖ్య గల విస్తార ధనమును సదస్యుల కొసంగి వారిఁ బూజించె. ఇది సార్వభౌమయజ్ఞ స్థానంబు. ఇది ఋచీకపుత్త్రునిసంచారస్థానము. ఈప్రదేశమునం దీతీర్థం బునఁ బూర్వము పుత్త్రునితో స్నానమాచరించుచుండిన యొకమగువకు రోఁకళ్లను గర్ణాభరణములుగ ధరించి సంచరించుచుండిన పిశాచ మిట్లు చెప్పెను. ఒంటెలయొక్కయు గాడిదలయొక్కయు పాఁడి గలచోట్ల నివసించుటచేఁ గల్గినపాపము గలవారును, వానిపాఁడివలన జనించిన పెరుఁగును బాలను భుజించుటచేఁ గల్గినపాపము గలవారును దొంగలచే వధింపఁబడి యగ్నిసంస్కృతముగాని కళేబరమును వేసిన నదియందు స్నాతులయి పాపమును జెందినవారును నీతీర్థమునస్నానముఁ జేసి పాప ములఁ బోఁద్రోలుదురు. పైపాపములు చేయనివా రిచ్చోట రెండు

రాత్రు లున్నచో, వారికి నేను బగటిపూటకంటె రాత్రిపూటలలో నెక్కుడుచెట్ట చేయుదును. అని చెప్పెను. కావున నోధర్మతనయా! మన మీతీర్థమున నొక్కరాత్రియే వసింతము. ఇది కురుక్షేత్రమునకు ద్వారంబు. ఇచ్చోట యయాతి యనేకయజ్ఞములం జేసె. వీనిజన్నములకుం బాకశాసనుం డానందించెను. ఇది ప్లక్షావతరణం బను యమునాతీర్థము. ఇందు దేవతలును ఋషులును సారస్వతయాగం బొనర్చిరి. దీనిని దేవర్షి యగు సంవర్తుండు రక్షించుచుండును. ఈప్రదేశమున భరతుం డనేకయాగములను జేసి సర్వలోకంబులను జూచె. నీవు నిందు స్నానముం జేయుము, సర్వలోకములును నీకుం గాన్పించును. అనఁగాఁ బాండవాగ్రజుం డనుజసహితుండై యాతీర్థంబున స్నానంబునేసి రోమశున కిట్లనియె. "మునీంద్రా! నీవు వచించిన ట్లిం దవగాహనము గావించుటచే నాకు దేవర్షిలోకములు, బ్రహ్మలోకము, ఆదిత్యలోకము, అశ్విలోకము, నాకలోకము కనఁబడె. మఱియు నాకలోకముం గల యంగనుంగొనఁగా నింద్రుండును,వానిపార్శ్వమునందు సవ్యసాచి గాండీవమును ధరించియున్నట్లును, జయలక్ష్మి వానిం జెందియుండునట్లును గాన్పించెను. అనఁగా రోమశుం డివి యెల్లను నీ తీర్థమునందుఁ గల స్నానమహిమవలన నీకు నిట్లు దృగ్గోచరంబులయ్యెను. ఇది సరస్వతీనది. ఇందు దేవతలు, మహర్షులు, రాజర్షులు నింకను బెక్కండ్రు యజ్ఞములనేకములు గావించిరి. ఇది యైదుయోజనములవిస్తారము గల ప్రజాపతియజ్ఞవేది. ఇది మిక్కిలి నియమముతో యజ్ఞములు పెక్కింటిని గావించిన కురుక్షేత్రము. ఈక్షేత్రమునందుఁ బ్రవహించుచున్న సరస్వతీతీర్థమునందు స్నానము చేసినవారును, నిచ్చోట శరీరత్యాగము గావించినవారును నాకలోకమున కేఁగుదురు. ఆకారణంబున నిచ్చోట మరణించుట కని పలువురు వచ్చి వసింతురు. మఱియొక నది యోఘవతి యనునది యిందుఁ బ్రవహించుచున్నది. ఇయ్యది నిషాదరాష్ట్రద్వారము. నిషాదులు దన్నె ఱుంగకుండునట్లు సరస్వతీనది యిచ్చోట నదృశ్యయై యున్నది. కావున నిచ్చోట దానికి వినశ యని పేరు. ఇది చమసోద్భవంబు. ఇచ్చోట సరస్వతి మఱలఁ గాన్పించె. ఈ చోటనె లోపాముద్ర యగస్త్యుని బెండ్లాడెను. అని విని ధర్మజుండు

రోమశునితోడఁ బయనమై ప్రభాసతీర్థమును, విష్ణుపదమును దర్శించి, యచ్చట స్నానము గావించి, దేవపితరులను దర్పణాదులచేతను, విప్రులను గోభూరిదానములచేతను దనివినొందించెను. అని విపాశానదిఁ జేరి రోమశుఁడు ధర్మజుం జూచి ఓరాజా! ఇది విపాశానది. దీనియందు వసిష్ఠుఁడు పుత్త్రమరణవేదనంజేసి దేహంబుఁ బాశంబులఁ గట్టి యుఱికెను. కాని, యీయేఱు వానిపాశంబులం ద్రెంచి వానిని గట్టుసేర్చెను. కావున, దీనికి విపాశ యనుపేరు గలిగెను. ఓ శత్రుసంహారకా, ఇది కాశ్మీరమండలము. ఇది యన్నిటను బావనంబు. పెక్కండ్రు మహర్షుల కునికిపట్టు. ఇట్టిప్రదేశమును నీవును దమ్ములును జూడుఁడు. ఇచ్చట నుదీచ్యఋషుల కందఱకు నాహుషునకును అగ్నికాశ్యపులకును సంవాదము జరిగెను. మహారాజా! ఇదిగో యిది మానసద్వారము. ఇటఁ బరశురాముఁడు వాసము చేసెను. ఈవర్షద్వారమును, విదేహముయొక్క యుత్తరద్వారమును సత్యవిక్రముఁ డయినపరశురామునియానతింబట్టి గాలికిఁ గొట్టుకొనివచ్చిన యీపద్మాదులరాశి దాఁటిపోఁ జాల దయ్యెను. ఓ పురుషర్షభా, ఇదిగో మఱొకవింత చూడుము. ఈచోట యుగాంతమునందుఁ బశుపతి యుమాసమేతుఁడును బ్రమథగణపరివృతుఁడును నై భక్తులకు దర్శన మొసంగు. ఇక్కాలనం జైత్రమాసంబునం దీప్సితార్థులై భక్తు లెందఱో మహేశ్వరు నర్చింతురు. ఈకొలనియందు స్నానమాచరించిన పుణ్యాత్ముండు నాకలోకముఁ బడయును. అరుంధతీసమేతుండై వసిష్ఠుం డీసరస్తీరంబునందు బహుకాల ముండెను. కావున నీప్రదేశ ముజ్జానక మని పేర్కొనఁబడెను. ఇది కుశవృద్ధము. ఇచ్చోటఁ బద్మములు దర్భలపై నిండియుండు. ఇది రుక్మిణ్యాశ్రమము. ఇది భృగుతుంగపర్వతము. అనేక మహర్షులను వెలవుపట్టైన వితస్తానది యిది. ఓపాండవాగ్రజా! దీనిని దర్శింపుము. ఇందు మునిఁగినవాఁడు సర్వపాపవిముక్తుఁ డగును. జలోపజల లనువదులు యమున కుభయపార్శ్వములయందుఁ బ్రవహించుచుండును. ఔశీనరుం డగుశిబిచక్రవర్తి యీప్రదేశమున ననేకయజ్ఞముల భూరిదక్షిణలతోఁ గావించి యింద్రునకంటె నతిశయించెను,

### శిబి యను రాజర్షి చరిత్రము

శిబి మహాసంభ్రమమునఁ గావించుచున్న యజ్ఞమున నింద్రాగ్ను
లొక్కనాఁడు వానిచిత్తంబెఱుంగఁగోరి యీభృగుతుంగ పర్వతమునకు
విచ్చేయునపు డింద్రుండు శ్యేనరూపమును నగ్ని కపోతరూపమును
దాల్చిరి. అప్పుడు శ్యేనంబు కపోతమును దఱుముచు రాఁగా నాకపోతం
బా శ్యేనంబునకు వెఱచి శిబిని శరణుఁజొచ్చెను. అంత దానిం దఱుముచు
వచ్చినడేగ శిబి కిట్లనియె. రాజేంద్రా! నీవు ధర్మాత్ముండవు. ఈపావురము
నా కాహారంబు. నేను జేరాఁకలితో నవయుచున్నాను. కావునఁ గరు
ణించి దానిని విడువుము. నాయాహారము నా కొసంగి నాప్రాణంబులను
గాపాడి పుణ్యముం గట్టికొమ్ము. నీయిప్పటికృత్యము ధర్మవిరుద్ధము.
అనఁగా శిబి డేగ కిట్లనియె. ఈపావురము నీవలనిభయముచే నామఱువు
సొచ్చియున్నది. తన్ను రక్షింపు మని నాశరణుఁ జొచ్చిన యిప్పులుఁగును
నేఁ ద్యజింపను. శరణన్నవారిని రక్షింపనివానికి గోవధ, బ్రహ్మహత్యలు
గావించిన వారిపాపము లంటును. అనిచెప్పఁగా డేగ యిట్లనియె. సర్వభూ
తములును నాహారంబున వర్ధిల్లు. దేనిం ద్యజించినను జీవింపవచ్చును గాని
యాహారమును ద్యజింపవచ్చునే? నాయాహారంబైన యీకపోతమును నీ
విప్పుడు వదలవేని నే నాఁకలి కోర్వలేక నీపాదంబులకడ నసువుల విడు
తును. తన్మూలమున నాశాబకములును బెంటియు జీవింపనేరవు. ఒక్క
పావురమును నీవు రక్షించినపుణ్యమువలన నిన్నిపులుఁగులఁ జంపినపాప
మొడిఁగట్టుకొందువు. శరణన్నవానిం గాపాడుట ధర్మమేయైనను, నధ
ర్మాచరణమున బహుజీవములు మరణింప నాపాపఫలము రా నున్న
ప్పుడు పుణ్యపాపములగురులాఘవముల నాలోచింపవలయు. ధర్మా
ధర్మములతారతమ్యములను బుద్ధిమంతుఁడు పరిశీలనచేయవలయును.
ధర్మజ్ఞులు ధర్మమునకు బాధాకరం బైనధర్మమును ధర్మముగా నెన్నరు.
ధర్మ మన్నింటికి హితముగ నుండవలయును. అదియునుంగాక యీకపో
తంబు నాకు వేదోక్త మగునాహారము. "శ్యేనాః కపోతాన్ ఖాదన్తి"
యను వేదవాక్యమును వినవే? కావున లెస్సగఁ బర్యాలోచనచేసి
దీని నా యాహారంబుగా నిమ్మనిన వెండియు శిబి యిట్లనియె.
శ్యేనమా! వినుము. ఈ పులుఁగు ప్రాణభయమున వచ్చి నన్ను

నాశ్రయించెను. ఆశ్రితుని నెట్టియధముఁడైనను విడువఁడు. దీని నీవ చనముల కలరి నే విడుతు నేని యది యాశ్రితత్యాగ మను నధర్మ మగును. నీవు పక్షి వయ్యును ధర్మ మెఱింగినట్లు వచించితివి. శరణాగతి పరిత్యాగంబు సేయుటకంటె మిక్కిలి యధర్మం బొం డెద్ది? నీయాఁకలి దీనఁగాని యొంట నుపశమింపదే? నీయత్నంబు దీనివధార్థమే కాక, యాహారార్థమే యైనచో నిప్పు డీ కాననంబున మృగమహిషవరాహ ఖగమాంసంబులు దీనిమాంసంబుకంటె రుచ్యములును జాలినవియు ననేకము లున్నవి. వానిని నీకు మిక్కిలిగాఁ బెట్టెద. ఈపావురమునందలి క్రోధ ముడుగుము దీని నే నెట్లును విడువనోప ననఁగా శిబికి డేగ యిట్ల నియె. నాకేమృగములు నాహారంబు గావు. నాకు దేవవిహితం బైనయీ యాహారంబు నొసంగుము. నిస్సారము లగు వచనము లెన్నియైనను నే వినంజాలను. కావున ధర్మవిహిత మగుకపోతాహారమే నాకు రుచ్యము గావునఁ గపోతమును వదలు మనుటయు శిబి మఱియు నిట్లనియె. శ్యేనమా! నీకోరినదాని దేనినైన నే నిత్తుఁ గాని నీభీతిచే హృదయమునఁ దటదటలాడుచుండు నీకపోతంబును వదలను. వలయు నేని, నారాజ్య మెల్ల నీకిత్తు. మఱియు దేని నొసంగినఁ, బ్రస్తుతము నీకు దీనియం దపేక్ష కలుగదో దాని నిచ్చెద ననఁగా రాజునకు శ్యేనం బిట్ల నియె. వేదవిహిత మైన యీయాహారమును నాకుఁ బ్రసాదింప వేని, దీనిఁ గావ నీకు బుద్ధి యేని, ఓశరణాగతవత్సలా! దీనియంత యెత్తుగలనీమాంసమును దూఁచి నాకాహారంబుగా నిడుము. అటులగు నేని దీని నేఁ గోరను. అని డేగ చెప్పఁగా నాదయామయుం డగు శిబి మహాప్రసాద మని, వెంటనే సురియఁ గొని, తనమాంసముఁ గోసి కోసి, తులలో నొకవైపున నుంచి, యది కపోతముతో సరితూఁగ కుండుట కాత్మగతంబున విస్మయ మందుచు తనువునందు నెత్తురు గాఱఁ దాన తుల నెక్కె. కపోతమును శ్యేనమును వానిగుణోన్నతికి మెచ్చి తమయప్పటిరూపంబుల వదలి వానిముందట నింద్రాగ్నులై నిలిచి యిట్లనిరి. ఓరాజేంద్రా! శరణాగతరక్షకా, మే మింద్రాగ్నులము. నీచిత్త వృత్తిం బరీక్షింప వచ్చితిమి. నీవు ధర్మమును లెస్సగాఁ బరికించితివి. ఆర్తత్రాణపరాయణమునకు నీశరీరముం దెంపుఁ జేసి కోసి యిచ్చితివి.

నీధైర్యశౌర్యసహనాదిగుణము లనన్యసాధారణంబులు. నీకీర్తి నిత్యమై శబ్దబ్రహ్మ మెంతకాలము లోకమునం దుండునో యంతకాలము వర్తిల్లఁగలదు. నీకుఁ బుణ్యలోకములగు. మఱియు నీశరీర మెప్పటియట్ల గుఁగాక" అనిచెప్పి వా రిరువురును దమతమరూపములతోఁ దమతమలోకములకుఁ జనిరి. శిబియు నంతఁ గొంతకాలము రాజ్య మేలి పుణ్యలోకములకేఁగె. ఇది యాశిబియజ్ఞము గావించినచోటు. ఈప్రదేశమున మహర్షులును దేవతలును విప్రులకు దర్శన మొసంగుదురు. ఇదిగో చూడుము శ్వేతుకేతుని యాశ్రమము. ఈముని మహనీయుం డగు నుద్దాలకుని పుత్త్రుండు. ఈయాశ్రమంబునఁ దరువులు సర్వకాలసర్వావస్థలయందును బుష్పఫలసహితంబులయి రమణీయంబులై యుండు. ఈ యాశ్రమంబున వాగ్దేవత శ్వేతకేతువునకు మానుషరూపధారిణియై దర్శన మొసంగె.

ఇందుఁ బూర్వము మేనమామయు నల్లుండు నయిన శ్వేతకేత్వష్టావక్రులు తపస్సిద్ధి నొందిరి. అష్టావక్రుండు మేనమామ యగు శ్వేతకేతువుతోడ జనకమహారాజుయజ్ఞశాల కేఁగి ఋత్విజుం డైన వంది యనువానిని వాదమున నోడించెను. బాలుండైన యష్టావక్రుచే నోడినందులకు వంది లజ్జితుండై యేట మునిఁగి కానరాకుండఁ బోయెను. అన విని యష్టావక్రుచరిత్రమును విస్తరించి చెప్పవే యని యడిగిన ధర్మనందనునకు రోమశుం డిట్లనియె.

## అష్టావక్రముని చరిత్రము

పాండవాగ్రజా! పూర్వకాలమున *కహోళుఁ డను మునీంద్రుం డుద్దాలకునియొద్ద విద్యాభ్యాసంబు గావించుచు గురువునకు వినయముతో శుశ్రూషలు చేయుచుండెను. అంతట నుద్దాలకుండు వానికిం గడుం గూర్చి వానిని వేగ సాంగవేదవిదుఁ గావించె. వాఁడును గురూపదేశంబున సర్వవిద్యలం బఠసియుండ నుద్దాలకుండు వానిపైఁ బ్రేముడి గలిగి తనకూఁతు సుజాతను వాని కిచ్చి వివాహము గావించె. అంత కహోళుఁడు బ్రహ్మచర్యమును వీడి గార్హస్థ్యధర్మము నాచరించుచుండఁ

* ఆంధ్రభారతముచొప్పున వీని కేకపాదుఁ డను నామాంతర ముండునట్లు తెలియుచున్నది.

గొంతకాలమునకు సుజాత గర్భిణియయ్యె. దానిగర్భమునందలి యర్భకుం డొక్కనాఁడు శిష్యులచే వేదాధ్యయనము చేయించుచున్న తండ్రి కిట్లనియె. అయ్యా! ఎడపడక రేలుంబవ ళ్లిట్టీవు విద్య నభ్యసింపఁ జేయ వలయునే? శిష్యులు రేలును వేదాధ్యయనము చేయుచుండుటచే నిద్రారహితులై జడమతులై యపస్వరముల నుచ్చరించిరి. అని యుపాలంభనముగాఁ బలికినఁ దండ్రి యందులకుఁ గినిసి నీ వధ్యయనంబునకు వక్రంబుగాఁ బలికితి గావున నీవు అష్టావక్రుఁడవై (యెనిమిది వంకరలుగల శరీరముతో) జనింతువు గాక అని శపించెను.

అట్లు గర్భస్థుం డైనశిశువు వృద్ధియగుచుండ సుజాతకుఁ గను ప్రొద్దు లగుటయు నాగర్భిణి భర్తం జేరి యేకాంతమున నిట్లనియె. నేఁ బూర్ణగర్భిణిని. ఇది పదియవనెల. పురిటికి వలసినపదార్థము లింట నెవ్వియును లేవు. ఎట్లీ ప్రసవకాలమును దరింతునో? ఏమి చేయుదును? ఎంత బీదవారును నీసమయమునకు వలయునంత తైలధాన్యములను సేకరించియుంచుకొందురు. మనకు ధనాభావముచే నివి దుర్లభములు వీనికి ధనంబు గావలయుఁగాదె. అనఁగాఁ గహోళుఁడు ధనసంపాదనమునకుఁ దరలి జనకరాజుపాలికిం బోయి యందు వరుణపుత్త్రుండైనవందితో వాదమునవోడి వానిని గ్రహమున లజ్జితుండై జలనిమజ్జితుఁ డయ్యెను. అంత నిట నుద్దాలకునియాశ్రమమున సుజాత శిశువుం గనియె. వాఁడుతండ్రి శాపంబున నష్టావక్రుఁడై జనించుటం జేసి, వానిని మును లష్టావక్రుండని పేర్కొనిరి. అప్పుడ యుద్దాలకుభార్య శ్వేతకేతుఁ డనువానిఁగనెను. ఇట్లు మామయల్లుండ్రు సమవయస్కులై తాతయాశ్రమమునఁ బెరుగుచుఁ బండ్రెండేం డ్లుద్దాలకుతోఁజదివి యధ్యయనశూరులైరి. ఉద్దాలకుండుతన యల్లుఁడు జనకసభలో నుండు వందిచే నవమానితుఁడై జలమజ్జితుఁడయ్యె ననువృత్తాంతంబు తెలిసి కూఁతు సుజాతం బిలిచి యావృత్తాంతంబును బుత్త్రునకుఁ దెలుపక రహస్యముగా నుంచునట్లు నియమించె. సుజాతయు నట్లే గోప్యరక్షణమును బహుకాలము గావించె. ఇట్లుండ నష్టావక్రుండును, వానిమామ శ్వేతకేతువును నిరువురు నేకవయస్కులై పితామహునియాశ్రమమునఁ బెరుగుచుండువా రన్యోన్యము తా మన్నదమ్ములుగను, నుద్దాలకుండు తమకుఁ దండ్రిగను భావించియుండిరి. ఒక్క

నాఁ డష్టావక్రుం డుద్దాలకునొడిఁ గూర్చుండియుండ శ్వేతకేతు వో ర్వక మాయయ్యయొడిలో నేల కూర్చుండి యున్నా వని యాక్షేపించి క్రిందికి లాగుటయు నష్టావక్రుం డేడ్చుచుఁ దల్లియగు సుజాత కడకుఁ జని యమ్మా! మాయయ్య యెవ్వఁడు? ఎక్కడ నున్నవాఁ డనఁగాఁ దల్లిరహస్యమును దాఁచినచో మహానీయుఁ డగుకొడుకు దన్ను శపించునని తలఁచి కొంతసే పూరకుండి వానితో యథార్థమును దాఁపక నుడివెను. దాని నెల్ల సుజాతవలన నష్టావక్రుండు విని వెంటనే శ్వేతకేతునియొద్దకుఁ జని 'మామా! జనకరాజుయజ్ఞమున నద్భుతము లనేకము లున్న వని వింటి. విప్రులు వాదింతు రఁట. మన మచ్చోటికిఁ బోయి వారివాదములను విని యానందించి యాగములోని విప్రభోజనమున మధురాహారములఁ గుడిచివత్త' మనఁగా శ్వేతకేతుఁ డందులకు వల్లె యన నిరువురును జనకునియజ్ఞవాటికకుఁ బోయి యజ్ఞశాలముందర మార్గమున రాజున కభిముఖులైరి. అంత రాజు వారిం దారిఁ దొలఁగుఁ డనిన నష్టావక్రుండు రాజున కిట్లనియె.

రాజేంద్రా! అంధులకును, వృద్ధులకును, భారవాహులకును రాజునకును దవ్వున నుండఁగనే, బ్రాహ్మణుఁడు దారిఁ దొలఁగవలయును. సమీపమునకు వచ్చినప్పు డన్ననో రాజు మున్నుగువారే బ్రాహ్మణునకు దారి దొలంగవలయును. అనఁగా జనకుం డాధర్మవచనమునకు సమ్మతించి యామామయల్లుండ్రు చిఱుతవారైనను విప్రులు గానఁ దానే దారిఁ దొలఁగి నేనే మీకుఁ దారిఁ దొలఁగితిని. మీకుఁ దోఁచినమార్గమునఁ బొండు. విప్రుల కింద్రుఁడును నమస్కరించు. మిమ్ము నే ననాదరింపను. అగ్ని కడునల్పమైనను గాల్పకుండునా? అనిచెప్పి చనెను. అంత వారిరువురును యజ్ఞశాలఁ బ్రవేశింపఁగోరి, ద్వారపాలుంజూచి, 'ఓరీ ప్రతీహారీ! యజ్ఞము మేము చూడఁ గుతూహలులమై బహుదూరమునుండి యేతెంచితిమి. యజ్ఞశాలఁ జొఱను, జనకరాజునుజూచి మాటాడను గోరుచున్నాము. మాకుఁ గోపింపక యుత్తముఁడగు వందిదగ్గఱకు మమ్ముఁ జేర్పు'మనఁగా నష్టావక్రునకు ద్వారపాలుం డిట్లనియె. అయ్యా! మేము వరుణపుత్త్రుండైన వందియాజ్ఞచే నిచ్చోఁ గావలియున్నవారము. నాచెప్పినమాట వినుము. అతం డీద్వారమున బాలవృద్ధులైన విప్రులను లోనికంప మా

కానతి యొసఁగఁడయ్యె. విద్వాంసులను బ్రవేశింపఁ జేయ మాకాజ్ఞ నొసంగియున్నాఁడు. వానియాజ్ఞచొప్పున మేము వర్తింపఁగలవారము. మీరుచిఱుతవారలు. కాన మీరు ప్రవేశింపరాదు. అనఁగా నష్టావక్రుండు ద్వారికున కిట్లనియె. వృద్ధుల కిది ప్రవేశింప నర్హంబేని మేమును విద్యావృద్ధులము, నియతవ్రతములు సలుపువారము, వేదప్రభావము తోఁ గూడిన వారము, వృద్ధసేవకులము, జితేంద్రియులము, వేదాంతశాస్త్ర ములం దాఁటితేఱినవారము. చిఱుతవార మని మమ్ముఁ దిరస్కరింపకుము. అల్ప మగు నగ్నిఁ దాఁకిన నయ్యది దాఁకినవానిని దహింపకుండునే? అనఁగా నాద్వారికుండు మఱియు నష్టావక్రున కిట్లనియె. "ఓబాలుఁడా, ఋషులు సేవించునది, నద్వయం బయినబ్రహ్మను బ్రతిపాదించునది, మంత్రార్థవాదముల రూపముగలది, కర్మకాండమునకంటె మిక్కిలి ప్రకా శించునది యగు వాక్కు నెఱుఁగుదేని, నీవు పలుకుము ఓరీ, నీవు పసివాఁ డవు. ఏల ప్రేలెదు వాదమున గెలుపు సుకరముగాదు" అని పలుక, నమ్ముని ఓరీ! బలిష్ఠమైనగొప్పశరీరముగలవాఁడే వృద్ధుఁ డని తలంచుచున్నావు. బూరుగుకాయ లావెక్కియున్నను నది నిస్సారము. అల్పశరీరము గలవాఁ డైనను జ్ఞానముచే వెలయువాఁడే వృద్ధుఁడు, జ్ఞానరహితుఁడు వృద్ధుఁడు గాఁడు. అనఁగా వానికి ద్వారపాలకుఁడు వెండియు నిట్లనియె. జ్ఞానము గలవారే పెద్ద లని నే నెఱుఁగుదు. గురుకులవాస మొనర్చి, గురుసేవఁ జేసికదా విజ్ఞానముఁ బొంద నగును. అప్పుడ కదా నరులు జ్ఞానవృద్ధులగు దురు. నీవు చిఱుతవాఁడవు. జ్ఞానసముపార్జనమునకుఁ గాలంబు చాల దని నేఁ దలంతు. నీవు చిఱుతుకవాఁడవయ్యు వృద్ధునిమాడ్కి మాట లాడెదవు. అనఁగా వానికి నష్టావక్రుండు వెండియు నిట్లనియె. వెండ్రు కలు నెరసినను, ధన మున్నను, బంధుమిత్రు లున్నను, నొక్కఁడు వృద్ధుఁడు గానేరఁడు. బాలుఁడయ్యును జ్ఞానవంతుఁడే వృద్ధుఁ డని దేవ తలు వక్కాణించిరి. సభలోనఁ గదా మాజ్ఞానాజ్ఞానంబులు దెలుపవల యు. సభ్యులుగదా వాని నిర్ణయించువారు? సభలోనికే ప్రవేశింపనీయ నిచో నియ్య దెట్లు పరిష్కరింపఁబడును? వరుణపుత్త్రుఁడగు వందితో వాద మునకు వచ్చినవారము. వానితో వాదించి వాని నోడింపఁగలము. అప్పుడు గదా నారాజపురోహితుఁడును సభయందలి విద్వాంసులును

రాజును మేము జ్ఞానుల మని యెఱుంగుదురు. అందఱు విద్వాంసులు నోరు మూసికొన్న గొప్పదనము,తక్కువదన మెట్లు తెలియును? అనఁగా నాద్వారపాలకుం డష్టావక్రునితో నిట్లనియె. ఓరీ, విద్యావిశారదులయిన విద్వాంసులకు సుప్రవేశంబయిన జన్నమునకుఁ బదియేండ్లకొండిక, వాఁడ వెట్లు చొత్తువు? నేనుపాయంబున లోనికిఁ జొఱ జతనంబు సేతు. నీవును దగుప్రయత్నము గావింపుము. అల్లదిగో రాజు నీ మాటలు విను నంత దవ్వున నున్నవాఁడు. నీవు మేటిపలుకులతో నతనిని బొగడుము. ఆతఁడు నాపొగడ్తను విని ప్రీతుఁడయి లోనికి రా ననుజ్ఞ యొసఁగు. ఇఁక నీ కోర్కులన్నిటినిఁ దీర్చు. అనఁగా, నష్టావక్రుండు జనకు నుద్దేశించి "నరేంద్రా! జనకవంశస్థులలో నీవు చక్రవర్తివి. నీవు సర్వసంపదలతోఁ దులఁదూఁగువాఁడవు.తొల్లి యయాతివలెనిపుడు నీవును సర్వయాగముల నొనర్చినవాఁడవు. నీసభయందుండు వరుణపుత్త్రుండైన వంది యనేకులగు విద్వాంసులను వాదమున నోడించి నిర్భయంబుగాఁ బరిజనులచే వారిని నీట ముంచుచున్నాఁడని వింటిని. నేను విప్రులమ్రోల బ్రహ్మమ్ముం గూర్చి విచారము నొనర్తును. ఏఁడీ యావంది! వానితో వాదింతు. సూర్యోదయమున నక్షత్రములు గాంతిహీనములగునట్లు, నాదర్శనంబున వంది నిస్తేజస్కుం డగును గాక. వానిని మే మోడించుట యథార్థంబు. సంశయింపకుము. మమ్ము సభలోనికిఁ జొరనీయక ద్వారపాలకుం డడ్డుపెట్టుచు నున్నాఁడు. ఆవంది యెక్కడ నున్నవాఁడు? వానిని మాకుఁ జూపుము" అని పెద్దగొంతుతో నుడువఁగా జనకరా జాబాలునితో నిట్లనియె. నీవు పరునిబలము దెలియక వందిని జయింపఁ గోరుచున్నావు. ప్రఖ్యాతబలు లగువారిట్లు చెప్పుట తగును. తొల్లి యిటకువచ్చినవిప్రులు వందియొక్క సామర్థ్యము నెఱుఁగక వానితో వాదింపఁ బూని, వాని జయింపఁజాలక, సూర్యునికాంతిచే మఱుఁగుపడిన నక్షత్రములువోలెఁ దేజోహీనులై యున్నవారు. నీ విప్పు డాతని జయింపఁగోరుట కేవలమోహముననే కాని, వేఱు కారణంబునఁగాదు. నీవును నతనిఁ జయింపఁ జాలక యవమానపడుదువు. నాయనా, ఇంతకుము న్నెందఱో యతని గోరిరి. అట్లుండ నీ వెట్లు నీసభయం దతని నోడింపఁగలవు? అనఁగా నష్టావక్రుండు రాజునకిట్లనియె. నరపాలా! వంది యెన్నడును నాయంతటివానితో వాదము

గావించియుండఁడు. ఎవరినో విద్యలు సక్కఁగ నేరనివారిని నోడించి నంతనే తన్ను విద్వాంసునిఁగా భావించి దనకంటె నెక్కుఁడైనవారలు లోకమున లేరని నిర్భయముగా నీసభయందుఁ దాను మహావిద్వాంసుండుంబోలె నిర్భయుండయి పలుకుచున్నాఁడు. స్వల్పకాలమైనను నాతో వాదము వంది సలుపునేని వాఁ డేమగునో యది నీ వెఱుంగఁగలవు. నన్ను బాలుం డని యనాదరింపకుము. వేయేల? యిరుసువిఱిగినబండి దారిఁ గూలినట్లు వాదమున వంది నా కెదుట నిలువక యోడుట నిక్క మనఁగా విని జనకరా జష్టావక్రునితో నిట్లనియె. ఆఱుబండికంటికడకమ్ములు, పండ్రెండిరుసులు, నిరువదినాలుగుగణుపులును, మున్నూటయఱువదియాకులుం గలిగినచక్రముయొక్క స్వరూపము నెఱిగినవాఁడే గొప్పపండితుఁడు. నీ వెఱుఁగుదేని చెప్పు మనఁగా నష్టావక్రుఁడు రాజుతో నిట్లనియె. ఓరాజా, ఇరువదినాలుగు పక్షము లను నిరువదినాలుగుగణుపులును, నాఱుఋతువు లనెడి యాఱుబండికంటికడకమ్ములును, పండ్రెండు నెల లనెడి పండ్రెం డిరుసులును గలిగి మున్నూటయఱువదిదినము లనెడి మున్నూటయఱువది యాకులు గలదై యెల్లప్పుడు తిరుగుచుండుకాలచక్రమునందు నీ వొనర్చుధర్మము నిన్ను రక్షించుఁగాక. అని యష్టావక్రుఁడు చెప్పఁగా రాజు విని వెండియు నాబాలు నీప్రశ్నముల నడిగెను. రథమునకుఁ బూన్చినగుఱ్ఱములమాడ్కిఁ గూడఁ దిరుగుచు డేఁగలవలెఁ దటాలునఁ బడునట్టి వేవి రెండు గలవో, యా రెంటిని దేవతలలో నెవరు గర్భము ధరింతురు? ఆ రెండును దేనిని బుట్టించుచున్నవి? అని జనకుఁ డడుగఁగా, నష్టావక్రుం డిట్లనియె. పూర్వోత్తరారణు లొండొంటితోఁ గలిసి యుండియే యగ్నిని గర్భమునఁ దాల్చి, వాయుసంయోగముచే నేయగ్నిని పుట్టించునో యట్టియగ్ని మీశాత్రవులకైనఁ గలుగకుండును గాకయని యష్టావక్రుఁడు ప్రత్యుత్తర మొసఁగెను. అంత జ్ఞాని యగు జనకుండు 'ఎయ్యది నిదురించు చున్నను గనుమూయ దనఁగా మీనమని యష్టావక్రుండు ప్రత్యుత్తర మిచ్చెను. దేనికి స్వరూప మున్నను హృదయ ముండదు? అని రాజడిగెను. "ఱాతి" కని బాలుఁ డనెను. 'ఎయ్యది పుట్టియుఁ బ్రాణమును బొంద దనఁగా, గ్రుడ్డు పుట్టియుఁ జేత

నత్వ మొంద" దని బాలవిద్వాంసుఁ డనెను. మఱియు రాజు "వేగ శక్తిచే వృద్ధిగాంచున దెద్ది?" యని యడుగ "పఱు," అని యష్టావక్రుం డనెను. అంత జనకుండు సంతసించి యష్టావక్రునితో నిట్లనియె: అయ్యా! నీవు మనుష్యరూపమున నుండు దేవతవే. కొండిక వయస్సున నా ప్రశ్నల కన్నిటికి సమ త్తరముల నిచ్చితివి. నీవు విద్వాంసుండవు. ఈసభ నీప్రవేశంబుచే నలంకరింపఁబడును గాక. నీవాక్కు లమోఘంబులు. నీవు జ్ఞానవృద్ధుఁడవు. ఓ దేవసత్త్వుఁడా, నిన్ను మానవమాత్రునిఁగా నెంచను. నీవు బాలుఁడవు గావు. నేను నిన్ను వృద్ధునిఁగా నెంచెదను. వాగ్వాదంబున నీతో నెన యగువాఁడు లేఁడు. నీవు యజ్ఞశాలలోనికిఁ బ్రవేశింపుము. నీ కడ్డంకి లేదు. అని జనకనృపాలుఁడు పలుకఁగా 'ఓ నృపాలా, ఈసభకు విచ్చేసియున్న సాటిలేని యుగ్రసేనసము లగు నృపాలురలో హంసవివాదులంబోలినవాదు లెవరో నే నెఱుఁగఁజాలకున్నాను.' 'ఓవందీ, నీ వెట నున్నావు?' అని నదీప్రవాహంబునొందిన దరిద్రునివలెను, మండుచున్నయగ్నిమధ్యముఁ జొచ్చినవానిపగిదియు నాతో వాదించి, నీట మునిఁగి తప్పించుకొని పోనేరవు. ఓరీ వందీ, నా యెదుటఁ గదలక నిలుము.

అని యష్టావక్రుండు పలుకఁగా, వంది యతనితో నిట్లనియె.—ఓరీకుఱ్ఱఁడా, గుహలో నిద్రించునురగంబును గాలితోఁ ద్రొక్కి దాని పడగపై మోది దానికాటునుండి తప్పించుకొని పోలేవు. ఇది చక్కఁగా నెఱుఁగుము. ఎవఁడు చక్కఁగా బలిసియు, చేవలేనివాఁడై పర్వతము మోఁదునో, వానిచేయియు గోళ్లును గాయపడునే కాని, యాపర్వతమున కించుకేనియు గాయంబు దగులదుసుమా యని వంది పలుకుచున్నను, నష్టావక్రుఁ డాతనిమాటలను వినియు విన నట్లుండి రాజులఁ జూచి, 'ఓనృపాలా, మైనాకునకుఁ బర్వతంబులవలెను, నెద్దునకు దూడలు వోలె నీరాజు లెల్లరు ను నీకుఁ దీసినవారలె. మహేంద్రుఁడు వేల్పులలో నెట్లు మేటియో, నదులలో నెల్ల గంగ యె ట్లుత్తమమో యట్లు రాజులలో నెల్ల నీ వుత్తముఁడవు. ఓనృపాలా, ఆవందిని నాయెదుటికి రప్పింపుము,' అని యిట్లు రాజుతోఁ బలుకుచుఁ బండితగోష్ఠియందు

గర్జిల్లుచుఁ గోపాటోపంబు గదుర వందిని గాంచి 'ఓరీ, మొదట నాపలుకులకు బదు లొసఁగుము. తర్వాత నీప్రశ్నల కుత్తర మిత్తు' నని యష్టావక్రుఁడు పల్కుచుండఁగా, వంది యాతనిమాటలను సరకుసేయక వానితో నిట్లనెను. అగ్ని యొక్కటె పెక్కు తెఱఁగుల వెలుఁగును. సూర్యుఁ డొక్కఁడె ముజ్జగంబుల వెలుఁగఁజేయుచున్నాఁడు. దేవేంద్రుఁ డొక్కఁడె యద్వితీయశూరుఁడై శత్రువులను బరిమార్చి తేజరిల్లుచున్నాఁడు. యముఁ డొక్కఁడె పితరుల కెల్లఁ బ్రభువై యున్నాఁడు అని యేకసంఖ్యగలవానిని వంది పలుకఁగా నష్టావక్రుఁడు 'ఇంద్రాగ్నులొండొరులు గూడి సంచరింతురు. పర్వతనారదమహర్షు లెప్పుడును గూడియుందురు. అశ్విదేవతలు జతగాఁగూడి యుందురు. భార్యాభర్తలు జతగా నుండునట్లు బ్రహ్మవిధించెను. బండికి రెండుచక్రములు గలవు. అని రెండు రెండుగా నున్నవానినిజెప్పెను. అంత వంది త్రిత్వసంఖ్యావిశిష్టములగువాని నిట్లనియె. ఈ ప్రపంచమందలి జంతువులు సాత్త్వికరాజసతామసము లను త్రిగుణములతోఁ గూడినవై పుట్టుచున్నవి. వేదములు మూఁడును గూడి వాజపేయ మనుయాగమును నెఱవేర్చుచున్నవి. అధ్వర్యూద్గాతృహోతలు పశుసోమేష్టిరూపంబులైన యాగములను నిర్వహించుచున్నారు. లోకంబులు మూఁడనియు, జ్యోతిస్సులు మూఁడనియుఁ జెప్పుదురు. అని వంది పలుకఁగా నాశ్రమములు నాలుగును బ్రాహ్మణులకు ముఖ్యములు. బ్రాహ్మణాదులగు నాలుగువర్ణములవారును నీయజ్ఞములను జేయుదురు. అట్లే నాలుగుదిశ లనియు, వర్ణములు నాలు గనియు, గోవు చతుష్పాత్తనియుఁ జెప్పఁబడినది యని యష్టావక్రుఁడు చతుస్సంఖ్యగలవానిం జెప్పెను. అంత వంది యగ్నులైదనియు, పంక్తిచ్ఛంద స్సయిదుపదములు గలదనియు, నిత్యయజ్ఞము లయిదనియు, నింద్రియంబు లైదనియు, వేదమున నప్సరస పంచచూడ యని చెప్పఁబడె ననియు, లోకంబునఁ బంచనదము పుణ్యప్రదముగాఁ జేర్కొనఁబడిన దనియు వంది యైదు సంఖ్యలు గలవానిని జేర్కొనెను. అంత నష్టావక్రుఁ డాఱుసంఖ్యలు గలవాని నిట్లనియె. ఓవందీ, యాధానమున నాఱు దక్షిణ లనియందురు. ఆఱుఋతువులె కాలచక్రము. మనంబుతోఁ జేరి యాఱు

జ్ఞానేంద్రియములు. కృత్తిక లాఱు. సాద్యస్కము లాఱని సకలవేదములందుఁ జెప్పఁ బడినవి. అని యాఱుసంఖ్యలుగలవాని నష్టావక్రుఁడు పలుకఁగా, వంది యేడుసంఖ్యలు గలవానిఁ జెప్ప నారంభించెను. గ్రామ్యములయిన యేడు పశువులును, వన్యములైనయేడుపశువులును, నేడు ఛందస్సులును జన్నములను నడుపుచున్నవి. ఋషు లేడ్వురు, పూజ లేడు, వీణ యేడుతంతులు గలది యని సప్తసంఖ్యాకములైన వానిని జెప్పెను.

మఱల నష్టావక్రుండు వందిం గాంచి, యెనిమిది కోణము లొక శతమానమును వహించెడి. అట్లె యష్టపాదమగు శరభంబు సింహముఁ జంపునది. దేవతలలో నష్టవసువు లనువా రున్నారు. యజ్ఞము లన్నిటి యందును యూప మష్టాశ్రి (ఎనిమిదియంచులుగలది) యని విధింపఁబడినది. అని యెనిమిదిసంఖ్యలు గలవానిని జెప్పెను.

అంత వంది నవసంఖ్యగలవానిఁ జెప్పఁబూని, పితృదేవతలకు సామిధేనుల నెడి ఋక్కులు తొమ్మిది. విసర్గము తొమ్మిది తెఱఁగులగు యోగము గల దందురు. బృహతీఛందస్సు తొమ్మిదియక్షరములు గలది. యోగము సదా తొమ్మిది తెఱఁగులయినది యని యందురు. అని నవసంఖ్యగలవానిం జెప్పెను.

అంతట నష్టావక్రుఁడు పది సంఖ్యలు గలవానిఁ జెప్పఁ బూని లోకమున మానవునకుఁ గల యవస్థలు పదియే. వేయికి నూర్లు పదియే. స్త్రీలు గర్భమును దాల్చునది పదినెలలే. ఏరకములు పది. దాసులు పదుగురు. దాశార్హులు పదుగురు అని పది యనుసంఖ్య గలవానిని జెప్పెను.

ఏకాదశినులగు పశువులు పదునొకండు. యూపములు పదునొకండు. ప్రాణభృత్తులకుఁ గలుగువికారములు (మార్పులు) పదునొకండే. దేవతలలో రుద్రులును పదునొకండుగురే. అని వంది పదునొకండుసంఖ్యలు గలవానిం జెప్పఁగా, నష్టావక్రుఁడు పండ్రెండు సంఖ్యలుగలవానిని జెప్పఁ బూనెను. సంవత్సరమునకు నెలలు పండ్రెండు. జగతీఛందస్సున నొక్కపాదమునకుఁ బండ్రెండేసి యక్ష

రములు. *ప్రకృతిసంబంధమైనయాగము పండ్రెండుదినములలోఁ జేయునది.' పండితులాదిత్యులు పన్నిద్ద అందురు. అని యిట్లష్టావక్రుఁడు పలుకఁగా వంది పదుమూఁడుసంఖ్యలు గలవానిం జెప్పఁగోరి, మహోగ్రతిథి త్రయోదశి యనఁబడును. భూమి పదుమూఁడుద్వీపములు గలది యని యొకశ్లోకమునఁ బూర్వార్థము మాత్రము చెప్పి, పదుమూఁడు సంఖ్యగలపదార్థములు తోఁపమిఁబై నేవియుఁ జెప్పలేక యూరకుండెను. అంత నష్టావక్రుఁడు తాను వందిశ్లోకమున నుత్తరార్థమును బూరింపఁగోరి, కేశియనువాఁడు పదుమూఁడుదినములు సంచరించె ననియుఁ, త్రయోదశము మొదలగుఛందస్సు లతిచ్ఛందస్సులని పేర్కొనఁబడు నని యిట్లుత్తరార్థమును బూరించెను.

ఇట్లష్టావక్రుఁడు శ్లోకమును బూర్తిసేయఁగా సూతపుత్త్రుఁడగు వంది నోరు మూసికొని తలవంచియుండుటయు నష్టావక్రుఁడు శ్లోకము పూర్తిచేయుటయుఁజూడ, నచ్చటిసభ్యులలో గొప్పకల్లోలము పుట్టెను. అట్లు జనకరాజుసభయందు దొక్కగొప్ప గడిబిడి కలుగఁగా నచట నున్న విద్వాంసు లగు విప్రు లెల్లరును జేతులు దోయిలించి, యష్టావక్రునిఁ గొనియాడుచు నతనికడ కేతెంచిరి.అంత నష్టావక్రుండు విద్వాంసులను జూచి, తొల్లి వంది పండితులను వాగ్వాదమున నీట ముంచివేసెను. ఇప్పుడు దానికి ఫలముల ననుభవించునుగాక. వీనిం గట్టి నీట ముంపు మని రాజుతో ననెను. అప్పుడు వంది జనకనృపాలునిఁ గాంచి, 'ఓ నృపాలా! నేను వరుణరాజుపుత్త్రుఁడను. మాతండ్రి దశవార్షికంబగు యాగంబును బ్రారంభించియుండెను. ఆయాగమునిమిత్తమే విప్రులను బెక్కండ్రను వరుణలోకంబునకుఁ బంపితి. ఆయాగము పూర్తియైనది. ఇదిగో వరుణలోకంబునుండి విప్రులు మరలి వచ్చుచున్నారు. ఈతనిమూలమున నాకు మఱలఁ దండ్రికడ కేగునదృష్టము సంభవించినది. కావున నీపూజనీయుఁ డగు నష్టావక్రునిఁ బూజించెదను' అనెను.

---

* యాగములు ప్రకృతి, వికృతి యని రెండువిధములు. అందుఁ బ్రకృతియాగములు ప్రధానములు. వికృతు లప్రధానములు. వీనికి ద్రవ్యదేవతాదులు లేవు. వీనిని ప్రకృతియాగమునుండి కైకొనవలయును.

అష్టావక్రుఁ డిప్పలుకులు వినిసదసద్వివేచనశీలు రగు పండితులారా! మున్నా వంది,యుచ్చైస్స్వరముగల వేదపాఠమునుబట్టియు నూహాపోహ లనుబట్టియుఁ బండితులను జయించెను. అట్టివాని వాక్యము నే నిప్రుడు కుతర్కార్ణవమునుండి యుద్ధరించుటను బరికింతురుగాక. అగ్ని స్వాభావిక ముగా దాహకశక్తిగలదైనను,సుజనదుర్జనులవృత్తముల నెఱిఁగినది కాన, సజ్జనులశరీరములను విడిచి, యనృతములు పలుకువారిశరీరములను నెట్లు దహించునో, యాలాగే సజ్జనులును బాలురందును, బిడ్డలందును, దీను లందును బక్షపాతము గలిగియుందురు గావున నామాటలను బాలవా క్యము లని యలక్ష్యము చేయక విందురుగాక. అని పలుకఁగా నూరకు న్నరాజుం జూచి ఓరాజా! వేగికాయ దిని, చురుకుఁదనము లేనివాఁడవై నామాట వినవా? లేక వీనిపొగడ్తలు నిన్ను మైమఱపించుచున్నవా? నేను బురికొల్పుచున్నను మదపుటేనుఁగుమాడ్కి నామాట విననట్లేల యున్నావు? అనఁగా నృపాలుఁడు నీయమానుషమైన దివ్యవాక్కును వినుచునేయున్నాను. నీవు దేవతారూపుఁడవు. వందిని వాదంబున గెలి చితి వన నిదిగో నీయానతిచొప్పున నీవందిని నీట ముంచెదను. అన విని నృపాలా! ప్రాణములతో నున్నవీనివలన నేమియు నుపయో గంబు లేదు. వీనిని వెంటనే నీట ముంపుము. అని యష్టావక్రుఁడు రాజుతో ననెను. అది విని వంది నే నిందులకు వెఱువను.నాప్రత్యర్థియైన యీ బాలవిద్వాంసునితండ్రి కహోళుఁడును వానివెంట నాచేఁ బరాజితులై నీట ముంపఁబడినవారును నిదిగో వచ్చుచున్నారు. అనఁగా నింతలో వా రందఱు వరుణుఁడు గావించిన సత్రయాగమున సత్కృతులై జలంబులనుండి వెడలి వచ్చిరి. అప్పుడు కహోళుండు పుత్త్రుండైన యష్టావక్రునిఁ గాంచి సభాసదులైన విద్వాంసులు మెచ్చెలను చుండ సంతసించి యట్టివాఁడు తనకు సుతుండైనందుల కుప్పొంగుచు, జనకమహారాజువంకఁ దిరిగి యిట్లనియె. నరేంద్రా! నే సాధింప వచ్చిన కార్యంబు నేను గాకున్నను నాసుతుం డద్దాని నెఱవేర్చెను. నీయజ్ఞ మున దేవతలు హవిర్భాగంబులఁ దృప్తులయిరి. సామంబు లెస్సఁగా గానంబు గావింపఁబడియె. ఇంద్రాదిదేవత లపరిమితానందమున నోల లాడుచున్నారు. నీకు స్వస్తి యగుఁగాక యని సుతుం దోడ్కొని నిజా

శ్రమంబునకుఁ జనియె. అంత వంది జనకరాజానుమతుం డై వరుణ లోకంబునకు నేఁగె. అట కహోళునివెంట నష్టావక్రుండును వాని మేనమామ యౌద్దాలకుం డగు శ్వేతకేతువు నుద్దాలకునియాశ్రమంబు నకుఁ బోయిరి అచ్చోట కహోళుండు భార్యయైన సుజాతసమ్ముఖం బున సుతునియుత్తమసామర్థ్యంబును మెచ్చి సుజాత సూచుచుండఁగ నష్టావక్రుని సమంగ యను నేట మునుంగ నియమింప వాఁ డట్లు చేయఁగా వానియంగములవక్రత్వము దొలఁగిపోయెను. అట్లు సమాంగనులు గలిగి యేటియందుండి వెడలివచ్చి తల్లికిఁ గనులపండు వొనర్చె. కావున నోధర్మరాజా! నీ వీసమంగానదియందుఁ దమ్ముల తోడను భార్యతోడను మజ్జనము సేయుము. అని చెప్పఁగా రోమశు వచనముల నాదరించి వా రట్లు కావించిరి. పిదప వారందఱు రోమ శునివెంట నితరము లగు తీర్థముల సేవింపఁ బ్రయాణమైరి. అట్లు సమంగానదీతీరంబున వారు ప్రయాణమై పోవుచు దారియందు మధుబిలతీర్థమును గాంచిరి. పిదపఁ గర్దమిలతీర్థముం జూచిరి. అప్పుడు రోమశుం డిట్లనియె. ధర్మనందనా! యీకర్దమిలతీర్థమున భరతుండు పట్టాభిషిక్తుండయ్యె. దీనియందుఁ గృతావగాహుండై దేవేంద్రుండు వృత్రవధపాతకమును బాసెను. ఇది మైనాకకుక్షి. ఇచ్చోట వినశన తీర్థరాజంబు కలదు. ఈతీర్థమునందు నిత్యస్నాతుఁడై యదితి పుత్రార్థంబు తపంబుఁ గావించె. ఈపర్వతము నెక్కినవారు లక్ష్మీకటాక్షముం బొందుదురు. నీవు నట్లు గావింపు మనఁగా రోమశునియాజ్ఞను ధర్మ జుండు సలిపె. అంత వారు కనకఖలపర్వతప్రాంతముల కేఁగిరి. అచ్చోట సమదభంగయై గంగ ప్రవహించుచుండె. దానిసమీపమునఁ బుణ్య ప్రాదం బొండు గలదు. అందుఁ దొల్లి సనత్కుమారుండు కృతస్నానుం డై సిద్ధుం డయ్యెను. అన విని వారు భృగుతుంగముం జేరిరి. అచ్చోట పయోష్ణినది గంగతో సంగమించును. ఆసంగమమున స్నానమాచరించి రోమశునితో ధర్మజుండు స్థూలశిరసునియాశ్రమముఁ జేరెను. ఆ యాశ్రమమును జొచ్చినవారు రాగద్వేషవినిర్ముక్తు లగుదు రని రోమ శుండు సెప్పె. వెనుక రైభ్యమునియాశ్రమమును జొచ్చిరి. అప్పుడు రోమశమహాముని ధర్మరాజుతో నిట్లనియె. ఈరైభ్యాశ్రమంబున భర

ద్వాజపుత్త్రుండైన యవక్రీతుండు నిజప్రాణములఁ గోల్పోయి మరల
సప్రాణుం డయ్యె. అని చెప్పఁగా ధర్మజుండు రోమశమహర్షిని నా
యవక్రీతచరిత్రమును సాంతముగాఁ దెలుపు మని యడుగ నారోమశుం
డిట్లనియె.

### యవక్రీతునిచరిత్రము

పూర్వకాలమునందు రైభ్యుఁ డనువాఁడును భరద్వాజుం డను
వాఁడును నిరువురు ఋషులు తపోధనులు మిక్కిలి స్నేహమున
మెలంగుచుండిరి. వారిలో రైభ్యుం డతులతపోవిద్యామహిమమున
విఖ్యాతయశస్కులైన యర్వావసుపరావసు లను పుత్త్రద్వయంబుతో
మునులయాదరణముం బడసియుండ భరద్వాజునిపుత్త్రుండయిన యవక్రీ
తుం డనువాఁడు వారికీర్తి కోర్వలేక వారికంటెఁ దాను విద్యాధికుం
డుగాఁ దలఁచి తీవ్రతపంబుఁ జేయఁ దొడంగె. ఆతపంబునఁ బొడమిన
యగ్నిజ్వాలలకు దేవత లోర్వలేక యింద్రుఁ బ్రార్థించి యవక్రీతుకోర్కి
నెఱుంగు మని వేడిరి. అంత నింద్రుండు యవక్రీతుతపశ్శాల కేఁతెంచి
"అయ్యా! ఇట్లేల దుష్కర మగుతపస్సు నాచరించుచున్నవాఁడ"
వనఁగా యవక్రీతుం డిట్లనియె. పాకశాసనా! వేదముల నభ్యసించు
టకు గురుకులవాసము బహుకాలము ప్రయాసముఁ జేయవలయును.
దానినిమిత్తము శరీరాయాస మెక్కువ యగును. అట్లు గాకుండ
బ్రాహ్మణవర్ణజాతు లైనవారికి వేదము లన్నియుఁ గ్లేశము లేక తమం
తట నవి స్ఫురించునట్లుగాఁ దపమాచరించుచున్నాను. అనఁగా నింద్రుండు
వాని కిట్లనియె. అయ్యా! ఇయ్యది వేదగ్రహణమునకు సన్మార్గము
గాదు. తపస్సుఁ జాలించి గురువుం జేరి శుశ్రూషఁ గావించి వేదములఁ
బడయుము. అని చెప్పి స్వర్గమున కేఁగెను. యవక్రీతుండు పాకశాస
నునియాలోచనముఁ గొనక వెండియుఁ బూర్వముచొప్పున ఘోర
తపమునకుఁ దొడఁగఁగా నింద్రుండు కడు భీతి నొందె నని మేము
వింటిమి. అట్లుగ్రతపం బొనర్చుచున్న యవక్రీతుకడ కేఁగుదెంచి, యిం
ద్రుఁడు వెండియు 'యవక్రీతుఁడా! నీవు సాధింప నలవి కానిపనికిఁ
బూనితివి. నీ కిది తగదు. వేదములు తమంతట నీకును నీతండ్రికిని

మాత్రము స్ఫురించు ననఁగా నష్టావక్రుఁడు మఘవాసునితో నిట్లనియె. మహేంద్రా! నాయభీప్సితం బొడఁగూర్పవేని యీయగ్నియం దుతికి శరీరత్యాగంబు గావించెద నని మూర్ఖపుంబట్టుఁ బట్టఁగా నింద్రుం డీ మూర్ఖు నుపాయంబున వానిపట్టునుండి తొలఁగునట్లు చేసెదఁగాక యని మనస్సున నిశ్చయించుకొని మహావ్యాధిచే బీడితుండైన యొక ముదుసలి బ్రాహ్మణవేషమును దాల్చి, యవక్రీతుండు నిత్యము స్నానమునకు వచ్చు గంగాతీరమునందలి రేవునొద్ద జేరి యామహానది కడ్డముగా పిడికిలితో నిసుకను దెచ్చి పోయుచుండెను. దానిని యవక్రీతుండు వీక్షించి యోవిప్రవరా! ఇది యేటియుద్యమము ?అనఁగా నావిప్రుండు "ఓతాపసవర్యా! ఇయ్యది మహానది. జనులు దీనిని దాఁటుటకు మిక్కిలి కష్టపడెదరు. వారికి సుకరముగ నాపిడికిళ్ళయిసుకతో సేతువుఁ గట్టెద ననెను. అప్పుడు యవక్రీతుఁ డామాటను విని యావిప్రున కిట్లనియె. ఓమూఁడుకాళ్ళముదుసలీ! ఇయ్యది యసాధ్యమగు. వేఱొక కార్యమును దలపెట్టుము. అనుటయు వృద్ధవిప్రవేషధారి యగు నింద్రుండోహో! నీవు నీతపస్సున విప్రుల నెల్లవారిని బుట్టుకతోడనే వేదవిద్యాభ్యాసులనుగ నొనర్పఁగలవేని నేనీ యిసుకతో భాగీరథికి సేతువును గట్టలేనా ? యని చెప్ప యవక్రీతుం డాముదుసలిబ్రాహ్మణు నింద్రుంగా గుర్తించి యో శునాసీరా! నే నెల్లరను వేదజ్ఞానులఁ గావింప లేనైతి నేని నన్నును నాతండ్రిని మాత్రము వేదజ్ఞులుగ ననుగ్రహింపవే యని వేఁడెను. అంత నింద్రుండు యవక్రీతునభిమతంబు నొసంగి దివంబున కేఁగెను. యవక్రీతుండు తనకోర్కులు వడసి తండ్రిపాలికిం జని"అయ్యా! మనయిరువురకు వేదజ్ఞానమును దపోబలమున సాధించితిని. ఆఖండలువరప్రసాదముచే నే నెల్లవారికంటె విద్యాధికుండనైతి నని చెప్పఁగాఁ గొడుకునకు భరద్వాజుఁ డిట్లనియె. పుత్రకా! వరమును బొందితి నని గర్వింపకుము. గర్వితుఁడయినవాఁడు కొంతకాలమునకె బాలధిపుత్రునివలె నశించు నని చెప్పెను. ఆకథను సవిస్తరంబుగాఁ జెప్పు మని యవక్రీతుం డడిగిన వతనికి భరద్వాజుం డిట్లనియె.

## బాలధియను వానిపుత్త్రుండు వరలబ్ధబహుకాల జీవితుండై గర్వించి శప్తుండై చచ్చుట

తొల్లి బాలధి యను ఋషీశ్వరుండు పుత్త్రశోకంబునఁ బెద్దకాలంబు తపం బొనర్చి దేవతలయనుగ్రహంబుఁ జెందె. అప్పుడు వార్లు బాలధిని వరము వేఁడు మనిరి. అంత నమర్త్యుఁడయినపుత్త్రుఁడు కావలయునని దేవతలకు బాలధి కోరెను. దేవతలు మర్త్యున కమర్త్యత్వంబు సిద్ధింపదు. చిరకాలజీవిత్వము వరప్రభావమున సిద్ధించు. నిమిత్తవిశేషంబులచే వాఁడు మరణించు. అనఁగా బాలధి యోనిర్జరులారా! ఈ సమీపమున నుండు నీపర్వతములు క్షయముగాకయుండునంతకు జీవించియుండు కుమారు ననుగ్రహింపుఁ డని వేఁడెను. అంత వారు వల్లె యన్ని నాకంబునకుఁ జనిరి.

అంత బాలధికి మేధానిధి యనుకుమారుఁడు కలిగెను. వాఁడు దినములపేరిటఁ బెరిగి పెద్దవాఁడై వరగర్వంబున నేరిని మెచ్చక ఋష్యాశ్రమంబులఁ జొచ్చి ఋషుల నవమానించుచుఁ దిరుగుచు నొక్కనాఁడు ధనుషాక్షుం డనుఋషి నవమానించె. అంత నమ్ముని మేధావిని బూడిదె కమ్మని శపించి తనశాపమున వాఁడు భస్మము కాని కారణం బరసి వానివినాశమునకుఁ బర్వతములయున్మూలనమునిమిత్తమై తనతపోమహిమంబున మహిషంబుల సృజియించి వానిచే నాపర్వతములను భేదింపఁ జేసెను. ఆకొండలు భిన్నములు కాఁగా నానిమిత్తమున మేధావి మరణించె. ఈకథ వేదములయందు వినంబడు. కావున నోపుత్త్రకా! వరమహిమంబున గర్వింపవలదు. రైభ్యుండు మహానీయుండు. వానికిఁ గినుక వొడముడు భూమండలంబు దలక్రిందుగఁ జేయనోపు. ఆతని పుత్త్రులును దండ్రియంతటివారలు. కావున గర్వించి యెప్పుడైనను వారిఁ దొడరకుము అనెను. అంత యవక్రీతుం డితరఋష్యాశ్రమంబులఁ జొచ్చి తనవిద్యామహిమను వారికిం జూపుచుఁ గొందఱ నుల్లసంబాడుచుఁ గొందఱ దిసంతుల గొట్టుచుఁ దిరుగుచుండెఁ. కాని రైభ్యునితోఁగాని, యాతనిపుత్త్రులతోఁ గాని యేనాఁడును విద్యామత్సరంబుఁ గాన్పింపక వారియెడఁ దండ్రియాజ్ఞ మెయి వర్తించుచుండెఁ. కాని, యొక్కనాఁడాశ్రమాంతరమునుండి వచ్చుచు, రైభ్యాశ్రమమున కనతిదూరంబున

రైభ్యునిరెండవకోడ లర్వావసునిభార్య యొంటరిగా నుండుటం జూచి
దానిపొంతఁ జేరి తత్సౌందర్యమోహితుఁడై లజ్జ విడిచి దానిం దన్నుఁ
బొందు మని యడుగఁగా నాసుందరాంగి తనయొంటరిపాటునకును, ముని
పుత్త్రుఁడగు యవక్రీతుశాపమునకును వెఱచి యప్పటి కంగీకరించినట్లు
పలికి యచ్చోటి నెట్లో పాసి రైభ్యాశ్రమము సేరి యేకాంతము
నందుఁ దన్ను యవక్రీతుం డాడినతులువమాటలం దలంచి తాను బర
పురుషున కింత యొల్లిదమైతినే యని మోమునఁ జెఱఁగుఁ గప్పి రోద
నంబుఁ జేయుచుండె. అంత రైభ్యుఁడు కోడలియేడ్పునకుఁ గారణం బడిగి
తెలిసికొని తోఁకఁ ద్రొక్కినపాముచందమున నగ్ని హోత్రమును
బ్రణయించి కోపావేశమున నొడ లెఱుంగక యగ్నియందుఁ దనజడ
నొక్కదానిని బెఱికి వ్రేల్చె అంత రైభ్యునిమంత్రబలంబున నగ్నికుండంబు
నుండి యవక్రీతుండు కామించిన రైభ్యుకోడలివంటి సుందరాంగి
యొకతె యావిర్భవించె. అంత వేఱొకజడ వెఱికి యగ్నియందు వేల్వఁగా
దానినుండి ఘోరాకారుం డగు రాక్షసుం డొకఁడు వెడలివచ్చె.
అంత వారిద్దఱు రైభ్యునికట్టెదుట వినతులై నిలుచుండి మునీంద్రా!
మీ కేకార్యము వలయునో యానతిం డనఁగా రైభ్యుండాయిరువ్వురుని
యవక్రీతు వధించి రండనెను. వారు వల్లె యని యవక్రీతుపాలికిఁ జనిరి.
ముందుగ నాతరుణి చనఁగా దానిం జూచి తాను మున్ను కామించియుం
డిన రైభ్యునికోడలింగా నెంచి దానితో ననుచితమదనప్రలాపము లాడు
చుండ నయ్యది యవక్రీతుకమండలువును మంత్రపూతజలముతో నున్న
దాని నపహరించెను. విప్రున కెప్పుడును స్వపరిశుద్ధ్యర్థమైయుండ వలసిన
జలపాత్రలేమిచే యవక్రీతుం డపరిశుద్ధుండై యుండ నప్పాట నారాక్ష
సుండు యవక్రీతుసమీపించి తనచేత నున్న శూలంబున వానిఁ దాఁకె.
ఆరాక్షసునకు యవక్రీతుండు వెఱచి యేదేని కొలనిలోఁ దలదాఁచుకొను
నిమిత్తమై పాఱుచుండ నేకొలనియందును నీరింకి జలము లేనట్లుండె. అంత
యవక్రీతుండు దన్ను వెన్నంటి శూలముతోఁ బొడుచునిమిత్తము రాక్ష
సుండు వచ్చుచుండఁ దనతండ్రిభరద్వాజునియగ్ని హోత్రము లుండు
ప్రదేశమునకుఁ జొచ్చుటకుఁ యత్నించెను. అట్టియెడ నింటికావలివాఁడు
ను నంధుండును నైన శూద్రుం డడ్డపడఁగా నారాక్షసుండు మిగిలివచ్చి

యవక్రీతుని వీపును శూలముతోఁ బొడిచి చంపెను. పిదప నారాక్ష సుఁడు రైభ్యునొద్దకుఁ బోయి యవక్రీతుచావును జెప్పఁగా నాఋషి యాతరుణి నారాక్షసునకు భార్యఁగా నొసంగ వారు యథేచ్ఛఁ జనిరి.

అంతఁ గొంతసేపటికి భరద్వాజుండు కాలోచితాహ్నికములఁ దీర్చికొని ఫలములను, దర్భలను, సమిత్తులను గొని యాశ్రమంబు సమీపించి యగ్నిహోత్రగృహముం జేరి యగ్నిఁ బ్రణయింప నయ్యది యెప్పటియట్ల ప్రత్యుత్థానంబుఁ జేయమికి జింతిల్లి యింటిసేవకుఁడగు శూద్రుని తన్నిమిత్తం బడిగెను. అంత నాయంధుండైన వృద్ధుండు భర ద్వాజుకొమరుని రైభ్యసృష్టుండైన రాక్షసుం డొక్కఁడు వధించె నని చెప్పి వానిశవమున్న చోటికిఁ గొంపోయి చూపెను. అంత భరద్వాజుం డాశవముం జూచి యతిచింతాకులమానసుండై యిట్లని వాపోయెను, అయ్యో! నాకొడుకా! నీ కీగతి కలిగెనే? నేను నీకుఁ దొలుతనే రైభ్యుని జోలికిఁ బోవలదని ఖండితముగాఁ జెప్పియుంటి. వాఁ డతికోపనుండు; ఇంచుక తప్పునైన క్షమించువాఁడు కాఁడు. కడు వృద్ధుఁడనైననా కీవృద్ధా వస్థలో నూఁతగఱ్ఱగా నొక్కని నిన్ను దైవమిచ్చియుండ నందుల కోర్వక రైభ్యుండు ని న్నీగతికిఁ దెచ్చె. విప్రుల కందఱకుఁ బుట్టుకతోనే వేద జ్ఞానంబు కలుగునిమిత్తము ఘోరతపస్సు గావించినలోకోపకారివి నీవు. నాతండ్రీ, నీవిప్పుడంతకుపురము సొచ్చితివి. నన్నుఁ గాపాడుదువని తలం చితి. అయ్యో! పాపిష్ఠదైవమా! నన్నీ వృద్ధావస్థయం దేకపుత్రమ రణజనితశోకము ననుభవింపఁ జేసితివే? యని పుత్త్రుఁ బనవి శోకిం చుచు, రైభ్యుం డెంతక్రుద్ధుం డయ్యెనో చూడుఁడు. నా కేకపుత్త్రుఁ డని రైభ్యుఁడు గొంత శాంతి వహింపరాదో! ఈపుత్త్రశోకమును నేను సహింపలేను. నేనును నాపుత్త్రు వెంట నీశరీరముం దొఱంగి కాలుని పురి కేఁగెద. నా కిట్టిచేటుఁ దెచ్చిన రైభ్యుండు తనజ్యేష్ఠపుత్త్రునిచే వధింపఁబడి చచ్చుఁగాక! యని శపించి మఱియు నిట్లనియె. లోకమున మృతపుత్త్రులకంటెఁ బుత్త్రులు లేకుండుటయే మేలు. కన్నకడుపు దుఃఖ మును సహింప నోపక లోకులు యుక్తాయుక్తవిచారమును వదలి చిర కాలమిత్త్రులచేతుఁ గూడఁ గోరుదురు. రైభ్యునితో నెంతకాలమో చెలిమిగలిగియుంటి. వాని నీదుస్సహామైనచింతకు నోర్వ లేక శపించితి.

ఇంతకంటె నన్యంబైనపాతకం బొండెద్ది కలదు? యని దీనుండై పుత్త్రుం దలఁచి తలఁచి వాపోయి యా పుత్త్రకళేబరమును దహించి వెంటనే తానును జితిఁ జొచ్చె.

అప్పుడు బృహద్ద్యుమ్నుం డనురాజు సత్త్రయాగంబుఁ జేయఁ బూని తనయజ్ఞంబునకు రైభ్యపుత్త్రు లర్వావసుపరావసువుల నిరువురను యాజకులనుగాఁ బ్రార్థించి రైభ్యననుమతి వడసి వారిని దోడ్కొనిపోయియుండె. ఆశ్రమంబున రైభ్యుఁడును నర్వావసుని భార్యయు నుండిరి. అంత నొక్కనాటిరేయి పరావసుఁ డొక్కకారణమున యజ్ఞవాటిక వదలి తనయాశ్రమంబునకు మఱలి వచ్చువాఁ డాశ్రమము చెంతఁ గృష్ణాజినంబుఁ గప్పికొని సంచరించుచున్న తండ్రిని జీఁకటియందుఁ గ్రూరమృగం బని తలంచి దాని నొక్కయేటునఁ గొట్టుడు నా దెబ్బకు ముదుకం డైనరైభ్యుండు సచ్చె. అంతఁ బరావసుం డామృత కళేబరంబుపొంతకుఁ జని యయ్యది తనతండ్రిశవం బని గుర్తించి తన కావించిన ప్రమాదంబునకుఁ జింతిల్లి కొంతసేపు ఘోరంబుగా నేడ్చి తుదకు శాంతచిత్తుండై తండ్రికి సంస్కారము నేసి, మఱల నర్వావసు వున్నచోటికిఁ బోయి తమతండ్రి తనచేఁ బ్రమాదంబున వధింపఁ బడుటను జెప్పి తన కాపాదించిన బ్రహ్మహత్యాపాతకంబునకుఁ బ్రాయశ్చిత్తము నతని నొనర్పు మనియు, నతఁ డొక్కరుండ యాయాగంబు నిర్వహింపఁ జాలఁ డనియుఁ దా నొక్కరుండ యజ్ఞముఁ గొనసాగింపఁ గల ననియుఁ జెప్పి యర్వావసుం బంపె. అంత వాఁ డన్నమాటమేరకుఁ దమయాశ్రమంబునకుఁ బోయి క్రమంబునఁ బ్రాయశ్చిత్తంబు గావించి కొని మరల సత్త్రంబునకు రాఁగా బరావసుండు బృహద్ద్యుమ్నునితో నిట్లనియె. రాజా! నాతమ్ముం డగు నీపరావసుండు బ్రహ్మహత్య గావించెను. వీఁడు యజ్ఞశాలఁ జొరఁగూడదు. వీనిని యజ్ఞవాటంబునుండి ద్రొబ్బింపు మన రాజు భటుల నందులకు నియమించె. వారు వచ్చి యర్వావసునిఁ గెంటుచుండఁగా అయ్యా! బ్రహ్మఘాతుకుండను నేను కాను. మఱి మాయన్న గావించిన బ్రహ్మవధకుఁ బ్రాయశ్చిత్తంబు వానికిఁగా నేను జేసి వచ్చితి. ఇంతియ కాని, నే నావధను జేయలే దని యెంత మొఱఁబెట్టుకొన్నను నారాజభటు లామాటలఁ జెడచెవి నిడి వానిం

గొంటఁగా నాయర్వావసుం డేమియుం జేయలేక వనంబున కరిగి సూర్యాభిముఖుండై యుగ్రతపంబు గావించె.

### దేవత లర్వావసునకుఁ గోరినవరంబు లిచ్చుట

అంతఁ గొంతకాలంబునకు దేవత లర్వావసుతపంబునకు మెచ్చి వానికిఁ బ్రసన్నులై వరముల నడుగు మనిరి. అంత నర్వావసుండు రైభ్యభరద్వాజయవక్రీతులఁ బునర్జీవితులఁ గావింపుఁ డనియుఁ, దన యన్న యగుపరావసునకుఁ గలిగిన బ్రహ్మవధపాతకంబుఁ దొలఁగునట్లును వరములు వేడెను. అంత నమరులు వాని కా వరముల నొసంగఁ బునర్జీవితుండైన యవక్రీతుండు వారి నిట్లడిగెను. అయ్యా! నేను రైభ్యుం బోలె జపతపస్స్వాధ్యాయములఁ జేసితి. నేను వానిచే నిప్పాటుఁ బడయ నేల? వానిమహత్త్వ మంత యెక్కుడగుటకుఁ గతం బేమి యని ప్రార్థించి యడుగ వారలు యవక్రీతున కిట్లనిరి. అయ్యలారా! రైభ్యుండు గురుకులవాసముఁ జేసి దీక్షాపరుఁడై బ్రహ్మచర్యంబుఁ సలిపి నియతి మెయి గురుశుశ్రూషాదుల నొనర్చి వేదాధ్యయనంబుఁ జేసి జ్ఞానియై మహత్త్వము గాంచె. నీవు వరప్రసాదంబున వేదంబులఁ బడసితివి. మీ కిరువురకు నిదియ తారతమ్యంబు. వ్రతాచరణంబుచే మహిమ యెక్కుడు రైభ్యన కయ్యె. వానివేదాధ్యయనంబు ఫలవంతమయ్యె వని చెప్పి వారు నాకలోకంబున కేఁగిరి. ఇది యా రైభ్యనాశ్రమంబు. ఇందువసించినవారు సకలపాపవినిర్ముక్తు లగుదు రని రోమశుండు ధర్మరాజునకు యవక్రీతుచరిత్రంబు సాంతముగ నుడివెను. అంత ధర్మరాజు సపరివారుండై రోమశునితోఁ గొంతదూరము పోఁగా రోమశుం డారాజుతో నిట్లనియె. రాజేంద్రా, మన మిప్పుడు శీరబీజమును, మైనాకమును, శ్వేతగిరిని గాలశైలమును గడచివచ్చితిమి. ఇచ్చోట గంగ యేడుపాయ లయ్యెను. దీని నే విరజసం బంద్రు ఈచోట నగ్ని తేజోవంతుఁడై వెలుంగుచుండు. ఈదేశము మానవులకు దృష్టిగోచరంబు కానేరదు. కావున నిది నిర్మానుషంబై యుండు. అల్లదె మందరపర్వతంబు. అది యక్షేశ్వరుండైన మాణిభద్రుని నివాసస్థలంబు. వాఁడు తన్ను బహురూపు లయిన యెనుబదివేవురు గంధర్వులు సదా కొలుచుచుండ నిందు విహరించుచుండు. కైలాస మచ్చటికి నాలుగామ

జనములదూరమున నున్నయది. అయ్యది యక్షరాక్షసగుహ్యకాదు లచే సేవింపఁబడుచుండు కుబేరునినివాసస్థలము. ఈస్థలములలోఁ గ్రుమ్మఱువారు శమదమాదిసంపన్నులును, రాగద్వేషరహితులును, దపోఘనులును నై యుండవలయును. మన మీసంపదలతో నుండియు మనకు భీముబాహుబలమును దోడ్పడవలయును. మఱియు మదీయ మంత్రబలమును మిక్కిలి సాయపడఁగలదు. ఈచోటులం దింత యుపపత్తి యున్నఁ గాని మనము సురక్షితులము కాము. ఇచ్చోట ననేక పుణ్యతీర్థము లున్నయవి. అం దవగాహనంబు సేసినవారు సర్వపాపవిముక్తు లగుదురు. అచ్చోటకి మన మిప్పు డరుగవలయును. ఇంద్రయమవరుణాదిదిక్పాలకులును గంగాయమునాదిపుణ్యనదులును నీకు శుభముల నిచ్చుఁగాక యని ధర్మరాజును రోమశుండు దీవించెను. మఱియును సప్తమరుత్తులును దేవలోకవైద్యు లశ్వులును, నిచ్చటిగొప్పసరోవరములును, నిచ్చట సంచరించు దేవతలును, నసురులును, వసువులును, నిన్ను రక్షింతురు గాక యని రోమశుండు ధర్మరాజునకు రక్ష యొసంగి గంగాభిముఖుండై "ఓజగత్పావనీ! పుణ్యనదీ! గంగాదేవీ! దేవేంద్రునియాటపట్టైన సుమేరువునం దుండి నీప్రవాహవేగధ్వని వినఁబడుచున్నది. నీ వజామీఢునివంశస్థుల కందఱకును బూజ్యురాలవు. కావున నీరాజరాజైనధర్మజు నెట్టివిపత్తుఁ జెంద నీయక నీవ కాపాడవలయును." అని యచ్చోట నుండు సర్వనదీనదములయు, దిక్కులయు, వృక్షములయు, బర్వతములయు నధిష్ఠానదేవతల నుతించి ధర్మరాజుతో రాజేంద్రా! నీ విచ్చోట నప్రమత్తుండవై మెలంగు మని నియమించె. అంత యుధిష్ఠిరుండు తనమనంబున 'రోమశమహర్షి యిచ్చోట మిక్కిలి సంరంభముతో నేల యున్నవాఁడో తెలియరాదు' అని యాలోచించి తమ్ములను నియమమునం దుండునట్లు నియోగించి యందఱిలో నబలయగు ద్రౌపదిసంరక్షణార్థము తగుకా పుంచి భీమసేనున కిట్లనియె. ఓభీమసేనా, కైలాసప్రాంతములనుగూర్చి, రోమశమహర్షి చెప్పిన మహాత్త్వమును వినుచుంటివిగదా? ఈయెగుడుదిగుడు ప్రదేశమును, సకలవిధము క్రూరజంతుసంతాననివాసంబు నైన నిర్జరారణ్యంబునకు నేఁ డును రానేరరు. మన కిప్పుడు మనయర్జుననిసాయమును లేదు. నీవు

మాకును సంరక్షణకర్తవు. కావున మీ రందఱును నిచ్చోటనుండి మఱలి చనుఁడు. నీవును, సహదేవుఁడును, ధౌమ్యుఁడును, దక్కటివిప్రులును, నింద్రసేనాదిభృత్యులును మఱలుఁడు. నేనును, నకులుండును, రోమశమహర్షియు లఘ్వాశులము, నియతవ్రతులమై యాదిదేవుం డగు మహాదేవుని నివాస్థానమైన కైలాసంబునకుం బోయి యామహాదేవుని దర్శించి వచ్చెదము. నీవును నీయాఁకలిదప్పుల నడంచికొని శాంతుండవై, పరాక్రమయుతుఁడవై మెలంగి వీరిని గంటిని ఱెప్పవలెఁగాపాడుచుండుము. మే మీగహనప్రదేశమునకుఁ బోయి మఱలివచ్చునంతకు గంగాద్వారమున నుండుము. అని చెప్పఁగా భీముం డిట్లనియె. ధర్మజా! నామనవి యొక్కింత యాలింపుము. ఇప్పుడు మనతో నర్జునుండు లేఁడు. వానిలేమికి మన మందఱము చింతిలుచున్నారము. ఇప్పుడు మీ రిద్దఱును మమ్మెడఁబాసి రోమశునితోఁగూడఁ బోయినచో మాకు మఱింత వగ గూరఁగలదు. మమ్ము నెడఁబాసి నీవుంటచే నీకును మాస్మరణమునఁ జేసి తీర్థరాజసందర్శనమును, మహాదేవునియాలయంబున దేవదేవుని సందర్శనమును నిరాతంకముగా జరుగనేరదు. ఈబండ్లు, గుఱ్ఱములును భృత్యజనంబును గఠినయాత్ర సలుపలేరని తోఁచుచో వారి నింద డించి మమ్మును మాత్రము నీవెంట రానిమ్ము. నకులసహదేవులును, ద్రోవదియు నడువ లే రని తలంతు వేని నీనిమ్నోన్నతప్రదేశంబుల నే మోచికొని వచ్చెద. వారును ని న్నెడఁబాసి యుండనేరరు. అనఁగా ధర్మజుండు భీముమాటలకు మెత్తవడి యతనిం జూచి, భీమసేనా! నీబలము పెంపొందుఁగాక. ద్రౌపది, నకులసహదేవులు నడువ లేనిచో వీరిని నేన మోతు నని యుత్సాహముతోఁ బలుకుదువు. వీరిని మోయఁగలశక్తి నీకుఁ దప్ప నేరికిఁ గలదు! ఇట్లు నకులసహదేవులను, బాంచాలిని మోయఁగోరిన నీకు బలిమి, యశస్సు, ధర్మము, కీర్తియుం బెంపొందును గాక. ఓదీర్ఘబాహువా, నీకు దారిని నలసట కాని, పరాభవము గాని లేకుండుఁగాక యని దీవింప, ద్రౌపదియు, బకపక నవ్వుచు రాజా! మీవెంట నశ్రమంబున నేనును రాఁగలను. నాకై వగవవల దనెను. అంత రోమశుండు ధర్మజుంజూచి తపంబుపెంపున మన మెల్లరము గంధమాదనంబున కరిగి యచ్చోటికే తెంచు మనయు

ర్జునునిం గలసికొందము. అనఁగా ధర్మజుండు దాని నంగీకరించెను. అంత వారందఱును బాదచారులై పోవుచుండ నా ప్రదేశం బంతయుఁ గిరాతులకును, బుళిందులకును, నింక ననేకాటవికజనసమూహమునకు నిరవై, గజబృంహితములకును హయహేషలకును మాఱుమ్రోఁతలు చేయుభయంకరగుహాలతోను నైసర్గికరామణీయకములతోను నొప్పుచు దేవతాసంచారపవిత్రమార్గములతోను, నొప్పుచుండు నా మహారణ్య మధ్యంబున నొప్పారు సుబాహుఁడను కిరాతరాజు దేశంబుఁ జొచ్చి వానిచే నతిథిసత్కారంబులఁ బొంది, యచ్చోట నింద్రసేనాదిభృత్యులను వంటలవారు మున్నగు సకలసేవకనికరంబును నిలిపి, మఱునాఁడు దయంబున నర్జునునిం జూచువేడ్కతో ధర్మరాజాదులు ముదంబునఁ దొఱలిపోవుచు ధర్మరాజు తమ్ములనుం ద్రోవదిని దేఱిపాఱఁ జూచి భీమాదులతో నిట్లనియె. ప్రాణులకుఁ బురాకృతకర్మనాశము గలుగదు. మన మడవులలోఁ ద్రిమ్మఱుచు నెంతకష్టపడుచున్నామో చూడుఁడు! ప్రాణి దేనికేని నొకయాశఁ బెట్టుకొని ప్రాణములను గంఠగతంబుగ నుంచికొని యుండును. కష్టములఁ బెక్కింటిఁ బడియైనను నీవిషమప్రదేశములలో సంచరించుచు నెవ్విధముననైన నర్జునుని సందర్శించునభిలాషతో నున్న మనమే యిందులకుఁ దార్కాణము. ఇంతవఱకు వాఁడు మనదృష్టికిగోచరుఁడు కాఁడు. ఆతహాతహాయిట్లుండఁ బాంచాలి పడుచుండుక్లేశమును జూడ మనస్సు మఱింత దత్తరపాటు పడుచున్నది. పార్థుఁ జూచుభాగ్యము మన కేనాఁటికిఁ గలుగునో ? వాఁడు మనలను వీడి చని యిప్పటికి నైదుసంవత్సరములయ్యెను. ఆమహామహుం డైన గుడాకేశునినీయైదు సంవత్సరములును జూడకునికి నామనస్సులో వ్యథ యింతింతన రాదు. ఆకురుసింహుని, శత్రుభయంకరుని, యుద్ధవీరుని, వైరికాలాంతకుని, సింహపరాక్రము, నింద్రసూను, శ్వేతవాహనుని, బీభత్సుని, విజయునిఁ, బరమశాంతుని, యోగివరుని, శరణాగతరక్షకుని యుద్ధమున మేటివిలుకానిని, నస్త్రముల నేర్చినవానిని, శత్రుసూదనుని, మహాబలుని, విజయుని, మనపార్థుని నే నెన్నండు కన్నులపండువుగాఁ గాంతునో ! వానిని దేపగాఁ గొని మన మపారమగు నాపత్సముద్రమును దాఁట నున్నాము. రాజసూయయాగమునకు మున్ను వాఁడు గావించినదిగ్విజయ

ముప్పటిధనకనకరత్నవస్తువాహనములను జూచి కదా దుర్యోధనుండు సూపోపక నాతో మాయజూదం బాడి వాని నెల్ల నాచికొని పోత రించియున్నాఁడు. ఆఖండలుఖాండవవనంబు దహించునెడ మయా సురుఁ గాపాడి వానిచే బహుమతిగా నాదివ్యసభను బడసినవాఁడుకిరీటి గాఁడే? వేయిహస్తములతో వెలసినకార్తవీర్యార్జునునంతపరాక్రమ వంతుఁడు గాఁడె మనసవ్యసాచి? సమరకౌశలమున వాసుదేవునకును, దేహదార్ఢ్యమున నీకును బలరామునకు నెనవచ్చువాఁడు మనఫల్గునుఁ డని యెఱుంగవా? దేవతలలోఁ బ్రథముఁ డగునింద్రునియంతటిమాహా త్మ్యము గలవాఁడు పార్థుండు గాఁడె? వీఁడు వేగమున సమీరునికిఁ దేటఁ దనమునఁ జంద్రునికిఁ గ్రోధమున దండధరునికి నెనవచ్చువాఁడు. వాని సుందరాకారంబును, వానిగుణగణములను వర్ణించుటకుఁగాని, లెక్కించు టకుఁగాని యొరులకు సాధ్యమే? వేగమున గంధమాదనముం జేరుదము. నరనారాయణాశ్రమం బగు బదరికావనమును జొచ్చి కుబేరనళినిని వీక్షింతము. అది దివ్యదేశము. వాహనంబుల నెక్కి యీప్రదేశము మెట్టరాదు. పాదచారులమై యట కేఁగుదము. నియతవ్రతుల నచ్చోటి క్రూరమృగంబులు బాధింపవు. కాన మన మందఱమును మితాహారులమై శమదమయుక్తులమై యర్జునునిదర్శనంబు నెదురుచూచుచుఁ గవచముల ధరించి యాయుధపాణులమై చరింత మనెను. అంత రోమశుండు ధర్మ నందనునితో నిట్లనియె.

## పాండవులు గంధమాదనపర్వతంబునకుఁ బోవుట

రాజేంద్రా! నీవును దమ్ములుం ద్రౌపదియు నీయనుచరులతో ననేకపర్వతములను దాఁటితిరి. పురములఁ బ్రవేశించితిరి. పుణ్యనదులను బుణ్యతీర్థములను వీక్షించి యందు స్నానమొనర్చి పూతులైతిరి. ఈప్ర దేశమునఁ గ్రుమ్మరువారు నియతవ్రతులై, సమాధియోగయుక్తులై యుం డవలయును. ఇయ్యది వాలఖిల్యులకును, సప్తర్షులకును, దేవేంద్రుఁడు మున్నగు నమరులకును నిత్యకర్మానుష్ఠానంబులకు యోగ్యంబైన ప్రదే శము. వార లిచ్చోట నంతర్హితులయి సంచరించు చుందురు. ఇయ్యది త్రైలోక్యపావని యగు గంగ. నాకంబునుండి భువి కీపుణ్యగంగ దిగు నపుడిచ్చోట మహాదేవుఁడు దీనిం దలఁదాల్చె. మరీచిభృగ్వాంగిరసపుల

హు లిచ్చోట సామగీతంబులు పాడిరి. సుదరా జిచ్చోట నాహ్నికములఁ దీర్చుకొనుచుండ సంధ్యలు, నశ్వినీదేవతలు వానిని గాంచి యుందురు. ఇచ్చోట రేలుంబవళ్లు సూర్యచంద్రులును నింకను దేజోవంతములైన గ్రహంబులు త్రిజగత్పావని యగు నీభాగీరథి నెల్లప్పుడు సేవించు చుందురు. ఇట వృషభవాహనుఁ డగు నాసర్వమంగళాపతి తనజటాజూటంబునందుండి యీపుణ్యనదిని భూలోకంబున కవతరింపఁజేసె. ఇయ్యది సర్వతీర్థములకును బుణ్యస్థలములకును నుత్తమంబు. పరిశుద్ధమనస్కులతో నీపుణ్యనదికిఁ బ్రణమిల్లుఁడు. అనఁగాఁ బాండవులు స్వర్ణదికి భక్తితో మ్రొక్కిరి. అంతఁ జనువారు ముందఱ కైలాసశిఖరంబుమాడ్కి ధవళమై తనధావళ్యమున దిక్కుల వెలిఁగించుచు నొక్కరాశిఁ బర్వతాకారం బున నుండుదాని వారు గాంచి యది యేమి యని మనస్సునఁ దలంచు చుండునంత వారికి రోమశుం డిట్లనియె.

ఈపర్వతాకారంబై తోఁచు తెల్లనిరాశి నరకాసురుఁ డనువాని యస్థులు. వాఁడు పూర్వమునం దొకప్పుడు తపస్సుఁ జేసి, వేదాధ్యయనంబు గావించి శౌర్యము నార్జించి యింద్రపదవిఁ బొంద నుద్యమించెను. ఆకార్యము సాధించునిమిత్తము పదివేలేండ్లు యోగధారణమున నిచ్చోఁ దప మాచరించుచుండు వానితేజ మగ్నిప్రభం బోలె జూడ నలవిగానిదై వెలుంగుచుండ నింద్రుం డందులకు వెఱచి వైకుంఠమునకుఁ బోయి శ్రీమన్నారాయణునితో మొఱ లిడఁగా నాజగన్నాథుం డార్తత్రాణపరాయణుం డింద్రునకు మనఃప్రియంబు గావింపఁ దలఁచి నరకాసురుతపోవనంబున కేతెంచి తపస్సుఁ జేయుచుండునాతనిం డాసి వానిశరీరమును దనపాణితలంబున నాపాదమస్తకము స్పృశించెను. అంత నరకునిచైతన్యం బాదిదేవునిచే నపహృతం బగుడు వానిశరీర మశనిపాతంబున నేలచదర మగుకొండచాడ్పున నిశ్చేతనం బయి నేల కొరఁగె. పురుషోత్తముకరస్పర్శచే నేలం గూలిన యీనరకాసురుని యస్థులప్రో విది కొండవోలెఁ గాన వచ్చుచున్నది. మఱియును నొకప్పుడు నూఱుయోజనములు విస్తృతమై భూప్రదేశము క్రుంగఁగా నయ్యాదిదేవుండు వరాహరూపం బెత్తి భూమి నిచ్చోఁ బైకి లేవనెత్తి

యుద్ధరించె ననఁగా ధర్మరాజు రోమశునిఁ దత్ప్రకారంబు వివరింపుమని వేఁడ నామని యారాజచంద్రుని కిట్లనియె.

### నారాయణుండు వరాహరూప మెత్తి భూమి నుద్ధరించుట.

పూర్వకాలమునం దొకప్పుడు నారాయణుండు నిష్ఠ మెయిఁ దపమాచరించుచుండె. ఆసమయమున భూలోకమున నున్న ప్రాణులు చావు లేక వర్ధిల్లఁగా, భూమి యాభారంబు నోర్వలేక నూఱుయోజనములు విస్తృతప్రదేశము క్రుంగిపోయెను. అంత భూదేవి తపం బాచరించుచున్న లక్ష్మీకాంతు శరణుఁజొచ్చి దేవా! నా యీభారం బపనయింపవే. నే నీభారంబు భరింప లేక నీపాదములయొద్దఁ బడితి నని మనవి సేయఁగా నాలోకభర్త భూదేవిఁ గరుణించి వల్లె యనెను. అంతఁ దత్కారణంబున నావిష్టరశ్రవుండు లోకభయంకరంబులు, ఘోరంబు లగు రక్తలోచనములును, నొంటికొమ్మును గల తెల్లనివరాహరూపంబుఁ దాల్చి శరీరంబుఁ బెంచి తనయొంటికొమ్మున క్రుంగినశతయోజనవిస్తృతభూమిని పై కుబికించెను. దానం జేసి ముల్లోకంబులు సంత్రస్తంబు లయ్యె. దేవతలు భీతిల్లిరి. గంధర్వులు బెగ్గడిలిరి. యక్షులు నిర్విణ్ణులైరి. రాక్షసులు విభ్రమముఁ జెందిరి. ఋషు లాఘోరరవంబున కాశ్చర్యమగ్నమానసులై దేవతలతోఁ గూడి బ్రహ్మపాలికిఁ బోయి యావైపరీత్యమునుండి తమ్ముఁ దప్పింపు మని ప్రార్థించిరి. అంతఁ బితామహుండు వారి వెఱ పుడిపి యిది ప్రళయంబు గాదు. భూమి శతయోజనవిశాలం బైనప్రదేశము క్రుంగగా శ్రీమన్నారాయణుండు శ్వేతవరాహరూపముం దాల్చి తనయేకశృంగంబున దానిని లేవ నెత్తుటచే నీభయంకరారావం బుప్పతిల్లె. వెఱవవలదు. రాక్షసులకారణంబున నీధ్వని పుట్టినది కాదు. హరి వలన మీకు భీతిలేదు.నందవనమున శ్రీమన్నారాయణుండు కాలానలంబు మాడ్కి వెలుఁగు. ఇదిగో నితనియురంబున శ్రీవత్సంబు గాన్పించుచున్నది. మీకుఁ బ్రసన్నుం డగు. ఆమహనీయునిఁ గీర్తింపుడు. మీకు శుభంబు లయ్యెడు. అనఁగా దేవత లెల్లరుఁ బితామహపురస్సరులై యయ్యాదిదేవుఁ బురుషోత్తము రమాకాంతుఁ గాంచి యాదేవు ననంత కల్యాణగుణంబుల నుతించి సెలవుఁ బొంది పితామహుతోఁ దమతమ

నెలవులకుం బోయిరి. అని రోమశుండు శ్రీమన్నారాయణుని శ్వేత
వరాహరూపావతారకథను బాండవులకు విన్నవింపఁగా వారును లోకా
రాధ్యగుణంబుల సంకీర్తించి గంధమాదనమున కేఁగు సంభ్రమంబున
నందఱును విండ్లను నమ్ములపొదులను ఖడ్గములను గవచములను ధరించి
యాజ్ఞసేని విప్రులమధ్య వచ్చుచుండ నాఘోరారణ్యంబున రోమశుండు
దారి సూపఁ దఱలిరి.

ఈతీరున వారు బహుదినప్రయాణముల నాయెగుడుదిగుడు ప్రదే
శంబులను, నిమ్నోన్నతపర్వతపఙ్క్తిని, దీర్ఘనదీనదంబుల నతిక్రమించుచు
వివిధోన్నతవృక్షంబులను, బలుతెఱంగు లగు క్రూరమృగంబులను
గాంచుచు నాగంధమాదనపర్వతమును సమీపించునెడ నొకానొక
ప్రదేశమునఁ బ్రచండమారుత మతితీవ్రముగ వీచె. ఆకారణంబున
భూమ్యాకాశమధ్యప్రదేశ మంతయు ధూళిధూసరితంబై యెదుట
నున్నవస్తువులు గానరాకుండఁ దమం బావరించె. అందులకు వా రెల్లరు
వెఱచి యొకరి నొకరు సేతులఁ దడవుకొనుచు, నెదుట నున్న
తరులతాగుల్మంబుల నాశ్రయించుచుఁ బోయిరి. అప్పుడు భీమసేనుండు
ద్రౌపదిని సంరక్షించుచు నోదార్పుమాటల ననునయించుచుండె. ధర్మజ
సహదేవు లగ్నిహోత్రంబుల వెంటఁ గొని వానిసంరక్షణమునకై
యొకమహావృక్షము నాశ్రయించిరి. రోమశుఁడును నకులుఁడు నొక
వంకఁ దక్కినవిప్రులతో నుండిరి. ఇట్లుండ ఆ పెనుగాలి వీవఁ బైకి లేచిన
దుమారంబున నంధులై కన్నులు తెఱవలేక యథాయథలైరి. ఇట్లుండ
నాకసంబు వీఁటలువాఱ మిన్ను పైఁబడునో యనునట్లు ఫెళఫెళరవంబున
వినంబడు నుఱుములును, నుఱుములకు మున్న మూసినలోచనంబుల నైత
మంధకార మావరింపఁజేయు మెఱుములును, మును వావరించియుండిన
ధూమజాలము నంతటిని నడంపఁజాలి సంతతధారాసంపాతంబుగాను, గడ
వలతో ముంచిపోసినట్లును భయంకరంబై గాలివానగురిసె. ఆమహావా
తంబునకు విఱిగిపడిన కొమ్మలును వ్రేళ్లతోఁ బెకలింపఁబడిన మహావృక్షం
బులును, జిందరవందరలైనపొదలును, శమిత కలకలారావంబులుగల పక్షి
సమూహంబులును, సెలయేళ్ల ప్రవాహధ్వనులును, బ్రవాహములఁ
గొట్టుకొనివచ్చిన వృక్షశాఖలడొలకలు గలిగి యందంద సెలయేళ్లగట్టి

యం దిరికికొని ప్రవహించుచున్న యేటినీటికి మహానిస్వనంబుఁ బొదవించు
చున్న యడ్డంపుపెనుశాఖలుం గలదై రాత్రి యంతయుఁ బ్రళయకాల
మహావర్షంబు వోలె నొకతుపాను వీచెను. అంత వేగుచు నావాన
వెలిసి సెలయేటివఱదలు తఱిగెను. పాండవులు వప్పిలుచు నొక్క
చోఁ గూడికొనిరి. పిదప నజ్ఞానంబు విరియఁగాఁ బరబ్రహ్మంబుఁ
గాంచు యోగిపగిది వారెల్లరును జేరికొని యొండొరుం
గుర్తించి క్షేమంబు లారసికొని మరలఁ బ్రయాణాసక్తు లయ్యెక్కొనెడు
దూరం బేగుటయు యాజ్ఞసేని రాత్రి వర్షవేగంబునఁ గొట్టుపడి యుద
యంబున దూరమార్గగమనంబున డస్సి కాలుసేతులు గడగడ వణంక
సీతుచే దంతములు రటరటధ్వని సేయఁ గ్రిందఁబడి మూర్ఛ వోయె.
దానియవస్థను నకులుండు సూచి తొలఁపైఁ బడసీయుక తనచేతు
లయం దిడుకొని ధర్మరాజు నెలుంగెత్తి పిలిచి యిట్లనియె. ధర్మజా!
పాంచాలిం జూడుము. ఇయ్యది రాత్రి వర్షపుసీతునకును, మార్గా
యాసంబునకుం గొట్టుపడినది. దీనిసుకుమారదేహం బీయాయా
సముల కోర్వ లేదు. ఎట్లో పండ్లు బిగియఁబట్టుకొని మనతో నీపాట్లం
బడుచున్నది. పుట్టిననాటంగోలె సంపదఁ దులతూఁగి మహావైభ
వంబుతోఁ బెరిగి మనతోఁ గూడ సమ్మెటపెట్టులం బడుచున్నది. • దీని
నూరార్పు మన ధర్మజుండును భీమసహదేవులును స్మృతి దప్పియున్న
యాకోమలిం జూచి కొంతసేపు నిర్వేదపడియుండిరి. అంత ధర్మజుం
డప్పాంచాలరాజపుత్రిఁ దనయూరువులు దిండుగా నొడియం దుంచి
కొని హా! విధీ! నిన్నేమందును? నాపూర్వకృతదుష్కృతముల నను
భవించుచున్నాను. ఈకోమలి పోతుటీఁగకుం జొరరాని శుద్ధాంతముల
యందుఁ బుట్టిననాటంగోలె రాణివాసంబు ననుభవించి యెండకన్నె
ఱుంగక, శ్రమ యన్ననేమో తెలియకుండ మాచెట్టవట్టి మాతో
నీయిడుమలఁ గుడువవలసె. అంతఃపురంబులయందు హంసతూలికా
తల్పంబుల మేనికి మెత్తదనముం గదుర సుఖోపలాలిత యైన యీతన్వి
యికర్కశశిలాతలంబున మేనిని వైచి పరవశయై దుఃఖముల
ననుభవించుచున్నది. లేఁజిగుళ్లవంటి దీనిమెత్తనియడుగులును దర్భం
బొడిచి సుందరవదనరదనను నాసిమిత్తంబునఁ దెలుపుపాటియున్నయవి.

నా తెలివిలేమిం జేసి సప్తవ్యసనములలో నొక్కటి జూదం బని యెఱిం
గియుఁ దానం జొచ్చుటం జేసి కదా యీకుసుమకోమలి కంగం బిట్లు
వాడె. కుంతీతనయులకుఁ గూఁతు నిచ్చి దాని సుఖింపఁ జేయ నుద్దేశిం
చిన పాంచాలరాజు దీర్ఘాలోచనంబు వృథయయ్యె. ఈయెలనాగ మమ్ముఁ
జెట్టవట్టి యేమి సుఖముచు ననుభవింపకున్నను, బాపినైన నాకష్టములను
మాత్రమె కుడుచుచున్నయది యని బహువిధంబులఁ బ్రలాపించు
చుండ ధౌమ్యుఁడు మున్నగు మహర్షులు రక్షోఘ్నమంత్రములఁ బఠిం
చుచు ధర్మజు నోదార్చుచుండిరి. పాండవు లప్పుడు తామరపాకువీవన
లతోఁ జల్లనిగాలి యాయమపైఁ బ్రసరించునట్లు వీచుచు నుపచారములు
సేసిరి. మహర్షులమంత్రపఠనంబునను, బాండుపుత్త్రులశీతలోపచారంబు
నను గొంతసేపటికి సేదదేఱిన యాకోమలిని వారు మెత్తనికృష్ణా
జినంబును బఱచి దానిపైఁ బరుండఁ బెట్టిరి. నకులసహదేవులు వివిధా
యుధాభ్యాసముచేఁ గాయలు గాచి కఠినములైన తమపాణితలంబుల
నా కుసుమకోమలిపాదతలంబుల మెల్లన నొత్తుచుండిరి. ధర్మరాజు
చల్లనిమాటలతో నాయమ నాశ్వాసించుచు భీముం జూచి నాయనా!
ఇవ్విధవిషమసంకటప్రదేశంబులందు మనయాజ్ఞసేని యెట్లు నడచు
నని సంశయము కలుగుచున్న దనఁగా నందులకు భీముం డిట్లనియె.
"ఓ ధర్మపుత్త్రా! నీకీచింత వలదు. ఇక్కఠినమార్గగమనాయాసంబుచే నిది
ప్పటికే డస్సియుండు. దీనిని నకులసహదేవులను, నీతోఁ గూడ నేమోచి
కొనివత్తునని ముందే చెప్పియుంటి. ఇంతేకాక హిడింబాపుత్త్రుండు ఘటో
త్కచుఁడు మనకుఁ దోడగునట్లు వానిని స్మరించెను. వాఁడు వీరినందఱ
మోచికొని యీప్రదేశంబులలో మనకు సాయపడును గాక! అనఁగా
ధర్మనందనుం డందుల కియ్యకొనెను. భీముండు ఘటోత్కచుం దలంప
వాఁడును దండ్రికిఁ బ్రసన్నుండై యెదుట నిలిచె అప్పుడు స్మరించిన
మాత్రమున విధేయుండై తనరాక్షసబలంబుతో సన్నిహితుండై తనకు
ధర్మరాజాదులకును దక్కటిమహర్షులకును మ్రొక్కి నిలువఁబడి యున్న
ఘటోత్కచుం జూచి భీముం డిట్లనియె. ఓరీ! నీతల్లి ద్రోపది కుసుమ
కోమలి గాన కంటకశిలాసహితవిషమారణ్యంబులలో నిప్పర్వతప్రదేశంబు
లలో నడచుటం జేసి కడుంగడు డస్సినది కావున నీయెలనాగను నీవు

మోచికొని మావెంట రమ్ము అని చెప్పఁగా వాఁడు పాండవులను ద్రౌప
దిని ధౌమ్యాదిమహర్షుల నందఱ నెత్తికొని, మిగిలిన విప్రబృందమును
దనసహచరు లగు రాక్షసుల నెత్తికొన నియమించె. రోమశమహర్షి
తనదివ్యతేజంబునం జేసి రెండవసూర్యునివలెఁ దేజరిల్లుచు నాసిద్ధమార్గం
బున నరిగెను.

అప్పుడువున నారాక్షసులు వారి నెత్తికొని యతివేగగమనం
బున మ్లేచ్ఛజనావృతంబైన నానాదేశంబులం గడచుచుఁ జని ముందు
నెడతెగని దేవరాక్షసగంధర్వయక్షసిద్ధసాధ్యకిన్నరకింపురుషసంచారంబు
గలదియు, నానావిధక్రూరమృగంబుల కాటపట్టును, బలుతెఱంగు
లగు చెట్లతోఁ గూడినదియు, హిమవత్పర్వతమధ్యగతంబు లగు
రమ్యంబులైనగుట్టలతోఁ జెన్నారుచుండునదియు నగు నుత్తరకురుదే
శంబులఁ బ్రవేశించి, మహాదేవునిలయం బగు కైలాసంబు దాఁటిరి.
అయ్యది మృగబాధావిరహితంబును, గంటకానావృతంబును, మృదు
మధురఫలభరితతరుగుల్మలతావిరాజితంబును, బృహద్వ్యతికీర్ణవియద్గంగా
స్థలిసమలంకృతంబును నీలతృణశాద్వలప్రదేశశోభితంబునునై పాదతలం
బులకు మెత్తనై యొప్పుచు, వివిధర్తుఫలకుసుమభరితబహువృక్షమండితం
బునై యొప్పారునొకసమతలంబుఁ జేరిరి. ఆప్రదేశంబునఁ జేరువారును,
నందు నివసించువారును సుఖదుఃఖాదిద్వంద్వరహితు లగుదురు. మాను
షమనంబులఁ జిక్కువఱచుదుఃఖములు లేనివా రయ్యెదరు. అచ్చోట
ధార్మికుల కగమ్యంబు. అందు బ్రహ్మవాదులు పరమాత్మ నెల్లప్పుడు
ధ్యానించుచు సోఽహంశబ్దనాదముఖరితులులై యుందురు. వారు ఫల
ముల భక్షించుచు దాంతులును, శాంతులును, జితేంద్రియులును మృగ
చర్మపరిధానులును, స్వయంప్రకాశమానమూర్తులును, తపోనిరతులును,
మోక్షమార్గావలంబులును నగు మునిశ్రేష్ఠులు. మఱియు నాపుణ్య
దేశంబు మేఘమండలంబు నొరయునట్టి యున్నతవృక్షరాజంబులచే
నాచ్ఛాదింపఁబడియున్నను దమోమయమైయుండక దివ్యతేజస్సుచేఁ
బ్రకాశించుచుండును. ఋషిశ్రేష్ఠిముఖనిర్గతోంకారనాదమంజులంబై దేవ
తలగతాగతంబులచేఁ బావనంబులైన కమండలువులచేతను, స్రుక్స్రువహా
మయజ్ఞోపకరణములతోఁ బరితంబులై యున్న నరనారాయణాశ్రమంబగు

బదరికాశ్రమంబుఁ గాంచి యచ్చోఁ ద్రిలోకపావని గంగ వేగ పాఱు చుండుటఁ గాంచి దానిరామణీయకమునకు, నచ్చోటిప్రకృతిసౌందర్య మునకు నానందించుచుఁ బాండవులు ఘటోత్కచుని భుజములనుండి దిగి పాదచారులై గంగోదకంబులఁ గృతావగాహులై పితృదేవతర్పణంబులఁ గావించి యచ్చోట నివాసం బేర్పఱచికొనియుండు మునిచంద్రులకు మ్రొక్కిన వారు పాండవుల నాశీర్వదించిరి.అచ్చోట లభించు కందమూల ఫలములు మున్నగువన్యపదార్థములచేత వారు పాండవుల కతిథిసత్కా రంబులఁ గావించిరి. ధర్మజుండును నచ్చోఁ దపమాచరించుచుండు యోగులఁ బూజించుచు మైనాకమును, హిరణ్యశిఖరమును దర్శించి, బిందు సరస్తీరంబుఁ జేరి యందుఁ గృతస్నానుండై యచ్చోటిరామణీయకమున కును, శీతలతరుచ్ఛాయలకును, నానాప్రసూనవితానవాసనల నొప్పారు లతాగుల్మంబులకును సంతసించుచు భూలోకనాకంబైనయాదివ్యదే శంబున నెల్లవారితో నాఱురాత్రులు వసించియుండి యంత మఱునాఁడు శ్మశానంపుదెసనుండి పుష్పసుగంధభరితశీతలమారుతంబు మనోహ రంబై వీవఁగా నావాయువుచేఁ బ్రేరేపితయైనదియు, వికచ సహస్రదళ యుతంబును నైనయొక్క యెఱ్ఱఁగల్వపువ్వు పాండవులయుఁ,దదనుగామి విప్రబృందములయు మధ్యంబునం బడియె. ఆపుష్పంబు సౌగంధికంబు నాఁబడు. ద్రౌపది యాపుష్పంబు నెత్తికొని భీమసేనుం జూచి మానసో ల్లాసకరంబును సుగంధమును వెదజల్లునదియును రమణీయంబునునైన పుష్పరాజంబును జూడుము. దీని ధర్మరాజున కిచ్చెద. ఇట్టివి మఱి కొన్నింటిని మనకామ్యకాశ్రమంబునకుఁ గొనిపోఁదలంచెద. నాయందుఁ నీకుఁ బ్రేముడిగల దేని వానియుండుచోటున కేఁగి కొన్నింటిని నాకుం దెచ్చి యిమ్మ"ని చెప్పి యాపుష్పంబుఁ గేలఁ బట్టుకొని ధర్మపుత్త్రుని సమీపమున కేఁగెను.

## భీముఁడు సౌగంధికపుష్పమును దేఁ బోవుట

అంత భీమసేనుండు యాజ్ఞసేనియీప్సితసిద్ధిఁ గావించునిమిత్తము కేల ధనుర్బాణములం బూని, కటంబున నాశీవిషంబులంబోని బాణ ములతోడి తూణీరంబు వెలయ, మెడపై నున్నసడఁ బట్టుకొనఁగాఁ గో పించుమృగరాజువలె నరణ్యంబు ప్రతిధ్వను లీన గర్జించి సకలప్రాణులకు

భీతి జనింపఁ జేయుచు, నెదురులేని మహాధైర్యంబుతో సౌగంధికంబుఁ గొనివచ్చినగాలి వీచినదెసకు నున్ముఖుండై యావైపున నెచ్చోటనో యాపుష్పరాజంబుఁ బూచుతరువు లున్న వని యూహించి యేఁగుచున్న వాఁడు కోకిలపంచమధ్వనులు వీనులకు విందుసేయఁ దుమ్మెదల ఝుం ఝుమ్మనుగీతములఁ జెవులార వినుచు, మిన్నేటియలల వెలువడు చల్లని తుంపురులగుమితో విరిసినతామరపువ్వులలోని పుప్పొళ్లఁ గొని వచ్చులేఁ దెమ్మరల మెల్లనిరాక కానందించుచు, గైరికాదిధాతువులు వ్యాపింపఁగా మైపూఁతపూసినట్లు కాన్పించుచుండునదియు, సానువుల నొరయు చుండు మేఘముల రాకపోకలం జేసి ఱెక్కలతో నాడుచుండు దానింబోలె నుండునదియు, నచ్చటచ్చటఁ బాఱుచుండు సెలయేళ్లలోని తరంగాగ్ర ములఁ గన్పడునురుగులం జేసి ముత్యాలసరములఁ దాల్చినదానింబోలె విరాజిల్లు కనులపండుగులైన దృశ్యములతో నొప్పిన యాగంధమాదన పర్వతపునెత్తమ్ములందు యక్షగంధర్వవిద్యాధర కాంతలు విటులపజ్జ నితరులకుఁ గానరాక దన్ను మార్గమునఁ బోవువాని వీక్షింప సంచరిం చువాఁ డాత్మగతంబునఁ దన కనురక్తయుఁ బ్రియురాలు నగు ద్రౌపది కోరికఁ దీర్ప నింతదూర మేతెంచితి. దుర్యోధనకృతాపరాధంబునఁ గదా ఘోరారణ్యంబులఁ గ్రుమ్మరవలసివచ్చె. పార్థుఁడు పజ్జ లేఁడని పొగులుచున్న పాండవాగ్రజుండు నేనును దనయొద్ద లేకున్కికి నెంత పొగులుచున్నవాఁడో! కవలు చిఱుతలు దుర్బలు లని వారి నొండెడకుఁ బంపక తనయొద్దనే యుంచుకొని యుండు. వేగంబున సౌగంధికమును సాధించుకొని మఱల వచ్చు నని యాలోచించుచు, నడ్డమైనకూళమెకంబుల మర్దించుచు, మహావృక్షంబుల విఱుచుచుఁ బొదలఁ దీఁగలతో నున్మూలించుచుఁ బాదఘట్టనంబులఁ బుడమి గడగడ వడఁకఁగ నతివేగంబునఁ గొంతదూర మేఁగి సింహనాదంబు గావించె. ఆభయంకరారావంబున భీతిల్లి పర్వతగుహలలో నిదురిం చుచున్న సింహశార్దూలాదు లులికిపడి మేల్కొని వనాంతరములకు వడివడి నేఁగెను. మనోహరగానంబులం గావించునవి, నాట్యము లాడునవియు నగు శుకపికమయూరహంసంబు లయ్యారవంబును విని నంతనే వికావికలై మూర్ఛిల్లెను. అట్లు భీమసేనుండు మార్గంబునఁ

బడి పోవుచు, బహుదూరవిస్తృతంబైన యొక గొప్పయరఁటితోఁటం జూచి తాటిచెట్లపగిది సత్యున్నతంబులై యుండు కదళీవృక్షంబులను మదపుటేనుంగుచాడ్పున భంజించుచు మరల సింహనాదంబు చేయఁగాఁ గదళీవృక్షభంజనంబునఁ గలిగిన నిస్వనంబుతోఁ సింహనాదంబును గూడి యొక్కటియై యత్యంతభయాస్పదం బగుచుఁ దడిసిన ఱెక్కలుగల కొన్ని పక్షులు కలకలరవంబులఁ జేయుచుఁ బైకెగురఁగా వానిఁ జూచి భీమసేనుండు సమీపమున సరోవరం బొండు గలదని యూహించి పక్షు లెగిరినవంకకు దారిఁ దీసి యట కొలనిం గని యందుఁ గృతస్నానుండై యాకొలనినీటిపైనుండి యేతెంచు శీతమారుతంబు దన్ను స్పృశింప నానందించుచు నాకదళీవనంబుననే మఱియుఁ గొంతదూరం బేఁగి భుజను లప్పళించి వెండియు సింహనాదం బొనర్చె. ఆమహానినదంబునకు గంధమాదనపర్వతకుహరంబులును, సింహవ్యాఘ్రాదిమహామృగంబులును బ్రతిధ్వను లొసంగె. ఆ నినాదం బాకర్ణించి యక్కదళీవనమధ్యగతుండైన హనుమంతుం డీనాదంబు భీమసేనునిదిగా నెఱింగి వానిం జూడఁ బ్రియ మంది వానిమార్గంబున కడ్డంబుగాఁ బెద్దయావు లింతఁ బెట్టి పాకశాసనుటెక్కెమువలె తీక్ష్ణమైన తనతోఁకఁ బైకెత్తి యయ్యరణ్యగతజంతుజాలంబు లెల్ల నదిరిపడి దిక్కులు సూడ నొక్క చఱపు చఱచె.

### భీముండు హనుమంతునిఁ జూచుట

అట్లు తోఁక చఱపఁగా బొడమినధ్వనిని విని భీమసేనుం డావలనికిఁ బోఁగా నచ్చోటఁ గదళీవనమధ్యగతంబైన యొకగొప్పబండపైఁ బరుండినవాని, కుఱుచనిసడలుగలవాని, మూఁపులు విశాలము లగుటం జేసి సన్ననై యుండు మధ్యప్రదేశముతో నొప్పువాని, నెంతమాత్రము వంకరగాక సూటియైనయూర్ధ్వదేహభాగముతోఁ బొడవులైన వెంట్రుకలు గలిగి టెక్కెపుగొయ్యం బోలి పొడవైన తోఁకతో వెలయువానిఁ గదలుచున్న గన్బొమలతోఁగూడి యెఱ్ఱని నాలుకయు మోమును గలవాని, పైకిఁ గాన్పించుచుండు తెల్లనికోరలు గలవాని, పాటలాననము గలవానిని కాంచనాద్రికమనీయవిగ్రహుని,

నిగనిగ మెఱయు పచ్చనికన్నులు గలవానిని, స్వర్గమార్గము నావరించిన హిమాచలంబుమాడ్కిఁ దనమార్గము నడ్డగించి పరుండిన వాని సమీరకుమారుం డగు హనుమంతుం గాంచి యాసమీరకుమారుం డగు భీమసేనుండు సమీపించి వెఱ పెంతయు లేక యొక భీకరనాదంబు సేయ దాని విని యాంజనేయుండు మెల్లన నటుమూసియున్న తనపింగళాక్షములం దెఱచి భీమసేను వీక్షించి చిఱునవ్వొలయ నిట్లనియె. అయ్యా! వ్యాధిపీడితుండనై యలసి యిమ్మహారణ్యంబున సుఖనిద్ర నొందియున్న నన్ను ముదుసలి యని యరయ లేక యేల మేల్కొలిపితివి. నోరు వాయి లేని తిర్యగ్జంతువులమైన మావంటివారు మానవుల ధర్మముల నెఱుంగలేక యకార్యముల నాచరించినను జ్ఞానవిరాజితులగు మానవులలోఁ బుట్టిన నీయట్టిమహనీయులు సర్వభూతములయెడఁ బశ్చాత్తాపము మెయిఁ గృపాళులై చరింతురు. వివేకులు ధర్మవిరుద్ధములైన యిట్టిచేతల కొడిగట్టరు. ఆలోచింప నీవు వృద్ధసేవ నెఱుంగనివానివలె నున్నావు. నీవు పెద్దల సేవించి, యుక్తాయుక్తతల నెఱిఁగియున్నచో వన్యమృగంబుల కిట్లుపద్రవంబు చేయనేరవు. నీ వెవ్వండవు? నిర్జనం బైనయీయరణ్యంబున నేల యొంటి చరించెదు? ఇఁక ముందు మార్గమంతయు దేవతలసంచారమునకు యోగ్యమైనది. సిద్ధులకుఁ దక్క సామాన్యమానవుల కీమార్గం బగమ్యంబు! సాహసించి యిఁక ముందుకుఁ బోవలదు. నామాట విని వెనుకను మఱలిపొమ్ము. ఇది దయచే నాయాడినమాటయే గాని స్వార్థంబు సాధించుకొనుటకుఁ జెప్పినమాట గాదు. నీకు స్వాగతం బగుఁ గాక; అమృతసమానములగు నాయిచ్చుపండ్ల నారగించి మఱలుము. నామాటలు హితములని తలంతు వేని యటు చేయు మనఁగా భీమసేనుండు హనుమంతున కిట్లనియె. అయ్యా! నేను క్షత్త్రియుండను. కురువంశస్థుఁడను. పాండురాజునకు క్షేత్రం బైన కుంతీదేవియందు వాయుభట్టారకునకుఁ బుట్టినవాఁడను. నన్ను భీమసేనుఁ డందురు. నీ వెవ్వండవు? నీకీవానరరూపంబు రానేల? దారిఁ దొలంగుము. అని భీమసేనుండు సెప్పఁగా నా హనుమంతుండు నవ్వుచు నే వానరుఁడను. నే దారిఁ దొలఁగను. శాంతుఁడవై సాధువు బోలె మఱలిపొమ్ము. క్రౌర్య ముడుగు మని చెప్పిన,

భీముఁడు 'క్రౌర్యమనుమాట' నటుండ నిమ్ము. దారిఁ దొలంగుము. లెమ్ము. కాదేని హానిఁ జెందుదువు అని పలికె. అంత హనుమంతుం డామాట లాలించి యన్నా! నేను గడు వృద్ధుండను. రోగిని. కావున మెదల నేర. నీ వవశ్యంబు పోవలసినచో నన్ను దాఁటి పొమ్మని చెప్పఁగా భీముఁ డయ్యా, నే నంత తెలివిమాలినవాఁడను గాను! జ్ఞానముచేఁ దెలియఁ దగిన పరమాత్మ జీవుఁ డని పేర్కొనఁబడి యెల్లశరీరముల నధిష్ఠించి యున్నవాఁడు. నిను దాఁటిన నేను నీలో నున్న పరమాత్మను దాఁటినవాఁ డనఁ దగుదు. తెలివి లేనివాఁడనైతి నేని నిన్నును నీకొండను హనుమంతుండు సముద్రమునుం బోలెఁ జెంగున దాఁటి యావలికిఁ బోయియుం డుదు,

అని చెప్పఁగా నాహానరుండు కౌంతేయా!హనుమంతుం డనువాఁ డెవ్వఁడు ? వాఁ డేల సాగరము నుల్లంఘించె. ఎఱింగింపు మని యడుగ భీముం డిట్లనియె. ఆహనుమంతుం డనువాఁడు వాయుభట్టారకసుతుండు. కావున నాకుఁ దోఁబుట్టువు. పొగడఁదగిన గుణంబులు గలవాఁడు. వాఁడు రామాయణ మను గ్రంథమునఁ బ్రఖ్యాతచరిత్రుండు. శ్రీరాముని భార్యయగుసీతను రావణుం డనురాక్షసుండు లంకాధిపతి యపహరించుకొనిపోఁగా నీహనుమ యాయమ నన్వేషించుచు లంకకుఁ బో నుద్యమించి సాగరమును దాఁటెు. బలపరాక్రమములయందును, తేజస్సునందును నే నాతనికి సమానుఁడ. దారిఁ దొలంగుము. కా దేనిఁ జేటొందుదువు. అనఁగా విని హనుమంతుం డాత్మగతంబున నీతండు భుజబలముచే గర్వించియున్నవాఁడు. అనిపైపై కుబుకు చుండునవ్వు నడంచుకొని యాతని కిట్టులనియె. శూరాగ్రణీ కడు వృద్ధుండఁ గాన లేవ నోప. నా యెడఁ గరుణించి దారియం దున్న నాతోఁకను మెల్లగా నవలకుఁ ద్రోసి మఱి నీదారిం బొమ్ము. అని చెప్పగా భీమసేనుండు పరాక్రమాంతిశయంబుఁ జూపి యీముదుకండైనవానరునిఁ దోఁకఁబట్టి లాగి వెంటనే యంతకుసదనంబున కతిథిగఁ జేయుదు నని యెడమచేతితోఁ దోఁకనెత్తఁ బూని నద్దానిని లేశమైనఁ గదలింప నేరక యంతటఁ గనుబొమలఁ బైకెత్తి, కన్నులు విస్తరింప ముఖం బుబ్బి శరీరమంతయుఁ జెమర్పఁగ రెండుచేతుల నాతోఁకం గట్టిగఁ బూనియు నెత్తఁ జాలక లజ్జించి యాకపివీరు

నకు మ్రొక్కి కేల్దోయి మోడ్చి యిట్లనియె. మహాత్మా! నాబీరంపుఁ బలుకుల మన్నింపుము. నీవు యోగసిద్ధుండవో, గంధర్వుండవో, గుహ్యకుండవో కాని సాధారణవానరుండవు కావు. నీకుఁ జెప్పఁదగునేని, శిష్యుఁడనైన నాకుఁ బ్రసాదింపుము. నీచరిత్రంబు సెప్పు మని దీసుండై యడుగ, భీమునకు హనుమంతుం డిట్లనియె.

మహాత్మా! నేను వాయుపుత్త్రుఁడను. కేసరికి క్షేత్రజుండను. హనుమంతుఁ డని నన్నుఁ బేర్కొందురు. ఇంద్ర సూనుం డగు వాలి యను వానరరాజు సూర్యపుత్త్రుం డగు సుగ్రీవుని నొక్క కారణంబున నవమానింప నాసుగ్రీవుండు నాసఖ్యంబు జేసి నన్ను సహాయునిఁగాఁ గొని ఋశ్యమూక మను పర్వతంబునందుఁ దొల్లి వసియించియుండె. అట్టికాలంబున దేవహితార్థముగ శ్రీమన్నారాయణుం డయోధ్యాపతి యగు దశరథునకు రాముం డను పేర విఖ్యాతయశుండై జనించి మనుష్యలీలల నాడుచుఁ దండ్రియానతిచొప్పున నరణ్యవాసంబుఁ జేయు నిమిత్తము దండకారణ్యమున భార్య యైనసీతాదేవితోను, దమ్ముం డైన లక్ష్మణునితోను సంచరించుచుండ లంకాధిపతి యగు రావణుం డను నసుర తనచెల్లె లగుశూర్పణఖచేఁ బ్రేరేపింపఁ బడి మారీచుం డను రాక్షసుని రత్నఖచితకనకమాయామృగశరీరముఁ దాల్ప నియోగించి రామలక్ష్మణు లున్నయాశ్రమసమీపంబునఁ దిరుగచుండ నియోగించె. అంత మారీచుండు మాయామృగవేషధారియై యచ్చోట విహరించుచుండ శ్రీరామునిభార్య సీతాదేవి తనభర్తనామృగంబును బట్టి తెమ్మనఁగా దానివెంట శ్రీరాముండు విండ్లి నమ్ములఁ దాల్చి బహుదూరంబేఁగె. అంత నామృగంబు నసురగాఁ దెలిసి రాముండు దాని నొక్కకోలం గూలనేసె. అసువుల వదలుచు నారాక్షసుండు 'హా లక్ష్మణా, హా సీతా' యని యాక్రందింప నాయెలుఁగు శ్రీరామునిదిగాఁ దలపోసి సీతాదేవి తనకుఁ గాపున్నమఱఁదిని సంగతిఁ దెలిసి రమ్మనఁగా లక్ష్మణుండు శ్రీరామునిసతి యాజ్ఞను శిరంబున వహించి సీత నొంటరిగ నాశ్రమంబున వదలి వెళ్లెను. అప్పుడు పర్ణశాలను వా రిరువురు వదలి చనుట నెఱింగి యది యదనుగాఁ గొని రావణుఁడు సీత నపహరించుకొని లంకకుఁ బోయెను. వెంటనే శ్రీరాముం డనుజసహితుండై పర్ణశాలకు వచ్చి సీతం గానక వనములను,

నదీతీరంబులను, వృక్షకోటరంబులను, గొండగుహలను వెదకుచు వచ్చి ఋశ్యమూకస్థుండైనవాలి నొక్కకోలం గూలనేసి కపిరాజ్యమునకు సుగ్రీవునిఁ బట్టాభిషిక్తుం జేసెను. సుగ్రీవుండు తనకు రాజ్యలాభం బొనర్చిన శ్రీరాముని కార్యంబు నెఱవేర్ప సీతాన్వేషణమునకు ననేకవానరులను బహుదూరంబు నానాదిక్కులకుఁ బంపె. నన్నును నింకఁ గొందఱు వానరులను దక్షిణమునకుఁ బంపెను. నేను సంపాతి యనుగృధ్రరాజువచనంబున సీతాదేవి లంకలో నున్న దని యెఱింగి శతయోజనవిస్తృతమైనయుదధి నవలీలం దాఁటి లంకఁజేరి యం దశోకవనమధ్యంబున హిమగతనళినింబోలె నష్టశోభయు వ్యసనపరంపరలచేఁ బీడితయు, సహచరరహితచక్రవాకింబోలినదియు నై కృపణదశను బొందిన జనకసుతను గాంచితి. అంత నాదేవికి శ్రీరామలక్ష్మణుల సేమంబు సెప్పి యామె నుచితవచనంబుల నోదార్చి శ్రీరామదూత నగు నాయొక్కపరాక్రమంబు రావణునకుఁ దెలియునట్లు లంకం గాల్చి లంకలో నున్న రాక్షసులందఱకు నేను శ్రీరామదూత ననియు, సుగ్రీవునిచెలికాఁడ ననియు, హనుమంతుఁ డని పేర్కొనఁబడువాఁడ ననియుఁ దెల్పి పిదపఁ గిష్కింధ కేతెంచి శ్రీరామునకు నాకనిన దంతయు విన్నవించితి. అంత నామహనీయుం డగు శ్రీరాముండు వానరబలంబుతోఁ గడలిగట్టున విడిసి సముద్రముపై సేతువుఁ గట్టించి లంకం జొచ్చి పుత్త్రమిత్త్రామాత్యబంధుసర్గముతో రావణుం గూల్చి శరణాగతుం డైనవిభీషణునికి రావణుతమ్మునకు లంకారాజ్యపట్టాభిషేకంబు గావించి యగ్నిప్రవేశముచేఁ దన పూతచరిత వెల్లడించిన సీతం దోడ్కొని దేవత లెల్ల మెచ్చఁగఁ బుష్పకవిమానంబు నెక్కి యాకాశమార్గంబున నిజపట్టణం బైనయయోధ్యాపురిం జేరి పట్టాభిషిక్తుండై పదునొకండువేలేండ్లు ప్రజలెల్ల సుఖులుగా రాజ్య మేలెతనచరిత్రంబు లోకంబున నెంతకాలము ప్రజలచేఁ గీర్తింపఁబడునో యంతకాలము నాకాయువునొసఁగె. సీతామహాదేవి నాకు సకలభోగంబు లుపస్థితంబులుగా వరము నిచ్చె. ఇచ్చోట నుండు గంధర్వులు విద్యాధరులు శ్రీరామచరిత్రను గీతంబుగా ననుదినంబుఁ బాడుచు నాకుఁ బ్రీతిఁ గావించుచుందురు. మానవుల కీచోటు లగమ్యంబులు. కావున నే నీదారి కడ్డం

బుగాఁ బఱుండియున్నాను. నీ వేల యీదుర్గమస్థలంబుల కేతెంచినాఁడ వనఁగా భీమసేనుం డామహాకాయుని హనుమంతుంగాఁ దెలిసి, సంతుష్టస్వాంతుండై యామహనీయునికి సాష్టాంగదండప్రణామంబులు సేసి మృదుమధురవచనంబుల నిట్లనియె. మహాత్మా! నీదర్శనంబున నాజన్మంబు సార్థకంబయ్యె. నాయెడ నీకుఁగల యనుగ్రహమునకు నీదర్శనంబు నిదర్శనంబు. పరమానందంబుం బొందితి. దేవాంశసంభూతుండవైన నీవు మర్త్యుండ నైననాకు నిజరూపదర్శన మిచ్చి నన్నుఁ గృతార్థుఁ జేసితివి. నీవు నాపై దయతో సముద్రమును దాఁటిననాఁటిరూపుం జూపి నన్ను సంతసింపఁజేయవే యన హనుమంతుం డానాఁటిరూపును నీన ( డెట్లు చూప నగు. కాలము చతుర్యుగరూపములతో భిన్నమై యుండు. కృతత్రేతాద్వాపరకలియుగనామములతో నవి విరాజిల్లు. కాలవ్యత్యాసంబున గిరులును, నదులును, వృక్షాదు లగు పదార్థములును వేర్వేఱుగఁ గాన్పించు ననఁగా, భీమసేనుం డది యెట్లుండు? ఆపరూపంబుల తెఱంగెఱింగింపవే యన హనుమంతుం డిట్లనియె.

హనుమంతుండు భీమసేనునకు యుగధర్మంబులఁ జెప్పుట

కృతయుగం బన్నియుగంబుల నత్యుత్తమంబు. ఆయుగంబున ధర్మము నాల్గుపాదంబులఁ బ్రవర్తిల్లు. ప్రజలువృద్ధిఁ జెందుదురు. ఋగ్యజుస్సామభేదంబుల బొరయక వేదం బేకంబై యుండు. దేవత లని దానవు లని గంధర్వు లని యక్షు లని భేదం బాకాలంబున లేదు. క్రయవిక్రయములు ప్రజ లెఱుంగరు. ఫలకాంక్షతోఁ గర్మములఁ బ్రజ లాచరింపరు. వ్యాధులు, ప్రజాపీడనంబులు గాన్పింపవు. ఇంద్రియములు విషయానువర్తులై చరింపవు. ప్రజలు జితేంద్రియులై యుందురు. కామక్రోధలోభమోహమదమాత్సర్యంబులు ప్రజలకు నుండవు. అందఱును దపస్స్వాధ్యాయాగ్నిహోత్రకర్మాచరణపరాయణులై యొండొరుల యెడఁ బ్రీతిం జూపుచు నీర్ష్యామత్సరాదులు లేక మెలంగుదురు. ప్రజలు పరమగతిపరాయణులై యోగమార్గావలంబులై యుందురు. సర్వభూతాంతర్యామి యగునారాయణుండు శుక్లవర్ణుండై యోగులకు దర్శనం బిచ్చుచుండు. ఫలసంగులు కాక ప్రజలు నిష్కామకర్మాచరణపరాయణులై కాలయోగంబున నుత్తమగతిం బ్రాపింతురు.

త్రేతాయుగంబు యుగంబులలో రెండవది. ఈయుగంబున ధర్మంబు మూఁడుపాదంబులఁ బ్రవర్తిల్లుచుండు. మానవులు ధర్మపరాయణులై సత్యమార్గము ననుష్ఠింతురు. యజ్ఞక్రియలు దానసంకల్పంబులీకాలంబున మెండుగ జరుగుచుండు. ఈయుగంబున నారాయణుండు రక్తవర్ణముతో వెలయు.

మూఁడవది ద్వాపరయుగంబు. ఈయుగంబున ధర్మము రెండుపాదములతో వర్తిల్లును. విష్ణుండు పీతవర్ణుఁ డయి చూపట్టు. ఆకాలమున జనులు వేదము నంతయుఁ జదువ శక్తులు గామిం జేసి నారాయణుండు వేదవ్యాసుఁడై యవతరించి వేదముల నాల్గుతెఱంగులుగ విభజించె. అప్పుడు కొందఱు వేదములను నాల్గింటినిఁ, గొందఱు మూఁటినిఁ, గొందఱు రెంటినిఁ, గొంద ఱొక్కదానిని నభ్యసింతురు. మఱికొందఱు వేదశూన్యులై యుండుదురు. ఈతీరున వేదంబు నానావిధము లగుచునుండ నాచారంబులును బెక్కు లగును. యజ్ఞములు, తపస్సులు, దానములును రాజసగుణప్రధానములై యాచరింపఁబడుచుండును. సత్త్వగుణము ప్రజలందు క్షీణించును. కావున మానవులు రోగపీడితు లగుదురు. ఆధిదైవికోపద్రవములనివారణార్థము తపస్సులు దానములు నొనర్పఁబడుఁగాని భక్తిపురస్సరముగ నిష్కామకర్మాచరణమును మనుజు లాచరింపరు. కర్మ ఫలాపేక్షతో యజ్ఞకర్మములు సేయంబడును.

నాలవది కలియుగము. ఇందు ధర్మం బొక్కపాదంబుననే వర్తిల్లును. పురుషోత్తముం డగు నాదినారాయణుండు యోగులకు నల్లని రూపంబునఁ దోఁచెంచు. వేదమార్గము లుపశమిల్లును. దురాచారంబులు సదాచారంబులై నెగడు. మానవులు యాగముల నిరసింతురు. సద్ధర్మములు మాఱును. ప్రజల కీతిబాధలు మెం డగును. వ్యాధులచే జనులు సదా పీడింపఁబడుదురు. రాగద్వేషములు, మదమాత్సర్యంబులు, ఆధులు, కఱవులును బ్రజల వేధించుచుండును. దుర్జనులు శోభింతురు.సజ్జనులు గానరారు. దుష్టులు పూజింపఁబడుదురు. శిష్టులవమానితులగుదురు. దుర్మార్గులు బాహాటముగ సత్కరింపఁబడి కీర్తిజయధ్వనులచేఁ బూజింపఁబడుదురు. సన్మార్గులు ప్రచ్ఛన్నులై గుహాలలో డాగి వెలు

పలికి రాక యడంగియుండురు. తామసగుణము ప్రజలలోఁ బ్రధానంబై యుండు. విప్రులు వేదబాహ్యులై స్వధర్మప్రవర్తకులుగాక, యన్యధర్మాచరణపరాయణులై ధనలోభులై వర్తింతురు. యుగము లిట్లు మాఱుచుండఁ బ్రజలలో ధర్మములు మాఱుచుండు. ఈవిధంబున లోకయాత్రయు, మనుష్యులమనోభావంబులును విపర్యాసములఁ జెందుచుండు. కలియుగం బాసన్నమై యున్న యది. చిరకాలజీవుల మగు మాబోఁటివారు యుగధర్మము ననుసరించియే ప్రవర్తింతుము. నీయడిగిన సంతయుఁ జెప్పితి. మఱలిపొమ్ము. నీకు శుభంబగుఁ గావుత మని చెప్పఁగా భీముండు మహాత్మా! నేను నీతొలిరూపంబు వీక్షింపఁ గాంక్షించుచున్నాను. నాయెడ ననుగ్రహించి యారూపంబుఁ జూపు మని వేఁడ హనుమంతుండు మందహాసంబుఁ జేసి, కోరినరూపమును బూల్చునేర్పుతోఁ దటాలున నిడువవాడికోఱలును, రక్తసదృశనయనంబులును, ముళ్లుపడినగొప్ప కనుబొమలును, మిన్నుముట్టునంత పొడవును, నందుకుఁ దగిన వెడల్పును గలిగి, సూర్యప్రభంబోని స్వకాంతులతోఁ గూడి, భీమునకుంబలె మేరునగంబు నాఁగఁ బెఱిఁగి యాయరఁటివనము నెల్ల నాక్రమించి యతిదీర్ఘంబైన పుచ్ఛంబు నాడించి నేలంగొట్టుచు భీకరరూపంబు నావహించుకొని భీముంజూచి వత్సా? నారూపమును వీక్షించితే? ఇంతకంటె నవసరంబుకొలఁది యెక్కుడుగ శరీరమును బెంచఁ గలుగుదుఁ గాని యారూపంబు నీకు భయావహం బగు. నీమానవనేత్రము లారూపమును జూడ నేరవు. శత్రుసమక్షమున నింతకంటె గొప్పశరీరమును దాల్ప నేర్తు నని పలికెను.

ఆమహాఘోరరూపంబు గాంచి భీమసేనుండు హనుమంతునితో మహాత్మా! నీఘోరరూపం బుపసంహరింపవే! నాచర్మచక్షుస్సులు నీతేజంబును జూడఁజాలమిఁ జీకట్లు గ్రమ్ముకొనుచున్నవి. ఈరూపమును నేఁ జూడ నేర. లంక నెల్ల నొక్కపెట్టె వినాశంబు గావింపవలతి వగునీ వుండ రావణసంహారంబు గావింప రాముండు రా నేల ? రావణుని సపుత్రమిత్రబాంధవంబుగా సంహరింప నీవొక్కరుండవుచాలవే? యని యడుగ హనుమంతుండు గంభీరనిస్వనంబున నిట్లనియె. అన్నా భీమసేనా! నీవ సత్యంబుఁ గన్గొంటివి. రావణుని సంహరింప నే నొక్కరుండ చాలుదు

కాని, వానికి శ్రీరామశౌర్యబలము లెఱింగింపఁగోరి నే నట్లు చేయనైతి. రావణుఁడు శ్రీరామపరాక్రమముఁదెలియకసీతాదేవినపహరించి మృత్యువుకోఁఱఁబెఱుకయత్నించె. దాన వాఁడు మడియుటకు మునుపే వానికి శ్రీరామశౌర్యబలముల నెఱింగించితి. నేనే రావణునివధించినచో రాముని కపకీర్తి యగు నని తలంచితి. అది యట్లుండనిమ్ము. ఇది సౌగంధిక వనంబునకుఁ బోవుదారి.వాయుభట్టారకుండు నిన్ను మార్గంబున రక్షించుఁగాక! సాహసించి యచ్చోటఁ బుష్పాపచయంబుఁ జేయకుము. దేవతలు బలులచేతను, హోమాదులచేతను సంతసించి యిష్టార్థంబు లొసంగుదురు. దేవతలు భక్తుల కనుగ్రహము చూపుదురు. నీవును సాహసం బొనర్పకుము. స్వధర్మంబుఁ బాలింపుము. ధర్మము నెఱుఁగుము. నరులు బృహస్పతివంటివారును గురువుల సేవించి కాని స్వధర్మముల నెఱుఁగఁజాలరు. అధర్మంబు ధర్మకవచంబుఁ దొడిగికొనియుండు. ధర్మం బధర్మంబై కానంబడు. మూఢులు ధర్మసూక్ష్మము నెఱుంగఁజాలరు ఆచారమున ధర్మము సిద్ధించు. ధర్మమువలన వేదములు పెంపొందు. వేదంబువలననే కదా యజ్ఞము లాచరితంబు లగు. యజ్ఞములచే దేవతలు తృప్తు లగుదురు. విప్రులు వేదవిధానోక్తప్రకారముల జేయఁబడిన జన్నములచే దేవతలను వశపఱచుకొందురు. శుక్రబార్హస్పత్య ధర్మములను క్షత్రియుండు లెస్సగాఁబఱించి ప్రజలను లోఁబఱచికొని, రాజ్యంబుపాలించు. కప్పములు గొనుట. గనులు త్రవ్వుట, వర్తకము చేయుట, కృషికి వలసిన జంతువులఁ పోషించుట యనునవి వైశ్యుఁడు చేయునేని జనులఁ బాలించును. త్రయీధర్మమును, దండనీతియును జక్కఁగా నడుపఁబడవేని, యీ ప్రపంచ మెల్లను హద్దు మీఱిపోవును. వైశ్యధర్మ మగు పశుపాలనవాణిజ్యములు జరుగవేని జనులు నశింతురు.

యాగములు గావించుట,వేదాధ్యయనము,దానకృత్యము ననెడు మూఁడును బ్రహ్మక్షత్రియవైశ్యులకు ముగ్గురకు మోక్షసాధనము లగు సాధారణ ధర్మంబులు. మఱియు విప్రులకు మాత్రము యాగములఁ జేయించుట, వేదాధ్యాపనము, బ్రాహ్మణులవలని ప్రతిగ్రహము ముఖ్యములు. క్షత్రియులకుఁ బ్రజాపాలనంబును, వైశ్యులకుఁ గృషివాణిజ్య గోపోషణాదులును విశేషధర్మంబులు. శూద్రులకు భిక్షాటనాగ్నిహోత్ర

ములు వ్రతములు లేకున్నను సుత్తమజాతిసేవ ధర్మము. ఓకౌంతేయా, వీనిలో నీకుఁ బ్రజాపరిపాలనమే శాస్త్రవిహితధర్మము. కావున జితేంద్రియుఁడవై శాస్త్రములనెఱిఁగి స్వధర్మ మవలంబింపుము. ఓనృపాలా, వృద్ధులతోను, జ్ఞానులును, బహుశాస్త్రపరిశీలకులును నగుసజ్జనులతోడఁ జక్కగానాలోచించి, యాప్రకార మాచరించువాఁడై యారాజు జనులను జక్కఁగఁ బాలించు. అట్లుకాక సప్తవ్యసనంబులఁ జిక్కినవాఁడు జనులచేఁ దిరస్కృతుఁడగు. ఎప్పుడు రాజు శత్రునిగ్రహసజ్జనానుగ్రహములతోఁగూడి లెస్సగా నడచునో, యప్పుడు జనులు తమతమధర్మంబులందు నిలిచియుండి తమతమమర్యాదలను మీఱకయుందురు. కనుక రాజు స్వపరదేశములందును, దుర్గమునందును శత్రుమిత్రబలములందును వేగులను నియమించి వారిమూలమున వానినిలుకడను, బెంపును, దఱుగుదలను నెఱుఁగవలయును. ఉపాయము నిగ్రహానుగ్రహములును, వేగును, బుద్ధి, మంత్రము(ఆలోచన), మగటిమి, నేర్పునను నివియెల్లను రాజునకుఁ గార్యసాధకములు. రాజు సామదానభేదదండములను నుపేక్షయును (అలక్ష్యమును) ననియెడి యన్నిటి నుపయోగించి కాని, కొన్నిటిని నుపయోగించి కాని కార్యములు సాధింపవలయును. నీతులెల్లను మంత్రము లాధారముగఁ గలవి. వేఁగులకును మంత్రము ముఖ్యము కనుకఁ జక్కనిమంత్రాలోచన గల సజ్జనులతో నాలోచనము చేయనగును. లోభితోను, నీచునితోను, మఱియు నెవరు చపలస్వభావులో వారితోను రహస్యములను గూర్చి యాలోచింపరాదు. విద్వాంసులతోడ నాలోచనములు చేయవలయును. శక్తులచేతను, నీతులను బ్రయోగించుచెలికాండ్రచేతను గార్యములుచేయింపవలయును. మూర్ఖులను నెట్టికార్యములందును నియోగింప రాదు. ధర్మబుద్ధి గలవారిని ధర్మకార్యములందును, బండితులను (యుక్తాయుక్తతల నెఱిఁగినవారిని) నర్థార్జనమందును, స్త్రీలయందు నపుంసకులను, గటికివారిని గఠినకార్యములందును నియోజింపవలయును. మఱియుఁ గార్యములందుఁ దనవారివలనను, బరులవలనను మంచి చెడ్డపనులవిషయమైన బుద్ధిని, శత్రువులబలాబలంబులను నెఱుంగవలయును. తెలివితోఁ దన్నుఁ గొలుచు సాధువులం దనుగ్రహమును, మర్యాదమీఱిన యసాధువులందు నిగ్రహమును (తిరస్కారమును)

జ్ఞాపవలయును. ఎపుడు రాజు సజ్జనానుగ్రహమునందు, దుర్జననిగ్రహ మునందును నేమఱక యుండునో, యపుడే జనులందు నడవడి మిక్కిలి చక్కఁగా నేర్పడియుండును. నృపాలా! యూహింపనలవికాని యీరాజధర్మమును నీకుఁ జెప్పితిని. అట్టిధర్మమును నీవు ధర్మములందు నిలిచిన వాఁడవై, ధర్మమును స్వస్వధర్మములప్రకారము పాలింపుము. తపోయజ్ఞదానములు, బాహ్యేంద్రియాంతరింద్రియనిగ్రహములు ననియెడి వీనిచే నెట్లు విప్రులు స్వర్గమొందుదురో, వైశ్యు లెట్లు దానము, అతిథిపూజ, స్వధర్మానుష్ఠానముననెడి వీనిచే సద్గతి నొందుదురో, యట్లు క్షత్రియులును నిగ్రహానుగ్రహరూపంబైన స్వధర్మమును ననుష్ఠించి పుణ్యము నొందుదురు. దండమును జక్కఁగాఁ బ్రయోగించువారును, గామక్రోధములు పాసినవారును, పేరాస లేనివారును గ్రోధరహితులు నైన క్షత్రియులు పెద్దలతోడిసాలోక్యము నొందుదురు. అని యిట్లు ధర్మబోధంబు నేసి హనుమ తనకామరూపంబు వీడి భీమసేనునిఁ దనయిరుగేల నాలింగనముచేసెను. అట్లు హనుమంతుండు భీము నాదరించి కౌఁగిలింపఁగా నా పుణ్యాత్మునంగసంస్పర్శనంబున భీమునిమార్గాయాసం బెల్లఁ దొలఁగె. భీముండు తన్ను మహాబలునిఁగా భావించె. అంత నారామదూత భీమునితోఁ దనకన్నుల నానందాశ్రువులు గురియ గద్గదస్వరంబుతో వెండియు ని ట్లనియె. భీమసేనా! పోయి రమ్ము. దారియందు నీకు స్వస్తి యగుఁగాక. నీ కసాధ్యంపుఁ బనులయందు నన్నుఁ దలంపుము. నే నిచ్చోట నున్నా నని యెవ్వరితో నాడకుము. కైలాసంబునందుండి సుందరాకార లగు దేవయక్షకన్యక లిచ్చోటి కేతెంచుసమయ మయినది. నిన్నుం జూచి యానందించితి. నాకన్నులు ప్రయోజనవంతంబులైన యవి. శ్రీరామకథ నాతలంపునకుఁ దెచ్చి నన్నుసంతుష్టుఁ గావించితివి. నాదర్శనంబునం జేసి నిన్ను శుభంబు లొందు. ఉభయులమును మారుతులము గావున భ్రాతలమైతిమి. భ్రాతృత్వంబుఁబట్టి వరంబు లడుగుము. ఒసఁగెదను. దుర్యోధనాదుల నొక్కుమ్మడి నేల రాచి వధింపఁ గోరితి వేని యట్లు గావించెద. హస్తినాపురంబుపై ఱాలవాన గురియించి పురమును నొక్కనిమేషమున విధ్వంసంబు గావించెద. దుర్మార్గుండై పాపముల కెల్ల నాలవాలంబైన యాదుర్యోధనుని విఱిచి పెడతెక్కలు

కట్టి నీముందటఁ బెట్టెద. నీవు కోరినవరముల నిత్తు ననఁగా భీముండు పరమానందం బుప్పతిల్ల, మహాత్మా! నీదర్శనంబునం జేసి నాకోర్కె లన్నియు ఫలవంతములైన వని తలంతు. నీరక్షఁ బడసినమే మవశ్యంబు వైరుల గెలుతుము. అనఁగా విని హనుమంతుఁడు వెండియు నిట్లనియె. భీమసేనా! నీవు నాకు భ్రాత వైతివి. వెండియు నీసంభాషణంబునఁ జెలికాఁడవైతివి. ఈభ్రాతృత్వసౌహార్దంబులవలన నీ కొక ప్రియంబుఁ జేసెద. అది యెద్ది యన దుర్యోధనుతో మీకుఁ బోరయ్యెడిని. అప్పుడు నీసింహనాదంబు నాచెవి సోఁకుచుండఁగనే, నే నర్జుని రథధ్వజంబున సన్నిహితుండనై నీకు బలవృద్ధియు శత్రువులకు మూర్ఛయుఁ గలుగునట్లు సింహనాదంబులఁ జేయుదు. అని భీమసేనున కభయం బిచ్చి సౌగంధిక సరోవరంబునకు మార్గమును జూపి హనుమంతుం డదృశ్యుం డయ్యె.

అంతట భీమసేనుండు హనుమంతునియొక్కయు శ్రీరామచంద్రునియొక్కయు మహిమల మనంబునఁ గొండాడుచుఁ బోలకరిమబ్బులవలె నల్లనిశరీరములు గల గజములు గలదియు, వెల్లతోఁకం గూడి లేఁబచ్చికల మెసపుచు బిత్తరిచూపులఁ జూచు జింకలసమూహములతో నొప్పారునదియు, సింహములు, పెద్దపులులు, వరాహములు, కారెనుములు మున్నగువాని ఘోరనినాదంబుల కాస్పదమైనదియు నెత్తావుల వెదఁజల్లు పువ్వులగుత్తులతోఁగూడి,పిల్లతెమ్మెరలకుఁగదలి తాళవృంతంబులై పాంథులమార్గాయాసం బపనయింప వీచుచున్నవో నాఁగఁ గనుపట్టునట్టి రెమ్మలుగల నానావృక్షసమూహములతోఁ గూడినగంధమాదన పర్వతంబునందుఁ గేలుదోయి మోడ్పఁగా నేర్పడునాకారంబువంటి తమ్మిమొగడల సొంపారి తుమ్మెదకొదమలకుఁ బ్రాణప్రదంబైన కమలములతో విరాజిల్లుచు నతిమనోహరంబులై నకొలంకుల నాదరించుచుఁ, బాంచాలరాజపుత్రివచనపాథేయుండయి యతివేగంబునఁ జని సాయంసమయమునం దాపర్వతరాజునకు శృంగారంబుగా బ్రహ్మ నిర్మించిన తామరపువ్వులమాలికయో యనున ట్లుండునదియును, హంసకారండవచక్రవాకములతో నిండినదియును, సొంపు పెంపారు బంగరువన్నె తామరలు గలదియు, నతివినిర్మలశీతలజలభరితంబు నగు

నొక్కమహానదిం గాంచి దానితీరంబునం దాయరణ్యపఙ్క్తికి పాయ కమణింబోలె నొప్పారుచుండు సౌగంధికవనంబుం జూచి వైడూర్య నాళంబులును, నమోఘపరిమళవిలసితంబులు నగు నానావిధసౌగంధిక పుష్పముల రమణీయత్వమునకు సంతసించుచు, యాజ్ఞసేనికోర్కె కొన సాగినదని మదిని మెచ్చుచు నాపుష్పములం గోయం దలంచుచుండ దానిని గాపుకాయుచుండు భయంకరాకారులు, నాయుధపాణులు నగు పది వేవురు రాక్షసులు భీముని సమీపించి 'యయ్యా! నీ వెవ్వండవు? మృగచర్మాంబరపరిధానుండవై యాయుధముల ధరించి యిట కేల వచ్చితివి?' యని యడుగ భీమసేనుండు వారి కిట్లనియె. నేఁ గురువంశ జాతుండగు పాండురాజు సుతుఁడను. ధర్మాత్ముండును నిరతసత్యవ్రతుం డును నగు ధర్మరాజుతమ్ముండను. మమ్ము నీదుర్గమారణ్యమునకు రాక్ష సులు మోచికొని రాఁగా బదరి కాశ్రమంబువఱకే తెంచితిమి. అంత నచ్చోటి కొక్కనాఁడు కరువలిచేఁ గొట్టఁబడి యాకసంబుననుండి యిల్లాతలంబునఁ బడి పొఱలుచు మాసమీపంబున నొకసౌగం ధికపుష్పంబు రాఁగాఁ బాంచాలి దానిసువాసనకు రామణీయకమునకు భ్రమ జెంది యట్టివి మఱికొన్ని తనకుఁ దెచ్చిపెట్టు మని కోరెను. దాని కోర్కెఁ దీర్చునిమిత్త మీపూవులం గొన్నింటి చిదిమి కొనిపో వచ్చిన వాఁడ ననఁగా భీమునకు రాక్షసు లిట్లనిరి. ఓరీ! ఇది కుబేరు వనంబు. మానవులకు దుర్గమంబు. ఇచ్చోట నెవ్వఁడేని యధర్మప్రవ ర్తకుం డగు నేని వాఁడు నశించు. కావున నాకుబేరుననుజ్ఞగొని నీకు వలసినన్ని పువ్వులఁ గొనుము. మీఁదు మిక్కిలి ధర్మరాజుతమ్ముండ వంటివి. ఆమహనీయునకుఁ దోఁబుట్టువవై ధనదనిర్మితంబైన యీసరో వరంబునందలిపుష్పములను వానియాజ్ఞం గొనక గైకొనుట పాడియే? మీఁదుగ నాయైలబిలునాజ్ఞ నుల్లంఘించుట నీ కుచితమే? యక్ష రాజానుమతిం గొనక యీసుమములఁ గన్నెత్తియైన నొకనికిఁ జూడ దరముగాదు. అనఁగా వారికి భీముం డిట్లనియె. ఓరాక్షసులారా! గుహ్యకేశ్వరుం డీ సమీపవర్తియై యుండఁడు. వర్తించిన నేమి? నాల్గు పూవులకుఁగా వాని నే యాచింతునే? ఉత్తమక్షత్రియుండు తనకు వలసినవస్తువులను క్షాత్త్రంబునఁ గొనును గాని భిక్షాచరణంబుచేఁ

గొనందు. ఇయ్యవి నెలయేళ్లం బుట్టినవి. కుబేరు పెరటియం దుత్పన్నములు గావు. ఇది దేవనిర్మితప్రదేశము. ఇం దెవ్వఁ డెవ్వని యాచింపవలయు? అని వారిని నిరాకరించి వా రాటంక పెట్టుచుండినను వారి మాటలఁ జెడచెవి నిడి భీమసేనుం డాకొలను సొచ్చె. అంత నాకావలి కాండ్రైన రాక్షసు లీదుర్మతి యెవ్వఁడో యెంత నివారించినను నిలువక కొలను సొచ్చుచున్నవాఁడు. అందఱము గూడి వీనిని శిక్షింతము, కొట్టుదము, కోయుదము, మనుష్యమాంసము నారగింతము. అని యుద్రేకపరవశులై వానిపై వివిధాయుధములఁ బ్రయోగించుచుం దన్నుఁ దాఁకఁగా భీమసేనుండు వారి నందఱ నొక్కుమ్మడి నిలువరించి కనకశైలముం బోని తనచేతిగద సారించి గిఱగిఱం ద్రిప్పి వారి నందఱ నొక్కవ్రేటు వేయుడు నందఱు నావ్రేటునకు మ్రందిరి. అంత హతశేషులగు కొందఱీవార్తను ధనదునకుఁ దెల్పఁ బోఁగా నా యక్షేశ్వరుండు వీరిమాటలను సావధానుండై యాలకించి భీమసేనుని యథేచ్ఛమెయిఁ వలసినన్ని పుష్పములఁ గోసికొననిండు. మీ రాటంక పెట్టవలదు. వాఁడు పుష్పములఁ గొనిపోవుట నా కిష్టము. నా కెంతయు నీవృత్తాంతము ముందే తెలియు ననఁగా రాక్షసులు కోపము చల్లార్చుకొని మఱల సౌగంధికవనంబున కేఁగిరి. అంత నచ్చట భీమసేనుండు విహరించుచుఁ బుష్పములఁ గోసికొనుచుండుటం జూచిరి. భీముం డిట్లు క్రోధవశగణము నోడించి సౌగంధికకమలములఁ బెక్కింటిఁ గోయుచుండె.

అంతఁ బాండవాగ్రజుం డున్నచోట వారికిఁ గొన్ని యపశకునము లిట్లు దోతెంచె. సుడిగాలి వీచెను. ఆలవాన గురిసెను. కొఱవులు పడెను. సూర్యుండు మసకగ్రమ్మిన ట్లుండెను. పిడుగు లాకసంబున నుండి పడెను. భూమి గడగడ వణఁకినట్లు గాన్పించెను. ధూళివర్షము గురిసెను. దిక్కులం దావిరి నిండెను. వఱడు లఱచెను. గృధ్రంబుల ప్రదక్షిణంబులై తిరిగెను. అంతటం జీఁకటి క్రమ్మిన ట్లయ్యెను. ఇట్టి దుర్నిమిత్తంబులు పెక్కులు దోతేర నివి యన్నియు సమరసూచనము లని ధర్మజుండు దలంచి, యిది యేమి కారణంబున నిట్టి యశుభంబులు గలుగుచున్నవి. ఎల్లవార లప్రమత్తులరై యుండుఁడు. అని ధర్మ

జుండు జాగరూకతను హెచ్చరించి తమతో భీముం గానక ద్రౌపదిం జూచి, భీమసేనుం డెచ్చోటి కేఁగినవాఁడు? వాని నెందులకేనిం బంపితివే? సాహసంబులకుఁగాని వానిమనంబు చొరదు. ఏమికారణమునవో యీ యుత్పాతంబులు కలిగె.

అనఁగా ధర్మరాజునకు ద్రౌపది యిట్లనియె. రాజేంద్రా! కరువలిచేఁ గొట్టుకొనివచ్చి యిచ్చోటున కొకసౌగంధికంబు రాఁగా దానిం గొని నీ కొసంగితిని గాదా? మఱియు నట్టివానిం గొన్ని తెచ్చి నా కొసంగ భీమసేను నపేక్షింపఁగా వానికై సౌగంధికవనమున కేఁగెను. నాకుఁ బ్రియంబు సేయునిమిత్తముగ నీశానుదెస కరిగె ననిన నందఱము వాఁ డున్న చోటికిఁ బోవవలయు ననఁగా ఘటోత్కచుండు తనయను చరు లగు రాక్షసులకుఁ దొల్లింటియట్ల యాజ్ఞాపింప వారి నంద ఱను బ్రాహ్మణులతోడ నారాక్షసులు మోచికొని సౌగంధికసరోవరంబు నకుఁ జనిరి. అంత ధర్మజుం డచ్చోట విఱిగినయంగంబులును, దెగిన కాలు నేతులు, డొల్లినశిరంబులును, ద్రెంపఁబడినప్రేవులును, గాకఘూకం బులు వొడిచి తినఁగా వ్రక్కలైనడొక్కలును, శిథిలంబులైన నెమ్ము లును గల యక్షులశరీరంబులఁ గాంచి, క్రోధారుణితనేత్రములతోఁ బెదవులఁ గఱచుచు, గాలరుద్రుంబోలె గదాధరుండై దుర్నిరీక్ష్యుం డగు భీమసేనుం జూచి, వానిసాహసకార్యంబున కద్భుతమంది 'యన్నా! యీసాహసంబేల చేసితి? దేవతలకిది ప్రియం బగునే? నాకుం గూర్తువేని నిఁక నెన్నం డిట్టి సాహసంబులకుఁ జొరకుము.' అని హితంబు గఱపి, వాఁడు గోసినకుసుమరాజంబుల ద్రౌపది కొసంగి యందు సంచరించు చుండె. అంత నావనపాలకులు గొంద ఱాయుధపాణులును, గొందఱు శిలలను ధరించియు, వీరిని జూఱచుఱుం జూచుచు వచ్చి సౌమ్యాకారు లగు ఋషిసత్తములను, శాంతస్వరూపుం డగు ధర్మజునిఁ గని వినమ్రులై వారికి సాష్టాంగముగా మ్రొక్కి ధర్మజు నాదరంబునఁ బ్రసన్నులై తమకుఁ దోడ్పడుచున్నంతఁ, గుబేరానుమతంబునఁ బాండవు లా గంధ మాదనసానువులలో నర్జును రాక కెదురుచూచుచుండిరి.

అంత నొక్కనాఁడు ధర్మజుండు భీమ, నకుల సహదేవులను, ద్రోప దిం జూచి యిట్లనియె. మనము రోమశమహర్షియనుగ్రహంబున ననేక

పుణ్యానదులను, దీర్థములను, సేవించుచు బ్రహ్మస్థలము, రాజస్థలము, దేవస్థలము, నాశ్రమంబుల వీక్షించుచు వారిసచ్చరిత్రంబుల వినుచుంటిమి. గంగాద్వారమును దాటి, హిమవంతమునం దనేకమహీధరముల నతిక్రమించి బదరికాశ్రమంబుఁ జేరి యిప్పుడు దానిం గడచని వచ్చితిమి.. ఇఁక గుబేరునిలయమైన యమరావతికిఁ బోవు టెట్లో యని యాలోచించుచుండ నొక్కయశరీరిణి యిట్లనియె. రాజేంద్రా! నీవు స్వపరివారముతో బహుదూరం బేతెంచితివి. మానవుల కగమ్యంబైన ప్రదేశంబులలోఁ గ్రుమ్మరితివి. పెక్కుతీర్థరాజంబుల సేవించితివి. అనేక పుణ్యాశ్రమంబుల వీక్షించితి. ఇఁకమీఁద నీకుఁ బోవ శక్యము గాదు. మఱలి నరనారాయణాశ్రమం బైన బదరీవనంబున కేఁగుము. అచ్చోట వృషపర్వాశ్రమంబు గడచి యార్ష్టిషేణాశ్రమంబున వసింపుము. అచ్చోట మీరు కుబేరాలయమును వీక్షింతు రనఁగా సుకుమారమై సుగంధయుతమై చల్లనిదైన మారుతము వీచెను. పుష్పవర్షము గురిసె. దాన ధర్మజు వెంబడినున్న విప్రజనంబులు విస్మితులై చూచుచుండ ధౌమ్యుం డుత్తరం బిటమీఁద మనము పోఁ జన దనఁగా ధర్మజుం డనుజులతోను, బాంచాలితోను, విప్రులతోను, భటాలితోను మఱలి నరనారాయణాశ్రమమునకుం జనుదెంచి ఘటోత్కచునకు వాని యనుచరు లగు రాక్షసులకు సెల వొసంగి తమతమ యునికిపట్లకుఁ బోవం బనిచె. అచ్చోట నతఁడు నర్జునుని రాక నిరీక్షించుచు భూసురాది పరివృతుండై సుఖం బుండె.

## భీమసేనుండు జటాసురుని వధించుట

అంత నొక్కనాఁడు జటాసురుం డను రాక్షసుండు ద్రౌపది నపహరింపఁ దలంపుఁ గొని విప్రవేషధారియై ధర్మజునొద్ద కేతెంచి 'యయ్యా! నేను సకలశాస్త్రార్థకోవిదుఁడను, విలువిద్య నెఱింగినవాఁడను, ఖడ్గాదిసాధనంబుల నుపయోగింప నేర్తు, నేను రాముని శిష్యుండ, విప్రుండను' అని చెప్పఁగా వానికలరూ పెఱుంగక వానిని మునిని బోలె ధర్మజుం డాదరించుచుండె. వాఁడును వారిపైఁ గపటపుఁ బ్రేమను జూపుచు వారి శస్త్రాస్త్రముల ప్రయోగకౌశలంబుల నెఱుం

గుహం దఱివేచి ద్రౌపది నపహరించికొని పోవువాఁడై యున్నంత నొక్కనాఁడు భీముం డాశ్రమమునందుండి యాయుధపాణి యై యెట కేనియో వేఁటకుఁ బోవ, రోమశధౌమ్యాదిమహర్షు లాహ్నికములఁ దీర్చుకొఱకు నాశ్రమంబు వీడి కొంతదవ్వరిగియుండ వాఁడు పాండవుల సర్వాయుధంబులఁ గొని ధర్మరాజనకులసహదేవులను ద్రౌపదీసహిత ముగా నెత్తికొని పాఱిపోవం దలఁచెను.అంత సహదేవుండు కొంతప్రయ త్నముం బూని వానిపట్టుఁ దప్పించుకొని వానిపై నుండి క్రింది కుఱికి వాఁ డెత్తికొని పోవుచుండిన యాయుధములలోనుండి ఖడ్గం బొక్కటి తిన్నగ లాఁగికొని భీము నఱచుచు నతండు వేఁటకుఁ బోయినమార్గ మున నేఁగెను. అట ధర్మజుండు వానిచేఁ జిక్కి వానిని బిలిచి యిట్ల నియె. ఓరీ దుష్టా! నీవు సదాచారముగల బ్రాహ్మణుఁడ వని నిన్ను మా యాశ్రమంబుఁ జొఱనిచ్చితి. నీ విట్లు నుసిగప్పిన నిప్పువోలె దురాచా రుండవైన రాక్షసుండ వని తెలియనైతి నవివేకీ! ధర్మము నెఱుంగవు. మానవులు తిర్యక్కులు నసురులును ధర్మం బెఱుంగుదురు. నీవును ధర్మ మెఱుంగుదు వని దలంతు. ఎఱింగినవాఁడవైతేని యిట్లు మమ్మెత్తుకొని పాఱిపోవు. శూరుండవైతేని మమ్మును వదలి మాయాయుధంబుల మాకొసంగి యెదుట నిలిచి యాయుధపాణివై పోరుము. పాంచాలిని మ మ్మోడించి యెత్తుకొని పొమ్ము. ప్రపంచమునం దుండు పశుపక్షి సరీసృపకీటకాదులన్నియు మనుష్యుల నాధారంబుగాఁ గొని జీవించు. నీవును మనుష్యులపై నాధారపడి జీవించువాఁడవు కావున నిమ్మా నవలోకంబున సంపూర్ణత గలదేని మీ రాక్షసలోకంబునకును సమృద్ధి యుండు. మీరును సుఖు లయ్యెదరు. ఇచ్చోట సంకటం బాపాదించునేని దేవతలకును గష్టములు గలుగు. మనుష్యు లొనర్చు నగ్నిహోత్రాదిక్రియలలోని హవ్యకవ్యముల దేవతలు తృప్తులయి మానవులకు వర్షాదుల నొసంగి మే లొనర్తురు. ఈ మనుష్యలోకమునకు మేము రక్షకులము. రాష్ట్రము లరాజకంబుఁ జెందనీయక దుష్టుల శిక్షించి, శిష్టులఁ బరిపాలించుట రాజధర్మము. రాజప్రమత్తుఁడై లోకములను రక్షించుచుండ మనుష్యులు సుఖిం తురు. కావున నిట్టిమానవులకుఁ బాలకుం డగురాజు నవమానింపరాదు.

ఇంతియగాక మావలన నీ కేకీడును గావింపఁ బడలేదు పైఁగా నీవు కపట వేషముఁ దాల్చి మాయొద్దనుండుట మే మెఱుంగక నిన్ను విప్రుఁడ వని పూజించుచుంటిమి. మాయన్నంబుఁ గుడిచి మాకే యాపదఁ గలిగించితివి. నిన్ను మేము రక్షించితిమి మమ్ము నీవు భక్షింప రాదు. అల్పబుద్ధిఁ గొని యల్పాచారుండవై యల్పపుఁజావు చావ రాదు. నీ కీపని తగదు. మమ్ము వదలుము. ప్రాణంబులం దాసఁ గొందు వేని మమ్ము వదలి యెటకేనియుఁ బొమ్ము. కాదేని శూరుండవై మాతోఁ బోరి మమ్ముం గెలిచి నీయిష్టంబు తీర్చికొమ్ము. ద్రౌపది నెఱుంగ కాసించితి. ఒడియందు నిప్పుఁ గట్టినవానిం బోలె, విషఫణీంద్రు కోఱలను బెఱుకుటకు యత్నించినవానిపగిది, గొప్పకడవలోని విషముద్రావువాని చందమున, ద్రోపది నెత్తుకొని పోవుటకు యత్నించెదవు. నీ కది కాని పని యని చెప్పుచు ధర్మజుండు వాని నదుమఁగా వాఁడు గమనవేగంబుఁ దఱిగి మెల్లన పోవుచుండుటయు ధర్మజుండు ద్రౌపదీనకులులఁ గాంచి వీనివేగమును మందగించితిని. వెఱవ వలదు. మన భీముండు వేగంబ యిచ్చోటి కేతెంచి మనకు విముక్తిఁ జేయును. అనుచుండఁగా సహదేవుండు వారిని సమీపించి జటాసురు నదలించుచు ధర్మజుతో నిట్లనియె. రాజా, క్షత్రియునకు యుద్ధమునఁ జచ్చుటొండె, లేక, గెలుపొంది శత్రుని రూపుమాయించి కీర్తిఁ గాంచు టొండె. పైఁ దెలిపిన రెండును క్షత్రియునకుఁ దగుకులోచితధర్మములు. కాఁబట్టి యప కారియైన యీరాక్షసునితోయుద్ధము చేసి వీనిఁ బొలియించుట కర్తవ్యంబు. వీఁడు సామవచనంబులకు లోఁగువాఁడుకాఁడు. వీఁడు రాత్రించరుఁడు. వీనికి నిశాసమయమున వీర్యం బగ్గలంబగు. అనేకమాయలంబన్ని మనల నప్పుడిడుమలఁ గుడిపించు కావున సూర్యాస్తమయమునకు మునుపే వీనివధోపాయంబు కర్తవ్యంబు అని చెప్పి యసురం జూచి 'రోరీ మదాంధా! ఈయధమంపుఁ బ్రదుకేల నీకు? నిలుము. పాండుసుతుండ సహదేవుండ నేను నిన్నీదినంబునఁ బోరిలో వధింప యత్నించి నీవెంట వచ్చుచున్నాను. నిన్ను వధింపనైతి నేని స్వకులాచారంబులకుఁ దప్పిన వాఁడనగుదు. నన్నుఁ జంపి పాంచాలిం గొనిపొమ్ము. హీనకర్ముఁడా! అట్లు కాదేని నిన్నుఁ జంపి నాక్షత్రధర్మంబు నెఱవేర్చెద'నని చెప్పుచుండఁ

గనే వృకోదరుండు వృకంబుమాడ్కి రాక్షసు నెదుర్కొని వజ్రపాణి యైన వాసవునివలె గదాపాణియై విహరించుచు వచ్చి యారాక్షసు మూపులనున్న ధర్మజనకులద్రౌపదులం గని క్రోధోద్రేకముగలవాఁడై 'దోసపలలాశీ! నీశౌర్యము నంతయును శస్త్రపరీక్షాకాలంబున నెఱింగితిని. ఏమో విప్రుండ వని మాఱునేత కియ్యకొనకుంటి. ఇఁకను నీకుఁ గాల మాసన్నమైనయది. నీరాక్షసమాయలను వెలిపుచ్చితివి. నిన్ను వధింపకున్న మాకు నరకావాసంబు సిద్ధంబు. గాలమునఁ జిక్కిన చేపఁ వైతివి. ద్రౌపది నెత్తికొనుపోఁ దలఁచితివి. అదియ నీచేటునకు మూలంబు. కాలాంతకుపాశబద్ధుండ వైతివి. అచిరంబుననే విగతజీవుండ వయ్యెదవు. అతిశీఘ్రంబున బకహిడింబులదారిం బట్టెదవు. నిను వధించి కాని నేను మఱలను. మావంటయింటికుండేల వైతివి.' అనుచుండ జటాసురుండు 'ఓరీ! భీమసేనా! కొందఱ మ్రుక్కిడి రాక్షసులం జంపితి నని విఱ్ఱవీగకుము. ఇప్పుడు పోరిలో నన్నుఁ జంపి చచ్చిన యారాక్షసులకు నీనెత్తుట జలాంజలిగావించెద' నని క్రోధారుణాత్ముండై సెలవుల నాకుచు భీము నధిక్షేపింప భీముం డూరకుండక వానిపై నెత్తి నడుచుటయు వా రిరువురును వృత్రేంద్రులవలెఁ బోరాడ సమకట్టిరి. ధర్మజనకులద్రౌపదులను వాఁడు క్రిందడించి దోసాటించి భీము దన ముష్టిఘాతంబునఁ బొడిచియు, నదల్చియు, విజృంభించియు నధిక్షేపించుచుండ నకులసహదేవులు భీమసేనునకుఁ దోడ్పడ సమకట్టఁగా వారిని భీముండు వారించి, వలదు మీరు కొంత సమరవిలాసంబుఁ గనుచుండుఁడు. వీనిఁ జక్కపెట్ట నే నొక్కండ చాలుదు నని దూరంబుననున్న యొక్కవృక్షంబు పెఱికి వానిపై వ్రేయఁగా వాఁడును వేఱొక వృక్షంబుఁ గొని భీముపై నేసెను. అంత నిట్లిరువురును జుట్టు నున్న తరువులతో యుద్ధంబు గావించి తరువులు సమసిపోఁగాఁ బాషాణంబుల నొకరిపై నొకరు ఉవ్వకొనుచుండిరి. అంతట నిరువురును మల్ల యుద్ధమునకుఁ జొచ్చి కొంతసేపు బాహాబాహిగా సమరంబు సలుపుచుండఁ గొంతవడికి భీముండు జటాసురునిఁ దనపిడికిట నొకపోటు పొడిచి దాన వాఁడు డయ్యఁగా వానిని హీనబలుంగా నెఱింగెను. అప్పుడు జటాసురుపాదంబుల రెంటి నొడిసిపట్టుకొని వానిని నాకసంబున

గిఱిగిఱిఁ ద్రిప్పి నేలఁ గొట్టఁగా వాఁడు నెత్తురు గ్రక్కుచుఁ, గనులు భీకరంబులై యుండ, నరములు దెగి, పెదవులఁ గఱచుచు విగతాసుఁ డయ్యె. అట్లు ఘోర రాక్షసుని వృకోదరుం డతిఘోరంబుగాఁ బరిమార్చుడు వానిశౌర్యంబును వెంట నున్నవిప్రులును మహర్షులును నన్నదమ్ములును ద్రౌపదియుఁ గొనియాడిరి.

అంతఁ బాండవాగ్రజుం డనుచరులతో నరనారాయణాశ్రమంబు నివాసంబుగాఁ జైకొని యుండి యొక్కనాఁడు పార్థుం దలంచి సోదరులతోను ద్రౌపదితోను నిట్లనియె. మనపార్థుం డస్త్రార్థము చని నాలుగేండ్లయ్యె. అయిదవయేఁడు నడచుచున్నయది. వాఁ డింకను నేల రాఁ డో కో? వాని నెదుర్కొనునిమిత్త మీ శ్వేతపర్వతమునందుఁ జరించుచున్నాము. నాకలోకంబున నస్త్రార్థంబే నేం డ్లుండుదునని తొల్లి నాతోఁ జెప్పియుండెను. కాలాతిక్రమణం బయ్యె. ఇంక నవశ్యంబు రాఁ గలఁడు. నాకుఁ గన్నుకై మెలంగుచుండు. పార్థు నెడఁబాసి యుండుట దుస్సహంబైయున్నయది మనస్సు వానిం జూడఁ దత్తరపాటొందుచున్నయది యని తనమనోభావమును వెంట నున్నబ్రాహ్మణులతోఁ జెప్పి వారికిఁ దమ్ములుం దానును బ్రదక్షిణనమస్కారము లాచరింప వారు ధర్మజాదులభక్తికి మెచ్చి వారితో మీయాపద లెల్ల నచిరంబ తొలంగు. క్షత్రధర్మంబున యయాతివోలె రాజ్యంబుఁ గొని సుఖముగ నేలుదురు గాకయని యాశీర్వదింప ధర్మరాజు వారిదీవనలచే సంతుష్టాంతరంగుండై వారుం దనవారును తోడు నడువ నుత్తరంబునఁ గైలాసంబును మైనాకంబును గంధమాదనసమీపగతపర్వతములను, శ్వేతపర్వతంబును వీక్షించుచు ముందఱిహిమవత్పర్వతమునకు వెనుకభాగంబున గంధమాదనపర్వతపరిసరంబునందు బహుపుష్ప ఫలనానాద్రుమలతాశోభితం బైన వృషపర్వునాశ్రమంబుఁ గాంచె. అంత వృషపర్వుండు ధర్మరాజునకు సపరివారంబుగ నాతిథ్యం బొసంగ ధర్మజుం డామునిసత్తమునకు మ్రొక్కినతండు వారలం గొనియాడి ధౌమ్యరోమశులకుఁ బ్రత్యేకాతిథ్యంబు సేయ నాసత్కారంబునకు వారలిద్దఱు హర్షించిరి. వీ రందఱితో నా యాశ్రమంబున సప్తదినంబు లుండి యష్టమదివసంబునఁ దనతోడివిప్రుల నెల్లర ధర్మజుం డంద ఱించి యామునీశ్వరునధీనము గావించి యాగ

పాత్రలను స్రుక్స్రువముల నంద యుంచి, ధౌమ్యరోమశులను సోద రులను ద్రోవదిని వెంటఁ గొని యుత్తరంబున కేఁగుటయు వృషపర్వుండు వారల నాశీర్వదించి కొంతదవ్వరిగి దారి చూపి వెనుకకుఁ దిరిగి తన యాశ్రమంబుఁ జేరి ధర్మరాజు తనవశమున నుంచిన విప్రుల నాదరించుట యందు జాగరూకుండై యుండె.

పాండవులు గంధమాదనపర్వతరామణీకముఁ జూచుట

సత్యపరాక్రముఁ డయిన కౌంతేయుఁడు యుధిష్ఠిరుఁడు పాదచారియై తమ్ములును గూడ రాఁగా ఋషి చూపినమార్గమునఁ దరలి, నానావిధవృక్షసమూహంబులు గల పర్వతసానువులయందు నివసించుచు, నానామృగంబుల కునికిపట్టగు శ్వేతపర్వతంబును నాలుగవ దినంబునఁ బ్రవేశించిరి. అవ్వల నా పాండవులు వృషపర్వునిచేఁ జూపఁబడిన మార్గమును బొంది,యతఁడు చెప్పినప్రకారముననే పోవుచు ననేకపర్వతంబులను దాఁటి యొక్కొక్క పర్వతపుఁ బై భాగములఁ జొరరాని గుహలను జూచుచుఁ బోఁగూడని పెక్కు కొండలను సుఖముగానే దాఁటిపోయిరి. ధౌమ్యుఁడును, ద్రౌపదియుఁ, బాండవులును, రోమశ మహర్షియుఁ గూడి యాతావున కేతెంచిరి. ఒకఁడును నచట నిలువఁ డయ్యె. మహాత్ము లగువారందఱు మృగపక్షులతోఁ గూడినదియుఁ బెక్కులగు వృక్షములతోను దీఁగలతోను నొప్పినదియు గుమ్ముడు, రేగు, జువ్వి, అత్తి, మఱ్ఱి, రావి, పాల, జీడి, నెల్లి, కరక, చంద్ర, గార, కలివె, తుమ్మికి, గొజ్జగి మొదలగు నట్టి వృక్షములను, నింకను నమృతతుల్యము లగు పండ్లతో నిండియుండు గంధమాదనపర్వతపుఁ జఱియలందలి యనేకవృక్షములను, మఱియు సంపంగి, యశోకము, మొగలి, పొగడ, పొన్న, ఏడాకులయరఁటి, కొండగోఁగు, పాటలము, కొండమల్లి, మందారము, మెట్టదామర, పారిజాతము, కాంచనము, దేవదారువు మొదలగు వృక్షములను, సాలతాలతమాల పిప్పలహింగుకవృక్షములను, శాల్మలికింశుకాశోక శింశుపాసరళవృక్షములను, జెవులకింపుగను మధురంబుగను గూఁత లిడుచుండు చకోరములు, శతపత్రములు, గండుఁదుమ్మెదలు, చిలుకలు, కోయిలలు, పిచ్చుకలు, తిత్తిరిపక్షులు, చకోరములు, ప్రియకములు, చాతకములు,

మఱి పెక్కు తెఱంగులగు పక్షులచే నధిష్ఠితంబు లగుననేక వృక్షములను, కుముదపుండరీక కోకనదోత్పల కమల కహ్లారములతో వెలయుచు మనోహరంబులైన చెఱువులను, మఱియు కొంగలు, చక్రవాకములు, నీరుకోళ్లు, గోరువంకలు, బెగ్గురులు, రాయంచలు, పక్కుకొంగలు, నీరుకాకులు, మొదలగు జలచరంబులగుపక్షుల తోను, కమలములందలి పూదేనియలఁ గ్రోలి మత్తిల్లి శాఖామృగ గణంబులచే నలంకరింపఁబడినదియు, దామర కుంటలతోను, మహావనం బులతోను గూడినదియు నై యొప్పుచుండు పవిత్రమైన మాల్యవంత మను పర్వతమును గాంచిరి. ఆవలఁ గింపురుషుల కునికిపట్టును, సిద్ధచారణసేవితంబును విద్యాధరులతోను, గిన్నరాంగనలతోను గూడినదియు, నేనుఁగులగుంపుల కునికిపట్టును, సింహ వ్యాఘ్రగణముల కావాసభూమియు, శరభమృగంబుల బొబ్బరింతలకుఁ బ్రతిధ్వనుల నీనునదియుఁ బెక్కుమెకంబులకు నునికియు నై నందనవనంబుఁ బురుడించు గంధమాదనంబుఁ గాంచి, దానిసొంపునకు మేనుల గగుర్పాటొదవ, మనోనయనములకు నింపువుట్టు మేటియడవులుగల యాగంధమాదనపు టరణ్యమును ద్రోవదియు, మహాత్ము లగువిప్రోత్తములును వెంట రా ధర్మజుఁడు దాని యందుఁ బ్రవేశించె. అట్లు పాండవు లాగంధమాదనంబునకుఁ బోవునప్పుడు నానావిధంబులగు పక్షులమోములనుండి వెలువడి యవ్యక్తమధురంబులై చెవులకు మనంబునకు నింపుపుట్టించెడి కూఁతలను వినుచు, నన్నిఋతువు లందుఁ బూచిన పూవులతో నొప్పి,యన్నిఋతువులందు ఫలించినఫలంబులతో నిండి, యాఫలభారమునకు వంగియుండునవి యగుమామిడి, అంబాళము, కొబ్బరి, తుమ్మిక, ముంజాతకము, అంజీరము, దాడిమ, మాదీఫలము, పనస, నిమ్మ, అరఁటి, ఖర్జూరము, పుల్లప్రబ్బలి, పరావతము, క్షౌద్రానీపము,మారేడు, వెలగ, నేరేడు మొదలగు చెట్లతోను దమయందలి మకరందములు గ్రోలి, సొక్కి సోలి పుష్పాళ్లపైన సోఁకుటం జేసి, యొత్తువిరంగు గలవై యింపుగాఁ గూయు తుమ్మెదలరొదలతో నిండి యంతట నున్న తామరపువ్వులచే సింగారింపఁబడియున్న కొలఁకులను, మఱియు నచ్చటఁ దీఁగెలజొంపములందుఁ బెంటినెమిళ్లతోఁ గూడి,

మేఘగర్జనంబు లాలించి కడు మోహపరవశంబులై కేకలచే శ్రావ్య
మధురధ్వనులు గలగానంబు చేయుచుఁ,బురులు విప్పి విలాసనాట్యంబులు
సలుపుచు వనవిహారాసక్తములైనందున నానందభరితంబులగు తీఁగల
జొంపములతో నిండి యిఱుకైయున్న కొండమల్లెపొదలందుఁ గొన్ని
నెమిళ్లను, మఱి దమయంగనలతోఁ గూడి విహరించి కైపెక్కినవి
వోలె నున్న మఱికొన్ని నెమిళ్లను, బురులు విప్పి పైకెత్తి యంతటం
బర్వఁజేసి, కిరీటములు దాల్చియున్నవో యన్నట్లుండు వేఱొక్కకొన్ని
నెమిళ్లను, గొనలందుఁ బసిండివన్నె పువ్వులు గలిగి, మన్మథుని తోమర
ములో యననొప్పు గొప్పవావిలిరెమ్మలను, జెవులతొడవులో యనఁ
దగి కొనలందుఁ బూచియున్న పర్వతసానువులందలి కొండగోఁగుపువ్వు
లను,మఱి వనపంక్తులందుఁ బూచి కాముకులను వశపఱుపఁజాలెడి మరుని
తూపులో యనఁదగు గోరింటపూవులను, వనపంక్తు లనెడి కాంతలు
దిద్దినగొప్పతిలకంబులో యనఁదగు తిలకవృక్షంబులను, మఱి మరుని
తూపులంబోలె నింపుగులుకు తియ్యమామిడియిగుళ్లను, మఱి తుమ్మె
దలబారును మీఁదఁ దిరుగు పూవులగుత్తులతో నిండి, కాఱుచిచ్చులం
బోలె వెలుఁగుచున్న పసిఁడివన్నె పువ్వులతోను, లోహితవర్ణములు;
కాటుకవన్నెలు, వైడూర్యవర్ణములు గలిగి శైలములు తమశిరంబు
లందుఁ దాల్చినపూవులసరములో యన నొప్పుపుష్పములతో వెలయు
సాలతమాలపాటలవకుళవృక్షంబులను జూచుచు, నిర్మలస్ఫటికవర్ణ
ములు గలిగి, తెల్లనిఱెక్కలుగల రాయంచలతో నొప్పుచు, బెగ్గురు
పక్షులరుతంబులతో నంతట నిండి, పద్మోత్పలశోభితంబులై సుఖస్పర్శశీతల
జలంబులు గలిగి కొండచరియలందు వెలయు పెక్కుకొలఁకులను
జూచుచు, నెత్తావిగలపువ్వులను, జవిగలపండ్లను, నందములగు కొలఁకు
లను, మనోహరంబు లగువృక్షములను జూచుచుఁ గమలోత్పల
కల్హారపుండరీకంబులనెత్తావి గొని, తిన్ననిపిల్ల తెమ్మెరలు వీచి, డెంద
ముల కాహ్లాదంబు గలిగింపఁ బాండవులు సంతసముచేఁ గనుదమ్ములు
విచ్చి, చూచుచు గంధమాదనంబు చొచ్చిరి. అంత యుధిష్ఠిరుఁడు
భీమునిఁ జూచి, ప్రేమ గులుకుమాటల ని ట్లనియె.

"భీమసేనా! ఈగంధమాధనపర్వతం బెంతకాంతితో నొప్పి యున్నదో చూడుము. ఈపర్వతమున మనోహరకాననమునందలి వృక్షములును, లతలును బత్రపుష్పఫలభరితములై గండుఁగోయిల కూఁతలతోఁ నిండి, పూచినపువ్వులు గలిగి వెలయుచున్నవి. ఈగంధమాదన సానువులందు ముండ్లుగలచెట్లును బుష్పరహితము లగు వృక్షములును లేవు. ఈగంధమాదనసానువులందలి వృక్షములు దట్టము లగుపత్ర పుష్పఫలంబులతో నిండినవయి యొప్పుమీఱియున్నవి. ఓ భీమసేనా! పూచినతామరపువ్వులు గలిగి, తుమ్మెదల ఝుంకారములతో నిండి కరేణుసహితమదగజంబులచేఁ గలఁతపెట్టఁబడుచున్న యీకొలఁకులను జూడుము. భీమసేనా! ఇదిగో కమలోత్పలశోభితమైన వేఱొక నళినిం జూడుము. ఇది పుష్పమాల్యంబులను దాల్చి వేఱురూప మెత్తివచ్చిన లక్ష్మీదేవియో యననొప్పుచున్నది. ఈకాననోత్తమంబున నానాపుష్ప సుగంధభరితములై, తేనెటీఁగలఝుంకారములతోఁగూడిన యీవృక్షంబులవరుస లెంతమనోహరంబులై వెలయుచున్నవో చూడుము.ఓ వృకోదరా! ఈపుణ్యదేశంబులను, నందలిదేవతోద్యానంబులను జూడుము. మనుష్యగోచరంబుగాని యీప్రదేశమును బొందిన మనము కృతార్థుల మైతిమి. ఓ భీమా! పుష్పితాగ్రము లగు తీఁగలతోఁ గూడి విరాజిల్లు నీపాదపంబులను జూడుము. ఇందుఁ బెంటినెమిళ్లతోఁ గూడి యింపుగాఁ గూయుచుండు నాఁడునెమిళ్ల కేకారవంబులను వినుము. వెన్నెలపులుఁగులు, మత్తిల్లినకోయిలలు, గోరువంకలు బెగ్గురులు మొదలగు పక్షులీ పుష్పభరితము లగు వృక్షములమీఁదికి వాలుచున్నవి చూడుము. రక్త పీతారుణవర్ణంబులైన పెక్కులు వెన్నెలపులుఁగులు చెట్లకొనలందుఁ గూర్చుండి యొండొంటిని జూచుచున్నవి. మఱి హరితారుణవర్ణంబులైన పచ్చికబయళ్లదాపునను సెలయేళ్లయందును బెక్కుబెగ్గురులు నడయాడు చున్నవి. గండుతుమ్మెదలును, వెన్నెలపులుఁగులును, రాపులుఁగులును సకలభూతమనోహరంబులైనధ్వనులను జేయుచున్నవి చూడుము. నాలుగుకోఱలు గల్గి, పద్మగంధముతో నొప్పు మదపుటేనుఁగులు వైడూర్యవర్ణము గల యీగొప్పకొలనిని గలియఁబెట్టుచున్నవి. పెక్కుతాటిచెట్లయెత్తుగలవై కొండలకొనలనుండి జాఱిన సెలయేళ్లు క్రిందఁ

బడుచున్నవి. మఱి, సూర్యకాంతి గలిగి, శరత్కాలమేఘములను బురుడించుచు, కొన్నిచోట్లఁ గాటుకవన్నెతో నొప్పుచు, వేఱుకొన్ని చోట్లఁ బసిండివన్నె మీఱుచు నుండు హరిదళము, నింగి లీకము మొదలగు ధాతువు లీపర్వతంబును వెలింగించెడి. కొన్ని చోట్ల సంజ వేళలందలి మబ్బులవలె నెఱ్ఱనైన మనశ్శిలాగుహాలును మఱికొన్నిచోట్లఁ గుందేటిరక్తమువలె నెఱ్ఱనైన గైరికధాతువులును, వేఱొకకొన్నిచోట్ల దెల్లనినల్లనిమబ్బులను బోలినవి, వేఱుతావులందు బాలసూర్యునిఁ బోలి నవియై యెక్కువకాంతులతో నొప్పు ధాతువులెల్ల నీపర్వతరాజంబును వెలిఁగించు చున్నవి.

భీమవిక్రము లగుగంధర్వులును, గిన్నరకింపురుషులును దమతమ ప్రియురాండ్రతోఁ గూడి పర్వతశిఖరంబులందు విహరించుచున్నవారు. ఈ ప్రదేశంబున సర్వభూతమనోహరంబుగ వినఁబడు సమతాలము లగు గీతములయు సామంబులయు నిస్స్వనంబు విస్తరంబుగావినఁబడుచున్నవి. భీమసేనా! శుభకరంబును బవిత్రమును నైనదేవనదియగు నీగంగానదిని జూడుము. దీనిదరులందు మహర్షులును గిన్నరులును విహరించుచుందురు. రాయంచపిండువులు వీనివెల్లువలందు నడయాడుచున్నవి. ఓశత్రు సూదనా! ఈపర్వతేంద్రంబునొం పే మన నగును! దీనియందుఁ గాన్పించు నానావిధధాతువులును, బాఱెడినదులును, నడయాడు కిన్న రులును, మృగపక్షులును, గంధర్వాప్సరసలును రమ్యకాననంబులును, నూఱుతలలుగలిగి పెక్కురూపంబులు గల సర్పరాజములును మనం బులకు మిక్కిలి యానందము గొల్పుచున్నవి." ఆ యాగంధమాదనపుఁ జక్కఁదనమును యుధిష్ఠిరుఁడు వర్ణింపఁ దక్కినవా రందఱును నమందా నందభరితులై యాపర్వతరాయణీమకమును జూడఁజూడఁ దనివి నొందక యుండిరి. అంత వారు సకలవిద్యాపారంగతుఁడైన యార్ష్టిషేణునియాశ్ర మంబుఁ జేరిరి.

## పాండవు లార్ష్టిషేణాశ్రమంబునకుఁ బోవుట

అతీరున నాగంధమాదనపర్వతంపు సింగారంబుం గనుంగొనుచుఁ బోవువారు ముందఱ దట్టంపుటాకులు సొంపైనసూనంబులును రసవం

తంబులైన ఫలంబులును గలిగి తరునికరసంపూర్ణంబై యలరారు నార్ష్టి షేణునాశ్రమంబుఁ గనుంగొని దానియభ్యంతర దేశంబుఁ జేరి బహు కాలంబు నిష్ఠమెయిఁ జేయుచుండు తీవ్రతపస్సుచే నొడ లెల్లఁ గృశించి నరములు మాత్రము గోచరించుచుండువాని నార్ష్టిషేణుఁ గాంచి తమ్ములుం దానును ద్రోవదియుఁ దమతమప్రవరలఁ జెప్పి యభి వాదనంబు లాచరింప నారాజర్షిశ్రేష్ఠుండు వారలఁ గూర్చుండ నియ మించి, యథాన్యాయంబుగ ధౌమ్యు నాదరించి ధర్మజునితో నిట్లనియె. "ధర్మనందనా! పితృశుశ్రూష తఱుఁగదుగదా ధర్మము నాచరింతువే ? సత్యం బాడుదువే? అసత్యంబు విడుతువే ? గురువుల నాదరిం తువే ? పాపాత్ముల వదలుదువే ? సుకృతదుష్కృతకరణత్యాగంబులను నాలోచించి యొనర్తువే ? నిన్ను నీవ పొగడికొనవు గదా ? సాధువులు నీకరణంబుల మెత్తురే ? కాననంబుననైనను ధర్మంబు విడువక యాచ రింతువే? నీయాచారంబులు సదాచారంబులే ? వాని ధౌమ్యుండు మెచ్చునే ? దానధర్మములచేతను, దపశ్శౌచములచేతను, నార్జవతితిక్షల చేతను నొప్పి పెద్దలనాటంగోలె లభ్యంబైనవృత్తి ననుసరించి రాజర్షి వర్తనంబున నడుతువే ? పితృలోకావాసు లగు పితరులు తమకులం బున జనించినవారు సేయు పితృయజ్ఞములచే సంతసింతురు. తమసంతతి వారు పాపులై దుష్కార్యంబులఁ జేసినచోఁ బితరులు దుఃఖింతురు. తల్లిదండ్రులు గురువు అగ్ని ఆత్మ అనునీయైదుగురు నెవనిచేఁ బూజింపఁ బడుదురో, వాఁ డుభయలోకసుఖములం జెందు. కావున నో ధర్మనం దనా! నీ వాతీరున నడుతువే ? " అని యడుగ ధర్మజుం డిట్లనియె. మహాత్మా! దయతో ధర్మముల నెఱుఁగఁ జెప్పితివి. నాయోపినం తకు లోపము వాటిల్లక ధర్మముల ననుష్ఠింతు. అనఁగా నార్ష్టిషే ణుండు వెండియు ధర్మరాజున కిట్లనియె. రాజేంద్రా ! కిన్నరగంధర్వాకిం పురుషసిద్ధాదులు దివ్యవస్త్రమాలికలతో నలంకరించుకొని తమతమజాతి కాంతాజనులఁ గూడి యీశిఖరంబున విహరించుచుందురు. వారిభక్షులు పర్ణభక్షులు, వాయుభక్షులు, నాకాశగాములు నగు మహర్షులు పర్వ సంధులయం దీపర్వతరాజమును సేవింప వత్తురు. ఆకాలములయం దీనగ

ముపై భేరీపణవమృదంగాదిశబ్దములతోఁ గూడిననానావిధవాద్య ధ్వనులు వీనుల కింపుగా విన నయ్యెడి. ఆనిస్వానము నిచ్చటనుండియే వినవలయుఁ గాని యాధ్వని పుట్టుతావునకుఁ బోరాదు. దేవతాసంచార యోగ్యంబైన యీప్రదేశంబు మనుష్యుల కగమ్యంబు. ఈప్రదేశమున జితేంద్రియుండై మానవుండు వర్తింపనిచో వాని నిచ్చోట దిరుగుచుండు సర్వభూతములును ద్వేషించు. మఱియు నట్టివాఁడు రాక్షసులచే నినుపశూలములచేఁ బొడువఁబడును. ఈశిఖరమును దాఁటుచుండఁగనే దేవతలును సిద్ధులగుమహర్షులును సంచరించుప్రదేశంబులు గానంబడు. కుబేరుండు యక్షరాక్షసులు దన్నుఁ గొలువఁగాఁ బర్వసంధులయం దీపర్వతోద్యానములందు నప్సరఃస్త్రీలతోఁ గ్రీడించుచు నెల్లవారికి దర్శన మొసంగును. అప్పుడైలబిలునిదర్శనార్థమై తుంబురుఁ డేతెంచి చేయుదివ్యగానము సామగానము వీనులకు శ్రావ్యంబై యుండు. ఈపర్వతములోని చిత్రవిచిత్రదృశ్యంబులను సర్వప్రాణులును బర్వసంధులయందు లోచనగోచరంబులు గావించుకొను. మీరును జితేంద్రియులై యిచ్చోట లభించు రసవంతములైనఫలాదు లాహారముగాఁ గొని, యర్జునుండు వచ్చువఱ కిందే యుండుఁడు. అని యార్ష్ణిషేణుండు ధర్మజాదులతోఁ జెప్పినవృత్తాంత మంతయు జనమేజయునకు వైశంపాయనుండు సెప్పఁగా విని యవ్వలఁ బాండవు లార్ష్ణిషేణాశ్రమంబున నెంత కాలము వసించియుండి రనియు, నచ్చో వారెట్లు కాలమును గడుపుచుండి రనియు, వారు భుజించుచుండినపదార్థము లెవ్వి యనియు, మహాపరాక్రమవంతుఁ డగు భీమసేనుఁడు యక్షులతోఁ గలహింపకూరకుండెనే యనియు, యక్షేశ్వరుండు పర్వసంధులందు స్వపరివారసమేతముగ నాపర్వతశిఖరమునందలి సర్వప్రాణులకు దర్శన మొసంగునని యార్ష్ణిషేణుండు సెప్పెనే. ఆతీరునఁ బాండవుల కా లోకపాలుని దర్శనం బయ్యెనే యనియు, మహానీయుండైనధర్మజుచరిత్రం బెంత విని నను మనంబు సంతుష్టిఁ జెందలేదు. కావున నింక నవ్వలివృత్తాంతం బంతయుఁ జెప్పవే యని క్రమ్మఱ జనమేజయుం డడుగఁగా వైశంపాయనుం డిట్లనియె.

అటఁ బాండవు లార్ష్టిషేణునివచనంబున నాపర్వతప్రాంతము లలో ఋషులయాహారంబులైన మధురఫలములను, విషపూతములు గాని శుద్ధబాణములతోఁ గొట్టినమృగమాంసంబులను గాని నానావిధ ఫలరసములను గాని యుపయోగించుచు, నచ్చోటి కేతెంచిన మహర్షు లతో నిష్టకథాగోష్ఠిఁ గాలంబుఁ బుచ్చుచుఁ గొన్నిమాసంబు లుండిరి. అంత నొకనాఁ డాపర్వతమున నున్న యొక్కమహాహ్రదంబును దన కునికి పట్టుగాఁ గొని బహుకాలంబు వసించుచుండిన బుద్ధిమంతుఁ డనుమహానా గమును గరుడుఁడు తన రెండుకాళ్లతో గ్రహించి యాకసంబున కెగురఁగా నాపర్వతము చలించె. అచ్చోటివృక్షములు గూలె. సర్వప్రాణులు భయ సంత్రాసంబుల విస్మయ మందె. అప్పుడు సమీరుఁడు చల్లఁగా వీఁచు చుండ నయ్యది విపరీతమై చండమారుతము కాఁగా నావేగంబునకు నెచ్చటివో కొన్ని పలువన్నెలపుష్పాలు మారుతానీతంబులై నేలం గొట్టు కొని రాఁగా వానిం జూచి భీమసేనునితో ద్రౌపది యిట్లనియె. నాథా! ఈకుసుమంబులు రమణీయంబులు. ఇట్టివానిం గొన్నింటెని నాకుఁ గొని తెమ్ము. తొల్లి సౌగంధికములను సాధించి నా కొసంగినశూరుండవు నీవు కావే. నీపరాక్రమం బసాధారణంబు, ఎద్దియేని సాధింప శక్తుండవు. ఈపుష్పరాజంబు లశ్వరథానదీప్రాంతముల తరువుల నలంకరించియుండు. అచ్చోట నివి విస్తారముగ నుండు. నీవు, పరాక్రమవంతుండవై గంధ ర్వులను,యక్షులను, సురగులను ఖాండవవనంబునందుండి తొల్లి,యావనం బింద్రునిదైనను వానికి వెఱవక యగ్నిదేవుని కొసంగి మాంటమేఱకు నావనంబుం గాల్చి యింద్రునితో సఖ్యంబు గావించికొని కిరీటమును నక్ష యతూణీరములను నగ్ని కానుక యీయఁగాఁ గొన్న వీరుఁడైన యర్జు నుని కన్నవు గావే? నీపరాక్రమము కడ్డు లేదు. కొలఁది లేదు. నీభుజ బలపరాక్రమంబునకు వెఱచి యిచ్చోటిరాక్షసులెల్ల బరుపిడుదురు. నిన్ను యథార్థంబుగ నే నెఱుంగుదు.నీవెత్తికొనిపోఁగా నీపర్వతశిఖరము వీక్షింప నాసఁ బొందెద. అని చెప్పఁగా బలదర్పోద్రిక్తుండై మానవంతుఁ డైనభీముం డుద్రేకించి ద్రౌపదీవచనములు మఱింత ప్రోత్సాహపఱుప వింటి నమ్ములను దూణీరమును ఖడ్గాదిసాధనములంగొని షడించిన యేనుఁగు

గుపగిది నాశైలసానువులలోఁ భయమోహరతుండును, లజ్జాత్యాగియు, మత్సరశూన్యుండునునై సర్వప్రాణులును దన్ను విస్మయముతోఁ జూచుచుండఁ బాంచాలరాజపుత్త్రికి వేడుక గలిగించువాఁడై మహోన్నతంబైనయాగిరిశిఖరం బారోహించియచ్చోట బంగారుమేడలతో నొప్పునదియు, ననేకస్వాదుఫలసమంచితతరునికరములతో వెలయుతోఁటలు గలదియు, రమణీయద్వారతోరణగోపుర సహితంబైన నగరుగలదియు, మారుతాహతమై పటపటాత్కారంబున నెగురుచుండు పతాకముగలదియుభరతనాట్యప్రవీణుచే సేవితమయి స్వర్ణమయమై స్ఫటికంపుగోడలలతో నొప్పు గృహోపరిభాగంబులుగలదియు నగు ధనదునినివాసస్థానంబుఁ జూచి,లలితవాయుస్పర్శచేఁ జొక్కినమనంబుగలవాఁడై యరిజనహృదయత్రాసజనకంబైన శంఖంబుఁ బూరించి ధనుష్టంకారంబు గావించె.

భీమసేనుండు మణిమంతుఁ డనుయక్ష నాయకు వధించుట

అంత సకలప్రాణిభయంకరం బగు నాశంఖధ్వని విని యచ్చోటఁ గాపుండు యక్షరాక్షసగంధర్వులాయుధపాణులై పఱతెంచి యుద్ధోన్ముఖులై భీమునకుఁ ఎదుఱ నిలిచి యట్టహాసంబున నాసమీరకుమారుఁ దాఁకిరి.అంతనామహాబలుండు వారు తనపైఁ బ్రయోగించినయాయుధములను బాణములను నన్నింటిని నుగ్గునేసి వారిదేహముల వ్రక్కలుగా వించి, తలలు పగిలించి నెత్తురు కాలువలు పాఱునట్లు సేసె. అంత నాకుబేరుపరిజనులు భీమునిపై నందఱు నొక్కుమ్మడి బాణప్రయోగంబులు సేయ నవి యెల్లను సూర్యమండలము నాకసంబున గప్పిన మెయిుఖుల చందంబయ్యె.దానికి మోహ మొందక భీమసేనుం డాటోపంబున ననేకాస్త్రంబులఁ బ్రయోగించుడు యక్షరాక్షససేన విధ్వస్తమయ్యె. అంత హతశేషు లీమహాకాయువీర్యంబునకు వెఱచి యాయుధంబుల వదలి దక్షిణాభిముఖులై పాఱిరి. ఈయాపద్వృత్తాంతమును గుబేర సఖుండు మణిమంతుం డనువాఁడు విని వెంటనే పాఱుచున్నసైన్యమును బురికొల్పుకొని వారిని బ్రోత్సహించుచు వెండియు భీమసేనుపైఁ బూనుచు, నో యక్షరక్షస్సులారా! మీపరాక్రమంబు లేల? సామాన్యమానవుఁ డొకనికి వెఱచి పిఱికిపందలై పాఱెదరు నే? వాఁ డనఁగ నెంతఁ అతండు మనప్రదేశమును జొచ్చి మనలనే ధిక్కరించుచున్నవాఁడు.

ఒంటరి కాఁడు. వానికిఁ బలువురోడితిరి. ఈవృత్తాంతము ధనేశ్వరుఁడు విన్నచో మిమ్మును మెచ్చునే? ఇది తగినపని కానేరదు. మఱలుఁ డని చెప్పి వారితోఁ దాను నాయుధపాణియై భీమునితో యుద్ధమునకు సమకట్టె. భీమసేనుని మణిమంతుండు సరకుఁగొనక తాఁకుచు, వానిపై ననేక శస్త్రములను, నస్త్రములను,వివిధాయుధములను బోరన ప్రయోగించెను. అవి యన్నియు భీమసేను ప్రత్యస్త్రప్రయోగంబుల వమ్ములు కాఁగా వాఁడు శక్తిశూలగదాపాణియై తాఁకిన భీమసేనుండు మూఁడువాడి తూపుల వానిం గొట్టె, అందులకు మణిమంతుండు నొచ్చియు నలయక భీమసేను నెదుఱ నిలచి శౌర్యముతోఁ దనచేత నున్నగదను శత్రువుపై వేయఁగా నాకసంబున వచ్చుచున్న యమ్మహాసాధనమును తాలరువ్వియు బ్రత్యస్త్రములచేఁ గొట్టెను. మఱియు భీమసేనుండు గదాయుద్ధమున నందఱికంటె నెక్కువపరిశ్రమఁజేసియుండుటచే, మణిమంతుగదాప్రయోగంబు భీమసేను మఱింత బలవంతుఁ జేసె. కాని, మణిమంతుం డంతటితోఁ బోక ఘోరాకారంబైనశక్తి నొకదానిని భీమసేనుపై వేయఁగా నామహాసాధనంబు భీముశరీరదక్షిణభాగంబుఁదాకి వానిదక్షిణభుజమును భేదించి రౌద్రాకారంబునఁ గ్రిందబడి తనంతట నది చల్లారెను. ఆపోటుచేత నుద్రిక్తుండై భీముం డరుణకమలనేత్రుఁడై కన్నుల నిప్పుకణంబులు రాల, శౌర్య ముద్రేకింపఁ దనచేతిగదఁ గొని పోట్లాడ యత్నించుటయు, నాయక్షుండు భీముపై మఱల వేఱొకశక్తిఁ బ్రయోగించిన భీమసేనుండు దాని మూఁడమ్ముల భగ్నంబు గావించి, వైనతేయుండు కాద్రవేయులం బోలె గదతో నాయక్షునాయకు లెస్సగా మొత్తెను. అందులకు మణిమంతుఁడు విగతాసుండయ్యె. హతశేషులగువారు వెనుకకుఁ దరలి కుబేరు శరణుఁ జొచ్చిరి. కొంద ఱార్తనాదులై తూర్పునకుం బాఱిరి. ఇట్లు భీమసేనుచే యక్షనాయకుండు మడియుడు నీవర్తమానము హతశేషులవలన ధనేశ్వరుండు వినెను.

ఇట నీయుద్ధము జరుగుచుండునప్పటిబాణముల తాఁకుడు ధ్వనులును, శూరుల వీరాలాపంబులును, గద లొండొంటిం దాఁకు నప్పటి నిస్స్వనంబులును, హతులైనవా రుస్సురనుచు నేలం బడఁగా జనించిన యార్తరావంబులును,వికలాంగులైనవారు బాధలతోఁ జేయుచుండు

రోదనంబులును సాశైలరాజగుహలలో మాఱుమ్రోఁగఁగా వానిని ధర్మ
జుండు విని దీనికిఁ గారణంబెద్దియో యని నకులసహదేవద్రౌపదులతోఁ
నాలోచించుచు నేమియుం దోఁపక చింతించుచుండెను. అంతఁ గొంత
సేపటికి ధర్మజుండు ద్రౌపదిని నార్ష్టిషేణునొద్దనుండ నియమించి తానును
గవలును నాయుధపాణులై యాపర్వతశిఖరంబునధిరోహించుచుండఁగా
నేలం బడియుండు కబంధములును, విఱిగినవెన్నెముకలును, జీలిన శరీరం
బులును, బగిలిన ఱొమ్ములును, జిందరవందరలైన యంగంబులును, వ్రస్సిన
ఫాలంబులును గలయక్షులయొక్క దేహంబులం జూచుచు మనంబునం
దొట్రుపాటు గదుర దెసలఁ బరికించుచుఁ బోవుచుండ నందొక్కచోవజ్ర
పాణియైనమహేంద్రుంబగిది యక్షులను రాక్షసులను వధియించి వీరుండై
వెలుఁగుచున్న వాయుసూనుం గని వానిసాహసమున కాశ్చర్యపడి
కౌఁగిలించి యాదరవాక్యములఁదేల్చి వానితో నందఱునొక్కచో నాశిఖ
రాగ్రంబున నాసీనులైరి. అప్పు డాశృంగంబు లోకపాలురు నలువు
రొక్కచోఁ గూడి మంతనంబు నేయు మేరుగిరిశృంగంబుఁ బోలియుండె.
అంత ధర్మజుండు భీమునితో నిట్లనియె. ఓరీ! ఇట్టిసాహసంబులు దివ్యదే
శంబులఁ జేయరాదు. దీన దేవతలు సంతుష్టులు గారు. సాహసంబునఁ
గాని, మోహమునఁగాని యిట్టిపనిఁ జేసియుందువు. ఋషిప్రోక్తంబుల
నాదరింపవలయును. ఇట్టివినీకుఁదగవు.క్షత్రియవిరుద్ధములైనపను లొనర్ప
రాదు. అని ధర్మజ్ఞులు సెప్పుదురు. ఇది దివ్యదేశంబు. ఇచ్చో శాంతము,
అక్రోధము నెఱపవలయు. ధర్మములను బరలోకప్రయోజనమును నవాద
రణనేసి పాపకార్యములను జేయువాఁడు తప్పక తత్ఫలంబులఁ గుడుచు.
నాయెడ ననురక్తుండ వేని యిఁక నైన నిట్టిసాహసములెన్నఁడు నేయ
కుము అని బోధించె. అంతకు మున్నే హతశేషు లగు యక్షులు భీముని
చేతలకు భయభ్రాంతులై యాయుధంబులఁ బాఱవైచి, తలవెంట్రు
కలు విఱియఁబోసికొనుచు నతివేగంబున గుహ్యకేశ్వరునిపాలికిం జని జరి
గిన యావద్వృత్తాంతంబు నిట్లు నివేదించిరి. దేవా! ఇంతకుము న్నొక
మానవుండు సౌగంధికవనముం జొచ్చి క్రోధవశగణంబుల నెల్ల
నిహతుల; గాంచి యుండెఁగదా? వాఁడె యిక్కొండశిఖరంబున కేతెంచి

యున్నాఁడు. వానిని నివారించిన నీయోధ లందఱును నాయుధంబు లతో నేల కొఱఁగిరి. యక్షరాక్షసనాయకుం డగుమణిమంతుం డసునీచెలి కాఁడు వానిచే హతుఁ డయ్యె. మేము వానిబాఱిం బడక యొకవిధ ముగఁ దప్పితిమి. కేవలమానవుం డీదివ్యదేశంబున నింతఁ జేసె. ఇఁక జరుగవలసినకర్జంబు నాలోచింపుము. అనఁగా యక్షేశ్వరుం డోహో వాఁడింత దెగించెనే ఇఁక వానిని మన్నింపరాదు. అని క్రోధా రుణితలోచనుండై వానితో మనకు యుద్ధము తప్పినది కా దన వారు యక్షేశ్వరునికిఁ దేరొక్కటియాయితము చేసి దానికి సుత్తమరథ్యం బులం బూన్చి యుద్ధోపకరణంబులం దునిచి తెచ్చిరి. అంత గుహ్య కేశ్వరుండు రథారోహణంబుఁ గావించుచుఁ గొన్ని శుభశకునంబులు పొడగాంచె. విజయప్రదము లగు గుఱ్ఱములసకిలింతలు వినంబడె. ఏనుఁ గులమదగంధమును, సైనికనికరాను లేపసౌరభములను గంధవహుండు గొనిరా నాఘ్రాణించి, యీశుభశకునముల నుపలక్షించి నానావిధాయు ధంబులతోడ యక్షసేన తన్నుఁ బరివేష్టించి రాఁగ, గంధర్వులు స్తుతించు చుండఁగా నతిరయంబున యక్షేశ్వరుండు గంధమాదనముం జేర నందు నాయుధపాణులై మైమఱువులఁ దొడిగి యుద్ధమున కోహటించి నిలుచు ప్రతివీరులవలె నున్న పాండునందనులం గాంచి వారియున్నతదేహంబు లను, నాయతభుజంబులను, దేజంబు గలమోములం గాంచి మిక్కిలి యానందించె. పాండవులు ధనదుని రాకఁ దెలిసి యామహనీయునకుఁ దామేమి యపచారముం జేసితిమో, యాతం డేమిగాఁ దమ్ముఁ దలం చెనో యని వితర్కించుచుండ నాతండు వీరిసమీపంబున కేతెంచె అంత నానల్వురు రాజపుత్త్రులును దిగ్గన లేచి యక్షేశ్వరునకు మ్రొక్కి వినయ వినమితోత్తమాంగులై యుండిరి. అంతఁ గుబేరుండు వీరియెదుటఁ బుష్పకంబు నిలిపి యక్షరాక్షసగణములచే నుపాసింపఁబడుచు తన్ను వీక్షిం చుచుండువాని, నైదువన్నెలపూలదండ నఱుతఁ గ్రాలు వానిని సాయు ధుండైన వీరుని చూపులతో నుండువాని, రక్కసులతోడం బోరా డియు వాడనివాఁడై తన యాయుధముల నప్పుడప్పుడు నిరీక్షించు చున్నవాని, యుద్ధంబు మగుడ నారంభమైనచో వెనుదీయక పోరాడ నిచ్ఛగలవాని భీమసేనుం దేరిపాఱఁజూచి ధర్మజు మొగంబై

యిట్లనియె. యుధిష్ఠిరా! సర్వభూతములకును నీకుఁ గలభూతదయ దెలియును. నీతమ్ములతోడ నీ వింద వసింపుము. సాహసంబున యక్షరాక్షసులఁ జంపె నని భీమునిపైఁ గోపగింపకుము. వారు కాలచోదితులై మ్రందిరి. భీముండు నిమిత్తమాత్రంబ. ఈయక్షరాక్షసులు హతులయ్యెద రని సురలు మున్నె యెఱుంగుదురు. భీమునిపై నాకుఁ గినుక లేదు. మఱియుఁ బ్రీతుండనైతి. మున్నె వీనికర్జంబునకు నే సంతసించియుంటి నని చెప్పి భీమసేనుముఖంబై వత్సా! ద్రౌపదికిఁ గుతుకంబొనర్ప నీకావించిన సాహసకార్యములకు నే నొడంబడి సంతసించితి. దేవతలఁగాని, యక్షరాక్షసులఁగాని, నన్నుఁ గాని యాదరింపక కేవల బాహుబలంబున నింత సేయశక్తుండవు నీవ కాని వేఱొక్కరుం డెవ్వండేనియు వలంతియగునే? అగస్త్యశాపంబు నీవలన బాసితి నని చెప్పఁగా యుధిష్ఠిరుం డాశాపకారణము నానతిమ్మని వేడ నాయైలబిలుండు వారి కావృత్తాంతం బిట్లు సెప్పె.

### కుబేరుండు మణిమంతునకుఁగలిగినశాపంబు చెప్పుట

పూర్వకాలమున దేవత లెల్ల నొకకార్యార్థముకుశావతీదేశంబున సభ గావించి నన్నుఁ బిలిపింప నేను మూఁడుమహాపద్మముల సంఖ్యగల నానాయుధధారులు, లక్షసైనికులు ఘోరరూపులు నగుయక్షసైనికులతో వెడలివచ్చుచుంటిని. అంత నామార్గమునందు యమునాతీరంబున నగస్త్యుం డూర్ధ్వబాహుండై సూర్యున కెదురుగ నిలుచుండి ఘోరతపం బాచరించుచు జ్వలించుచుండు నగ్నిహోత్రునిచాడ్పునదుర్నిరీక్ష్యుండై యుండ నాచెలికాఁడగు నీ మణిమంతుండు గ్రొవ్వున నాతాపసోత్తమునిపై నుమియ, నందుల కగస్త్యుండు గినిసి నన్నుం జూచి నీచెలికాఁడగు నీమణిమంతుండు నీవుచూచుచుండ నాపై నుమిసెఁ గావున నీయపరాధంబున నీసైన్యంబుతో వాఁ డొకకాలంబున నొకమానవునితోఁ బోరాడి యుద్ధంబున విగతాసుండగుఁగాక యనిశపించి వెంటనే యామానవు నీక్షించి సైన్యవధముచేఁ గలిగిన వ్యథనపనయింతు వని చెప్పెనని ధర్మజుతో మఱియు నిట్లనియె. ధైర్యము, నేర్పు, దేశము, కాలము, పరాక్రమము లను నీయైదును లోకతంత్రవిధానమునకు నైదు తెఱఁగులు కృతయుగమునందు వీని నంద తెఱంగి కార్యములఁ జేయుచుండిరి. ఈ

యైదింటిని రాజులు బాగుగ నెఱింగి జాగరూకులై ప్రజలం బాలింతు రేని వా రుభయలోకంబులం గీర్తిం బడయుదురు. ఇంద్రద్యుమ్నుండును వానిని నేర్పుతో నుపయోగింప శక్తుండగుటచే నాకలోకాధిపత్యంబుం గాంచె. వానియుక్తాయుక్తతలం బరిశీలింపక సాహసకార్యాచరణపరాయణుండు కార్యభేదమును దెలియక నిష్ప్రయోజకకార్యమ్ముం బూని రెండులోకములయందుం గీడొందు. ఈ భీమసేనుండు గుణదోషములం బరిశీలింపఁడు. భుజబలగర్వమున సాహసకార్యములం బూను. భయంబు లేక యెదిరిన దన్నెఱుంగక క్రొత్తవారితో విద్వేషించు. వీనిచే ధర్మశాస్త్రాధ్యయనంబు నేయింపుము. లెస్సఁగ నాశాస్త్రమున శిక్షితుం జేయుము. ఆర్ష్టిషేణాశ్రమంబునకుఁజని యీమొనటికృష్ణపక్షం బచ్చట నివసింపుము. యక్షులు కిన్నరులు కింపురుషులు వానియోగంబున నీకు రసవంతము లగు ఫలంబులం గొని తెచ్చియిచ్చి మిమ్ములను సేవించుచు మీ కేయపాయముం బొరయకుండ రక్షింతురు. ధర్మదేవత నిన్ను, వాయుదేవుండు భీముని, నింద్రుం డర్జునుని, అశ్వినశ్వులు కవలను నెట్లు సంరక్షించుచున్నారో, యాతీరున మీ రెల్లరును నాకుం బరిరక్ష్యులు. దమ దానాదిసద్గుణంబులకు నెల వైన యర్జునుండు తనకు వలసినమహాస్త్రంబుల వడసి నాకలోకంబున నింద్రపరిరక్షితుండై క్షేమంబున నున్నవాఁడు. యమునాతీరంబున శంతనుండు సప్తాశ్వమేధంబులం గావించి దేవర్షులను, బితృదేవతలను దనిపియుండె. అట్టివాఁడు మీ ప్రపితామహుండు. వాఁ డిప్పుడు నాకలోకంబునం దనకావించిన సుకృతఫలము లనుభవించుచున్నవాఁడు. ఆమహనీయుని నాకంబున నిత్యపూజలం జేసి నీతమ్ముం డర్జునుండు, సంతుష్టుం జేసె. మీయెడం బ్రీతుండై శంతనుఁడు మీ క్షేమం బడిగె ననఁగా విని పాండుపుత్త్రు లందఱును సంతుష్టులైరి. అంత భీమసేనుండు దాఁ గావించినసాహసంబునకుం గుబేరు మన్నింపఁ బ్రార్థించె. ధనదుండును వాయుసూనున కనుకూలుండు కాఁగా, భీమసేనుండు లోకపాలకునకు మ్రొక్కె. అంతఁ గుబేరుండు శరణుసొచ్చిన భీము నాదరించి భీమసేనా! అరిమర్దనుండ వగుదువు గాక! యని దీవించె. పదంపడి గుహ్యకేశ్వరుండు యుధిష్ఠిరు వెంగంబై

యయ్యా!నీతమ్ముం డర్జునుం డింద్రునానతిం గొని యచిరంబ యిటకు వచ్చు వాఁడు. అంతవఱకు మీరు గంధమాదనంబున వసించియుండుఁడు. మీకు యక్షులు వలసినపదార్థములఁ దెచ్చియిత్తు రని వారి వీడ్కొని స్వసైన్యుండై యక్షరాట్టు చనెను. యక్షులును గుబేరాజ్ఞ మెయి భీమ సేనహతయక్షకళేబరంబులను వెంటనే యాశైలశిఖరమునుండి తొలఁ గించిరి. దాన వారికి శాపాంతం బయ్యె.

ఇవ్విధంబున నుత్తరదిక్పతియనుజ్ఞం గొని పాండవు లార్ష్టిషేణా శ్రమంబుం జేరి యక్షు లుపచరించుచుండ నందుఁ గొంతకాల ముండిరి. అప్పు డొక్కనాఁ డుదయంబున ధౌమ్యుండు ప్రాతరాహ్నికంబులం దీర్చికొని యార్ష్టిషేణుతోడం బాండవుల సమీపింపఁగా, వా రాఋషి వర్యునకు మ్రొక్కి మిగిలినవిప్రుల నర్చించియుండ ధౌమ్యుండు తూర్పు దెసం జూపి యిట్లనియె. పాండవాగ్రజా! లోకపాలురలో నింద్రకుబేరు లీదిక్కును బాలింతురు. మందరపర్వతం బాదెస నున్నది. వారు తమతమ పట్టణంబు లగు నమరావత్యలకాపురములందు నుందురు. అట నుదయిం చు సూర్యుని బ్రహ్మర్షులును, విప్రులును, సిద్ధులును, సాధ్యులును నుప స్థానమంత్రంబులచే నర్చింతురు. అని చెప్పి ధౌమ్యుండు ధర్మరాజును దక్షిణాభిముఖుం గావించి యోపాండుపుత్త్రా! జీవుల కెల్ల నియామకుం డగు యముం డీ దిక్కున నుండి సంయమిని పట్టణమునందు సమవర్తియై విరాజిల్లు. అని పశ్చిమదిశం జూపి ధౌమ్యుం డిట్లనియె. అయ్యా! ఈ దిక్కున వరుణుం డస్తమయపర్వతమును సముద్రమును నాశ్రయించి యున్నవాఁడు. సూర్యుఁ డస్తాచలగతుండై తననిత్యకృత్యములు ముగిం చును. వరుణుండు నచ్చోటనే యుండి సకలభూతములను రక్షించును. ఓసుభగుఁడా! మేరుపర్వత ముత్తరదిక్కున వెలయుచున్నది. మిక్కిలి తేజోవంతమైపవిత్రమైనయాపర్వతమునందు సకల చరాచరభూతజాలము లను సృష్టించు బ్రహ్మదేవుం డున్నవాఁడు. బ్రహ్మమానసపుత్త్రు లగు మరీ చ్యాదులును వసిష్ఠాదిసప్తర్షులు నందే యున్నవారు. సప్తర్షు లం దుద యాస్తమయములఁ గాంతురు. బ్రహ్మసదనంబునకుఁ దూర్పున నారా యణస్థానంబు గలదు. అది స్వయంప్రకాశంబు; సర్వతేజోమయంబు.

అది తనతేజంబున వెలుంగుచు సర్వబ్రహ్మాండమును వెలిఁగించు చుండు. దేవర్షులు గాని, బ్రహ్మర్షులుగాని దానిని నిరీక్షింప నేరరు. యోగసిద్ధు లగుమహనీయులును, నిష్కామకర్మాచరణంబు గావించిన సర్వసంగవిముక్తులును నగుయతీంద్రు లచ్చోటికి కేఁగుదురు. అద్దానిం జూచ్చినవారు మఱల జననమరణాదిసంసారచక్రంబునఁ బడరు. వారు ముక్తులు. ఆస్థానం బక్షయంబు.సర్వకార్యకారణుండును నాదిమధ్యాంత రహితుండును,సత్యజ్ఞానానందరూపుఁడును,లోకారాధ్యుండునగు శ్రీమన్నారాయణున కయ్యది నివాసస్థానము. పరమభక్తిని దానికి నమస్కరింపుము. నారాయణుండు నివసించుస్థలమునకు సుమేరు వని పేరు. సమస్త జీవరాసుల నందుండి రక్షించును. భానుం డామేరుపర్వతమున కెల్లప్పుడు చంద్రసహితుండై ప్రదక్షిణంబు సేయుచుండు. ఉత్తరాయణమున స్వకిరణములచే గ్రహించిన సకలపదార్థములరసమును దక్షిణాయనమున మేఘుండై వర్షించి యుత్తరాయణమునందుఁ దనకిరణములవేఁడిమిచే డస్సినభూతజాలంబున కంతటికి నాప్యాయనంబు గావించుచు,కళ లనియుఁ గష్టము లనియు, క్షణము లనియు, ముహూర్తము లనియు, నహోరాత్రము లనియుఁ,గాలపరిచ్ఛేదంబు సేయుచున్నవాఁడు. చంద్రుండును బక్షములకుఁ గారకుండై యాపర్వతరాజుం జుట్టి తిరుగుచుండు. ఆకసంబున నుండు నితరగ్రహనక్షత్రము లాకొండలజేసిచుట్టును బ్రదక్షిణంబుగఁ దిరుగుచుండు. అని ధౌమ్యుండు మేరుపర్వతమహిమంబును జెప్పఁగా విని పాండురాజపుత్త్రు లానందించిరి. అట్లు ఋషిప్రోక్తంబులగు సువార్తల నానందించుచు వా రాగంధమాదనంబునందు యక్షులను సేవించుచు దినదిన మొక్కొక్కవిశేషంబుం జూచుచు వ్రతము లాచరించుచు నియమపరులై యర్జునురాక నెదురుచూచుచు నొకనెలదినము లచ్చోట నుండిరని వైశంపాయనఋషివర్యుండు సెప్పఁగా జనమేజయనృపవర్యుండు విని సంతుష్టస్వాంతుఁ డయ్యె.

ఆనగేంద్రమగు గంధమాదనంబున మహాత్ములగుపాండవులు పార్థునిరాక యెదురుచూచుచు నుత్తమవ్రతముల నూని యుండఁగా, వారికి నతిప్రమోదంబు గలిగెను. అత్యంతనిర్మల స్వభావంబుతోఁ గూడి సత్యధర్మప్రధానులై తేజరిల్లుచున్న యాపాండవులకడకుఁ బెక్కెండ్రు మును

ళును, గంధర్వకిన్నరులు నేఁగుదెంచిరి. దేవతాగణంబు లమరావతి
నొంది తేఁటదనంబు నొందులాగున, బుష్పఫలభరితవృక్షశోభితంబగు
నాగంధమాదనంబు గాంచు.నామహారథులకు నెక్కువ మనః ప్రసాదంబు
గలిగెను. అట్లు పాండవులు దమంబు నొంది మయూరహంసవాహ
నంబులతోఁ గూడి పుష్పభరితంబులైన యాగంధమాదనంబుచరిపులను
శిఖరంబులను జూచుచు మహానందముతో నొప్పియుండిరి. అనగేంద్ర
మున శిఖరంబులను బోదలజొంపములతోఁ గప్పినవియు, బెగ్గురులు
నీరుకోళ్లు,రాయంచలు మున్నగు నీటిపక్షులతో నొప్పినవియుఁ, దామర
పువులచే నిండినవి యగు తామరకొలఁకులను గుబేరునిచే స్వయముగాఁ
ద్రవ్వింపఁబడినవానిని జూచి యాపాండవు లానందభరితులయిరి.
నిండురూపు గలవి, చక్కని తిన్నెలు గలవి, రత్నఖచితములును,
మనోహరంబులునైన కుబేరునిక్రీడోద్యానంబులు గాంచి, యాకుబేరు
నికి నిష్టు లగుచాడ్పున నాతనియాశ్రమంబుననే తిరుగుచుండిరి. పెక్కు
వర్ణములు గలిగి, నెత్తావితోఁగూడిన మహావృక్షములతోను, మొయి
ళులపిండువులతోను నిండిన యాపర్వతశృంగంబునుం జూచుచుఁ దపః
ప్రధానులై యాపర్వతశిఖరములను గలయఁ జూచిరి. ఆపర్వతపు నిజ
ప్రభావంబుచేతను, బర్వతమందలి యోషధుల ప్రభావమునను, సూర్యుఁ
డుదయకాలమునఁ బాండవులకు విస్పష్టరూపుఁడుగఁ దోచెను. విభా
వసుఁ డేసూర్యునిఁ బొంది రాత్రులందుఁ జరాచరంబులఁ బ్రకాశింపఁ
జేయుచున్నవాఁడో యట్టి సూర్యుని యస్తమయంబులను శూరు లగు
పురుషసింహు లచటనుండి చూచిరి. ఆవీరు లగు పాండవులు చీఁకటి
క్రమ్ముటను, దొలఁగుటను, సూర్యునియుదయాస్తమయములను, సూర్య
కాంతి దిక్కులందు విదిక్కులందు వ్యాపించుటనుజూచి యానందభరితు
లయిరి. పాండవులు వేదాధ్యయనపరులై, పంచమహాయజ్ఞాద్యనుష్ఠానం
బులను జలుపుచు, ధర్మప్రధానులై పుణ్యవ్రతంబు లోలి సలుపుచు,సత్య
నిరతులై సత్యవ్రతుఁడగునాధనంజయునిరాక కెదురుసూచుచు, నస్త్ర
విద్యఁ గఱచి మఱలివచ్చిన మనయర్జునునితోడికూడిక యిటనే మనకుఁ
గలుగునుగాక యని పలుకుచు నచటిఋషులవలనఁ బెక్కుదీవనలఁ బడ
యుచుఁ దపోయోగనిష్ఠులై యుండిరి. ఆపర్వతమున వింతలఁ గాంచుచు

నాయర్జునుని సదా తలంచుచున్న యాపాండవుల కొక్కరేయియుఁ బగలును నొకసంవత్సరముతో సమానంబుగాఁ గడచెను. ఎపుడు మహాత్ముఁ డగు పార్థుఁడు ధౌమ్యునసుమతిఁ బడసి జడలు దాల్చి యస్త్రలాభంబునకై తరలెనో, యదిమొదలాపార్థునే, తలపోయుచున్న పాండవులు హర్షసంతోషములు లేకయుండిరి. మదగజేంద్రగామి యగు వాఁడు పార్థుఁడెన్నఁడు యుధిష్ఠిరుననుమతి వడసి కామ్యమునుండి హిమవంతమునకుఁ దరలెనో యదిమొదలుపాండవులు శోకభరితులై యుండిరి. అట్లస్త్రార్థమై యింద్రునికడ కేఁగిన యాయర్జునుఁగూర్చి పాండవులు చింతించుచుండఁగా, వారికి నాదీర్ఘకాలం బెంతయో కష్టంబునఁ గడచెను. అట్లు పాండవు లచటఁ జింతాకులితమానసులై యుండఁగా జిష్ణుఁడు, దేవేంద్రునియొద్ద నైదేండ్లుండి యాగ్నేయ వారుణ సౌమ్య వాయవ్య వైష్ణవ పాశుపత్య బ్రాహ్మాద్యస్త్రములను నింద్రునవలనఁ బడసి, యతనికి నభివాదనంబు సేసి యతనియనుమతిఁ బడసి ముదంబున మఱలి గంధమాదనంబునఁ బాండవు లున్నయెడకుఁ బయన మయ్యెను.

---

## తృతీయాశ్వాసము

అంత బాదరాయణశిష్యుండైన వైశంపాయనుండు పిదపటి కథను వినుట కువ్విళ్లూరుచున్న జనమేజయభూపాలున కిట్లనియెను.

అట్లు గంధమాదనంబున నొక్కదినము పాండుపుత్త్రు లందఱు నొక్కచోట సుఖులై కూర్చుండి యిష్టకథాగోష్ఠి నుండఁగా నాకసంబున నొక్కరథంబున దేదీప్యమానమై ప్రకాశించుచు బొగలేని యగ్ని జ్వాలవోలె వెలుఁగుదాని నిజప్రభలచే నంతరిక్షమును వెలిగించు దానిం గాంచి దవుదవ్వుల నందు దివ్యకిరీటంబుతోను, పారిజాతకుసుమమాలికలతోను, దేవత లొసఁగిన యాభరణములతోను నుండు నొక్క మహాపురుషుం గాంచి, యావిమానంబు సమీపగతం బగుడు వాని నర్జునుంగా నెఱింగి యానందం బుప్పొంగుచుండఁ గొంతసేపటి కాకొండచెంత నావిమానంబు విడియుడు దానినుండి యర్జునుండు దిగి ధర్మజ భీమ ధౌమ్యులకు నమస్కరించి వారియాశీర్వచనంబులఁ బొంది,

తనకుఁ గవ లభివందనంబులు సేయ వారిని గ్రుచ్చియెత్తి ద్రౌపదిం జూపులచే నాదరించి ధర్మజుసమీపంబున వినయ మొప్పఁ గూర్చుండి యుండె. అంత నందఱును బలుమాఱింద్రుం డెక్కి యనేకమహాయుద్ధములలో విజయమును బొందినయావిమానముయొక్క రామణీయకముం జూచుచు దాని నతిపూజ్యంబుగాఁ దలంచుచు, నద్దాని సారథి యగు మాతలిం గడు గారవించి వానికిఁ దగినసపర్యలం జేసి నాకలోకవృత్తాంబు లారయుచు, దేవతలక్షేమంబుల విచారించుచుండ మాతలియుఁ దత్తదనుకూలము లగు నుత్తరంబుల వారిని సంతుష్టులం జేసి వారికిఁ దండ్రివోలె నుచితంబుల నేర్పి వారిచే ననుజ్ఞాతుండై మఱల నింద్రురథముఁ దోలుచు దివంబున కరిగె. అప్పు డర్జునుండు, దేవేంద్రుండు నాకంబునఁ దన కొసంగిన దివ్యాభరణములఁ బాంచాలరాజపుత్త్రి కొసంగి విప్రులమధ్య నున్నయుధిష్ఠిరునిమ్రోలఁ గూర్చుండి తా సురల మెప్పించుటయు, వా రంపులకుఁ దనకు బహుమానంబులుగా నస్త్రముల నొసఁగుటయు మున్నుగాఁ గల స్వర్గవాసమప్పటి తనవృత్తాంత మెల్లఁ బూసఁ గ్రుచ్చినట్లు క్రమంబున నన్నకు విన్నవించి కవలతో నా రాత్రి సుఖనిద్ర సలిపె.

## ఇంద్రుండు పాండవులయొద్ద కేతెంచుట

అంత మఱునాఁ డుదయకాలంబున యుధిష్ఠిరునకుఁ బార్థుఁడు తమ్ములతోడఁ దానును నభివాదనంబుచేసి సల్లాపంబులాడుచుండ నాకసంబున తూర్యధ్వానములును భేరీపణవాదివాదిత్రనిస్వనంబును,వివిధఘంటారవంబులును, రథనేమిధ్వనియు వినరాఁగా యుధిష్ఠిరుఁడు సావధానుండై చూచుచుండె.అంత నాఖండలుఁడు బంగారుతేరెక్కి గంధర్వాప్సరోగణంబులు వెంట రాఁగా నరుదెంచి పాండవుల సమీపంబున దేరు డిగెను. అప్పుడు పాండుపుత్త్రు లందఱును దిగ్గన లేచి పాకశాసనున కెదురేఁగి యతనిఁ దోడ్తెచ్చి యాపర్వతంబున నొక్కచో నున్నతంబైన యుత్తమాసనం బొండు చూపి యం దాసీనుం జేయ నింద్రుండు హర్షంబునఁ గూర్చుండెను. యుధిష్ఠిరపురస్సరు లగు పాండుపుత్త్రు లందఱును నంతట నాశునాసీరు విధ్యుక్తంబుగ నర్చించిరి. అంత యుధిష్ఠిరుండు తమ్ముఁ డైనయర్జునుని మహత్త్వంబునఁ గదా దేవరాజునకు నే నభి

గమ్యుండనైతి నని మనంబున నెన్నుచు మిక్కిలి వినమ్రుండై తల వాంచి యాదరంబుతో నాఫల్గునుని వీక్షించుచుండ నప్పు డతనిం జూచి యింద్రుం డిట్లనియె. ధర్మతనయా! నీ వచిరకాలముననే యాపదల నెల్లం బాసి నీపితృపితామహార్జితం బైన సామ్రాజ్యంబుఁ బొందుదువు. నీతమ్ముండు నర్జునుండును నాకంబున నాయొద్ద నియతమనస్కుండై యుండి యనేకదివ్యాస్త్రంబులను నావలనఁ బొందె. వానివర్తనంబు వలన నాకుం గడుఁ బ్రీతి వానియందుఁగలిగె. వీఁ డపరిమితపరాక్రమవం తుఁడయ్యె. వీఁడు ముల్లోకంబుల నేరికి నజయ్యుండయ్యె. మీకు స్వస్తి యగుఁగాక.ఇచ్చోటినుండి మీరుతఱలి కామ్యకవనంబును జేరుఁడని సదా లోచనంబు గఱపి యచ్చోఁ దన్ను వీక్షింప నేతెంచినట్టి గంధమాద నస్థితమహర్షిగణములచేస్తూయమానుండై నాకలోకంబున కరిగె. పాండు నందనులకుఁ బాకశాసనునితో గంధమాదనంబుననైన యీసమావేశ వృత్తాంతంబును నొక్కయేఁడు జితేంద్రియుండై నియమపూర్వకంబుగఁ బఠించుపుణ్యాత్ముండు శతమానమైనయాయుస్సు గలిగి సుఖి యగు నని వేదవ్యాసశిష్యుండు వైశంపాయనుండు నయ్యభిమన్యుపౌత్రుండగు జనమేజయునకుఁ జెప్పి వెండియు ని ట్లనియె.

అట్లు దేవేంద్రుఁడు నాకలోకమున కేఁగుడు నర్జునుండు కవలు ద్రౌపదియుఁ దోడ రాఁగా సమీరకుమారు ముందిడికొనిపోయి ధర్మజు సమీపించి నమస్కరించి వినయవినమితోత్తమాంగుండై యుండ ధర్మ సూనుండు వాని నెత్తి కౌఁగిటఁ గ్రుచ్చి శిరంబు మూర్కొని విజయా! మమ్ము విడిచి యానాకలోకంబున నీ వె ట్లుంటివి? దివ్యాస్త్రము లెట్లు సాధించితివి? వానిప్రయోగోపసంహారంబులను లెస్సగ గ్రహించితివే? మహాదేవు నేరూపునం గంటివి? పాకశాసనుం డెవ్విధంబున నీ కిష్టంబు సలుపుచుండె? వారు నీయెడఁ బ్రీతులై నిజాస్త్రంబుల నొసంగిరే? వారి నె ట్లర్చించుచుంటివి? ఇంద్రుండు నీవలనఁ గూర్మిఁ జెందె ననెను. ఆమహానీయుం డట్లు నిన్నుఁ బ్రియోక్తులాడుటకు నీ వొనర్చిన సపర్య లెయ్యవి? అంతయును విస్పష్టంబుగఁ దెలుపు మని విజయు నడుగ నాతం డన్న కిట్లనియె.

అర్జునుండును ధర్మరాజునకుఁ దనయస్త్రలాభంబు చెప్పుట

ధర్మపుత్త్రా! నీవు తొల్లి నాకుపదేశించినవిద్యను గ్రహించి నీసెలవు మెయిఁ దపం బాచరింపఁబోయితి. తన్నిమిత్తము కామ్యకవనమున 'నున్న మిమ్ము వీడి యచ్చటనుండి తరలి భృగుతుంగంబనుపర్వతప్రదేశమునకుఁ బోయితిని. అచ్చోట నారాత్రిగడపి మఱునాఁడు వేకువ నందుండి ప్రయాణమైయొక్కభూసురు నాచోటఁగంటి. ఆమహానీయుండు నాకులగోత్రంబు లడుగ నిజవృత్తాంతం బతని కెఱింగించితి. అందుల కతఁడు ప్రీతుండై నన్నుఁ దపం బాచరింపు మనియు,నాకు వేగముగనే బిడౌజుండు దర్శన మొసంగు ననియుఁ జెప్పి యదృశ్యుం డగుడు నే నచ్చోటినుండి ప్రయాణమై హిమవంతంబుఁ జేరి యచ్చోటఁ దొలిమాసంబునఁ గందమూలఫలాహారుఁడను రెండవమాసమున వారిభక్షణుండను, మూఁడవనాల్గవమాసములందు నిరాహారుండను నూర్ధ్వబాహుండనునై యుంటిని. ఈతీరునఁ దీవ్రతపోనియమమున నుండినను నాదేహమునం జేవ తఱుగదయ్యె. అది నాకు వింతగానుండె. పదంపడి యైదవనెల ప్రారంభమైనమఱునాఁ డుదయమున నాయుండుచోటున నొక్కవరాహంబు తన ముట్టెతో నచ్చటచ్చట భూమియందు బొరియలు వెట్టుచుఁ గాళ్లదుమ్ము రేఁచుచుఁ దనకఱకుమేన ధరణితలంబు రాయుచు నలుదెసల నిటటు సూచుచుఁ గానంబడియె. దానివెంటఁ జేత ధనుర్బాణంబులు గొని వనితాజనంబుతో నొకయెఱుక యచ్చోటి కేతెంచి, యాపందిపై నేను బాణ మేయఁగాఁ దానును గూడ దాని నొక్కకోల నేసె. అంతఁ బోక వాఁడు నన్నుఁ జూచి 'యయ్యా! ఇయ్యది నాబాణంబునకు గుఱియై యుండ నీవు దీని నేలఁ గొట్టితి? వేటకాండ్ర కున్నన్యాయంబున కేల వెలియైతివి? అయిననగుఁగాక; నిన్నుఁబీచమడంతు' నని వెఱవక నాయెదుట నిలిచి వింటినమ్ముల గొని యుద్ధము సేయ మనఁగా నేనును వెనుదీయక వానిపైఁ బెల్లున బాణంబుల నేసితి కాని, యవి యెవ్వియును వానిం గదలింపవయ్యె. వాఁడును నాపై నలిగి నన్ను బాణపరంపరలతోఁ గప్పె. అంత నేను వాని భల్లంబుల నన్నిటిని నడుమన విఱిచితి. మరల నాయెఱుకుపై బాణవర్షంబుఁగురియింప వాఁడు తనమాయ నొక్కటిఁ

బన్ని నాయస్త్రములు దన్నుఁ దాఁక నీయనివివిధరూపంబుల గాన్పింపఁ దొడంగుడు నేను వానిమాయలకుఁ జలింపక వెండియు నంప వాన గురి యుంప నాకిరాతుం డొకపరి హ్రస్వాకారుండుగను, మఱియొకపరి దీర్ఘాకారుండుగను, వేఱొకపరి యల్పశిరస్సు గలిగినబృహత్కాయుఁడుగను నింక నొకపరి బృహచ్ఛిరంబుగలిగిన యల్పకాయుండుగను, నొకసారి యొక్కఁడుగను, మఱియొకసారి యనేకులుగను గన్పడుచుండెను. కాని పోరుమాత్రముఘోరంబయ్యె. అతఁడు నను గాఢంబు నొప్పించుచుండె. అంత నేను వానిని బరాక్రమవంతునిఁగా నెఱింగి యతఁడు స్వల్పశిలీముఖంబులకు వెఱవండని తెలిసి వానిపై వాయవ్యాస్త్రమును బ్రయోగింప నది వృథయయ్యె. అంత నేను ధైర్యమును విడనాడక వానిని ననేకబాణంబులతోఁ గొట్టి శలభాస్త్రమును, ఱాలవానను వానిపై గురియింప నాయెఱుక వాని నన్నిటి నొకపెట్టున మాయించె. అంత వీఁడలంతిఁ బోవువాఁడు కాఁడని సమంత్రకంబుగ బ్రహ్మాస్త్రంబు గాండీవంబున సంధించి ప్రయోగించుడు నాయస్త్రంబు భూనభోంతరాళంబునఁ జెటచెట పుటపుటలతో నార్భాటంబు సేయుచు మంటల నుమియఁ బ్రజ్వలించుచుఁ బోయి వానిసమీపంబున నిర్వీర్యం బయ్యె. అంత నామహాస్త్రంబును నేమియుం జేయలేకపోఁగా నేను నివ్వెఱ పడి ధైర్యంబు వదలక నాచేతివింట వాని సమీపించి కొట్టఁగా వాఁడు దానిని నా తూణీరయుగళంబును మ్రింగివైచె. పదంపడి యుద్ధసాధనము లేవియు లేకున్కి వానితో బాహాబాహియుద్ధమునకుఁ బూనితి. అప్పుడు వానిని ముష్టిఘాతంబులఁ గొట్టితి. అఱచేతులం జఱచితి. వానిని బైకెత్తి క్రిందఁగొట్టితి. ఎంతఁజేసినను కిరాతుండు డయ్యఁడయ్యె. నేను మాత్ర మలసితిని. అంత నాధైర్యంబు సన్నంబయ్యె. వాని వీర్యంబు లా వెక్కె. ఇట్లు కొంతసేపు నిస్త్రాణుండనై పోరి వానిం గెలువనేరక నిర్వీర్యుండనై క్రిందఁబడితి. అంత నామాయాకిరాతుండు నన్ను వీక్షించి పకపక నగి తనవెంట నున్న వనితాజనంబుతో నదృశ్యుం డయ్యె. పదంపడి కొంతవడికి నాయెదుట నొక మహాపురుషుండు పినాకపాణియై జడలు దాల్చి యుమాసమేతుండై వృషభవాహనుండై నన్నేలు దైవమో నాఁగ నామ్రోల దర్శనం బొసంగె.

అట్లు సన్నిహితుండైన యీశానుండు యుద్ధప్రదేశమునుండి తోలం గని నన్నుఁ జేరవచ్చి 'కౌంతేయా! నీధైర్యసాహసంబులకు సంతుష్టాంత రంగుండ నైతి. వరములు గోరుము. అమరత్వమును మాత్ర మీఁజా లను. వెఱియవి వలసినవాని నడుగుము. ఇష్టసిద్ధిం జేసెద' నని చెప్పి ముందు కిరాతరూపంబునఁ దా మ్రింగిన గాండీవంబును తూణీరయుగళం బును నా కందిచ్చె. నేను వానిని భక్తిపూర్వకంబుగఁ గ్రహ్మఱఁ గైకొం టిని. శర్వుఁ డని యెఱింగి సాష్టాంగనమస్కారంబు లాచరించి చేతులు మోడ్చి శిరంబున నిడికొని యి ట్లడిగితి. దేవదేవా! నాయెడం బ్రీతుండవేని దేవతలయొద్ద నుండు నస్త్రంబుల నాకుఁ బ్రసాదింపవే యన, సర్వేశ్వరుండు నాప్రార్థనము నంగీకరించి భక్తవత్సలుఁ డయి నాకుఁ దనపాశుపతాస్త్రమును సమంత్రకంబుగ నుపదేశించి దాని ప్రయోగోపసంహారముల నేర్పి నన్ను నిర్దేశించి యిమ్మహాస్త్రంబు సాధా రణసమయములం దుపయోగింపరాదు. అల్పులపై దీనిని బ్రయోగింతు వేని యిది లోకప్రలయకారకం బగు. కావున నీసర్వాస్త్రములు నుపయోగింప నవి వ్యర్థము లయ్యెనేని యప్పుడ కాని దీని నుపయో గింపరాదు. ఏయస్త్రమును నీ కుపయోగపడక నీకు మహాపత్కాలము దాఁపర నున్నసమయమున దీని నుపయోగింపుము. అని యానతిచ్చి నిజవాహనముతో నదృశ్యుం డయ్యె.

అంత నే నారాత్రి యంద కడపితి. మఱునాఁటియుదయంబున నాచోటఁ దొల్లి గాంచినవిప్రవర్యుం గంటి. వానితో నెఱుకతోడి పోరును, బిదప మహేశ్వరసందర్శనంబును, పాశుపతాస్త్రలాభమునుం జెప్పితి. అంత వృత్తాంతంబు విని యాభూసురవర్యుండు నన్ను వీక్షించి యిట్లనియె. అయ్యా! నీ వెంత పుణ్యమూర్తివో! మహర్షులకు వీక్షింప రాని పరమేశ్వరుని సందర్శించి కృతార్థుండవైతివి. వేగంబ యింద్రాది లోకపాలురు నీయొద్ద కిప్పు డేతెంచి, నీకుఁ దమతమదివ్యాస్త్రంబు లిత్తురు, నీకు శుభం బగు నని దీవించి యాతండు నే ననుమతింప యథే చ్ఛం జనియె. అంత భానుండు మధ్యందినగతుఁడయి వెలుంగుచుండె. అప్పు డున్నట్టుండి లలితవాయువులు వీవసాగె. పూలవాన గురిసె. వివిధ వాద్యధ్వనులు వినఁబడియె. గంధర్వాప్సరసల గానంబులు పొంపై

వీనుల కింపుఁ గొల్పె. అంత నే నాశ్చర్యపడి యిది యేమి వింతయో యని నలుదెసలం జూడ్కులు నిగిడించి చూచుచుండ నింద్రాణితో నింద్రుండును, దమతమ గాణులతో లోకపాలురును దమతమవివిధ విమానంబుల నారోహించి నాచెంత కేతెంచిరి. అప్పుడు మాతలి సారథికం బైన రథంబునుండి శచీసమేతుండై యింద్రుండు డిగ్గి నన్నుఁ సంబోధించి యిట్లనియె. సవ్యసాచీ! నీకుఁ బరమేశ్వరుండు ప్రత్యక్షుం బై పాశుపతం బొసంగుట నీచే దేవకార్యంబు సాధించుట కని యెఱుంగుము. లోకపాలుర మగు మాయస్త్రంబుల నీ కొసంగెదము కైకొను మనఁగా నేను వానిని మహాప్రసాద మని గ్రహించితి. వాని యొక్క ప్రయోగోపసంహారములను మహాశుచినై వారివలనన నేర్చి వారికి దండప్రణామంబు లాచరింపఁగా వారును దమతమలోకములకుం జనిరి. వారితోఁ దఱలిపోవుచుఁ డింద్రుండు నను ఫల్గునా! యని పేర్కొని, స్వర్గంబునకు రమ్ము, పుణ్యతీర్థావగాహనంబున నీయా శరీరము పూతం బై యున్నది. మఱియు మహాదేవుసందర్శనమునను, దివ్యతపశ్చరణమునను నీవు పుణ్యమూర్తి వై తివి. కావున నాకలోక ప్రవేశంబు నీ కతిసులభంబు. నీకై మాతలిని నీరథంబుతోఁ బంపెద, దాని నధిరోహించి యేతెమ్ము. నీచరిత్రం బెల్ల నెఱుంగుదు. నాక లోకంబునం దుండు సప్తర్షులును, బ్రహ్మర్షులును, దేవతలును నెల్ల వారు దానిని నెఱుంగుదురు. అనఁగా నే నింద్రునితో మహానుభావా! నాయెడఁ బ్రసన్నుండవై దివ్యాస్త్రంబు లనుగ్రహింపుము. నీవు గురుం డవై వాని ప్రయోగోపసంహారంబుల నుపదేశింపు మని వేడఁగా నింద్రుండు పార్థా! నీకు మహాస్త్రంబులవలని ప్రయోజనం బెద్దియో దాని నే ననుగ్రహింప సంసిద్ధుండ నయి యుండ నస్త్రంబులే కావల యు నని పట్టు పట్టెద వేల యని యడుగ నింద్రునిభావం బెఱింగి, నేను 'దేవరాజా! వినుము, దివ్యాస్త్రంబుల నకాలంబున నుపయోగింపను. అట నెఱింగి సర్వాస్త్రంబులు ప్రతిహతంబులగుడు, మహాపద సంఘటిల్లి నప్పుడు మానవులపై దివ్యాస్త్రములఁ బరగింతు. నీవు సంశయింపక వాని నా కనుగ్రహింపు మని వేడఁగా నావృత్రారి నన్నుం జూచి 'మోనవరుఁడా! నీచిత్తం బరయుటకు నే నట్లంటిఁ గాని యొండెద్దియుఁ

గాదు. ఇంతవినయముతోఁ గౌశలంబున మాటలాడుట మదీయాత్మ జుండ వైన నీక తగుఁగాని లాతివా రిటులాడ నేర్తురే? నాకంబునకు వచ్చితి వేని వాయవ్యాగ్నేయవాసవవారుణవైష్ణవాది సర్వాస్త్రంబుల నీ కొసంగి వానిప్రయోగోపసంహారంబుల గురుండనై యుపదేశించి యంపుదు నని వచించి యంతర్ధానంబు నొందె.

అప్పుడు కొంతసేపటికి దివ్యరథంబుఁ గొని మాతలి నాసమక్ష మున కేతెంచి కుంతీపుత్రా! ఆఖండలుండు నిన్ను నమరావతికిఁ దోడి తె మ్మని నన్నంపఁగా నాతనియాజ్ఞ శిరంబున వహించి యిట కేతెంచితి. మాయామయంబుసు బవిత్రగమనంబు నైన యీయాకాశయానంబు నధిరోహించి నాకంబున కరుదె మ్మనఁగా నే నుండుపర్వతరాజమునకు వందనం బొనర్చి సెలవుంగొని దివ్యరథమునకుఁ బ్రదక్షిణం బొనర్చి సాష్టాంగముగ మ్రొక్కి వెంటనే దాని నధిరోహించితి. అంత నే నార థంబున నిశ్చలుండనై యుండుటం గని మాతలి నాతో నిట్లనియె. 'ఆఖం డలనందనా! ఈరథం బాకసంబున నేఁగుచుండ నింద్రుఁ డైన గొంత చలియించు. నీ వెంతమాత్రమును జలింపక రథగమనవేగమును లక్ష్యపెట్టకున్నావు. ఔరా! నీధైర్య మెంతటి' దనుచు నాకలోకము నకుఁ బోవుచున్నంత నాకసంబున దివ్యవిమానంబులఁ జూచితి. నాకం బున నందనోద్యానంబుం గాంచితి. అయ్యది స్వయంప్రకాశమానము. అచ్చోట నివసించువారిని శీతోష్ణాదిద్వంద్వంబులు వేధింపవు. పుణ్య మహిమలు గలవారి కయ్యది వాసస్థానము. సర్వర్తుపుష్పఫలసంపూర్ణ మాచోటు. శుకపికాదినానావిధవిహంగధ్వానములచే రమణీయమైన యచ్చోట నెల్లప్పుడు నుండువారి శాపత్తులరుతంబులు సామగానంబుఁ బోలె వీనులకు విందొనర్చుచుండు. అచ్చట నుద్యానవనంబులు పలుచెట్ల తోను విహంగమంబులతోను నొప్పారుచుండును. అచ్చటి సరోవరం బులు పంకజములతో సంపూర్ణంబులును దివ్యహంసములకు సంచార యోగ్యంబులును, యోగులతపస్సులకుఁ గెలంకులును, ఋషుల పర్యటనంబులచేఁ బవిత్రములును నై యుండు. అట్టి యమరావతింజొచ్చి యందలి పుష్పసుగంధమునకును, జల్లని తెమ్మెఱలకు నిచ్చ మెచ్చుచు నందలి సప్తఋషులను, నష్టవసువులను, నేకాదశరుద్రులను, ద్వాదశా

దిత్యులను, ననేకసిద్ధగణంబులను, సాధ్యసమూహంబులను, గిన్నర నిచయంబులను గాంచి, వారి కందఱకు వేర్వేఱ నమస్కరించి వారి యాశీర్వాదంబులం బడసితిని. అమరావతిలో నింద్రునగరి మొగసాల రథంబు డిగ్గి పురందరు సమీపించి సాష్టాంగముగ మ్రొక్కి నిలిచితి. సురరాజును నాయెడఁ గడుఁ బ్రీతుఁడై నన్నుఁ గౌఁగిలించి ప్రుచ్చి యెత్తి శరీరమంతయుఁ దడవి నాకుఁ దనయర్ధాసనం బిచ్చి కూర్చుండ నియోగించె. అంత నాసభలోనివా రెల్లరును నాటంగోలె నన్ను గారవించుచుఁ గడుఁ బ్రీతితో మెలంగుచుండిరి. సురరాజును దాఁ జెప్పిన చొప్పున దివ్యాస్త్రముల నొసఁగె. నా కుబుసుపోకకై చిత్రసేనుఁ డనువాని విశ్వావసుపుత్త్రుని గంధర్వుం జెలికానిఁగ నొనర్చి వాని వలన నాకు నృత్యంబును గానంబును నేర్పించె. ఈ విద్యల నన్నింటిని నేర్చి సుధర్మసభయం దనిశంబు దేవర్షిబ్రహ్మర్షిసముత్కంబున గీతవాదిత్ర మాధుర్యంబు, దేవవేశ్యకాంతాసమూహనృత్యచాతుర్యంబు నరయుచు నింద్రుం డుపదేశించిన యస్త్రవిద్య నభ్యసించుచుంటిని.

అవ్విధంబున బహుదినంబులు గడవ నొక్కనాఁడు నిలింపాధి పతి నన్ను డాసి యాదరంబున నిట్లనియె. పార్థా! నీయస్త్రాభ్యాసం బసదృశంబు. నిన్ను దేవతలును, నసురులును నెవ్వరును గెలువలేరు. ఇఁక మానవులఁ జెప్ప నేల? సమరభూమియందు ని న్నెదుర్కొనువా రెరును లేరు. నీ వతిరథుండవు. పదునేను దివ్యాస్త్రముల ప్రయోగోప సంహారముల, నావృత్తి ప్రాయశ్చిత్త ప్రతిఘాతంబులై దింటిని నావలన నేర్చి ధనుర్ధండవైతివి. ఇఁకను నీవు గురుకార్యం బొనర్పవలయు. అత్యవసరం బొక్కండు సంభవించె. దానికి నీ వొడంబడవలయు ననఁగా, నేను "దేవా! నీయానతిని శిరంబున వహించి యొనర్చెద. నాకు సాధ్యంబైనచో శరీరము దాపక ధైర్యముం బూని నీయిష్టంబు నెఱ వేర్తు. నను నమ్మి కార్యభారంబు నాపై వైచితివేని యీక్షణంబ యా కార్యము నెఱవేర్చుటకు యత్నించెద. ఆలస్యంబు చేయ" నంటిని. అంత దేవేంద్రుండు నామాటలకు సంతసిల్లి యిట్లనియె. సవ్యసాచీ! మూఁడు లోకములయందు నీ కసాధ్యమొం డుండునే? నివాతకవచులను మూఁడు కోట్లరక్కసులు సముద్రమును దుర్గముగాఁ గొని నాతో విరోధించి

దేవతల కపకారముఁ జేయుచున్న వారు. నీకుఁ దగు యుద్ధోపకరణముల నొసంగెద. అది గురువునాజ్ఞగా నెఱవేర్పుము. నెమలిఱెక్కల వన్నె రోమములుగల వేయిగుఱ్ఱములం బూన్చినరథము నారోహింపుము. నీవు మాతలిని సారథిగాఁ గొనుము. విజయధ్వజము నా రథంబునకుఁ బైనఁ గట్టించెద. ఈయుత్తమకిరీటంబు శిరస్సునఁ దాల్పుము. అని చెప్పి రథంబు నాయితంబు చేసి యభేద్యమును స్వర్ణరూపంబునైన యీకవచంబుఁ దొడుగ నిచ్చి, దివ్యమణిభూషణంబులచే నన్నలంకరించి గాండివంబున కెన్నండును శిథిలంబుగానిగుణంబును యోజించి, నన్నురథము నెక్కించి యారాక్షసవధార్థముగఁ బంపె. పంపునెడ నన్ను విజయివై రమ్మని దీవించె. ఇట్లు సురరాజుదీవనలం గొని నేనును మాతలిసారథి కంబై, విజయధ్వజంబున నొప్పుదాని, మయూరసవర్ణరోమహ యాయుతయోజితం బైనదాని, దివ్యాస్త్రసమంచితం బైనదాని, బలి వృత్రనముచ్యాదిరాక్షసులవధకాలంబున నుపయుక్తం బైనదాని, దివ్యస్యందనం బెక్కి యమరావతీపురవీథుల మహానినదంబునఁ బోవు చుండ నన్ను నమరేంద్రునిఁగ భావించి దేవతలును ఋషులును తటా లున నన్ను సమీపించి యాఖండలనందనా! నీ వేకార్యంబునఁ జను చున్నవాఁడవు? అని యడిగిరి. నేను వారితో నివాతకవచవధార్థం బేగు చున్నాఁడ ననఁగా వారు మిక్కిలి సంతసించి నాయెడం బ్రీతిఁజేసి యా శంఖంబు నిచ్చి దీనిఁ బూరించిన దానవగర్భనిర్భేదనం బగు నని యద్దా నిని విజయసూచకంబుగ నా కొసఁగి యిట్లనిరి. ఈరథంబు నింద్రుండు దుష్టరాక్షసుల సంహారనిమిత్త మరుగునప్పు డెక్కు. నీకు విజయంబు సమకూరుం గాక యని యాశంఖంబు నిచ్చి, తొల్లి, యింద్రవిజయముల కిదియు నొకకారణమైయుండె ననిరి. అంత నే దానిం గైకొని మహర్షు లాశ్చర్య మందుచుండ నాకంబునకుఁ దరలితి. పిదప కామగమనంబును, వియద్గమనంబును నైన నారథంబు కొంతవడికిఁ దిమితిమింగిలాది క్రూర జలజంతుసంకీర్ణంబైనదియు, బొడవైన యలలయుత్పత్తి వినాశంబులు గలదియు నగు సముద్రంబునుపరిభాగంబునకుఁ బోవఁగా నీరథం బింద్రు నిదిగా నెఱింగి నివాతకవచులు తమజలదుర్గమున సురక్షితులై యుండ, నేను దేవదత్తమైన శంఖంబును బూరింప నా మహానిస్స్వనంబునకు వారు

వెఱచెంది, కవచంబులఁ దొడిగి గదలం బూనువారును, శూలహస్తులును, జాపాది యుద్ధపరికరంబులచే నలంకృతులును, ఖడ్గపాణులును, ముసల ముద్గరధారులు నై యుద్ధసన్నాహంబున నెదుర్కొనఁగా మాతలియు రథం బొక్కసమతలంబున నిలుపుచుండె. అంత నారక్కసులు పెల్లున శోకధ్వనిం గావించిరి. ఆధ్వనికి సముద్రమునందలి తిమితిమింగిలాదిక్రూరజలచరజంతువులు విగతసత్వంబు లయ్యె. అంత వారాహావాద్యంబులతో ఘోరంబుగా నన్నుఁ దాఁకిరి. అప్పుడు వారితోఁ బోరు ఘోరంబయ్యె. ఆసమయంబున దేవర్షులును బ్రహ్మర్షులును నాకసంబున నుండి సిద్ధసాధ్యులతోను విజయముం గోరుచు కాలోచిత స్తుతిగీతంబులఁ బాడుచుండిరి. అంత నివాతకవచులు నాతేరుం జుట్టుముట్టి నాపైఁ దండోపతండములుగా యుద్ధపరికరములు పైవ నేనును నేమరక, యొక్కఁడొక్కఁడే యాయుధములను వేసెనో క్రమంబుగ వానిపై వానినే వైచి యొక్కొక్కనిఁ బదేసియమ్ముల గాఢముగాఁ గొట్టిన గొందఱా తాఁకుడునకుఁ బెడముఖంబు లిడిరి. అంతఁ గొంత తెఱపి రథము చుట్టుచు గలుగఁగా,నింతలో మాతలి యచ్చోట మూఁగిన రాక్షసులపైఁ దనయరదంబుఁ దోలెను. రథమునకు యోజింపఁబడిన పదివేలయశ్వంబులయ్యసురసేనపైఁ బాఱ నాగుఱ్ఱముల పదఘట్టనల నలఁగినవారును రథచక్రములకుం గీలించియుండు వజ్రసమానము లై నకమ్ములం దగిలి చూర్ణమైన యుత్తమాంగంబులు గలిగినారాచంబులు సోకి వికలాంగులునై యనేకులు సచ్చిరి. హతశేషులగు నారక్కసులు మఱియు రథంబుచుట్టు నావరింప యత్నించుచుండ మాతలి నేర్పున రథము నతిచిత్రగతుల నడుపుచుండె. నేను వారి నంత సమీపింప నీయక, లఘుబాణంబులను, విచిత్రశరంబులను మర్దించినఁ గొందఱు మ్రందిరి. కొందఱు వెనుకకు మఱలిరి. కొందఱు నావిజయము నోర్వక వెంటనే మూఁకలం గూర్చుకొని యందఱు నొక్క పెట్టున నారథరథ్యసారథులను నావరించికొని మాపై ననేక బాణప్రయోగంబులఁ గావింప నేనా తుములంబున శరంబులఁ దొడుగుటకు వీలులేక సమంత్రకంబుగా నత్యతిఘోరంబైన బ్రహ్మాస్త్రంబుఁ బఱపితిని. అంత దానిమహత్త్వమువలన ననేకులు హతులైరి. అందులకు రక్కసు లపరిమితముగ

నందఱుం గూర్చుకొని శక్తిశూలఖడ్గగదాద్యాయుధములను నాపైఁ
బఱుప నేను వాసవప్రియం బైన మాధవాస్త్రమును వారిపైఁ బ్రయో
గించిన న వ్విపరీతసాధనము వారిబాణంబులను ఆయుధములను నాపైఁ
బ్రయోగించిన వానిని నుగ్గుచేయఁగా నేను వెన్వెంట వారి నొక్కొ
క్కనిఁ బదేసిబాణంబుల మర్మము లవియునట్లు కొట్టితి. ఆదెబ్బలకు
వారిదేహంబులు జర్ఝరీభూతంబు లయి పుష్పించిన కింశుకంబును
బోలియుండె. అంత న య్యసురులు నిలువక తమమాయాబలంబున
నాపై పాషాణవర్షంబుఁ గురియించిరి. నేను వజ్రాస్త్రంబుఁ బ్రయోగించి
యా ఱాల నెల్ల నుగ్గుగావించితి. అంత వారు విఫలమనోరథులయి
వేఱొక్కమాయచే వర్షంబు గురియుడు నెడతెగని ధారాపాతమునను
దెసలు బీఁటలువాఱ నిట్లు శబ్దించుచున్న గర్జనధ్వనులును గొంత నన్ను
దిగ్భ్రమఁ జెందునట్లు నేసె. దానఁ గొంతఁ జింతించి మరల స్ఫూర్తి
నొంది యింద్రుం డుపదేశించియున్న విశోషణాస్త్రంబు ప్రయోగింప
దానం జేసి యా సంతతజలధారలన్నియు శోషించె. వెనుక నారక్కసులు
దమమాయచే నిప్పుగాలి వెదఁజల్లుట కారంభించిరి. నేను సలిలాస్త్రంబున
నిప్పును, బర్వతాస్త్రంబున వాయువును నిరోధించిని. వారిమాయ
లన్నియు విఫలములు గాఁగా వారు చెలరేఁగి యొకేసమయమున ననేక
మాయలఁ బన్నుటయు దానిఫలంబుగా ఘోరాస్త్రంబుల నగ్నిని,
పాషాణంబులం జండవాయువును వర్షించుచుండ నమ్మాయవానచేఁ జిమ్మ
చీఁకటులు గ్రమ్ముకొన మిన్ను మన్ను దెలియక నారథాశ్వంబులు మగు
డుడు, నాకు భీతి గదుర, మాతలి రథంబునొగలపై తహతహలాడుచు
పార్థా! ఏమి చేయుదను. ఈయసురులతోడి సంగ్రామము తొల్లి
యమృతార్థము జరిగిన దేవాసురులయుద్ధముకంటెను, నింద్రునకు వృత్ర
శంబరాసురులతో జరిగినసంగరంబుకంటెను మించియున్నది. అప్పుడును
నేనింద్రునకు సారథినై యుంటి. కావున వారియుద్ధప్రకారంబుల నెల్ల
జూచియున్నవాఁడ. కాని, యిట్టి వివిధ మాయాసంగరమును నెప్పుడుం
జూచి యెఱుంగను. ఎంతయేని భీతిల్లియున్నాను. ఇది యుద్ధము కానే
రదు. బ్రహ్మచే నిర్ణీతమైన జగత్సంహారసమయ మని మోహము తెల్లవాఱ

బలికెను. అంత మాతలికి నే నుత్సాహంబుఁ గల్పించి, భీతిల్లకు మని యుద్బోధించి యిదే చూడుము నాశక్తి యని యాతనిఁ బ్రోత్సహించి, గుణంబు సారించి, ధనుష్టంకారముం జేసి యా భయంకరములగు మాయల నెల్ల విరియున ట్లొనర్ప సర్వశత్రుమోహిని యను సమ్మోహ నాస్త్రంబుఁ బ్రయోగింప నయ్యది మాయలన్నియు నడంచుటయు, నార క్కసులు వేర్వేఱు మాయలఁ బరిపరివిధంబులఁ బన్నిరి.దానివలన లోకం బంతయు నున్నట్టుండి చీకటియై కానంబడియె. ఇంకొకపరి లోక మతి తేజోమయమై యుండె. వేఱొకపరి లోక మంతయు నీట మునిఁగినట్లు గానంబడె. ఈసమయమునందు మాతలి యప్రమత్తుఁడై తేరు నేర్పున నడుపుచుండఁ బైపైఁ బడురక్కసుల నెల్ల నానాబాణపరంపరల కాహుతి గావించుచుంటి. అంత నారక్కసులలో హతశేషులైనవారు మరల నొక్కుగుమియై మాయఁ గావించి తా మొరులకుఁ గానరాక ఘోర సంగ్రామంబు నదృశ్యులై చేయుచుండిరి. అంత నే నుత్తమాస్త్రములను లెస్సగా నభిమంత్రించి గురి దప్పక ప్రయోగించుటయు నవి యా మోహ గాంద్రైన రక్కసుల నెల్లరం బొరిగొనుటయు హతశేషులు మాయలఁ బోఁద్రోలి యుద్ధరంగంబునం దుండి తొలంగి పాఱుచుండ నప్పుడు మాయ తొలఁగుటచే నంతయు నజ్ఞానంబు దొలంగిన యోగికిఁ గన్పడు నిశ్చయాత్మకం బగు బ్రహ్మస్వరూపంబుచాయఁ గన్పట్టె. అప్పటి దృశ్యము నేమి చెప్పుదు! ఏతట్టుచూచిన రక్కసుల యవయవంబులు భూషణసహితంబులై గుట్టలు గుట్టలుగఁ బడియుండె. కొన్నితావు లందు వారియంగంబులు పర్వతములచాడ్పునఁ బ్రోవులై పడియుండె. వానిమధ్యంబున నారథరథ్యంబు లడుగు లిడుటకు నైతము వలను గాక యా పీనుంగురాసులపైఁ గాళ్లు వైవ నాశవాంగంబుల మీఁదనే మాతలి రథము నడుపవలసివచ్చె. అట్లు రథంబు పీనుఁగు లపైఁ బోవుచున్న మఱల వారిలోఁ గొందఱు దురంబునకుఁ గట్టాయి త్తులై యరుదెంచి మాయాబలంబునఁ గానరాక యాకసంబున కెగిరి మాపైఁ బర్వతంబులఁ బడున ట్లొనర్చిరి. కొందఱు రథచక్రంబులను, గుఱ్ఱములకాళ్లను గట్టిగం బట్టికొనిరి. ఇట్లు పర్వతంబు లాక్రమించుట చేతను, రథమును గుఱ్ఱములును నిగ్రహింపఁబడి మెదల నేరకుండుటను

నేను గుహలోఁ నుంపఁబడినవాఁడువోలెఁ గదల నేరక చింతతోఁ నుండ, మాతలి "యర్జునా! వెఱకుము. ఐంద్రాస్త్రము నభిమంత్రించి ప్రయోగింపు" మనఁగా నేను వానిమాట మేరకు వర్తించితిని. అంత నష్టమహనీయాస్త్ర ప్రభావంబున రాక్షసు లెల్లరును దెబ్బలు దిని కూలిరి. రథమునకు గుఱ్ఱములకు నా పీనుంగుపెంటలలోఁ బోవుటకుఁ గొంచెమేనియు వీలు కలుగదయ్యె. అట్లామూఁడుకోట్లరక్కసులును హతు లగుటయు, మాతలి నవ్వుచు నన్నుం జూచి, "పార్థా! దేవదానవు లెవ్వరును శౌర్యంబున నీ కీడు కారు." అని బహువిధంబుల నుతించె. వా రందఱును వధింపఁబడఁగా నాదానవులపట్టణంబున వారియంగనల రోదనధ్వనులు రోదసి నాక్రమించె. అంత నేను రథంబుతోఁ వారిపురమును బ్రవేశింప నా రథనేమిపటపటాత్కారమున కాయంగనలు భీతిల్లి యిండ్లలోనికిఁ జొచ్చుచుండ వారినగర మంతయుఁ గ్రుమ్మరి యా పురశృంగారమున కలరి, మాతలిం జూచి యత్యంతరమణీయం బైన యీపురమును దేవత లేల ప్రవేశింప రని యడుగ మాతలి నా కిట్లనియె. ఇది బహుకాలము క్రింద దేవనిర్మితమై దేవతలకు దేవేంద్రునకు నునికిపట్టయి యుండె. అంత నీరక్కసులు విజృంభించి దేవతల దీనినుండి వెడలఁగొట్టి యుగ్రతపంబాచరించి బ్రహ్మను సాక్షాత్కరించుకొని తమకు దేవతలవలన భయము కలుగకుండఁగను, నీపట్టణము తమకు నివాసస్థలమైయుండునట్లును వరములం బడసిరి. అంత నివాతకవచులను నీరక్కసుల కిది పురంబయ్యె. పదంపడి దేవేంద్రుండు బ్రహ్మ నారాధించి యీరక్కసులవధించు నుపాయంబు వేడఁగా బ్రహ్మదేవుండు వీరిని దేవతేతరుఁ డగు మహనీయుం డొకండు రూపుమాపును. కొంతకాలంబు నిరీక్షింపుఁ డని పితామహుండు వచించియుండె. వీరిని జంపునిమిత్తమయి యాఖండలుండు నీకు సర్వదివ్యాస్త్రముల నుపదేశించె. సురలచే నవధ్యత్వవరము వడసిన యీదుర్మార్గులు నీచే బొలిసి రని వారివృత్తాంత మంతయు నాకు వివరించి మాతలి రథమును గ్రమ్మఱించె.

## అర్జునుఁడు ధర్మజునకుఁ బౌలోమకాలకేయులవధప్రకారముఁ జెప్పుట

అంత నేను నివాతకవచులం బోరిగొని మఱలి చనుచు ముందట సూర్యాగ్నితేజస్సులం బోలినదియు, నాల్గుద్వారములుగలిగి గోపురాట్టాలక ప్రాకారవిలసితంబు, వివిధాయుధధారులగు రక్కసుల చే రక్షితమును, సుందరోపవనవిలసితంబును నగు నొకపురమును గాంచి యిది యెవరిపురము ? ఇం దుండువా రెవరు ? వీరి నేలువాఁ డెవండు ? అని యడుగఁగా నాకు మాతలి యిట్లనియె. పూర్వ కాలమున దితి యను దానవమాతకు కూఁతులు పులోమయు గాల కయు ననువా రుండిరి. వా రిరువురును వేయి దివ్యవత్సరంబులు బ్రహ్మ దేవునిఁగూర్చి యారాధించిన నప్పితామహుండు వారికిఁ బ్రసన్నుం డైన,వానివలన వారు తమకొడుకులకు నల్పదుఃఖమును, దేవదానవులచే నవధ్యత్వమును గోరిరి. మఱియు నాకొడుకులకు నిరామయం బైన యీపురమును వాసస్థలముగాను గోరిరి. ఇది హిరణ్యపురంబని పేర్కొ నంబడు. పితామహువరంబునం జేసి యీపురమునందుఁ బౌలోమకాల కేయు లనువా రున్నారు. వీరు బ్రహ్మవరమున గర్వితులై దేవదానవుల కసాధ్యులై యెవ్వరికిని నవధ్యులై యున్నారు. మానవునివలన వీరికి మృత్యువు బ్రహ్మచే విధింపఁబడియె. కావున వీరితో నీవు సమ రంబు పాటించి దేవతల కవధ్యులైన యీ దుష్టరాక్షసుల సంహరించి యింద్రుని మెప్పు వడయు మనఁగా నేనును నుబ్బి యట్ల చేసెదనని బాస యిచ్చితి. వెంటనే మాతలి రథంబు నాపురమువంకకుఁ బఱపెను. అంత నాపౌలోమ కాలకేయు లతిశూరులైనవా రఱువదివేవురు రథికులు సర్వయుద్ధోపకరణములతో నాపై నెత్తిరాఁగా వారిని నేను జూచుచుండఁగనే నాపై వారు శరపరంపరల నేసిరి. నేనును నాయస్త్ర విద్యాబలంబున వారి నెదుర్కొని నాబాణంబులు పెక్కింటిని వారిపైఁ బ్రయోగించితిని. అంత వారు నాపై నేసినబాణము లన్నియు వృథలై పోయినవే కాక వారు నాబాణంబులచే సమ్మోహితులైరి. దానిచేత వా రిటుటు పాఱుచుఁ గొందఱు పరస్పరము గొట్టికొని మడిసిరి. కొందఱు కొంతవడికి మూర్ఛదేఱి మాయఁ గావించి తమపురంబుతో

నందఱు నొక్కపెట్ట నుప్పరంబున కెగసినట్లు తోతెంచిరి. అంత నేను వారిని పురంబుతోఁ బై కెగుర నీయకుండ నాబాణంబుల వారి కడ్డంబుగాఁ బఱపితి. అయినను వారు తమ కుండు బ్రహ్మవరమహిమచే నాపురంబు కామగమనంబు గావున నొక్కపరి యది పాతాళ మధిగమించినట్లు, వేఱొక్కపరి యయ్యది యూర్ధ్వమున నున్నట్లును, మఱియొక్కపరి జలనిమగ్నముగను గనుపఱచుచుండుటచే నే నద్దానిపై దివ్యాస్త్రములం బ్రయోగించితి. అద్దాన నాపురంబు శిథిలం బయి నేలం గూలె. అట్లు చిదరవందరలైన యాపురం బాయసురులు, వీఁడి యీర్ష్యచే నందఱు నొక్కపెట్ట నాపైఁ గవిసిరి. మఱియు నేఁ బ్రయోగించు దివ్యాస్త్రములను మాఱుగ వారును దివ్యాస్త్రంబులను వేయుచుఁ దమ్ముఁ దప్పించుకొనుచు బహుమాయలఁ బన్నుచుండిరి.ఇంక వారంత కంత కగ్గలంబుగఁజలంబువాటించి పలుతెఱంగుల నన్ను నొప్పించిరి. అంత నమ్మహారణ్యంబునం దెద్దియుం దోఁపక నాయస్త్రంబు లన్నియు వమ్మగుట గుర్తించి మిక్కిలి పూనికతోఁ ద్రిపురాంతకు ధ్యానించి సర్వభూతములకును శుభం బగుఁ గాక యనుచుఁ బాశుపతాస్త్రంబును దలంచుటయు నప్పుడ నాయెదుట మూఁడుశిరస్సులతోఁ బాముల సొమ్ములుగాఁ దాల్చిన మహాపురుషుం డొకండు కానంబడియె, పదంపడి నాకు నానుహానీయాస్త్రము గాండివమునందలి యల్లెత్రాటితో సంధింపఁబడినట్లు తోఁచె. అంతట శూలిని ధ్యానించి ప్రణామం బొనర్చి పౌలోమ కాలకేయులు చంపఁ బడుదురు గాక యని నిర్దేశించి యాపాశుపతమును సమంత్రకముగ నర్చించి వదలితి. అంత నా మహనీయాస్త్రప్రభావంబున దటాలున ననేకసింహములును, బెద్దపులులును, ఘోరవరాహంబులును, క్రూరము లైనశరభములును, గాఱెనుములును, దోడేళ్లును, యక్షులును, రాక్షసులును, బిశాచములును, గుహ్యకులును, గంధర్వులును మున్నగువా రనేకు లుద్భవిల్లి యారక్కసుల నెల్లం బీసుంగులు గావింపఁగా మరల భూతపతికి నమస్కరించితి. అవ్విధమునఁ బౌలోమ కాలకేయు లందఱును హతులు కాఁగా వారి నారీమణు లందఱు నాక్రందించిరి. వారిరోదనధ్వని నింగి ముట్టె. ఆ ధానవపురం బెండినమ్రాఁకులతో నిండిన కాననంబువిధంబున సొధ

దప్పె. మాతలియు నాపరాక్రమమునకు మిక్కిలి సంతసించి యాఖం
డలనందనా! ఈకార్యముచే నీ వింద్రునికి మిక్కిలి ప్రియుండ వైతివి.
ఇంద్రుఁడు దేవతలచే నవధ్యులగు నీశూరుల మారణోపాయం బూహిం
చుచుండు. దైవయోగంబున వీ రందఱును నీచే నొక్కపెట్టున మడి
సిరి. నీపరాక్రమంబుఁ బొగడ నేరికిఁ దర మని నన్నుఁ బరిపరివిధంబుల
నుతించుచు రథంబు సాలించి నాకంబునకుఁ దోడ్కొనిపోవ,
నివాతకవచ పౌలోమ కాలకేయ వధప్రకారము నంతయు సవిస్తరం
బుగ నాపాకశాసనునకు నే విన్నవింప న య్యింద్రుండును దేవత లెల్ల
రును సావధానులై యాకర్ణించి నాకార్యంబున కచ్చెరువడిరి. అంత
నింద్రుండు నన్నుఁ జూచి, ధనంజయా! ఏయది దేవదానవుల కసాధ్యం
బో, యెవరు సురాసురులచేతను మడియరో, యాకార్యంబును సాధించి,
వారిని వధించి గుర్వర్థంబుఁ దీర్చితివి. నీపరాక్రమమునకు మెచ్చితి.
ఎల్లప్పుడును రణమధ్యంబున జాగరూకుండవై యస్త్రప్రత్యస్త్రప్రయో
గములయందు సుస్థిరుండ వగుము. నీ భుజబలపరాక్రమంబుచే జయిం
పఁబడిన మహీవలయము నీ యజాతశత్రుం డేలువాఁడు. నీకు దివ్యా
స్త్రంబులు ప్రసన్నములు గావున యుద్ధమున ని న్నెవ్వరును జెనకఁజా
లరు. భీష్మ ద్రోణ కర్ణ కృప శకుని ప్రభృతులు నీయందు షోడశాంశ
మువారు. ని యన్నదమ్ములు ని న్నెల్లప్పుడును దలంచుచుందురు. నీ
వలన దేవకార్యంబు సాధితంబయ్యె. భూలోకమునకు నింకం జను
మని యాజ్ఞ నొసంగి యీకవచంబును, స్వర్ణమయంబయిన యీ
మాల్యంబును, దేవదత్త మని పేర్కొనంబడు నీశంఖంబును, నీకిరీటం
బును, నీదివ్యవస్త్రములను, సొమ్మును నొసంగి పంపఁగా సురసేవితుండైన
సునాసీరుననుజ్ఞం బొంది మిముం జూచు వేడ్క మనస్సున నుప్పొంగ
నిట కేతెంచి యీగంధమాదనపర్వతశిఖరంబునందు మిమ్ముం బొడగాం
చితి. నే నింద్రలోకమున జూదమువలన మనకుఁ గలిగినయవస్థను దలఁ
చుచు నయిదేండ్లు వసించితి నని యర్జునుఁడు నిజవృత్తాంతం బంతయు
వినిపింపఁగా ధర్మజుఁడు పార్థుని సాదరముగఁ జూచి గారవించి యిట్లు
నియె ధనంజయా! మనభాగ్యంబున నీవు సకలాస్త్రములను బడసితివి.
సురరాజు నర్చించి మెప్పు వడసితివి. పినాకపాణికృపాపాత్రుఁడ వైతివి.

లోకపాలురతోడం గలసి వారికిఁ బ్రియంబు సలిపితివి. మహీమండల మంతయు సాధించినవాఁడ వైతి. ధార్తరాష్ట్రుల లోఁగొంటి వని తలం చెద. నివాతకవచుల వధించిన నీయస్త్రముల నన్నింటిని మాకుఁ జూపుము. అని ధర్మజుం డడుగుటయు నర్జునుం డాయస్త్రంబుల మరు నాఁడు చూపెద నని చెప్పఁగా నందఱును వానిసామర్థ్యంబుఁ దలపో యుచు నారేయి గడపిరి.

## అర్జునుఁడు ధర్మపుత్త్రున కస్త్రములఁ జూపుట

అంత మఱునాఁడు ధర్మపుత్త్రుండు యథావిధిగా నిత్యకర్మముల నొనర్చి తమ్ములతోడ నాసీనుండై యర్జునునిఁ బిలిచి పార్థా! నీయస్త్ర ముల నెల్లఁ జూపు మనుడు కిరీటి వల్లె యని శుచియై యాచమించి తనగాండీవము, దేవదత్త మగుశంఖము మున్నగు యుద్ధోపకరణము లను దేవతానుగ్రహంబునఁ బడసిన యస్త్రముల నెల్లం జూపఁ దొడంగె.ఆయస్త్రప్రదర్శనకారణంబున భూమి గడగడ వడఁకె, అగ్నులు చల్లారె. సమీరుండు వీవ వెఱచె. జలంబులు శోషించె. బ్రాహ్మణ కార్యంబు లాగె. వారికి వేదంబులు దోఁపవయ్యె. రసాతలంబున నున్న చేతనంబు లన్నియు నస్త్రతాపం బోర్వలేక మిక్కిలి భీతిల్లి యర్జునుం బరివేష్టించి కేలు మోడ్చి యభయంబు వేడె. చేతనంబు లెల్లఁ జేష్ట లుడిగె. బ్రహ్మరుద్రాదిదేవతలును దిగ్భ్రమపడి యేతెంచిరి. దేవతల ప్రేరణంబున గంధవహుండు దివ్యసూనంబుల దండలను నపార్థు చుట్టును బడవేసెను. అచ్చర లాడిరి. గంధర్వులు పాడిరి. కిన్నరులు వాద్యంబుల వాయించిరి. కింపురుషులు చిందులు ద్రొక్కిరి. అచ్చోటికి దేవతాచోదితుఁ డై నారదుం డేతెంచి యర్జునునితో పార్థా! అస్త్రం బులఁ బ్రయోగింపకు. వీని కెదురు లేకున్నఁ గాని, దైన్యంబు గలుగ కున్నంగాని ప్రయోగించినంతనె లోకక్షయం బాపాదిల్లు. సురక్షి తము లైనచో సుఖంబుఁ జెందించును. ఎన్నఁడును నిరధిష్ఠానంబుగ వీనిం బ్రయోగింపకుము అని చెప్పి యుధిష్ఠిరుం జూచి, ధర్మజా! ఎన్నఁడైన సంగ్రామంబు వాటిల్లునాఁడు నీతమ్ముని యస్త్రవిద్యావిలా సంబుఁ జూతు వని చెప్పి వారించి దివి కేఁగె. దేవతలును దమయునికి

పట్లకు వెళ్లిరి. అని వ్యాసశిష్యుండు పరీక్షిత్పుత్రునకు వచింపఁగా
నా రాజచంద్రుండు కిరీటి దేవలోకంబునందుండి తనయన్నదమ్ములను
ద్రోవదిం గూడికొనినపిదప వా రేమిగతి వర్తించిరి యానతీయవే యన
వైశంపాయనుండు జనమేజయునకు వెండియు నిట్లనియె.

అంత నప్పాండవు లందఱును గంధమాదనంబునం గల విశేషం
బులను, చిత్రవిచిత్రవస్తుజాలంబులను కుబేరుని గృహంబున వీక్షిం
చుచు నాలుగేండ్లు గడపిరి. అట్లు వా రరణ్యంబులం దొల్లి యాఱేం
డ్లును, నర్జునుండు నాకలోకంబునందుండి వచ్చినపిదప గంధమాదనం
బున నాలుగేండ్లును గలసి దశవర్షంబు లరణ్యావాసం బొనర్చిరి. అంత
నొక్కనాఁడు సమీరకుమారుండు యుధిష్ఠిరుం జేరంజని యొంటరి
పాటునఁ దమ్ములు విన నిట్లనియె. ధర్మతనయా! నీప్రతిజ్ఞ యథా
ర్థం బయ్యె. వనవాసకాలమునఁ బదివత్సరముల కాలము గడిపితిమి.
ఇయ్యది పదునొకండవయేఁడు. ఇంక నొక్కయే డనాయాసంబుగ నర
ణ్యంబున నుండి పదంపడియజ్ఞాతవాసంబుఁ గడపుదము. పిదపఁ గష్టాత్ముం
డైన ధృతరాష్ట్రపుత్త్రుం గదనంబున నెదుర్కొని వైరంబు సఫలంబుఁ
గావించి యాసుయోధనుని బంధుసుతమిత్రభ్రాతలతో రూపుమా
యించి సాంద్రయశశ్చంద్రికలు నలుదెసల వెలయ హాస్తినాపురసిం
హాసనం బధిష్ఠింపుము. సురల నాఖండలుండుం బోలెఁ బ్రజల శాంతి
మెయి నేలుము. రాజోచితవిధ్యుక్తక్రియాకలాపంబు లాచరించి సుర
లను దనుపుము. విరోధుల నడంచుట నీ కెంతపని? సత్యంబుగ నీ వల్గిన
సురరాజు నైతము నీ కోపఁడు. నివురు గప్పిన నిప్పుచాడ్పున నుండు నీ
ప్రతాపము రగులుడు లోకంబులు విధ్వస్తంబులుగావె? నీయాజ్ఞ నెఱ
వేర్చునిమిత్తమై వాసుదేవుండును, నర్జునుండును, సాత్యకియుఁ, గవ
లును, నేను నుండువార మని నీ వెఱింగినది కాదె? ఇంక నీవనంబుల
నుండు విశేషంబులం జూచుచు మగిడి యరుగుద మన ధర్మపుత్త్రుండు
దమ్ములహృదయం బెఱింగి వెంటనే ప్రయాణసన్నాహంబున నచ్చోటఁ
దా మున్న కుటీరంబును, దమకు సమీపమున నచ్చోఁ బాఱుచుండిన
నదులను, సన్నిహితంబులైన సరోవరంబులను గుబేరానుమతంబునఁ
దమకు సేవకులై యున్నయతులను నామంత్రణంబు సేసి తమమిత్త్రుల

తోడు పడసి యరిమర్దనంబు గావించి, మరలఁ దపోనుష్ఠానముల నిమిత్త మిచ్చోటికిఁ జనుదెంచువార మని యాలోచించుచుండె. ఇన్ని నాళ్లు వీరివెంట సర్వతీర్థాభిగమనంబునకుఁ దోడై యుండిన రోమశ మహర్షియు వారికిఁ గొన్ని ధర్మంబు లుపదేశించి దివంబున కరిగె. అంత భీముండు త న్మాగహన ప్రదేశమున మోచి తెచ్చుటకు హిడింబాసుతునిఁ దదనుచరులను స్మరింప వాఁడట్ల యేతెంచి, వాఁడు తమ్ము నందఱను మోవఁగా, వానియనుచరులగు రక్కసులు వారివెంబడి నున్న విప్రజ నంబులను మోవ నచ్చోటు వాసి యార్ష్టిషేణాశ్రమంబున కేతెంచిరి. అంత వా రందఱును రాజర్షికిఁ బ్రణతులై యాతనియాజ్ఞను శిరసా వహించి యా రమణీయప్రదేశంబులను వీడలేక యెట్టకేలకు మనసు గట్టిసేసికొని యచ్చటనుండి తరలి యరణ్యమార్గంబునఁ గైలాసంబున కవలి ప్రదేశంబుల నధిగమించి పిదప వృషపర్వాశ్రమంబుఁ జేరిరి. అంత నా రాజర్షి పుంగవుండు వీరి కెల్ల నతిథిసత్కారంబులం జేయ వానిని యథా క్రమంబుగఁ గొని యచ్చోట నొకరాత్రి వసించి రేపకడ వృషపర్వు వీడ్కొని మరల బదరికారణ్యముం బ్రవేశించిరి. నందనవనములవంటి యచ్చోటిరమణీయప్రదేశంబులందు నొక్కమాసము సంచరించి, హిమవత్పర్వతప్రాంతముల నుండు కిరాతదేశంబునఁ జీనతుషారదరదాది ప్రదేశంబులం దాటి క్రమ్మఱ సుబాహుపుర ప్రవేశముఁ గావించిరి. ఆ కిరాతపురంబున నొక్కనాఁ డుండి సుబాహు వొసంగిన సపర్యలం గైకొని తాము తొల్లి యాపురమున విడియించియున్న తమభృత్యు లైన యింద్రసేన విశోకాదులం గూడి, నిజరథారూఢులై, ఘటో త్కచున కాతనిపరివారమునకు సెలవొసంగి హిమవత్పర్వతప్రాంతం బుల దినదిన ప్రయాణంబు సలుపుచు విశాఖయూపంబుఁ జేరిరి. అచ్చోట వేఁటాడుట కనేకమృగంబు లుండుటం జూచి, మృగయావ్యసనంబున వా రం దొక్కయేఁడు గడపిరి. అప్పు డొక్కనాఁడు వృకోదరుండు వేఁటకుఁ బోయి యొకకొండజెలఁగచేఁ బట్టువడ యుధిష్ఠిరుండు పోయి వానిని విడిపించె. అంత వారియరణ్యవాససమయసమాప్తికాలము సమీపించుటయు నా మరుభూములమార్గమునందు సరస్వతీనదీతీరం

బున నానావిధతరులతాదులచే దట్టమై యుండునదియు, ననేకమహర్షులయాశ్రమంబులకుఁ దావలంబై యుండునదియు నగు ద్వైతవనంబుఁ జేరి విప్రబృందములతో నట విహరించుచుండిరి. అని వైశంపాయన మునివర్యుండు జనమేజయనృపవర్యునితోఁ జెప్పఁగా జనమేజయుండు, మునిచంద్రా, అతిబలుండైన వృకోదరుండు పన్నగాక్రాంతుం డెట్లయ్యె? అతండు మున్ను యక్షరాక్షసుల నొక్కరుండ వధియించి గుహ్యకేశ్వరుని సమరంబునకు మల్లుచఱచి యుండినవాఁడు కాఁడే? ధర్మజుం డతని నెట్లు వదలించె. ఆవృత్తాంతం బెంతయు నద్భుతంబు. దాని నాన తీయవే యని యడుగుటయు నమ్మునిచంద్రుం డా రాజచంద్రున కిట్లనియె.

### అజగరంబు భీముచేఁ బట్టుకొనుట

ఆవిధంబున నప్పాండుసుతులు హిమవత్ప్రాంతగహనకాంతారంబుల విహరించుచుండ నొక్కనాఁడు వృకోదరుండు గదాదిసాధనంబులను, మృగయావ్యాపారంబునకు వలసిన ఖడ్గాద్యాయుధములను గొని నానాతరులతావితానయుక్తంబై యొప్పారు నవ్వనంబుఁ జొచ్చి యందుండు సకలభూతంబులు భీతిల్ల దారుణనినదంబుఁ గావించుచు, భుజము లప్పళించుచు, దరువులఁ బెకలించుచు, లతలను ద్రెంపుచు, బుట్టలఁ గీటడంచుచు, నడవిపందులను, దున్నలను, సింహవ్యాఘ్రాదిక్రూరమృగములను వధించి చెండాడుచుఁ బాదఘట్టనంబుల సకలోర్వీధరకాననములతో వెలయు ధరిత్రిని గడగడ వడంకించుచుఁ బాలకడలి మథించు మంథరనగంబుచాడ్పున గాననంబు నల్లకల్లోలపఱచుచుండఁగా నొక్కచోట నొక్క మహానాగంబు కన్పడె. అప్పాపఱేఁడు పర్వతాకారంబై హరితవర్ణకాయంబుతోఁ జిత్రవిచిత్రరోమంబులు గల్గి, నాల్గుకోఱలతోఁ గొండగుహవలెఁ దెఱచియున్న యెఱ్ఱని వదనంబును, ప్రజ్వరిల్లుచున్న నేత్రంబులును గల్గి, కాలాంతకవిషంబును ఫూత్కరించుచు, దననోటివిషోచ్ఛ్వాసంబులచే లోకములను భస్మపటలంబుఁ జేయునో నాఁగ నొప్పుచుఁ బ్రళయకాలసమవర్తి ననుకరించుచు, గాననములోని సకలభూతముల వెఱపించుచుండె. అంత భీమసేనుం డాటోపంబున దానిం డాయుడు, నయ్యది వాని రెండు

భుజంబుల నొక్కుమ్మడి బంధింపఁగా, నాగాయుతబలుం డయ్యును భీమసేనుండు దానిపట్టునుండి తప్పించుకొనుట కశక్తుం డయ్యె. అప్పు డామారుతి యిది సామాన్యసర్పంబు గాదు. దీనిబలం బత్యద్భుతంబు. అని తనతో విచారించి యా సర్పరాజున కిట్లనియె. ఓ నాగరాజా! నీమహిమం బత్యద్భుతంబు. నీబలంబు భీమంబు. నేను పాండురాజపుత్త్రుండ. ధర్మతనయు తమ్ముండ. భీమసేనుం డనువాఁడ. ఈకాననంబున సింహశార్దూలాది క్రూరమృగంబులను నాబలిమి మెయి ననేకముల వధించినవాఁడ. యక్షరాక్షసుల ననేకులను నొక్కండనే యసహాయుండ నై పిలుకుమార్చినవాఁడ. పదివేలయేనుంగుల బలముతో వర్ధిల్లువాఁడ. ఇట్టి నేను నీచే బంధింపఁబడి యెంత యత్నంబు చేసియు నీపట్టుఁ దప్పించుకొనలేక నిర్విణ్ణుండనై యున్నాఁడ. ఇంత బలిమి నీ కెట్లు గలిగె? నన్నేమైనఁ బనిగొందు వేని నీయాజ్ఞ నొనర్పువాఁడ. నీపే రెయ్యది యని యడుగుచుండ నయ్యజగరంబు భీమసేనుమే నెల్లం జుట్టుకొని, చేతులు మాత్రము వదలి యిట్లనియె. వృకోదరా! నావృత్తాంతంబు సెప్పెద వినుము. నేను తొల్లి నహుషుం డనురాజను. నీవంశమునఁ బూర్వ మున్నవాఁడను. నీవును నన్ను వినియుందువు. నే ననేకాధ్వరంబుల నొనర్చి తత్ఫలంబుగా నింద్రపదవిం బొందితి. కాని, గర్వితుండనై విప్రుల నవమానించితి. అంత నగస్త్యుం డలిగి నన్ను ఘోరాకారం బైన సర్పంబు గమ్మని శపించె. అపుడు నేను విషణ్ణచిత్తుండనై యగస్త్యునాశ్రయించి మహాత్మా! నాకు శాపానుభవకాలమునందు బలవత్సత్త్వములు నాకుఁ జిక్కుదుర్బలత నొందుటకును, బూర్వస్మృతి చెడకుండఁగను గరుణింపుము. నాకు శాపవిమోచనమును బ్రసాదింపుము. అని ప్రార్థింప నమ్మునీంద్రుండు కరుణించి నాకోరినవరంబు లిచ్చి, యింకఁ బెద్దకాలంబునకు నెవ్వఁడేని నీయడిగిన ప్రశ్నములకు సదుత్తరంబు లిచ్చునో యామహానీయువలన నీకు శాపావసానం బయ్యెడుఁగావుత మని చెప్పె. ఆముని వరప్రభావంబుచే నాచే బంధింపఁబడిన మహాసత్త్వంబుగల యేప్రాణియైనను గదలలేక పోవును. నేను దీవ్రమైన క్షుద్బాధతో నవయుచున్నవాఁడ. నీవు నా కిప్పు డాహారంబ వైతివి ప్రాణభృత్తులకు జీవితాశ బలీయము గాదే! వంశవర్ధనుఁడవైన నిన్నిఁ బ్రాణంబుల నిల్పుకొనుట

కాహారంబుగాఁ జేసికొనవలసివచ్చె. దైవప్రేరణ మట్లున్నయది. ఏమి చేయవచ్చు ? చేసిన పాపకార్యఫలమున నీ సర్పశరీరముఁ బడసితి. నానాకష్టముల కాలవాలమైతి. శాపాంతంబు నా కెన్నండగునో యని చింతించుచుండ నా యజగరంబునకు భీముం డిట్లనియె. ప్రాణులకు సుఖదుఃఖములయనుభవంబు దైవాధీనంబు. దుఃఖానుభవంబునఁ గోపంబు నొందరాదు. తన్ను నిందించుకొనియుఁ బ్రయోజనంబు లేదు. అపాయము సంభవించినపుడు మనస్సును జలింపనీయక యొక్క తెఱంగున నిలుపవలయు. అట్టివాఁడే ధీరుండనఁబడును. దైవవశంబునఁ గల్గెడుదానిని బురుషయత్నమున నాపఁగలమే. దైవయోగమే బలీయము. పౌరుషము దుర్బలము, దైవము చిన్నచూపు చూచినంతన కాదే నాగాయుతబలుండనైనను నే నిప్పుడు నీచేఁ జిక్కితి. అనిమిత్తముగ నా కీదురవస్థ వాటిల్లె. నా కీశరీరమున కపాయము సంభవించినదని చింత లేదు. కాని, రాజ్యమును గోల్పోయి యక్షరాక్షసభూయిష్ఠంబును, సంతతమృగసంకులంబును నైన యీ హిమవత్ప్రాంతకాంతారంబులయందు నాయన్నయుం దమ్ములు నిడుమలఁ గుడుచుచున్నవారు. నా రాక కెదురుచూచుచు నేను సకాలమున వారికి గోచరింపనినాఁడు నాకై వా రెంత గుందుదురో! ఒకవేళ నేను లేకున్నను దనయస్త్రవిన్యాసబలంబునఁ దా నొక్కరుండే విరోధుల గెలువఁగల నను తలంపుతో నాకై యర్జునుండు వగవకున్నను, నాబలిమి నాధారపరచికొని కోల్పోయిన రాజ్యంబుఁ గ్రమ్మఱఁ బడయవలయునని నమ్మియుండు ధర్మాత్ముండగు నా యన్నయు, దుర్బలులైన కవలును నెంత వగఁ జెందుదురో? కాంతారవాసంబును బండ్రెండేండ్లు చెల్లించి శూరులైన తనకొడుకులు మరలి యజ్ఞాతవాసంబుసలిపి తన్నుఁజూడఁగావచ్చుచో వారి క్షేమం బారసి సంతసింపఁగలతల్లి నా లేమింజేసి యెంతదుఃఖంచునో యని యెంతయుఁ జింతిల్లెద. అని పలుతెఱంగుల విలపించుచు నజగరంబుపట్టు దప్పించుకొన లేక భీముం డుండె.

### ధర్మరాజు భీముని వెదకఁబోవుట

ఇట ధర్మరాజునకుఁ గొన్ని యుత్పాతంబులు దోఁచెను. అంత నాతండు భీతిల్లుటయుఁ దనకుఁ గుడిభుజం బదరఁగా గుర్తించి, ముందు

గొంత చెఱుపు దోఁచినను బిదప శుభం బగు నని భావించి ద్రౌపదిం బిలిచి భీముం డెటఁ బోయి యున్నవాఁ డనఁగా యాజ్ఞసేని మృగ యాసక్తుఁ డై వేఁటకుఁబోయె నని తెలిసి చెప్పఁగా విని యాశ్రమంబున ద్రౌపదిసంరక్షణార్థ మర్జున నకుల సహదేవుల నుంచి తాను ధౌమ్య సహితుండై కాంతారమునందుఁ దూర్పున భీమసేను పోయినమార్గంబున నేగుచు, నతండు వేఁటాడుతఱి వధించిన మృగంబులు పర్వతోపమాన ములును, నతఁ డరుగు దెంచునపుడు, తదూరుసంజాతవాతభగ్నంబులై నేల కొరగి యుండు తరుసంచయములును, శుభచిహ్నంబులతో నొప్పారు భీమసేనునడుగులజాడయుఁ గాన్పించు చుండెను. అంత నాజాడఁ గొంత దూర మేఁగఁగాఁ బ్రచండవాయు వొక ప్రదేశ మున వీవఁజొచ్చె. మఱియు నాచోటున నుండుచెట్లు పత్రరహితం బులై కంటకావృతంబులై కానంబడియె. ఆస్థలం బంతయు నిర్జలం బై పాషాణమయంబై స్థాణుమూలంబై యూషరప్రాయం బై యుండె. అచ్చోట నొక మహాజగరంబుచే బంధింపఁబడిన మహాబలు భీమసేనుం జూచి చింతించి 'భీమసేనా! ఈ పెన్పాముచేత నెట్లు బద్ధుండ వైతి?' వని యడిగి వానివృత్తాంతం బంతయు నెఱింగి యజగరంబు నుద్దేశించి 'యో సర్పరాజా! నీకాహారంబుగ నింక నెద్దానినైన నిచ్చెద. ఇప్పుడు నీచేఁ బట్టువడిన నాతమ్ముని వదలుము. నీవు దేవ తవో? లేక, సర్పరూపధరుండ వగు రాక్షసుండవో! నీ కెద్దాని నొసంగిన నీ నాతమ్ముని విడుతువో. నీవృత్తాంతమంతయు వివ రింపు మనఁగా నజగరంబు ధర్మజున కిట్లనియె. అయ్యా! నాకుఁ గాలప్రాప్తంబైన యాహారంబు నీ తమ్ముండు. కావున వీని నేను విడువనోప. ఇచ్చోటన నీవు నుంటివేని నీవు నాకు రేపటిదినమున కాహార మయ్యెదవు. ఇచ్చోట నుండవలదు. పొమ్ము. నాప్రదేశం బున నుండువారి నెట్టివారినైనను నేఁ బట్టి బంధించి భక్షింతు. ఇయ్యది నావ్రతంబు. నే నెవ్వం డంటివి? వినుము. నేను దొల్లి భవద్వంశ పూర్వజుఁడను. చంద్రున కేనవవాఁడ. నాతండ్రి యాయు వనునృపాలుండు. నహుషుఁడు నాపేరు. భూలోకంబున ననేకసుకృ తంబులం జేసి తత్ఫలముగా నింద్రపదవి నధిష్ఠించితి. భూలోకంబున విస్తారమైన తపం బాచరించితి. వేదాధ్యయనంబు లెస్సగాఁ జేసితి.

అనేకయజ్ఞములను గావించి భూసురుల దానదక్షిణాలం దనిపితి. పిదప నాకంబున కేఁగి యింద్రుండనై యాయైశ్వర్యంబున మత్తిల్లి బ్రాహ్మణుల ధిక్కరించితి. అంత నగస్త్యుం డనుమునివరుండు నాకుఁ గోపించి నన్నజగరం బగు మని శపించె. కావున నీదుర్దశం జెందితి. కాని, యగస్త్యుం డనుగ్రహించి నాకుఁ బూర్వస్మృతియు, మహాసత్త్వుల హీనసత్త్వులం జేయుశక్తియు నొసంగి, నాయడిగిన ప్రశ్నముల కేవాఁ డెవ్వాండు సదుత్తరంబు లిచ్చునో వాఁడు నాకు శాపావసానం బని ప్రసాదించె. కావున నాయడిగినప్రశ్నలకు నీవు సదుత్తరంబు లిత్తేని నీతమ్ముని వదలెద ననఁగా యుధిష్ఠిరుండు మహాత్మా! నీప్రశ్నంబులకు సదుత్తరముల నిచ్చుటకు విప్రులు తప్ప నితరులు వలంతురే? ఐనను నానేర్చినకొలందిఁ బ్రత్యుత్తరముల నొసఁగెదను. అడుగు మనుటయు నయ్యాజగరం బిట్లనియె.

ధర్మరాజు అజగరం బడిగినప్రశ్నములకు సదుత్తరముల నిచ్చి భీముని విడిపించుట

రాజేంద్రా! బ్రాహ్మణుం డన నెట్టివాఁడు? ఆతనికిఁ దెలియఁదగిన దేది? యని యడుగ ధర్మజుం డిట్లనియెను. ఓనాగరాజా! ఎవనియందు సత్యము, దానము, ఓర్పు, తపస్సు, దయ, కనికరము గలవో వాఁడు బ్రాహ్మణుం డనఁబడును. వాఁడు దేనిం దెలిసిన దుఃఖరహితుఁ డగునో, యట్టి దుఃఖములేనిదియు, సుఖము నైనదియునగు పరబ్రహ్మ మతఁడు తెలియఁదగినది. నీ వేమి తలంతువో యెఱుంగను. నాకుఁ దోఁచినప్రత్యుత్తర మిచ్చితి. అనఁగా నాగం బిట్లనియె. రాజా! చాతుర్వర్ణ్యమును బ్రమాణమని చెప్పుదురు. నీవు సెప్పినట్లు సత్త్వాదిగుణంబులు గలవాఁడే బ్రాహ్మణుఁ డైనచో నవి శూద్రునియం దుండు నేని వాఁడు బ్రాహ్మణుం డనఁబడునే? సుఖదుఃఖరహితమైన పరబ్రహ్మ మతనికి వేద్యమని (తెలియఁదగినది) యంటివి. సుఖదుఃఖములు రెండును లేనిది లోకమున నొం డుండునే? యనఁగా యుధిష్ఠిరుం డిట్లనియె. సత్యాదిగుణంబులు గలవాఁడే బ్రాహ్మణుండు. అవి శూద్రునందుఁ గల్గుచో వాఁడు శూద్రుఁడు గాఁడు. బ్రాహ్మణునం దయ్యవి లేకున్న, వాఁడు బ్రాహ్మణుండు గాఁడు. వృత్తమే యుత్తమంబు. శీతోష్ణములకు మధ్య వేఱొండు గాననట్లు లోకమున సుఖమో దుఃఖమో యేది

యొకటి కానిది లేకున్నను లోకమునకుఁ బరముగ నున్నదియు, నిట్టి ట్టిదనరానియు నగు పరబ్రహ్మము ద్వంద్వరహితము గాన నది సుఖ దుఃఖరహిత మని తలంతు ననఁగా నజగరం బిట్లనియె.

వృత్త మత్యుత్తమం బంటివి. దానిచేతనే బ్రాహ్మణత్వం బగునేని వర్ణాశ్రమాచారాదులు వ్యర్థములు గావే? యనిన ధర్మపుత్త్రుం డిట్లనియె. నాగేంద్రా! వినుము. వాచాలత్వము, మైథునము, జననము, మరణము మనుష్యుల కందఱకును సాధారణము. కావునఁ బూర్వము ప్రమాదంబున వర్ణసంకరము కాఁగా బ్రత్యేకజాతి నియమం బవశ్యం బయ్యె. కావున వృత్త మత్యుత్త మని వేదముల నెఱింగినవారి యభి ప్రాయము. బ్రాహ్మణస్త్రీగర్భమునందుఁ బుట్టినవాఁడు బొడ్డుఁ గోయఁబ డుటకు మున్ను సావిత్రి తల్లిగను, నాచార్యుండు తండ్రిగను నుండు. కావున వాఁడు వేదములయందుఁ జెప్పఁబడిన సంస్కారములఁ బొందు నంతకు శూద్రసముఁడే యగును. కావున నతం డుపనయనాదివేద విహితసంస్కారములఁ బొంది సత్త్వాదిగుణంబుల కలవాటుపడినచో నప్పుడు బ్రాహ్మణుం డనఁబడును. సత్త్వాదిగుణంబులు గలశూద్రుండే సచ్ఛూద్రుం డనఁబడు నని మనువగు స్వాయంభువు తొల్లి వచించె. అని చెప్పఁగా నజగరంబు ధర్మజుని విదితవేద్యత్వంబునకు మెచ్చి నృపాలా! నీయుత్తరంబులకు మెచ్చితి. నీతమ్ముని నేను భక్షింపను. అనఁగా ధర్మ జుం డజగరమున కిట్లనియె.

మహాత్మా! నీవు వేదములను వేదాంగములను నన్నిటి నెఱిం గినవాఁడవు కావున నిన్ను నే నడిగెద. దేని నాచరించినచో నుత్తమ గతి గలుగు. వివరింపు మనఁగా నజగరం బిట్లనియె. సత్పాత్రమున నీగి, ప్రియమైనదాని నొసర్చుట, సత్యంబుఁబలుకు, హింస నెల్లపుడు గావిం పకునికి యివియ యుత్తమగతిసాధనంబులు. అనఁగా ధర్మజుండు నాగేం ద్రున కిట్లనియె. అయ్యా! దానాహింసాసత్యవచనప్రియాచరణంబుల నెద్ది పెద్ద యని యడిగిన నజగరం బిట్లనియె.

రాజేంద్రా! పై వానిలో సమయోచితముగ నొక్కొక్కటి గొప్పగాఁ దోఁచినను నవి యెల్ల సమంబులే యగును. వానిలో గురు లాఘవంబుల నెన్నరాదు. అనఁగా ధర్మజుం డిట్లనియె.

స్వర్గమును మనుష్యుం డెట్లు పొందు? కర్మఫలములు ధ్రువము లని వినుచున్నారము. శరీరమును వదలుచుండఁగనే జీవుండు భోగ సాధనరహితుఁ డగుచున్నాఁడు. కావున నప్పటిస్థితియందు వాఁడు కర్మ ఫలముల నెట్లు గుడుచు? ఈసందేహమును దెలియఁజెప్పు మనఁగా నజగరం బిట్లనియె.

దానముల నాచరించుచు హింస తెరువున కేఁగనివాఁడు స్వర్గమును బొందును. సత్కర్మములను బాగుగను విశేషముగను జేయనివాఁడు సుకృతఫలముగ మనుష్యత్వమును బ్రాపించు. కామక్రోధములతోఁ గూడుకొని హింసను జేసినవాఁడు మనుష్యులలోఁ బుట్టక తిర్యగ్జాతు లలోఁ బుట్టు. దుఃఖము నంతయు ననుభవించి పాపం బెల్ల నశింపఁగా క్రమమున మనుష్యజాతిం బుట్టి, యాజన్మమందు సత్కర్మల నొనర్చి దేవత్వమును బొందు నాశరహితుం డైన జీవాత్మ నిజస్వరూపము నెఱుంగక ప్రకృతిమాయలలోఁ జిక్కి తత్తత్కాలాచరితంబు లై యవశంబు లై ప్రాపించు కర్మల నాచరించుచు దదనుగుణము లైన శరీరంబులఁ జొచ్చుచు వదలుచు నాయాఫలంబుల ననుభవించుచు సంసారచక్రమునందుఁ దిరుగుడువడుచుండును. ఇది కర్మఫలముల యొక్క శాశ్వతప్రకారము అని చెప్పఁగా ధర్మరాజు వెండియు నిట్ల డిగెను. శబ్ద స్పర్శ రూప రస గంధముల ననుభవించునపుడు నాత్మకు సాధనం బెయ్యది? ఎల్లవిషయములను యౌగపద్యమున గ్రహింప నగునా? యనఁగా నజగరం బిట్లనియె.

ధర్మనందనా! శరీరాధిష్ఠాన మైన జీవాత్మ విషయప్రవృత్తికి మనస్సు, బుద్ధి, త్వక్కు, చక్షుస్సు, శ్రోత్రము, జిహ్వ, ఘ్రాణము నను వీనిని సాధనములుగాఁ గొనును. ఆత్మ భ్రూమధ్యస్థితుం డై యుండి పరాపర స్వరూప మగుబుద్ధిని వివిధవిషయములయందుఁ బ్రేరేపించు. అట్లది ప్రేరేపించుచుండఁగనే సర్వవిషయపరిజ్ఞానంబు గలుగు. అంతట మనస్సు విషయప్రదేశములయందుఁ బ్రవేశించు. అందు దేనియందు మనస్సు ప్రవేశించునో, యావిషయమును గ్రహించునట్టి యింద్రియముమూలమున జీవాత్మ యాయా విషయసుఖముల ననుభవించు. కావున నొకేకాలమున సకలవిషయములను గ్రహింప వీలు కాదు.

అని చెప్పగా మనస్సు, బుద్ధి వీనిలక్షణంబుల నెఱింగింపవే యని ధర్మ జుండు మఱల నడుగఁగా నజగరం బిట్లు వచించె.

బుద్ధి యెల్లప్పుడు నాత్మస్వరూపము నాశ్రయించి జ్ఞానరూపమై గుణరహితమై యుండును. మనస్సు సంకల్పవికల్పములతోఁగూడి గుణసహితమై యుండును. ఇదియ మనోబుద్ధులకుఁ గలభేదములు. అని చెప్పఁగా ధర్మజుండు శంకలం దొలఁగి యజగరమున కిట్లనియె.

మహాత్మా! నీమాటలచే సందియములు తొలఁగినవి. సర్వజ్ఞుఁడ వగు నిన్ను మోహ మెట్లు మోసగించి యధిష్ఠించెనో యని వేఱొక శంక నన్ను బాధించుచున్నయది యనఁగా నా పన్నగవర్యుండు నృప వర్యున కిట్లనియె.

బుద్ధిమంతుఁడయ్యును సుఖములలో మునింగి మోహము నొందును. నేను మహదైశ్వర్యంబునఁ బ్రజ్ఞాహీనుండ నై మదించి యీగతిం జెందితి. నా మహాస్వరూపమును గొంత వినుము. నా సుకృతంబునం జేసి బ్రహ్మర్షులు, దేవతలు, గంధర్వులు, యక్షులు, రాక్షసులు, పన్నగాదులగు త్రిలోకవాసు లెల్లరును నా కరిగాపులైరి. చూచిన మాత్రమున నా కెదుట నున్నవారి తేజస్సు నంతను లాగికొనునంతటి దృష్టిశక్తి గలిగియుంటిని. వేయిమంది బ్రహ్మర్షులు నే నెక్కిన విమానము మోయుచుండఁగా నాకమున సంచరించుచు నాకంటె నధికుం డెవ్వం డీ మూఁడులోకంబులలో నున్నవాఁ డని వృథాభిమానము గలిగియుండఁగా నొక్కనాఁడు నాపల్లకిని మోయుచుండు నగస్త్య మునీంద్రుని వేగిరించి కాలఁ దన్నితి. అంత నా ఋషివర్యుండు నా కలిగి సర్పంబవై పడుమని శపింపఁగా నా కీదుర్గతి ప్రాప్తించె. మునిశాప మహిమచే నేఁ గ్రిందఁ బడుచు నీ యజగరాకారంబు నొందుటకుఁ జింతించి యగస్త్యు నిట్లు ప్రార్థించితి. మునీంద్రా! నాయజ్ఞానమును సైరింపుము. శాపాంతమును బ్రసాదింపుము. అనఁగా నాఋషిచంద్రుఁడు కరుణించి యీ పాపఫలము నంతయు ననుభవించినపిదప పాండురాజ పుత్త్రుండైన ధర్మాత్ముండు నీశాపవిముక్తిఁ జేయు నని ప్రసాదించె. సాధువులలోఁ బ్రథమగణ్యుండ వగు నీతో నే నీ సంభాషణమును గావించుటవలన నాకు శాపవిమోచన మయ్యె. మహానుభావా

మహోపకార మొనర్చితివి. మహదైశ్వర్య మెంత సమకూడినను విప్రావ
మానం బెన్నఁడును జేయరాదు. నీవు బ్రాహ్మణులతపస్సులయొక్క
మహత్త్వ మెఱింగినవాఁడవు కావున నావిషయముల కనుగుణములైన
ప్రశ్నలఁ జేసితి. నీయెడ సంతసిల్లితి. నీతమ్ముని భీమసేను నిదె విడిచి
పుచ్చితి. నీకు మే లయ్యెడి. నేను నాకంబునకుఁ బోయెద నని వచించి
నహుషుండు తనకుఁ బూర్వమునఁ బ్రాపించియున్న యజగరరూప
మును శాపావసానం బగుడు వదలి, పూర్వదివ్యదేహమును బొంది
తనకై యప్పుడె వచ్చి వేచియుండు దివ్యవిమానంబు నెక్కి, నాకంబు
నకుఁ గ్రమ్మఱఁ జనియె. యుధిష్ఠిరుండును తమ్ముండైన భీమసేనుని
నజగరబంధవిముక్తుం జేసికొని వానిఁ దన వెంటఁ దోడ్కొని ధౌమ్యు
నితోఁ మఱలిపోయి తనయాశ్రమంబున నీయావద్వృత్తాంతంబు తమ్ము
లకును, ద్రౌపదికిని, దోడనున్న విప్రులకును జెప్పఁగా వారు భీమసేనున
కింత సాహసంబు తగునే యనుచును, ధర్మరా జింతమహనీయుఁడై
యొప్పునే యనుచును సంతసంబునం బొదలిరి.

అవ్విధంబున వా రాయాశ్రమంబున వసించుచుండఁగా వర్షర్తువు
సన్నిహితం బయ్యె. అప్పు డాకసంబు నల్లని మేఘంబులచేఁ గ్రమ్మఁబడి
కన్నులు మిఱుమిట్లు గొలుప తళతళలాడుచుండు మెఱుపులును,
దెసలు భూనభోంతరాళంబులు బీఁటలువాఱ శబ్దించు నుఱుములును
రేయింబవలును నొకతీరుగ జిమ్మచీఁకట్లు గ్రమ్మి మెఱసినప్పుడు తప్ప
దెసలం గనుంగొన వీలు కాని సంతతధారాసంపాతంబు వర్షించె.
ఆయపరిమితవర్షపాతంబుచే భూమియంతయు నర్ణవం బయ్యె. ఏఱు
లపారముగఁ బ్రవహించు నీటితోఁ దమగట్టులమీఱి తీరంబుల నున్న
భూములయం దిసుకదిబ్బల నుంచె. ఏతట్టు చూచినను మయూరములు
కుంచెలెత్తి నృత్యంబు సేయుచు షడ్జస్వనంబునఁ గూయుచుండె.
భేకంబులు బెకబెకధ్వనులఁ జేయుచుండె. పంచమస్వనంబులఁ బికం
బులు గూయుచుండె. సకలజంతుజాలంబులకు సంతసం బుప్పొంగె.
వర్షకాలమంతయు నప్పాండవులు విప్రసమేతులై యా మరుభూముల
యందు నివసించి శరత్కాలంబగుడు, నిర్మలోదకముల నిండినదియుఁ
గుముద కువలయ కల్హార పుండరీకములతో శోభిల్లుచుండునదియుఁ,
క్రౌంచహంససమాకీర్ణయుఁ గాంతిమన్నక్షత్రములతో నిండిన

విమలాకాశము గలదియు, సంతసించిన సమస్త వనమృగపక్షి సమూహములు గల కాననంబులు గలదియు నైన యా సరస్వతీనదీతీరంబుఁ జేరి యందు వెలయుచుండు ద్వైతవనంబు నధిగమించిరి. అంత తద్వనమందలి నిర్మలోదకంబుల విప్రసహితులై యందఱు కృతస్నానులై నిర్ధూతకలుషులైరి. అచ్చోట నవ్వనమునందలి రమణీయతను గన్గొనుచుఁ బగలెల్ల జిగురుజొంపముల నందంబై తెరువరుల కపారమైన చల్లని నీడ లొసంగుచుండు పొదరిండ్లను, నాపొదరిండ్ల క్రిందఁ బ్రకృతి పాంథులనిమిత్తమై నిర్మించినదో యనునట్లుండు తెల్లని యిసుక దిన్నెలయందు వారు సంచరించుచుండిరి. పగటిపూట సూర్యుని కిరణజాలంబులవేడిమిచే స్రుక్కియుండు ప్రాణుల యలపుఁ దీర్చి నను రా జనుపేరు నన్వర్థంబుచేసెనో యనునట్లు రేలు నక్షత్ర సమూహమధ్యములంగన్పట్టిన నల్లకలువలచుట్టము తనమండలమునందుఁ దనయంశువు లనుకరములచే నమృతమును జల్లినవిధంబున, నేలం బిండారఁబోసినచందంబున శుక్లపక్షపురాత్రి వెన్నెలలు సాంద్రంబులై కాయ నానందలహరిం దోఁగుచు వా రా కార్తికపౌర్ణమాసి నచటఁ గడపిరి. అచ్చోనుండి పాండవులు తమవెంట ధౌమ్యాదివిప్రవరులును, నింద్రసేనాదిసూతభృత్యులును రాఁగఁ బ్రయాణమై కామ్యకవనంబు చేరిరి. అచ్చోటనుండు ఋషివర్యులు వారల నాదరింపఁ బాండవులు వారిసత్కారంబులం గొని పాంచాలీసహితులై విప్రవరుల నారాధించుచున్నంత వారియొద్ద కొక్కపురుషుం డర్జునమిత్త్రుం డగుభూసురుం డేతెంచి యో పాండుసూనులారా! సర్వకాలసర్వావస్థలయందు మీమేలు గోరుచుండు వసుదేవపుత్త్రుండు శ్రీకృష్ణుం డిచ్చోటికి మీ రాక నెఱింగి మిమ్ముం జూడఁ గుతూహలియై యిదే వచ్చుచున్నవాఁడు. అతనితో బహువత్సరములు జీవించియుండువాఁడును, మహాతపస్వియు నిరంతరస్వాధ్యాయసంపన్నుండును నగు మార్కండేయుం డనుముని చంద్రుం డరుదెంచుచున్నవాఁడు. నన్ను మీకడకు ముందుగఁ బోయి వారిరాకను మీకుఁ దెలియఁజెప్పు మనిరి.

### శ్రీకృష్ణుండు సత్యభామతోడఁ బాండవులయొద్దకు వచ్చుట

ఇట్లాభూసురుండు పాండవులతోఁ దనవార్త చెప్పుచుండఁగనే సైన్య సుగ్రీవ మేఘపుష్పాది హయయోజితం బైన తేరెక్కి దేవకీసు

తుండు సత్యభామాసహితుండై శచీదేవితోఁ గూడిన శునాసీరుచందంబునఁ దేజరిల్లుచు నచ్చోటికి కేతెంచి తేరుడిగుడు ధౌమ్యపురస్కృతులైన పాండవు లేవురు నాతని నెదుర్కొనఁగా శ్రీకృష్ణుండు ధౌమ్యధర్మజ భీమసేనులకు వందనం బాచరించి, తన్ను బహుకాలంబు గదియక యెడఁబాసియున్న యర్జునుం గౌఁగిలించుకొని తనకు మ్రొక్కిన కవల నాశీర్వదించి ద్రౌపది సుచితంపుమాటల నోదార్చె. సత్యభామయు ద్రౌపదిని నాలింగనాదిక్రియల బాగుగ నెఱపె. ధర్మజుండును దన్నుఁ జూడవచ్చిన దేవకీనందనునకుఁ గాలోచితాతిథిసత్కారంబుల గావించి యా మహనీయునిచుట్టును దమ్ములతో సుఖాసీనుం డయ్యె. శ్రీకృష్ణుండు నర్జునుం జేరంజని యాతనితోఁ గొంత సల్లాపంపుమాటలాడి వారి నందఱు గనుంగొని ధర్మజుతో నిట్లనియె. రాజేంద్రా! నీకు రాజ్యలాభంబుకంటె ధర్మం బెక్కుడు. దానంజేసి సత్యార్జవాది సద్గుణసమన్వితుండవై ధర్మమును దపస్సును నాచరించుచు రాజోచిత ధర్మమును వీడక గ్రామ్యధర్మముల నాచరింపక ప్రవర్తించుచున్నావు. కాన నీకు ధర్మరాజను నామంబు సార్థకం బయ్యె. నాఁడా సభలో నాపాపాత్ములు ద్రౌపదిం బఱచినపాట్లను జూచుచుంట నీకె చెల్లెఁ గాని యితరుల కలవియె? నీ ప్రతిజ్ఞాకాలంబు పూర్తియగుచుండఁ గనె యాపాపాత్ముల నంతకపురంబునకుఁ బంపుటకు మే మందఱము నీకుఁ దోడై రాఁగలము. యాదవు లందఱును, వార్ష్ణేయ, భోజ, కుకురాంధకాదు లెల్లరును నీయాజ్ఞను దప్పక దలఁ దాల్చువారలు. సర్వసంపదలతోఁ దులఁదూగుచు ధరణీరాజ్యం బేలెదవు. ఇది నిక్కవంబు. మీయదృష్టంబున నిప్పాండవమధ్యముండు దేవలోకంబున కేఁగి దేవతలవలన దివ్యాస్త్రంబులం గొని ధన్యుండై మీతోఁ జేరి యున్నవాఁడు. మీ కేకొఱంతయును లేదు. ఓ ద్రుపదరాజతనయా! నీకుమారులు నావీట యదుకుమారులతో నేనుంగుల నెక్కుచు, నశ్వారోహణంబులఁ గావించుచు మిక్కిలి వినోదంబులతోఁ జరింపుచునున్నవారు. వారికిఁ బాంచాలురమధ్య నుండుట కన్న యాదవులమధ్య నుండుట ప్రియముగా నున్నది. నీకంటెను, గుంతీదేవికంటెను సుభద్ర వారిని మిక్కిలి దయం జూచుచున్నయది. ప్రద్యుమ్నుండు వారల

కస్త్రాచార్యుండు. అభిమన్యుంఁడు వారికి నీత్యుపదేశకుండు. దుర్యోధ నాదులకుఁ జేటుకాలంబు సమీపించె. శీఘ్రంబ మీకు శుభంబు లయ్యెడి. అనఁగా దేవకీనందనునకుఁ గుంతీనందనుం డగు నయ్యుధిష్ఠి రుండు కేలు మోడ్చి వినయంబుతో నిట్లనియె. మహాత్మా! నీవు మాకు శరణంబవు. అరణ్యావాసకాలము ముగింపునకు వచ్చె. నీకృప కలు గుటంజేసి యజ్ఞాతవాసంబు సలుపన వలయు. అనంతరము నీ యిచ్ఛ వచ్చినచొప్పున మ మ్మాజ్ఞాపింపుము. మేము నీభక్తులము. నీకు బంధు వులము, సేవకులము. నీవు పట్టినకార్యమునకు వేఱు పోఁగునే?

## మార్కండేయుండు పాండవులయొద్దకు వచ్చుట

అని యిట్లు వారు భగవంతునితో నిష్టాగోష్ఠి నుండఁగా నచ్చోటి కప్పుడు బహుకాలజీవియుఁ, దపస్స్వాధ్యాయసంపన్నుండును, నిరువదేండ్లప్రాయంపువాఁడువోలె నుండువాఁడును నగు మార్కం డేయుండు వచ్చుటయుఁ, బాండవులును, వాసుదేవుండును, నచ్చోట నున్న విప్రు లందఱును దిగ్గన లేచి మార్కండేయున కెదురువోయి యాతని నర్ఘ్యపాద్యాదిసత్కారంబులం దనిపి యుచితంబు లొనరిం చిరి. సత్యాద్రౌపదు లాతనిఁ బాదంబులకు మ్రొక్కిరి. అంత మార్కం డేయుం డాసన్నుం డగుడు పాండవులయు నచ్చోనున్నవిప్రవరులయు ననుమతంబున వాసుదేవుంఁడు మునినాథు నుద్దేశించి 'మహాత్మా! ఈ విప్రవరులును, బాండవులును, సత్యాద్రౌపదులును నీవలనఁ బూర్వు లగు రాజులచరిత్రంబులును, బ్రాహ్మణమాహాత్మ్యంబును, బతివ్రతా మహిమయు, సర్వధర్మములను వినఁగోరియున్నవారు. కరుణించి వీరల నీవాగమృతధారల నానందించునట్లు చేయవే' యనుచుండఁగా నప్పు డచ్చోటికిఁ దెల్లనిశరీరంబుతోను, బుజమునఁ దాల్చిన వీణెతోను దేవర్షియగు నారదుండు కృష్ణాయనిగీతమును బాడుచు నేఁగుదెంచె. అంత మార్కండేయుండు పాండవులకు ధర్మముల బోధించుటకు యత్నించుచుండ దాని నారసి వారి నభినందించి యథేచ్ఛం జనియె. అంత మార్కండేయుండు మీరు గోరినవృత్తాంతంబు సవిస్తరముగా నుడువుటకు విశేషకాలంబు పట్టు. అయినను సావధానులరై యాల కింపుడు. చెప్పవలసినదంతయుఁ జెప్పెదను. అనఁగా నందఱును మధ్యంది

నంబున వెలుంగు భానునివిధంబునఁ దేజోవంతుఁడై వెలుఁగుచున్న యా మునిచంద్రుని దెసఁ జూడ్కులు నిల్పి తదేకధ్యానపరాయణులై యుండిరి. పదంపడి ధర్మరాజు కథాప్రచారమునకుఁ దొలుతఁ గావింపవలసిన విధానంబుగా నొకప్రశ్న మార్కండేయు నడిగెను. అయ్యా! మాకుఁ దెలిసినంతవఱకును ధర్మమార్గంబుల వీడక ధర్మప్రవర్తకులుగనే యుండు మే మిట్టిదుఃఖములం గుడుచుచుండుటయు, సదా యధర్మపరులును దుర్నీతిమార్గయాయులు నగు దుర్యోధనాదులు సుఖులై వర్తిల్లుచుండుటయుం జూడఁగా జీవుండు శుభాశుభకర్మఫలముల నీలోకంబున ననుభవించునో? పరలోకంబున ననుభవించునో? రెండు లోకంబులయందును ననుభవించునో? ఎచ్చటను ననుభవింపఁడో? యని సంశయమయ్యెడి. కర్మఫలముల కెల్ల జీవుండు కర్త యగును. ఈశ్వరుండు కర్తగాఁడు. కావునఁ గర్మఫలంబుల జీవుఁ డనుభవింపక తీరునా? ఇవి యెల్ల వివరింపవలయు ననఁగా నారాజచంద్రున కమ్మునిచంద్రుం డిట్లనియె. ధర్మపుత్త్రా! నీప్రశ్నంబు సముచితంబు. నీ కంతయుఁ దెలిసినను లోకప్రచారముకొఱకు నడిగితివి. దాని కుచితరీతి నుత్తరం బొసంగెద. ఆలకింపుము. పూర్వము ప్రజాపతి మొదటికల్పమునందు ధర్మప్రధానులగు శుద్ధశరీరులను సృజించెను. వా రమోఘసంకల్పులు, సువ్రతులు, సత్యవాక్కులు, తమంతటఁ దాము తిరుగుచుండువారు. జీవనమునకొకరిపై నాధారపడువారు కారు వారు నిరుపద్రవులు, శమదమాదిగుణసమేతులు, రాగద్వేషాదిదుర్గుణరహితులు, సహస్రపుత్త్రులు, సహస్రాయుషులు. వీరు సర్వార్థసిద్ధులం బడయుచుఁ ద్రిలోకసంచారులై దేవర్షులకు సమానులై వారిని దర్శించుచుండిరి. అంతఁ గొంతకాలంబునకు వారు కామక్రోధలోభమోహపూరితులై వంచనాకృత్యంబులు జీవనోపాయంబులుగఁ గడపుచు, సంకల్పితకార్యములు పూర్వమునవలె ఫలింపమి మోఘయత్నులై, రోగపీడితులై యల్పాయుష్మంతులై ఘోరకార్యముల నుద్యమించుచు, నుద్యమించినవి ఫలింపమి దరిద్రులై, నాస్తికులై, యొకరి నొకరు మెచ్చక పాపాచారులై దేహంబుల వీడి తిర్యగ్యోనులయందుఁ బుట్టుచు నరకకూపంబులం బడుచుఁ బాపంబులనుభవించుకొఱకు భూలోకంబున నిట్లు జననమరణరూపసంసారచక్రబునఁ దిరుగు కీటకంబులు వోలె నైరి. దేహులు దేహాంతరంబుఁ బొందు

నెడ వారికర్మంబులు వారి వెంట నంటు. అవి వారిని వదలవు. వారిలో నుత్తములు తపస్స్వాధ్యాయనిరతులై సత్కర్మాచరణపరాయణులై చిత్తశుద్ధిం బొంది యాత్మజ్ఞానంబు వడసి, సత్యవాదులు, గురుశుశ్రూషా పరాయణులు, జితేంద్రియులు, స్వాధీనచిత్తులునై శీలంబునం జేసి నీరోగులును, నిరుపద్రవులును నై నిర్మలజ్ఞానతేజస్సునం జేసి పరబ్రహ్మనిష్ఠులై యుత్తమలోకమును బొందెదరు. ఇంక నొకవిశేషంబు గలదు. కొంద ఱీలోకమున మే లొందుదురు. కొందఱు పరలోకంబునను, గొంద ఱుభయలోకంబులను మే లొందుదురు. కొంద ఱేలోకమునను మే లొందరు. ఎట్లనఁగా వినుము. పూర్వకృతపుణ్యంబునఁ గొంద ఱీలోకంబున నధికధనసమృద్ధి నొందుదురు దానం జేసి వా రెడ తెఱపి లేక గంధమాల్యాదులచే నలంకృతులయి, మైపూఁత నెత్తావి వెలయించుచు వనితాసంగతంబున వర్తించుదురు. వారి కీలోకంబు సుఖంబై కానంబడు. కొందఱు తపస్స్వాధ్యాయనిరతోపవాసంబుల శరీరమును శుష్కింపఁ జేయుచు, శీతాతపంబుల దేహమును వడఁబెట్టి, హింసారహితులును, జితేంద్రియులును నై వర్తించుచు, నీలోకంబునఁ గష్టంబును బరలోకంబున సుఖంబును బొందుదురు. ధనమును ధర్మమున నార్జించి యాధనంబుచే నిల్లాలిం దెచ్చికొని సంతతిని బొంది యాగాదిసత్క్రియలం జేసి యెప్పుడును విధ్యుక్తకర్మపరులై వర్తించుగృహస్థులకు నుభయలోకంబులయందును మేలగు. కొంచె మేనియు విద్య నార్జింపక, తపోదానములు సలుపక, శరీరసౌఖ్యము నొందక వ్యర్థజీవనులై హింసాదిదుర్గుణంబులం దవిలి దుర్జనులై వర్తించువారికి నుభయలోకంబులయందును మేలు లేదు. ఇది మనుష్యులకర్మగతివిధంబు. మీ రతిబలపరాక్రమవంతులరు. బహువిద్యల నేర్చినవారలు. దేవహితం బాచరింప నీలోకమునఁ బుట్టినవారలు. మీ రుత్తమకర్మంబులచే దేవపితరుల నర్చించి పుణ్యము నొంది మీవచ్చిన కార్యమైనవెంటనే నాకలోకంబున కేఁగెదరు. ఇది యంతయు యథార్థంబు. ఇన్నికష్టములపాలైతిమి గదా యని చిన్నవోకుఁడు. అని తెలియఁజెప్పఁగా విని ధర్మజుం డూవడిల్లి మునీంద్రా! బ్రాహ్మణప్రభావంబు వివరింపవే యను నారాజునకు మార్కండేయుం డిట్లనియె.

మార్కండేయుండు ధర్మజునకు బ్రాహ్మణప్రభావంబుఁ జెప్పుట

ధర్మజా! పూర్వకాలమునందు హైహయవంశజాతుం డైన యొక్క బాలుండు వేటకుం బోయి యొకకాననంబున మృగచర్మధారి యైన యొకమునికుమారుని మృగముగ నెంచి వానిని దూరంబున నుండి పొంచి బాణమునఁ గొట్టుడు, నమ్మునికుమారుం డాయేటునకు మడిసె. అంత నాబాలుం డేటువడి మృగంబు సచ్చె నని యటఁ బోయి చూచుడు, నయ్యది మునికుమారుశవంబు కాఁగా వాఁడు వడివడిఁ దన యూరికిం బోయి తనపెద్దలకు నక్కథ యంతయు నెఱుంగఁ జెప్పె. అంత వా రందఱు పశ్చాత్తాపంబునఁ బొగులుచున్న యబ్బాలకుం దోడ్కొని యా మునికుమారుశవంబును నెమకుచు నరణ్యంబునకు రాఁగా వారి యందుఁ దార్క్ష్యముని యాశ్రమంబు కానవచ్చె. అంతవా రందుఁ జొచ్చిరి. అంత నాతార్క్ష్యుండు వారిని సకలోపచారంబులతో నర్చింప రాఁగా వారు వానిసత్కారంబు గ్రహింప నొల్లక 'అయ్యా! మా కుమారుండు విప్రు వధించె. దానం జేసి మేము సత్కారార్హులము గా' మనిరి. అంత నాతార్క్ష్యుం డింపులకు వగవ నేల? నాతపోబలంబుఁ జూడుఁడు. ఆర్యులారా, మీచేఁ జంపఁబడిన యావిప్రశవం బెచ్చోటఁ బడి యున్నది? అని యడుగఁగా, వా రంతయును జెప్పిరి. దాని నంతయు విని, మీచేఁ జంపఁబడిన బాలుండు వీఁడేనా? యని తనకుమారుం జూపె. అంత నా హైహయకుమారుం డానవాలుపట్టి, యితండ యన హైహయు లాశ్చర్యపడి, మునీంద్రా! ఈబాలుం డెట్లు ప్రాణంబుల నొందె. ఇది మిక్కిలి యాశ్చర్యకరంబు. ఇది మీ తపోమహిమమున నైన యద్భుతకార్యం బేని మేము వినవలతుము. అనఁ దార్క్ష్యుండు వారి కిట్లనె. రాజపుత్రులారా, మే మెపుడును సత్యవాక్కులము. రాగద్వేషములు మ మ్మంటవు. చెడునడకల నడువము. అన్నదానముచే నతిథులను, భృతిదానమున భృత్యులను నుపచరించి భుక్తశేషమైన విఘసాన్నము నారగింతుము. పుణ్యతీర్థముల సేవింపుదుము. పుణ్యాశ్రమంబుల విడియుదుము. మదమాత్సర్యములను వదలి, శమాదిసద్గుణములతో విరాజిల్లుదుము. కావున మృత్యువు మావంక తల సూపదు. మీవలన బ్రహ్మహత్య గాదయ్యె. జడియకుఁడు. మీ యునికిపట్ల కేఁగుఁ డని పంపఁగా వారు తార్క్ష్యుండు గావిం

చిన యాతిథ్యంబు గ్రహించి తదాజ్ఞచే నిజపురంబున కేఁగి సంతుష్ట స్వాంతులయి యుండిరి. ధర్మపుత్రా! ఇంకను బ్రాహ్మణమహిమంబు సెప్పెద విను మని యిట్లు చెప్పందొడంగె.

## అత్రిగౌతములసంవాదప్రకారము

పూర్వకాలమునం దత్రి యనువిప్రుం డొకం డుండె. ఆతండు ధర్మమార్గము ననుష్ఠింపం దపోవనంబునకుం బోవ యత్నించి యాతని భార్యం బిలిచి దానితోను బుత్త్రులతోను దనయుద్యమంబుం జెప్పెను. అంత నాతనిభార్య ద్రవ్యము సంపాదించి తెచ్చి తగురీతిం బుత్త్రులకును, భృత్యులకును బంచి యిచ్చి యావల నీయిచ్చవమెయి నరుగుము. ధన సంపాదన కుపాయం బెట్లందు వేని, వైన్యనృపాలుండు యజ్ఞంబాచ రించుచున్న వాఁడు. ఆయజ్ఞంబున కేఁగి యారాజును యాచించి ధనము తెమ్ము. ఆతండు నీవు కోరినంతధన మొసంగు. ననఁగా నత్రి భార్యను జూచి యోశుభాంగీ! వైన్యుండు యాగదీక్షితుండై యున్నవాఁ డని నే నెఱుంగుదు. నే నచ్చోటికి ధనార్థినై యేఁగుచో నచ్చట నుండు నాశత్రువులు నాప్రయోజనమును వ్యర్థపఱుప యత్నింతురని శంకించెద. వినం గా నిమ్ము. పోయివచ్చెద నని వైన్యయజ్ఞాయతనంబున కత్రి పోయి యామహారాజుఁ గాంచి, నృపాలా! నీవు మహానీయుండవు. రాజులలో నగ్రగణ్యుండవు, ధన్యుండవు, ఈశ్వరుండవు. అని ముసు లందఱు ని న్నిట్లు నుతింతురు. నీకంటె ధర్మము నెఱింగినరాజు వేఱొకండు లేఁడని పొగడఁగా గౌతముం డను మునివరుం డాయాగాయతనమున నుండి రాజును నట్లు స్తుతివాక్యములచే నుతించినయత్రి కలిగి 'అత్రీ! యిట్లు పలుకరాదు. రాజులలో నగ్రగణ్యుం డింద్రుండు గాని వైన్యుండు గాఁడు. తెలివిమాలి కాఁబోలు నీ విట్లు పలికితి' వనఁగా నత్రి యింద్రుం డువోలె నితండు విధాతయే యని బుద్ధిసమాధానంబునఁ బలికెద. మోహమలమఁగ నీకు బుద్ధి కొఱంతవడియె. అని మాఱు పలికె. ఆమా టలు విని గౌతముం డత్రిని, నీవే మోహావిష్టుండవు. నేను నీదు చరి తంబు సర్వంబు నెఱుంగుదు. రాజదర్శనంబుం గోరి ప్రలాపము లాడె దవు. శ్రేష్ఠ మగు ధర్మముయొక్క ప్రయోజనము నెఱుంగవైతివి. పెద్ద వాఁడవైతివి. కాని, జ్ఞానరహితుఁడవై యున్నా వని పల్కుచుండ వార

లిపురసంవాదంబు విని యచ్చట నుండు విప్రవర్యులు నీ వేల యిట్లు వాదులాడెదరు ; ఏకార్యార్థంబున నీవాదు వొడమె నని కాశ్యపుం డనుమునివర్యుండు గౌతమాత్రుల నడుగ గౌతముం డిట్లనియె. సభాసదులైన విప్రవర్యులారా! వినుఁడు. వైన్యనృపాలుఁడు విధాత యట్ల, నేను గాదనెద. మీ రీవివాదమును లెస్సగ వారసి మీకుఁ దోఁచిన భంగి నిర్ణయింపుఁ డనఁగాఁ గాశ్యపుఁడు మునులారా, ఈవివాదమును దీర్ప మే మసమర్థులము. సనత్కుమారుండు నేర్చు ననియె. అంత నావిప్రులందఱును నామాటలయొప్పిదమున కలరి యందఱును నాపురాణముని పాలి కేఁగి వివాద ప్రకారం బంతయు నెఱింగించిరి. అప్పుడు సనత్కుమారుండు వారి కిట్లనియె. విప్రులును రాజులును గూడి రేని యగ్నివాయువులు గూడి కాననంబును దహించినట్లు వారు శత్రువుల భంజింతురు. రాజనంగ సామాన్యుండు గాఁడు. ఆతండే న్యాయమూర్తి, ధర్మస్వరూపుండు, ప్రజాపతి, మహేంద్రుండు, విధాత, గురుండు, శుక్రుఁడు విరాట్టు, సమ్రాట్టు, స్వర్ణేత్రుఁడు, సహాజిత్తు, బభ్రువు, సత్త్వయోని, పురావిత్తు, సత్యధర్మ ప్రవర్తకుఁ డనునామంబులఁ బిలువఁబడును. అట్టి వానిం బూజింపనివాఁ డుండునా? ఋషు లధర్మమునకు భీతిల్లి బలమును క్షత్రంబున నిడిరి. ఆకారణంబువలన రాజు దేవతలలో భానుంబోలి మనుష్యులలోఁ దేజస్వియై విరాజిల్లు. శాస్త్రములను బరిశీలింపఁగా రాజు మనుష్యులలోఁ బ్రధానుండని తెలియు. అని పలుక, సనత్కుమారువచనంబు లాలించి వైన్యుం డానందభరితుఁడై యత్రిం బిలిచి 'మునీంద్రా! నన్ను మనుష్యులలో నుత్తముం డని వచించితివి. ఇంద్రసమానుం డంటివి. నీయెడం బరమప్రీతుండ నైతి' నని చెప్పి వివిధము లగు ధనంబులను, నుత్తమదాసీజనంబు లనేకములను, బదికోట్ల గద్యాణంబులను, బదిబారువులు బంగారు నొసంగె. అత్రియు వాని నెల్లఁ బ్రతిగ్రహించి తనయున్న యాశ్రమంబున కరుదెంచి, పుత్త్రులం బిలిచి తా నార్జించి తెచ్చినధనంబు వారికిఁ బంచియిచ్చి భార్యం బ్రీతం జేసి తపోవనంబున కరిగె. అని ధర్మపుత్త్రునకు మార్కండేయుం డత్రిగౌతముల సంవాదమును, సనత్కుమారుని తీర్పును, నత్రి ధన మార్జించి తెచ్చి పుత్త్రుల కొసంగి తపోవనంబున కేఁగుటయుం జెప్పి వెండియు సరస్వతీతార్క్ష్యసంవాదం బను నీతి వాసంబుకాలమున ధర్మరహస్యం బెఱుంగఁ జెప్పె.

## సరస్వతీ తార్క్ష్య సంవాదము

ఓకురంతపుఁడా ! యుధిష్ఠిరుఁడా ! పూర్వము తార్క్ష్యుండు సర స్వతి నుపాసించి యాదేవి ప్రత్యక్షంబు కాఁగా నాపరమేశ్వరిం జూచి యిట్లనెను. ఓశుభాంగీ ? పురుషున కెయ్యది శ్రేయంబు ? దేని నాచరిం చుచో స్వధర్మమును పురుషుఁడు వీడకుండు ? అగ్నియం దేవిధ ముగ హోమంబు సేయవలయు ? ఏకాలమున నగ్నిం బూజింపవలయు ? అగ్నిహోత్రమునకు సంబంధించిన చరిత్ర నంతయుఁ జెప్పుము. ఈత త్త్వమునంతయు యథార్థముగా నీవలనఁ దెలిసికొని స్వధర్మము మేరకు విధ్యుక్తధర్మముల నాచరించి యుత్తమలోకములఁ బడయఁ గోరు చున్నాఁడ. నావేడికోలు నంగీకరించి యోకల్యాణీ! నాసంశయ విచ్ఛే దంబు గావింపు మనఁగా భారతి సుప్రీతయై యతని కిట్లనియె. వేదా ధ్యయనంబు గావించి, తపస్సు చేసి, శౌచపవ్రతమున బ్రహ్మమును బొంది పురుషుండు నాకలోకమునకుఁ బోయి దేవతలతోఁ జెలిమి నాచ రించి బంగారు తామరపువ్వులతోను, నిర్మలోదకములతోను రమణీ యములైన కొలంకుల కెలఁకుల నప్సరసలతోను ముచ్చటలాడుచుండు. మేలైనదూడయుఁ జాలినంతపాలుంగల తొలిచూలియావు నుత్తమ బ్రాహ్మణునకు దాన మొనర్చిన పుణ్యాత్ముండు తనకులమునఁ దనకు ముం దటివారి నేడ్గుర నుద్ధరించును. ఆధేనువు దేహమున నెన్ని రోమము లుండు నన్నివత్సరంబులు వాఁడు నాకలోకమున సుఖంబు లనుభ వించు. కపిలగోవును జక్కని సొమ్ములతో నలంకరించి విప్రునకు దాన మొనర్చినవాఁడు సమస్తవాంఛలను బొందును. బరువెంతయైన మోయంజాలిన వృషభమును దాన మొనర్చినవాఁడు పదియావుల నొసఁగినవానిసుకృతంబు నొందు. తిలధేనువును బంగారునగలతో నలంకరించి దానమిచ్చిన పుణ్యాత్ముండు వసువు లుండులోకమున కేఁగును. కటికిచీకటితో వెలయుచుండు నరకమునఁ బడు మహాపాపా త్ముని గోదానం బుద్ధరించు. బంగారముసు దాన మొసంగినసుకృతి సశరీరస్వర్గముం జెంది, సూర్యలోకమున వసించు. వస్త్రదానంబుఁ జేసినపురుషుండు చంద్రలోకమున కేఁగు. సత్పాత్రుఁ డగుబ్రాహ్మణునకుఁ గన్యాదానంబును భూదానమును జేసినమహనీయుం డింద్రలోకమున కేఁగు. పెదునేక యేడేండ్లగ్నిహోత్రమును నియతిమై నాచరించిన సదా

చారసంపన్నుండు తనపూర్వుల నేడ్గురను వెనుకటివారి నేడ్గురను సుకృతులం గావించి యుద్ధరించు. శుచిత్వము లేనివాఁడు, కాలు సేతులం గడుగనివాఁడు, వేదములు చదువనివాఁడు, విద్వాంసుఁడు కానివాఁడు నగ్నియందు వేల్చుట కనర్హులు. దేవతల నారాధించునిమి త్తమయి శ్రోత్రియుం గానివానిని నియోజింపరాదు. అట్లు చేసిన నాక ర్మము వ్యర్థమగును. కావున లెస్సగఁ బరీక్షించి యగ్నిహోత్రముకై సద్బ్రాహ్మణుని నియోజింపవలయు. శ్రద్ధ లేనివాఁ డగ్నియందు వేల్చు హవిస్సులను నిర్జరులు గ్రహింపరు. అంతేకాక దేవతలు సదా శుచి త్వము నే యరయుచుందురు. శ్రద్ధతోఁ గర్మములు సేయువారును, సత్య వ్రతాచరణపరాయణులును నగ్నియందు వేల్వఁగా మిగిలినదానిని భుజించుమహనీయులును గోలోకమునకుఁ బోయి యచ్చటఁ బుణ్యవాస నచే నుత్తమపదం బైనమోక్షమును బ్రాపింతు రనఁగాఁ దార్క్ష్యం డిట్ల నియె లోకజననీ! నీదర్శనంబున సకలజనులును కర్మములందుఁ బ్రేరితు లగుదు రని తోఁచుచున్నది. ఆదిలక్ష్మీదేవింబోలె మిక్కిలి తేజోవంతురా లవై దివ్యరూపముతో వెలుఁగుచున్నదానవు. ఓలోకపావనీ! నీయ థార్థంబు నా కెఱింగింపుము. అన్న తార్క్ష్యునకు సరస్వతి యిట్లనియె. యజ్ఞములయం దారాధనమునిమిత్తమై సంపాదింపఁబడు శ్రేష్ఠపదార్థ ములవలన నేను వృద్ధిఁ బొందుదు. నాయునికిపట్టగ్నిహోత్రము. విప్రు లకు సదా సంశయవిచ్ఛేదంబు గావింతు. ప్రస్తావవశంబున నీతో నే నింత యాడితి. యజ్ఞమున కుపయోగించు సర్వద్రవ్యములయందును నే నుందును. అనఁగాఁ దార్క్ష్యుండు సరస్వతి నుద్దేశించి యోపరమే శ్వరీ! తాపసు లెయ్యది మేలని తలంతురో! ఎద్ది దుఃఖరహితమైన మోక్షమార్గమో! సాంఖ్యయోగమార్గముల నెట్టి పరమపురుషుం బొందుదురో! తత్ప్రకారం బంతయు నా కనుగ్రహింపు మనఁగా భారతి యి ట్లనియె. వేదములఁ బఠించుచు సతతము తపస్వియై పుణ్య వ్రతముల నాచరించుచు, సర్వసంగపరిత్యాగియై, రాగద్వేషవిరహితుఁ డైన ముక్తపురుషుఁడు బ్రహ్మనిష్ఠుఁడై 'సర్వం వాసుదేవమయ" మని ధ్యానించుచుఁ బరబ్రహ్మమును జెందు. అపరబ్రహ్మమధ్యమందు వేయి కొమ్మలఁగూడి విశాల మయినపుణ్యగంధము గలవేదవృక్షంబు వెలయు చుండు. ఆవేదవృక్షముమూలమునుండి మిగులఁ బావనంబులగు

తేనెవంటి సెలయేళ్లు పాఱుచుండును. దానియొక్కొక్కకొమ్మయం దును నిసుకతిన్నెలతోఁ గూడిన గొప్పనదులు బూరుగు లనెడిభక్ష్య ములును, నంజు ళ్లనెడిశాకంబులును, సంతతంబులగు పాయసములనెడి బురదలును గలిగి పాఱుచున్నవి. ఏవృక్షంబున నింద్రాగ్నిప్రభృతు లగువేల్పులు మేటియాగంబుల నొనర్చిరో, యయ్యది నాపరమపదము. అని సరస్వతి బోధింపఁగా దార్క్ష్యుం డమ్మహాదేవికి నమస్కరించి కృతార్థుం డయ్యె. అని చెప్పఁగా యుధిష్ఠిరుండు మార్కండేయునిఁ దనకు వైవస్వతమనువృత్తాంతంబును వివరించి చెప్పు మని వేఁడఁగా మార్కండేయుం డి ట్లనియె.

## వైవస్వతమనుచరిత్రంబు

ధర్మనందనా! భానుపుత్త్రుఁడగు వైవస్వతమనువు పూర్వకా లమునందుఁ బ్రసిద్ధుఁడై వెలయుచుండె. ఆతనిమహత్త్వంబు చెప్ప నలవికాదు. అతఁడు తేజస్సంపద మిక్కిలిగాఁ గలిగియుండు. ఆతఁడు తేజశ్శాలి, తపస్వియునై తండ్రితాతలకంటె వాసి కెక్కియుండె. ఆతం డిట్లు మహత్త్వంబుపెంపునఁ గీర్తిశాలియై యుండొకకాలమున బదరి కారణ్యమున కేఁగి గంగాతీరంబునఁ గొంతకాల మూర్ధ్వబాహుండయి యొంటికాలిపై నిలిచియు, మౌనియై, కనుతెప్పల వాల్పకయు జడలం దాల్చి బహువత్సరములు ఘోరతపం బాచరించె. అట్లుండ నచ్చోట మీ నొక్కటి యాతనిని సమీపించి యిట్లనియె "ఓతపోధనుఁడా! మీనంబు లలో గొప్పవి చిన్నవాని భక్షించు. నేను గొండికను. ఏదైన నొక్కగొప్ప మీనమువాతఁ బడుదునేమో యని వెఱతు. వన్యోకజలాశయంబునకుఁ గొనిపోయి వదలిపుణ్యంబునం బొమ్ము. నీకు నావలననైనఁ బ్రత్యుపకారము వైళంబచేయుదు" నని చెప్పఁగా విని సహజకరుణార్ద్రహృదయుండు గాన వైవస్వతుం డమ్మీను నొక్కపెద్దకాఁగునం జేర్చి దానిని గన్న బిడ్డ నారయువిధంబునఁ జూచి దానియోగక్షేమంబుల వాత్సల్యముతో నరయుచుండె. అదియును నాకాఁగున నుండి కొంతకాలమునకు వృద్ధి నొంది తనశరీరము నందు మెదలించుటకుఁ దావు లేక వైవస్వతుం జూచి మహాత్మా! నా కిందు మెదలఁ జోటు లేదు. నన్ను మఱియొక చోటుం జేర్పు మనఁగా నాసూర్యసూనుం డవ్వల్లె యని దానిని రెండు యోజనములనిడివియు నొక యోజనము వెడల్పునుం గల యొక్క

సరస్సునం జేర్చె. ఆమీన నాసరస్సున బహువత్సరంబులు వసించి యంత
కంతకుఁ బెద్దదై యందును దనకుఁ గదల మెదలఁ జోటు చాలకుండఁగాఁ
దన్నరయవచ్చిన మనువుం గాంచి, యోదయామయా! నేను గ్రమమున
బెరిగి పెద్దమత్స్యమ నైతి. ఈసరస్సున నాకు మెదలఁ జోటే చాలదు.
నన్ను గంగానదిం జేర్పుము. ఇయ్యది నాకోరిక. నీయభిమతం బెట్టిదోఁ
నీవలనఁ బెరిఁగినవాఁడ నగుటంజేసి యీసు వదలి నీమాట వినవలసిన
వాఁడనై యున్నాను. అని చెప్పఁగా నామనువు దానియందుఁ బుత్త్ర
వాత్సల్యంబునం జేసి దానియప్పటిదేహంబు మెదలుట కిరవగునది
యమ్మహానదిగా నెఱింగి, యామీనంబు నాసరస్సునందుండి మోచికొని
పోయి గంగానదిం జేర్చె! ఆమత్స్యంబు కొంతకాలమున కమ్మహానది
యందుండి మితి మీఱి పెరిఁగి తా నుండుటకుఁ దగిన లోఁతు లేని
యానదియందుండి వేఱొకస్థలమునకుఁ బోవ వాంఛ వొడమ మరల
వైవస్వతు నుద్దేశించి యిట్లనియె. ఓకరుణాసముద్రుఁడా! నా కీమహా
నదియందు నైత మవకాశంబు చాలక యున్నయది. నన్ను సాగర
ముం జేర్పు మనఁగా నాభానుసుతుండు మెల్లగా నామహామీనంబును
సాగరముం జేర్చె. దానిమహాకాయంబు వీక్షించుటకు పర్వతాకా
రంబై యుండియు నాతపస్వి తన్నెత్తుకొనుటయు మహాకాయుం
డయ్యు, లఘుత్వము నొందునణిమాద్యైశ్వర్యయుతుండైన యోగికరణి
నతిలఘువై యుండె. అప్పు డామత్స్యంబు మనువు తన్ను సాగరంబున
దిగవిడచుటయు వానిం జూచి నవ్వుచు నిట్లనియె. అయ్యా! ఇఁక
మీఁదఁ జేయవలసిన కర్జమును జెప్పెద నాలకింపుము. అచిరకాలమున
నీప్రపంచమునకుఁ బ్రళయకాలము గలుగు. అప్పు డీచరాచరభూత
జాల మంతయు నశించు. సప్తసాగరములు నుప్పొంగు. కావున నీవు
మిక్కిలి దృఢములగు మోకులతోఁ గూడిన యొక్క యోడను నిర్మింపు
ము. అం దిప్పుడు ప్రపంచమున నున్న బీజంబుల నన్నిటినిఁ జేర్పుము. సప్త
ర్షుల నాహ్వానించి వారి నం దెక్కించుకొనుము. పిదప నన్నుఁ దలంపుము.
అప్పుడ నేను మీ కొకశృంగముతోఁ బొడసూపెదను. వెంటనే
నాశృంగమున కాయోడం దగిలించికొని మిమ్ము సాగరంబు దాఁటింతు.
నేను లేకున్న మీ రాసలిలమును దాఁటఁజాలరు అని చెప్పఁగా వైవస్వ
తుండు వల్లె యనియె. అంత నామహామీనం బదృశ్యం బయ్యె. వైవ

స్వతుండును వెంటనే తనస్థానముఁ జేరి యొకగొప్పయోడను నిర్మించి యందు మీనంబు చెప్పినచొప్పున సర్వబీజముల సేకరించి సప్తర్షుల నం దారోహింపఁజేసి సంతసంబునఁ బొదలుచుండుటయుఁ బ్రళయ చిహ్నములు పొడసూపె. లోక మంతయుఁ జీఁకట్లు గ్రమ్ముచు మేఘ ములు గ్రమ్మి ఘోరంబుగ సంతతధారలతో వర్షింప భూప్రదేశ మంత యు సాగరంబుతో సాటిగ జలమయమయ్యె. మీనంబు చెప్పినచొప్పున సప్తసాగరములు నుప్పొంగె. ఆనీట మనువు గావించిన యోడ తేలు చుండ నతఁడు మహామీనంబుఁ దలంచుడు నయ్యది సన్నిహితంబైన, ధానికొమ్మునందు దృఢమైనమోకు నొకదానిం బిట్టుగఁ దగిల్చి యా యోడను బంధించె. అట్లు నావను మనువు తన శృంగమునకుఁ గట్టఁగా, మహామత్స్యం బానావను గట్టుచేర్చెను. అంతఁ గొంతకాలము జరు గఁగా నానావ హిమవంతంబున కుత్తరపార్శ్వంబునఁ దేలుచుండఁగా మహాసలిలంబు తఱుగం జొచ్చె. అప్పుడా మత్స్యంబు నావలోనివారిం బిలిచి మీ రీనావ నీహిమవత్పర్వతశిఖరంబునఁ దిరంబుగఁ గట్టుఁ డనఁగా వా రట్లు చేసిరి. కావున హిమవంతంబుయొక్క యాశిఖర మిప్పటికిని నౌబంధనం బనుపేరితో వెలయుచున్నది. అని చెప్పి, యాజలచరం బోడలోనివారిం బిలిచి వెండియు నిట్లనియె. నే నెవరై నదియు మీకుఁ దెలియుటకై నాస్వరూపంబుఁ జెప్పెద. నేనే యీప్ర పంచమున కంతకు నాదికారణంబను. నే నీప్రపంచమునకుఁ బరుఁడను. నాకంటెఁ బరంబైన దన్యంబు లేదు. ఈమహాప్రళయంబున మీనాకా రుండనై మీభయంబుఁ దీర్చితి. ఇఁక నీవైవస్వతుండు చరాచరభూత జాలంబును సృజించువాఁడు, మహాతపస్వి కావునఁ దనతపఃప్రభావం బున నీకార్యం బెల్ల నొనర్చి కాంతిమంతుండై వెలయువాఁడు. నాయం దలియపారభక్తింజేసి యీతనికి మోహము లేకుండునట్లు ప్రసాదిం చితి. అని పలికి యామీనం బదృశ్యంబయ్యె. మాయామీనంబైన భగవంతుని వచనామృతంబుం గ్రోలి యేపెక్కి వైవస్వతుండు ప్రజా సృష్టిక్రమంబుమఱచె.మనువు తపం బొనర్చి తనతపోమహిమంబున సృష్టి క్రమం బెఱింగి పూర్వవిధంబునఁ బ్రపంచము నంతటిని స్థావరజంగమా త్మకంబగుదానిని సృజించెను. ఇక్కథ వైవస్వతోపాఖ్యాన మనఁ బడును. దీనిని వినినవారు కోరినకోర్కు లెల్లఁ బడసి నాకలోకంబును

బ్రాపింతు రని మార్కండేయుండు బోధింప నాతనికి ధర్మజుండు వెండియు నిట్లనియె.

### మార్కండేయుండు ధర్మజునకుఁ బ్రళయప్రకారంబుఁ జెప్పుట

మహాత్మా! ఈలోకంబున నీకంటె దీర్ఘాయుస్సుగలవారు బ్రహ్మ తప్ప నితరు లెవ్వరును లేరుగదా! ప్రళయకాలంబున సూర్యచంద్రాగ్ని వాయుప్రచారంబు లేకుండుఁగదా? భూమి యేకార్ణవంబై జలమధ్యమున మహాండంబై తేలుచుండఁ జేతనాచేతనపదార్థంబు లన్నియు నిశ్చేష్టితంబులై యుండునప్పు డాపరమాత్మను నీవు నీతపోవిశేషంబున సంతసింపఁజేయుటం జేసి యాతనికృపామహిమంబున నీపరమేష్ఠిని పరమాత్మనాభికమలమునందు శయానుండై యుండువాని నీకన్నులార వీక్షించితివి గాదే? అప్పుడు పరాత్పరుని యోగసమాధినిష్ఠ నారాధించితివిగాదే? ఆదేవదేవు ప్రసాదంబునఁ గదా నిన్ను జరామరణంబులు పీడింప వయ్యె? నీవు చిరంజీవివి. లోకంబులందు నీ వెఱుంగనిది యుండ నేరదు. ప్రళయకాలంబున నీజగముల ప్రకారమును వివరింప వేఁడెద. మహాత్మా! దీని నెఱుంగం జెప్పవే యని యడుగ నామునిచంద్రుం డారాజచంద్రున కిట్లనియె. ధర్మజా, స్వయంభువు పురాణపురుషుఁడును, శాశ్వతుఁడును, నవ్యయుఁడును, నవ్యక్తుఁడును, సూక్ష్మములలో సూక్ష్ముఁడును, గుణాత్ముండును, నిర్గుణుండును, సర్వమునకుఁ గర్తయును, నకర్తయును, భూతాత్ముండును, భూతకర్తయును, నచింత్యుఁడును, బవిత్రుండును, ననాదినిధనుండును, విశ్వుండును, నక్షయుండును, బీతవాసుండును, జనార్దనుండును, బరమేశ్వరుండును, వేదవేద్యుండును నైనయీకారణదేహుండు వసుదేవనందనుండై మన నడుమ లీలావిగ్రహరూపముఁ దాల్చి వెలయుచుండు. పరమపురుషుండైన శ్రీకృష్ణునకు మ్రొక్కి నీయడిగినయర్థమును వివరించెద నని యట్లు చేసి యతని కిట్లు వచింపఁదొడఁగె. కృత, త్రేతా, ద్వాపర, కలియుగంబులు నాలుగు దేవమానంబునఁ బండ్రెండువేలేండ్లపరిమితికాలము గలిగి యుండు. అందుఁ గృతయుగమునకు నాల్గువేలేండ్లపరిమితి. దానిసంధ్యాకాలపుఁబరిమితి నాల్గునూఱేండ్లును, సంధ్యాంశమును నాల్గునూఱేండ్లును గలిగియుండు. త్రేతాయుగపుఁ గాలపరిమితి మూఁడువేలేండ్లు. దానిసంధ్యాకాలపరిమితి మున్నూఱేండ్లు. సంధ్యాంశమును

మున్నూఱేండ్లయి వెలయును. ద్వాపరమునకుఁ బరిమితకాలము రెండువేలేండ్లు. దానిసంధ్యాకాలపరిమితి యిన్నూఱేండ్లు. సంధ్యాంశమును నిన్నూఱేండ్లై యుండు. కలియుగమునకు వేయేండ్లును, దాని సంధ్యాకాలము నూఱేండ్లును, సంధ్యాంశకాల మన్ని యేండ్లు నునై విలసిల్లు. ఇట్లు పండ్రెండువేలేండ్లతోఁ గూడికొనిన నాల్గుయుగయుల పరిమితకాలము మహాయుగ మనఁబడు. అట్టిమహాయుగంబులు వేయి యయిన, బ్రహ్మదేవున కొక్క పగ లగును. అది యొక్క ప్రళయకాలము. ఆకాలమునకు వేయేండ్లు పూర్వమునుండియే లోకమున నధర్మము మెండగును. జనులలో సూనృతవాక్కు లరు దగుదురు. జనులు విధ్యుక్తస్వధర్మములను వదలుదురు. వ్రతములకును యజ్ఞములకును మాఱుకర్మముల నాచరింతురు. వర్ణాశ్రమధర్మము లడుగంటు. లోకమున ధర్మపరాయణు లుండరు. అధర్మపరాయణు లెందుఁ జూచినను వ్యాపించియుందురు. వానలు కురియవు. కాటకంబులు మెండగు. స్త్రీలు భర్తల మెచ్చక స్వచ్ఛందులై యన్యపురుషులతో విహరింతురు. మోసములు పెచ్చుపెరుఁగు. పిదప ననేకవత్సరములు వాన కురియకుండు. ఆదోషంబున జంతువు లెల్ల నశించు. సూర్యుండు చండాంశువులచే వేఁడిమియెండలఁ గాచి సర్వసముద్రనదీజలంబుల నింకించు. అంత సంవర్తకాగ్ని చండవాయువుతోడం గూడి యిరువదిరెండువేల యోజనంబులు వ్యాపించి సర్వోషధులయు, వృక్షంబులయు, లతాదులయు రసంబులం బీల్చి త్రిలోకముల భస్మీభూతంబులు గావించు. అంతఁ బ్రళయకాలమేఘంబులు నీలపీతరక్తపింగళధూమ్రపాటలవర్ణంబులై యాకసంబున నలుదెసలం గ్రమ్మి చూపు గాన రానీయక యంధకారము బంధురంబు గావించు. ఇట్లామేఘంబు లతరిక్షం బెల్ల నావరించి భూమ్యాకాశమధ్యప్రదేశమునఁ బ్రతిధ్వను లెసఁగ జెవులు చిల్లులు వోవ నుఱుముచు ద్వాదశవర్షములు సంతతధారలుగా వాన గురియించి ముందు వొడమియున్న యగ్నిం జల్లార్చు. అంత సాగరంబులు చెల్లెలికట్టం దాఁటి నేల యంతయు జలమయంబై కొండలు, నదులు, మహావృక్షంబులు నన్నియును నాజలంబున మునింగియుంటం జేసి యేది యేచోట నున్నదియు వేఱుపఱచి తెలియుట యసాధ్యంబగు. అట్లున్నంత మహావాయువు వొడమి, యామేఘముల నన్నిటిని

బాలుఁడ్రోలును. పరమాత్మ పిదప నాచండమారుతంబు నడంచి యొక
కమలపత్రంబునఁ బవ్వళించియుండు. ప్రళయంబునం దెల్ల నిట్లుండు.
నేను గడచినకల్పము నంతమునం దాజలమధ్యంబున గతిఁ గానక, నిలువ
నీడలేక, పదార్థం బెద్దియుం గానక, దిగు లొంది, యానీట రేయింబవళ్
లును నీదుచు వగచుచుండ నాయెదుట నొకగొప్పమఱ్ఱిచెట్టు గన్పట్టె.
దానిని నలుదెసలం బరికించి చూడ నందొకశాఖయం దొకపర్ణము సెజ్జ
చేసికొని చంద్రవదనుండును, బుండరీకాక్షుండును, శ్రీవత్సవక్షుండు
నతసీపుష్పనీలుఁ డొకబాలుండుగ నాకు గోచరించె. నాకుఁ ద్రికాలపరి
జ్ఞానము గలిగి యున్నను, నే నాబాలు నెఱుఁగ నైతి. కావున
నామనంబున నీబాలుం డెవ్వండో? లోకము లెల్ల నశింపఁగా నీలో
కంబునఁ గానవచ్చు నమ్మహానీయుఁ బరాత్పరుం డని తెలియనేరక,
వాఁడు లక్ష్మీ కిరవగు పురుషుం డని యెంచి కొంత తడవాలోచించు
చుంటి. అప్పు డాబాలుండు కొంతసేపటికిఁ గను విచ్చి నన్నుం బిలిచి
మార్కండేయా! నీయర్ణంబునఁ గడు డస్సినట్లున్నావు. విశ్ర
మింపఁ దలఁచితేని నావదనకుహరంబునఁ బ్రవేశించి కొంతసేపు నాయుద
రంబునఁ బరుండు మని యా బాలుండు తననోరు దెఱవ, భూత
జాలంబులును, బరిచితమానవులును నశింపఁగా నేను మాత్ర మొంట
రిగా వానితోఁబాటు గతజీవుండను గాకున్కికిని, మానవదేహంబుఁ
గల్గి యుండుటకును రోయుచు, దైవయోగంబున నాబాలువదనంబుఁ
బ్రవేశించితి. ప్రవేశించుడు వానియుదరంబున బ్రహ్మాండరూపం బైన
యీచతుర్దశ భువనంబులును, సూర్యచంద్రాదులును, నక్షత్రంబులును,
గంగాదిమహానదులును, సప్తసాగరంబులును, మేరుమందరకైలాస
హిమవదాదినగంబులును, స్వస్వవర్ణాశ్రమాచార విహితకర్మముల
నాచరించుచుండు జనులను, సింహాదిక్రూరమృగసంకులంబులయిన కాఱడ
వులును, భూమిం గల సకలపదార్థములును నింద్రాగ్నియమ వరుణాది
లోకపాలురును, దేవతలును, దానవులును, యక్షులును, రాక్షసులును,
గుహ్యకులును, అప్సరోగణంబులును, సిద్ధులును, సాధ్యులును,
గరుడుండును, మహర్షివర్యులును నాయుదరంబున నుండఁ
జూచి యప్పరమాత్మయొక్క చిత్రవిచిత్రకార్యముల కానందిం
చుచు, నా పరాత్పరునియందే మనస్సు నిల్పి ధ్యానించుచు, నాయు

ధరంబున నూఱేండ్లు గడపినను దాని కంతంబు గానలేనైతి. ఆదిమధ్యాంతములు లేని యాపరమాత్మ నించుక ధ్యానింపఁగా నాబాలుండు దా నూపిరిని విడుచువేగమున నన్నుఁ దనయుదరంబున నుండి వెలువరించె. వెడలి వచ్చి పరికింప నాబాలుండు వటపత్రశాయియై, సుఖంబున నుండ వీక్షించి యత్యాశ్చర్యమగ్నుండనై యుండ నాబాలుండు నన్ను మరలఁ బిలిచి మార్కండేయా! నాగర్భంబున సుఖ ముంటివే? బడలిక వాసెనే? యన, నే నది యంతయు భగవంతునిచిద్విలాసంబుగా నెఱింగి, యరుణవర్ణంబులైన మెత్తనిప్రేళ్లతో నొప్పారుచుండు నాబాలునిపాదంబుల కెఱఁగి శిరస్సున మోడ్చిన కే లుంచి, దేవా! నీయనుగ్రహంబున నాకుఁ బూర్వస్మృతి చెడకున్నయది. నీగర్భము ప్రవేశించినవెంటనే నా కిందు సకలలోకంబులు గానఁబడియె. ఇచ్చోటఁ జూడ నీవు చిన్న పాపనిఁబోలెఁ గాన్పించెదవు. లోకముల నన్నిటిని గర్భస్థంబుఁ జేసి యిట్లుండ నేల? ఎంతకాల మీరీతిం జరింతువో? నీమాయాస్వరూపంబు దెలియ రాదు. పరమకృపాళుండవై యీసంశయమును దీర్పవే! ఓ జగన్నాథా! నాయంతరమును, నీయోగ్యతయుఁ దెలియక నిన్నడుగుచున్నాను. అనఁగా నాభక్తవత్సలుండు నాయెడ దయ దాల్చి నన్నాఅడించి, వత్సా! ఇంద్రాదిదేవతలును నామాయాప్రభావం బెఱుంగరు. ఈసమయంబున నిట్లున్న నన్ను నీవు నీతపోబలంబున నెఱింగితివి. ఎఱింగి నన్నే శరణుఁజొచ్చితివి. నీశరణాగతికి మెచ్చితి. నీపితృభక్తి నాకుఁ దెలియును. బ్రహ్మచర్యవ్రతప్రభావంబు నీ కగ్గలంబు. దానంజేసి గాదె యీ కానరాని నన్నీకాలమునందు నీవు వీక్షింపఁ గల్గితివి. ఓ మహానుభావా! వలసినవరముల వేడుము. నీయడిగినవానిని వివరించెద సావధానుండవై విను మని యిట్లనియె.

**నారాయణుండు మార్కండేయునకుఁ దనమహాత్మ్యముఁ జెప్పుట**

నారము లనఁగా నుదకంబులు; అయన మనఁగా స్థానము. ఉదకములు నాకు స్థాన మగుటచే నేను నారాయణుఁడని పిలువఁబడుదు. అట్టినేను సర్వభూతంబులను సృజించుచుఁ బాలించుచు, లయింపఁ జేయుచు, బ్రహ్మ యనియు, విష్ణు వనియు, శివుఁ డనియుఁ బేర్కొనఁ బడుచున్నాను. ఇంద్రాదిలోకపాలు రెల్లరును నాయంశమునఁ బుట్టినవారే. సంవర్తకానలంబును, సంవర్తకమారుతంబును, సంవర్తక

సూర్యుండును నేన. నాకు ముఖ మగ్ని. పాదములు భూమి. నేత్రములు సూర్యచంద్రులు. దేహము భూమ్యంతరిక్షములు. రోమములు కామ క్రోధ లోభ మోహాదులు. సముద్రాదులు నాకు వస్త్రములును బడక లును, బహుదక్షిణల నిచ్చి నే ననేకయాగముల నొనరించితి. వేదవిదు లగువిప్రులు నన్ను సంతసింపఁజేయుటకు యజ్ఞములఁ గావింతురు. స్వర్గకాంక్షులైన క్షత్రియులును వైశ్యులును మత్ప్రీతిగా నధ్వరము లను జేయుదురు. ఋగ్యజుస్సామాథర్వములను నాలుగువేదములును నాయందుఁ బుట్టినవి. తుదకు నవి నన్నే చేరును. ధాతను నేనే. విధా తను నేనే. యజ్ఞమును నేనే. నాముఖమునందు విప్రులును, నాభుజ ములయందు క్షత్రియులును, నాయూరువులయందు వైశ్యులును, నాపాదములయందు శూద్రులును బుట్టిరి. రాగాదిదోషవర్జితులై సంగము లేకుండుటను గల్మషరహితులై సత్యవాదులై యధ్యాత్మవిదులై వేదముల నెఱింగి ఫలకాంక్ష లేక, ఫలమును నా కర్పించి, యహింసా వ్రతులై, తపస్సులను, దానములను విస్తారముగఁ గావించుచుండు పుణ్యపురుషులు సదా నన్నే భజించి, నాయందుఁ బ్రీతి గలవారై యాగాదులను నాప్రీతికై కావించి మోక్షమును బడయుదురు. కామ క్రోధలోభమోహమదమాత్సర్యము లను నంతశ్శత్రువుల కోడి దుష్క ర్మముల నాచరించుకష్టాత్ములు నాయథార్థము నరయ లేక జననమరణ రూపంబైన సంసారచక్రంబునఁ దవిలి వెలువడ లేక యలయుచుందురు. పూర్వకాలమున భూమి యనేకయోజనములదూరము భారమునఁ గ్రుంగఁగా నేనే వరాహరూపమును దాల్చి దానిని నాకొమ్మున లేవ నెత్తితి. శేషుఁడనై యీవసుంధరను ధరించుచున్నాను. బడబాగ్నినై సముద్రజలములఁ ద్రావి, పిదపఁ బ్రళయకాలమున నాయుదకములను విసర్జించెదను. అజ్ఞానులు నారూపును బ్రాపింప లేరు. ధర్మమునకుఁ జేటు వాటిల్లి, యధర్మం బెల్లెడలను విస్తరించుచో, రాక్షసాదులబాధ విశి ష్టులకు విస్తారమైనప్పుడును నేను బుణ్యాత్ములవంశములలో మనుష్యుం డనై యవతరించి యంతయు నశింపఁజేసి మగల నామాయాప్రభావం బున నన్నిటిని బుట్టింతు. కృతయుగంబున శ్వేతవర్ణుండను, త్రేతాయుగం బునఁ బీతవర్ణుండను, ద్వాపరంబున రక్తవర్ణుండను, గలియందుఁ గృష్ణ వర్ణుండనై వర్తింతు. ఆశ్చర్యకరంబును వర్ణింప నలవి కానిదియు నగు

కాలచక్రమును నేన నడపింతు. ఇదినాకు విలాసంబై యుండు. నీసదా చారమునకును నీసద్వృత్తికిని మెచ్చి బ్రహ్మరూపంబున నేనే నీకు వరము నిచ్చితి. సర్వలోకులకును దాత యైన బ్రహ్మదేవుండు నాలో సగమువాఁడు. యుగసహస్రంబు నిండువఱకును శంఖచక్రగదాధరుఁడనై యోగనిద్రయందు వర్తింతు. బ్రహ్మ మేల్కొనువఱకును నిట్లు బాలరూపముతో నుండుదు. ఈప్రపంచ మంతయు సమస్తభూతజాలంబుతో నీమహాజలనిమగ్నమై యుండ నీవు దిగ్భ్రమం జెంది యలయుచుండుటను గాంచి నీకుఁ గొంతవిశ్రాంతి గలిగించు నిమిత్తము నిన్ను నాయుదరంబునం బ్రవేశింపఁజేసి నీకు యథార్థంబు తెలియుచుండఁగనే నిన్ను వెలువరించితి. నీకల్యాణంబుకొఱకు నింతఁ జేసితి. మహాతపస్వివియు నాభక్తుఁడవును నన్ను సదా ధ్యానించువాఁడవును నగుటం జేసి నీకు మహత్త్వంబు బోధించితి. బ్రహ్మ నిదుర మేలుకొనువఱకు నీ విచ్చోటనే స్వేచ్ఛతో నుండుము. అతఁడు మేల్కొని మఱల నీభూమియందుఁ బూర్వమువలెఁ జరాచరభూతజాలంబు సృజించు. సృష్టి నంతయు నానుపూర్విగఁ దెలియుము. అని నాకు బోధించి యాపరబ్రహ్మ మంతర్హితం బయ్యె. అంతఁ గొంతకాలమునకు బ్రహ్మదేవుండు మేల్కాంచి పూర్వవిధంబున సృష్టి నారంభించెను. కావున నే నీ చరాచరాత్మకం బైన సర్వభూతముల సృష్టిస్థితిలయముల మూఁటెనిం గన్నులారఁ జూచినవాఁడ. ఈచిత్రరూపముతోఁ బ్రళయకాలమున నాకు దర్శన మొసంగినపరాత్పరుండు మీకుఁ జెలియై, చుట్టమై దేవకీగర్భమునందు వసుదేవనందనుండై యవతరించి ప్రస్తుతము జగన్నాటకసూత్రధారియై యున్నవాఁడు. మీభాగ్యం బెట్టిదో! ఈతండె యాదిపురుషుండు. పరమునకంటెఁ బరమైనవాఁడు. మానుషమానసంబునకు నగోచరంబగు నానందమయుండు. ప్రపంచమునందలి యండపిండములయం దొక్కఁడయి వెలయువాఁడు. సర్వచరాచరభూతముల కేడుగడ. ఈమహానీయు నిచ్చో దర్శించుటం జేసి యీవృత్తాంతం బంతయు నాకు స్మరణకు వచ్చె. శరణన్న వారిని దన్నక రక్షించెడు నీశరణాగతవత్సలుం డగు పురుషోత్తము నారాధింపుఁడు. ధ్యానింపుఁడు. అనఁగాఁ బాండవు లేవురును ద్రౌపదీసహితులై లేచి యావసుదేవనందనుని పాదారవిందములకు వినయవినమ్

తోత్తమాంగులై మ్రొక్కి నిలువంబడంగా నప్పరమేశ్వరుండు వారి నందఱను జేరందీసి తనకడకంటిచూపులచే నాదరభావంబుం గాన్పించి యప్పటికిం దగినభంగి వారి నూరార్చె.

మార్కండేయుండు ధర్మజునకుఁ గలిధర్మంబులం జెప్పుట

పిదప ధర్మజుండు మృకండుపుత్త్రుని వీక్షించి మహాత్మా! నీ వానతీయంగా నీప్రళయకాలచర్యల నన్నింటిం దెలిసితి. కలియుగంబున ధర్మంబులు తాఱుమాఱగు నంటివి. ధర్మములు పొరలంగాం బ్రజ లెట్లు వర్తింతురు? లోకప్రవర్తనం బెట్లు జరుగును? పుణ్యాత్ముల నెవ్వ రాదరింతురు? సవిస్తరముగ నాకలికాలమహిమమును దెలియంజెప్పవే యనుటయు నమ్మునీంద్రుండు ధర్మశ్రవణాసక్తుం డగుధర్మజున కిట్లనియె. మహాత్మా! ఈభావంబులను నేం బెద్దలవలన వినియుంటి. వానిని నీకు వివరించెద. సావధానుండవై వినుము. ధర్మము కృత, త్రేతా, ద్వాపరంబులందు నాల్గు, మూండు, రెండు పాదంబులతోడను, గలియుగంబున నేకపాదంబునను వర్తించు. కృతాదియుగంబులం గ్రమంబుగా మనుజుల కాయుస్సును, వీర్యమును, దేజస్సును దఱుగుచుండు. కలియుగంబునందు ధర్మమును మనుజులు ప్రశంసార్థాదివ్యాజంబులం జేయుదురు. దానిని బరమార్థముగం జేయరు. సత్యమును వీడుదురు. కపటవర్తనులయ్యెదరు. ఆయుస్సు తఱుగుటం జేసి బహువిద్యల నేర్వరు. అల్పవిద్యాగ్రహణంబున నజ్ఞానంబు బలిష్ఠం బగు. దాన లోభంబు ప్రబలు. లోభమునం గ్రోధ ముత్పత్తి యగు. క్రోధమునం గామ మతిశయించు. కామముచే మత్సరంబు జనించు. మాత్సర్యంబున జను లొండొరుల మెచ్చక పాపాచరణమునకు వెనుదీయరు. దానం జేసి వర్ణసంకర మగు. పుణ్యదేశము లెల్లం బుళిందబర్బరయవనాదిసంకీర్ణంబులై క్రూరమృగంబు లగు సింహవ్యాఘ్రభల్లూకాదులకు వాసంబు లయి యోగిజనశూన్యంబై ఘోరాకృతిం దాల్చు. సుగంధద్రవ్యములలో గంధములు తఱుగు. రసవంతంబులగు వస్తువులు నీరసంబు లగుటం జేసి రుచిహీనంబు లగు. గోవులపాండి యత్యల్ప మగును. మేంకలయు, గొఱ్ఱెలయుం బాండి హెచ్చును. లతలయందును జెట్లయందును గుసుమములు కొలందిగాం బొటమరించు. దానం జేసి ఫలసమృద్ధి యుండ నేరదు. కాలవర్షములు గురియవు. సర్వబీజములును నోషధులును రసహీనంబు లగుటచే

బాగుగ ఫలింపవు. ఆటికధాన్యపుఁ బంట వృద్ధియగును. మనుష్యులు దుర్బలులై, పరాక్రమహీనులై, హ్రస్వదేహులై, నిస్సారులై, నిర్ధనులై, దరిద్రులై, నాస్తికులై, తెక్కలికాండ్రును, గపటజీవులును నగుదురు ఇది తగు నిది తగ దని తమలో వగవరు. సాధులకును బేదవారికిని నెగ్గాచరింతురు. పాపాచారు లగుదురు. దాఁచియుంచినధనమును, దీనులద్రవ్యమును, విధవలవిత్తమును నపహరింతురు. పురుషు లన్నవిక్రయము గావింతురు. పద్మముఖులు పణ్యయోషు లగుదురు. కన్యాదానక్రియాకలాపంబులు లేకయే తమ కిచ్చవచ్చినస్త్రీలను బురుషులు గ్రహించి వారితోఁ బొందుదురు. అతిథిసత్కారములు గృహమేధులయిండ్లయందు నడుగంటును. పరాన్నభోజులై పాపముల మూటఁగట్టుదురు. సకాలవర్షములు లేకుండుటం జేసి యేటిపాయదలల కాసించి, మహానదుల కతిప్రయాసమున నడకట్టలు కట్టి యానీటిపాయదలచే బహుప్రయాసమున నల్ప ఫలంబులను బండింతురు. దేవతారాధనలు గావించియుఁ, బితృకర్మలఁ జేసియు నప్పు డొకళ్లొకళ్లం బిలిచి కుడుపుదురు. మిత్త్రుప్రదేములందుఁ బైరిడుదురు. ఆఁబోతులను, నొకయేటిదూడలను దయమాలి గాడికి గట్టుదురు. చేతియం దున్నవస్తువును జూచుచుండఁగనే నాచికొనిపోవుదురు. వృద్ధులు జడమతు లగుదురు. వారికి బాలురు బోధకు లగుదురు. బాలురు విశేషజ్ఞాను లయ్యెదరు. భీరుఁడు శూరుఁడై వర్తిల్లు. శూరుఁడు భీరువులతో వాదులాడు. కడుఁగాటకంబులచే మంచిభూములు ఫలింపవు. జనులు సుక్షేత్రంబుల వదలి యవగోధమ ఉత్పన్న మగు మెరక భూములం జేరి యాపంటలచే జీవింపఁగోరుదురు. సహజముగ ఘోర కార్యములఁ జేయుదురు. స్వేచ్ఛగా వర్తించుచు సాహసకార్యముల ననుసరించి హింసలకు వెనుదీయక, పండిన నేలలను, ఫలవృక్షములతో నొప్పారు తోటలను జెఱుతురు. ఐహికవాంఛ మెండై, పరమార్థచింత లేక యధర్మముల కొడిగట్టుదురు. పుత్త్రులు తండ్రులం జంపుదురు. తల్లులు కన్నశిశువుల కుత్తుక నులుముదురు. ఇట్లు చంపియును బశ్చాత్తాపంబు నెంతమాత్రమును బొందరు. దుర్వాదములఁ గావించుచు ననిందితులై చరింతురు. పురుషులకు భార్యలే శత్రు లయ్యెదరు. భార్యలును బతుల మెచ్చక ప్రగల్భంబు లాడుచు, మాటకు ముం దెద్దియు

నెఱుఁగనివారువోలె నేత్తురు. కాని పురుషులమాట గీటునఁ బుచ్చుదురు. ఘోరకార్యంబుల కొడిగట్టి పతినైనను, బుత్త్రునైనను జంప నుంకింతురు. అనురాగంబునఁగాని, ద్రవ్యాశచేఁగాని స్వేచ్ఛానువర్తులై పరపురుషులం గవయుదురు. విప్రులు వృథావాదములు నొనర్చుచుఁ దపస్స్వాధ్యాయ యజ్ఞాదివ్రతాచరణముల నుజ్జగింతురు. తినఁదగినవి తినఁదగనివి యను నాలోచనము లేక యన్నింటిని భుజింతురు. జలచరంబులు భోజ్యవస్తువు లగును. జనులు వేదముల నిందింతురు. ద్రవ్యార్జనపరాయణులై విప్రులు శూద్రసేవఁ జేయుదురు. వర్తకమును జేయుదురు. గోళ్ళను బెంచుచు, జడలు దాల్చి, మునివేషధరులై ధర్మముపేర ధనమార్జించి జీవింతురు. వేదవిక్రయులు విప్రు లగుదురు. రాజులు మదించి లోభాదిదుర్గుణతత్పరులై వంశక్రమాగతంబైన రాజ్యధనవస్తువాహనంబులఁ దృప్తులుకాక పెఱవారిద్రవ్యములను విలువగల వస్తువులను బలాత్కారంబున నాచికొందురు. ప్రజలపై నన్యాయంపుఁగప్పముల విధించి వారిని బీడింతురు. సాధువులగువారిభార్యలను ద్రవ్యమును నిర్బంధించి లాగికొందురు. ప్రజలను గఠినశిక్షలపాల్సేయుదురు. వైశ్యులతికపటవ్యాపారమును జలుపుదురు. జనులధనమును మాయమాటలచే వ్యాపారంపునెపమున నపహరింతురు. శూద్రతపస్వులు మెండై గొప్పపండితులై వెలయుదురు. తమస్వల్పవిద్యాభ్యాసమున విప్రుల నవమానింతురు; సర్వజనులకు హితబోధ సలుపుదురు. విప్రులు వారిని సేవింతురు. వారియెడఁ బ్రమాణబుద్ధిని గొనియుందురు. వారు నుడువు ధర్మముల వినుచుందురు. శూద్రు లిచ్చుధనమును గొందురు. శిష్యులు గురువులఁ దిరస్కరింతురు. గురువులును శిష్యులవిషయమునఁ గపటముతో వర్తింతురు. ఆశ్రమధర్మములు క్షీణించును. అన్యాయపరులు మెండగుదురు. ధర్మాత్ములు సన్నగిల్లుదురు. దేశ మెల్లను మ్లేచ్ఛాక్రాంతమగును. మఱియుఁ గలియుగాంతమునందు శూద్రు లతిక్రోధులై విప్రులను జంపఁ జూచుదురు. వారు విప్రులచే వెట్టిసేయింతురు. విప్రుల ధనము నపహరింతురు. ఈదుర్మార్గులకు వెఱచి విప్రులు తమతమ నెలవులం బాసి కొండగుహలందును, నరణ్యమునందలిపొదరిండ్లయందును, నదీతీరమునందలి చెట్లమఱుఁగునను, గుట్టలమఱుఁగునను డాగుదురు. వర్ణాశ్రమవిభాగము చెడును. లోక మెల్ల నొకేవర్ణము గలది యగును. ప్రజలకుఁ

బదునాఱేండ్లు పరమాయు వగును. స్త్రీ లైదాఱేండ్లప్రాయపు వారు సంతతిని గాంతురు. ఏడెనిమిదేండ్ల మగవారు పిల్లలకుఁ దండ్రులగుదురు. స్త్రీపురుషు లన్యోన్యప్రీతులు గాక నిజేచ్ఛతో వర్తింతురు, పుత్త్రుల తల్లి దండ్రులకు శ్రాద్ధకార్యంబులను జేయరు. గృహస్థులు దారినడుచువారి కాయాసముఁ దీర్చుకొనుటకుఁ దమనెలవుల తావు నీయరు. ఆఁకలిగొని వచ్చినయతిథి కన్న మిడరు. దప్పిఁ గొన్నవానికి దాహముఁ బోయరు. స్నేహితులు, బంధువులు, పరిజనులు వదలఁగా వారమ్మా! నాయనా! యని దిక్కులేనివాండ్రవలెఁ బరిదేవనము సలుపుచు నానాదేశములఁ ద్రిమ్మరుదురు. నిషేధ్యము లగు మద్యపానాదులు ప్రబలును. ఆశ్రమ ములు, అగ్రహారములు, విప్రగృహములు నెమ్ములతోఁ గూడి పాడు పడును. నరమాంసాసక్తములగు పక్షు లెల్లప్పుడు నూర నూరను రచ్చ పట్లను గానంబడుచుండు. దిక్కులు బూదిరైపోవును. నక్షత్రంబులు తేజోహీనములై వెలయును. సూర్యుఁ డుదయాస్తమయసమయముల యందుఁ దలలేని యొకశరీరమధ్యమం దంతర్హితుండై కానంబడును. బీఱెండ గాయు. ఆకసంబున నుఱుములు మెఱుము లతిశయించు. ఉల్కలుపడును. పర్వము లేకయే రాహువు సూర్యచంద్రాదులఁ గప్పును. అగ్ని తీవ్రమై జ్వలించు. పక్షుల రవములు వీనులకుఁ గఠోరములై తోఁచు. ఈతీరున లోకమంతయుఁ దీరుతెన్నులు లేక విపరీతంపు నడక గలిగి, యెల్లెడల నధర్మంబు ప్రాఁకఁగాఁ బాపము విస్తరిల్లి సాధువులకును ఋషులకును నిలువ నీడ లేకపోవును. అప్పు డధర్మము నణంచుటకును ధర్మము నుద్ధరించుటకును విష్ణుదేవుండు శంబలగ్రామంబున విష్ణుయశుం డను బ్రాహ్మణునకు కల్క్యవతారియై పుట్టును. ఆదేవుండు స్మరణ మాత్రమున వాహనములు,నాయుధములు, కవచములు, శస్త్రములును బడయును. సదాచారసంపన్ను లగువిప్రులువానిని జుట్టి గొలువఁగా నతఁ డధార్మికులగువారిని, మ్లేచ్ఛులను వధించి న్యాయమార్గమున దిగ్విజయ ముం జేసి చక్రవర్తి యగును. ధర్మమును లోకమున స్థాపించును. శాస్త్రో క్తప్రకారమున నశ్వమేధయాగము నొనర్చి తా నార్జించిన జగత్తు నంతయు విప్రులకు దారవోసి తపం బాచరించునిమిత్తము వనాంతర ముల కేఁగును. పిదప మఱల వర్ణాశ్రమవిభాగములు జనులలో సక్రమ ముగ వర్తిల్లును. ధర్మము సుప్రతిష్ఠిత మగును. అప్పుడు కృతయుగము

లోకము నాక్రమించును. సూర్యచంద్రబృహస్పతులు పుష్యమాసమున నెపు డేకరాశిగతు లయ్యెదరో యయ్యది కృతయుగ మనఁబడును.అపుడు జనులు ధర్మమార్గావలంబులు ధార్మికులు నగుదురు. బ్రాహ్మణులు జపతపము లొనరింతురు. స్వాధ్యాయపరు లయ్యెదరు. యాగముల నొనర్తురు. రాజులు ధార్మికులై ప్రజల నేలుదురు. వైశ్యు లుత్తమమార్గమున వాణిజ్యము నొనర్తురు. శూద్రులు తక్కిన యుత్తమవర్ణముల వారికి సేవ నొనర్చుటయందే యాసక్తచిత్తు లగుదురు. ధార్మికులు తటాకములఁ ద్రవ్వింతురు. వనప్రతిష్ఠలఁ గావింతురు. దేవాలయాదులను నిర్మింతురు. సకాలవర్షములు గురియును. సర్వబీజములును ఫలించును. ధర్మము వర్ధిల్లును. ఇది కృతయుగప్రకారంబు. త్రేతాద్వాపరములయందును ధర్మము వర్తిల్లును వాయుప్రోక్తపురాణముచొప్పున నేను నీ కీయుగ చర్యలను జెప్పఁ గలిగితి. నేను యుగధర్మముల నెల్లఁ బలుమాఱు ప్రత్యక్షంబుగ వీక్షించి యుంటి. ఇంకను నీహితార్థం బొండు సెప్పెద. సావధానచిత్తుండవై వినుము. ఏనాఁడును విప్రు నవమానింపకుము. అతఁ డలిగినచో జగము లెల్లను దగ్ధము లగును. దీనిని మనస్సున స్థిరముగా నిడికొని యెల్ల కార్యముల నప్రమత్తుండవై మెలంగుము. అని మార్కండేయుం డతీతానాగతము లైన యుగధర్మముల నెల్ల నుడివి, ధర్మమునకు నవశ్యానుష్ఠేయ మగు హితమును బోధింపఁగా ధర్మనందనుఁడు మృకండునందనునితో ని ట్లనియె. ఋషివర్యా! ప్రజాపాలనంబున నుండు నే నెట్టి ధర్మమును సలుపవలయు? ఎట్లుండిన, ధర్మమునకు వెలి కాకుందును? అనఁగా నాచిరంజీవి యగు మునిసత్తముం డిట్లనియె. ధర్మజా! సర్వభూతములయెడఁ గృపాళుఁడవగుము. వానియెడ నసూయఁగొనరాదు. సత్యమునువచింపుము. శాంతిఁ బూనుము. మృదుత్వమును జేకొనుము. ధర్మమునే చరింపుము.అధర్మము నుజ్జగింపుము. దేవతలను బితరులను నారాధింపుము. ప్రజలఁ బ్రీతితో నేలుము. అప్రమాదుఁడవై మెలంగమిచే దోషము పాటిల్లు. తద్దోషపరిహారార్థము దానముల నొనర్పుము. పెద్దలయందు వినయము సలుపుము. ధర్మమున సర్వమహీమండలమును గెలిచి సంతసంబుతోఁగూడి సుఖింపుము. లోకప్రశస్తమగు కురువంశమున జాతుఁడవు నీవు. నీవర్తనము ధర్మయుతం బగుటచే ధర్మరాజని పేర్కొనఁబడితివి. అట్టివాఁడ

వగు నీకుఁ దెలియని ధర్మములు గలవే? ధర్మప్రవర్తకుఁడనయ్యును, గష్టములపాలైతిఁ గదా యని మనమునఁ జింతసేయకు. ప్రజ్ఞావంతులు కాలవశమున విధిప్రేరణచేఁ గలుగువానికి వగవరు. నామాటలయం దాదర ముంచి, సంశయాత్మకుఁడవు కాక ధర్మము నాచరింపుము. నీకు శ్రేయస్సు కలుగును. అని బోధింప నామునివచనములచేఁ బరమప్రీతుండై ధర్మజుండు వెండియు నిట్లనియె. మునివరా! నీయాజ్ఞను శిరంబున వహించి వర్తించెద. లోభమోహములు నా తెలుపున రావు. అనఁగా నచ్చోట నుండిన వాసుదేవాదులు మార్కండేయుని ధర్మోపన్యాసంబునకు విస్మయ మంది యాముని యింత యొప్పునే యని మార్కండేయు నుతించిరి. అంతట ధర్మజుఁ డాబ్రహ్మణ్యమూర్తితోఁ దనకు బ్రాహ్మణప్రభావమును జెప్పు మని వేఁడుటయు నంత నాతండు ప్రియంబున ధర్మజున కిట్లనియె.

మార్కండేయుండు ధర్మజునకు బ్రాహ్మణప్రభావము సెప్పుట

పాండుపుత్త్రా, తొల్లి యిక్ష్వాకువంశంబునఁ బుట్టి యయోధ్యాపతియై పరీక్షితుం డనువాఁడు బ్రహ్మోత్తరంబుగాఁ బ్రజాపాలనంబు సేయుచుండె. అతండు మృగయారతుండై యొక్కనాఁడు జవనాశ్వారూఢుండై వనంబునకుఁ జని యనేకమృగంబుల వేఁటాడి, యొక్కమృగంబు నేసిన నయ్యది వాఁడితూపుఁ దప్పించుకొని యరణ్యమధ్యంబునకుఁ బఱువ వాఁడును దానివెంబడిఁ బోయి బహుదూరగతంబైన దానిం గానక యలసి యొక్కచోట రమణీయంబై తామరపువ్వులతో వెలయుదాని, నతినిర్మలోదకములతో నొప్పారు సరోవరంబుఁ బొడఁగాంచి, గుఱ్ఱంబు డిగి, దారియలసటఁ దీర్చి దానియాహారము నిమిత్తము కొన్ని తామరతూడులం దెచ్చి దాని మేయఁజూచుచు, సమీపమున దీర్ఘశాఖలతో వెలయుచుండు నొకవిశాలతరుచ్ఛాయ నాసీనుండై సేదఁ దీర్చుకొనుచు, శ్రావ్యమనోహరంబై, తనరారు మధుర గీతము నొక్కదానిని వీనుల వినియె. అంత నామధురస్వరంబు వచ్చు వలనిఁ జూచుచుండ నొక్కసుందరాంగి, యౌవనవతి, రూపరేఖాలావణ్యంబుల నొప్పారునది యాచోటికి కేతెంచె. అంతఁ బరీక్షితుం డాపిలాసవతినిఁ జూచి 'నీ వెవ్వరిదానవు? ఇంతమనోహరంబైనచక్కని శరీరము గలిగి యీనిర్జనారణ్యంబున నొంటి చరింప నేల?' యన నాలావణ్య

వతి నేఁ గన్యను, నే నెవ్వరిదానం గాను. అనఁగా రాజు దానిసౌంద ర్యంబునకు మోహించి నీవు కన్యవై తేని నన్నుఁ బెండ్లాడు మనెను. అంత నాకన్నియ నన్ను జలవిహారమునకుం బోనుపనుందు వేని యంత పర్యంతము నీయొద్ద నుండుదు. ఇది నాశపథంబు. ఇందుల కియ్యకొన్ని నన్నుఁ బరిగ్రహింపు మనఁగా రాజు వల్లె యనెను. అంత వా రిరువురును గాంధర్వవిధానమునఁ బెండిలియైరి. ఆసమయమున రాజా నెమకుచు నయోధ్యనుండి సేన వచ్చెను. రాజును నూతనవధువుం దోడ్కొని పురప్రవేశము గావించి యాతరుణీలలామంబుతో నెల్లప్పుడేకాంతంబునఁ జరించుచుండుటం జేసి దానిగుట్టు నెవరు నరయఁ జాలరైరి. అంతఁ బ్రధానామాత్యుఁడు రాజువలనఁ గావలసిన రాచకార్యములకు నిరోధమగుడు, రా జుండుప్రదేశమున నున్నయొకవనితం గని దానివర్తన మడుగ నచటివార లతని కిట్లనిరి. అయ్యా! యిది యపూర్వతరుణిగాఁ దోఁచెడి. దీనిచెంతకు సలిలంబుఁ గొని పోరాదు. అనఁగా మంత్రి యాలోచించి కొండొకచోట జలరహితంబును, రమణీయ తరులతాగుల్మములతో నొప్పారునదియు నగువనమును నిర్మించి దానిచెంత విశాలమైన తటాకంబు నిర్మలోదకపూరితమైనదానిని నిర్మించి దానిరామణీయకమును రాజున కెట్లో తెలిపెను. అంత నారాజు మంత్రి నిర్మించినవనముఁ జొచ్చి దానిశృంగారమున కచ్చెరువొంది యందుఁ దనవలఁచిన వనితారత్నముతో విహరించుచు నొక్కనాఁడు మిక్కిలి దప్పిఁ గొని యిటు సంచరించి యొకబండిగురివిందపొదఁ దూఱి దానిచెంగట నిర్మలోదకములతో నొప్పారుతటాకంబు గాంచి తనప్రియురాలితోఁ దనదప్పి దీర్చుకొన నాతటాకంబునుండి కొంత నీరు దెమ్మనఁగా నదియు జలాహరణమున కా తటాకంబుఁ జొచ్చి నీట మునింగి మఱలఁ గానరాదయ్యె. అంతఁ బరీక్షితుం డెంతసేపటికి మఱలి రాని ప్రియురాలి నెనుకుచుఁ దటాకంబుఁ జొచ్చి నీటినంతయుఁ గలఁచి చూడ దానియందొకరంధ్రమునఁ గప్ప యొకటి కానరాఁగా నయ్యది తనమోహనాంగిని మ్రింగియుండు నని యూహించి క్రుద్ధుండై తనరాజ్యంబునందలి కూపములయందును, తటాకములయందును, నదులయందును నెచ్చోట నున్నను గప్పలను జంపి తనకుఁ గానుకగాఁ దెచ్చినవానికి విస్తార ధనము నొసంగెద నని చాటించె. అంత నల్పమానవులు రాజునకుఁ బ్రీతి

గావింప భేకంబులఁ జంపం దలపెట్టెరి. అందులకు భేకంబు లన్నియు వెఱచి తమనాయకునొద్దకుఁ బోయి యీ భేకప్రళయంబును విన్నవింప నామండూకనాయకుం డొకమునివేషముతోఁ బరీక్షితునొద్ద కేతెంచి యిట్లనియె. రాజా! అల్పజంతువు లగు భేకములయెడఁ గ్రోధము నుడుగుము. నిరపరాధు లగు కప్పలఁ జంప రాదు. వీనిని వధింపఁగా నీ కే లాభంబు సమకూరు ననఁగా నమ్మునిరూపధారి యగు మండూకనాయకునకు నరనాయకుం డగు పరీక్షితుం డిట్లనియె. అయ్యా! కప్పలు నా ప్రియాంగనను మ్రింగినవి. దానంజేసి వానిని వధింపఁ బూనితి. అవి యొనర్చిన దౌష్ట్యమునకు ఫలితము నవి యనుభవింపక తీరునే? వాని వధం బవశ్యకర్తవ్యము. నాయుద్యమంబున కాటంకంబు సేయకుము. అనఁగా నా భేకనాయకుండు చింతాకులితస్వాంతుండై రాజునకు వెండియు ని ట్లనియె. ఓ దయామయా! ప్రసన్నుండవై నామనవిఁ గొంత యాలకింపుము. నేను భేకనాథుఁడను. ఆయు వను పేరం బిలువఁబడువాఁడ. ఆసుందరి నాకూఁతురు. దాని దుర్భాగ్యంబునం జేసి పలువురు రాజులు మోసపోయిరి. అనఁగాఁ బరీక్షితుం డాయువుతో నిట్లనియె. భేకాధిపా! దానిపై నామోహ మగ్గలంబు. నామనస్సు దానిం జూడక నిశ్చలత నొందదు. దాని నెట్ులైన నా కొసంగు మనఁగా భేకనాయకుఁడు రాజు వేఁడికోలునకు మనస్సు కరఁగి వల్లె యని తనకూఁతు రావించి రాజున కొసంగి యతనికి సేవ లొనర్చుచుండు మని నియోగించి, దానికి బుద్ధిఁ గఱప నెంచి దానితో నిట్లనియె. బిడ్డా! నీదుశ్శీలంబున రాజులు పెక్కుఱు మోసపోయిరి. కావున నీకొడుకు లబ్రహ్మణ్యు లయ్యెదరు గాక యని శపించె. అంతఁ బరీక్షితుండు తనవలచినమోహనాంగి నా కప్పలఁ జేడు దన్నుఁ జెందించినందుల కమితానందభరితుండై సంతోషమున సుషోభాంగి యాకప్పలరాయని కుచితసత్కారములఁ జేసిన నాతండు వారి వీడ్కొని వచ్చినదారిఁ బోయె. అంతఁ బరీక్షితుం డా తరుణియం దభిమతభోగముల ననుభవించి దానియందు శలుఁడు, బలుఁడు, దలుఁ డను ముగ్గురు పుత్త్రులను బడసెను. పిదపఁ గొంత కాలంబున కారాజు విరక్తుండై రాజ్యంబు జ్యేష్ఠుఁ డగుశలుని కొసఁగి, యాజీవితాంతము తపస్సుచే గడుప నెంచి యరణ్యమునకుం జనెను. అంత రా జగుశలుండు రాజ్యాభిషిక్తుండై ప్రజాపాలనము సేయుచు

నొక్కనాఁడు వేఁటయందుఁ దగిలి వనమునం దనేకమృగంబుల నేయుచుఁ బోవువాఁ డొకమృగంబును నేయ నయ్యది తప్పించుకొని పరవ, వానివెంట నంటి రథరథ్యంబుల వేగంబునఁ బోనిచ్చుచుఁ గొంతసేపటికి నా రథాశ్వంబులు డస్సిన, సారథి యయ్యా, రథ్యంబులు డస్సినవి. ఇంక నివి పోలేవు. వామ్యాశ్వంబులు గాని మృగంబు వెంటఁ జన లేవనఁగా శలుండు వామ్యాశ్వంబు లన నెయ్యవి? అవి యెచ్చోట నుండు? చెప్పు మనఁగా నాసారథి తాను బొరఁబడి వామ్యాశ్వంబుల సంగతిఁ జెప్పినట్లు తలంచి, చెప్పినచో వామదేవఋషి తన్ను శపించు నేమో యనియు, నట్లు చెప్పకున్నచో శలుఁడు దన్ను దండించు ననియు మనంబునఁ గలవరపడుచుండ శలుండు సారథిం జూచి యీ వామ్యాశ్వముల సంగతిచెప్ప వేని నిన్నుఁ దెగ వ్రేసెద నని యాయుధములతో బెదరింపఁగా నప్పుడు సారథి వినిచేఁ జచ్చుటకంటె మహర్షి శాపమున గ్రుందుట మేలని యిట్లనియె. నృపాలా! వామదేవుఁ డను బ్రహ్మర్షి యిచ్చటికి సమీపమున నున్నాఁడు. ఆమహనీయుని యాశ్రమంబున వేగవంతంబు లగు నశ్వంబు లున్నయవి. అచ్చోటికిఁ బోయి వానిని రథమునకుఁ బూన్చుకొనినఁగాని, యిపుడు తప్పించుకొని పాఱినమృగమును బట్టనేర వనెను. అంత సారథిని దమరథమును వామదేవాశ్రమమునకుఁ దోలింపు మనుడు వాఁ డట్లు చేసె. శలుం డాశ్రమమునకు సమీపమునఁ దేరు డిగి చని వామదేవుని దర్శించి 'మునివర్యా! నాచేత నేటువడి యొకమృగ మరణ్యముఁ జొచ్చెను. దాని వెన్నంటి వధింపవలయు. నా రథ్యంబులు డస్సినయవి! ఇఁక శ్రమంబున కోర్వలేవు. కావున మీ యాశ్రమమునం దున్న గుఱ్ఱములను గొంత యరు వియ్యవలయు' నని యడిగె. అట్లతఁ డడుగఁగా వామ్యాశ్వంబుల నాఋషివర్యుం డిచ్చుట కియ్యకొని శలునితో నిట్లనియె. రాజా! నీపనియైనవెంటనే నాయశ్వంబుల నా కొప్పగింపవలయు ననఁగా రాజును నట్లె యనెను. అంత సారథి యారథ్యంబుల రథంబునకుఁ బూన్పుడు నయ్యవి యతివేగంబునఁ బాఱి రాజుచే నేటువడి చనినమృగమును దఱియఁగా రాజు దానిని వధించి కృతకృత్యుం డయ్యెను. వామ్యాశ్వంబుల వేగగమనంబునకు రాజు అచ్చెరువు నొంది సారథితో నిట్లనియె. ఈవేగవంతము లగు నశ్వంబులు మునుల కేల? వామదేవునకు మన మీయశ్వంబుల నీయ

వలదు. మనయూరికిఁ గొనిపోవుద మని తలంచితిని. పురంబువైపు రథంబు మఱలింపు మనఁగా వాఁడు రాజాజ్ఞ చొప్పున వర్తించెను. అంత వామదేవుండును శలుండు తనయశ్వములఁ దన కొసంగక జాగు సేయుటఁ దెలిసి నెలవఱకు వేచియుండి పిదప నాత్రేయుం డనుతనశిష్యునిఁ బిలిచి యిట్లనియె. శలుఁ డను నయోధ్యాపతి నాయశ్వంబుల నరువుగాఁ గొనిపోయి, నెలదినంబు లయ్యెను. ఇంతవఱకుఁ దోలి పంపఁడు. కాన నీ విప్పుడ యయోధ్యకుం జని యానరపాలుం గాంచి మాయొజ్జ యిచ్చిన వామ్యాశ్వంబులతోఁ బని యయ్యె నేని వానిని దోలిపెట్టుమనుము. అని చెప్పఁగా నాత్రేయుండు శలుపాలికిం బోయి మునివచనంబులఁ దెలుపఁగా గర్వాతిరేకంబున శలుండు రాజయోగ్యము లగు నశ్వరాజంబులు విప్రుల కేల! ఊరక పొమ్మనెను.

శలుఁడు వామదేవునిఁ దిరస్కరించుట

అంత నామునిశిష్యుండు మఱలివచ్చి రాజు పలికిన పల్కుల వామదేవునితోఁ జెప్పుడు వామదేవుం డందులకుఁ గినిసి రోషతామ్రాక్షుండై తాను వెంటనే యయోధ్యకుం జని యశ్వంబుల నిమ్మనుటయు నారాజు నే నీయఁజాల ననఁగా నమ్ముని కనలి రాజా! ఇతరాశ్వంబులచేఁ గానిపని నాయశ్వంబులచేఁ గావించికొని వాని మగుడ నిమ్మని నే నడుగ నీవీయ ననుట పాడి గాదు. బ్రహ్మక్షత్రంబులకుఁ బోలని యీవిధమునఁ జరింతు వేని నిన్ను వరుణుఁడు ఘోరపాశంబుల బంధించుఁ గాక యని శపించె. అంత శలుండు సాధుగతులఁ బోవునెద్దులు పాఱునవికుఁ దగు. వాని నీ కిచ్చెద. వానిని బండిం గట్టికొని యాశ్రమంబున కేఁగుము. మఱియును వేదములే మీవంటి వారిని వహించును గదా? యనఁగా వామదేవుఁడు మమ్ము వేదములు పరలోకమున వహించుఁ గాని యీలోకమున వహింపవు. ఈలోకమున మాకును నితరులకును నితరంబులే వాహనంబు లనఁగా శలుఁడు వెండియు నిట్లనియె. మునివరా! నీకు గుఱ్ఱములే వలయు ననిన మాయొద్ద నుండు నీయశ్వంబులు తప్ప వేగవంతంబులగు నితరాశ్వములఁ గోరుకొనుము. ఒసంగెద. లేదా! మంచి వేసడంబులఁ గోరినచో నొసంగెద. ఇఁక నీవామ్యాశ్వంబులు మావి గాని నీయవి గానేరవు. అనఁగా రాజా! నాధనమును నీ వపహరించితివి. అన్యాయవృత్తం

బైన ధనమును గొనుటకు సాహసించుట బ్రాహ్మణునకుం బరమ ద్రోహంబు. సాధువచనంబుల నాగ్రహ్మముల నా కొసంగ వేని ఘోరాకారు లగు రాక్షసులు నిన్నుం జుట్టుముట్టి నిన్ను వధింతు రనిగొ. అంత శలుండు గినిసి యా రాక్షసులే మద్వచనప్రేరితులై నిన్నును సశిష్యునిం జంపుదు రనియె. అంత వామదేవుండు శలుం జూచి త్రికరణశుద్ధముగా వేదోక్త ధర్మముల నాచరించు విప్రుల కపకృతి దలంప గాదు కావున నీ యీ యపరాధమునకు వేవేగ ఫలము గుడుతు వనుచుండఁగనే ఘోరా కారు లయిన రాక్షసులు శూలాద్యాయుధపాణులై శలుం జుట్టుకొ నఁగా శలుం డిక్ష్వాకువంశంబునఁ బుట్టిన నాతప్పులు శూరు లేని, వామ దేవునకు వామ్యాశ్వంబుల నీయ రని ఘోరంబుగా నఱచుచుండ రాక్షసులు శలుని వధించిరి. అంత వామదేవుండు నిజాశ్రమంబునకుఁ జనియె. అంత నయోధ్యాధిపత్యమును శలునితమ్ముఁడు దలుఁడను వాఁడు బూనెను. పిదపఁ గొంత కాలమునకు వామదేవుఁడు రోషా విష్టుండై వచ్చి తనయశ్వముల నిమ్మని యడుగ, దలుఁడు 'ఆహా! వాను దేవుం డింకను గుఱ్ఱములమీఁదియాసతో నున్నవాఁడే వీని నపుడే వధిం చియుండవలయునని చెంత నున్న సారథితో విషదిగ్ధంబయిన బాణంబున నీపాఱునిఁ జంపెద. అంతటితో గుఱ్ఱములజోలి వీని కుండ దనఁగా వామదేవుం డాబాణమే యంతఃపురమున నుండు పదియేండ్లవాఁడగు నీకుమారుఁడు శ్యేనజితుం డనువాని వధించు ననఁగా వెంటనే యాబా ణము శ్యేనజిత్తుం జంపె. అందులకు దలుండు గినిసి వేఱొకబాణముం గొనిరండు వీని నేను వధించెద, నాపౌరుషంబును జూడుం డని బాణ మును వింట సంధించి చేతి నెత్తఁబోవుడు నయ్యది యెత్తుటకును వాల్చు టకు నశక్యంబయ్యె. దలుఁడు దాన లజ్జించి తనసభయం దందఱుఁ గలయం జూచియీబాణమునుసంధింపనువిడుపను నేరనైతి. వామదేవుఁడుహతుఁ డుగాఁడయ్యె. హస్తంబు స్తంభించె. ఇదియెట్లు పూర్వస్థితిఁ బొందుననఁగా వామదేవుండు దయఁ దాల్చియీబాణమున నీదేవిం దాఁకుము. నీపాపని వృత్తియగుననఁగా దలుం డట్లు చేయుటయు, హస్తస్తంభనంబు వాసె. అంత నాదలుని రాణి వామదేవునొద్దకు వచ్చి యిట్లనియె. మునీంద్రా! నేను బలుమాఱులు నాభర్తకు బ్రాహ్మణాపరాధంబు తగ దని బోధింతు. పుణ్యలోకములు వలతు వేని వారియెడ మిథ్యాప్రవర్తనంబు కూడ

దండుము. కాని, యీతండు నామాట వినండు. ఆఫలంబు వేవేగఁ గుడిచె. అని తెలుపఁగా నమ్మునీశ్వరుం డాయిందువదనమాటలఁ మెచ్చి యిట్లనియె. ఓ రాజపుత్త్రీ, నీప్రవర్తనంబున నిక్ష్వాకుకులంబు రక్షితం బయ్యె. వరములఁ గోరు మనఁగా నారాణి యిట్లనియె. మునిచంద్రా! నాపతికిఁ బాపచ్యుతియు, నాకొమరునకుఁ బునర్జీవము ననుగ్రహింపవే యనఁగా వామదేవుం డాహామాత్రికోర్కె నొసఁగెను. రాజపుత్త్రుండగు శ్యేనజిత్తు వెంటనే నిద్రమేల్కొన్నవానివలె సజీవుఁడయ్యె. అంత దలుండు వామదేవుమహిమమున కచ్చెరువడి యాతనికిఁ బ్రదక్షిణ నమస్కారము లొనర్చి వామ్యాశ్వంబుల నాతని కొసంగఁగా వామదేవుండు సంతుష్టచిత్తుండై గుఱ్ఱముల వెంటఁ గొని నిజాశ్రమంబునకుఁ జనియె. ఈవృత్తాంతంబును విని ధర్మరాజు మార్కండేయునితో వెండియు నిట్లడిగెను. మునివర్యా! బకదాల్భ్యు లను మహర్షులు దేవేంద్రునకు హితు లనియుఁ, జిరకాలజీవు లనియు విందుము. బకునకు దేవేంద్రునకును సుఖదుఃఖవిచారప్రయుక్తమైన స్నేహవృత్తాంతమును విన గోరెదను. అని యడుగఁగా మార్కండేయుం డిట్లనియె.

### బకశక్రసంవాదము

పూర్వకాలమున దేవతలకును నసురులకును ఘోరయుద్ధంబు ప్రవర్తిల్లె. అందు దేవతలు గెలిచిరి. అసురులవలనిభయము లోకులకుఁ బాసెను. ఇంద్రుఁడు మూఁడులోకములను నిష్కంటకముగ నేలుచుండెను. ఆకాలమున భూలోకమునందు సకాలవర్షములు గురియుచు వచ్చెను. వసుంధర బహుసస్యసంపన్నయై విరాజిల్లెను. మానవులు ధర్మిష్ఠులై మెలఁగుచు, నిరామయులై నిత్యతృప్తులై కాలముం గడపుచుండిరి. అప్పుడు మఘవానుఁడు స్వపాలితమైనరాజ్యముం జూచువేడ్కనైరావతారూఢుండై సంచరించుచు భూలోకమున కేతెంచి, ఋష్యాశ్రమములను, పట్టణములను, గ్రామములను, వాపీకూపతటాక సరిత్సరోవరములను దర్శించుచు జనులు స్వవర్ణాశ్రమాచారాదుల నడపుచుండుటను జూచి సంతుష్టుండై తూర్పుసంద్రపుఁ దీరంబున నొప్పారు చక్కనైన బకునియాశ్రమంబునకు విచ్చేసెను. అంత నమ్మహర్షి దేవేంద్రున కుచితసత్కారముల నొసఁగ నాతండు సంతుష్టాంతరంగుండై బకమహర్షిం జూచి 'మహర్షివర్యా పెక్కువేలవత్సరంబులు' బ్రతికియున్న

వాఁడవు కావున నిన్నొక్కటి యడిగెద. ఆనతీయవే యనఁగా బకుఁడు వల్లె యన నింద్రుం డిట్లడిగెను. చిరంజీవులు గానుండువారి కెయ్యది దుఃఖము? అనఁగా ఋషివర్యుఁ డిట్లని నుడివెను. ప్రియులు కానివారితో నుండుట, ప్రియులతో నెడఁబాటు, పుత్త్రులయొక్కయు భార్యయొక్కయు, సుహృదులయొక్కయు మరణము, పరాధీనత యివి దుఃఖములు. మఱియుఁ, జిరంజీవులు ధర్మాచరణాసక్తులకుఁ గీడును, ధర్మశూన్యులకు మేలును గలుగుచుండుటను జూచుచుందురు. దీనికంటె దుఃఖతరం బన్యం బుండ నేరదు మఱియును నందఱును నర్థము లేక దుఃఖింతురు. అర్థము లేనివారి నెల్లరు పరిహసింతురు; అవమానింతురు. నరజన్మమే కష్టముల కాకరంబు. అని చెప్పఁగాఁ జిరకాలజీవులకు సుఖం బెయ్యది? యని యింద్రుం డడుగ బకమహర్షి యిట్లనియె. దుర్మార్గుల నాశ్రయింపక తనంతన లభించిన కాయగూరలతోఁ దృప్తి నొంది యెనిమిదవముహూర్తమునఁగాని, పండ్రెండవముహూర్తమునఁగాని తనయింటికడ వండికొని భుజించుట సుఖము. రేపటి కెట్లు జరుగునో యను తలంపుతో మృష్టాన్నంబు నీదినమునందు విచారముతో భుజించుట సుఖము కానేరదు. మఱియును బరగృహాన్నము నెల్లప్పుడు భుజించుచు శ్వానము వలె నన్నదాతలయిండ్ల ముందఱఁ దిరుగుచుండుట మిక్కిలి దుఃఖము. అతిథుల నాతిథ్యంబునను, భూతముల బలిదానంబులను, బితరులఁ బిండప్రదానంబులను, దేవతల యాగాదులందు నగ్నిముఖమున హవిర్దానములచేతను దృప్తిపఱచి భుజించుమహనీయుఁ డుత్తమసుఖమును బ్రాపించు. ఆఁకలి గొని వచ్చిన యతిథికి నొసఁగిన యన్నదానము మహిమను బొగడుట వశమా? ఎవఁ డతిథిని బూజించుచున్నప్పుడు వాఁడెన్ని కబళము లాహారము గొనునో యాగృహస్థుం డన్ని వేలగోదానముల ఫలమును బొందును. యౌవనమందుఁ బ్రమాదముచేఁ జేయుదోషము లాతిథ్యంబున నీఁగు. అతిథి యన్నము గుడిచి కుడిచి చేతిని గడుగుచుండఁగా గృహస్థునిపాపము లన్నియు క్షయించును. అని చెప్పఁగా నింద్రుండు బకమహర్షితో సరసాలాపంబు లాడుచుండి మావలనఁ దనివి నొంది నాకమున కేఁగెను. అంత నమ్మునిచంద్రునితో ధర్మరా జిట్లనియె. మహర్షివర్యా విప్రులమహిమంబు నుడివితివి. కొంత రాజులమహిమ

మును దెలుపుము. అని యడుగఁగా మృకండుపుత్త్రుండు ధర్మపుత్త్రునకు నిట్లనియె.

మార్కండేయుండు ధర్మరాజునకు రాజులమహిమంబు చెప్పుట

పూర్వము చంద్రవంశమునఁ బుట్టిన యయాతి మహిమ మీఱ రాజ్యపాలనము గావించుచు సభయందు శునాసీరుచందంబున నాసీనుఁడై యుండ నొక్కవిప్రుండతని పాలికేతెంచి యిట్లనియె. మహాప్రభూ! గుర్వర్థంబు నిన్ను యాచింప వచ్చితి. నేఁజెప్పినదాని కొడంబడుదు వేని చెప్పెద ననఁగా యయాతి యది యెది యని యడిగిన నావిప్రుం డాతని కిట్లనియె. యాచకుండు దాత నెద్దానినైన నడిగిన దాత మనంబున సంకటపడుట సర్వసాధారణంబు. అట్లుకాక మనఃప్రియంబుగా గోసహస్రంబు గుర్వర్థంబున కిమ్ము. అనఁగా యయాతి యవ్విప్రున కిట్లనియె. భూసురవర్యా! యాచింపఁదగినవస్తువును యాచకుం డడుగుచో నేనిత్తు నని చెప్పెను. ఒడంబడితి నేని దాని నీయకమానను. ఇచ్చిన పిదప పగవను. ఒడంబడినదాని నిచ్చి, సంతసంబున సుఖింతు. యాచకుల కిచ్చి మఱియొకరితోఁ జెప్పను. యాచకుం డలిగిన నేఁ గినియను. విప్రుం డన్నితెఱంగుల నాకుఁ బ్రియుండు. అని చెప్పి యాభూసురునకు వేయి మొదవుల నొసంగి సంతృప్తిగావించి పంచెను. ఆవిప్రుండును యయాతి తన కొసంగినగోసహస్రంబును గైకొని సంతుష్టుండై చనియె. ఇది రాజగు యయాతియొక్క మహిమము.

మఱియును సేదుక వృషదర్భు లను రాజు లిరువు రుండిరి. వారు రాజోచితవిద్యలను నీతిశాస్త్రములను బఠించి వంశానుగతంబైన రాజ్యములఁ బాలించుచుండిరి. అందు వృషదర్భుఁడు బాల్యము నుండి విప్రులకు బంగారమును వెండిని దప్ప వేఱొక్కదాని దానమొసంగ నని గుప్తవ్రతమును బూనియుండె. అటు లుండ నొక్కనాఁడు విప్రుం డొకండు సేదుకుపాలికిం బోయి 'రాజా! నేను వేదాధ్యయన సంపన్నుఁడను. గురుకులవాసంబు పూర్తియయ్యె. గుర్వర్థంబుగ నశ్వ సహస్రంబును నడిగి వానిని గొంపోవుట కేతెంచితి. అనఁగా సేదుకుఁ డాబ్రాహ్మణునితోఁ దనకు వానిని నొసంగుటకు వీలు లేదనియు, వృషదర్భుపాలికిం బొమ్మనియు నుడివెను. అంత నాబ్రాహ్మణుండు వృషదర్భు పాలికిం బోయి గుర్వర్థంబుగ నాకు వేయి యశ్వముల నొసఁగు మనఁగా

నావృషదర్భుం డాభూసురుని మునికోలతో నడచె. అంత నవ్విప్రుం డో
ర్ప్పకో రాజా! నాతప్పేమి? నన్నేల కశాఘాతంబున నొంచితివని యధి
క్షేపించి శపింప యత్నింపఁగా వృషదర్భుం డయ్యా! నీకోరినయశ్వసహ
స్రము వేఱొకం డెవ్వండు నీయలేకపోయెనా ! కాకున్న నశ్వములఁ
గోరుట బ్రాహ్మణధర్మమా ? యని యడుగ, సహజమగుకోర్కె గల యా
విప్రుం డిట్లనియె. అయ్యా! తొలుత నేదుకుని యాచించితి. ఆతండు
తనకుఁ గాదని నుడివి నిన్ను యాచింపు మనఁగా నీయొద్ద కేతెంచి
నిన్ను నడిగితి ననుటయు వృషదర్భుం డయ్యా, యీదినము పూర్వా
హ్ణంబున నాబొక్కసమునకు వచ్చుకప్పము నిచ్చెద. మునికోలదెబ్బల
సైరింపు మని ప్రార్థించి యాదినము తనబొక్కసమునకు వచ్చిన యాదా
యమున నావిప్రునకశ్వసహస్రమునకుఁ గావలసిన మూల్యము నొసం
గెనని మార్కండేయుండు వెండియు నిట్లనియె.

కురువంశమునఁ బుట్టినసుహోత్రుం డను రాజు మహర్షులను
సేవింపఁబోయి మగిడివచ్చువాఁడు మార్గమున నౌశీనరుం డగు శిబిని
దూరస్థుండైనవానిం గాంచె. అంత వా రిరువురును దమవయస్సుల
కనుగుణంబుగఁ బరస్పరాభివందనంబులం జేసికొని గుణముల నిరువు
రును సమానులను తలంపున నొండొరులు దారి తొలంగరైరి. వారిని
నారదుం డప్పుడు పొడఁగని మీరిరువురును నిట్లేల దారి దొలంగ
కున్నారని యడిగెను. అప్పుడు వా రిట్లనిరి. మునీంద్రా! యోగ్యున కయో
గ్యుఁడు, శిష్టాచారున కశిష్టాచారుఁడు, సమర్థున కసమర్థుఁడు, దారి
దొలంగుట యెచ్చోటనుఁ గలదు మే మిరువురము పరస్పరసఖ్యమున
సమానుల మగుటంబట్టి యిట్లున్నవారము. దేవర్షి వగు నీవు చెప్పిన
చొప్పున నాచరింతు మనఁగా నారదుం డిట్లనియె. ఏదో యొకమిషచే
శాంతక్రూరులు క్రూరశాంతుల కెడ మిచ్చి దారి దొలంగుదురు. సాధువ
గువాఁ డసాధువుపట్ల సాధువర్తనుం డగును. మఱి సాధువిషయమున
సాధువుగా వర్తించుట యతనికి సహజధర్మము. ఉపకారమునకు నూఱిం
తలు ప్రత్యుపకార మొనర్చుట యుచితము. మహిమగలవారియెడ
దానికి పరిమితి లేదు. మీయిరువురిలో సాధుశీలుండు శిబి యని నా
మతంబు. దానముచే లోభిని, సత్యముచే ననృతవాదిని, సహనంబునఁ
గ్రూరకర్ముని, సాధుగుణమున నసాధుని జయించుట పాడియండ్రు. సాధు

వ్రులవిషయమునను వేఱొకధర్మమును సుమువ్రుట ధర్మము కానేరదు. ఇఁక మీరును బోలినభంగి వర్తింపుఁడు. అని చెప్పి వాకమం [illegible]నెను. అంత సుహోత్రుండు శిబి తనకంటె గుణాధికుండని యెఱింగి శిబి నెక్కుడుఁగా శ్లాఘించి యతనికిఁ బ్రదక్షిణంబుగా దారిఁ దొలఁగి చనెను. శిబిమాహాత్మ్యంబు వర్ణింప నలవి కాదు.

శిబిచరిత్రంబు కొంతఁ జెప్పెద వినుము. పూర్వకాలమందు దేవతలు శక్రుం జూచి శిబిచిత్తము నెఱుంగుమనఁగా నింద్రాగ్నులు మేమనసి వచ్చెద మనిరి. ఇంద్రుఁడు శ్యేనరూపముతో నామిషార్థియై కపోతమును దఱుమ, నగ్ని కపోతరూపమును ధరించి శిబికడ కేగె. అయ్యది శిబిని శరణుజొచ్చి యిట్లనియె సార్వభౌమా! డేగ నన్నుఁ దఱుముచుండఁ బ్రాణభీతి నీమఱువు సొచ్చితి. నా కభయం బీయవే. నేను బ్రహ్మచర్యవ్రతము సలిపి గురువునొద్ద వేదాధ్యయనంబు చేసినతపోదమాదిగుణవంతుండను. నన్నుఁ గాపాడుము. దానము లన్నింటికంటెఁ బ్రాణదానం బుత్తమము గాదే? యని కపోతము మొఱ యిడఁగాఁ బురోహితుండభయదానం బిమ్మని రాజునకుఁ జెప్పఁ గపోతంబును రక్షింప నొడంబడెను. వెంటనే రాజునొద్దకు డేగ సమీపించి రాజా! ఈనాఁ డీకపోతంబు నాకడనుండి తప్పించుకొనిపాఱివచ్చి నిన్ను శరణుజొచ్చినది. నేను దానిం బట్టవచ్చితి. నీవు వదలినచో దాని నెట్లైనఁగొని నా యాఁకలి దీర్చుకొందు.దానిని రక్షించి నన్నాఁకట నవయునట్లొనర్చి యీ పాతకంబున కొడిగట్టుకొనకుము. నానోటి కడ్డమువచ్చిన నీకు సద్గతి లభింపదు. నీ వీపాతకము ననుభవింప నెన్ని దేహములనో యెత్తవలసి యుండు. అనఁగా శిబి యిట్లని వితర్కించె. పక్షులెన్నండును దెలివితో వచనము లాడనేరవు. అట్లు మాటాడువానిని గని యెఱుంగ. ఈశ్యేనకపోతంబులవచనములు చూడ విచిత్రములుగా నున్నవి. ఇవి రెండును జ్ఞానవంతంబులైనవిగాఁ దోఁచెడి. ఎట్లు చేసిన ధర్మహాని కానేరదు. అని కొంత తడవు మనంబున నాలోచించి డేగకు శిబి యిట్లనియె. భయాతురుఁడైన ప్రాణిని రక్షింపనిమానవుని నింద్రుండు తనవజ్రాయుధంబుతోఁ జంపు. అట్టివానిగృహంబును బితరులు సొరరు. వాఁ డొసంగు హవిస్సులను దేవతలు ముట్టరు. వాని సంతానంబు వర్ధిల్లదు. వాఁ డేలు రాజ్యమున వానలు గురియవు. సస్యములు మొలవవు. వానికిఁ బుణ్య

లోక భ్రంశము గలుగు. కావున శరణన్నవానిని గాపాడకుండుట యధర్మము. నీయాఁకలిఁ దీర్చుటకు వేఱొకం డుపాయ మూహించి చెప్పెద. నీకు వలసినంతయాహారంబును, గోరిన మాంసంబును నీవుకోరిన ప్రదేశమునఁ జేర్చువాఁడ. దానం దృప్తి నొంది యీకపోతమాంసభక్షణమును మానుము. నాకు శరణాగతత్రాణపుణ్యము నొసంగుము. అనఁగా డేగ యిట్లనెను. రాజా, నాకుఁ గపోతము వేదవిహితమైనయాహారంబు. కావున నే దీని విడువ నేల? అన్యమాంసం గొన నేల? దీనినే నా కొసంగుము ఆటంకపెట్టకుము. అని నిర్బంధించి యడుగ శిబి డేగకు వెండియు నిట్లనియె. ఓడేగా, నీకు బదులుగ నెద్దొసిత్తును. కాని, భయముచే శరణుచొచ్చిన యీపక్షిని విడువను. దీనినిమిత్తము ప్రాణములను విడుతును. కాని దీనిని విడువనే విడువను. ఇది సాధువని నీవెఱుఁగవా? దీని విషయమున నీవు క్లేశము నొందకుము. ఎట్టకేలకు దీనిని నీ కొసఁగను. ఎట్లు నాపెద్దలు నాకార్యముచే నన్నుఁ బ్రశంసింతురో, యట్లు నాకు మేలు సేయుము. నీయభీష్టం బెయ్యదియో, నాకెఱింగింపు మనఁగా నా డేగ శిబితో నిట్లనియె. నృపాలా! నీకుడితొడమాంసమునుండి యీకపోతమంత నాకుఁ దూచియిమ్ము. అంతటితో నేఁ దృప్తినొంది చనెద ననఁగా శిబి యామాట కెంతయు సంతసించి తనకుడితొడ మాంసమును దులలో నొకవైపున నుంచి వేఱొక్కవైపునఁ గపోతంబు నుంచి తూచఁగాఁ గపోతంబువైపు బరువెక్కు డయ్యెను. అంత శిబి తన మఱొకతొడమాంసంబుఁ గోసి యందలి మాంసమును దులయం దునిచి చూడ నప్పటికిని నామాంసంబు కపోతము యొక్క యెత్తునకు సరిరాదయ్యె. అంత శిబి సంకోచింపక తనతొడమాంసఖండంబు లుండుతుల దానే యధిరోహించె. అంత నాడేగ రాజేంద్రా, కపోతము రక్షించితి వని చెప్పి యదృశ్యం బయ్యె. అంత శిబి కపోతముం బిలిచి యిట్లనియె. మహాత్మా! నిన్ను మేము సామాన్యపక్షియగు కపోతముగాఁ దలపోసితిమి. విమర్శింప నాతలంపు పొల్లయ్యె. ఇచ్చోటికి వచ్చిన డేగ యెచ్చట! పరికింపఁగా నిది దేవమాయగాఁ దోఁచెడి. వివరింపవే యనఁ బారావతం బిట్లనియె. సౌరధికులశ్రేష్ఠుఁడా! నే నగ్నిని, శ్యేనంబు దేవేంద్రుఁడు. మేమిరువురమును నీమన స్సరయఁ గోరి యిట్లు మాఱురూపములతో నేతెంచితిమి. నీవు పరమసాధువవు. నీసాధుచిత్త

వృత్తికి మేము మెచ్చితిమి. నీశరణాగతత్రాణతత్పరత లోకమునం దెవ్వరి యందుఁ గానరాదు. తెంపుచేసి నీమాంసమును గోసి యిచ్చితివి. నీకు శుభమగు గుర్తునొక్కదానిం గావించెద. నీపార్శ్వభాగమునఁ గపోతరోముఁ డను పుత్త్రుం డొకఁడు జనించి లోకప్రశస్తముగా రాజ్య మేలి రాజులలో మేటి యగు నని చెప్పి యదృశ్యుండయ్యె.

మఱియు శిబిసచ్చరిత్రమున వేఱొక్క విశేషముగలదు. చెప్పెద. సావధానుండవై యాకర్ణింపుము. విశ్వామిత్రమునివంశమునఁ బుట్టిన యష్టకుఁ డనురాజు అశ్వమేధయాగముం జేసి సోదరు లగు ప్రతర్దనవసుమనశ్శిబు లను వారితోడఁ దేరెక్కి పోవుచుండఁగా వారి కెదురుగ దేవర్షి యగు నారదుం డరుదెంచిన వారు తమరథంబు నిలిపి నారదుఁ దమరథము నెక్కుమని వేడిరి.నారదుండును నమస్కృతితోఁ దన్నుఁ బ్రార్థించినరాజపుత్త్రుల వేడికోలున కియ్యకొని వారిరథంబు నధిరోహించె.అట్లు రథంబు నారదసహితమై వేగంబ పోవుచు నా సోదరులలో నొక్కఁడు నారదుంజూచి మహాత్మా! నామనం బొక్కయర్థంబుఁ దెలియఁ దమకించుచున్న యది. నాయెడఁ బ్రసన్నుండవై నాకు దానితెఱం గెఱింగింతువే యని సవినయముగఁ బ్రశ్నింప నారదుండు నీమనంబున నున్న దాని నడుగుము. తెలియఁ జెప్పెద ననఁగా నతఁ డిట్లనియె. మునీంద్రా! సర్వగుణముల నొప్పారు సోదరులమగు మేము నాకంబునకుఁ జనుచుండ మాలో నెవ్వండు మున్ను నడుమన రథమును డిగవలసివచ్చు ననఁగా నారదుం డష్టకుఁడు డిగు నని వచించె. అది యేమి కారణంబున నష్టకుండు డిగు నందు రేని వినుఁ డని నారదుం డిట్లు సెప్పె. పూర్వమొకానొకప్పుడు కొన్నాళ్లు నే నష్టకునియింట నతిథినై యుంటి. అప్పు డాతం డొకనాఁడు నన్ను రథంబు నెక్కించుకొని యెట కేనియుం దోడ్కొని పోవుచుండెను. అపుడు మార్గంబున వన్నె కొక గుంపుగా వేర్వేఱుగ నేర్పఱచియున్న యనేకగోసహస్రంబులం జూచి యివి యెవ్వారి వని యష్టకు నడిగితి. అంత నష్టకుం "డివి యన్నియు నేను దానమిచ్చిన యావులు" అని తన యీవిని దాన పొగడికొనియె. ఆకారణంబున నష్టకుండు ముందు దిగవలయు నని యంటి. అంత నా పృచ్ఛకుండు మరలఁ దక్కటివారలలో నెవ్వారు పిదప రథము డిగు వారని నారదుని మఱల నడుగ నందులకుఁ బ్రతర్దనుఁ డని యుత్తరం బొసంగి దానికిఁ

కారణం బీతెఱంగున నారదుండు నుడివె. ప్రతర్దను నింట నేను
కొన్నాళ్లు పూర్వముంటి. అప్పు డొకనాఁ డశ్వంబులఁ బూన్చిన తేరెక్కి-
న న్నందుఁ గూర్చుండ నియమించి తా సారథ్యంబుఁ జేయుచుఁ జను
వాఁడు ముందట నొక్కవిప్రుం గని యాతండు వేగవంతంబైన యశ్వం
బొక్కదానిఁ బ్రతర్దనుని యాచింపఁ బ్రతర్దనుండు నగుచు నేన వెంటనే
విప్రుఁడు కోరినకోర్కె తీర్చెద నని నుడివెను. అంత నాబ్రాహ్మణుండు
తన కప్పుడ కావలయు ననఁగా రథంబునకుఁ బూన్చినవానిలోఁ గుడి
ప్రక్కఁదాఁ బూన్చిన దానిని వేవేగనొసంగి, తక్కటివానితో రథంబు
లాగించుకొనుచుండె. అంతఁ గొంతసేపటికి వేఱొక బ్రాహ్మణుఁడు
మా కెదురై ప్రతర్దనునిఁ దక్షిణ మొక యశ్వము నిమ్మని వేడఁగా మఱి
యొక యశ్వము నిచ్చి వానిం దృప్తుఁ జేసె. అంతఁ గొంత సేపటి కింకొక
బ్రాహ్మణుఁ డేతెంచి యతిశీఘ్రంబుగ నొకయశ్వమును దనకొసఁగు
మనఁగా రథమునకుఁ బూన్చియుండు వేఱొకయశ్వమును వాని కొసఁగి
వానిం బనిచె. అంతఁ గొంతవడికి మఱి యొకవిప్రుం డరుదెంచి
యాలస్యంబు లేక గుఱ్ఱ మొక్కదాని నిమ్మని మఱిమఱి ప్రతర్దనుని
వేఁడ రథమునకుఁ బూన్చిన మిగిలిన యొకయశ్వమును వాని కొసంగి
పనిచి రథమును దానే లాగికొనుచుఁ బోవుచు నసూయతోఁ గూడు
కొన్నవాఁడై యిఁక నెవఁ డేని వచ్చి నాయొద్దనుండి యే గుఱ్ఱమును
గొనిపోవునని నుడివె. ఇచ్చియు నసూయావిలసితమానసుండై ప్రవ
ర్తిలుటంబట్టి ప్రతర్దనుండు రథమును డిగిపోవు నంటిని. అంతఁ బృచ్ఛ
కుండు పదంపడి రథమును డిగిపోవువా రెవరు? అని యడుగ నందులకు
నారదుండు వసుమనసుం డని నుడివి దానికిఁ గారణంబు నిట్లు వక్కా-
ణించెను. వసుమనసునింటఁ బుష్పరథప్రయోజనము జరుగుచుండఁగా
బ్రాహ్మణులు స్వస్తివాచనార్థమై పెక్కండ్రు పోయియుండిరి. అప్పుడు
నేనును వసుమనసునింటికిఁ బోయియుంటిని. అంత వసుమనసుండు
నాకును, నావచ్చియుండిన విప్రులకును నారథముయొక్క సొంపును
జూపుచుండ నే నారథవైభవమును స్తుతించితిని. నాస్తోత్రమునకు సంత
సించి వసుమనసుండు నీవు కొనియాడినరథమును నీవ కొనిపొమ్మని
యాసుందర రథమును నా కొసంగె. అంతఁ గొన్నాళ్లకు మఱియొక
ప్రయోజనము సంభవించుడు నేనప్పుడును వసుమనసునింటికిఁ బోయితిని.

అప్పుడు స్వస్తివాచకులగు విప్రులకుఁ గనుసన్న చేసి నన్నుఁ జూచి మునివరా! మాయింటఁ బుష్పరథము నిమిత్తములయిన ప్రయోజనములలో స్వస్తివాచనికవిప్రులు లెస్సగ సంభావింపఁబడుదు రని వచించె. విప్రులఁ బరిహసించుటం జేసి వసుమనసుండు డిగు నని చెప్పితి. అంతటఁ బోక తొల్లింటి పృచ్ఛకుం డీక దిగ నర్హుం డెవ్వం డనఁగా నారదుండీక డిగిన నేన డిగవలయు. శిబి దిగఁజాలఁడు! అతఁడు నాకుఁ దుల్యుండు. తప్పక పుణ్యలోకములకుఁ జను ననఁగా నాప్రష్ట యది యేమి కారణంబున శిబి కంతమహత్త్వ మబ్బె ననఁగా వానికి నారదుం డిట్లనియె. అయ్యా! వినుము. తొల్లి యొక బ్రాహ్మణుండు శిబియొద్ద కేతెంచి "రాజా! పేరాఁకటితో నున్నవాఁడ. నా కన్నంబును వండించి యిడు మనఁగా శిబి యట్లకాక యని చెప్పి తత్కార్యంబు నెఱవేర్చుట కుద్యమింపఁగా నాబ్రాహ్మణుం డిట్లనియె. నృపాలా! నాకు నరమాంస భోజనం బిడవలయు. అందు క్షత్త్రియమాంసంబున మిగుల సంతసింతు. నీకొడుకు బృహద్గర్భుం డనువానిఁ జంపి వానిమాంసమును వండించి యన్నంబుతోఁ జేర్చి నాకిడవలయు. ఇట్లు సంసిద్ధాన్నముగావించి నన్నుఁ బిలువవలయు ననెను. అంత శిబి యాయొడఁబాటున కెంతయు వెనుదీయక యావిప్రోత్తముఁడు వచించిన చొప్పున, నన్నం బాయితంబు గావించి పాత్రంబున నునిచి దానిఁ దనశిరస్సునం దుంచికొని యావిప్రుని వెదకుచుండె. అప్పుడు శిబిసేవకుఁ డొకఁ డరుదెంచి రాజా! నీవు వెదకుచుండు బ్రాహ్మణుండేలకో యతికుపితుండై నీభాండాగారమును, నశ్వశాలను, గజశాలను, నంతఃపురంబును, నాయుధశాలను గాల్చుచున్నాఁడు. అని చెప్పఁగా శిబి యామాట కెంతయును మనస్సునఁ గినియక మొగంబున విన్నదనంబుఁ బొరయక, కడు వినయంబున నమ్మహీసురుపాలికిం బోయి యిట్లని వచించె భూసురవర్యా! నీవుకోరిన ట్లన్నం బాయితంబు నేసి కొని వచ్చితి. సంతృప్తిగ నారగింపు మని వేడుకొనఁగా నాబ్రాహ్మణుండు శిబి కార్యంబునకు విస్మయ మంది తలవాంచి యేమియు నననేరక కొంతపడికి మిన్నకుండెను. అందులకు శిబి యీబ్రాహ్మణుం డేకారణంబున నూరకయున్నవాఁడో, నావలన నేయపరాధంబు కలిగెనో యని విన్నవోయినవదనంబుతో మఱియు నావిప్రుని ననేకవిధంబులఁ బ్రార్థించి యన్నంబు భుజింపు మని వినయముతో వేడుకొనుచుండెను.

ఆవిప్రుండును గొంతతడవు పలుకకుండి తలయెత్తి శిబిం జూచి యీయ న్నంబు నీవ భుజింపు మనఁగా శిబి తమయాజ్ఞను శిరమున సహించి పుత్త్రమాంసమును భుజింపవలసివచ్చెఁగా యని మనంబున నెంతయుం గొంకక పుత్త్రునికపాలమునందలిమాంసము నన్నమిశ్రమైనదాని సునిచి కొని భుజింపఁ గడంగె. అప్పు డాభూసురుండు శిబి చేయి పట్టుకొని, రాజచంద్రా! నీవు రాగద్వేషములఁ గెలిచినవాఁడవు. కామక్రోధ ములు నీవశములు. విప్రార్థంబు నీ వేకార్యమును నైనను బూనికొని చేయుచుందువు. నీమనంబును లెస్సగ నరసితి నని కొనియాడె. శిబియు నాభూసురుని నానావిధముల సంతసింపఁజేసి తలయెత్తిచూచుటయు, మునుపు తనచేఁ జంపఁబడినయెవనిమాంసము విప్రార్థమై పచనము గావింపఁబడెనో యాబృహద్గర్భుం డనుతనకుమారుఁడు వివిధాభరణ భూషితుండై దివ్యమాల్యాంబరములఁ దాల్చి తనమ్రోల నిలువఁబడి యుండుటం గాంచె. అంత నాబ్రాహ్మణుఁడు నదృశ్యుండయ్యె. అట్లు శిబివర్తనంబును బరీక్షింప నేతెంచిన విప్రవేషధారి లోకవంద్యుఁడగు పరమేష్ఠి యని యెఱుంగుము. ఇందులకు శిబిమంత్త్రులు విస్మయపడ శిబిని సమీపించి నృపాలా! నీవేమి పడయంగోరి నీవు తెలిసిన ట్టిట్టికార్య మును జేసితి వనఁగా నియ్యది సాధుజనులవర్తనము. ఇట్లొనర్చి కీర్తిని గాని, భోగమును గాని, ధనమును గాని బొందవలయు నని తలంపు గొన్నవాఁడను గాను. విప్రార్థముగ దేనినైన నొసఁగవలయు ననుట నామనోనిశ్చయము. అని చెప్పెను. కావున నిట్లు చిత్తశుద్ధి గలిగి సన్మార్గవర్తనమున వర్తించిన శిబి తప్ప వేఱొకండు పుణ్యలోకమునకుఁ బో నర్హుండే యనినన్నారదువచనములకుఁ బ్రచ్ఛకుండు సంతృప్తింజెందె. శిబిమాహాత్మ్యము వర్ణింప నలవికాదు. అని మార్కండేయుండు సెప్పఁగా విని ధర్మపుత్త్రుఁడు మునిశ్రేష్ఠా, 'చిరంజీవియగు నీవంతయు నెఱుఁగుదువు. నీకంటెముందుఁబుట్టి చిరంజీవులైనవా రితరు లెవరయిన నున్నవారి నెఱుఁగుదువే' యని యడుగ నమ్మునీంద్రుఁ డయ్యుధిష్ఠిరున కిట్లనియె.

## ఇంద్రద్యుమ్నోపాఖ్యానము

బహుకాలము క్రిందట నింద్రద్యుమ్నుఁ డనురాజు భూలోకం బునఁ బెక్కులు పుణ్యకార్యంబు లొనర్చుటం జేసి నాకలోకంబునఁ బెక్కేండ్లు వసించి యుండె. అంతఁ గొంతకాలమునకు భూలోకంబున

నింద్రద్యుమ్నునికీర్తి మాసె నని తలంచి వేల్పు లాతనిఁ బుణ్యలోకం
బుల నుండనీయక పుడమిం ద్రోసిరి. అంత నా మహీకాంతుఁడు చిరం
జీవి నగు నాకడకు నేతెంచి, 'ఋషివర్యా, న న్నెఱుఁగుదె' యన, నే
న్నిట్లంటిని. మహారాజా! నేను బహుకార్యనిమగ్నుఁడనై యుండుటం
జేసి ని న్నెఱుఁగను. నే నాయు వృద్ధికరంబులగు రసాయనములను
నెఱిఁగినవాఁడఁగాను. నేనాత్మ కార్యముల యనుష్ఠానమే జ్ఞప్తియుంచు
కొనఁ జాలను. శరీరశ్రమముచే స్వకార్యానుష్ఠానమునకే కడంగను.
నాసంగతి యిట్లుండ నిన్ను నెఱుఁగుదు నని యెట్లందును? అని రాజు
నకుఁ జెప్పఁగా, నతఁడు వెండియు నన్నుఁ గాంచి, నీకంటె ముందుఁబుట్టి
చిరంజీవులయినవారు గలరా? యనఁగా నేను 'హిమవంతంబునఁ
బ్రావారకర్ణం బనుగూబ యొకటి గలదు. అది నాకంటెఁ జాలముందుఁ
బుట్టినది. దాని నడుగు' మంటిని. అంత నామహీపాలుఁడు గుఱ్ఱమై
నన్ను మోచికొనుచు నాయులూక ముండుచోటికి నన్నుఁ గొని
పోయి, 'యోయులూకమా, నీవు న న్నెఱుఁగుదే' యని యడు
గఁగా నాదివాంధము కొంత తడవు చింతించి ని న్నెఱుఁగ నని బదులు
చెప్పఁగా నారాజర్షి 'నీకంటె ముందుగఁ బుట్టి చిరంజీవి యైనవాఁడు
గలఁడా?' యని యాయులూకమును మఱల నడిగెను. అయ్యది కొంత
యాలోచించి యచ్చటికి ననతిదూరమున నింద్రద్యుమ్నం బనుసర
స్సున నాడీజంఘు మనుకొంగ గలదు. అయ్యది నాకంటెఁ బెద్దది.
దాని నడిగిన నా మహీపాలువృత్తాంతము దెలియఁగల దనఁగా
నా రాజు నన్నును నాఘూకమును మోచికొని యాకొలనియొద్ద కేఁగి
నాడీజంఘునిఁ బిలిచి యింద్రద్యుమ్నమహీపాలు నెఱుఁగుదే యని
దాని నడుగ నాకొంగలరాయఁడు కొంతతడవు నిమీలితనేత్రుఁడై
యాలోచించి తా నెఱుఁగ ననఁగా, మేము నీకంటె ముందుఁ బుట్టి
చిరజీవియైనది యొం డెద్దియేనిఁ గలదే యనఁగా నాబక మిట్లనియె.
అయ్యా, యీసరస్సునఁ దాఁబేలొకటి చిరజీవియైనది యున్నది. దాని
నడిగి యీయర్థ మరయుద మని చెప్పఁ, గచ్ఛపమును మాకడకు రప్పిం
చెను. అంత మేము దాని నింద్రద్యుమ్నమహారాజు నెఱుఁగుదే యని
యడుగఁగా, నాతాఁబేలు కొలనిలో నుండి తనయంగములఁ జూపి
పైకి వచ్చి కన్నీరు నించి, డెందమునఁ గలవరపాటొంది, వడవడ

వణఁకుచు స్మృతి తప్పినవాఁడు వోలె నై, యేమి! నే నతని నెఱుంగనా? ఇట నతఁడు వేయి జన్మంబు లొనరించెను. ఇతఁడు దక్షిణోదకములతోడ నొసఁగిన గోవుల త్రొక్కుళ్ల చేతనే యీ సర స్సేర్పడె. నే నీ సరస్సుననే యున్నాను. యాగములం దపారభూరిదక్షిణల తోను, నన్నపానాదులతోను నా రాజుమూఁడ్క భూసురులను దనివి నొందించిన మహనీయుం డన్యుండు గలండే? ఇతని యజ్ఞములయందుఁ బశువులను గట్టిన యూప స్తంభంబు లిప్పటికిని వెలసియున్నయవి. అమ్మహనీయుఁడు యాగదక్షిణలుగా భూసురుల కొసంగిన బహుపశు దానములచే వానిగొరిజలయం దిమిడిన భూరజంబుచేతఁ బల్లమైన యీతావు లింతకాలమునకుఁ గొల నయ్యె. ఈకొల నాకారణంబున నింద్రద్యుమ్నసర స్సనఁబడుచున్నది. ఆమహీపాలు నిన్నాళ్లకుఁ జూడఁ గంటి. నేను ధన్యుఁడనైతి. నాజన్మము సఫలమయ్యె. పుణ్యాత్ముండ నైతి. అని పెద్దయెలుఁగునఁ జెప్పుచుండఁగా నాకలోకంబుననుండి దివ్యవిమానము నమరులు పంపి యింద్రద్యుమ్నుని "నీకీర్తి భూలోకమున మాయలేదు. కావున నో రాజా! నీవు గ్రమ్మఱ నాకలోకవాసివి కమ్ము. ఈ విమాన మెక్కుము. రమ్ము స్వర్గమున నుచితస్థానమును బొందుము" అని చెప్పుచుండుమాటలు విని యింద్రద్యుమ్నుం డంత నాకంబునకుఁ జనె. కావున భూలోకమున సుకృతులకీర్తి యెందాఁక నుండునో వా రంతకాలము పుణ్యలోకవాసు లగుదురు. దుష్కృతుల యపకీర్తి యెంతకాలము పుడమిని వ్యాపించునో వా రంత కాలము నరకవాసు లగుదురు. కావునఁ బాపకార్యములందు మనస్సును జొఱనీయక యాపవలయును. పుణ్యకార్యములనే సదా యాచరింప వలయును. అంత నింద్రద్యుమ్నుండు విమానమును దెచ్చిన దేవదూతలను గొంతవేచియుండుఁ డని నన్నును, నులూకంబును మాయునికి పట్టులఁ జేర నిచ్చి విమానము నెక్కి నాకలోకంబునకుఁ దఱలి తనకు దేవతలు నియమించినస్థానమునొందె.అని మార్కండేయ మునీంద్రుఁడు ధర్మజునకుఁజెప్పె. ఈయింద్రద్యుమ్నోపాఖ్యానము నాకర్ణించి యుధిష్ఠిరుండు మార్కండేయుని "మునీంద్రా! ఇంద్రద్యుమ్ననకు మఱల నాకలోకావాసంబునకుఁ గారణంబు నీవ కావే" యని నుతింపఁగా మార్కండేయుండు నరకపతితుఁ డగు నృగమహీపాలు నుద్ధరించిన

యా వాసుదేవు నెదుట మాబోంట్లు "దివిటీలపజ్జ నుండు దివ్వెలవంటి వారు కావున వారియెదుట మేము ప్రశంసార్హులము గాము. అనఁగా నచ్చోట నున్న వారందఱును జనార్దనునివంకఁ జూచి యాతనిమహత్త్వ మఱల యొప్పునే యనిరి.

మార్కండేయుండు ధర్మరాజునకు దానాదిధర్మముల తెఱఁగెఱిఁగించుట

అంత నియమనిష్ఠుఁడగు నయ్యుధిష్ఠిరుండు తపోనిష్ఠాగరిష్ఠుండగు నాచిరంజీవిని "అయ్యా! దానము లెప్పుడు చేయవలయును ? ఎట్టివారు సత్పాత్రములు? దానరహస్యం బెట్టి?" దని యడుగఁగా మార్కండేయుం డతని కిట్లనియె. పుత్త్రులు లేనివాఁడును, బుట్టిననాటం గోలె వెలిపడ్డవారును, సర్వదా పరులయింట భుజించువారును, దమ భోజనమునకు మాత్రమె వంటఁజేసికొనువారును వ్యర్థజన్ములు. వీరు ప్రతిగ్రహమున కనర్హులు. కావున వీరు దానపాత్రులుగా రని శాస్త్రములుద్ఘోషించును. మఱియుఁ బరాన్నభోజి, యారూఢనిపతితుఁడును, నన్యాయోపహితుఁడు, పతితుఁడు, దొంగ, అసత్యవాది, పాపి, కృతఘ్నుఁడు, గ్రామపురోహితుఁడు, వేదవిక్రయి, శూద్రులయింట్లవంటచేయువాఁడు, వ్రాత్యుఁడు, కూలికిఁ బ్రేతకృత్యములు చేయువాఁడు, శూద్రస్త్రీపతి, స్త్రీపరతంత్రుఁడు, సర్పములఁబట్టువాఁడు, పరిచారకుఁడు నను పదునాలుగురకును జేసినదానము నిష్ఫలమగును. జపితలును, నగ్నియందు వ్రేల్చువారును, నధ్యయనపరులును, వేదములను నోడచే సంసార సముద్రమును దాము దాఁటుచు నితరులను నైతము దాఁటించుయోగ్యత గల విప్రులకు వృద్ధావస్థలో సర్వదానముల నొనర్చువాఁడు పుణ్యలోకములఁ బడయు. విప్రోత్తముల నానందింపఁ జేసినవానియెడ దేవతలు ప్రీతు లయ్యెదరు. సర్వకాలములయందు నుత్తమవిప్రుల యాలోచనములు వినుచుండు పుణ్యపురుషుఁడు సర్వపాపముల వీడి నాకమునకుఁ బోఁగల్గుఁ గాన నెల్లప్పుడును బితరులను, దేవతలను, భూదేవులను బూజించుచుండు నీవును బుణ్యలోకములను దప్పక యధిగమింతువు. గొంతులందుఁ గఫము కట్టుటచే వికారియై యాసన్న మృత్యువగువాఁడు విప్రార్చనంబునం జేసి సద్గతిఁ జెందు. శ్రాద్ధకాలముల యందు మిక్కిలి కష్టపడయైనను సదాచారసంపన్నులగువిప్రుల నియమించి వారిని గుడువఁ బెట్టవలయు. దుర్వర్ణుఁడు, దుర్బలుఁడు, పుచ్ఛ

డుగోళ్లవాడు, కుష్ఠురోగి, మాయావి, కుండగోళకులు, నాయుధజీవి యనువీరిని బ్రయత్నంబున శ్రాద్ధకార్యములందుఁ బరిత్యజింపవలయును. పంక్తిదూరులతోఁ గలిసిన శ్రాద్ధంబు విఫలమగు. వేదవిదుఁ డొకరుండు లభించెనేని వానితోఁ గూడ మూఁగవారు గాని, బధిరులు గాని, యంధులు గాని నిమంత్రణమునకు నుపయోగింతురు వేదాధ్యయనపరుఁడగు శ్రోత్రియుఁడు, దరిద్రుఁడు, గృహస్థుఁడు, సాయంప్రాతరగ్నిహోత్రపరుఁడు, కుటుంబి, తనకు శ్రాద్ధదినమునకుం బూర్వ మనుపకారి, మోఁకాళులకు లోనుగాఁ జేతు లుంచికొని జుట్టుజుట్టుని శబ్దము చేయక న్యాయార్జితాన్నముఁ గుడుచువాఁడు నైనయుత్తమబ్రాహ్మణునకుఁ గపిలగోదాన మొనర్చినవాఁడు సర్వపాపవినిర్ముక్తుఁడగు. ఒకనికొక్కదానము నీయవలయును, కాని, పలువుర కొక్కదాన మొసంగరాదు. అనేకుల కొక్క గోదానము చేసినచో వారద్దానిని విభజించుకొనునిమిత్త మాగోవును విక్రయింతురు. దత్తంబైన గోవు విక్రయింపఁబడెనేని దాతృప్రతిగృహీతలు మూఁడుపురుషాంతరములధోగతులఁ జెందుదురు. సంపన్నున కిచ్చినదానంబు నిష్ఫలం బగుటం జేసి పాత్రుల నేర్పఱచి సర్వదానములను దరిద్రుల కొసఁగుసుకృతి జన్మాంతరములయందు వేయి పసిండి గద్యాణములం బొందు. బలిష్ఠంబైన బలీవర్దమును దానము నొనర్చినవాఁడు కష్టములం బెడఁబాసి నాకలోకావాసి యగు. గో వీనుసమయమున లేగయొక్క శిరస్సును ముందటికాళ్లును గర్భమునందుండి వెలుపలికి వచ్చి యర మేను గర్భమున నుండునందాఁక నాగోవు పృథివి యనఁబడును. రెండువైపుల ముఖముతో నుండునట్టి గోవు నాసమయమున వేదవేదాంగపారంగతుఁడైన విప్రునకు విధియుతంబుగ దాన మొనర్చిన సుకృతి యాయావు దూడలమేన నెన్ని రోమములు గలవో యన్నివేలయుగములు నాకలోకార్చితుం డగు. ఆవుగిట్టలకును, ముక్కునకును బంగారుతోఁ దొడవును జేయించి, రత్నఖచిత శృంగములఁ జేయించి వానితో ధేనువు నలంకరించి యట్టి యావులను దానమిచ్చినవాఁ డపారగోదాన ఫలముఁ బడయు. భూదాతకుఁ గల సుకృతము లెక్కిడ రానిది. వేయి మాట లేల ? గోభూసువర్ణములదాన మొసంగిన సుకృతి ముల్లోకముల దాన మొసంగినవాఁడుగఁ బరిగణింపఁబడును. అన్నదానమహాత్త్వ

మహారంబు. దారి నడచి ధూళీధూసరితపాదయుగళుం డైన పాంథుఁ డెవ్వండేని బడలి, యన్నదాత యెవ్వం డని యరయుచుండ, నట్టివాని కాతిథ్యం బొసంగి, వాని నాదరించి, మార్గాయాసంబు సడలఁ బాదం బులు నేతితోఁ గడిగి, వానికి మజ్జనాదులకు వలసినంత నీ రొసంగి, మృష్టాన్నమును గడుపాఱఁ బెట్టి, యతఁడు భుజింపఁగా మిగిలిన యన్నంబుఁ దా భుజించి, యతిథి నేద దీర్చుకొనుటకుఁ దగిన విడిదలఁ జూపి వానిఁ బరుండఁజేసి, వానికి సుఖముగాఁ బాదంబు లొత్తుచుఁ బ్రియవచనముల నాడుచు, సేవలఁ జేయు మహనీయుఁడు యమలో కముపొంతఁ బోక బ్రహ్మలోకమును జేరును. జ్యేష్ఠానక్షత్రము నందుఁ బుష్కరమునఁ గపిలగోదానము గావించినఫలము బ్రాహ్మణ పాదోదకమునఁ దడిసియుండునంతకాలమును బితృదేవతలు తామర పాకు దొప్పలతో నా యుదకంబులం ద్రావి సంతసింతురు. విప్రు లేతెం చిన కార్య మడుగువానిచే నగ్నులు దనియు. విప్రున కాసనం బిచ్చిన నింద్రుండు సంప్రీతుఁ డగును. అన్న మిడిన బ్రహ్మ పరమానందము బొందు. అతిథి కొనర్చిన సేవ యొక్కొక్కటియు గోదానఫలము నతిశ యించు. అతిథివెంట సమరు లుందురు. అతిథి పూజితుం డగునేని యమరు లానందింతురు. లేనిచో వారు నిరాశులై గృహస్థునకుఁ గీడుఁ దలంతురు. అన్నము బ్రహ్మము. అతండు సంవత్సరము మున్నగు కాల నియమముతో వెలయుచుండు కాలదేవత. కాలము యజ్ఞము. అన్ని యు యజ్ఞమునందు సుప్రతిష్ఠితములై యుండు. కావున నన్నదానం బన్ని దానములలో నత్యుత్తమంబు. అన్నముఁ దాఁ బెట్ట లేనివాఁ డన్న దాత నతిథికిఁ జూపుచో వాని నన్నదానఫలము చెందును. కావునఁ గష్టము లెన్ని యైనఁబడి, యతిథుల కన్నదాన మొసంగుము. అతిథులు భోజ నంబునఁ దృప్తులైన యట్లగ్నులు హోమాదులచేఁ దృప్తంబులు గావు. పుణ్యలోకమున నన్నదాతలు మొట్టమొదటను, బిదప సత్యవాక్కు లును, నడుగక యే యిచ్చుదాతలు పిదపను గ్రమముగఁ బూజితు లగు దురు. ధర్మసంపాదితధనమువలన ధాన్యముం గొని యాధాన్యము నొక విప్రున కొసఁగు నేని భూదేవి వానియందుఁ బరమప్రీతయై వానికి వేఱొకజన్మమునందు మితి లేనిధన మొసంగు. దానము లొనర్చు టకు నియమితకాలము లున్నవి. ఎట్లం టేని వినుము. గజచ్ఛాయాపుణ్య

కాలమునందు శాస్త్రోక్తశ్రాద్ధము గావించి విధ్యుక్తదానము లిచ్చుచో నాఫలమును వాఁడు పదివేలకల్పము లనుభవించు. ఆపన్నమయములయందు విప్రులకు వలసినంత వస్తుసామగ్రుల నొసఁగుచో నానఁ గలుగు సుకృతంబు నావయై వానిని సంసారసాగరమును దాఁటించు. ఆదాత మోక్షసిద్ధిం బొందు. సర్వకాలములయం దితరసమయములకంటె నిసు మడింతలయిన ఫలమును దాత ననుభవింపఁజేయు. వసంతాదిఋతువుల సంధికాలమునం దొనర్చినదానమువలని ఫలంబు పదియంతలై దాత నుప కరించు. వత్సరసంధికాలమున సామాన్యకాలమునం దొనర్చినదానము కంటె నూఱింతలై దాత కనుభవం బొసఁగు. వృషభసింహవృశ్చికకుంభ సంక్రమణకాలములు హరిపదము లనఁబడును; మిథున, కన్యా, ధను ర్మీనసంక్రమణములు షడశీతిసంజ్ఞతో వెలయు; మేషతులాసంక్ర మణములు విషువనామకములై పరగు; దక్షిణోత్తరాయణకాలములు కర్కాటకమకరసంక్రమణకాలము లనందగు; ఈకాలములయం దొన ర్చినదానంబు లుత్తరోత్తరము నతిశయించునిఫలము నొసఁగు. సూర్యచంద్ర గ్రహణకాలములయం దొసఁగినదానఫలమును గణింప నేరికిని నలవి కానేరదు. మఱియుఁ బూర్వజన్మమున భూదాన మొసంగనివాఁడు భూమిఁ బడయనేరఁడు. వాహనదాన మొసంగనివాఁడు మఱుసటిజన్మ మునందు వాహనాదులం బడయలేఁడు. మఱియు విప్రుల కేయేవస్తు వులను దానమిత్తురో వారు పిమ్మటిజన్మములలో నాయావస్తువులను సులభోపాయమునఁ బడయుదురు. సంసారతరణోపాయంబు దానం బుకంటె నన్యంబు లేదు. కావున దానమహిమను, దానపాత్రస్వరూప మును, దానయోగ్యకాలమును నోపాండవజ్యేష్ఠా! నీకు సవిస్తరముగ వచించితి ననఁగా నయ్యుధిష్ఠిరుం డద్దాని విని సంతుష్టస్వాంతుండై వెండియు మార్కండేయు నిట్లని యడిగెను. ఓమునివర్యా! నీవచో మధురరసాస్వాదనంబున మనం బెంతయుఁ దనివిఁ జెందదు. నాకు యమలోకమునకు మానవలోకమున కెంతదవ్వో, యేయుపాయంబున యమలోకబాధలను మానవులు దప్పించుకొనఁగలరో? దీని నానతీ యవే యన నాతపస్వి వనవాసియైనపాండుపుత్రున కిట్లని చెప్పం దొడఁగెను.

యమలోకమునకును భూలోకమునకు నెనుబదియాఱు వేలామడ
నములదూరము గలదు. యమలోకమునకుఁ బోవుదారియందుఁ ద్రాగు
టకు నీరు లేదు. అలఁతఁ దీర్చుకొనుటకు నీడ నిచ్చుచెట్లు లేవు. వాస
యోగ్యము లగు నిండ్లులేవు. ఆకాశముకంటె బయ లది అది ఘోరా
టవియై మానవులకుఁ జొరశక్యంబు కాకుండు. యమదూత లాదుర్గ
మకాంతారంబునందు సమస్తజీవులను నడపించికొని పోవుచుందురు.
ఆమార్గమున నడచిపోవువారి కష్టము లింతింతన రానివి. శ్రేష్ఠులైన
విప్రుల కనేకదానముల నిచ్చినవారు సుఖులై పోవుదురు. అశ్వదా
తలు గుఱ్ఱములఁ నెక్కి పోవుచుందురు. గొడుగుల నిచ్చినవారు గొడు
గుల ధరించి పోవుదురు. అన్నదాత లాకఁటి మలమలమాడక తృప్తులై
పోవుదురు. వస్త్రదాతలు వస్త్రములందాల్చి పోవుదురు. బంగారమును
దానమిచ్చినవారు సర్వాభరణభూషితులై పోవుదురు. ఆమార్గమునఁ
బోవు భూదాతలు సకలసుఖముల ననుభవించుచుఁ బోవుదురు. సస్యదా
తలు కష్టములు లేనివారుగను, గృహదాతలు విమానముల నెక్కియు,
దప్పికి నీటి నొసంగినవారు దప్పిక లేకయును, దీపదాతలు వెలుతురు
గల దారియందును, గోదాతలు సర్వపాపవినిర్ముక్తులుగను, సుఖులును
నైచనుచుందురు. మఱియును మాసోపవాసులు హంసలచేఁ గట్టఁబడిన
విమానముల నెక్కియును, నాలుగురాత్రు లుపవసించినవారు నెమళ్ళచే
లాగఁబడిన రథములందును జనెదరు. ఏకభుక్తవ్రతమును మూఁడుదిన
ములు సలిపినవారు సుఖులుగఁ బోవుదురు. దానములఁ జేసినవారును,
వ్రతాదిపుణ్యకార్యముల నాచరించినవారును యమలోకమునందుఁ
బుష్పోదక యను నేటియొడ్డున విడిదలఁ జూపఁబడుదురు. ఆయేటియుద
కము తియ్యనై యుండును. ఆసుకృతు లానీరు ద్రావుచు నందు సుఖు
లుగ నుందురు. పాపము లాచరించినకష్టాత్ములకు దుర్గంధిపూయమును
(=చీమును) ద్రావ నిత్తురు. వా రనుభవింపవలసినకష్టము లెన్నియేని
యుండును. విధివిహితములగు పూజలచే విప్రుల నర్చించినవా రెచ్చో
టను సుఖు లగుదురు. కావునఁ బితరులకార్యములయందును, దేవతా
కార్యములయందును యత్నపూర్వకముగ సద్బ్రాహ్మణుల నర్చింప
వలయు. మండుచున్న యగ్నియందు హుతమైన హవ్యముంబోలె
సద్బ్రాహ్మణునకు దత్తవస్తు వనంతఫలము నిచ్చు. శౌచనియమము గల

సద్బ్రాహ్మణు లలిగిరేని యెంత చెఱుపైనఁ జేయంగలరు. వారి కాయుధము వారికోపమే కావున యత్నపూర్వముగ వారి నేటేటి వారికి సపర్య లొనర్చి మెప్పించు టెంతయు మేలగు ఈకథ నంతయు నైమిశారణ్యవాసులు విని యెంతయేని సంతుష్టులైరి. దీని వినినవారికి దుఃఖములు సంభవింపవు. భయములు గలుగవు. క్రోధ ముత్పన్నము గాదు. అన విని ధర్మరాజు మార్కండేయుని శౌచ మనఁగా నెద్ది? విప్రునిఁ బరిశుద్ధపఱచునది శౌచమే కదా. మునీంద్రా! దానిని వివరింపవే యని యడుగ మార్కండేయుం డతని కిట్లనియె.

శౌచము మూఁడువిధములుగ నెగడు. అది వాక్శౌచ మనియుఁ, గర్మశౌచ మనియు, జలశౌచ మనియుఁ బేర్కొనఁబడును. అట్టి త్రివిధశౌచములతోఁ గూడినవాఁడయి ప్రతిదినము సాయంప్రాతఃకాలములయందుఁ దప్పక సంధ్యోపాసనాతత్పరుఁడై వేదమాత నాఁబడు గాయత్రిని జపించు ద్విజన్ముండు గాయత్రిచేఁ బూతుఁడై సకలపాపములం దొలంగి పుణ్యలోకములఁ బొందఁగలఁడు. గాయత్రీజపమును జేయునట్టి భూసురుండు సర్వభూమండలమును దానముగాఁ గొన్నను బవిత్రుండే యగు. సూర్యాదిక్రూరగ్రహములు వాని నేమియుఁ జేయవు. అంతియకాక యవి వానియెడఁ జల్లనిచూపులు చూచుచు వానికి శుభము లొసంగును. మహాకాయులగు క్రూరస్వభావముగల రాక్షసులు వానికిఁ జేటొనర్ప వెఱుతురు. విప్రులకు యాజనమువలనఁ గాని, వేదాధ్యాపనమువలనఁ గాని చెడుగులను గొనినఁగాని కలుగు పాతకంబులు వాని నంటవు మండుచున్న నిప్పెంత పవిత్రమో వాఁ డంత పవిత్రుండు. నిత్యపరిశుద్ధుఁడు. వేదముల నేరకపోయినను, పామరుండైనను,విప్రుఁడు నివురుగప్పిననిప్పువంటివాఁడు. శ్మశానాగ్నివోలె దూష్యుఁడు గానేరఁడు. ఇఁక వేదాధ్యాపకులును, సంస్కారయుతులును నగు విప్రుల మహత్త్వమును గూర్చి వేఱుగఁ జెప్పవలయునే! విప్రుండు విద్వాంసుఁడైనను నవిద్వాంసుఁడైనను స్వామహత్త్వమున దైవముపంటి వాఁడే యగును. చిత్ర విచిత్ర ద్వారములతోను, బచ్చలతోరణములతోను, నెత్తైన మేడలతోను, గోపురములతోను విరాజిల్లుపురములు, విప్రులు లేనిచోఁ దేజోహీనములై యుండు. వేదాధ్యయనపరులు, సదాచారసంపన్నులు, జ్ఞానులు, నిత్యతపస్వులునగు విప్రులతో

నుండు పల్లెగ్రామమును, నరణ్యమైనను బట్టణ మని వ్రాసి కొన్కు. ఆపల్లెను బుణ్యతీర్థమనియుం, బుణ్యాశ్రమమనియు వచింతురు. ధర్మమార్గమునం బ్రజలం బాలించు నుత్తముండైన రాజును, దపస్వి యైన విప్రుని నెదు ర్కొని విధ్యుక్తముగం బూజించినవారికిం బాపంబులు వెంటనె తొలంగును. పుణ్యతీర్థస్నానము, పవిత్రులయిన సజ్జనులసంకీర్త నము, సాధువులతో మాటలాడుట యను నీ మూంటిని బెద్దలు మిక్కిలి కొనియాడుదురు. సాధుజనసంపర్కమునం బవిత్రమైన నోటిమాట లనెడి పుణ్యజలంబులందుం బెద్దలు తమయాత్మలను ముంచి పావను లగుదురు. ఇట్లు గురూపదేశమున సదాచారసంపత్తి గల్గుటచేం జిత్త ము శుద్ధమై యింద్రియములను విషయప్రదేశములను బొందనీయక యణంచి వశవర్తనములుగం జేసికొని తపస్సుచేయువానిచెంతకుం బాపములు చేరవు. ఇట్లు తపస్సుచేం జిత్తము మాలిన్యరహితము గానిచో వాండు సన్న్యసించి దండమును ధరించినను, మౌనమును బొందినను, జడలు దాల్చినను, దలం బోడిసేసికొన్నను, నారచీరలు ధరించినను, వ్రతము లొనర్చినను, బుణ్యతీర్థముల స్నానముచేసినను, నగ్నిహోత్రములయందు నాజ్యాదిహవిస్సులను హోమము చేసి నను, నరణ్యవాసముచేసినను, నుపవాసములచే శరీరమును శుష్కింపం జేసినను నన్నియు నిష్ప్రయోజనము లగు. చిత్తమును శుద్ధపఱ చుట కష్టము గాని యుపవాసాదు లెంత మాత్రము కష్టములు కావు. మనస్సుచేతను, వాక్కుచేతను, గర్మచేతను, బుద్ధిచేతను నేపురుషుం డెవ్వనియందును బాపముం దలంపండో సర్వభూతకృపాళుం డగు. నాపురుషుండు గృహమునం దుండియుం దపస్వి యని ప్రఖ్యాతిం గాంచు. వ్యసనములు గాని వ్యాధులు గాని యతనిని సమీపింప వెఱచును. నిప్పున వేయించిన విత్తనము లెట్లు మొలవనేరవో, యట్లు స్వజ్ఞానా గ్నిచేం గాల్పంబడిన జననమరణక్లేశంబులు వానిని బొందనేరవు. సర్వ భూతములయం దుండు పరమాత్మయే తనయాత్మ యని యాత్మైక్యాను సంధానమును గావించిన పురుషుండు శోకాదులం బొందండు. వానికిం గావలసిన పదార్థం బీప్రపంచమున నొండెద్దియు లేదు. వాండు దేనినిం గోరండు. వాండు గురుశుశ్రూష సలిపి, యాతనియనుగ్రహంబున ననేకశ్రుతిస్మృత్యాధారములఘూలమున నిర్ణయింపంబడిన పరబ్రహ్మ

యాథార్థ్యము ననుభవముచే నెఱిఁగి యా యనుభవమువలనఁ గలిగిన విశ్వాసముచే నితరంబు లన్నియు మాయ యని భావంబున దృఢత నేర్పరచుకొనుము. ఆదృఢవిశ్వాసయుక్తమైన పరబ్రహ్మజ్ఞానమే మోక్ష మనఁబడును. విశ్వాసము లేక యెల్లపురుషుఁడు సంశయాత్మకుం డగువాఁ డుభయలోకభ్రష్టుఁ డగును. వాఁడు దావానలమునకు భయపడు పురుషునివలె వేదము లనఁగనే భయపడు నని జ్ఞానవృద్ధులు సెప్పుదురు. వేదార్థమును బాగుగ నెఱింగిన మహనీయుం డిప్పుడు నావచించిన తత్త్వము నెఱింగియుండు. ప్రాణాయామముచేఁ బ్రణవము నుచ్చరించి పొందఁగల పరబ్రహ్మయాథార్థ్యమును హేతువాదములచే విమర్శించు పురుషుండు పరబ్రహ్మమును బొందుటకు నేరని సాధనముల వ్యత్యాసముచేఁ జలించినబుద్ధి గలిగి కల్యాణమును బొంద నేరఁడు. కావున మిక్కిలి యాయాసముతోనైనను వేదప్రమాణార్థమును దెలియవలయును. ఇయ్యదియే వేదపరమరహస్యము. ఆవేదప్రమాణార్థమును దెలిసిన మహనీయుండు వేదమూర్తి యనఁగా వేదస్వరూపుఁ డనఁబడును. వేదముల యాథార్థ్యము నెఱుంగుచో నాత్మయాథార్థ్యము దానికి వేఱుగా నుండనేరదు. వేదతత్త్వము నాత్మతత్త్వమును నొకటియే యని యెఱింగినవాఁడు విదితవేద్యుం డనఁబడు. కావున వృథా హేతువాదములను వదలి శ్రుతిని, స్మృతిని నాధారభూతములుగాఁ గొనుము. అట్లు చేసితివేని నీకు వేదోక్తమైన యాయుస్సును, గర్మఫలమును, మహిమయు విస్తరిల్లుచుండును. ఇంత సాధించుటకుఁ జిత్తము శుద్ధి యగుట ముఖ్యము. చిత్తశుద్ధి గల్గి తపస్సు చేసినవాఁడు స్వర్గముఁ బొందును. దానము లొసంగినవారు భోగములనుభవింతురు. గంగాది పుణ్యతీర్థముల స్నానమాచరించినవారికిఁ బాపములు నశించును. జ్ఞానసంపాదనచేఁ బురుషుం డవ్యయంబైన మోక్షమును బొందు. మోక్షము శాశ్వతపదవి. దానిఁ బడయుటకే పుణ్యాత్ములు తీవ్రతపంబుల నాచరింతు రని చెప్పిన విని పాండుపుత్త్రుండు మృకండుపుత్త్రుం జూచి మునీంద్రా! యాత్మతత్త్వం బూహించుటకు నైత మింతకష్టమగునే? ఇప్పు డీప్రసంగవశంబున నే నించుకఁ దెలిసితి. బహుకాలతపస్వివి, చిరంజీవి వగు నీ వెఱుంగనిదియుం గలదే? రాజర్షిచరిత్రంబులఁ గొంత విని నామనం బాసఁ గొనుచున్నది. ఇక్ష్వాకు

వంశమునఁ బుట్టిన కువలాశ్వుం డనువానికి దుంధుమారుఁ డను నామ మెట్లయ్యె? వివరించి చెప్పు మనఁగా నమ్మునీంద్రుం డన్నరేంద్రున కిట్లనియె.

### మార్కండేయుండు ధర్మరాజునకుఁ గువలాశ్వచరిత్రము చెప్పుట

పూర్వ ముదంకుం డను బ్రహ్మర్షి మరుభూములలో నాశ్రమంబు నిర్మించికొని శ్రీమన్నారాయణు నుద్దేశించి యనేకవత్సరంబులు ఘోర తపంబు గావింప నందులకు మెచ్చి భగవంతుం డొకనాఁ డాతనికిఁ బ్రసన్నుండయ్యె. అప్పు డాయుదంకుండు దేవాదిదేవుం బ్రత్యక్షమునఁ గాంచి యిట్లని నుతించె. దేవా! సకలప్రాణికోటిసహితమైన యీ ప్రపంచమును నీవ సృజించితివి. ఈసకలమును విరాట్స్వరూప మగు నీదేహము. ఇంద్రాదిదేవత లెల్లరును, సనకాదిమహర్షులును నీగుణంబులను సర్వదా ప్రశంసించుచుందురు. ని న్నుపాసించుచుందురు. నీ వానందించినచో జగంబంతయు స్వస్థతఁ బొందు. నీవు కనలిన జగం బెల్ల నల్లకల్లోల మగును. నీవు యోగులగుసాధువులభయంబుఁ బోగొట్టు దిట్టవు. వామనమూర్తివై బలిని మూఁడడుగులుభూమి వేఁడి రెండుపాదంబుల ముల్లోకంబుల నాక్రమించి మూఁడవపాదము నిడుటకు బలిని స్థల మడిగినాఁడవు కావే? అసురుల భంజించి సురల కభయప్రదానము చేయు వాఁడవు కావా నీవు? సర్వభూతముల యుత్పత్తిస్థితిలయములకుఁ గారణ భూతుండవు నీవ. నిన్నుఁ బూజించి కదా సురలు సుఖమున నున్నారు. అని వినుతింప నారాయణుం డానందభరితుండై 'ఉదంకా! నీతపంబునకు మెచ్చితి. నీస్తోత్రములచే నానందించితి వరము వేఁడు మనఁగా నుదంకుండు భగవద్వాక్యశ్రవణమునఁ దపఃక్లేశంబు తీర నిట్లనియె. పరమపురుషా! భవద్దర్శనంబునం జేసి ధన్యుండనైతి. ఇఁక వరము లేల? యనఁగా భగవంతుం డుదంకుభక్తి కెద మెచ్చి నీకు వరము లొసఁగఁ బ్రత్యక్షమైతి. వరములు వేఁడుము. ఒసఁగెద ననఁగా నుదంకుండు కేలుజోడించి దేవా! నాచిత్త మనవరతము సత్యమునందును, ధర్మమునందును, దమమునందును నెల్లప్పు డుండుటకును, నీపై నిశ్చలభక్తి గలిగియుండుటకును ననుగ్రహింపవే యన నార్తార్తిభంజనుం డుదంకున కావరముల నొసంగి యాతనితో మఱియు నిట్లనియె. నాయనుగ్రహంబున నీవు దేజోవంతుఁడవై లోకహితార్థంబుకొఱకు నొకకార్యంబుఁ

జేయవలయు. అది యేది యంటివేని వినుము. దుంధుండను రాక్షసుండు ఘోరతపస్సుం జేయుచున్నవాఁడు. వానితపస్సిద్ధేరచో లోకములకుఁ జేట్ట గలుగు. వాఁడు చావకున్న లోకములకుఁ జెఱుపు తప్పదు. వానిచావున కుపాయంబును జెప్పెద. ఇక్ష్వాకువంశమున బృహదశ్వుండనురాజుపుట్టి బ్రహ్మోత్తరంబుగాఁ బ్రజాపాలనంబు చేయుఁ గలండు. వాఁ డతిధార్మికుఁడు. వాఁడు సర్వధర్మముల నెఱింగినవాఁడగును. వానికిఁ గువలాశ్వుఁ డను కుమారుఁడు జనించు. నీవు దుంధువును బరిమార్చుటకుఁ గువలాశ్వునిఁ బ్రేరింపవలయు. ఆసమయమున యోగమహిమచే నాశక్తిని నాకువలాశ్వునందుఁ జొనిపెద. నీవు దుంధువుపైకి నారాజును బ్రేరేపించి యారాజుచే దుంధువును జంపించి లోకమును నిష్కంటకము గావించి కీర్తిం బొందుము. అని యుదంకు నొప్పించి భగవంతుం డదృశ్యుం డయ్యె. అట నిక్ష్వాకుం డయోధ్యను రాజధానిగాఁ బ్రజల ధర్మంబునఁ బరిపాలించి తనకుమారుఁడు శశాదునియందు రాజ్యభారము నుంచి దేవలోకావాసము నకుంబోయె. శశాదునకుఁ గకుత్స్థుఁడును, వాని కనేనసుఁడు, వానికిఁ బృథువును జనించిరి. పృథువున విష్వగశ్వుండును, వాని కద్రి యనువాఁడును, నద్రికి యువనాశ్వుఁడును, యువనాశ్వునకు శ్రావుఁడును సుతులై పుట్టిరి. శ్రావునకు శ్రావస్తుఁ డనువాఁ డాత్మజుండై తనపేర శ్రావస్తి యనునగరంబు నిర్మించి విఖ్యాతిఁ గాంచె. శ్రావస్తునకు బృహదశ్వుండనుపుత్త్రుండు పుట్టె. బృహదశ్వునకుఁ గువలాశ్వుండను సుతుండై జన్మించె. వాని కిరువదియొక్క వేగురు పుత్త్రులు పుట్టిరి. వారు రాజోచితసర్వవిద్యలను నేర్చి సర్వసుగుణములకు రాసులై వెలసిరి. బృహదశ్వుండు తనపుత్త్రుండైన కువలాశ్వుసచ్చరిత్రంబునకుఁ జిత్తమం దలరి, వానియందు రాజ్యభార మునిచి తపోవనంబున కేగ నిశ్చయించియుండె. దాని నెఱింగి యుదంకుండు బృహదశ్వుపాలికిం బోయి రాజేంద్రా! తపోవనమునకుఁ బోవుట కేల యుద్యుక్తుండ వైతివి. నీధర్మపరిపాలనము నం జేసి యరణ్యములలో నాశ్రమములఁ గావించికొని బ్రహ్మనిష్ఠయందున్నడు మే మేకొఱంతయు లేకయున్నాము. రాజునకు ధర్మమున రాజ్యమును బాలింపఁ గలుగుసుకృతమునకంటెఁ వనంబున కేఁగి తపస్సు నాచరించుటచేఁ గలుగు సుకృత మెక్కు డగునే? ప్రజలను ధర్మంబునఁ

బాలించుటే క్షత్రియుల కుచితధర్మ మని తొల్లిటిరాజులు నిర్ణయించి యున్నారు. మాయాశ్రమమునకు సమీపమున సాగరతీరమునందు సైకతమయంబై బహుయోజనవిస్తృతంబై యుజ్జాలకం బను ప్రదేశ మొండు గలదు. ఆ యిసుకప్రదేశమునందు దుంధుం డనుదానవుఁడు యెరికిని దుష్ప్రవేశంబై గొప్ప దగు నొకగుహవంటిబొక్కఁ గావించి దేవతలకు వినాశకరంబైన దారుణతపస్సును జేయుచుఁ బరుండి యున్నాఁడు. వాఁడు దేవతలచేతఁగాని, దానవులచేతఁ గాని వధ్యుఁడు గాఁడు. వాఁడాయిసుకగుహనుండి సంవత్సరమునకొకపరి యొకనిట్టూర్పు విడుచు. ఆనిట్టూర్పునకు వాతావరణ మంతయు విషపూరితములైన పొగ లెగయును. మిణుగురులు నిండును. అగ్ని భయంకరమైన మహాజ్వాలతో వెలువడును. ఆనిట్టూర్పు వేగమునకు భూప్రదేశమునుండి దుమ్ము రేఁగి సూర్యమండలంబుఁ గప్పు. భూమి ధరాధరములతో గడగడ వణంకు. ఆకారణంబున మాకు నాయాశ్రమవాసంబు కష్టమై యున్నది. వానిపై దాడివెడలి వానిం జంపి లోకకల్యాణ మొనర్పుము. వానిఁ జంపుప్రయత్నము గావించువానిలోనికి శ్రీమన్నారాయణుండు తన తేజస్సునుజొప్పించు. ఇట్లునాతో నయ్యాదిదేవుం డానతిచ్చినవాఁడు. కావున నోబృహదశ్వుఁడా! నీవు విష్ణుతేజోవిరాజితుండవై యుగ్రమూర్తియైన యారక్కసునిఁ బరిమార్పుము. అనఁగా బృహదశ్వుం డుదంకున కంజలి గావించి యిట్లనియె. మునిచంద్రా! నామనవి నాలింపుము. నేను విరక్తుండనై తపస్సు గావింప వనంబునకుఁబోవ నిశ్చయించి యస్త్రసన్న్యాసముం గావించితి. కావున మఱల నాయస్త్రములతో యుద్ధమునకుఁ బూనుట ధర్మవిరుద్ధంబు. నాసకలరాజ్యధురంధరత్వము నాపుత్త్రుండును, సుగుణయుతుండును నగుకువలాశ్వునియం దారోపించితి. వాఁడు నా కేకపుత్త్రుం డయ్యును దా బహుపుత్త్రులతో నున్నవాఁడు. కావునఁ గువలాశ్వుండు తనకుఁ బుత్త్రులు బాసటఁ జేయ నీయాజ్ఞను శిరసావహించి యాయసురఁ బరిమార్చువాఁడు. వాఁడు మిక్కిలి శౌర్యవంతుఁడు. విశేషించి ధైర్యశాలి. నీకుం బ్రియంబు సేయువాఁ డని కువలాశ్వుం బిలిచి మునివర్యునుద్దేశంబుఁ దెలిపి వాని దుంధుపును వధింప నియోగించి యుదంకునను జ్ఞఁగొని బృహదశ్వుండు తపోవనంబున కరిగె.నన నఁగా ధర్మనందనుం డీవృత్తాంతంబు విని మార్కం

డేయు నిట్లడిగెను. మునీంద్రా! దుంధు వెవనిపుత్త్రుండు? వాని కింత బలిమి యెందుండి కలిగె? వానికి సమానులగు బలవంతు లెవ్వరును నున్నట్లు కానరాదు. వానివిధంబును దెలియం జెప్పు మనఁగా నారాజర్షి వర్యునకు బ్రహ్మర్షివర్యుం డిట్లని చెప్పంబోడంగె.

నారాయణుండు మధుకైటభులం జంపుట

గతించినకల్పముచివరిభాగమునందుఁ జరాచరము లగు ప్రాణి సమూహమంతయు నశించి బ్రహ్మాండ మంతయు నేకార్ణవంబుగ నుండ శ్రీమన్నారాయణుం డనేక యోజనములు విస్తరించి దివ్యతేజంబున వెలయుచుండు శేషుండను పాన్పుపైఁ బరుండి యోగనిద్రఁ బోవుచుఁ బీతాంబరమును దాల్చి శ్రీవత్స మను మచ్చచే నొప్పారుచుఁ గిరీట కౌస్తుభాదులు ధరించియుండ మధుకైటభులను నిద్దరు రాక్షసు లాసర్వ కారణకారణాత్మకుని లోకమహేశ్వరుం గాంచిరి. వెంటనే యా లోకారాధ్యుని నాభికమలమునందు సుఖనిద్ర నున్న పరమేష్ఠిని, వేద మూర్తిని, నాలుగు మోముల వేల్పుం గని విస్మితులై భయము కలుగు నట్లు క్రూరకర్మమును జేయఁ దొడంగిరి. అంత బ్రహ్మ మేల్కాంచి వారిని జూచి భీతిల్లి, తనయునికిపట్టైన నారాయణుని నాభిపద్మనాళంబుఁ గద లించుటయు యోగనిద్రఁ జెందిన నారాయణుండు మేల్కాంచి తన యెదుట నున్న మధుకైటభులం జూచి వారు వచ్చినకార్యం బడిగి యిట్లనియె. అయ్యలారా! మీరాయెడం గడుం బ్రీతుండ నైతి. వర ములు వేడుఁ డనఁగా, వారిద్ద ఱందులకు నవ్వి 'యోహోహో! నీవా మాకు వరము లొసంగువాఁడవు! నీవరము లటుండ నిమ్ము. నీకు వల యునేని కోరుము వరములను. వానిని నీకు మే మొసఁగెద' మనిరి. అది భగవంతుఁ డాలించి విని యట్లయిన నేను గోరువరమును దప్పక నా కిం డని లోకహితార్థంబుగా మీ రిరువురును నాచే వధ్యులుగా వరము నిం డనఁగా వా రిట్లనిరి. మేము నవ్వులకైన నసత్య మాడము. నీకోరినవర మొసంగితిమి. కాలవశంబున సంభవించినదాని ననుభవింపక యెవ్వారికిఁ దీరదు. అయిన నొక నియమముఁ జేసెదము. దానికి నీవు నొడంబడవలయును. అదెద్ది యన నిర్జలం బగుచోట మమ్ము వధింప వలయు. నీకుఁ బుత్త్రత్వంబుఁ గాంతుము. ఇది మాకు నీవొసంగవలసిన

వరము లనఁగా భగవంతుఁ డందులకు వల్లెయని, వారల వధించుటకు నిర్జలప్రదేశం బెందుం గానక వారికి తనతొడయందుఁ గూర్చుండఁ బెట్టి చక్రంబున వారితలలఁ దఱిగెను. దుంధుండు వారిపుత్త్రుండు. తనతండ్రుల విష్ణుండు వంచనమెయి వధించె నని మనంబున నీసుఁ బూని యాహారంబును వదలి నరములు వెలువడఁ గృశించి యొంటికాలిపై నిలిచి యనేకవత్సరంబులు తపం బొనర్చి బ్రహ్మనారాధింప నాతండు వీనితపంబునకు సుప్రీతుండై వానికిఁ బ్రత్యక్షం బగుడు వాఁడు తనకు దేవదానవగంధర్వోరగములచేఁ జావులేమిని వరముగాఁ బడసె. బ్రహ్మయానతిని బొంది దుంధుండు మరలి వచ్చి విష్ణువు తనతండ్రుల వధించుటఁ దలపోయుచు సమయము చిక్కినప్పు డెల్ల దేవగంధర్వుల నిడుములఁ బెట్టుచుండును. ఇప్పుడు వాఁడు సముద్రతీరంబునం దిసుక ప్రదేశమునం దుజ్జాలక మను స్థల మునికిపట్టుగాఁ జేసికొని లోక హానికరంబు లగు కార్యములఁ జేయుచుండె నని మధుకైటభులవధ ప్రకారంబును, దుంధునివర్తనంబును జెప్పి మఱియు నమ్మార్కండేయ మునీంద్రుండు ధర్మపుత్త్రునితో నిట్లనియె. ఉదంకుఁ డట్లు బృహదశ్వుచే నియుక్తుండైన కువలాశ్వునిఁ బ్రోత్సహించి దుంధునిపైకి యుద్ధము నకుఁ బ్రేరేపింపఁగాఁ గువలాశ్వుండు తన యిరువదియొక్క వేవురు కొడుకులతో యుద్ధోన్ముఖుండై లోకహితార్థమై రణభేరి మ్రోగించెను. అప్పుడు కొన్ని శుభసూచనములు పొడమె. దేవదుందుభులు మ్రోగెను. చల్లనిగాలి వీచెను. దేవతలు కువలాశ్వదుంధువులసమరసన్నాహముఁ జూడ విమానారూఢులై యాకసంబు నలంకరించిరి. అంతఁ గువలా శ్వుండు విష్ణుతేజఃపుంజమున నావృతుఁడై దుంధునివాసం బైన సైకత ప్రదేశంబుఁ జేరి దుంధు వగుపడునందాఁక సైకతంబుఁ ద్రవ్వఁ దన కొడుకుల నియోగించె. అంత వా రేడహోరాత్రము లాయిసుక యంతయుఁ ద్రవ్వి వాలుకాంతర్హితుండైన ఘోరాకారుం గాంచి నిదురించు చున్నవాని ననేకాయుధములతోఁ గొట్టిరి. వాఁ డా దెబ్బలకుఁ గనలి లేచి తన్ను మర్దించుచున్న వారియాయుధంబుల నెల్ల నొక్కపెట్టున మ్రింగె. ప్రళయకాలవహ్నివంటియగ్నికణములఁ దన్నుఁ గొట్టువారిపై నుమియుటయు వా రెల్ల రందు మ్రందిరి. కపిలకోపాగ్నిభస్మీభూతులైన సగరపుత్త్రులువోలెఁ గువలాశ్వపుత్త్రులలో దృఢాశ్వ,కపిలాశ్వ, చంద్రా

శ్వులనువారు ముగ్గురు దక్క నందఱును వానియుమిసినయగ్నికణంబులచే దగ్ధులైరి. అంత దుంధుపు నిదురమేల్కాంచి, రెండవకుంభకర్ణుఁడో యనునట్టి ఘోరాకృతితోఁ బైపైఁబడి వచ్చుచుండఁగాఁ గువలాశ్వుండు విష్ణుతేజంబు తన్నావహించియుండుటచే వానికిఁ గొంతగైన జంకక వాఁడుమియుచుండు వహ్నికణములను యోగమహిమచేఁ జల్లార్చి, వానిదేహమునం దుండి బయలువెడలి వచ్చుచుండు తేజస్సారము నంతటిఁ బీల్చి వాని నిర్వీర్యుం గావించినను వానియాటోపంబు తఱుగకున్నంత, వానిపై బ్రహ్మాస్త్రముం బ్రయోగించె. ఆయస్త్రానలవేగంబున వాఁడు నీఱై మ్రందె. నాటంగోలెఁ గువలాశ్వునకు దుంధుమారుం డను నామాంతరము నెగడె. వెంటనే యింద్రాదిదేవతలును, నారదాదిమహర్షులును గువలాశ్వునెదుటఁ బ్రసన్నులై నిలిచిరి. కువలాశ్వుధైర్యస్థైర్యములకును, నుదంకువచనమున నుండినవానివిశ్వాసమునకును, ముగ్గురు తప్ప వానియిరువదియొక్కవేగురుపుత్త్రు లెల్లరును దుంధుపుచే హతులైనను జలింపకున్నందులకును, వాని యపారశౌర్యమును దేవతలు కొనియాడి, వరములు వేఁడు మని దేవతలును ఋషులును జెప్పఁగా నామహీపాలుండు విప్రులకు దాన మిచ్చుటయందుఁ దనకు నత్యాసక్తియు, నరాతులు దన్ను గెలువరామి, శ్రీమహావిష్ణువుతోడి సార్వకాలికసఖ్యము, సర్వభూతములయెడఁ దన కద్రోహభావము సదా ధర్మమునం దాసక్తి, సదా స్వర్గలోకవాసము నను నీవరములం గోరెను. అంత దేవతలును మహర్షులును వానికోర్కులను ననుగ్రహించిరి. అంత నానరపాలుం డుదంకాదిమహర్షులు తన్ను మఱింత కొనియాడి యాశీర్వచనములను గురియఁగా వాని నన్నిటిని శిరంబున వహించి నిజాశ్రమంబులకేఁగునట్లు వారికి సెలవొసంగెను. అంత సేవకులు విజయభేరిని మ్రోగింప, వందిమాగధ వైతాళికులు తనయపారశౌర్యమహిమలను బొగడుచుండఁ గువలాశ్వుఁడు విజయచిహ్నములతో నయోధ్యాపురముఁ బ్రవేశించెను. కువలాశ్వుపుత్త్రులలో దుంధుపువలన మ్రందినవారు పోఁగా మిగిలిన ముగ్గురిమూలమున నిక్ష్వాకువంశంబు వృద్ధియయ్యె. కువలాశ్వునకు దుంధుమారుఁ డను పేరు గల్గుట కిదియ హేతువు. విష్ణుమహిమచే విరాజితమై లెస్సఁగా వృద్ధి నొందిన యీ

కువలాశ్వునిచరిత్రమును వినిన రోగులై యున్నవారు నీరోగు లగుదురు. అల్పాయుష్కులు దీర్ఘాయుష్కు లయ్యెదరు. దరిద్రులు ధనికు లగుదురు. అపుత్రకులు సత్సంతానమును బడయుదురు. అసుఖులు సుఖవంతు లయ్యెదరు. అని యిట్లు మార్కండేయుండు ధర్మరాజునకు ధుంధుమారోపాఖ్యానమను కువలాశ్వరాజర్షి చరిత్రమును వినిపించిన: బాండవాగ్రజుండు లెస్సగానాకర్ణించి యాఋషిచంద్రునకు వెండియు నిట్లనియె.

మునివర్యా! లోకమునందు సూర్యచంద్రులు, వాయువు, పృథివి, యగ్ని, మాతాపితలు, గురువులు, పతివ్రతలగు వనితలును గౌరవార్హులుగదా! వనితలు తాము పుట్టిపెరిగినగృహముల వీడి, స్వోచితపురుషుని వివాహమాడి, యన్నచింత మాని, త్రికరణశుద్ధిగాఁ బతియె దైవంబనిభావించి, మనోనిగ్రహముఁజేసి, పతికి సకలసపర్యలఁ గావించుచు, వాఁడెట్టివాఁడైనను నసూయపడక, యీసరించుకొనక, వానియెంగిలి గుడుచుచు వానితల్లిదండ్రులను, దేవతాతిథులను, భృత్యులను భరించుచుఁ గుటుంబముయొక్క మేలును దలంచుచు, శాస్త్రోక్తమగు నాచారమునఁ బ్రవర్తించుట సామాన్యమా? కావున నాతిరున జీవితకాలంబులఁ బుచ్చినవనితల పాతివ్రత్యసచ్చరిత్రలను వినవలతు. మఱియు మాతాపితరులలోఁ గుమారునివిషయమైనక్లేశ మెవరికి నెక్కుడైయుండు? పుత్రుం డట్టితల్లిదండ్రులయెడ నాచరింపవలసినవిధమును వినవలతు. హీనయోనిజాతుండు ధర్మమేవిధమున నడుపఁగలఁడు? దీని నంతయు నాకుఁ దెలియ వివరింపుము. అని యడుగఁగా మార్కండేయుం డిట్లనియె. ధర్మపుత్రా! పుత్రునిఁ దల్లి పదినెలలు గర్భమునమోసి ప్రసవాది సమయములందుఁ బ్రాణాపాయస్థితిని బొంది యెవ్విధముననో వానిం గని, యప్పటినుండి వాఁడు స్వేచ్ఛఁ జరించువఱకు చీమచిటుక్కుమనిన వానిక్షేమమునకు లోపమగలుగునో యని నిరంతర మాసంతాన ధ్యానముననే యుండు తల్లియొక్క శ్రమ మెక్కువ గానఁ దల్లిదండ్రులలో దల్లి యే విశేషపూజనీయ యని కొందఱు తలంతురు. తండ్రి తపస్సులను జేసి, దేవతాతిథిసత్కారములకు వలయు ధనమార్జించి, కుటుంబపోషణమునం దనవరతజాగరూకత్వమును వహించి పతివ్రతయగు స్వభార్యయందు సత్సంతానముఁ బడయుదుగా యనియు,

సంతానమును బడసి నానావిధముల వారివృద్ధినిమిత్తము పెక్కు-పాట్లు పడుటంజేసి తండ్రియే యెక్కుడని కొందఱిమతము. కాని, నా కిరువురును బుత్త్రులకు సమానులే యని తోఁచెడిని. మాతా పితరులు పుత్త్రుం గని కసికందనీక పెరిగి పెద్దవాఁ డెన్నఁ డగునా యనియు, నట్లు పెరిఁగి విద్యల నేర్చునా యనియు; విద్యల నేర్చి కీర్తిని సంపదను సంపాదించి లోకమునఁ బ్రఖ్యాతుఁ డగునాయనియు, ధర్మాచరణశీలుఁ డగునా యనియు బహువిధంబుల వానిమేలు గోరుచుందురు. తదనుగుణముగఁ బుత్త్రుఁడును బెఱిగి పెద్దవాఁడై కీర్తిమంతుఁడై, ధర్మబుద్ధి గలిగి మాతాపితరులయెడఁ బ్రీతివిశ్వాసగౌరవములు గలిగియుండుట వానికిఁ గడు శ్రేయము. వాఁడు వారివాంఛల నీడేర్పవలయును. ఏపురుషుఁడు తన సత్ప్రవర్తనంబుచేఁ దల్లిదండ్రుల మనస్సు నానందింపఁజేయునో వాఁడే సత్పుత్త్రుం డనఁబడు. వాఁడు రెండులోకములయందును మేలుగాంచు. మఱియు విధ్యుక్తముగ వివాహితయై పతిసేవానిరత యగు సతికి యాగాదిసుకృతకర్మఫలము లరచేతివై యుండును. నీయడిగినవి యన్నియు వివరించునిమిత్త మొక్కపురాతనేతిహాసమును వచించెద. అందిపిరెుల్లను నీకుఁదేట పడగలవు. అని మార్కండేయుఁడు పాండవాగ్రజున కిట్లని చెప్పనారంభించె.

మార్కండేయుఁడు ధర్మజునకు పతివ్రతామహిమంబుఁ జెప్పుట

ధర్మనందనా! పూర్వ మొక్కమునిపల్లెయందు సాంగవేదాధ్యయనపరుండైన కౌశికుం డనువిప్రుం డొకఁ డుండె. ఆతం డొక్కనాఁడు సమీపమున నున్ననదియందు స్నాతుఁడై శుచియై వచ్చుచు నెండవేడిమిని సహింప లేక కాళ్లు పురపురం బొక్క, తల చుఱ్ఱుమనుచుండఁగా వేవేగ నడచి దారియందున్న యొకవృక్షంబునీడను గూర్చుండి వేదాధ్యయనంబు సేయుచుండె. ఆచెట్టుపై నాకులనడుమ నావిప్రునకు సూటిగా నొకకొక్కెర కూర్చుండియుండి రెట్టపైవ నయ్యది యాకౌశికుశిరస్సునఁ బడెను. అందుల కావిప్రుండలిగి క్రోధారుణితలోచనుండై యాకొక్కెరను జుఱచుఱం జూచుడు నయ్యది వానికోపాగ్నికి భస్మమై నేలం గూలె. దానిని గని కౌశికుండు పశ్చాత్తప్తుండై, అయ్యో! నేనెంతతప్పుఁ జేసితి? అజ్ఞానంబున నీకొక్కెర నా

శిరస్సునఁ బడునట్లు రెట్టవైవ దానిం గని నేను జూచుడు నయ్యది నశించె. నేఁ గోప మెంత సైరింప నయితి నని వగచుచుఁ బల్లియకేతెంచి మధ్యాహ్నం బగుడు విప్రగృహంబులందు భిక్షాటనంబునకై వెడలె. అంత నొక్కగృహస్థునిల్లు సొచ్చి "భవతి భిక్షాం దేహి" యనఁగా నాగృహిణి వీనిం జూచి భిక్షఁ దెచ్చుటకై పాత్రశోధనంబు గావించు చుండ, నాపుణ్యవతిభర్త యెచ్చటికో పోయియున్న వాఁడలసి యాకఁటితో నింటికి నేతేర, వానికాళ్లు గడిగి, సేదఁ దేర్చి, వాని స్నాతుం జేసి, దేవతార్చనమునకును నాచమనాదులకు వలయు నుదకంబు నిచ్చి పుష్పఫలాదుల నమర్చి, దేవతానివేదనము కాఁగా, వానిం గుడువం బెట్టి, కాలుసేతులు గడుగుటకు వానికి నీరొసంగి, వానిపాదం బులు దుడిచి, మెత్తనిపాన్పువైచి శయనింపఁజేసి, కొంతసేపు వానికా ళ్లొత్తుచుండునంతలో భిక్షకై వేచియున్న బ్రాహ్మణుఁడు స్మరణకు రాఁగా వేగంబున లేచి భిక్షం గొని కౌశికుని కెదుట నిల్చెను. అంతఁ గౌశి కుఁడు కాలవిలంబమునకుఁ గనలి యిట్లనియె. వనితా ? న న్నుండు మని చెప్పి భిక్ష నిడక యింతకాలయాపన నేల యొనర్చితివి? అప్పుడు పొమ్మనినఁ బోయి యుందును. ఇది నీకుఁ దగ దన బ్రాహ్మణి యిట్ల నియె. విప్రోత్తమా! వినుము. నీకు భిక్షఁ గొనితేరఁ బాత్రశోధనంబుఁ గావించుచుండ నెందే నేఁగియున్న నాభర్త కడు డస్సి రాఁగా నాతనికి వలయు నుపచారాదులచే సేదఁ దీర్చితి. అన్నపానముల నమర్చితి. అతనిసేవ లొనర్చుచుండ నీవు స్మరణమునకు రాఁగా వేవేగ భిక్షఁ దెచ్చితి. ఇయ్యది నాధర్మంబు. నాకుఁ బతికంటె దైవం బన్యంబు లేదు. ఆవ్రతాచరణమునం దున్నదాన. నాపతిసపర్య లన్నియుఁ దీర్చి పిదప దేనినైనఁ జేయుదు. దానంజేసి యింతతడ వయ్యె నని సాంత్వనపూర్వక వచనములతోఁ గౌశికునకుఁ బ్రతివచన మీయఁగా వాఁ డందులకు సహనముఁ జూపక "యోహో! నీభర్త కన్న నీకు బ్రాహ్మణు లింత యెల్లిదమైరో? నీకు నీభర్త యెక్కువయు, విప్రులు కొఱంతవారును నైరే? బ్రాహ్మణులు వహ్నితుల్యు లన వినవో! వారు కినిసిన లోక ముల కుపాధిఁ గల్గింతురు. దేవతల కధిపతి యగు నింద్రుండును వారికి విధేయుండు. ఇంక మానవులమాట వేఱుగఁ జెప్పవలయునే! పెద్దల వలన బుద్ధులు వినమింజేసి మదంబున న న్నదరించితివి." అని పరుష

వాక్యముల నాడెను. అంత నాపరమసాధ్వి భిక్షమున కేతెంచిన యావిప్రుం డత్యంతకోపనుండై యుండుటం గని యతని కిట్లు మఱు వచనముం బల్కెను. ఆర్యా! కోపమును వదలుము. న న్నేల నీ వట్లు చుఱచుఱం జూచెదవు. నీకోపాగ్నిదగ్ధ మగుటకు నేం గొక్కెరం గాను. బ్రాహ్మణమాహాత్మ్యంబు నే నెఱుంగుదు. ఒకవిప్రుం డలిగి కడలి జలంబు లపేయంబులుగం జేయండే. వేఱొకభూసురుండు వాతాపి యను రక్కసు జీర్ణించుకొనండే? మఱియొక బ్రాహ్మణుండు దండ కము నరణ్యంబుగాం జేయండే! వారు దేవతుల్యులు. నిగ్రహానుగ్రహ సామర్థ్యము గలవారు. నేను వారల కవజ్ఞ నేనాండును జలుపను. నా ధర్మంబు నాకుం దెలియు. ఇంతేకాక నేను వారి నెప్పుడు పూజింతు. నే నొనర్చిననేర మిందెద్దియు లేదు. నాకుం బతిభక్తియు పరమవ్రతంబు. పెఱకర్జంబు లముఖ్యములు. నీకుం బతి యంత యెక్కువయ్యెనే యని యంటివి. నాకుం బతియ దైవంబు. పతిసేవ యుత్తమధర్మము. కావునం బతిసేవ గావించి ని న్నాదరింప భిక్షం గొనివచ్చితి. నాపతివ్రతా మాహాత్మ్యంబునం జేసి కొక్కెర నీకోపాగ్నిభస్మమైన సంగతి నెఱిం గితి. కామక్రోధలోభమోహమదమాత్సర్యము లను నీయాఱును మనుజున కంతశ్శత్రువులు. ఆశత్రువులం గెలిచి, యింద్రియములను విషయప్రసక్తములు గాకుండ వశపఱచుకొని, శాంతిం దాల్చి, యప కారికి నైతము కీడెన్నక, సకలభూతములయందును గృపాళుండవై, సత్యవాదివై, యాచార్యసేవాతత్పరుండవై, యజన, యాజనాధ్య యనాధ్యాపన, దాన, ప్రతిగ్రహము లను షట్కర్మముల నియతమై నాచరించుచు, ధర్మబుద్ధి గలిగి, వేదాధ్యయనమున నలసుండవు గాక, సర్వభూతములయందును దనయందును వెలుంగుచుండు పరమాత్మ యొక్కండే యని భూతముల నాత్మోపమ్యబుద్ధితో భావించువాండే సర్వోత్తముం డనంబడు భూసురుండు. బ్రాహ్మణులకు శాంతి, సత్యము, నార్జవము, నింద్రియనిగ్రహము నను గుణంబులు వేదనిర్ణీతధర్మము లని పెద్దలు సెప్పుదురు. అయినను, ధర్మసూక్ష్మము దురూహము. కావున లెస్సగా నాలోచించి బ్రాహ్మణోచితకర్మము నాచరింపుము. నీవు కేవల ఛాందసుండవై వేదాధ్యయనపరుండవై ధర్మముల నెఱుంగనివానిం బోలె నున్నవాండ వని యూహింతు. ధర్మయాథార్థ్య మరయం గోరెద

వేని మిథిల కరిగి యం దుండు ధర్మవ్యాధుఁ డను మహనీయునిఁగొడఁ దెలియుము. వాఁ డెల్లప్పుడును బితృపరతంత్రుఁడు, సత్యవాది, జితేం ద్రియుఁడు, సర్వధర్మముల నెఱింగినవాఁడు. నీకు సకలధర్మబోధఁ గావించు. వనిత నగు నే నింతఁ జెప్పఁదగదు. అయినను బ్రస్తావవశ మున నింత సెప్పితి. సైరింపుము. వనితలు వివేకరహితులు. వారియప రాధము లెన్ని యున్నను క్షమింపవలయు. ధార్మికులును వారితప్పుల సైరింతురు. అని చెప్పఁగాఁ గౌశికుం డాపుణ్యాంగనవచనంబుల విని పరమశాంతుఁడయి యామె కిట్లనియె. ధర్మశీలా! నీవివేకసహితోపన్యా సంబునకు మెచ్చితి. నీవచనము లెల్ల నాకు నిశ్శ్రేయససాధనంబులు. క్రోధమును త్యజించితి. మిథిల కిదె తఱలుచున్నాను. ధర్మవ్యాధు నందుఁ గాంచెద. ధర్మసూక్ష్మములను వానిసద్బోధలచే నెఱింగెద. నీకు శుభం బగుఁగాత! పోయివత్తు నని భిక్షం గొని తద్గృహంబు వెడలి నే నింత బ్రాహ్మణధర్మ మెఱుంగనైతినే యని వగచి యిదె మిథి లకుఁ బోయి ధర్మవ్యాధుం జూచెద. వానిసద్బోధచే ధర్మరహస్యముల లెల్ల నెఱుంగుదు నని నిశ్చితమనస్కుండై మిథిలం గూర్చి తఱలెను.

కౌశికుండు తత్త్వం బుపదేశంబు గొనునిమిత్తము ధర్మవ్యాధునొద్ద కేఁగుట

అట్లు కౌశికుండు దినప్రయాణంబులు సలిపి యనేకమున్యాశ్రమ ములను, నదీనదములను, గ్రామపట్టణములను గడచని మిథిలానగర ము జేరెను. అయ్యది విప్రుల సంతతయాగకర్మలతోఁ గూడినదియుఁ, దమతమకులోచితధర్మముల నాచరించుబహుజనంబులతో సంకీర్ణమును, నున్నతప్రాకారములతోను, గోపురములతోను, లోఁతుగల యగడ్తల తోను విరాజిల్లుచు, నిష్కామకర్మాచరణపరాయణజనక రాజపాలితంబు నునై యొప్పారుచుండె. అంతఁ గౌశికుండు విప్రుల నడిగి ధర్మవ్యాధుఁ డున్నచో టెఱింగి యచ్చోటకుఁ బోఁగా నప్పుడు ధర్మవ్యాధుండు నానావిధమృగమాంసఖండముల నంగడిం బఱచి విక్రయించుచుండఁ జూచి, యంగడిచుట్టును కొనునిమిత్తము జనము మూఁగియుండు టెఱింగి, మిక్కిలి యేవఁ గొన్నచిత్తముతో వానిని సమీపించుట కిష్టపడక, దూరమునం దొక్కచో నుండె. అంత ధర్మవ్యాధుండు బ్రాహ్మణునిరాకఁ దన యోగబలంబున నెఱింగి వానిని డగ్గఱి యభి వాదనంబు గావించి, స్వాగతం బడిగి, పతివ్రతాంగనావచనంబున

గాదే తా మీ యెడ కేతెంచుట యనియు, వాని రాక దా మున్నెఱింగి యుండుటయుఁ దెలిపి యాకౌశికునితో. "తా మిచ్చోట నుండ నేల? మాగృహంబునకుఁ బోవుదము రం" డని యాహ్వానించి వానిం దోడ్కొని తనయింటికిఁ జనియె. కౌశికుండును ధర్మవ్యాధుని యెఱుకకు మెచ్చి, పతివ్రతమాటలం దలపోయుచు నిది రెండవ యాశ్చర్య మని వింతఁ గొనుచు, వినయముతో ధర్మవ్యాధునిపిఱుందన వాని యిలు సొచ్చి యతండు భక్తిపూర్వకంబుగఁ గులోచితసత్కారంబులు నొసంగ, నతఁడు వాని సత్కారంబునఁ గొని వానితో నిట్లనియె. ఓవ్యాధవర్యా! నిన్ను నే నొక్కటి యడిగెద. సువిచారుండవై చెప్పుము. జీవహింస యుచితమే? అయ్యది మిగుల నిందితము గాదే? నీవు సకలధర్మముల నెఱింగినవాఁడ వని తెలిసినది. అటులయ్యును నీ వీఘోరకర్మమున కెట్లొడంబడితివి? నీవంటి ధర్మవిదున కీకార్యంబు తగ దని తలంచెద ననఁగా నాధర్మజిజ్ఞాసువునకు ధర్మజ్ఞుం డగు వ్యాధుం డిట్లనియె. ద్విజోత్తమా! చెప్పెద వినుము. విప్రులకుఁ దపస్స్వాధ్యాయబ్రహ్మచర్యసత్యవాక్యములును. రాజులకు దండనీతి, వైశ్యులకుఁ గృషి పాశుపాల్యవాణిజ్యములును, శూద్రుల కుత్తమసేవయు వేదవిహితములైనధర్మము లెట్లో మాకులంబున కీకార్యమట్లు. దీని విడవరాదు. మఱియును, మమ్మేలుప్రభు వగుజనకుండు నిజకులోచితధర్మము నుజ్జగించి యన్యధర్మప్రవర్తకులను వేగులవలన నెఱింగి తాఁ బాలించుసకలజనులను నిజధర్మాచరణంబున నియోగించు వానియాజ్ఞ యనుల్లంఘనీయము. ఉల్లఘించినవారు శిక్షితు లగుదురు. తనపుత్త్రులైనను, దుర్వృత్తు లగుచో నాతండు చండశాసనుండై వారిని దండించు. రాజులు తమధర్మమును బాలించినం గాదె వారిజనులును ధర్మమును విడనాడక క్రమంబున నడతురు. మారాజు పాలించుదేశంబునఁ గులోచితధర్మమును వదలి యితరధర్మాచరణుం డొక్కం డేని యుండఁడు. కావున నేనును నాకులధర్మము నాచరించుచుందును. వంశక్రమాగతం బైన యాచారంబు ననుష్ఠించు నాయెడఁ గినియకుము. ఇది మాకు విధివిహితధర్మము. ఇటులుండియు నాచేతులతో జీవహింసఁ జేయను. ఒరులు సంపి తెచ్చిన మృగమాంసమును వెలకుఁ గొని దానిని దగినవెల కమ్మి యాధనంబున నేను

జీవింతు. నూాంసము నే భుజింపను. కడు ముదుసలులైన నాతలిదండ్రులకు సేవచేయుదు. యథార్థంబుఁ బల్కుదు. పరుల యైశ్వర్యంబున కసూయ పడను. నాశక్తికిఁ దగినంత దానమొనర్తు. దేవతలఁ బూజించి యతిథు లకుఁ బెట్టి తచ్ఛేషాన్నమును గుడుతు. భృత్యులను బోషింతు. ఋతు కాలమునఁగాని వెఱకాలములయందు భార్యాసంగమము గావింపను. భగవన్నిమిత్తమైన యుపవాసవాసరములం దుపవసింతు. నక్తములఁ గావింతు. వ్రతినై కాలము గడపుదు. నన్ను నుతించువారియెడను దూషించువారియెడను నొక్కరూపై యుందుదు. ఆయిరుతెగలవారిని నానందంబునఁ బొడఁగాంతు. ఇట్టి వర్తనంబులం జేసి హీనకుల స్థుండ నయ్యును శీలవంతుఁ డనఁబడితి. నీవడిగినహింసవిషయమై యుత్తరంబుఁ జెప్పవచ్చి యింతచెప్పితి. ధర్మము దెలియఁగోరి నా యొద్ద కేతెంచినవాఁడవు గావునఁ దత్స్వరూపంబుఁ జెప్పెద నాక ర్ణింపుము.

## కౌశికునకు ధర్మవ్యాధుండు ధర్మంబు బోధించుట

మానవుఁడా! సమస్తప్రాణులయెడఁ గృపాళుండవై మెలంగవల యు. ఉన్నకొలది భూతములకన్న దానము సేయవలయు. సహన మన్నింటియం దుండవలయును. ఉపకారులకుఁ గృత మెఱింగి ప్రత్యుపకృతి గావింపవలయు. ఇంద్రియములను విషయములయందుఁ బ్రవేశింప నీయక త్యాగబుద్ధిఁ జేయవలయును. అరిషడ్వర్గంబుల జయింపవల యును. ధర్మనిరతుండవై యుండవలయును. అసత్యము లాడుట వీడవల యును. అడుగకున్నను నొరులకుఁ బ్రియముసే సేయఁ దలపెట్టవల యును. ఇచ్చకంబు లాడినవారియెడ ముదంబును, సత్యమును నప్రి యంబును నాడినవారియెడ ద్వేషంబును జూపరాదు. ద్రవ్యమునం దతిమోహము నుంపరాదు. ధర్మము నుజ్జగింప కుచితకర్మము నాచరింప వలయును. అట్లొనర్చుటచేఁ దనకు శుభములొడఁగూడకున్నను నధర్మ మును బూనరాదు. మఱియు మేలొరులకుఁ జేయునప్పుడు ధర్మపరిశీలన మావశ్యకము. అపకారికిఁ బ్రత్యపకారము చేయరాదు. అది యసాధు కృత్యము. ఒరులకుఁ జెఱుపును జేయఁబూనినవాఁడు దురాలోచన ముచేఁ దానే చెడును. ధర్మమున శ్రద్ధ వదలి, ధర్మాత్ముల ధర్మమును

బరిహసించువాఁ డవశ్యంబును జెడు. అట్టి దుర్మార్గులశరీరంబులు గాలిచే నింపఁబడిన సారరహితమైన తిత్తులే యగును. మూర్ఖుఁడు తా నొనర్చినకార్యములను బగలు సూర్యుని స్వరూపము వెల్లడిలఁ గావించు తీరున సర్వదిక్ప్రదర్శనంబుఁ జేసి యాత్మప్రశంసాపరాయణుం డగు. కావున వాఁడు లోకమునఁ బ్రకాశింపఁడు. సిరి లేకున్నను సద్గుణరాశి యుండెనేని సుకృతవిద్యుం డవశ్యంబు తేజోవంతుఁడై వెలుఁగు. ఇతరుల నిందింప రాదు. తన్నుఁ దాను బొగడుకొన రాదు. ప్రమాదంబున నేరంబుఁ జేసె నేనియు నిట్టిదాని నికఁ జేయ నని పశ్చాత్తాపంబుఁ బొందుటచే సగమును, నాభావంబున సత్కార్యాచరణముచేఁ బెఱసగమును పాపము నశించు. ఇవి పెద్దలు సెప్పు వాక్యములు. సర్వపాపములకు లోభమోహములు మూలము. కాబట్టి యత్నమున నైన వానిని విడనాడవలయును. గడ్డిచే మూతఁ గావింపఁబడిన బావులం బోలెఁ గొందఱు పాపులు ధర్మజ్ఞులవలెఁ దోఁచుచుందురు. వారిని శిష్టుల యాచారంబునను వర్తనంబునను దెలియవలయు ననఁగాఁ గౌశికుండు ధర్మవ్యాధా! శిష్టాచారం బన నెట్టిది? యనఁగా ధర్మవ్యాధుం డిట్లనియె. వేదవిధ్యుక్తము, శాస్త్రోక్తము యోగిజనులాచరించునది యని శిష్టాచారము మువ్విధమై వెలయు. యజ్ఞములు సేయుట, దానము, తపశ్చరణము, వేదములఁ జదువుట, సత్యమాడుట, యరిషడ్వర్గముల తెఱువునఁ బోకుండుట, ఋజుమార్గప్రవర్తనము, నాచారమును రక్షించుట, నాచార్యసేవాపరత్వము, నింద్రియవశీకరణము, సకలప్రాణులకును హితుఁడై యుండుట, యహింస, పుణ్యతీర్థస్నానము, సర్వవిద్యల నేర్చుట, శాంతి, శౌచము, దీనులయెడ ననుగ్రహము, కులోచితధర్మాచరణము, నసూయ లేమి, నిత్యసంతోషము, ప్రియము నెప్పుడు పల్కుట యనునివి శిష్టాచారములు. హింసారాహిత్యము, సత్యసంధత, ఈగి, శమమును బై యన్నింటిలో నుత్తమంబులు. బుద్ధిమోహములం జేసి ధర్మమునందుఁ జూపోపమి గల్గి, మర్యాదఁ ద్యజించి, క్రూరకార్యములం జేయు పాపులును, దుర్మార్గులగునట్టి పాపులును జెడుదురు. ఆచార్యుల సేవించి, జ్ఞానమును బడసి, ధర్మాత్ముల సేవించి, ధైర్య మను తెప్పతోఁ గామక్రోధలోభమోహమదమాత్సర్యాదు లను మహామీనములతో నిండినదియు,

విషయము లను జలజంతువులతోఁ బూర్ణంబైనదియు, నగు మోహమనెడి మహానదిం దాఁటి పుట్టుక యను వెనుఁగోట నతిక్రమించి మోక్ష సామ్రాజ్యమును బొందుము. పాపియైనవాఁడు రాగద్వేషములకు లోఁబడి రెండులోకములకును గాక చెడిపోవును. సమస్తవిద్యలను నేర్చి సుగుణములతోఁ గూడి, తమ కులధర్మములయం దాసక్తచిత్తులైన వృద్ధులయాచారము ననుష్ఠింపవలయును. పరుషము లాడుట వదలవల యును. సత్యమునే యాడుచుండవలయును. ప్రియముల నాడుట శ్రేయస్కరము. ధర్మమును వదలక కర్మాచరణంబును జేయుచు, ఫల మునకై వేచియుండక, కర్మపరిపాకమున నగుఫలము నెఱుంగుచు, శుభఫలమున కగుసుఖమును నశుభఫలమునకు దుఃఖమును బొందక, రెండుఫలములయందును నేకమనస్కుఁడయి, సర్వమును విధి ప్రేరిత మని భావింపవలయును. మఱియును శక్తికొలఁది దానములు నేయుచుఁ బరమార్థచింతయందే చిత్తమును రమింపఁజేయువారు జ్ఞానులై సర్వవిధము లగులోకాచారములం గనుచు నిశ్శ్రేయస మునుం బొందఁగలరు. ఇదియే శిష్టాచారస్వరూపమును. ఆమార్గంబునఁ బోవు సత్ప్రవర్తకుఁడు వర్తనంబును. ఓమునీంద్రా! నీవు మొట్ట మొదట నావృత్తిం జూచి యిది హేయమైనది కాదో? యని ప్రశ్నించి యుంటివి. తన్నిమిత్తమై సమాధాన మింత చెప్పవలసివచ్చినది. దాని నట్లుండ నిమ్ము. హింస యిట్టి దని వివరించి చెప్పుట కెవ్వరును నేరరు. దానిప్రకారంబు నాకుఁ దెలిసినంత వివరించెదను వినుము.

### ధర్మవ్యాధుండు కౌశికునకు హింసాస్వరూపంబుఁ జెప్పుట

ప్రాణికోటియెల్లను బూర్వజన్మకృతకర్మవశంబునఁ జచ్చుచుండు. అవి పొలియుటకు ఘాతుకుఁడు నిమిత్తమాత్రమే కాని వేఱు గాదు. ఓద్విజోత్తమా! మేము విక్రయమునకుఁ గారణభూతులము గాము. వానిని భక్షించువారికి దోషంబు గలుగును. ఓషధులు, తీఁగలు, ఫల ములు, కాయగూరలు, పశువులు, మృగములు, పక్షులు ననునివి యెల్ల మానవులకు భుజింప యోగ్యము లని వేదవాక్యములు చెప్పును. మఱి యు నౌశీనరియైన శిబినృపాలుండు తనమాంసమును గోసియిచ్చి యిం ద్రాగ్నులను సంతసింపఁ జేయఁడే? పరికింప నియ్యది హింసగానేరదో? దాన నతండు పుణ్యలోకములఁ జెందఁడే? రంతిదేవుం డనుదినము రెం

రెండువేలపశువుల వధించి వానిమాంసంబున నతిథులసంతర్పణంబుఁ జేయుండే? ఆమహిమచే నాతనికి సాంప్రయశశ్చంద్రికలు గలుగవే? వేదవిదు లగు విప్రోత్తములు యాగములయందుఁ బశుహింసఁ జేసి తత్కర్మంబులఁ బుణ్యలోకావాసంబులం జెందరే? మఱియు నాపశువులు మంత్రపూతంబులగుటంజేసి వానికిని సుత్తమగతులు గల్గును. అగ్నులు మాంసంబున నధికసంతృప్తిఁ జెందునని వేదములు ఘోషించును. అగ్నులు మాంసాశులుగా రేని మాంసము నిత్యాశనము గాకుండు దేవతలకార్యములయందును, శ్రాద్ధాదిపితృకార్యముల యందును మాంసమును విప్రులచేఁ గుడిపించుట పరిపాటి యయ్యెను. ఋతుకాలమునందు మాత్రము వివాహితయైన భార్యతోడి సంగమము నపేక్షించుచుఁ, బెఱకాలములయందును బరస్త్రీ పరాఙ్ముఖుఁడగు విప్రుండు సదా బ్రహ్మచారి యనునట్లొప్పునో యట్లు దేవపితృకార్యంబులయం దుపయోగింపఁబడిన మాంసశేషంబును భుజించినను వాఁడు మాంసాశనుండు కాఁడని వేదములుచాటుచున్నవి మఱియును వ్యవసాయ మంతటి యుత్తమజీవన మొండెద్ది లేదని సర్వలోకములవారొప్పికొనెదరు. అందు నేల దున్నునప్పుడు నాగేటికఱ్ఱునకుఁ దగిలి చచ్చుజీవరాసుల నెన్నఁ దరమే? పాటింపఁగ వ్యవసాయవృత్తి జీవహింసాతత్పరతగాదే? అది లోకోత్తర మెట్లయ్యె? పేయేల? నడుచునెడఁ గూర్చుండునెడ, బరుండునెడ దేహ మొరయుటంజేసి యెన్నియేని జీవములుచచ్చు. జ్ఞానులునైత మీపాపమునకుఁ దప్పి వర్తింపలేరు. పృథివి, అప్పులు, ఆకాశము జంతుజాలములచే నిండియుండుటంజేసి జ్ఞానముననో యజ్ఞానముననోయెల్లవారును జీవహింసఁ జేయకుండలేరు. పరిశీలింపగా జీవహింసారహితుం డొక్కండును లేఁడు. 'అహింసాపరమోధర్మ' యను వ్రతపరాయణు లాహారార్థముగఁ బర్ణములను, శాకములను, ఫలములను గొనునప్పుడు వేనవేలుజంతువులు వారికిఁ దెలియకుండఁగనే బలు లగుచుండుటఁ దెలియరో? వారును జీవహింసఁ జేయువారలే. ఆఫలాదులలోను, శాకాదులలోను జీవకళ లేదో? ప్రాణులు పరస్పర మొకటి యింకొకటిని భక్షించి జీవించుట దైవవిహితంబైనది గావున హింసను నివారించుట దుస్తరంబై యుండు. హింస నోపినంత యత్నముతో వర్జించుట యహింస నాఁబడు. కావున వీని నన్నింటిని నాలోచించి

చూడఁ గులధర్మమును వదలక చేయుచుండుట పథ్యంబని తోఁచె
డిని. పూర్వజన్మకృతకర్మంబుచేఁ బ్రాప్తమైన కులోచితజీవనంబు ఘోరం
బైనను విడువఁదగదు. సత్కర్మం బెట్లు సమూహమునకో దుష్కర్మం బెట్లు
తొలఁగునో యను తలంపు నిరంతరంబును సమూహమున కొనర్చు చుండ
వలయును. అట్లొనర్చునెడ పాపహేతువు కానేరదు. పూర్వము ముని
శాపముచే రాక్షసుం డైన కల్మాషపాదుం డనుక్షత్రియుండు రాక్షసోచిత
మనుష్యమాంసాశి గాఁడే? దానం జేసి యాతనికి బాపంబు సమకూడెనే?
ఎవ్వరికేని వేదవిహితంబైన యనుచితకర్మ మైనను యయ్యది యతనికిఁ బాపంబుఁ
గానేరదు. కావున నేనును స్వీయవంశవిహితమైన వృత్తిని వదలకున్న
వాఁడ. ఈశ్వరాసక్తుండ నయ్యును నేను సత్యమునే పలుకుదు. దాన
ముల నొసఁగుదు. గురువులను శుశ్రూషలఁ జేయుదు. స్వధర్మానువర్తినై
యుండుదును అని మున్న చెప్పియుంటిని గదా? లోకమునఁ గొందఱు
గొప్పవంశమున జనించినవారయ్యును సద్గుణముల కాలవాలములైనను
నతిఘోరకర్మములనాచరింతురు. ఘోరకృత్యముల నొనర్చియు లజ్జింపరు.
శత్రుమిత్రులు సమీచీనపక్షపాతు లయ్యు నొండొరుల లెస్సగఁ జూడరు.
చుట్ట లయ్యును నొకరి కొకరు కొంత యసూయపడుదురు. కొందఱు తమ్ము
గొప్పవారమని యెంచుకొని గురువులను నైతము దూషింతురు. ఇట్లు
లెచ్చుతగ్గులు మెండుగాఁ గానంబడుచుండును. బాగుగ నాలోచించి
దుర్గుణములకు లోను గాక వంశాగతధర్మములు నడుపవలయు. ఏది
ధర్మమో యెయ్యది యధర్మమో దాని నిరూపించుట గహనంబై యుండును.
ధర్మమును వేదప్రమాణంబులవలనను బెద్దలయాచారంబులవలనను బాగుగఁ
బర్యాలోచన చేసి నిర్ధారణ సేయవలయు. సత్యము త్తమము పుణ్యమూ
లము. అనృత మధమము పాపమూలము. అని యెల్లవారలు నెఱుంగు
దురు. అందును సూక్ష్మవిశేషంబు గలదు, ప్రాణాపాయమునను వివాహ
కార్యములను నాడినయనృతంబు సత్యప్రాయంబు. వేయేల? భూతహి
తార్థమైన బొంకు సత్యమేయగు. భూతద్రోహముగఁ బల్కిన సత్యవార్త
యేయయ్యును బొంకేయగు. ధర్మసూక్ష్మ మివ్విధమై నానాప్రకారంబుల
వర్తిల్లు. పురుషుండు తనతొల్లింటిజన్మమందలి పుణ్యపాపవిశేషంబుల ఫల
ములుగా శుభాశుభములఁ బొందుచుండును. పురుషప్రయత్నం బెందును

ఫలకారి కానేరదు. దాని నెఱుంగక యవివేకులు శుభములం బొందినప్పు డయ్యవి తమప్రయత్నమునం గలిగిన వని సంతసించి యశుభములు సంభవింప దైవముపై దూఱుదురు. పరిశీలింప నవి యెల్ల ననాధారంబులు. తమవిజ్ఞానంబు పెంపునను బురుషకార్యమునను సర్వకార్యములును సమకూఱు నేని, యట్లే మానవుఁడు సర్వమనోరథములను నెఱవేర్చుకొన రాదో? వాఁడు జననమరణములు లేక సుఖియై యుండఁగాదో? నీతిమంతులును సమర్థులును బుణ్యాత్ములు నగు కొందఱు తామారంభించిన కార్యములందు వైఫల్యముం బొంది దుఃఖితు లగుదురు. ఎప్పుడును మోసమే పన్నుచు భూతద్రోహమె కర్తవ్యముగా జేయుచుండు పాపాత్ములు కొందఱు సుఖులుగ నుందురు. యత్నమే లేక యూరకుండు మఱి కొందఱు సంపదలతోఁ దులఁదూగుచుందురు. కొందఱు సర్వప్రయత్నములను జేసియు ఫలములు వడయక కష్టముల పాలగుదురు. ఇంకను గొందఱు దేవతాపూజలను దానధర్మములను బుత్రార్థులై జేసియుఁ బుత్త్రులం గాంచనేరరు. పుత్త్రులం బడసియుఁ గుల పాంసులుం గందురు. భుజింపను విస్తారముగ నన్న ముండువారు కొందఱు నానారోగపీడితులై తమ కున్నదానిని సైతము భుజింపనేరరు. చికిత్సవలనఁ గొందఱు రోగముల నివర్తించుకొందురు. నిపుణులగు వైద్యులచికిత్సం బొందియు దివ్యౌషధంబుల సేవించియుఁ గొందఱు రోగులు తమరోగనివృత్తిం గాంచనేరరు. కొందఱు నానాకష్టములం బడి పట్టెడన్నమును భుజింతురు. ఏకనక్షత్రమున నేకరాశియందు జనించియుఁ గొందఱు వివిధఫలముల ననుభవించుచున్నారు. ఈవ్యత్యస్తఫలానుభవంబుల నన్నింటిని బర్యాలోచించి చూడ మానవులకు మేలుకీళ్ల ఫలముల ననుభవించుటకు ముఖ్యకారణము పూర్వజన్మకర్మమే ప్రధానకారణమని నిర్ణయింపవలసియున్నది. ప్రపంచమంతయు నశించినను దనకు వినాశము లేక శాశ్వతుండైన జీవుండు కర్మబద్ధుఁడై కాలానుగుణముగఁ బ్రాప్తించి నశించు దేహంబులం జొచ్చుచు, వానిని విసర్జించుచు, నాయాఫలముల ననుభవించుచు జననమరణరూపమగుసంసార సముద్రమునందలి సుడిగుండమునఁ దిరుగుడు వడుచుండు నవఁగా గౌశికుం డాకర్ణించి జీవునియొక్క శాశ్వతత్వమును దెలియఁజెప్పుమనఁగా ధర్మవ్యాధుం డతని కిట్లు చెప్పం దొడంగె.

ధర్మవ్యాధుఁడు కౌశికునకు జీవలక్షణంబుఁ జెప్పుట

జీవుఁడు నిత్యుఁడు. నాశరహితుఁడు శరీరనాశనమే మరణము నాఁబడు. అది గనుకనే మూఢాత్ములు దేహాభయము గలిగినపుడు జీవుఁడు నశించె నందురు. జీవుఁడు దేహాంతరము నొందును. జీవునకు దేహాంతరప్రాప్తియే మృత్యు వనంబడును. మర్త్యలోకంబున నొక మనుష్యుఁ డొనర్చిన కర్మను వేఱొకఁ డనుభవింపఁడు. మానవునిచేఁ జేయఁబడిన కర్మము నా మానవుఁడే యనుభవింపవలయును. ఆకర్మ మనుభవింపక తీఱదు. పుణ్యశీలురగు మానవులు పుణ్యులగుదురు. పాపాత్ములు నరాధములగుదురు. నరుఁడు స్వకర్మలచే ననుసృతుఁడై, యాకర్మల ప్రకారము పుణ్యపాపజన్మములఁ బొందును. అని ధర్మవ్యాధుఁడు పలుకఁగా బ్రాహ్మణుండు జీవునకు నుత్పత్తియందుఁ బుణ్యపాపము లెట్లు గలుగును? పుణ్యపాపజాతులును నెట్లు గలుగుఁ జెప్పు మని యడుగఁగా నతనికి నతం డిట్లనెను. అయ్యా! ఇయ్యవి గర్భాధానము మొదలుకొనియు కలుగుచుండు. వాని ప్రకారమును సంగ్రహముగ నుడివెద వినుము. జీవుఁడు నానికర్మసంచయముకొలఁదిగ జన్మ మొందును. సత్కర్మమునే యాచరించుచుండు పురుషునకు శుభజన్మము గలుగు. పాపకారియగు పురుషునకుఁ బాపయోనులందు జన్మము గలుగు. అసత్కర్మముల నెల్లప్పు డాచరించుచుండువాఁడు అర్యకులలోఁ బుట్టి నరకమును బ్రాపించు. పూర్వజన్మమునం దొనర్చిన యసత్కర్మఫలంబుగా హీనజన్మంబు నెత్తియు నంతం బోక, రోగపీడితుఁ డగుపురుషుం డపథ్యంబుఁ జేయుచుండుపున, పలుమఱల దుష్కార్యములనే చేయుచు సదా దుఃఖములఁ గుందుచు, నా దుఃఖములనే సుఖములుగా భావించుచుఁ, బుట్టుక, చావు, ముదుసలితనము, రోగము మున్నగువానిబాహుళ్యంబున నెంతయుఁ గట్టుఁ గానక జననమరణరూపసంసారసముద్రమున మునుఁగుచుం దేలుచుండు. పాపములనే చేయుచుండిన వాని కెన్నటికి నంత ముండదు. ఆజీవి కడతేర లేఁడు. కావునఁ గూడినంతమట్టుకు జీవుండు దుష్కృతములకు దూరుండై యసూయాదిదుర్గుణవర్జితుండై, యేకులమునందుఁ బుట్టుచున్నాఁడో యాకులధర్మానుష్ఠానపరుండై, న్యాయ్యమును ధర్మ్యమును నగు వృత్తంబున నార్జించిన ధనాదులచే గురు బంధు మిత్రాదుల

నంతసింపఁజేయుచు నాస్థతోఁ గామ్యకర్మముల నాచరించువాఁడు స్వర్గాదిపుణ్యలోకములఁ బొందును. మఱియును గామ్యకర్మాచరణము యొక్క ఫలము లగు స్వర్గాదిభోగము లనిత్యము లని జ్ఞానముచే నెఱింగి మోక్షమే శాశ్వత మని యెఱింగి కర్మ నాచరించు కర్మ ఫలములను నిష్కామబుద్ధితో బ్రహ్మార్పణము చేయుచు జననమరణసంసారబంధములం బాసి విరాగియై యింద్రియముల విషయములయందుఁ బ్రవేశింపనీయక మఱలించుచు, సత్త్వాదిసద్గుణోపేతుండై 'తత్త్వమసి' 'అహం బ్రహ్మాస్మి' యను మహావాక్యార్థముల మననము చేయువాఁడు మోక్షము నధిగమించు ననఁగాఁ గౌశికుండు ధర్మవ్యాధుని నింద్రియనిగ్రహ మనఁగా నేది? దానిఫలం బెద్ది? ఆనిగ్రహ మెట్లు చేయవలసి పడును? నిగ్రహఫలం బేది? తెలియఁ జెప్పుమనఁగా ధర్మవ్యాధుఁ డి ట్లనియె. విషయములయందుఁ దొలుత మనస్సు ప్రవర్తించు. ఆమనస్సు రాగద్వేషములకు వశమయ్యెనేని పురుషుఁ డింద్రియవ్యాపారముల కధీనుఁడగును. ఇంద్రియవిషయవశంవదుఁ డగువాఁడు రాగముచేఁ గట్టుపడి ద్వేషలోభమోహావిష్టుం డగును. అప్పుడు వానికి ధర్మబుద్ధి మాసును. ధర్మార్థముల యందు మనస్సు ప్రేరితమై హితులును విద్వాంసులును వారించినను వినవొల్లక పాపముల నభ్యసించుచు నెప్పుడుఁ దనకార్యములే యుత్తమము లనియు, నవియే విధ్యుక్తము లనియు దురూహలచేఁ బెడర్థంబులఁ జేసి తనమతంబు సాధింప యత్నించు. ఈవిధమున దుష్కృతములను జింతించుచు వానిని జేయుచు పాపినే చెప్పుచు నీమూఁడు విధంబుల నధర్మములకు మూలం బగు రాగమునఁ దగులువడి సుగుణదూరుండై తనవంటిమనోవికారములు గల దుష్టులం గూడుచు, నుచితము నెఱుంగక పాపకృతమున నుభయలోకములకును భ్రష్టుఁడగు. జ్ఞానముగలవాఁ డీదోషముల నెల్లఁ జక్కఁగాఁ బరిశీలించి నిపుణుఁడై సుఖదుఃఖములయాథార్థ్యము నెఱింగి సజ్జనసేవఁ జేసి వారి సహవాసమున నిర్మలచిత్తము గలిగి ధర్మసంపాదనంబు గావించి పరమాత్మయందు బుద్ధిని రమింపఁజేయు. మఱియు నింద్రియస్వరూపమును, వానిని గెలుచువిధమును, గెలుచుటచేఁ గలుగుఫలమును న న్నడిగియుంటివి. అది యాత్మవిద్య యనంబడు. ఆత్మవిద్యను బోధింప మావంటిహీనకులజు లర్హులు గారు.

దానిని మేముచ్చరించుటకు సమర్థులము. అయినను నీవు విప్రశ్రేష్ఠుండవు.
జ్ఞానివైనవాఁడవు సర్వవిధములఁ బూజ్యులయిన విప్రులకుఁ బ్రియం
బొనర్పవలయు. కావున ముందుగ భూసురులకు వందనములు గావించి
వారికిఁ బ్రియం బైన బ్రహ్మవిద్యాస్వరూపమును సంగ్రహముగఁ జెప్పె
దను. సావధానమనస్కుండవై యాకర్ణింపు మని మఱియు నిట్లనియె.

### కౌశికునకు ధర్మవ్యాధుండు బ్రహ్మవిద్యాస్వరూపము నఱింగించుట

ఈప్రపంచం బంతయు మహాభూతమయమై యున్నది. మహా
భూతములు పరబ్రహ్మమయములు లని యెఱుంగుము. భూమి, అప్పు,
తేజస్సు, వాయువు, ఆకసము నను నీయైదును మహాభూతము లనఁబ
డును. పరబ్రహ్మమునందుండి యాకసమును, నాకసమునందుండి వాయువు
ను, వాయువునందుండి తేజస్సును, దేజస్సునుండి నీరును, నీటినుండి పృథివి
యుఁ బుట్టినవని యెఱుంగుము. ఈ విధమున భూమియందు నీరును, నీటి
యందుఁ దేజస్సును, తేజస్సు వాయువునందును, వాయు వాకసమునందును,
నాకసము పరబ్రహ్మమునందును లయము నొందును. పృథివియొక్క ముఖ్య
గుణము గంధము! నీటియొక్క ముఖ్యగుణము రసము! తేజస్సు
యొక్క ముఖ్యగుణము రూపము! వాయువుయొక్క ముఖ్యగుణము
స్పర్శ! ఆకసముయొక్క ముఖ్యగుణము శబ్దము. మఱియు నింకొక విశే
షంబు చెప్పెద. ఆకసమునకు గుణము శబ్దమొక్కటియే యని యెఱుం
గుము. వాయువునకు ముఖ్యగుణము స్పర్శయేయైనను నది శబ్దముతోఁ
జేరి ద్విగుణములుగలదై యుండును. తేజస్సునకు ముఖ్యగుణము రూప
మొకటియేయైనను దానిని శబ్దస్పర్శగుణములును నావరించియుండును
గావున నది త్రిగుణములు గలదై యుండును. నీటికి ముఖ్యగుణము
రసమేయైనను దానిని రూపస్పర్శశబ్దములును నావరించి యుండును
గావునఁ దనముఖ్యగుణమైన రసముతో నీమూఁడుగుణములును
దానిని నావరించియుండును గావున నది నాల్గుగుణములు గలదై వెల
యును. అట్లే పృథివికి ముఖ్యమగు తనగంధగుణముతో శబ్దస్పర్శరూప
రసములును నావరించి యుండుటచే దనముఖ్యగుణముతో నైదుగుణ
ములుగలదై విరాజిల్లును. ఈపంచభూతములగుణము లైదును నింకను
విశేషము లైనగుణములతోఁ గూడి పరబ్రహ్మము వెలుఁగుచుండును.

పంచభూతములలో నొకటి యెక్కువ వేఱొకటి తక్కువ యనునది లేక యన్నియుఁ దుల్యములే యని గ్రహింపుము. ఈగ్రాహ్యపంచమహాభూతములచేతనే స్థూలశరీరము కల్పింపఁబడిన దని యెఱుంగుము. ఈస్థూలశరీరమును జీవుఁ డాశ్రయించియుండు నని తెలియుము. కర్మవశమున జీవుఁ డన్యదేహమును స్వీకరించునప్పుడు తొలిశరీరము నశించును. శ్రోత్రము(చెవి),త్వక్కు (చర్మము), చక్షుస్సు (నేత్రములు), జిహ్వ(నాలుక), ఘ్రాణము (ముక్కు), ననునివి జ్ఞానేంద్రియములు లని తెలియవలయు. వరుసగా వీనికి శబ్దస్పర్శరూపరసగంధములు విషయములై వర్తించు. ఇట్టింద్రియము లైదని చెప్పినవి వీనితో మనస్సు చేరి యాఱవదిగను బుద్ధి యేడవదిగను, నహంకార మెనిమిదియనుదిగను గూడి వర్తిల్లు. మహాభూతము లైదు, వానిగుణము లైదు, నింద్రియ సమూహం బంతయు నొక్కటి, మనోబుద్ధ్యహంకారములు మూఁడు, సత్త్వరజస్తమోగుణములు మూఁడును గూడిన రాశి సప్తదశక మని యు లేక యవ్యక్త మనియుఁ జెప్పంబడును. మఱియును బంచభూతములు (౫) పంచతన్మాత్రలు (౫) దశేంద్రియములు (౧౦) త్రిగుణములు (3) అంతఃకరణ మొకటి (౧) గూడినరాశి చతుర్వింశకంబు (౨౪) అనంబడు. ఇవి యొక్కొక్కప్పుడు సమష్టిగను వ్యష్టిగను ననేకప్రకారంబుల భిన్నములై యవ్యక్త మగు తత్త్వమునందు నావిర్భవించుచు,లయించుచు నుండును. ఇంద్రియములతో గూడినదై నకు జ్ఞానరూపము గలిగించునది వ్యక్త మనంబడు. ఇంద్రియములతో గూడినదై జ్ఞానోత్పాదనముఁ గలిగించునదికాక, యనుమానము మొదలగు ప్రమాణములచే గోచరం బగుతత్త్వ మవ్యక్తం బనఁబడు. ఇంద్రియములకు శబ్దాదివిషయగ్రహణమే సహజ ధర్మము. ఇంద్రియవశుం డైనపురుషుండు జననమరణరూపసంసారతాపములఁ బడయును. కావున జ్ఞాని యైనవాఁడు ప్రపంచమునందలి సుఖదుఃఖములను, రాగ ద్వేషములను బరిశీలించి యింద్రియజనితసుఖము లన్నియుఁ జివరకు దుఃఖహేతు వని నిశ్చయించి యాచార్యసేవఁ జేసి యామహానీయుఁ డుపదేశించిన వాక్యార్థమననముచేతఁ గలిగిన జ్ఞానైశ్వర్యములచే విలసితుండై సమస్తకారణములకు హేతుభూతము, నిత్యము, నుపమానరహితము, వచింప నశక్యము, నామరూపక్రియా

దిరహితము నగు పరబ్రహ్మమునకును, క్రియారూపమై యనిత్యమై చరాచరస్వరూపమై యుండు ప్రపంచమునకును గల తారతమ్యంబుఁ దెలిసి సర్వభూతములయందు ననఁగా ప్రాణులయందుఁ బరబ్రహ్మము నిండి యుండుటను నట్లే తనయందు నాపరబ్రహ్మము సన్నిహితమై యున్న దని యెఱింగి, సర్వదిక్కులఁ బాపి యన్ని యవస్థలయందును, నన్ని ప్రదేశములయందును, సర్వప్రాణులయందును నద్వైతభావన ననఁగా "నేక మేవాద్వితీయం బ్రహ్మ" యని చూచుచుండును బ్రహ్మస్వరూపుండై ప్రకాశించు. ఇట్లు వెలయుటకు మూలము తపస్సు. తప మనఁగా నింద్రియములను గెలుచుట యనుయోగము ముందుఁ గలది. ఇంద్రియముల గెలిచినవారికి స్వర్గప్రాప్తి. ఇంద్రియములు కోరినపానికి నరకప్రాప్తియని యెఱుంగుము. విచారింపఁగా నింద్రియములను జయించు యోగమునకంటెఁ బరబ్రహ్మప్రాప్తికి నుత్తమయోగంబు వేఱు లేదు. పాపములును, క్లేశములును జితేంద్రియుని సమీపింపవు. పురుషునకు శరీరము రథము. ఈ శరీర మనెడి రథమునకు నాత్మ సారథి. ఇంద్రియములు గుఱ్ఱములు. ఈయింద్రియము లను మంచిగుఱ్ఱములను నేర్పరి యగు నాత్మధైర్యమను పగ్గముచే లాగిపట్టి వానిని సన్మార్గమునఁ దోలుచుండుటచేఁ దాను సత్ప్రవర్తకుం డగును. అనఁగా సమర్థుఁ డగు సారథిచే సత్పథంబునఁ బోవుచుండు గుఱ్ఱములమూలమున రథ మెట్లు పెడత్రోవలఁ బోక యుద్దేశించిన స్థలమునకుఁ బోవునో యట్లే పురుషుండు స్థైర్యమునఁ బంచేంద్రియములను స్వేచ్ఛగాఁ బోనీయక లాగి పట్టి యనఁగా గెలిచి శరీరస్థజీవునకుఁ గష్టములను బెట్టక బ్రహ్మైక్యమును గలిగించి మోక్షానందమును బొందించును. ఇంద్రియములు పోవుమార్గముననే మనస్సును బోవునేని సముద్రమునందుఁ దుపానుచేఁ గొట్టఁబడిన నావవలెఁ బురుషుఁడు చెడును. వానికి సుఖము గలుగనేరదు. కావున నింద్రియలోలత్వమును వీడి వానికి వశుఁడు గాక యోగధ్యానపరాయణుం డైనవాఁడు పరమాత్మను గనును, మోక్షమును బొందును. వాఁడే యద్వయానంద మనుభవించును. అని చెప్పఁగాఁ గౌశికుండు సత్త్వరజస్తమంబు లను త్రిగుణములతత్త్వము నెఱుంగఁజెప్పు మనఁగా ధర్మవ్యాధుఁ డిట్లనియె.

## కౌశికునకు ధర్మవ్యాధుండు త్రిగుణస్వరూపమును జెప్పుట

తమోగుణము మోహాత్మమై యుండు. సత్త్వము ప్రకాశబహుళమయి యుండు. రజోగుణము భయాత్మకమై యుండు. అవిద్య, మోహము, జడత్వము, నిద్ర, యింద్రియములకు వశమగుట, యాలస్యము, క్రోధము ననునివి తామసగుణలక్షణములు. రాగము, లోభము, అసూయ, మానము ననునివి రాజసలక్షణములు. జ్ఞానము, ధైర్యము, వైరాగ్యము, అనసూయత, ఋజుభావము, ప్రసన్నత, ద్వేషరాహిత్యము, శాంతి యివి సత్త్వగుణలక్షణములు. సాత్త్వికగుణప్రధానుండు జ్ఞానయాథార్థ్యము నెఱింగి, లోకుల ప్రవర్తనంబున నేవగింపు గలిగి, రాగము లేక, యహంకారముం బోద్రోలి, సుఖదుఃఖములు, లాభాలాభములు ప్రియాప్రియములు మున్నగు ద్వంద్వములయందు సమబుద్ధి గలిగి పరమాత్మయందు సంశయరహితుండై శాశ్వతమైన మోక్షమును బొందును. వీఁడు దేనికిఁగాని కట్టువడఁడు. శూద్రుండైనను సాత్త్వికస్వభావముగలవాఁడేని క్రమముగ వైశ్యక్షత్రియబ్రాహ్మణ జన్మము లెత్తి మోక్షసిద్ధిఁ బొందు ననఁగా, కౌశికుండు ధర్మవ్యాధునితో నయ్యా! పార్థివశరీరమునం దగ్ని యె ట్లుండు? వాయు వెట్లు వర్తించు? తెలియఁజెప్పు మనఁగాఁ గౌశికునకు ధర్మవ్యాధుం డిట్లనియె.

## ధర్మవ్యాధుండు కౌశికునకు శారీరలక్షణంబుఁ జెప్పుట

దేహమునం దుండు నగ్ని నాభి యునికిపట్టుగాఁ గలిగి వాయువులతోఁ గూడి శిరస్సు నాశ్రయించి, దేహమంతయు వ్యాపించును. ప్రాణవాయువు హృదయము నునికిపట్టుగాఁ గలిగి యచ్చోటనుండి యగ్ని యునికిపట్టైన నాభినిం బర్వియుండు. భూతభవ్యభవిష్యత్తు లన్నియుఁ బ్రాణవాయువునందుఁ గుదుట గలిగియుండును, ప్రాణము సర్వభూతమయమైయుండు. అదియ యారాధింపఁ బడవలసినది. శారీరాగ్ని ప్రాణవాయువుచే లెస్సగఁ బరిపాలింపఁబడును. ఆప్రాణమే సర్వభూతాత్మ యగు సనాతనపురుషుఁడు. అదియే మనోబుద్ధ్యహంకారస్వరూపుఁడు. భూతములకు విషయీభూతుండు. అది యవ్యక్తము, సత్త్వము, జీవుఁడు, కాలము, ప్రకృతి, పురుషుఁడు ననఁబడును. ఆప్రాణము స్వప్నకాలమునను మేల్కొనియుండును. స్వప్నమున

స్వప్నము నొందును. జాగ్రద్దశనున్నవారికి బల్మి గలిగించును. అంగ ములు గదలునప్పుడు కదలుచుండును. ఆప్రాణము నిలిచినపుడు పురు షుఁడు మృతుఁ డనఁబడు. పంచభూతాత్ముఁడగు జీవుఁడు శరీరముఁ బాసి వేఱొకశరీరము నొందును. శరీరమధ్యమున నాభి యుండును. నాభి యందు నగ్ని యుండును. అపాన మనువాయు వెముకలను మూలముగాఁ గలిగి, గుదస్థాన మునికిగఁ గొనియుండును. శారీరాగ్ని నపానం బాశ్ర యించి మూత్రమును, మలమును, రేతస్సును వెలుపలికిఁ ద్రోయు టకుఁ గారణమైయుండును. ఉదానవాయువు కంఠము నావరించి యుండి మాటలాడుటయును, భారమును మోచుట మున్నగుసకలకార్య కరణమునకు హేతువుగ నుండును. సమానవాయువు ప్రాణవాయు వును నపానవాయువును, నాభి నావరించియుండు నగ్ని నాశ్రయించి నాభి యునికిపట్టుగఁ గలదై యుండును. ఈసమానవాయు వాహా రము జీర్ణించుటకుఁ దోడ్పడును. ఎట్లనఁగా వినుము. భుజించునాహా రము హృదయస్థితంబైన ప్రాణవాయువుతోడ్పాటున నుదరమును బ్రవేశింపఁగానే శరీరము నావరించియుండు నితరవాయువులు యుగపద్భావమున నచ్చోటఁ జేరును. అంత నీమైదువాయువుల యొర యికచేత శారీరాగ్ని ప్రజ్వరిల్లును. ఆయగ్నికి నాభియందలి సమాన వాయువుయొక్క విశేషసహాకారమునం జేసి యాహారంబు లెస్సగాఁ బ్రత్యవయవమునకుఁ బోవుట కనుకూలముగాఁ బచనమగును. ఈరీతిన నాహారము పక్వమై దానిసార మింద్రియములు మున్నగుదేహావయ వములం జేయును. అపానవాయువుమూలమున నాహారమునందు దేహో పయుక్తము కానిపదార్థ మగుమలము నాభికి దిగువ నుండు పక్వాశ యమునందుఁ జేరి, యధోద్వారముమూలమున వెలుపలికి వెలువడును. దేహము నావరించియుండు నాడులలో ముఖ్యము లగుపదినాడులు ప్రాణవాయువుచేఁ బ్రేరేపింపఁబడి జీర్ణకోశమునందలి పక్వాన్నరస మును నాకర్షించి శరీరావయవములలో వ్యాపించియుండు ననేకము లగు నితరనాడులును నుచితక్రమంబున వర్తింప ధాతుపోషణమును జేయును. ఇది పరమయోగులకుఁ గాని యితరులకుఁ దెలియదు. నేనీ విషయము పారిమూలమున నెఱింగితి. దేహలక్షణములను, శారీరా వయవముల ప్రత్యేకవర్తనములను దెలిసి యోగులు యోగమహిమచే

శీతోష్ణములు, సుఖదుఃఖములు మున్నగు ద్వంద్వములను సమానముగ నెన్ని వాయువులను వశపఱచుకొని మూర్ధమున నాత్మను జేర్చి యాత్మను బరమాత్మలో నైక్యపఱతురు. ఈయైక్యభావమే కైవల్య మనఁబడును జీవాత్మను బరమాత్మలోఁ జేర్పఁగలిగినయోగి కైవల్యమును బొందె నందురు. అనఁగా మోక్షసామ్రాజ్యము నాయోగి యధిగమించి మఱల జననమరణసంసారహేతుభూతము లగు దేహాదుల నాయోగి పొంద నేరఁడు. కాలచేష్టలకు వశమైన జ్ఞానేంద్రియము లైదు, కర్మేంద్రియము లైదు, మనస్సుతోఁ బదునొకండింద్రియములతోఁ గూడినశరీరమునందుఁ బాత్రమునందుఁ బాలె సన్నిహితుండై యుండు నయ్యగ్నియే జీవాత్ముండు. తామరాకునం దంటుకొని యున్నను నీటిబిందువు తనయార్ద్రత్వమును నాకు నంటనీయక యెట్లు మెలంగునో యాజీవాత్ముండు శరీరము నధిగమించియుండియు, నిర్లేపస్వరూపముతో నుండును. భూమి విత్తనములలో మొలకెత్తుటకుఁ దోడ్పడువిధమున శరీర మాది లేనిపుణ్యపాపకర్మములను బ్రకాశంబుగావించుటంజేసి క్షేత్రము నాఁబడు. ఈశరీరము పుణ్యపాపకర్మఫలమున నేర్పడిన దని లెస్సగా నెఱింగి నిర్లేపుండై యుండుఁ గావున జీవుండు క్షేత్రజ్ఞుం డనఁబడు. ఆజీవుఁడే, లేక యాజీవాత్ముండే, విలాసార్థముగ సకలబ్రహ్మాండమును దనమాయచేఁ బ్రవర్తింపఁజేయు పరమాత్మ యని యెఱుంగుము. దీని నంతయు నుత్తమజ్ఞానసిద్ధు లగుయోగులు యోగానుసంధానమునం దాత్మపరమాత్మలయొక్క యద్వైతభావనముఁ గందురు. ఆత్మయాథార్థ్యంబు స్పష్టముగా నిట్లున్నను మూఢుల కది దురూహ్యమై యుండు. కావున నుత్తమపదం బగు మోక్షమును బ్రాపింపఁగోరువానికిఁ గర్తవ్యమును జెప్పెద నాలకింపుము. కామక్రోధలోభమోహమదమాత్సర్యము లెడఁబాసి, మానావమానముల నొక్కరూపుగాఁ దలంచి, గర్వమును వీడి, చిత్తమును జితేంద్రియుండవై స్వాధీనముచేసికొని, శరీరపోషణమునకు మాత్రము వలసినంతలఘ్వాహారముం గొనుచు, నెల్లప్పుడు సమాధినిష్ఠ నవలంబించి జ్ఞానమును బొంది యాజ్ఞానముమూలమున నాత్మను బరమాత్మయందుఁ గలియునట్లు యత్నించుటయే మేలు. అట్లొనర్చుపురుషుండు నిశ్శ్రేయసముఁ బొందఁగలఁడు. సుఖము లన్నింటిలో నానిశ్శ్రే

ద్యాసమే పరమసుఖంబు. చిత్తప్రసన్నత్వమును బొందినమహనీయుండు గాలిలేనిచోటఁ జలింపక దీపకలిక తేజస్సు నెట్లు వెదచల్లునో, యట్లు గాఢనిద్రాకాలమందలి సౌఖ్యమునకు సమానమగు నుత్తమానందమును బొందుచు మోక్షపదవిం బ్రాపించు. దీనినే నిర్వాణపద మందురు కొందఱు. ఫలాపేక్ష వదలి నిష్కామబుద్ధితోఁ జేయుకర్మాచరణముచేత నింద్రియములు విషయాదులలోఁ బ్రవర్తింపక మనస్సుచే మఱలింపఁబడి, చిత్తమును బ్రసన్నతఁ జెందించును. ఈయోగి కక్రౌర్యము పరమధర్మము; శాంతమే పరమబలము; ఆత్మజ్ఞానమే పరమజ్ఞానము; సత్యాలాపమే పరమవ్రతము. ఈయోగి సర్వభూతములకు హితమాచరించుచు నిరుపద్రవకరుఁడై యుండవలయును. క్రోధరహితతపస్సు గలిగి, మాత్సర్యరహిత ధర్మాచరణపరాయణుఁడై, జ్ఞానమును మానావమానములసమానభావనచే రక్షించుకొనుచు, నాత్మప్రసాదమును బొంది, గురువునకైన నిట్టిట్టి దనరాని యోగస్వరూపము బ్రహ్మయోగముచే నెఱుంగవలయు. ఇట్టి యవస్థను యోగి పొందినాఁ డనుటకు నిదాన మెద్ది యందు వేని వానిసర్వభూతస్నేహభావమును నద్రోహచింతయు ననియే యెఱుంగవలయు. వానియానంద మకించనత్వమున నున్నదనియు, వానియచాపల్యమే నిరాశాస్వభావ మనియు నెఱుంగుము. ఆయోగి సంగవర్జితుఁడై యుండి నిస్సంగమును, సుఖదుఃఖరహితమును నగు పరబ్రహ్మమున ననుసంధానము గావించు. విప్రోత్తమా! ఇదియ సంగ్రహరూపమైన బ్రహ్మవిద్యాప్రకారము. నీ వింకను నావలన నేదేని తెలియఁగోరుదు వేని యడుగు మనఁగాఁ గౌశికుండు ధర్మవ్యాధువిజ్ఞానమున కచ్చెరువొంది వానివలన సుప్రీతుండై యిట్లనియె. అయ్యా! నీవిజ్ఞాన మింతయద్భుతమైయుండునే! నిన్ను సామాన్యమానవుం డనరాదు. నీవు మహాయోగివి. యోగుల కందరాని బ్రహ్మజ్ఞానమును దెలిసి పామరునిం బోలె నిట్లు వర్తింతువే? యని ప్రశంసించె.

ధర్మవ్యాధుండు కౌశికునిఁ దనతల్లిదండ్రులయొద్దకుఁ దోడ్కొనిపోవుట

అటుపిమ్మట ధర్మవ్యాధుండు కౌశికునితో నిట్లనియె. భూసురవర్యా! నాకీవిజ్ఞానంబు గల్గుటకు ముఖ్యహేతు వొండు గలదు. దానిని నీకుఁ బ్రత్యక్షదర్శనంబు గావింతు. నేను వసించునాయింటికేతెంచి లోపలికి వచ్చి చూడుము. అనఁగాఁ గౌశికుండు వల్లె యన

వానిఁ దనపిఱుందన తోడ్కొనిచని స్వగృహాభ్యంతరమును జొచ్చి యచ్చోటఁ జతుశ్శాలములో మిక్కిలి రమణీయమును, దేవతాగృహమునుబోలెఁ బరిశుభ్రమును నతిపవిత్రమును, దివ్యసుగంధపరిమళయుతమును, దివ్యపుష్పమాల్యాలంకృతంబును, బచ్చనితోరణంబులు గలదియును, నున్నతోత్తమదుకూలసమన్వితశయ్యలతోఁ గూడినదియు, నగురమ్యమైనసౌధమునం దుత్తమాసనములయందు సుఖంబుగం గూర్చుండియున్నవారును, నిర్మలవస్త్రధారులును నప్పుడే భుజించి సంతృప్తులై సుసంతుష్టులై యుండువారగు రెండురూపములను జూపి, తాను వారికి మ్రొక్కి కౌశికుతో నిట్లనియె. వీ రిరువురు నాకు వంద్యులైన నామాతాపితరు లనుచుండఁగనే వారిట్లనిరి. నాయనా! లేలెమ్ము. సకలధర్మములను దెలిసిన నిన్ను నీధర్మమే రక్షించు. దీర్ఘాయుస్సును బొందెదవు. నీవిజ్ఞానమునకును, శౌచపరాయణత్వమునకును, సదాచారసంపదకును మెచ్చితిమి. సత్పుత్త్రుఁడ వగునిన్నుఁ గనుటచే మాపితృపితామహులు తృప్తులైరి. త్రికరణశుద్ధిగా మాకుఁ గొఱఁతలేని సేవ యొనర్చుచున్నావు. పితృసేవాతత్పరులలోఁ బరశురాముఁ డగ్రగణ్యుఁడు. వాని నెన్నిసపిదప నేతత్సత్కార్యాచరణపరాయణత్వమునకు ని న్నెన్నవలయును. లెస్సగ నాలోచించిన నిన్నే ప్రథమమున గణింపవలయును. అనఁగా ధర్మవ్యాధుండు లేచి, వారికిఁ గౌశికుఁ జూపి యీమహనీయుండు మనభాగ్యవశమున నీనాఁడు మనయింటి కేతెంచె ననఁగా వారును నావిప్రోత్తము నుత్తమక్రియలచేఁ బూజించిరి. కౌశికుండును వారియోగక్షేమము లరసెను. వారడుగఁగాఁ గౌశికుఁడు దనవృత్తాంతము నంతయు వారికిఁ జెప్పెను. అప్పుడు ధర్మవ్యాధుఁడు కౌశికున కిట్లనియె. వీరు నామాతాపితరులు. వీరు నాపాలిదైవములు. నాకు వీ రింద్రాదిదేవతలు; నా కన్నులు వీరే; వీరే నాకు యజ్ఞస్వరూపులు; వీరే వేదము లనుతలంపుతో దేవపూజలను నేను వీరికి సలుపుచుందును. నాబిడ్డలు, భార్య, మిత్త్రులు వే యేల? నా ప్రాణములు వీరిసేవ కనియే భగవంతుఁడు నియోగించియున్నాఁ డని భావింతు. దినముతప్పక నేనే వీరికాళ్లను గడుగుదు. వారి కుదకము లొసంగి నేను వారిని స్నాతులం జేయుదు. వివిధరుచ్యభక్ష్యములతో నన్నమును గుడువఁబెట్టుదు. వారితో మంచిమాట లాడుదు. వారి కిష్ట

ముగాని వైపున నెంతమాత్రముఁ జూడనైనఁ జూడను. వీరి కిష్టమైన
దియే నాకుఁ బరమధర్మ మని తలఁచి ధర్మవిరుద్ధమునైనను వారికిఁ బ్రియ
మైన దాని నవశ్యంబుఁ జేయుదు. తల్లి, తండ్రి, అగ్ని, ఆత్మ, గురుఁడు
నను నీయైదుగురె పురుషునకుఁ బూజనీయులు. వీరికి భక్తితోఁ బూజ
లను సలుపు పుణ్యాత్ముండు సకలవ్రతముల నాచరించినవాఁడే యగును.
నాతలిదండ్రుల నిట్లు సేవించుకారణంబుననే నా కీసిద్ధి గలిగె. నీ
యూరిలోని యాపతివ్రతాశిరోమణి మిథిలకుం బోయి నావలన ధర్మ
మెఱుంగు మని తేటపడఁబలుకుటంగాదె నీ వింతదూరమున నుండు నీ
పురమున నుండు నాకడ కేతెంచితివి. ఆపుణ్యాంగనకుఁ బ్రీతి గలుగు
నట్లు నీ కింతసే పీయర్థముల నెల్లఁ దేటతెల్లంబుగాఁ దెలియఁ జెప్పితి.
మఱియు నీ కొకహితమును జెప్పెద. ఆకర్ణింపుము. వేదాధ్యయనమునఁ
బ్రీతిగలవాఁడవై నీతల్లిదండ్రులకు నీవు సేవ లొనర్పవైతివి. వారిసే
లవుఁ బొందకయే యిల్లు వదలి మిథిల కేతెంచితివి. నీవేగతి యనియున్న
యాబీదముదుసళ్లను నీ విట్లొంటిమై వదలి వచ్చుటచే నీపోఁబడి
తెలియక నీకై వగచుచు వారు కన్నీరు సోనలై కార్చుచు నంధు
లైరి. ఇది యెంతయు నొప్పనిపని. తల్లిదండ్రులకు శుశ్రూష సేయక
నీ వెంత వేదాధ్యయనపరాయణుఁడవయ్యు, నెంత తపోధికుఁడ
వయ్యును నాతపోవేదాధ్యయనాదు లన్నియు మాతాపితృశుశ్రూ
షారాహిత్యంబుచే నిష్ఫలంబు లగు. నామాట వినుము. వేగంబ
మీగ్రామంబునకుఁ జనుము. వృద్ధులైనతలిదండ్రులమది మెచ్చ
తత్సేవాపరతంత్రుఁడ వగుము. ఇదియె శ్రేయోమార్గంబులలో
నుత్తమోత్తమము. అని బోధసేయఁగాఁ గౌశికుండు ధర్మవ్యాధున
కిట్లనియె. ధార్మికశ్రేష్ఠుఁడా! నీ వాడిన దెల్ల సత్యంబు. నీధర్మబుద్ధికి,
నీసదాచారసంపత్తునకు మది మెచ్చితి. నీదివ్యబోధంబు నా కమృత
వృష్టి యయ్యె. ఇచ్చోటనుండి తెఱలి మాయూరి కేఁగి యింట నున్న
ముదుసళ్లైన నామాతాపితల సేవించి వారికి మనఃప్రియం బొన
ర్చెద. నా పూర్వజన్మసుకృతంబున నీవంటి సదాచారసంపన్నునిఁ
బొడఁగాంచితి. నీవంటిధర్మజ్ఞులు లోకమున బహుసంఖ్యాకులగు
జనులలో నొక్కఁ డుండును. స్వర్గపతితుం డగు యయాతిని వాని
మనుమ లుద్ధరించినట్లు మాతాపితరులకు సేవ లొనరింపమి నరకలో

కముఁ బడవలసిననన్ను సద్బోధఁ గావించి యుద్ధరించితివి. నీధర్మ వైచిత్ర్యమును బరిశీలింప, మిగుల నాశ్చర్యము గలుగుచున్నయది. విప్రు లూహించినను దెలియరాని ధర్మసూక్ష్మముల నెల్ల శూద్రగర్భ మునం దుత్పన్నుఁడవైన నీ వనాయాసంబున బోధింప నేర్చితివి. పర్యా లోచన సేయఁగా నీవు శూద్రుండవే కావని తెలియుచున్నది. ఏకారణం బున నీ కీశూద్రకులమునందు జన్మ మెత్తవలసివచ్చెనో యెఱుంగు దేని తెలుపు మనఁగా నాకౌశికునకు ధర్మవ్యాధుండు తాను హీనకులమున జన్మించినందులకుఁ గారణము నివ్విధముగాఁ జెప్పెను.

ధర్మవ్యాధుఁడు కౌశికునకుఁ దనపూర్వజన్మ వృత్తాంతంబుఁ జెప్పుట

పూర్వజన్మమునందు నే నొకసద్బ్రాహ్మణునికుమారుండను. వేద వేదాంగముల నభ్యసించి యాచారవంతుఁడనై వర్తించుచుంటి. అంత నాకొకరాకొమరుండు చెలికాఁడై వెలయుట వానితో ధనుర్విద్యను సైత మామూలాగ్రముగా నెఱింగితి. అంత నాచెలికాఁడైన రాకొమరుండు రాజ్యభారము వహింప వానితో నెప్పటియట్ల స్నేహితుఁడనై వర్తిం చుచుండ నొకనాఁ డారాజపుత్త్రుఁడు వేఁటవోవఁ బురంబునఁ బాటింప నేనును మృగయారతుండనై వానివెంట నాఖేటంబునకుఁ జని యనేక మృగముల నేసితి. ఇట్లు బాణము లేయుచుండ నాబాణంబున కొక వృద్ధబ్రాహ్మణుండు గుఱియైన, వాఁ డాబాణవేగంబునఁ గ్రిందఁ బడియె. నేనును నతఁడు ముని యని తెలిసి పశ్చాత్తప్తహృదయుండనై వాని యొద్దకుఁ బోయి నాయకార్యకరణంబునకు వెలవెలం బోయి నన్ను మన్నింప వేఁడగా నాయేటున బాధితుం డైన ముని బాధ సహింపలేక కోపంబున నన్ను వ్యాధునిఁగాఁ బుట్టు మని శపించె. ఆశాపంబునకు భీతిల్లి యామునివరేణ్యుని మఱియుం బ్రార్థింప నామునీశ్వరుండు నన్ను దయార్ద్రదృష్టితోఁ గాంచి తనశాపము తప్పదనియు, నేను మనఃపూర్వకంబుగ నేరమును జేయనివాఁడ నగుట నాయం దను గ్రహించి యిట్లనియె. నీవు హీనకులమునందు జనించియు, ధర్మజ్ఞుండ వగుదువు. నీతల్లిదండ్రులకు మెచ్చువచ్చునట్లు శుశ్రూషలు సేయుదువు. నాయనుగ్రహంబున నీకుఁ బూర్వజన్మజ్ఞానంబు గలుగును. కొంతకాల మావ్యాధజన్మమును గడపి యాతనువు వీడి, మరల బ్రాహ్మణుండవై శమదమాదియోగసంయుక్తుఁడవై యుత్తమగతిం బ్రాపింతు వనఁగా

న్నేసుసు విధికృతంబునకు వగవ నేల? యనుకొని యామునిమేనఁ
గ్రుచ్చుకొనియున్న బాణంబును మెల్లగ లాగి యతని నెత్తుకొని
యాతనియాశ్రమంబుఁ జేర్చితి. నాపుణ్యావశంబున నాయేటున బాధ
పడిన యాబ్రాహ్మణుండు చావం డయ్యె. కాని, యామునిశాపంబు
ఫలించి నా కీజన్మ మెత్తవలసివచ్చె. ఈవ్యాధదేహము వాసి బ్రాహ్మ
ణుండనై సద్గతిం గాంతు. ఇది నాపూర్వజన్మవృత్తాంతం బనఁగాఁ
గౌశికుండు ధర్మవ్యాధుం జూచి దేహు లిట్టివిధంబున సుఖదుఃఖములఁ
గుడుచుచుందురు. అందులకుఁ జింతసేయరాదు. నీ కీబోధ యెఱుంగనిది
కాదు. లోకవృత్తాంతమును బాగుగ నెఱింగి ధర్మజ్ఞుండవైననీ వారు
లెవ్వరును జేయుట కశక్యమైన ధర్మమును జేయుచున్నావు. ఈ
జన్మము నీవిరువఁ గడపి వేఱొకజన్మమునఁ దప్పక బ్రాహ్మణుండవై వెల
యుదువు. సత్యము ఓర్పు మున్నగుసాత్వికగుణంబు లుండుటం జేసి నీ
వీజన్మముననే విప్రుం డనఁబరఁగుదు వని నామతంబు. బ్రాహ్మణకుల
మునఁ బుట్టినవాఁడయ్యును మిథ్యాచారుండై పాపనిమిత్తంబు లగు
దుష్కర్మములఁ జేయుచుండినవాఁడు శూద్రసముఁ డగు. సత్యాది
సాత్వికగుణములు గల శూద్రుండును విప్రసమానుఁడే యగు. ఆచరిత
కర్మంబులచేఁ గులౌన్నత్యమును, గులహీనత్వమును బురుషుండు
పొందును. నీకు దుష్కర్మములు క్షీణించినవి. కర్మదోషమును వ్యాధుఁ
డనైతిఁగా యని ఖేద మొందకుము. అనఁగా వ్యాధుం డాబ్రాహ్మణున
కిట్లనియె. మానసదుఃఖము లనియు శారీరదుఃఖము లనియు దుఃఖములు
ద్వివిధములు. ఇష్టసంయోగవియోగములవలన మనస్సునకు మోద
ఖేదంబు వొడము. దేహమునకుఁ బ్రతికూలకార్యములను జేయు
టచే శారీరఖేదంబులు వొడము. విజ్ఞానమున మానసఖేదములను,
నౌషధాంచులసేవచే శారీరఖేదములను నపనయింపఁగలము. ఇట్లు
జ్ఞానులు సేయుదురు. అల్పబుద్ధులు ప్రతీకార మెఱుంగక మనోదుఃఖ
ములపా లగుదురు. ఇష్టముయొక్కయెడబాటునకు, ననిష్టముయొక్క
కూడికలకు దుఃఖించుటవలన ఫలము వేఱొక్కటియుఁ బొంద మని
జ్ఞానులు తెలిసి విరక్తు లగుదురు. సుఖదుఃఖముల కానందపరితాప
ములు వొందనివారే జ్ఞానులు, సుఖులు, పండితులు. అసంతోషులే
మూఢులు. దుఃఖమునకును నసంతుష్టికి నంతము లే దని భావించి జరి

గినదానికి వగవక నిత్యానందభరితులైనవారే పండితులు. విషాదమునఁ బొవలుట వివేకిగుణము కానేరదు. విషాదమే విషము. విషాదంబు మనస్సున వృద్ధియైనచోఁ గ్రస్నం బైనయురగంబు చావున్బవివేకరహితునకుఁ దప్పక చెఱుపుఁ జేయు. విషాదము మనస్సునఁ గదుర్చ గర్తవ్యమును నశ్రద్ధతోనుండి చేయఁడేని వాఁడు తేజోహీనుండై పురుషార్థములఁ బడయఁజాలఁడు. కావున గతమునకుఁ జింతిల్లక, వగఁ దొలఁగునుపాయంబుఁ బూనుట శ్రేయంబు. ఇంద్రియగోచరమగు ప్రపంచ మనిత్య మని భావించి యాత్మయాథార్థ్యము ననుసంధించు స్థితప్రజ్ఞులు శోకవిరహితులై పరమగతిం గాంతురు. దీని నంతయును నేను లెస్సఁగా బర్యాలోచనచేసి శోకము వదలి కాలము నిరీక్షించుచున్నవాఁడ ననఁగాఁ గౌశికుండు వ్యాధుం జూచి ధర్మజ్ఞా! నీయట్టివానికి వగ గలుగునే? నీవు స్థితప్రజ్ఞుండవు. ధర్మవేత్తవు. సుజ్ఞాననిధివి. నీ వెఱింగియున్నను నేఁ జెప్పెద. ధర్మమునెడ నప్రమత్తుఁడవై వర్తింపుము. నీధర్మంబు నిన్నుఁ గాపాడును. నీకు శుభంబవుఁగాత మని దీవించి ధర్మవ్యాధునెలవుఁ బొంది వ్యాధుం డంజలి గావించి వల్లె యనుటయు నతనికిఁ బ్రదక్షిణపూర్వకముగాఁ గౌశికుండు నిజనివాసమునకుఁ దరలి క్షేమమున నిలుసేరి ధర్మయుక్తంబుగ మాతాపితరులకు శుశ్రూషనేసి ధన్యుం డయ్యె.

ధర్మనందనా! నీవడిగినచొప్పునఁ బతివ్రతామాహాత్మ్యంబును, దలిదండ్రుల సేవలవలని ఫలమును, హీనకులమునఁ బుట్టినవాఁడు ధర్మము నాచరింపవలసినమార్గమును వక్కాణించితి ననఁగా ధర్మరాజు మునీంద్రా! యద్భుతావహంబును, ధర్మయుతంబును నగు నీ ధర్మవ్యాధోపాఖ్యానంబును వినుటంజేసి యింతకాలమును నొక్కముహూర్తమై చనె. నీవు ధర్మములఁ జెప్పుచుండిన నింక నాకర్ణించుచుండవలయు నని మనస్సు గోల్పుచున్నది. తనివి గలుగదు. అగ్ని వనంబునకుఁ బోఁగా నంగిరసుండు దేవతలకు హవ్యములను మోచె నని విందు. అందులకు హేతు వెయ్యది? మఱియు నగ్ని యొక్కండై యుండ వాని కనేకకర్మ లాచరింపవలసియుండును. అందులకు హేతు వెయ్యది? మఱియుఁ గుమారస్వామి యగ్నికుమారుఁడనియు, రుద్రుని తనయుం డనియు, గంగాపుత్త్రుం డనియుఁ, గృత్తికలసుతుం డనియు,

ష్యపహరింపఁబడు. అందులకుఁ గారణం బెయ్యదియో? ఈసందియంబు లన్నింటిని దీర్ప నీవ యర్హుఁడవు. అనఁగా ధర్మజునకు మృకండుజుఁ డిట్లనియె.

మార్కండేయుండు ధర్మజున కంగిరసుం డగ్నియైన తెఱం గెఱింగించుట

పూర్వకాలమునం దగ్ని దేవుండు దేవతల కలిగి క్రోధరూపముం దాల్చి యరణ్యమున కేఁగి యతిశాంతుండై తపంబుఁ గావింపం బూనె. అపుడు లోకకార్యములు నెఱవేఱునిమిత్తము పరమేష్ఠి తనబహు కాలతపోమహిమంబున లోకముల నెల్లఁ గాంతియుతములై ప్రకాశింపఁ జేయుచుండు నంగిరసుఁడు, తనకుమారుని నగ్నిపదమున నియమించెను. అరణ్యంబునఁ దపంబుగావించుచున్న యగ్ని యంగిరసుని తేజస్సు నెఱింగి పగఁ జెంది యయ్యయో, నే నలిగి రాఁ బరమేష్ఠి నాప దంబున కంగిరసు నియమించి దేవకార్యములను నడుపుచున్నాఁడు. నేను బోకున్న లోకమున నావహ్నిత్వము పేరు లేక వినష్టమగు. కావున నే మఱలిపోయి నాపదమును స్వీకరించెద. అని యూహించి దేవలోకంబున కరిగి చూడ నంగిరసుండు తనయత్యధికతేజంబున నగ్ని స్థానమున వెలుంగుచుండుటను దేవతలకు హవిర్భాగంబు మోచి తెచ్చియిచ్చుచుండుటను గాంచి హానితేజంబునకు వెఱఁగంది మగిడి వనంబునకుఁ బోవుచుండ, నంగిరసుం డగ్నిని సమీపించి స్థావరజంగ మాత్మక మగు ముల్లోకంబులఁ గీర్తివడసిననీవ నీకార్యమును నుద్ధ రింపుము. నీవు లేకున్నఁ బరమేష్ఠి యీకార్యమునకు నన్ను నియమించె. కాని, నీ వుండ నే నీ కార్యంబున కర్హుండ నగుదునే. కావున నీకార్యమును నీవ కైకొని చీఁకటిని బాపి నిర్వహింపు మని చెప్పెను. అంత నగ్ని దేవుం డంగిరసునితో నిట్లనియె అయ్యా! ముల్లోకముల యందు నాకీర్తి మాసెను. అందఱును నిన్నే యగ్నిఁగాఁ దలంచుచు న్నారు కావున నే నాపదంబును బ్రాపింపఁ దగదు. నేనే యగ్నిత్వ మును బూనవలయు నని నీ కంత మక్కువ గలదేని నాకు రెండవ పదం బగుప్రాజాపత్యాగ్నిస్థానము నొసంగుము. నీవు ప్రథమాగ్నివై యుండుము. అనఁగా నందుల కంగిరసుం డిట్లనియె. అయ్యా! ప్రథమాగ్ని నీవై యుండుము; నేను ద్వితీయాగ్నినై ప్రాజాపత్య వహ్నిత్వమును బొందెదను. నన్ను నీకుఁ బుత్త్రుఁగా నాదరింపుము

అని పలికిన నగ్ని యట్ల యని తాను బ్రథమాగ్నిగాై యాంగీరసుని
బ్రాజాపత్యాగ్ని స్థానమున నిల్పె. అంగిరసునిపుత్త్రుండైన బృహస్పతి
తృతీయాగ్ని పదంబునం దుండెను. దేవత లందులకు హేతువు పరమేష్ఠి
నడిగి తెలిసికొని యూరకుండిరి.

నానావిధాగ్నులస్వరూపములు చెప్పుచున్నాను. ఆకర్ణింపుము.
బ్రహ్మమూడవపుత్త్రుండగు నంగిరసునకు వసుద యను భార్యయందు
బృహత్కీర్తి, బృహజ్జ్యోతి, బృహద్బ్రహ్మ, బృహన్మనసుఁడు, బృహ
న్మంత్రుఁడు, బృహద్భాసుఁడు, బృహస్పతి యను వారేడ్గురు పుత్త్రులును,
భానుమతి, రాక, సినీవాలి, ఏకానేక, యర్చిష్మతి, హవిష్మతి, మహా
మతి యనువా రేడ్గురు పుత్త్రికలుం జనించిరి. అందు బృహస్పతికిఁ
జాంద్రమసి యనుభార్యయందు శంయుఁడు, విశ్వజిత్తు, విశ్వభుజుఁడు,
ఊర్ధ్వభాక్కు, స్విష్టకృత్తు, మన్యువు ననువా రార్గురు కొడుకులును
నొకకూఁతురుం బుట్టెరి. వారిలో శంయుఁ డనువాఁడు చాతుర్మాస్య
లం దశ్వమేధమున నాజ్యభాగముతోడ మొదటిహవిర్భాగమును
గొనుచుఁ బ్రఖ్యాతుం డయ్యె. ఆశంయునిభార్య సత్య. యీయువతీ
లలామ ధర్మపుత్త్రి. ఈమెయందు శంయుఁడు భరద్వాజుఁడు, భరతుఁ
డు నను నిర్వురు పుత్త్రులఁ గనెను! వారిలో భరద్వాజుండు పౌర్ణమాస
యజ్ఞములయందు స్రుక్కున బ్రేల్వఁబడిన హవిర్భాగంబులఁ గొనువాఁ
డయ్యెను. వానికి భార్య వీర యనునది. దానియందు వీరుఁ డను
పుత్త్రుండు పుట్టి రథప్రభుఁడు, రథధ్వానుఁడు, కుంభరేతుఁ డనునా
మాంతరములతో వెలసి యాగములందు సోమముతోడ నాజ్యభాగ
మున కర్హుండై విరాజిల్లె. వానిభార్య సరయు వనునది. దానియందు
మిక్కిలి తేజోవంతుండై భానుం డనువాఁడు జనించి యాగ్నేయ హవి
ర్భాగమును గొనుట కర్హుం డయ్యె. భానున కధికకీర్తిమంతుఁడును
సంపద్యుక్తుఁడును నగు నిశ్చ్యవనుం డనుకుమారుం డుదయించె.
వానికి సర్వపాపములను బోఁగొట్టు నిష్కృతి యనువాఁడు పుట్టె.
వానికొడుకు ఋజస్కరుం డనువాఁడు. వీఁడు శరణాగతుల రక్షించు
సుస్వభావముగలవాఁడు. కావునఁ జిత్తవికలులును, క్లేశసహితులును
నగు జనులు వీనిని బ్రార్థించుటంజేసి వీఁడు స్వనుం డనఁబరఁగె. శంయుని
రెండవకొడు కగు భరతునకు భారతుఁ డనుపుత్త్రుఁడును, భారతి

యను పుత్త్రత్రయముం గలిగిరి. బృహస్పతి తృతీయపుత్త్రుండు సకలభూత
ములం దనబుద్ధిచే నాక్రమించుటం జేసి విశ్వజిత్తనంబడె. వానికొడుకు
సర్వభూతములయాహారంబుల జీర్ణించుశక్తి గలవాఁడగుట విశ్వభుజుం
డనంబరఁగె. ఆకారణంబున వాఁడు భూసురులకుఁ బూజనీయుండయ్యె.
వానిభార్య గోమతి యనునది. భర్తకారణంబున గోమతీతీరంబున సలుపం
బడు సర్వకర్మములు ఫలాంతములై నెగడు. వానితమ్ముఁ డూర్ధ్వభాక్కు.
వీఁ డూర్ధ్వముఖుండై సముద్రోదకములనెల్లఁ బానము చేసెను. ఈయూర్ధ్వ
భాక్కునకే బడబాగ్ని యని పామరనామము. వానితమ్ముఁడు స్విష్టకృత్తు
నాఁబడు. వీఁ డగ్నిహోత్రకర్మమును జేయు యజమానునిచే నగ్నియొక్క
పూర్వద్వారంబున వేల్వంబడు హవిస్సును స్విష్టించును (సంతోషముతోఁ
గైకొనును) గావున వీఁ డాపేరఁ బిలువంబడెను. వీనితమ్ముఁడు మన్యుఁ
డనంబడును. సర్వభూతములును బ్రశాంతిం జెందినపిదప వీఁడు క్రోధమ
యుండగును. కావున మన్యుఁడని పేరికిఁ బేరు. వీనికిఁ గూఁతురు స్వాహాయ
నంబడును. సుమారుండు కాముఁ డనునామమునం బరఁగు. కాముఁడు రూప
మున సర్వదేవతలకంటె సుందరుండు. మోఘుండును, సుస్థిరుండును నను
వారు కాముని యనుజులు పుత్త్రు లయిరి. వారికి మహాభాక్కనువాఁడు
పుత్త్రుండు పుట్టె. మఱియుఁ గశ్యపుఁడు, వాసిష్ఠుఁడు, ప్రాణుఁడు, నంగి
రసుఁడు, చ్యవనుఁ డనునవి రేఁపును దమకు బ్రహ్మ కెనవచ్చువాఁడు
పుత్త్రుండొక్కరుం డగ్నివర్ణమైన శిరస్సుతోడను, భానుసన్నిభంబైన
బాహువులతోడను, బంగారువర్ణముగల చర్మముతోడను, గన్నులతోడను,
నల్లని పిక్కలసౌందర్యాతిశయముచే వెలయుదేహకాంతితోడను బాంచ
జన్యుండనువాఁడు పుట్టెను. వాఁడు పదివేలేండ్లు తపంబుఁ గావించి
శిరస్సుచే బృహద్రథంతరము లను సామములను, ముఖమునందు హరిని,
బొడ్డునందు శివుని, బలమున నింద్రుని, ప్రాణమునందు వాయ్వగ్నులను,
బాహుద్వయంబున సర్వభూతములను సృజించె. మఱి బృహద్రథునకుఁ
బ్రణిధి, కశ్యపునకు మహత్తరుఁడు, నంగిరసునకు భానుఁడు, చ్యవనునకు
నౌషరుండు, ప్రాయణునకుదాత్తుఁడుం బుట్టిరి. వారివంశజు లయిదుగురు.
తపుఁడను వాఁడు పదునైదుగురు కొడుకులఁ గలిగించె. వారు సుభీముఁడు,
అతిభీముఁడు, భీముఁడు, భీమబలుఁడు అతిబలుఁ డనువారైదుగురు.

యజ్ఞముషు లొకతెగవారును, సుమిత్రుఁడు, మిత్రవంతుఁడు, మిత్రజ్ఞుఁడు, మిత్రవర్ధనుఁడు. మిత్రధర్మయు ననువా రొక్కజతగను, సురప్రవరుఁడు, వీరుఁడు, సువేషుఁడు, సురవర్చసుఁడు, సురహంతయును ననువా రైదుగు రొక్కజతగను గా నిట్లు మూఁడు మొత్తములుగఁ గూడి యగ్నులలోఁ బరస్పరకలహములఁ గలిగించుచు యజమానులయాగములకు విఘ్నము లాచరించుచు యాగఫలములఁ దా మపహరింతురు. వారిని శాంతింపఁజేయుటకు యాగములం దగ్నిచయనము గావింతురు. కావున మంత్రములవలన వీరు వీర్యరహితులై యాగములకు విఘ్నము సేయ నోడుదురు. మఱియుఁ దపుఁడు యజ్ఞప్రవర్తకులగు నైదుగురు పుత్త్రులఁ గనెను. వారిలో బృహదుక్థుఁ డనువాఁడు హోమముఁ జేయునప్పుడు యాగములలో గణ్యుఁ డయ్యెను. రథంతరుఁ డను పేరివాఁడు మిత్రవిందుఁ డను రెండవపేరితో యజ్ఞములయం దధ్వర్యులమూలమున హవిర్భాగములఁ గొనుచుఁ బుత్త్రపౌత్త్రులతోఁ గూడికొని విఖ్యాతిఁ గాంచె. నాలవయగ్ని పుష్టిమతి యనువాఁడు. వీఁడు తన్నుఁ బూజించు వారివిషయమై తుష్టుఁడగును; వారికిఁ బుష్టిఁ గావించును. కావుననే వీనికిఁ బుష్టిమతి యనుపేరు. అయిదవవాఁడు శివుఁడు. వీఁడు తన్నారాధించు దీనులఁ బ్రోచు. వారికి శుభములఁ జేకూర్చు. మఱియును దపునకుఁ బెక్కు రాక్షసులును, మానవులును బుట్టిరి. మఱియుఁ బురందరుఁ డనువాఁడు మను వను నగ్నిని గుమారుంగాఁ బడసె. ఈమను వను నగ్ని తన్నారాధించువారి సకలతపఃఫలముల నిర్వహించు. ఈమనువు బ్రాహ్మణులచేఁ బూజితుండు. ప్రాజాపత్యవహ్నిని వీఁడు నిర్వహించు. శంభుఁడు, అవసథ్యుఁడు నను వీరిరువురును మను నగ్నిపరంపరలో విఖ్యాతులైరి. మఱియు భానుఁ డనునగ్నికి సూర్యపుత్త్రియైనబృహద్భాస, నిశయు ననువార లిరువురు పత్నులైరి. బృహద్భాసకు నలువురు కొడుకులు పుట్టిరి. వీరిలోఁ బెద్దవాఁడు దుర్బలులకు బలమును గల్పించు వహ్నియై బలదుఁ డని పేర్కొనఁబడెను. రెండవవాఁ డగ్నులు శాంతిఁ బొందినపిదపఁ దాను ద్యుతిమంతుండై వెలుఁగు. అట్లు దారుణమైన వెల్గుతోఁ బొడసూపును గాన నతండు మన్యుమంతుం డనం బరగె. దర్శపూర్ణమాసములప్పుడు హవిర్భాగంబులు గొనుచు మూఁడవ

వాఁడు ప్రసిద్ధుండై విష్ణుఁ డనియు ధృతిమంతుఁ డనియుఁ బేర్కొనఁ బడెను. నాల్గవవాఁడు చాతుర్మాస్యయజ్ఞములయం దింద్రునితో నాగ్ర యణేష్టి హవిస్సును గొనుటం జేసి యాగ్రయణుం డనఁబడెను. నిశకు నగ్నీషోము లనుబా రిరువురు పుత్త్రులు, మఱియు నొక్కకూఁతురును బుట్టిరి. భానుఁడు వేఱొకభార్యయం దేవురు ప్రత్యేకాగ్ను లగు పుత్త్రులం బడసె. వారిలో వైశ్వానరుండు చాతుర్మాస్య యజ్ఞములయందు విప్రులచేఁ బూజితుం డగును. రెండవవాఁడును స్విష్టకృత్తనువాఁడు. వీనికి విశ్వపతి యని నామాంతరము. వీఁడు విశ్వమున కంతటికిఁ బ్రభుఁడై యీయగ్నియందు వేల్చి పూజించువారియిష్టమెల్ల ఫలవంత ముగఁ జేయును. మూఁడవవాఁడు హుతాశనుఁడు కర్మఠులైనవారికి నితఁడు ధూమాద్యర్చిరాదిగతులకు హేతుభూతుండు. సకలహుత పదార్థములను మోచికొనిపోయి దేవతల కొసఁగుఁ గావున హుతవహు డనఁబరఁగె ఇతఁడు సకలప్రాణుల శరీరము నాశ్రయించియుండి శబ్ద రూపములను సాధనుండై యుండు. ఇతఁడు హిరణ్యకశిపుపుత్త్రియగు రోహిణి యనుదానిఁ బెండ్లాడి పుత్త్రులంగనెను. నాలవవాఁడు కపిలుఁ డను తురీయాగ్ని. ఇతఁడు లోకమునందు సాంఖ్యయోగమును బ్రవ ర్తిల్లఁజేసిన మహానీయుండు. ఐదవవాఁ డగ్రణియనఁబడును. ఇతఁ డన్ని కర్మములయందు సకలభూతముల కగ్రమున నుండువాఁడు. కావున నగ్రణి యనఁబడెను. మఱియు నానావిధములగు నగ్నులు పెక్కండ్రు సకలధర్మకర్మములను నిర్వర్తించువారుగఁ బ్రకాశించిరి.

అగ్నిహోత్రములకు వాయువువలన సంసర్గదోషము లాపా దించె నేని వానికిఁ బ్రాయశ్చిత్తంబు లున్నయవి. ఆహవనీయ దక్షిణాగ్ని గార్హపత్యాగ్ను లనఁబడుత్రేతాగ్నులు వాయువశమున నొండొంటిం గలసినఁగాని, దావాగ్ని తాఁకుడు గలిగినఁగాని, యగ్ని శుద్ధ్యర్థమై యష్టా కపాలముచేత, రజస్వలయైనస్త్రీ యగ్నుల స్పృశించెనేని వసుమంతుఁ డగు నగ్నికొఱకు నష్టాకపాలముతో, నిష్టిఁ జేయువలయును.

అగ్నులకు జాతకమృతులయాశౌచవార్త వినుటవలన నాశౌ చులగువారిస్పర్శ వాటిల్లుచో సురభిమంతుఁ డగు నగ్నిని నావహించి యందుఁబైతీసిన నన్నము వండి యాయన్నము నాయగ్నియందు నిష్టిఁ జేసినయెడల జాతకమృతాశౌచులసంస్పర్శదోషములు నివర్తించును.

ఆర్తుండైన విప్రుఁడు వరుసగా మూఁడు నాళ్లగ్ని వేల్వఁడేని తంతుమంతుఁడగు నగ్ని నావహించి యష్టాకపాలేష్టి చేయ వలయును.

దర్శపూర్ణమాసములు నిలిచెనేని పథికృతుఁడగు నగ్ని నావహించి యష్టాకపాలేష్టిని జేయవలయును. దాన దర్శపూర్ణమాసస్థాలీపాకాకరణదోషము నివృత్తి యగును.

అగ్నులకు సూతికాస్పర్శము కలుగుచో నగ్నిమంతమను నగ్ని యందు నష్టాకపాలపురోడాశముతో నిష్టి చేయవలయును.

అప్పుఁడనునగ్ని ముదిత యనుదాని వివాహమాడి యానియందద్భుతుఁడను పుత్త్రునిఁ గాంచెను. వాఁడు సర్వభూతములకధినాథుఁడై లోకకార్యముల నెల్లఁ జేయుచు గృహపతి యనఁ బిలువఁబడెను. ఇతఁడు దేవతలకు హవ్యముల మోచికొని పోవుచుండెను. అంత వాఁడొక్కనాఁ డథర్వుఁడను నగ్నినిఁ బిలిచి నేను మిక్కిలి బలహీనుఁడ నైతిని. హవ్యములను దేవతలకు మోచికొనిపోవం జాల. నీవు మోచికొనిపోయి వారి కిచ్చునది యని చెప్పి సముద్రమును జొచ్చెను. దేవతలు వాని వెదకుచుండ సముద్రములోని జలచరములాపులికుమారుఁ డద్భుతుఁ డనునగ్ని సముద్రమున డాగియున్నవాఁ డనఁగా వారు వాని సముద్రమునందు వెదకి కాంచి ప్రార్థించిరి. కాని, వాఁడు దేవతలప్రార్థన నంగీకరింపక తా నుండుచోటు మత్స్యములు దేవతలకు సన్న చేయుచుండుటచేఁ గినిసి మీ రనవులు నిర్దయులై నానావిధోపాయంబుల మిమ్ము వధించి భక్షింతు రని మీలకు శాపమిచ్చి శరీరమును వదలి భూప్రదేశగతుం డయ్యె. అట్లగుటం జేసి యాయద్భుతుం డను నగ్ని మోమునందు గంధకము, నెముకలయందు దేవదారువును, శ్లేష్మమున స్ఫటికము, పిత్తమున మరకతము, వాయువు నుండి కృష్ణాయసము, గోళ్లయం దభ్రకము, నరములయందుఁ బగడము మఱియు ననేకధాతువు లుత్పన్నములైనవి. ఆవిధమున గృహపతి యను నగ్ని శరీరమును వదలి తపం బొనర్చుచుండ భృగువు, అంగిరుఁడు మొదలుగాఁగల మహర్షులు తాము తపంబు సేసి యాయగ్నికి యాప్యాయనముఁ జేయఁగా నతండు వెడలివచ్చి యామునుల తేజస్సునకు భీతిల్లి మఱల సముద్రమును జొచ్చెను. అంత జను లెల్ల భయకంపితులై యథర్వాంగిరసు నాశ్రయించిరి. దేవతలును నాయథ

ర్వు ననేకవిధముల భజించిరి. ఆతండు తనదివ్యదృష్టిం జూచి గృహ
పతి యని పేర్కొనంబడిన యద్భుతుం డనునగ్ని సముద్రముం జొచ్చి
యున్నవాఁ డని యెఱింగి సర్వభూతములును జూచుచుండ సముద్ర
మును జిలికెను. అంత నద్భుతుఁ డను నగ్నిహోత్రుఁడు కడలి వెలు
వడిరాఁగా నథర్వుండు వాని బహుప్రకారంబులఁ బ్రార్థింప లోకహి
తార్థము మఱలఁ దనహవ్యవాహత్వమునకుఁ బూనుకొనెను. అగ్ని
హవ్యముల మోవ నొల్లక నానాదేశముల సంచరించునెడ ననేకనదు
లలో డాగి యుండుటం జేసి యానదుల తీర్థములు పావనము లయ్యె.
అవి సింధువు, దేవిక, సరస్వతి, గంగ, శతకుంభ, సరయువు, గండకి,
చర్మణ్వతి, తామ్రావతి, వేత్రవతి, కౌశికి, తమస, నర్మద, గోదావరి
వేణ (పెన్న), కావేరి, కృష్ణవేణి, కపిల, శోణ మొదలగు నదు లీకార
ణంబున మఱియుఁ బ్రశస్తములైనవి.

ఆయద్భుతుఁ డనునగ్ని ప్రియ యనుభార్యను వివాహమై
విదూరథుఁ డను కుమారుం గాంచె. సోములును నగ్నితో సమానులుగ
నెన్నుకొనంబడిరి. అత్రివంశమున మానసపుత్రు లనేకు లుద్భవిల్లిరి.
అత్రి తనపుత్త్రుల సృష్టిఁ గావింపఁ బూనఁగా వారలకు నిరోధము
గలిగె. ఆకారణమునఁ దత్కాయమున ననేకాగ్నులు వొడమె. అగ్ను
లనేకములైనను వాని తేజస్సొక్కటియే. జ్యోతిష్టోమయాగమున ననేక
యాగము లుత్పత్తినొందుచందమున నొకయగ్ని తేజస్సున ననేకాగ్నులు
పుట్టినవి. ధర్మజా, అగ్నివంశమును వివరముగాఁ జెప్పితి. ఇఁక నద్భు
తునకు సప్తర్షులభార్యల నిమిత్తముగాఁ బుట్టిన దేవసేనాని కుమార
స్వామివృత్తాంతంబు వినిపించెదను. మిక్కిలి శ్రద్ధాభక్తులతో వినుము.
అని చెప్పి మార్కండేయుం డిట్లనియె.

### కుమారస్వామిచరిత్రము

పూర్వకాలమున నొకప్పుడు దేవదానవులకు ఘోరరణమయ్యె
ను. ఆసంగ్రామమునందు దేవత లోడిరి. రాక్షసు లుక్కుమిగిలి వర్తిం
చిరి. అంత దేవేంద్రుండు మనంబునఁ జింత గదుర నాలోచించి దేవ
తలఁ బ్రోత్సహించి, పనిగొనునాయకుం డొకఁడు లేమిచేఁ బలుమాఱు
లీయపజయము సంప్రాప్తమగుచున్నది. ఈదేవసేనకుఁ దగిననాయకు
డెవండొ కాఁగలఁడో యని యాలోచించుచు మానసం బనుపర్వతమును

సమీపమున నాలోచించుచుండె. అట్లుండ నెటనుండియో యొకయాడు కూయి 'నన్నుఁ గాపాడరే. నాకుఁ దగినమగని నియమింపరే' యని వినరాఁగా నాయార్తనాదంబు వినవచ్చు దిక్కుమొగంబై యింద్రుం డటకుఁ బోయెను. అప్పు డొకఘోరాకారుండైన రక్కసుండు కేశి యనువాఁ డొకసుందరాంగిం దఱుముచుఁ, జెయిపట్టి యీడ్చుచుండ, నక్కన్నియ దివ్యకన్యకగాఁ దలపోసి,కృపాళుండై యింద్రుఁ డారక్కసు బాఱినుండి దాని విడిపింపఁ దలపోసి, కిరీటధారియు గదాపాణియు నగు నారక్కసునకుఁ జూచి యోరీ ! ఈకన్నియను వదలుము. నే నింద్రుండను; వజ్రపాణిని. ఈ యాఁడుపడుచు నేల యేచెదు? చెడ కుము. నావచనమును వినుము. అనఁగా నాపలలాశి యింద్రుని ధిక్క రించి వానిపైఁ దనచే నున్న గదను వేసెను. అంత నింద్రుండు తనచేత నున్న వజ్రముతో నాగదను తుత్తునియలు సేసెను. అంత నారక్క సుండు మఱియుం గినిసి సమీపమున నున్న పర్వతశిఖరము నొక దానిం బెకలించి యింద్రునిపై నేయఁగా నాశిఖరమును దనవజ్రముచేఁ ముక్కలుసేసెను. రక్షోవీరుఁడు సేయునది లేక యాకన్య నట విడిచి పలాయితుఁ డయ్యె. అంతట నప్పాకశాసనుం డాకన్నియం జేరి యిట్లడి గెను. అమ్మా! నీ వెవతెవు? ఎవ్వరివానవు? ఏమి యొనర్పనున్న దా నవు? అని యడుగ నది యిట్లనియె. దయామయా! నే నరిష్టనేమి యను ప్రజాపతికూఁతురను. నన్ను దేవసేన యందురు. నాచెలియలు దైత్యసేన. మే మిరువురము మాతండ్రియొద్ద సెలవుఁ బొంది చెలులతో విలాసార్థ మీ మానసశైలపరిసరంబున విహరించుచుండ నీకేశి యను రక్కసుండు మాయిరువురం గామించి బలాత్కరింప వానిని నాచెలి యలు దైత్యసేన యిష్టపడి వరియించె. ఈ ఘోరాకారునియందు నా మనసు గొల్పదు. కాని, వాఁడు నన్ను వదలక యెటు లేని నన్ను లోఁ గొన యత్నించుచుండ వానిబాఱినుండి తప్పించుకొనుటకుఁ బరువె త్తుచు నాక్రందనంబుఁ జేయ నాపాలిటి దైవమై నీవు వచ్చి నన్ను రక్షించితివి. నీవు నిర్ణయించుపురుషునిఁ బతిగా వరించెద. అనఁగా నింద్రుండు దానికి ప్రతివచనము నిట్లు సెప్పె. అమ్మా, నీతల్లియుఁ నా తల్లియుఁ బ్రజాపతియైన దక్షునికూఁతులు. నీవు నాకుఁ జెలియలివి. నీకుఁ దగినవాని వరుని నొందెని నేమకి వివాహము చేసెద. అయిన నీబల

మెట్టిది ? సుమన్వ మన నాకన్నియ నాఖండలునితో నిట్లనియె. అయ్యా! నే నబలను. నాకు మహాబలుండగు పురుషునిం బతిగాం వరింతు. ఏలయన్న, నాతండ్రి యరిష్టనేమి నాపసితనంబున నన్నెత్తికొని ముద్దాడుచు రాక్షసుల జయించువాండును, బురుహూతమిత్రుండును, దేవసేనానియు నగు నొకమహాబలుండు నీకుం బతియయ్యెడు మనివరము నిచ్చియున్నవాండు. అట్టి బ్రహ్మణ్యమూర్తిం గాని నేను వరియింప ననంగా నింద్రుం డిట్టిపురుషుం డెవ్వండా యని యాలోచించి యాసమయమమావాస్యా ప్రాతఃకాల మగుటం జంద్రసూర్యసమాగమ సమయమ్మై యుదయకాలసాంధ్యరాగద్యుతితో సముద్రోదకంబు లోహితవర్ణంబై యుండుటయు, భృగ్వాంగిరః ప్రముఖులగు సప్తర్షులు ప్రేల్చిన హవిస్సుల నగ్నిహోత్రుండు మోచికొని దేవతల కొసంగుటకు సూర్యమండలంబుం బ్రవేశించుటయుం బర్యాలోచించి యాముహూర్తము రౌద్రనామకం బని గుర్తించి, యప్పుడే భానునిం బరివేషము ఘోరముగం జుట్టియుండుటయు గని, సింధునది యుదకములు శోణితవర్ణము గలవై ప్రతీకూలవాహినిగాం బాఱుచుండుటం జూచెను. మఱియు మిడుగుఱు లప్పుడు బయల్పడెను. శివారుతంబులు వినంబడెను. ఈచిహ్నములచే నతిశీఘ్రముగ దేవాసురయుద్ధ మొకటి కా నున్నట్లు తెలిసెను. ఈయాలోచనమున నేర్పడిన ఫలిత మే మనంగా సోమసూర్యాగ్నిసంభవుండై నవాండు గాని దీనికిం బతి గాం డనియు, నతండు భావిదేవాసురసమరమున దేవతలసేనాపతియై రక్కసుల నుక్కడంచు ననియు నూహించి యాకన్నియం దోడ్కొని బ్రహ్మపాలికిం బోయి పరమేష్ఠీ! ఈకన్నియకుం దగినవరుని నియమింపు మనం బితామహుం డింద్రునితో నిట్లనియె. బృందారకవరా! నీయాలోచనమెయి సోమసూర్యాగ్నిసంభవుం డైన శూరుండే దీనిభర్త. ఆ మహనీయుండే నీసేనాపతి యయి దానవుల నోడించు నని చెప్పంగా నాఖండలుండు పితామహునకు నమస్కరించి యాతనిసెలవుం గొని యాకన్నియం దోడ్కొని వసిష్ఠాదు లగుసప్తర్షులు దర్శహోమమును జేయుచుండ హవిర్భాగముం గొనునిమిత్తము తదీయాశ్రమమున కేంగెను. అప్పు డాబుధు లద్భుతుం డనునగ్ని నావాహనము సేయంగా నాండు సూర్యబింబమునందుండి వెలువడివచ్చి వా రిచ్చిన

హవిర్భాగంబులం గొని దేవతల కిచ్చుటకొఱకు మరల సూర్యునిఁ బ్రవేశింపఁబోవువాఁడు హోమకాలమునందు సప్తర్షులభార్యలసౌంద ర్యమును జూచి వారలఁ గామించి వారిసంగమ మపేక్షించె "వారు లోకోత్తరశృంగారవతులు, పరమపతివ్రతలు, ఇట్టివీరికి నామనంబు నెట్లెఱుకపఱతు?' నని యద్భుతుండు కొంత యాలోచించి గార్హపత్యాగ్నికుండముఁ బ్రవేశించి యందుండి చలించినచిత్తముతో వారి యతిశయసౌందర్య మెల్లఁ గనుచుండె. అంత నాయగ్ని వారిపైఁ దన మరులు నిలుపలేక దేహపరిత్యాగము గావింప వనంబునకుఁ బోయె. వానిభార్య దక్షునికొమార్తెయైన స్వాహాదేవి వీనిసమాగమమును గోరి, వీనిమనోవిభ్రమములం దెలిసి యదియ యదనుగాఁ గొని, తన మనంబున నిట్లు యోచించె. "నేను సప్తర్షిభార్యలరూపు దాల్చి నా భర్తతోఁ గలిసి యతని నభిమతక్రీడలం దేల్చెద" నని నిశ్చయించి ప్రథమమున నంగిరసునిభార్య శివ యనుదానిరూపుఁ దాల్చి దేహంబు విడువ వనంబునకుఁ జని యున్నయగ్నిపాలికిం బోయి "పావకా! సప్తర్షులభార్య లందఱును నీతేజస్సును మనంబున నూహించి నిన్నుఁ గవయఁ గోరియున్నారు. నేను నంగిరసునిభార్యను శివ యనుదాన. నా యందు నీ విష్టోపభోగముల ననుభవింపుము. వారందఱుఁ గూడి తొలుత నన్ను నీకడకుఁ బొమ్మనఁగా నిప్పుడు నీపాలి కేతెంచిని. నన్నుపభోగించి నాకోర్కె నీడేర్పుము. నీవు నన్నొల్లక నిరాకరించితి వేని శరీరత్యాగం బవశ్యంబు గావింతు" నని నిజభావము నామనోభవ వికారమున కెఱింగింప దానిం జూచి యద్భుతుండు నేను బుష్పబాణ పీడితుండ నగుటను మీ రెట్లెఱింగితి రనఁగా శివారూపమున నున్న యామాయలాడి స్వాహాదేవి యగ్ని కిట్లనియె. "మాకెల్లరకు నీపై వలపు గలదు. అయిన నీకు వెఱచి నీచిత్త మెటు లుండునో యని యిన్ని నాళ్లూరకుంటిమి. ఇప్పుడు నీహావభావములవలన నీనిజహృదయ మెఱింగితిమి. నీవును మమ్ము వలచియున్నవాఁడ వని యెఱింగితిమి. కాన జంకు వదలి నీయొద్దకు మున్న నేను వచ్చితి. నన్నుపభోగించి కామబాధనుండి తప్పింపుము" అనఁగా నగ్ని విని సంతుష్టుండై దానిం జేరఁదీసి కౌఁగిలించి యిష్టోపభోగములం దేల్చె. అంత స్వాహాదేవి వాని

రేతస్సును వాల్చి మనంబున నిట్లు చింతించె. నే నీరూపంబుతోఁ బోయితినేని లోకులు సప్తర్షిభార్యల సంశయింతురు. వారికి నిరాప నింద రాఁగూడ దని గరుడిరూపమును దాల్చి, రాక్షసపిశాచపన్నగాది భయంకరభూతగణములతోఁగూడి నానావిధ భయంకరమృగసంకుల మైన శ్వేతపర్వతంబు నధిగమించి గంగాతీరమునందు శరస్తంబ ముచే నావరింపఁబడియుండు కాంచనకుండమున నా రేతస్సు నుంచెను. ఇట్లు స్వాహాదేవి వరుసగా సప్తర్షిభార్యలలోఁ దక్కటివారి రూపులం దాల్చి యగ్నితోఁ గ్రీడించి వాని రేతస్సంగ్రహణముఁ జేసి శరవణపరివృ తమైన కాంచనకుండమునందు దానిని నిక్షేపించుచుండె. కాని, వసిష్ఠు భార్య యరుంధతిరూపును మాత్రము దాల్పఁజాలదయ్యె.

## కుమారస్వామి యవతారము

అవ్విధంబున ఋషిపత్నులయార్వురరూపములం దాల్చి స్వాహా దేవి యగ్నితో సంగమించి స్కన్నంబగు నాతని రేతస్సును గొని రెల్లుచేఁ జుట్టఁబడిన కాంచనకుండమునం దిడుటచే దానినుండి బలపరాక్రమశాలి యొక మహాపురుషుఁ డుద్భవిల్లెను. వాఁడు స్కందుండు నాఁబరగె. శుక్ల పక్షపుఁబాడ్యమినాఁడు రేతస్సేచనము, విదియనాఁడు పిండ మయి తృతీ యనాఁ డాఱుతలలు పండ్రెండుభుజములు, పండ్రెండు నేత్రములు, పండ్రెండు శ్రోత్రములతో బాగుగ శరీరముదాల్చి చవితినాఁ డంగప్రత్యం గము లేర్పడి రోహితవర్ణముగల తను వొంది యొక కేల శివధనుస్సువంటి వింటిని ధరించి, వేఱొక కేల గుణమును సారించి ధనుష్టంకారమును జేసెను. ఆధ్వనికి దద్దరిల్లి, చిత్రైరావత నామకంబులగు పాములు భూబిల ములనుండి పైకి రాఁగా నా రెంటిని రెండుచేతులఁ బట్టుకొని, యొకచేత శక్తిని, వేఱొకచేత విలాసార్థముగఁ గుక్కుటమును దాల్చెను. అంత నున్నట్టుండి యొక యఱపు నఱచెను. మఱియుఁ బైకి లంఘించి రెండు చేతుల శంఖంబుఁ బట్టి దాని బిగ్గరగాఁ బూరించెను. అప్పుడ మూఁడు లోకములను మ్రింగ నున్నాఁడో యనునట్లు కొండగుహలవంటి యాఱు నోళ్ళ నొక్కమాఱు దెఱచెను. రెండుచేతులను పైకెత్తెను. ఆకసమును దన్నునో యనునట్లు కాళ్ళను పైకి లేవ నెత్తెను. బాల్యచేష్టల కనుగు ణంబుగా నోట రెండువ్రేళ్లు పెట్టుకొని కుడుచుచుండెను. అతిభయంకర

ముగా నటిచి యుక్కుమీఱ బెట్టిదంబులైన బాణంబు లేసి క్రౌంచపర్వ తమును భేదించెను. హంసలకు నావలికిఁ బోవునట్లు, దారితీసెను. శ్వేత పర్వతశిఖరమును శక్తిపాతంబునఁ గ్రిందికి ద్రొబ్బెను. ఆశిఖరము భయంకరముగఁ గ్రిందఁ బడఁగా నావేగమునకు భూమి యదరెను, పర్వతములు నుగ్గయినవి. అంతఁ బంచమినాఁ డీమహాకార్యములకు లోకు లెల్లరన్య శరణంబు లేక యాకుమారుని శరణుఁజొచ్చిరి. వారి కభయంబు నాకుమారుఁ డొసంగెను. వసుంధరయు, ధరాధరంబులును గుమారు సేవించి భద్రంబులై నిలిచె. అట్లమ్మహాసేనుం డుద్భవిల్లుటయు ఘోరోత్పాతంబులు ప్రభవించె. ఇంద్రునిచైత్రరథవనవాసులు గుంపులుగుంపులుగాఁ గూడి యగ్నిసప్తర్షులభార్యలఁ బొందుటచేఁ బుట్టినపుత్త్రునివలన లోకమునకు మహోపద్రవము వాటిల్లనున్నయది. ఈయుత్పాతంబుల కదియే కారణం బనిరి. మఱికొందఱు వినత గరుడరూపమున నగ్ని రేతస్సును గొని పోవుచుండినది యని తలంచి, వినతవలన నింత యనర్థము గలిగె ననుచుండిరి. కాని, యెవరును నింతకుఁ గారణము స్వాహాదేవి యనుట నెఱుంగరు. గరుడి యీమాట విని స్కందునికడ కేఁగి నేను నీకుఁ దల్లి నని నుడివెను. అంత సప్తర్షులు దివ్యతేజంబుతో వెలుఁగుచున్న కుమారునిఁ గాంచి తమ పత్నులను నెడఁబాసిరి. కాని వసిష్ఠుఁ డరుంధతిని విడువఁ డయ్యె. వనవాసు లందఱును నాలుగురు ఋషులపత్నులకే యీపుత్త్రుఁడు జన్మించె నని పలికిరి. అయినను స్వాహాదేవి యీతఁడు నాకు బుట్టినకుమారుఁడు నేన వీనిపుట్టుకకుఁ గారణ మని సప్తర్షుల కెఱిఁగించెను. సప్తర్షులలో విశ్వామిత్రమహాముని యిష్టినిఁ బూర్తిగావించి యదృశ్యుఁ డయి, కామపీడితుఁడైన యగ్నిని వెనుదగిలి చనెను. కాన నతఁ డీయుదంతము నెల్ల నెఱింగి యుండెను గావున ముందుముందుగా నక్కుమారుని శరణుచొచ్చి, వేదమంత్రములచే నతనిం బొగడి కుమారునకుఁ జేయవలసిన పదుమూడు మంగళముల నొనర్చి, జాతకర్మ మొదలగు క్రియ లెల్ల నెఱవేర్చెను. ఆవల నమ్మునీంద్రుఁడు కుమారుమహిమను దెలిసి యతనికిఁ గుక్కుటధ్వజత్వమును, శక్తిసాధనమును, పారిషదులను నొసఁగి లోకహితమునకై యీకర్మ నెల్లఁ గావించుటంజేసి, కుమారునకు నిష్టుఁడయ్యె. స్వాహాదేవి మాతృరూపంబుఁ దాల్చి యిట్లొన

ర్చె నని యెఱింగి సప్తర్షులకు స్వస్వపత్ను లిందు దోషవతులు గారని యెఱింగించెను గాని, వారామాటలు వినియుం దమపత్నులం బాసిరి. ఆసమాచార మంతయును దెలిసి దేవతలు వజ్రపాణికడ కేఁగి కుమారుపలన భయము కలుగుచున్నది. వాని నిప్పుడ సంహరింపవలయును. కానిచో నింద్రుఁడు వాఁడవధ్యుఁడని యోఁచించుచుండ వానివలనముల్లోకములకుఁ జెఱుపు వచ్చునని వేల్పు లనిరి. అంత నింద్రుండు భీతుండై మఱియు నిట్లని తలంచె. కుమారుం డతిబలుండు. నాచే నవధ్యుండు. వాఁ డలిగె నేని బ్రహ్మ నేనిఁ జంపు. కావున వానిజోలి మన కేల ? అనఁగా వారలు దేవేంద్రునితో నిట్లనిరి. నీ వాకుమారు వధింపఁ జాలవేని, వానిం జంపుటకు లోకమాతలం బంపుము. వారు వానిం దెగటార్చెద రనిరి. అంత నింద్రుండెట్టకేలకు వారిమాటల విని యెట్టకేని మాతృగణంబుల కుమారువధార్థమై నియమించి పంపె. ఆమాతృగణములు కుమారు సమీపించి వానితేజోబలవీర్యమహిమలం గాంచి వానిఁ జెనక వెఱచి వానితో "మేము సప్తమాతృకలము. నీకుఁ దల్లుల" మని వినయపూర్వముగ విన్నవింప వారిని స్కందుం డనుగ్రహించె. వారు తనకుఁ దల్లులగుటచే వారిచనుబాలఁ ద్రావనారంభింప వారిచన్నులు చేఁపె. అంత వారు స్కందునకు యథార్థముగఁ దల్లులైరి. అంత నగ్ని దేవుండు కుమారుపాలికి వచ్చుటయు స్కందుండు సప్తమాతృకలతో నెదురేఁగి యయ్యగ్నిని బితృభావమునఁ బూజించెను. అంత నగ్ని మాతృగణసమేతుఁడయి కుమారసంరక్షణపరుండయి మాతృకలయందఱ కోపవశమున జన్మించిన యొకర్తుక శూలము చేబట్టి దానిగ్రాఁ యాకుమారునిఁ దనతనయుంబోలెఁ గాపాడుచుండె. లోహితసముద్రమునకుం గూఁతురగు నొక్కర్తుక లోహితముఁ ద్రావుచుఁ గుమారునిఁ గౌఁగిలించుకొని పుత్రుంబోలెఁ గాపాడెను. అగ్నిహోత్రుండు పెక్కుబిడ్డలుగల మేఁకతలతోఁగూడిన మృగము మాడ్కి బొమ్మలతో నాటలాడించుచున్నట్లుండెను. గ్రహములు, ఉపగ్రహములు, ఋషులు, సప్తమాతృకలు, హుతాశనప్రముఖులగు పారిషదులగణంబులు వీరు గాక తక్కుంగల స్వర్గవాసు లను ఘోర రూపులు మాతృగణంబులతోడ నీమహాసేనుం జుట్టుముట్టి వేడుకలు చూపుచు సంతోషపఱచుచుండిరి.

అదియెల్ల నెఱింగి యింద్రుండు కుమారునిపై నీసు జనింప, దేవ సేనం గూర్చుకొని, యైరావతారూఢుండై వజ్రపాణియై కుమారునితో యుద్ధ మొనర్పఁ గట్టాయితుఁడయి వచ్చి శంఖంబు పూరించి మల్లు సర చుటయును జూచి కుమారుండు ప్రతిసింహనాదంబు చేసి యాఱు మోములనుండి యగ్నికణములను మహాభయంకరంబుగా నుమియ నా యగ్నితాఁకుడునకు దేవతలు భీతిల్లి వేఱెవ్వరిని శరణముఁగానక, నక్ష త్రముల మాడ్కిఁ దేజరిల్లువానిని కుమారునే శరణమును బొందిరి. అంతఁ గుమారుఁడు శరణన్నవారిని రక్షించెద నని వారికెల్లర కభయప్ర దానం బొసంగె. అంత నింద్రుండు కుమారునకు జంకక వానిపై వజ్రా యుధంబు నేసెను. ఆమహాసాధనము కుమారు కుడిపార్శ్వమును భేదిం పఁగా దానినుండి వేఱొకకుమారుండు కుండలములు ధరించుకొని, బం గారుచాయ గలవాఁడు, మేఁకపోతుమోము గలిగి, విశాఖుం డను నామముతో వెలువడెను. వాఁడు ప్రళయకాలాగ్నివలెఁ దేజస్సున వెలుంగుచుండె. అంతేకాక, యనేకకుమారులును, గన్యలును బుట్టిరి. వీరి నందఱం జూచి నముచిశత్రువు వెఱచి చేతులు రెండుజో డించుకొని కుమారుని శరణువేఁడఁగా, ససైన్యుఁ డగుపురుహూతున కామహనీయుం డభయ మొసంగి కాపాడెను. ఆదరభావంబునఁ జూచెను. దేవతలును సంతసిల్లిరి. కుమారునివలని భయము తొలఁగిరి. అంత వారు పూలవాన గురియించిరి. దుందుభుల మ్రోగించిరి. అప్సరసలచే నాట్య మాడించిరి. ఇట్లు స్కందుఁడు సకల దేవతా సత్కారములం బడసి వెలసియుండె. కుమారుదేహంబునఁ బుట్టిన కుమారులును, గన్యలును విశాఖునిఁ దండ్రిగా భావించికొని లోకము లోని స్త్రీజనులగర్భములను, శిశువులను వేధించుచు వధించుచుం దురు. అట్లు గాకుండునిమిత్తముగ జనులు తచ్ఛాంత్యర్థము కన్యా కుమారగణములను, గుమారుని, రుద్రరూపుఁడగు నగ్నిని, పార్వతీ రూపిణియగు స్వాహాదేవిని బూజించి మ్రొక్కుచుందురు. తపుఁ డను నగ్నివలనఁ బుట్టినకన్యలు కుమారునొద్ద కేతెంచి మేము నీయ నుగ్రహమును బొంది లోకమాతలుగఁ జరింపవలయు నని తలం తుము. నీవలన మాకు లోకపూజ్యత గలుగవలయును. మాకుఁ బ్రీతి కరంబుగ నీవరమును బ్రసాదింపు మనఁగాఁ గుమారుండు వారియెడఁ

ప్రీతుండై వారు కోరినట్లొనర్చెను. అంత కాకి, హలిమ, హాలి, యార్యా, బాల, బృంహిళ, ధాత్రి యనువారేడ్గురును గుమారుమాతలైరి. వారు వారిపుత్త్రులు లోహితాక్షుఁడు, భాగవక్త్రుఁడును గలిసి దోష్మండుగురు కుమారునసుజ్ఞ లోకపూజితులై చరింతురు. ఇఁకఁ గుమారువృత్తాంతం బటుసైనిఁ గొంత పరిశీలింతుము గాక! కుమారుఁడు స్వర్ణకవచమును ధరించెను. లోహితాంబరధారియై విరాజిల్లెను. దివ్యకుండలములు వాని వీనుల వెలసెను. ఇట్లుమహనీయుండు తీక్ష్ణదంష్ట్రుఁడై సర్వలక్షణయుతుఁడై, లోకప్రియుండై, తరుణుఁడుగా నుండ భవనైకలక్ష్మి పద్మ, తనంతన యాతనిఁ జేరెను. అప్పు డాకుమారుండు నిండు కళలతో నొప్పారు నిశాకరుంబోలి వెలుంగుచుండె. అంత బ్రహ్మవాదులగు భూసురులును బ్రహ్మర్షులును గుమారు సమీపించి యిట్లనిరి. దేవుఁడా! నీవుసామాన్యుండవు గావు. పుట్టినయాఱునాళ్లలో నింటఱ వశులఁ గావించికొంటివి దేవతలు నీకుఁ బ్రియులైరి. ఇంద్రుఁడు నీకు విధేయుం డయ్యె. పరమకారుణికుండవై శరణన్నవారి కెల్ల నభయదానం బిచ్చితివి. నాకాధిపత్యమును నింద్రపదవి ననుష్ఠింపుము. లోకములకు శుభము లొనఁగూర్పుము. అని ప్రార్థింప, గుమారుం డింద్రపదమునసుండి చేయవలసినపనులెయ్యవి యని యడుగ మునులిట్లనిరి. ఇంద్రపదముననుండువాఁడులోకులకు బలమును, తేజస్సును, సౌఖ్యములను సమకూర్పవలయును. వాని ననేకులు పూజింతురు. వారిపూజలకు మెచ్చి వారికి వరములొసంగవలయు. దుర్మార్గులను శిక్షింపవలయును. శిష్టుల నందఱఁ బరిపాలింపవలయును. పంచమహాభూతములకు నెక్కుడుశక్తిని గలిగించుచుండవలయును. సూర్యాగ్నుల తేజస్సుల దీప్తిమంతములుగఁ జేయవలయును. నీకు సాటియైనవిక్రమతేజంబులు గలవా రెవరును లేరు. నీవంటివానికే యీయింద్రాధిపత్యము దగియుండును. కావున నీముల్లోకములకు నీవే రాజవై యేలుము. ఇది మాయభిమతంబు. మే మెల్లరము నిన్నుఁ గొలుచుచు నీయాజ్ఞను శిరంబునవహించి యొనర్చుచుండెదము. అని చెప్పుచుండ నింద్రుండు కుమారస్వామి కిట్లనియె. మహావీరా! నీవ యింద్రపదం బధిష్ఠింపుము. మాకెల్లరకును ముల్లోకములనునధిపతివై విరాజిల్లుమనఁగా స్కందుఁ డింద్రునితో ని ట్లనియె. "పురందరా! నీపదంబున నీ వుండుము. నేను నీపంచిన సర్వకార్య

ముల నీకనుసన్న మెలంగుచుండెద. సర్వమును విజితమయ్యెడు" మనఁగా నింద్రుం డాదేవునితో నిట్లనియె. నీ వతిబలశాలివి. రక్కసుల గెలువఁ జాలుదువు. నీ వతి బలశాలి వని జను లెఱింగి స్వర్గాధిపత్యమునఁ జాలని నాకును, నీకును బగ గలిగించిరి. పగ గలిగె నేని నిన్ను నే సాధింప శక్తుండఁ గాను. నన్ను నీ వొకక్షణమున నడంతువు. బలవంతుండైన వాఁడే నాకాధిపత్యమున కర్హుఁ డగును. కావున మాటాడక యింద్రుండ వగు మనెను. అంతఁ గుమారుండు దేవేంద్రునితో నిట్లనియె. దేవా! ఈముల్లోకములకు నెప్పటియట్ల నీవేయధిపతివి. నేను నీకనుసన్న మెలఁగు చుండెద. నే నాపదంబు నొల్ల. ఇది నిక్కంబు. అనఁగా నతనికిఁ బురం దరుం డిట్లనియె. నీయభిమతం బట్లగు నేని, కుమారా! నేన యింద్రుఁడనై యుండెద.నాయాజ్ఞను నీవు శిరంబున వహింతు నంటివి గాన నే నొక్కటి చెప్పెద. ఆలకింపుము. నీవు దేవసేనాధిపత్యముఁ దాల్చి నాసైనిక కార్య నిర్వహణము నెల్లఁ గావించుచుండు మనఁగాఁ గుమారుం డందుల కియ్య కొని యిట్లనియె. "పురందరా! నన్ను నీసేనాపతిగఁ గైకొనుము. నేను దానవవినాశము గావించెద. దేవకార్యసిద్ధి నొనర్చెద. గోభూసుర హితంబు గలుగ వర్తిల్లెద" నని నివేదించెను.

ఇంద్రుండు కుమారస్వామిని సకలదేవసేనాధిపత్యమున నభిషేకించుట

ఆకుమారస్వామిమాటలకుఁ గడుఁ బ్రీతుండై యింద్రుండు వెంటనే యాకుమారుని భద్రపీఠంబునఁ గూర్చుండఁబెట్టి యాతపత్ర చామరాదిశుభలక్షణంబులతో విరాజిల్లున ట్లొనర్చి తీర్థములనుండి మంత్రపూతజలకలశములఁ దెప్పించి యాసలిలములతో నాతనిని దేవతలసకలసేనాధిపత్యంబున నభిషేకించి, సకల రాజోపచారముల నొనర్చెను. మహర్షు లాదేవునిఁ బలుతెఱంగులఁ బూజించిరి. ఆసమయ మున నతనిపైఁ బట్టియుండిన కనకమయచ్ఛత్రము లెస్సఁగా వెలుంగు చుండ నయ్యది యగ్నిమండలంబుం బోలెఁ బ్రభల నీనుచుండె. ఆసమ యమున నిజవాహనమైన యెద్దు నెక్కి, శర్వాణీసమేతుండైన శర్వుం డచ్చోటికి కేతెంచి కుమారుదేవసేనాధిపత్యపట్టాభిషేకసమయము నకై విశ్వకర్మ గట్టిన బంగారుపువ్వులదండను తానే యాకుమారు మెడవైచె. అప్పుడు స్కందుం డెఱ్ఱనివలువలను దాల్చి, పుట్టుకతో నొప్పారినమైమఱుపుతో రక్తాభ్రములతోఁ గూడిన సూర్యమాడ్కి

వెలుఁగుచు సురలకు గెల్పునిచ్చు శక్తి యను దివ్యసాధనమును దన మోలిల నుంచికొని, యగ్ని యొసంగిన కుక్కుట ధ్వజమునందు విరాజిల్ల, స్వకీయ మగు పార్షదగణములు పరివేష్టింప, సకలదేవసేనాధిపత్యమున నభిషిక్తుండయ్యెను. వెంటనే దేవసేన లన్నియుఁ గుమారు సమీపించి వందనాదిసత్కారములను జలిపి యిట్లనియె. "దేవసైన్యాధ్యక్షా! ఇఁకముందు నీవ మాకు నాయకుఁడవు. నీయాజ్ఞచొప్పున మేము మెలంగెదము. మాయందఱవలన వలసినప్పు డెల్లను పనిగొనుము." అని చెప్పి కుమారుఁ గొలువ నిలిచిరి. అప్పు డాసభలో నచ్చరలాడిరి. గంధర్వులు పాడిరి. కిన్నరకింపురుషులు పూలసోనలు గురిసిరి. ఇది కుమారుఁడు దేవసేనాధిపత్యమున నభిషేకింపఁబడిన వర్తమానము.

మఱియు నింకొకటి చెప్పెద. వేదవేత్త లగ్నిని రుద్రుఁ డందురు. పూర్వము రుద్రుఁడు వీర్యమును విడువఁగా నయ్యది శ్వేతపర్వతాకారమును దాల్చె నందురు కృత్తిక లనఁబడు మునిపత్న్ను లార్వురరూపముతో స్వాహాదేవి రుద్రరూపుఁడయిన యగ్నితో సంగమింపఁగా స్కన్నంబయిన వీర్యమును జేర్చి యాశ్వేతపర్వతంబున గంగాతీరమునందు శరస్తంబమున వదలుటంజేసి యం దుద్భవిల్లిన కుమారుం డగ్నిసూనుఁ డనియు, రుద్రపుత్త్రుఁడనియుఁ, గార్తికేయుఁడనియు, గాంగేయుఁ డనియు, శరవణోద్భవుఁ డనియు, స్కందుఁడనియుం బిలువఁబడెను. ఈస్కందునకు దేవసేనాధిపత్య మీయఁబడిన మఱునాఁడు పురందరుండు పూర్వము దాను బ్రహ్మానుజ్ఞచే సురక్షితముగ నునిచియుండిన దేవసేన యను కన్యకను దెచ్చి దాని సర్వాభరణభూషితం గావించి కుమారస్వామి ముందు నిలిపి, కుమారా, నీవు పుట్టుటకు మునుపే పరమేష్ఠియిక్కన్యక నీకు భార్యగా నిర్ణయించెను. గాన శాస్త్రవిధిచొప్పున నీవు దీనిం భార్యగాఁ గొనుము అనెను. అంతనాకుమారస్వామి మిక్కిలి యానందించి బృహస్పతి పురోహితునిఁగాఁ గొని దేవసేన నగ్నిసాక్షికంబుగఁ బుండ్లాడెను. ఆనాఁడు షష్ఠి కావున, నాతిథి కుమారునకు సమ్మతమై పవిత్రమైన దయ్యెను.

ఆర్గురు మహర్షులును మున్ను తమపత్న్నులకు వచ్చిన యపనిందను సహింపలేక వారిని త్యజించి రని చెప్పియుంటిమి. ఆ ఋషిభార్య

లార్గురును గుమారుని సమీపించి యయ్యా! నీవు మా కుక్షివిల్లిన వాఁడ వని మా కపనింద గలిగినది. సత్యమరయని మున్పతులు నిష్కా రణముగ మమ్ము వదలివైచిరి. కావున మేము పుణ్యహీనలమైతిమి. నీవును తద్వచనమును యథార్థ మని నమ్మి మాయందు మాతృభావము సేయుము.అట్లుగావించి మాకుఁ బుణ్యలోకములయందు స్థాన మేర్పఱు పుము. ఇది యొనర్చినచో నీవు మాకుఁ బుత్త్రకార్యముల నొనర్చి మా ఋణము నీఁగినవాఁడ వయ్యెదవు. అని ప్రార్థింపఁగా కుమారుం డిండ్రుఁ బిలిచి వారికిఁ బుణ్యలోకముల నెలవు లేర్పఱుపుమనెను. అప్పు డంతకు ముందు రోహిణితో నభిజిత్తు తాఁ బెద్ద యని కలహించి దప్పుకొంతు లైన చంద్రభార్యలలోఁ దా నట్లగుటకుఁ దపంబు గావింప వనంబునకు నేఁగఁగా రోహిణికిఁ బొరుగుస్థలము రిత్త యగుటచే వీరలనం దింద్రుండు చేర్చెను.అచ్చో వా రగ్నిదైవత్యంబైన నక్షత్రంబులయి ప్రకాశించిరి. పదంపడి గరుడి షాణ్మాతురుకడ కేతెంచి యయ్యా! నీవు నాకును నొక్కరూపునఁ బుత్త్రుండవైతివి. నేను నీతోడ నుండెద ననఁగాఁ గుమా రుండు గరుడిం జూచి, యమ్మా, నీకు నీకోడ లుపచరింప నాయొద్దన యుండు మని దాని కోరికం దీర్చెను.

### కుమారస్వామి సప్తమాతృకలను బాలగ్రహములుగఁ జేయుట

తదనంతరమున సప్తమాతృకలు కుమారస్వామికడ కేతెంచి, 'యయ్యా మేము సర్వలోకమాతలము. నీకును దల్లులుగా నుండుటకై కష్టపడియున్నాము. మమ్మును భజింపుము. అనఁగా విని బాహులేయుం డు'మీకోరికలగుఁగాక. మీకొఱకు నేనేమి సేయవలయు'ననఁగా వారు మున్నీలోకమున మాతృకలుగా నియమింపఁబడినవారిని దొలఁగించి వారి స్థానములను మమ్ము నియోగింపుము. అందఱును వారినిఁ బూజింపక మమ్మే పూజించున ట్లనుగ్రహింపుము నీకొఱకు వారు మా ప్రజలను హ రించిరి' అనఁగా నాషాణ్మాతురుండు వారి కిట్లనియె. మీకిదె వేఱు ప్రజల నొసంగెద. వారు వహించినవారలను మీ కొసంగఁదగదు. ఇంక మీ కేదేనిఁ గల దేని యడుగుఁడు. ఒసఁగెద ననఁగా వారు కుమారా! నీ సాహాయ్యంబునఁ బూర్వపుమాతలు హరించిన ప్రజలను, వేఱు ప్రజలను మేము హరించునట్లు వర మొసంగు మనిరి. అంత షడాననుండు వారిం జూచి మీరు లోకులకుఁ గీడు తలంచుచున్నారు. అయినను

మీకోరినది నియమముఁజేసి నెఱవేర్తును. మీరు శిశువులఁ దినుకోర్కె-
లుగలవారైనను మిమ్ముఁ బూజించినవారి ప్రజలఁ గాపాడుఁడు. వారికి
శుభముల నొసంగుఁడు. అనఁగా వారట్ల చేయుదు మని యొడంబడి
తాము వెండియుఁ గుమారస్వామితోఁ జిరకాలము కూడి మెలంగఁ
గోరఁగా నాదేవుండు వారి కిట్లనియె. మీరు పెక్కు-రూపములతోఁ
బదునాఱేఁడులదాఁక శిశువులను బాధపెట్టుఁడు. మీకుఁ దోడుగ నా
మేన నొక్క-నిఁ బుట్టింతు. వానితోడ మీరు కలసి సుఖులై యుండుఁ
డని చెప్పుచుండఁగనే వానిశరీరమునుండి యగ్నికి సమానుఁడగు నొక్క-
పురుషుండు వెలువడుచునే వాఁడు పేరాఁకట మలమలమా
డుచుఁ గ్రిందఁబడి మూర్ఛవోయెను. అంతఁ గుమారస్వామి నిజ
వీర్యంబున వానిసేదఁ దేర్చి మాతృగణమునకు సహాయుండవై వారికి
శిశువుల బాధించుటయందుఁ దోడ్పడు మని వాని నియోగించె
వాఁడు రౌద్రగ్రహ మయ్యెను. మఱియును స్కందాపస్మారం బనఁ
బడెను. మాతృగణములఁ గాపాడువాఁడయ్యెను. మఱియు గరుడ
మాత యగు శకునిగ్రహ మనఁబడు వినతయు, రేవతి యనుపేరుతో
శైపతగ్రహం బనఁబడు దేవమాత యగునదితియు, ముఖమండిత యనఁ
బడుదైత్యమాత యగుదితియు, గోమాతయగు సురభియు, శునక
మాత యగుసరమయు, వృక్షమాతయైన కరంజయు, సర్పమాత
యగుకద్రువయు, నప్సరసలమాతయు, గంధర్వమాతయు, స్కందుదాది
యగు లోహితాస్యయుఁ బూతనయు ననువారలు సప్తమాతృకలతోఁ
జేరి పదునెనమండ్రగురయి లోకములోని సర్వశిశువులను బీడించుచుం
దురు. అందుఁ గద్రువ గర్భిణుల గర్భమున సూక్ష్మరూపిణియై ప్రవేశించి
గర్భములనే హరించు దాని నెఱుంగక గర్భము దిగజాఱె నని జను
లందురు. లోహితాస్య కదంబపూజన కిష్టపడును. వృక్షమాత సర్వ
భూతదయామయయగుటు శిశువుల కేహానియు చేయక వారిని రక్షించును.
వీరును స్కందునిమేనఁ బుట్టిన కుమారులును కుమారికలును స్త్రీల
ప్రసవగృహములలో నేఁడునాళ్లు వసింతురు. వీరికి స్కందగ్రహము
లనిపేరు. శిశువులకుఁ బదునాఱేండ్లు వచ్చునందాఁక వారిని సందు
చిక్కినప్పుడెల్లను బీడింతురు. కావున వీరు బాధింపకుండు నిమిత్తముగఁ
గుమారస్వామికిని, వానితలిదండ్రులగు పార్వతీపరమేశ్వరులకును,

సమయోచితముగ రోగము ననుసరించి యాయారోగాధి దేవతయగు
గ్రహమునకును శాంతికపౌష్టికక్రియలచే బలులను నుపహారముల
నొసంగుచుండవలయును. ఈపూజానివేదనములచే నాగ్రహంబులు
శాంతిఁ జెంది సుప్రీతులై శిశువులకు బాలురకు నాయురారోగ్య
వీర్యశుభము లొడఁగూర్చును. ఇంతేకాక పదునాఱేండ్లమీఁదను
గొన్నిగ్రహములు మానవులను బాధించును. మహాదేవునకు నమ
స్కరించి వాని నిఁక నీకు వివరించెద. ఆకర్ణింపుము. ఏపురుషుఁడైనను
నిదురించుచున్నపుడు కాని మేల్కొనియున్నపుడు కాని దేవతలం
జూచి పిచ్చిపలుకుల నాడును. అది దేవతాగ్రహ మనఁబడును. కూ
ర్చుండి కాని, పరుండినపుడు గాని పితరులం జూచి భ్రమపలుకు లాడె
నేని వాని నావహించి యుండునది పితృగ్రహ మని యెఱుంగుము.
సిద్ధులను జూచిన ట్లాత్మయం దూహించి వారి కవమానముగ వెఱ్ఱి
పలుకు లాడునేని వాని నావహించియుండునది సిద్ధగ్రహ మని యెఱుం
గుము. ఎవఁడైనను రసగంధములను వాసనఁ జూచి పిచ్చివాఁ డయ్యె
నేని వాని నావహించినది రాక్షసగ్రహ మని యూహింపుము. పిశా
చాపిష్టుఁడై యున్మత్తుఁడయ్యె నేని వాని నావహించినది పైశాచిక
గ్రహ మని యూహింపుము. కాలవ్యత్యాసమునఁ బిచ్చివాఁ డగునేని
వాని నావహించినది యక్షగ్రహ మని నిర్ణయింపుము. వాతము
యొక్కగాని, పిత్తముయొక్కగాని, శ్లేష్మముయొక్కగాని, వ్యత్యాస
ములచేఁ జిత్తోన్మాదము నొందె నేని నదియు నొకగ్రహవికారమే
యగును. వీని కన్నింటికి నివారకములు ప్రాయశ్చిత్తవిధులు శాస్త్ర
ములయందుఁ బేర్కొనఁబడియున్నవి. వానిని బరిశీలించి ప్రతివిధాన
ములు గావింపవలయు. ఘోరాకారములను వీక్షించినపుడు గాని,
యతిభయజనకంబైనసంగతిని వినుచుండినఁగాని, మనోవ్యాకులతఁ
గాని, లేక వెఱ్ఱితనమునుగాని యొకఁడు పొందుచో నందులకు మన
స్సునకు శాంతి గలుగునట్లుపశాంతవాక్యములె ప్రతివిధానము. ఆట
లాడుచుండునపుడును, నాహారమును గొనునపుడును, యథేష్టసంచార
ము గావించునపుడును డెబ్బదియేండ్లవఱకును మానవులకు గ్రహ
ములు సోకుచుండు. ఇవి మానుషగ్రహంబులు. డెబ్బదియేండ్లైనపిదప
ముదిమి సంభవించి యయ్యది యన్నిగ్రహములకంటె విశేషముగా

మనుష్యుని వేధించుచుండు. పరిశుద్ధుని, జితేంద్రియుని, ననలసుని, ఆస్తికుని, శ్రేష్ఠాపంతుని, మహేశ్వరభక్తుని నెట్టిగ్రహములును సమీపింపవు.

మాతృగణంబును శిశుపీడనంబునఁ గుమారస్వామి నియోగించుచుండునెడ నగ్ని పత్నియగు స్వాహాదేవి కార్తికేయుని సమీపించి యిట్లనియె. నీవు నాకౌరసుఁడవు. నాకును నీవు ప్రియంబు సేయు మనఁ గుమారుం 'డమ్మా, నీకోరి కెయ్యది? తెలియఁ జెప్పు'మనఁగా స్వాహాదేవి కుమారున కిట్లనియె. అయ్యా! నాకుండు దుఃఖమును నీవంటి కుమారుఁడు దక్క వేఱొక్కరుండు తీర్పలేఁడు. సావధానుండవై యాకర్ణింపుము. నేను దక్షపుత్రికను మాతండ్రి నన్నతిబాల్యముననే యగ్నికిచ్చి వివాహము గావించె. అయ్యగ్ని నాటంగోలె న న్నొల్లక యున్నాఁడు. నేను సదా పతి కెడగాకుండ వర్తింపవలయు నని యున్నదానను. నా కట్టిపొందు కలుగున ట్లనుగ్రహింపుము. అని వేఁడఁగా నాదేవసేనాపతి తల్లి స్వాహాదేవి కిట్లనియె. నేఁడు మొదలు బ్రాహ్మణు లగ్నియం దేది వ్రేల్చినను వ్రేల్చునపు డెల్ల స్వాహాశబ్దముతో మంత్రములను జతచేసి యుచ్చరించి యగ్నియందు హోమము గావింతురు. కావున నీ కెప్పుడు నెడఁబా టగ్నితో నుండదు అని తెల్పిన నావతుకూఁతురు కుమారుననుగ్రహంబునకు సంతసిల్లి యతని నేర్పునకుఁ గొనియాడె. ఆయవసరంబునఁ బరమేష్ఠి కుమారుని సమీపించి యిట్లనియె. ఒకరహస్యమును జెప్పెద వినుము. అగ్నియందు రుద్రుఁడు, స్వాహాయందుఁ బార్వతి తమయోగబలంబున నావహించి సంగమింపఁగా వారి యమోఘవీర్యమునకు నీవు జనించితివి. వా రుభయులు నిచ్చోటటి కిప్పు డేతెంతురు. ఆజగత్పితరులను నీవు మాతాపితలుగ నెన్నుము. ఆపార్వతీపరమేశ్వరులను బూజింపుము. మఱియు నింకొకటి వక్కాణించెద. పూర్వము మహాదేవుండు పార్వతితో సంగమించునప్పు డామహనీయుని యమోఘవీర్యము పలుతెఱంగులై పలువేళ్లతో వెలసినది. కొంతవీర్యమిచ్చోటఁ బడి మించి కామించిక మనఁబడెను. మఱికొంతవీర్యము లోహితసముద్రమునందుఁ బడియె. కొంతవీర్యము సూర్యకిరణములం బ్రవేశించె. వేఱొకకొంత పుడమియం దింకె. మిగిలిన వీర్యము వృక్షములందుఁ జేరె. ఈలీరున నైదువిధములుగ ఘోరాకారులగు రక్కసు

లైదుగణముల వా రుద్భవిల్లిరి. ఈపంచవిధ రక్షోగణమును నీకుఁ బార్షదులై నిన్నుఁ గొలుచుచుందురు. ఈతీరున వచించి పరమేష్ఠిపార్షదగణమువా రర్కపుష్పముల పూజల సంతసింతురు. అట్లు జిల్లేడు పుష్పములతో నెవఁడు పార్షదులను బూజించునో వానికి ధనసంపత్తియు శరీరారోగ్యమునుం గలుగు. మింజికామింజికంబులను బూజించుచో శిశువులు గ్రహబాధలు లేక యారోగ్యవంతు లగుదురు. చెట్లను జేరిన రుద్రవీర్యమున వృద్ధిక లనుస్త్రీలు పుట్టిరి. వారు మాంసమే యాహారముగాఁ గోరి లోకసంచారులై యుందురు. బిడ్డలులేనివారీస్త్రీగ్రహములఁ బూజించిన బిడ్డలఁ గనెదరు. బ్రహ్మ, పార్వతీపరమేశ్వరులను మాతాపితరులనుగా భావింపుమని కుమారస్వామికిఁ జెప్పిపోవుచుండఁగనే, యింద్రుండు తన యైరావతపు గంటలను రెంటిని గుమారస్వామి కాటవస్తువులుగాఁ దెచ్చియిచ్చె. ఆగంటలకు వైజయంతము లని పేరు. కుమారుం డారెండు గంటలను సంతసముతోఁ గొని, యం దొక్కగంటను విశాఖున కొసఁగి, యొక్కటి తా గ్రహించె. ఈ తీరున గుమారస్వామి తనలోహితపు టెక్కెము ముందు నడువ, దేవతలు తన కొసంగిన యాటవస్తువులను గ్రహించి పార్షదగణములచే నెల్లప్పుడు పరివేష్టితుఁడై యా శ్వేతపర్వతపుసానువులలో నానాసూనవితానవాసనలతో నొప్పారుతరులతాగుల్మములతో నుండువనములయందు స్వేచ్ఛగాహరించుచుండె. ఆవిహారమునకు సుమనస్సులు మెచ్చిరి. ఋషులు నుతించిరి; అచ్చరలాడిరి; గంధర్వులుపాడిరి.

### ఈశ్వరుఁడు కుమారునితోడ భద్రవటంబుఁ జేరుట

అంతకు ముందే యచ్చోటికి కేతెంచియుండిన పార్వతీసుతుఁడగు కుమారస్వామిబాలక్రీడలకుఁ బరమేశ్వరుఁడు పరమాహ్లాదభరితుండై వేయి సింహములఁ బూన్చినరథమునం దుమాసమేతుండై కూర్చుండి యింద్రధనుస్సుతోఁ గూడిన మేఘమధ్యమున మెఱయు సూర్యునివలెఁ దేజరిల్లుచు దేవసేనతోఁ గూడిన బాహులేయుం దోడ్కొనిభద్రవటము సమీపించె. వారిముందట యక్షాధ్యక్షుండగు కుబేరుఁడు మాణిభద్రాదులతో రమ్యమగు పుష్పకవిమానము నధిరోహించి వచ్చుచుండెను. వారికి వెనుక నింద్రుం డైరావతారూఢుం

వేల్పులతో నేతెంచె. వలపట జృంభకాదిగణసేవితుండైన మహా
యక్షుండును, వానివలపట నష్టవసువులును, నేకాదశరుద్రులును,
డాపట మూర్తిమంతములగు వ్యాధిసహస్రములతోఁ బరివృతుండైన
యంతకుండును, బిదపఁ దిమితిమింగిలాదియాదోగణసేవితుండైన వరు
ణుండును, బదంబడి ననేకాయుధధారులును, వానివెంబడి బ్రహ్మర్షి
సమూహపరివృతమైన కమండలువును, గమండలువునకు వలపట దేవతా
దండంబును, దానికి వెనుక స్వరూపధారులైన మహానదీ నదములతోఁ
గూడినసముద్రుండును, బర్జన్యాదిమేఘంబులును, నవగ్రహములును, సర్వ
దేవతలును, రాజర్షులును గూడి యొడ్డోలగంబున నేతెంచిరి. శ్మశానముల
యం దనిశముఁ దిరుగుచు రుద్రునకు నెచ్చెలియైన రాక్షసగ్రహ మనఁ
బడు పింగళుం డను యక్షోత్తముఁడును బతాకం బట్టుకొని పురోభాగ
మున నడిచెను. ఆసమయమునఁ బుణ్యాంగనలు సుగంధప్రసూనవర్ష
ములఁ గురియించిరి. చంద్రుండా దేవసేనానికిఁ దెల్లనిగొడుగు పట్టెను.
వాయ్వగ్నులు వింజామరలను వీచిరి. ఆవిధమునఁ బేరోలగంబున భద్ర
వటమును సమీపించి వృషభవాహనుండు శిఖివాహనునిఁ బిలిచి
కుమారా! ఏడవది యగు మారుతస్కంధమును గాపాడుచు దేవతల
కసురులవలన భయము గలుగనీక యప్రమాదుండవై మెలంగుచుం
డుము. కార్య మున్నయపుడు నన్నుం జూడుము. నీవు నన్ను దర్శించు
నపుడు శ్రేయఃప్రాప్తిం జేసెద నని దీవనల నొసంగి యాతనిం గౌఁగిలించి
కొని శిరంబున ముద్దిడి నీవిడిదల కేఁగు మని యాజ్ఞ నొసంగె.

### కుమారస్వామి మహిషాసురుం జంపుట

అంత నొకనాఁ డాకసమునఁ బగటిపూట నక్షత్రములు వెలుఁగ
నారంభించెను. భూమి దడదడ యదరెను. భూమ్యాకాశమధ్య ప్రదేశ
మంతయుఁ జీకట్లు గ్రమ్ముకొనెను. ఇంక ననేకోత్పాతంబులు పొడసూ
పెను. ఇందులకుఁ గారణ మేమో యని జనులు భ్రమాన్వితులై నలు
దిక్కులు సూచుచుండిరి. అప్పుడు వీర్యవంతుండైన మహిషాసురుం డను
రాక్షసుం డొక్కఁ డనేకరాక్షసులతోఁ గూడికొని మహాసైన్యము
నొక్కదానిం గూర్చి, వారిని సర్వాయుధములఁ దాల్చిన యోధవరు లనే
కులు నడుపుచుండ, నాశ్రమములను, యజ్ఞవాటికలను, బ్రాహ్మణగృహ

ములను, దేవతలను, మహాభయంకరా రావములతో నొక్కపెట్టం దొడంగెను. తొలుత శంకరు నధిక్షేపించెను. ఇతర దేవతలను దిరస్కరించెను. ఆయుధరహితు లగుననేకజనుల నాయుధములతోఁ బ్రహారణముల గావించి నొంచెను. దేవతలపైఁ బరిఘలను, యక్షులపైఁ బ్రాసములను, గంధర్వులపై శతఘ్నులను, గిన్నరులపై ముసలములను నిట్లు నానావిధాయుధముల ననేకులపైఁ బ్రయోగింపఁ దనసైన్యమునకుఁ గట్టిడయిఁ డెను. వాని యాటోపంబునకు దేవతలు కొందఱు మడిసిరి. కొందఱు మూర్ఛిల్లిరి. కొందఱు వెన్నిచ్చి పాఱిరి. దవానలంబు పొదుగ నెండిన పుల్లకులు గాలినట్లు దేవానీకంబు మహిషుని సైన్యాగ్నిచే వికావికలై యనాథమై నలుదెసలం బాఱుచుండఁ బురందరుండు వారి నెల్ల నెలుంగెత్తి యోవీరవరులారా! వెఱచఱచి పాఱకుఁడు. భీతిల్లకుఁడు. ఆయుధపాణులై యరులను దాఁకుఁడు. నే నుండఁగ మీ రింతభీతిల్ల నేల? యని యుత్సాహంపుమాటలఁ దేల్పఁగా వారెల్లరు మఱల సమసూండి, ధైర్యంబున శౌర్యముం బూని యరిసైన్యముపై శరపరంపరలు గురియ నారంభింపఁ బోరు ఘోరంబయ్యె. ఆతాఁకునకు రక్షోగణంబులు విఱిగిలంగులును, దెగినశిరంబులును, దునిసినబాహువులును, దుత్తుమురులైన పదకరంగుళులును, వ్రయ్యలైన హృదయంబులును, బగిలిన ఫాలంబులును, విఱిగిన నాసికలును జీలినచెవులును గలవారై భిన్నములైన దేహంబులనుండి స్రవించునెత్తుటిధార లేఱులై పాఱ ననేకులు నేలం గూలిరి. అంత నమరులు విజయసూచకముగ శంఖముల నొత్తిరి. సింహనాదంబులను జేసిరి. భుజములఁ దట్టిరి. కిలారింపులఁ గావించిరి. అప్పటికిని హతశేషులైన రక్కసులు మహిషాసురుండు పురికొల్ప మరలఁగడుసురవడితో దేవతల మరలఁ దాఁకిరి. దేవతల నానావిధాయుధముల మొత్తిరి. అప్పుడు మహిషాసురుం డొకకొండ శిఖరమును గేలంబూని దేవతలపై విసరివైవ దానిదెబ్బతాఁకి దేవతలు పదినేవురు హతులైరి. తక్కినవారు నీచమృగములు సింహమును జూచి వెఱచఱచునట్లు పలాయితులైరి. అంత మహిషుండు వేవేగరుద్రుపాలికిం బోయి యాతనిరథముయొక్క నొగలను జేఁ జిక్కించుకొనఁగా రక్కసులెల్లరల్లదె రుద్రుండు చిక్కె. మనల విజయలక్ష్మి వరించె నని సింహనాదంబులఁ జేసిరి. సురలును భూసురులును భీతిల్లిరి. బ్రహ్మర్షులు బెదరిరి

అంత రుద్రుండు కుమారుని దలంప నాతండు లోహితవస్త్రమును ధరించి, పుష్పమాలాలంకృతుండై, సహజస్వర్ణకవచముం దొడిగి, లోహిత తురంగమంబులం బూన్చిన బంగారుతేరెక్కి కన్నుల నిప్పులు రాల, మనస్సు తీవ్రక్రోధయుతంబుగా నేతెంచి తనచేత నున్నశక్తిని మహిషాసురుపైఁ బ్రయోగింప నాదివ్యాయుధపుఁబెట్టున వానితల పగిలి ఘోరాకృతితో నున్న దీర్ఘదేహం బుత్తరకురుదేశమార్గమునందు షోడశ యోజనవిస్తీర్ణదేశము నావరించె. ఆ కారణంబున నా దేశ మంతయు జనులకుం జొచ్చుటకు వీలుకాకపోయె. జను లావారియందు నడుచుట మానిరి. పిదపఁ గుమారస్వామి యితరాయుధప్రహారణముల వానిసైన్యము నంతయు నుగ్గునూచమగునట్లు గొట్టెను. అప్పుడు వెఱచి పాఱుచున్నరక్కసులను గుమారునిపార్షదులు వెన్నంటి తఱిమి చేఁజిక్కించుకొని వారిశరీరములం జీల్చి మాంసముల భక్షించి రుధిరముఁ బానము నేసి మిక్కిలి సంతృప్తులైరి. అట్లొక్కముహూర్తకాలమున సూర్యుండు తమముం బోలె నగ్ని యెండినకట్టియలవలెఁ బ్రచండవాయువు పర్జన్యునిం బోలె షణ్ముఖుండు రాక్షసుల నెల్ల నంతకుపురి కతిథులుగఁ జేసి మహాదేవుపాదయుగళంబునకు సాష్టాంగముగ నమస్కరించె. శర్వుండు స్కందునిశౌర్యమునకు మెచ్చెను. సురలు స్తుతించిరి. ఇంద్రుండు శక్తిధరుని మఱిమఱిం గౌఁగిలించుకొని యిట్లనియె. కార్తికేయా! వీఁడు బ్రహ్మావరగర్వంబున మత్తిల్లి దేవతల నేనాఁడు సరకుసేయఁడు. ఋషులఁ దిరస్కరించె. ఈలోకకంటకుం డీనాఁడు నీచే నీల్గె. అంతియ కాక యీమహాయుద్ధమునందు వీనివంటిబలపరాక్రమశాలులు మాయావులు నగుఘోరరాక్షసులు పెక్కండ్రు హతులైరి. రాక్షసుల తాఁకుడునఁ బార్షదులుం గొందఱు మ్రందిరి. త్రిపురారి యుద్ధమున నెట్లు శౌర్యమును జూపి విజయముం గొనెనో యట్లే నీవు నీసంగరంబున విజయివైతివి. నీ యీతొలివిజయగీతములను దేవత లెల్లప్పుడును బాడుచుందురు. త్రైలోక్యావాసులు నీయశస్సులు సదా పొగడెదరు. దేవత లెల్లరు నీకువశులై వర్తింతు రని చెప్పి రుద్రునెలవుఁ గొని తన నెలవున కేఁగెను. దేవతలును దమతమ యాశ్రమములకుఁ బోయిరి. ఈతీరున నొక్కమధ్యాహ్నమునఁ గుమారుండు రక్కసులఁ బరిమార్చి

దేవతలయు మహర్షులయు స్తోత్రములకుఁ బాత్రుండయ్యె. ఈషణ్ముఖుని చరిత్రముం జదివినవారు సర్వసంపదలతోఁ దులఁదూఁగి తృప్తులై స్కంద సాయుజ్యమును శరీరపాతంబునఁ బొందెదరు. ఇఁకను యుధిష్ఠిరా! నీవు స్కందునినామంబులు వినవలతేని వినుము. ఆగ్నేయుఁడు, స్కందుఁడు, దీప్తకీర్తి, అనామయుఁడు, మయూరకేతువు, ధర్మాత్ముఁడు, భూతేశుఁడు, మహిషార్దనుఁడు, కామజిత్తు, కాముదుఁడు, కాంతుఁడు, సత్యవాక్కు, భువనేశ్వరుఁడు, శిశువు, శీఘ్రుఁడు, శుచి, చండుఁడు, దీప్తవర్ణుఁడు, శుభాననుఁడు, దీప్తశక్తి, ప్రశాంతాత్ముఁడు, భద్రుఁడు, కుక్కుటవాహనుఁడు, షష్ఠీప్రియుఁడు, ధర్మాత్ముఁడు, పవిత్రుఁడు, మాతృవత్సలుఁడు, కన్యాభర్త, అవిభక్తుఁడు, స్వాహేయుఁడు, రేవతీసుతుఁడు, ప్రభువు, నేత, విశాఖుఁడు, నైగమేయుఁడు, సుదుశ్చరుఁడు, సువ్రతుఁడు, లలితుఁడు, బాలక్రీడనకప్రియుఁడు, ఖచారి, బ్రహ్మచారి, శూరుఁడు, శరవణోద్భవుఁడు, విశ్వామిత్రప్రియుఁడు, దేవసేనాప్రియుఁడు, వాసుదేవప్రియుఁడు, ప్రియుఁడు, ప్రియకృత్తు మొదలగు కార్తికేయుని దివ్యనామములను నిత్యము పఠించికీర్తించువారు స్వర్గమును, కీర్తిని, ధనమును నిస్సంశయముగాఁ బొందుదురు. ఈస్కంద నామములను నిత్యము పారాయణము చేయువారైహికాముష్మికసుఖములను బడయుదురు.

## సత్యాద్రౌపదీసంవాదము

అని యీతీరున మార్కండేయుండు ధర్మరాజున కనేక బ్రహ్మర్షి వృత్తాంతములను, రాజర్షివర్తనంబులను, బతిప్రతామాహాత్మ్యంబును, వైవస్వతమను చరిత్రంబును, వివిధధర్మములను, నింద్రద్యుమ్నోపాఖ్యానమును, నాంగిరసుం డగ్నియైన తెఱంగును, గుమారస్వామియవతారంబును మున్నగుకథలను వాసుదేవాదులు విప్రులు గూడియున్న సభలోఁ జెప్పుచుండఁగా, ద్రౌపదియు సత్యభామయు నాశ్రమాభ్యంతరమున నిష్టాగోష్ఠిని సల్పుచుండిరి. అప్పుడు సత్యభామ ద్రౌపదిని నేకాంతస్థలంబునకుఁ బిలిచి యిట్లని యడిగెను. యాజ్ఞసేనీ! లోకపాలతుల్యులగు నీపతు లేవురును నీకుం బ్రియులై వశ్యులై యేకాలమున నీకు సప్రియంబుఁ దోఁపనీయక నిన్ను మిక్కిలి యాదరమునఁ జూచుచుండెదరు. ఇట్లు వారు వర్తింపఁగారణమేమి? నేను దెలియక యడుగుచున్నాను. అట్లు

వర్తించుట నీనోముల ప్రభావమో? లేక, వారిని నీవశంవదులఁ గావించు
కొనుట కేదైన మంత్రబలము గలిగినదానవో? అదియునుంగాక,
మందులమూలముననఁగాని, మూలికాదులమూలముననఁగాని వారి నిట్లు
నీవశ్యులఁ గావించికొని యున్నావో? లేక, విద్యలచేతఁగాని
జపహోమాదులచేతఁగాని మందులచేతఁగాని వారు నీయభిమతములఁ
దీర్చెదరో? తెలియఁజెప్పితి వేని నేనును నట్లు సలిపి నాభర్తను స్వాధీన
పఱచికొందును. అనఁగా నాపతివ్రతారత్నం బైనపాంచాలరాజ
పుత్త్రి సత్రాజిత్పుత్రికతో నిట్లనియె. సాత్రాజితీ! నీవు న న్నిట్లడుగఁ
దగునే? అట్టికార్యములు దుష్టాంగన లొనర్చునవి గాని లోకా
రాధ్యుఁ డగు శ్రీకృష్ణుని కిల్లాలివైన నీ విట్టి ప్రశ్నయడుగుట
కాని, యిట్టిసందియము నీకుఁ గల్గుటకాని యుక్తంబు గాదు. నీవు బుద్ధి
మంతురాలవై యుండియు నిట్లడుగుట తగునే? స్త్రీలు మగవారు
తమకు వశ్యులై వర్తించునిమిత్త మట్టిమందులను మంత్రములను
నోషధులను వాడినచో దానివలన వారికి శరీరోపాధులు గల్గుటయే
గాక, యీరహస్యవర్తనమును మగవారు గుర్తించిరేని వారు మగు
వలం జూచిన నులుకుదురు. భర్త తనప్రియురాలిని మందుమ్రాఁకులు
దెలిసినది యని యెఱుఁగుచో నంతట దానిని జూచిన నింట నున్న
పామును జూచి వెఱచులాగున, నామగువకు వెఱచును. అట్లు మగు
వను జూచిన మగనికిఁ దాల్మి యెక్కడిది? తాలిమి లేనివానికి సుఖ
మెక్కడిది? మగఁడు మగువలకు మందులు మ్రాఁకులచే నెన్నఁడును
వశుఁడు గాఁడు. మీఁదుమిక్కిలి కడిఁదిరోగములు వానిం జుట్టుకొను
ను. కొందఱు స్త్రీలు మగనిం జంపఁగోరి, మూలిక లనుపేర విషముఁ బెట్టు
దురు. స్త్రీ లిచ్చునౌషధమును మగలు నాలుకతో నాఁకినను, బసరులు
వారిచర్మమునకుఁ బూసికొన్నను, జూర్ణములు లోనికి బుచ్చుకొన్నను,
జలోదరము, కుష్ఠము, ముదిమిగలవారై నపుంసకులు, నున్మత్తులు,
చెవుటులు, గ్రుడ్డులు నగుదురు. పాపపుఁబను లొనర్చు పాపలు మగలం
జంపుకొందురు. కావున మగల కెన్నఁటికి మానిని యెట్టియదనునను
జెఱుపు దలంపరాదు. సత్యభామా మహాత్ములగు నాభర్తలయెడ నెట్టి
నడతతో మెలఁగుదునో చెప్పెద నాలకింపుము. మహాత్ములగు పాండు
పుత్త్రులు నాయెడఁ బ్రీతిమెయి నుండుటకుఁ గారణముల వచించెద.

ఆకర్షింపుము. లేనిపోనికోరికలను మదిం గోరి తత్సంపాదనమునకుఁ గ్రోధముం బూనను. భర్తలు నావిషయమున మిక్కిలి విశ్వాసమును జూపుచున్నా రని గర్వింపక నియమపూర్వకముగ నన్ని వేళలయందు వారికి సకలోపచారముల నొనర్చుచుండుదు. దుర్మార్గంపుఁజేఁతల జోలికిఁ బోవుదానను గాను. పరపురుషుఁ డెంతరూపవంతుఁడై నను, ద్రవ్యవంతుఁడై నను, వాఁడు భగవంతుఁడే యైనను, దేవమానుష గంధర్వులలోనివాఁడై నను, వాని నేఁ గన్నెత్తి చూడ నోప. భర్తల కంటె ముందు భుజింపను. వారియాసనముల నే నాక్రమింపను. వారికి ముందు శయనింపను. వా రిలు వదలి యెచట కేనిం బోయియుండి యలసివచ్చినచో వారిమది మెచ్చునట్లు వారికి సకలోపచారంబులఁ గావింతు. ఏమఱక వారికి నేన యర్ఘ్యపాద్యాసనాదుల నొసంగుదు. వారిసేవలు పరిచారికలచేఁ జేయింపను. పాకాదులయందును, గృహ పాత్రశోధనమునందును, గృహధాన్యాదులగు నాహారపదార్థముల యోగక్షేమములయందును మిక్కిలి యప్రమత్తనై మెలంగుచు వారికిఁ బ్రియములైన వంటకములఁ జేయించి నాచేతులార వారికిఁ దనివి తీర నిడుదు. వారివర్తనమునకుఁగాని, వా రాడుమాటలకుఁ గాని నే నెన్నఁడు నెదురాడను. దుష్టస్త్రీలసాంగత్యమును జేయను. జాగుసేయక వారి కనుకూలప్రవర్తన గలిగియుండుదు. విలాసవార్తల యప్పుడు తప్ప నకారణంబ నవ్వను. విలాససమయ మప్పుడును విశే షించి హాస మొనర్పను. తలవాఁకిట నిలువను. మలమూత్రవిసర్జన మప్పుడు విశేషకాలయాపనమును జేయుచు నొంటిఁ జరింపను. పతు లెట్లాడినను గోప మొక్కింత యేనిఁ బూనను. పతులు కార్యార్థము దేశాంతరమునకుఁ బోయిరేని వారు వచ్చునందాఁక వ్రతినై గంధ మాల్యాద్యలంకరణములచేఁ దనువు నలంకరింపను. వారొల్లనిపదార్థ ముల నెప్పుడును నేఁ గుడువను. వారు నాసవతులగోష్ఠి నుందురేని యందుల కసూయపడను. పాండవులు మెత్తనిమనస్సుగలవా రని నిరాకరింపను. వారు మహాత్ము లని నే బాగుగ నెఱుంగుదు. వా రలిగి రేని నాగుపాములవలెఁ బసివట్టుదు రని భీతిల్లినచిత్తంబున నణఁగి వారియనుజ్ఞ ననుసరించి తిన్ననిప్రవర్తనంబున మెలఁగుదు. వారిం గాదని కూర్చుండను, భుజింపను, అలంకార మొనరించుకొనను, శయ

నింపననియుఁ దెలియుము. స్త్రీలకుఁ బతిసేవయే పరమధర్మము. పతులనే దైవముగా భావించి వారు వర్తింతురేని వారికి సద్గతి యఱచేతిదై యుండును. అత్త చెప్పినట్లు బిచ్చ మిడుట, బల్యన్న మొసఁగుట, శ్రాద్ధ కార్యములయందు సాయపడుట, దర్శపూర్ణమాసస్థాలీపాకముల నడుపుట, పెద్దలఁ బూజించుట మొదలగు కుటుంబకార్యములఁ బరాకు లేక రేయింబవలు నడుపుచుండుదు. మాయత్త కుంతీదేవికి స్నాన పానాద్యుపచారములందును, నన్నాదుల వడ్డనలలోను నేను బరి చారకులపై భార మిడక స్వయముగ నేన చూచుచుందును. ఆయ మకు మాటాడను. ఆయమనెలవు లేక భుజింపను. దుకూలవస్త్ర ధారణము గావింపను. భూషణముల ధరింపను. మఱియు ధర్మనందనుం డింద్రప్రస్థపురమున రాజ్య మేలుచుండ నాతనికి మున్ను ప్రతిదినము నెనిమిదివేల విప్రులును, వేర్వేఱ ముప్పదిదాసులుగల యెనిమిది వేల స్నాతకబ్రహ్మచారులును, బదివేలమంది సన్యాసులును, బంగారు పళ్లెములలోఁ గుడుతురు. వారి యన్నపానీయములు లెస్సగ జరి గినవా? సేవకులు వంచన లేక వారికిఁ గుడువఁబెట్టిరా? యని స్వయ ముగ నేను విచారించుదాన దివ్యాంబరములను నమూల్యాభరణ ములను దాల్చినలక్షమందిదాసీజనులు పళ్లెరంబులఁ జేతఁబూని రేయిం బవ ళ్ళతిథులకుఁ గుడువఁబెట్టుచుందురు. వారి ప్రవర్తనమును వారి నామరూపంబులను జక్కఁగా నెఱింగి లోపముల ననుదినంబును నే నరయుచుండుదు. ధర్మరాజుగజశాలయందు లక్షగజము లుండును. గుఱ్ఱపుశాలను లక్షగుఱ్ఱము లుండును. నిత్యము వానిభాణంబుల నే నరయుచుండుదు. ఇంతేకాక పాండవులయొక్క యన్యకాంతల భోజన మజ్జనాద్యుపచారకార్యములను లోటు గాక వారిదాసదాసీజనుల విధేయవర్తనముతో సైతము నేన విచారించుచుండుదు. వేయేల? ధర్మరాజు గోవులను గాయు గోపకులయు సకలసేవకులయు యోగ క్షేమముల ననుదినము నేన విచారించుచుండుదు. మాపతుల బొక్క సములయాదాయవ్యయములను విచారించి నిలువరించిన ధనమును లెక్కించి ముద్రలగట్టియుంతు. కుటుంబభారము నంతయు నిట్లు నేను నిర్వహింపఁగా వారు నాపై విశ్వాసమున నేతత్కార్యనిర్వహణ మును నాయం దుంచి వారు సుఖులై యుందురు. వారు సుఖులుగ

నుండుట కేయేసదుపాయములను చేయవలయునో యాయాయుప చారములను మెలఁకువతో నే నొనర్చుటంజేసి వారు నాయందుఁ బ్రేమఁడి గలిగియున్నారు. రే యంతయు లెస్సగ విచారించి యొక్కకొంత నిదురించి వెండియుఁ బతులకు మున్న నిదుర లేచి నిత్యకార్యములయం దప్రమత్తురాలనై ప్రవర్తింతు. నాపరిచర్యకు మెచ్చి వారు నాయెడఁ బ్రియముసు జూపెదరు. ఇంతియకాని వేఱు మందుల మ్రాఁకుల నే నెఱుంగ. ఇది నాసమాచార మని చెప్పఁగా సత్యభామ విని యాజ్ఞసేనిం గొనియాడి నీ విట్టి పతివ్రతవే? నీమన స్సెఱుంగక నే నాడిన మాటల సైరించి నన్ను క్షమింపుము. నేను నీకుఁ జెలిని. నాతప్పు నీవు మన్నించి దానిని బరిహాసముగా నీవంటివారు గొననిచో మ రెవ్వ రంతసైరణ గలిగియుండు రనఁగా సత్యభామకు యాజ్ఞసేని వెండియు నిట్లనియె. చెలీ! వినుము. స్త్రీలకుఁ బతియ పరమ దైవంబు. ఆతండు సంతసించెనేని స్త్రీలకుఁ గోరిక లన్నియు నీడేరును. సంతానము గల్గును. వివిధభోగములు తమంతట ననుభవయోగ్యము లగును. స్వర్గము ప్రాపించును. యశస్సును గల్గును. భర్త యలిగెనేని వారికి లోకమున నిలువ నీడ యుండదు. నీకుఁ బతి యనురక్తుండయి యుండుటకు నుత్తమమార్గమును నుడివెదను. ఆకర్ణింపుము. కష్టముల విశేషించి యనుభవించినఁగాని తుదకు సుఖము చేకూరదు. కావున శ్రీ కృష్ణమూర్తి మెచ్చునట్లు సకలోపచారము లాతనికి నీవ చేయుము. వాసుదేవుండు నీయంతఃపురము వెలుపలిద్వారము చేరె ననఁగా నీవు లేచి నిలుచుండి పరిచారికలను బంపక స్వయముగ ద్వారమును సమీపించి లోనికి మందహాసమునఁ గొనివచ్చి కాళ్లను గడిగి తగినయాస నమును నీవ వైచి యందుఁ గూర్చుండఁ బరిచరింపుము. మఱియు నీపతి యన్యస్థలములయందుండి యేదియేని కార్యమునిమిత్తముగ దూతిక నంపెనేని యాకార్యమును వెంటనే నీవు సమకూర్చి సదుత్తర మొసఁగి పంపుము. దానంజేసి యాతండు నీయెడ మిగులఁ బ్రీతిఁ జూపు. మఱి యు నాతండు నీతో సల్లాపము లాడునవసరమున నేదిచెప్పినను నద్దాని నీవితరకాంతలతోఁ జెప్పకుము. నీసవతు లెవరేని నీపతి నుల్లసం బాడిన చో నీవును దానివలె వర్తింపకుము. ఆతనికిఁ బ్రియము లేని జనులను నీయంతఃపురమునఁ జేర్పకుము. పతికి హితులు, బంధువులు, ననురక్తులు

వీరి కెల్ల గుసుపుఁబెట్టుము. అప్రమాదవై పరపురుషులవృత్తాంతం బున మౌనవ్రతము ధరించి యుండుము. కుమారు లగు ప్రద్యుమ్న సాంబాదులతో భాషింపవలదు. దుష్టులఁ జెట్టఁ జేర్పవలదు. పుణ్యాంగ నలచెలిమి గోరుము. వారితో సంభాషింపుము. వారినడత లనుసరణీ యములు. ఇట్లు వర్తించినచో నీపతి నీమాట జవదాఁట నేరఁడు. నీ కనురక్తుం డగు. ఇయ్యదియ కులాంగనలకు నుత్తమధర్మంబు ఇహపర లోకసాధనంబు. యశస్కరంబు. అని చెప్పఁగా విని యాసాత్రాజితి యోపతివ్రతాతిలకమా! నీవలన నత్యుత్తమధర్మమును వింటి. నీకఱపి నట్లుగ నడతు నని పలికి పాండవపత్నిం బలుతెఱంగులఁ బ్రశంసించె. ఆతీరునఁ గృష్ణుం డప్పాండవులయు మహామునులయు సంభాషణంబుల నాలకించుచుండి యిక నేఁ బోయి వత్తు నని యందుండిన యెల్లవారియా నతిం గొని వారంపఁగా ద్వారావతికిం బోవ రథారోహణంబు సేసె. అప్పుడు సత్య ద్రౌపదిం జూచి యమ్మా, మధుసూదనుం డూరికిఁ బయన మయ్యెను. నాకు సెలవిమ్ము. పోయివచ్చెద. అరణ్యవాసమునకు మన మునఁ గుందకుము. దేవతాసమాను లగుపాండవులు సమయము తీరఁ గనే శత్రువుల వధించి క్రమ్మఱ నిజరాజ్యమును గొందురు. అప్పుడు నీవును మరల సుఖ మనుభవింతు. మీరరణ్యమునకుఁ దరలఁగా మిమ్ముం జూచి పరిహాసంపుఁబల్కులు పల్కినవారును, ముసిముసినవ్వులఁ బోయి నవారును నగు ధార్తరాష్ట్రులస్త్రీలు వేగంబ దుఃఖములపా లగుదురు. నామాట నమ్ముము. అది యట్లయగు. మీకు హాని యొనర్చినపాపాత్ములు వేగంబ యమపురి కతిథులై నరకము లనుభవింతురు. నీపుత్త్రులు ప్రతి వింధ్యాదులు ద్వారకయందు నభిమన్యుం గూడి శస్త్రాస్త్రవిద్యలయందుఁ బాండిత్యము గడించుచు సుఖులైయున్నారు. సుభద్రయు రుక్మిణియు వారల కన్నపానాదు లగుసౌకర్యముల నమర్చుచుఁ బెంచుచున్నారు. మాధవుండు వారలఁ బ్రీతిమెయిఁ జూచుచుండును. బలరాముఁడు మొదలగుయాదవముఖ్యు లెల్లరు వారి నత్యాదరమునఁ జూచుచుం దురు. అనుదినమును వారిశారీరకసుఖములను, స్నానాదికార్యములను, నన్నపానములను వసుదేవుండు విచారించు. అని ద్రౌపదికి దానిబిడ్డల వర్తమానమును వినిపించి సంతసింపఁజేసి "యమ్మా సెల విమ్ము." అని యాపుణ్యవతిని వీడ్కొని భర్తృరథారోహణముం గావించె. లోకా

రాధ్యుఁ డగువాసుదేవుండు వీరిసల్లాపంబుల నెల్ల సర్వజ్ఞుండగుటఁజే నెఱింగి మునిముసినగవులు నగుచు యాజ్ఞసేనిని దగుమాటల నూరార్చి యందఱియానతిఁబొంది ద్వారావతి కేఁగెను. మార్కండేయుండును బాండవులఁ గథాలహరిం దేల్చి వారిసెలవుఁ బొంది నిజాశ్రమమునకుఁ జనియె నని వైశంపాయనుండు సెప్పఁగా జనమేజయభూపాలుఁడువిని మిక్కిలి యానందభరితుఁడయ్యె.

గ ద్య ము.

ఇది శ్రీమదాంధ్రవచనమహాభారతమునం దారణ్యపర్వంబున నర్జునాగమనము, నర్జునుఁడు యుధిష్ఠిరునితో నివాతకవచకాలకేయవధ ప్రకారం బెఱింగించుటయు, దేవతలవలనఁ దాను బొందిన యస్త్రములఁ జూపుటయు, నారదవచనమున నది చాలించుటయుఁ, బాండవులు గంధ మాదనమునుండి మఱలివచ్చుటయు, నాజగరోపాఖ్యానమును, వాసు దేవునిరాకయు, మార్కండేయాగమనము, సరస్వతీతార్క్ష్యసంవాదం బును, వైవస్వతమనుచరిత్రంబును, మార్కండేయుండు యుధిష్ఠిరాదు లకు నానావిధధర్మములను బోధించుటయు, నింద్రద్యుమ్నోపాఖ్యా నంబును, దుంధుమారచరిత్రమును, బతివ్రతాఖ్యానమును, ధర్మ వ్యాధుఁడు కౌశికునకు ధర్మముల బోధించుటయు, నాంగిరసంబును, గుమారస్వామిజననమును, నాతని చరిత్రమును, సత్యాద్రౌపదీసంవా దంబు నన్నది తృతీయాశ్వాసము.

---

## చ తు ర్థా శ్వా స ము

ఈతీరున మార్కండేయుండును వాసుదేవుండును దమతమనెల వుల కేఁగినపదంపడి మాతాత లగుపాండవేయు లేతీరున వనవాసక్లేశం బుల సహించి రని జనమేజయుండు వైశంపాయనుని నడుగఁగాఁ దత్ప్ర కారంబు నామునివర్యుం డానృపాలవర్యున కిట్లని విన్నవించెను.

అంతఁ బాండవులు కామ్యకవనవాసమును వదలి యచ్చటినుండి తరలి యనేకనదీనదములను బర్వతరాజములను దాఁటుచుఁ దొల్లింటి ద్వైతవనంబు ప్రవేశించి యం దొక్కరమణీయస్థలంబున సరోవరసమీ

షమునందుఁ బర్ణశాలల నిర్మించి యందుఁ గాపుర ముండిరి. అట్లుండు నపుడు తమయొద్ద కేతెంచువిప్రవరులతపస్స్వాధ్యాయనిరతికి మెచ్చుచు వారల మిగుల భక్తిమై నుపచరించుచుండిరి.

వారిట్లు ద్వైతవనంబున నుండ నొక్కనాఁ డావనమందలి విప్రులలో నొక్కండు ద్వైతవనంబునందుండి తఱలి హస్తినాపురంబున కేఁగి ధృతరాష్ట్రునొద్ద కరిగి యాతనిచే సత్కృతుఁడయి యుచితాసనాసీనుండై యుండ నాచీకురా జావిప్రున కిట్లనియె. విప్రోత్తమా! మీ రెచ్చటినుండి యెచ్చటికి కేఁగుచున్నారు? మీయీప్రయాణంబుల విశేషంబు లెయ్యవి? ఆనతిం డని యడుగ నాభూసురుం డిట్లనియె. రాజేంద్రా! నేను ద్వైతవనంబునుండి యరుదెంచుచున్నాఁడ. అందుఁ బాండురాజపుత్త్రులు శీతునకును, వేఁడిమికిని, బోడుగాలికిని సహింపలేక యతికృశాంగులై యున్నవారు. లోకములను జయింపఁ గలమగ లేవురు గలదయ్యును బాంచాలి యనదవోలెఁ గడు నిడుమలఁ గుడుచుచున్న యది. అనిచెప్పఁగా ధృతరాష్ట్రుం డంతయు నాలకించి తనమనంబున వారియిడుమలకుఁ దనయు పేక్షయే కారణ మని తలపోయుచు దుఃఖాకలితహృదయుండై వేఁడినిట్టూర్పులు వదలుచు మౌనముతోఁ గొంతసేపూరకుండి పదంపడి మనస్సు రాయిచేసి యాభూసురునితో నిట్లనియె. అయ్యా! నాపుత్త్రులందఱిలో నయ్యజాతశత్రుండు సత్యధర్మమును సదా పాలించువాఁడు. పరిశుద్ధుఁడు. పెద్దలమార్గమున వర్తించుమహనీయుండు. నాపుత్త్రులలోఁ బెద్దవాఁడు. ఇంద్రతుల్యుఁడు. మెత్తనిపాన్పునఁ బవ్వళించువాఁడు. వేకువ వీనుల కింపుగా వందిమాగధులు మంగళస్తోత్రముల మేల్కొలుపుచుండఁ దిన్నగా లేచి కాల్యకృత్యముల ధర్మముమెయి సలుపుచుండువాఁడు. అట్టివాఁ డీకాలమున వనవాసము గావించుచుఁ గఠినమైన శిలాప్రదేశములఁ బవ్వళించుచుఁ గ్రూరమెకములయుఁ బక్షులయుఁగూఁతల మేల్కాంచువాఁడయ్యె. వానితమ్ముండు నాగాయుతబలుఁడయ్యు నెండవాన గాలుల సహింపలేక కృశించి యడవుల నేలం బవ్వళించుచు దుష్టులగు నాకొడుకులవర్తనంబును దలపోయుచుఁ బాంచాలి పడునిడుమల కోర్వలేక కనలిననాగుబాముపోలె రోజుచు రాత్రులు కనుమూర్క

లేకయే యుండును. సుకుమారుఁడయిన యర్జునుండును నన్నలుఁ దమ్ములును బ్రియాంగన యైన ద్రౌపదియుఁ గుడుచునిడుమలను దలంచి యగ్రజునిసత్యధర్మబద్ధుండై యేమియుఁ జేయనేరక యుండును. యుధిష్ఠిరుమనంబునఁ గ్రోధ ముండదు! అర్జునుం డగ్రజునిచిత్తానుసరణమున వర్తించువాఁడు. భీమపరాక్రముండైన భీమునిమనంబునఁ గ్రోధంబు చల్లారదు. కాని, నిత్యనిరతుండైన ధర్మజునాజ్ఞ నుల్లంఘింప నేరకెట్లో యిన్నినాళ్లూరక యున్నవాఁడు. వాఁడు దివారాత్రంబు లన్నపానంబులు లేక నిద్రమాని నాకొడుకుల ప్రవర్తనంబులం దలంచుచుఁ గోపమును దరికొల్పుచు, నిట్టూర్పులు నిగిడించుచు, నెల్లప్పుడును నాపుత్త్రులవధోపాయము నేమరక తలపోయుచుఁ గాలము నిరీక్షించుచుండు. ముందు దుర్ద్యూతమప్పుడు యుధిష్ఠిరుం డోటుపడి దుఃఖితుండై యుండ దుశ్శాసనుం డాడినతులువమాటలు కార్చిచ్చొందినకసవుపోచలవలె వానిమేని దహింపకుండునే? ఇంతియ కాక యిప్పుడాకోపాగ్ని యరణ్యవాసక్లేశ వాయుప్రేరితమై యినుమడించి మిక్కిలి జ్వలింపకుండునే? భీమార్జును లిరువురు గూడి నాపుత్త్రపౌత్త్రుల నెల్లర నిర్మూలింపకుందురే? కాలాంతకునియట్టివాఁ డగు భీమునకు నర్జునుండు తోడ్పడిన, వారిరువురును బిడుగులవంటి బాణములను శత్త్రుసైన్యముపైఁ గురియించి వారిని నిర్మూలింపక కొందఱ నైన మిగిలింతురే? అర్జునుం డీకాలమున మునుపటివాఁడు కానేరఁడు. నాకలోకమునకేఁగి లోకపాలురవలన దివ్యాస్త్రములనార్జించికొని యున్నవాఁడు. ఈదేహముతో నాకంబున కరిగి క్రమ్మఱ నిటకు రాఁగల్గు టేటిమాట? ఏమి చెప్పుదు? గాండీవము విల్లఁట? సవ్యసాచి విలుకాఁ డఁట? దివ్యములస్త్రము లఁట? అట్లుండ నామహానీయుఁ బోర నెదుర్కొను మానవుఁ డేపాటివాఁడు? ప్రాణములఁ ద్యజించియైనఁ, దప్పినఁ దప్పుఁ గాక యని తెంపుఁజేసి తేనెతెట్టెయందలితేనె కాసించు మధుతస్కరుఁడువోలె నాకొడుకు సుయోధనుండు తెలివిమాలి, దుశ్శాసనకర్ణసౌబలుల మంతనంబునఁ దెంపుఁజేసి వారితో విరోధ మూనియున్నవాఁడు. మీఁద రాఁగలహాని నెఱుంగఁడు. దుర్ద్యూత మాడి పాండవులరాజ్యమును నాచికొనెను. దాన నింత చేటయ్యె. పోనిండు. ధర్మపుత్త్రుండును జూదమాడ నేల వచ్చెను? నేను దుష్టులయిన కొడుకులమతం బవ

లంబించితింగాని యానాఁడు జూదమును వారింపనైతి. దుర్మార్గులదారిఁ బోయి హానిఁ దెచ్చికొంటి. నాకొడుకులను జేటుకాల మాసన్నమైన యది. అయినం గానిమ్ము. ఇప్పుడు వగచి కార్యము లేదు. గతజల సేతుబంధమునఁ బ్రయోజనము లేదు. కానున్నయది కాకమానదు. జీవి శుభాశుభకర్మముల ననుసరించి యాఫలములఁ గుడిచి తీఱవలయును. మంచినేలను దున్ని సకాలమున విత్తనముఁ జల్లినచో నయ్యది కాల వర్షములచే వృద్ధిఁబొంది యేపెక్కి సంపదనుండునా! సర్వమును దైవాధీనంబయి వర్తించును. కర్మఫలములకుఁ బురుషుండు కర్త గానేరఁడు. కానున్నయది కాకమానదు, అగ్ని వాయుప్రేరితముగాక మండునా? చూలాలు ఉచితకాలంబునఁ దనంతటఁ బ్రసవించు. ఱేపకడ రాత్రి నశించును. రేయి యగుతఱిఁ బగలు నశించు. అట్లే సుఖకాలము సమీపించెనేని దుఃఖమును, దుఃఖము సమీపించెనేని సుఖమును నశించు. దుర్యోధనునిదుష్ప్రవర్తనమున నిట్టి యనర్థంబు చేకూఱె. దుర్మార్గుండ డట్లేల వర్తింపవలెను? పెక్కువనటుల పాలైనపాండుపుత్త్రు లిఁక నూరకుందురే? ఇంతటితోనైన సుయోధనుండు వారిపాలొసంగిన వైర మడంగి యందఱును సుఖింతురు, వాఁ డట్లొనర్చునే? ఈ కార్యమంతయు నెట్లు కానున్నదో? ఉభయ పార్శ్వములవారికిని సంధి కావించి పాండవుల రాజ్యభాగము వారి కొసంగుట సర్వశ్రేయము. సంధి కాకున్నచోఁ బొడము ననర్థముల కంత ముండదు. ఇది యథార్థంబు. ఒకఁ డపకృతి యొనర్ప నొరులు బదు లొనర్పకుందురే. కర్మము భిన్నము గాదు; జాఱిపోవదు. పెక్కువిధంబులుగా మాఱిపోవును కాని నిక్కముగాఁ జేసినకర్మమునకు నాశం బీలోకంబునఁ గలుగదు. ధనంజయుఁ డరణ్యమునుండి దివి కేఁగి దివ్యాస్త్రము లనేకములు వడసి వచ్చె. చూడుఁడీ వానిమగఁటిమి! బొందితో దివి కేగిన ధనంజయుఁడు వెండియు భువి కవతరించె. మానవుఁ డెవ్వఁడేని యట్లు రాగలఁడే. కాలచోదితులై జమునిప్రోలికిఁ బోవ నున్న యీమనకౌరవులం బరిమార్ప నాతఁడు మఱల నేగుఁ దెంచె. విలుకాఁడో యిరుగేలబాణము లేయు నర్జునుఁడు; ధనువో వేగంబుగల గాండివము. అతనియస్త్రములో దేవతా వరప్రసాదలబ్ధములు. ఈమూఁటివెలుఁగు నెవఁ డోర్వఁగలఁడు? కర్మగతి యేతీరున

వర్తింపనున్నదో యనిపలుతెఱంగులఁ జింతించుచుండె. ధృతరాష్ట్రుని యీమనోవేదననంతయు నాలించినశకుని యీవృత్తాంతంబు నంతయును గర్ణునకుఁ జెప్పె. అంత వారిరువురును దుర్నయమున దుర్యోధనుపాలికిం బోయి యేకతంబునఁ జీకురాజుపరివేదన మంతయును జెప్పిరి. ఈవృత్తాంతంబంతయును సుయోధనుండు విని వగఁ జెందె. అంత రాధేయుండు రాజున కిట్లనియె.

## కర్ణశకునిదుర్యోధను లేకతంబున మంతనంబు చేయుట

మహీపాలా! శూరులైన పాండుపుత్త్రుల నిజబుద్ధికౌశలంబున నరణ్యమున వసింపఁజేసితివి. ధర్మజుం డింద్రప్రస్థపురంబున రాజ్య మేలుచుండఁగా నాతనివశగతములై యున్న సకలైశ్వర్యములను నీవశముఁ గావించికొంటివి. విప్రులస్తుతివాక్యములచేతను, సామంతరాజుల పొగడ్తలచేతను నీపరాక్రమము దినదినప్రవర్ధమాన మగుచు దేవతలలోఁ బ్రభాకరుండుంబోలె రాజులలో నీవు తేజోవంతుండవై వెలయుచున్నావు. ఏకాదశరుద్రులమధ్యమందు విరాజిల్లు యమునిమాడ్కియు, వేల్పులచేఁ గొల్వఁబడు పాకశాసనునిపగిదిని, నక్షత్రములనడుమఁ బ్రకాశించు చంద్రునివిధంబునను, నీవు భ్రాతృబంధుసుజనపరివృతుండవై వెలయుచున్నవాఁడవు. సకలమహీప్రజలును నిన్నుఁ గొలుచుచుండ సర్వసుఖములను దమ్మునితో ననుభవించుచు నాఖండలువిభవంబు ననుకరించుచు మహీమండలంబు నేలుము. నీయాజ్ఞ నుల్లంఘించిన పాండవుల నడవులపాల్సేసితివి. వార లీసమయమున వనవాసులగు విప్రులతోడ ద్వైతవనమున నున్నా రని విందు. వారలు రాజ్యమును గోల్పోయి వనగతులై యుండఁగా రాజ్యస్థుండ వగు నీవు సకలసంపదలతో నిపు డాద్వైతవనంబున కేఁగి రాజ్యలక్ష్మీవిహీను లగువారికి రాజ్యలక్ష్మిని గనుపఱచుచో వెలయు నిన్నుఁ గాంచి వారు దీనవదనులై మధ్యందినమార్తాండునిచాడ్పున సంతాపమును బొందుదురు. మహదైశ్వర్యముతో నీవు వారియెదుట భద్రగజము నెక్కిపోవుచుండ వారికి నీవు నహుషపుత్త్రుం డగుయయాతివిధంబునఁ బొడసూపుదువు. ఆవిధమును నీశత్త్రువు లగు పాండవులు సూచి యడలుదురు. ఐశ్వర్యంబు గలవాఁడు మిత్త్రుల సంతసింపఁజేయవలయు. శత్త్రువులఁ

దపింపఁజేయవలయు. ఇవి రెండును వానికి ముఖ్యకర్తవ్యములు. కొం
డపై నున్నవాఁడు కొండదిగువ నున్నవారినిఁ జూచువిధమున మహీ
వలయమున నుండు నైశ్వర్యము నంతయు ననుభవించుచుండువాఁడవును
మానవుల కెల్లర కందరానిపదము ననుభవించుచుండువాఁడవును నగు
నీవు దుర్భరదారిద్ర్యము ననుభవించు నీపరమశత్రువులను నొయ్యా
రంపుఁజూపులతోఁ జూచుటనంటి భాగ్యమునకన్న వేఱొండు మనః
ప్రియంబుకలదే. ఇంతటి మనఃప్రియంబును బుత్త్రలాభము గలిగింప
నేరదు. ఇట్టియానందము ధనలాభమునఁ బొడమదు. ఇవ్విధమయిన
సంతసము రాజ్యలాభమున సంభవింపదు. నారచీరలు గట్టి కూర లశనం
బుగ నున్నయష్టసుని నీవు సకలసంపత్సమృద్ధుండవై సకలపరివారము
తోఁ జూచు భాగ్యమున జనించుసుఖమునకంటె నన్యసుఖంబుండునే?
దివ్యంబు లగు కట్టుపుట్టంబులతోను, మేటియాభరణములతోను నానా
భోగములఁ గుడుచుచున్న నీరాణివాసస్త్రీలను నారచీరలను ధరించి,
విగతాభరణలై, పర్ణశాలలయందు వసించుచుండు పాంచాలి సకల
కష్టములఁ బడుచు నీయంతఃపురకాంతలవిభవమును జూచి యోర్వ
లేక దుంపుఁగాక! మీవారల సకలైశ్వర్యములఁ జూచి యడలుఁగాక!
తనయిప్పటిబ్రదుకును నిందించును గాక! ఆనాఁడు దానికట్టిన పుట్టంబు
సభలో నొలుచుచున్నప్పటి దుఃఖమునకంటె మించిన దుఃఖము దానికి
దుస్సహంబై యుండుఁగాక. ఇక్కార్యం బవశ్యంబుకర్తవ్యంబనఁగా శకుని
యిప్పటి కీపనిని జేయకుండరా దనియుపపాదించె. వారియువురియభిప్రా
యంబుఁ దెలిసి యాలోచనాపరుండగుసుయోధనుం డిట్లనియె. ఇయ్యది
నాకభిమతంబు. దీనికి నే సంతసింతుఁ గాని, యియ్యది నెఱవేరునా యని
యించుక సందియంబు పొడమెడు. అని దీనుండై నుడువుచు సూతపుత్త్రుని
కిట్లనియె. ద్వైతవనమునకు మనలను మాతండ్రి పో నిచ్చువాఁడు
కాఁడు. అందుఁ బాండుపుత్త్రు లుండు టాతం డెఱుంగు. ఆతండు వార
లంగూర్చి వగచినవిధం బంతయు నింతకుమున్న మీరలు నా కెఱింగించి
తిరి. వారలు మనకంటెఁ దపోధికు లనియు, బలశాలు రనియు నాతని
మతంబు. ఎన్నిమాటలఁ జెప్పినను, సదుపాయములం దేల్చినను నాతండు
మీఁ దాలోచించు. మన కాజ్ఞ నొసంగఁడు. పాండవుల కుడుకుఁ బుట్టిం
చుటకన్న మన కావనంబున వేఱొకకార్య ముండునా! అల జూదంబు

నాఁడు విదురుండు మనల ముగ్వుర నెట్టిమాటల నాడెనో మఱచితిరే? సర్వము నాలోచించుచో మనయాలోచన కొనసాగనేరదని తోఁచుచున్నయది. సకలకష్టముల ననుభవించుచు వనవాసముఁ జేయుచున్న నా గర్భశత్రువులగు పాండవులను జూచి సంతసించుటకంటె నాకీరాజ్యలాభము సంతసం బియ్య నేరదు. నారచీరలు గట్టిన పాంచాలినిఁ జూచి సంతసించుభాగ్యమున కన్న నాకు వేఱొండు భాగ్యము గల్గునే? చింతాసముద్రనిమగ్నులయిన పాండవులను నేను నానావిధవిభవములతోఁ గూడి వీక్షింతునేని నాపుట్టుక సఫలంబయ్యె. నేను ధన్యుండ నయితి నని తలంతు. నాతండ్రి నిందుల కియ్యకొనునట్లొనర్పఁగలయుపాయము నూహింపవలయు. నీవును శకునియు దుశ్శాసనుతో నాలోచించి రేపకడ నా కెఱింగింపుఁడు. భీష్ముఁడును నిందుల కనుజ్ఞ నొసంగవలయు. వారిరువురు నొప్పిరేని ద్వైతవనయాత్ర తప్పక సాగును. వారి నొప్పించునుపాయంబు మది నూహింపవలయును. అని వచించి వారిని వీడ్కొలిపె. వారును దమతమ యునికిపట్లకుఁ జనిరి. సుయోధనుండా రేయి నెట్లో గడపె. అంత రేపకడఁ గర్ణుండు సుయోధనుపాలి కరుదెంచి శకునిదుశ్శాసనులు వినుచుండ నగుమొగంబుతో నిట్లనియె. రాజేంద్రా! విను మొక్కయుపాయంబూహించి వచ్చితి. ఆలకింపుము. వచించెద. మనయాలమంద ద్వైతవనంబున నున్నయది. దానిఁ జూచుసాకుఁ జెప్పి రాజును మెప్పించిన త్తము. వానికిఁ గ్రూరమృగములవలని వెఱపు లేక రక్షణఁగావించుట నీకుఁ గర్తవ్యంబు. కావున ఘోషయాత్రసాకుఁ బెట్టి ద్వైతవనంబునకు మన మందఱ మతి విభవముతో నేఁగి పాండవుల నడలించుట లగ్గు. రాజందుల కవశ్యంబు సెలవొసంగు. అనఁగా శకునియు నిదియ నా కుచితముగఁ దోఁచినది. ఈయుపాయంబు మనయాలోచనంబున కనపాయంబు. అని వారందఱు చప్పటులుగొట్టుచు, నొకరినొకరు మెచ్చుచుఁ దామువృద్ధరాజుకడ నుండు నప్పుడు పశువులు ద్వైతవనమున నున్నవని తమతోఁ జెప్పునట్లు సమంగుఁడను గొల్లవానిఁ బఱచి వానిం దోడ్కొని యారాజుపాలికిం బోయి పరస్పర కుశలవార్తల నాదరించుకొని రాజునకుఁ బ్రణమిల్లి యుచితాసనంబులఁ గూర్చుండిరి.

### కర్ణశకునులు ఘోషయాత్రకు ధృతరాష్ట్రుననుజ్ఞఁ గొనుట

అంత వారేర్పఱచియుండిన సంకేతంబుచొప్పున నాసంగవుండు ధృతరాష్ట్రునకు మ్రొక్కి, 'దేవా! గోవులన్నియు నిప్పుడు మనసమీపమున నుండుద్వైతవనమున క్షేమంబున నున్నయవి. వానికి రక్ష కావలయు. క్రూరమృగంబులబాధనుండి వానిని గాపాడవలయును. వనమునఁ జక్కఁగాఁ బసులకుఁ బచ్చిక పట్టియుండుటం జేసి మేపునకు మిక్కిలి వసతిగలిగియున్నది. దీనినిఁ బ్రభువులకు మనవిసేయవచ్చితి.' అని చెప్పఁగా సూతసూనుండును సౌబలుండును రాజున కిట్లనిరి. నృపాలా! ఆయాలమంద లన్నియు నిపుడు మంచి మేపుపట్టున నుండుటం జేసి వానికిఁ గ్రూరమృగోపద్రవము సంభవింపక తమపుత్త్రుఁడు దుర్యోధనునికి వేట కనుజ్ఞ నొసంగవలయును. ఆతండు క్రూరమృగంబుల వేటాడి వానివలని బాధ పశుగణంబులకుఁ గలుగనీయకచేయును. ఇంతియ కాక దూడలను బసులను నేర్పఱచి గుర్తులఁ బరిశోధించి వానిరక్షించునిమిత్తము పసులకాపరుల నియమించి తగుకట్టుబాట్లను జేయుట యవసరము. అనఁగా నందుల కాంబికేయుం డిట్లని పలికె. గోవుల నరయుట లెస్సైన కార్యము. వానినిమిత్తము వేటకుఁ బోయి క్రూరమృగవధ ముచితము. కాని పసులకాపరులవార్తలను విని ద్వైతవనమున కీసమయమునఁ బోవుట సరి కాదు. మీచే దుర్ద్యూతమునఁ బరాజితులైన పాండుపుత్త్రు లిప్పుడు ద్వైతవనమునం దిడుమలఁ గుడుచుచున్నవారు. అచ్చోటి కీసమయమున మీరేఁగుచో నేదైన దోసఁగు వొసఁగు. అందులకు మీరు కారకులు కాకపోయినను నిందలపాలగుదురు. పాండవులు తపోధనులు సమర్థులు. ధర్మజుం డంత క్రోధంబు సాధింపఁడు. అర్జునుండును గవలును నగ్రజుమార్గానువర్తనులు. భీము డుగ్రుండు. వానియలుక చల్లారదు. ఏదో నెపంబుఁ గల్పించి రణోన్ముఖుండగు. పాంచాలి మీచేఁ బరిభవింపఁబడి యీసున నగ్నికణంబులఁ గ్రక్కుచుండు. దాని తేజం బపారంబు. మీరలో కడు రాగద్వేషంబులు గలవారలు. వారల కెగ్గు సేయ సమకట్టుదురు. వా రందుల కలిగి మిమ్ము స్వీయతపోబలంబున నొండె, శస్త్రాస్త్రములచే నొండె సమయింపఁజూతురు. మీరు మీవెంట వచ్చుబలంబున వారినిఁ దిరస్కరింతురు. అనర్థ మంతట వాటిల్లు. ఫల్గునుం డింతకు మున్న నాకలోకం

బున కేఁగి దివ్యాస్త్రములను బడసివచ్చియున్నవాఁడు. ఆతఁ డవి సాధింపక మున్నె ముల్లోకంబులందలి విలుకాండ్ర కెల్ల మేటియై విఖ్యాతిఁ గాంచె. ఇఁక దివ్యాస్త్రములఁ బడసియుండు నప్పుడు నీయున కీపుడు మీ రెంతటివారు ? నామాట నాదరించి మీలోఁ గొందఱు వారి కేయపరాధమును గావింపకున్నను మీవెంబడి నేతెంచుసైనికులలో నెవఁడైన నేదేనియకృత్య మొనరించును. అందులకు బుద్ధిపూర్వకముగ మీరు కారకులు గాకున్నను, నాయపరాధమునకు మిమ్మునే కారణముగా వారు దలంతురు. కావున గోగణపరిశీలనమునకును రక్ష గావింప నేర్పాటు లొనర్చుటకును నితరుల నేరినేనిఁ బంపుట మేలు. ఇక్కార్యంబునకు మీ రేగుట యొప్పదని తలంతును. అనఁగా నయ్యాంబికేయునకు సౌబలుం డిట్లనియె. రాజేంద్రా! మేము వారి కెగ్గొనర్పము. పరమధర్మాత్ముం డగుధర్మపుత్త్రుండు ధర్మమార్గమున వర్తించు. ఆనాఁ డాసభలోఁ బెద్దలు వినుచుండ వనవాసదీక్షను బూనియున్నాఁడు కదా ! ఆతనిసోదరులును నాతనియాజ్ఞల మీఱి నడువరు. కాన ధర్మజుఁడు మాపైఁ గినియఁడు. మేము ఘోషయాత్రకుఁ జని కొన్నాళ్లు వేడుకతో నందు వర్తించి గోగణముల లెస్సగాఁ బరిశీలనగావించి మఱల వచ్చువారము ఇంతియ మాయూహాంచు. మాపరిజనులలో నెక్కండును వారి కెగ్గొనర్పక కాచియుండుదుము. వేయేల ? మేము వారుండు ప్రదేశములకుఁ బోము. సెల వొసంగు మని వినయవినమ్రుండై వేఁడఁగా నామాట లాలకించి యవ్వైచిత్రవీర్యుం డెట్టకేలకు సెల వొసంగె.

### దుర్యోధనుఁడు ఘోషయాత్ర కేఁగుట

అంత దుర్యోధనుండు తండ్రిచే ఘోషయాత్రకు సెలవుగొని యపరిమితానందంబు పొదలఁ బుర మంతయు ఘోషయాత్రఁ జాటించి కర్ణసౌబలదుశ్శాసనులును, దక్కుంగలసోదరులును వెంట రాఁగా నంతిపురపుఁగాంతలఁ దోడ్కొని తరలెను. మఱియుఁ బౌరజనులు పత్నీసమేతులయి యాదుర్యోధనుని వెంబడించిరి. అతనివెంట నెనిమిదివేల రథంబులును, గజంబులు ముప్పదివేలును, దొంబదివేలగుఱ్ఱములును, పెక్కువేలకాల్బలములును, వేటకాండ్ర సేవకులును, వందిమాగధులును దరలిరి. అపుడు వణిజులు నానావిధవస్తువులఁ నింపిన శకటములను

బోలుకొని పోయి యాసన్నివేశంబుల నంగళ్లు పఱచిరి. ఆసుయోధనుని ఘోషయాత్రయందు వర్షాకాలమేఘగర్జనంబుంబోలె గొప్ప రొద జనించెను. అప్పుడు దుర్యోధనుని సైన్యంబులసంఘట్టనంబులఁ బైకెగసిన పరాగంబు రోదసీకుహరంబుఁ గప్పె. పరిజనకోలాహల ధ్వానంబున దెసలు పిక్కటిలువాఱె. ఆనాఁడు ప్రయాణము రెండుక్రోసుల దూరము నడచెను. అంత నొక్కవిడిప్రదేశమున విడిదలఁ గావించి మఱునాఁడు తరలి కతిపయదినప్రయాణంబుల ద్వైతవనంబును రారాజు సమీపించె. అప్పుడావనంబున నొక్కచో శిబిరంబు గావించుకొని యందుండ వేర్వేఱు భృత్యులు దనవెంటరాఁగాఁ, గ్రేపులను, గోవులను, గోడెలను, గొప్పవృషభములను, దర్ణకములను నానావర్ణములు గల వానిని బ్రత్యేకప్రత్యేకములుగ నేర్పఱచి యన్నింటికి గుర్తులఁ గావించి వానివానికిఁ దగుగోపాలురరక్షణములను నియమించి వారి వారికిఁ దగుపారితోషికముల నొసంగి గారవించుచు, గొల్లలవర్తనములను బరికించుచు, వారియాటవికగానంబుల మెచ్చుచుఁ, గొడుకులతోను, జెలికాండ్రతోను, విలాసిజనులతోను వలసినంత పాలు పెరుఁగు వెన్న నేతు లారగించుచుఁ గోరినవిహారముల నానందించుచుఁ గ్రూరమృగంబుల వధించునిమిత్త మాఖేటంబునకై వేఁటకాండ్రఁ జెచ్చి వేఁటాడి యనేకమృగముల మాంసంబులను శిబిరమునకు బోయలచేఁ గావళ్ల నింపి పంపుచు, నవ్వనంబునఁ దేనెటీఁగల ఝుంకారనాదంబులవిని యానందించుచు, నెమిళ్ల క్రేంకారంబుల నాలించుచు, నానావిధతరులతాగుల్మాదుల రామణీయకంబున కలరుచు, వనమధ్యగతసరోవరనిర్మలశీతజలముల్పైనుండి వీచు తెమ్మెరల నుల్లాసవంతుఁ డగుచు, రారాజాయరణ్యంబున విహారము సల్పుచు ద్వైతవనమధ్యగతముఖ్యసరోవరతీరమున విడిసె. ఆసరోవరమున కివ్వలిగట్టున ధర్మజుండు విప్రబృందపరివేష్టితుండై ద్రౌపదీసహితుండై యప్పుడు సద్యస్కం బను రాజర్షియజ్ఞము గావింప దీక్షితుండై యుండె. అప్పుడు సుయోధనుండాసరోవరతీరమునఁ దమకు విడిదలల నేర్పఱచునిమిత్తము పరిచారకుల నియోగింపఁగా వారు సాధనంబులతో విడిదల గావించుటకు యత్నించిరి. అప్పు డాసరోవరరక్షకు లగు గంధర్వభటులు వారికడ్డమువొచ్చి, యీకొలనిసమీపమున విడిదల లేరికిఁ గావించుటకు

మాయొడయం డిష్టపడఁడు. కావున నీచోటువదలి పొండని కొందఱు గంధర్వభటు లాగర్వాంధభటుల నడ్డగించి యిట్లనిరి. ఓ భటులారా! మీ రెవరిమానతిమెయి నీప్రదేశముఁ జొచ్చితిరి? మీ రిచ్చోటికి రావలదు. ఇచ్చోటఁ జిత్రసేనుం డను గంధర్వరాజు విలాసార్థంబు విలాసినీజనంబులతో నిచ్చోట విడిసియున్నవాఁడు. తొలఁగిచనుఁ డనఁగా వార లచ్చటనుండి చని కురురాజుమ్రోల నీవృత్తాంతం బంతయు నెఱింగించిరి. అప్పుడా మదాంధుం డంతటఁ బోక, యుద్ధనిపుణులగు తమసైనికులలోఁ గొందఱఁ జీరి యాసరోవరతీరమునుండి యాగంధర్వులఁ దఱుముఁ డని సెలవొసంగె. అంత వా రాతని యాజ్ఞను వహించి సరోవరతీరమున కేఁగి యాగంధర్వభటులతో నిట్లనిరి. అయ్యలారా! మీ రెవ్వరు? ఇచ్చోట నుండకుఁడు. మహాబలపరాక్రమశాలి యగు దుర్యోధనమహారా జంగనాసహితుండై యీవనమున విహారార్థమై యేతెంచియున్నవాఁడు. వానియాజ్ఞ యైనది. తఱలుఁడు. ఇది మారాజుపంపు. అనఁగా వా రామాటలకుఁ బకపక నగుచు నాభటుల కిట్లనిరి. మీ రాజు తనకును నెదుటివారికిని గల యంతరమును నెఱుంగఁడు. మమ్ము వేల్పులను భృత్యుల నదలించున ట్లదలించుచున్నాఁడు. మూఢులగు మీరు యమాగారమున కతిథులు గాఁగోరెదరు. యుక్తము నెఱింగినవారు గారు. లేనిచో నవివేకియగు మీ రాజానతిఁ గొని యెదిరి బలపౌరుషంబుల నెఱుంగక యిట్లు వలుకుదురే? పోనిండు. ఇప్పటికి మిమ్ము మన్నించెదము. మీ రాజుశిబిరంబునకైనను, లేక, యావలి తీరంబున ధర్మజువిడిదలకైనను జనుండు. మిమ్ముఁ గాపాడెదము. లేదా మామాట విన కిం దుండుదు రేని మీయసువులు మీవి కా వనఁగా వా రందులకు వెఱచి యయ్యాంబికేయపుత్త్రుపాలికిం జని వానితో గంధర్వులమాటలఁ దేటతెల్లంబుగా మనవిచేసిరి. అంత సుయోధనుండు తోఁకత్రొక్కినపన్నగంబుచాడ్పున జెలరేఁగి యాగంధర్వు లేపాటివారు? వా రానా కనుజ్ఞ నొసంగువారు? ఆ గర్వితులను, వేగమ శిక్షింపుఁడు. వారల నాదరింపరాదు. పాకశాసనుండు వారికిఁ బాసటయ్యె వచ్చినను వారిని గెలిచి శిక్షింతును. సైన్యములను సిద్ధపఱపుఁడు. అని రోషపూరితరక్తనయనుండై గొప్పయెలుంగెత్తి యార్వ నారాజరాజుసైనికులగు భటులు వివిధాయుధపాణులై దెసలు బీటలు

వ్రాలి నార్పుచుఁ బెడబొబ్బలిడుచు భుజాస్ఫాలనంబులఁ జేయుచు, వీర
హుంకారనాదంబులఁ గావించుచు గంధర్వు లున్నవలని కేఁగిరి.

## కౌరవులకు గంధర్వులకును యుద్ధము

అంత గంధర్వభటులు తెగువకుఁ జొాలక వారిని దిన్ననిమాట
లతో నెంతఁ దేల్చినను వా రుద్ధతులై పైఁబడుటయు నాగంధర్వభటులు
చిత్రసేనునికడ కేఁగి యావృత్తాంతంబును విన్నవించిరి. అంతఁ జిత్రసే
నుండు రారాజుభటులయుద్ధతిని విని వారల లెస్సగ మర్దింపుఁ డని సెల
వొసంగె. అంత నాగంధర్వభటులు నానాయుధముల ధరించి యొక్క
పెట్టున దుర్యోధనుసైన్యముపైఁ బడుటయు, వారు చిందఱవందఱలై
పాఱిరి. దాని సంతయు దూరమున నుండి చూచుచున్న రాధేయుండు
రారాజు మెచ్చుపడయునిమిత్తము విలాసముతో గంధర్వులయుద్ధతి
కెదు రేఁగి తనయస్త్రలాఘవము మెఱయ వారిపై నంపవాన గురియించి
పెక్కండ్ర వధించె. ఈతీరున గంధర్వులు కొందఱు కర్ణునిచే వధింపఁ
బడఁగా, సెఱివారు కోపఘూర్ణితతామ్రాక్షులై వేనవేలుగ రణభూమి
కేతెంచి యెటుసూచిన గంధర్వమయమై యొక్కపెట్టున నందఱును గర్ణుం
దాఁకిరి. అప్పుడు దుర్యోధనసోదరులు కర్ణునకుం బాసటగాఁ రాఁగా యుద్ధ
మతిశయించె. గంధర్వు లనేకులు మడిసిరి. కౌరవులసైన్యమున నార్పులు
పెడబొబ్బ లెసఁగె. ఆయార్పులను విని చిత్రసేనుండు భీకరమూర్తియై
యంగనామధ్యంబుననుండి చెంగున నెగిరి కవచధారియై, యాయుధ
ములఁ బూని కౌరవసైన్యంబుఁ జొచ్చి నానావిధచిత్రగతుల యుద్ధము
సలిపి, మాయాస్త్రప్రయోగము గావించి కౌరవసేనలను మోహితులఁ
జేయఁగాఁ బదుగురుపదుగురు గంధర్వు లొక్కొక్క కౌరవసైనికునిఁ జుట్టి
కొనినట్లు కానరాఁగా నీచిత్రయుద్ధమునకు దుర్యోధనునిసైనికులు వెఱ
చఱచి ప్రాణభీతిఁ బాఱిరి. కర్ణుం డొక్కరుండు చలింపక రణాంగణం
బున నిలిచి యుద్ధము గావించుచుండ దుర్యోధనసోదరులు పాఱిన
సైన్యమున నుత్సాహంబుఁ గల్పించి మరల్చుచుండిరి. అంత గంధర్వులు
వేనవే లొక్కుమ్మడి రాధేయుం జుట్టుముట్టి యనేకాయుధము లతని
పైఁ బ్రయోగించి కొంద ఱాతని తేరికాఁడిని, గొందఱు ధ్వజమును,
గొందఱు గొడుగును, గొందఱు తేరినొగను, గొంద ఱశ్వములను,

కొందఱు రథావరణమును, కొందఱు సారథిని జిందఱవందఱలు సేయ రాధేయుండు విరథుండై వికర్ణురథ మెక్కి యుద్ధరంగమున నిలువలేక తొలఁగిచనియె. అంతటఁ గౌరవసైనికు లందఱును వికావికలై పాఱిరి. అప్పుడు దుర్యోధనుండు పైపైవచ్చుగంధర్వసైనికుల నంపవాన ముంపఁగాఁ జిత్రసేనుం డంపులకుఁ బెల్లు గినిసి గంధర్వులఁ బురికొల్పుకొని, యొక్క పెట్టునఁ గర్ణునిపైఁబడినతీరునఁ బడి వాని విరథుం జేసె. అంతఁ జిత్రసేనుండు దయఁ దాల్చి సుయోధనుం జంపక వెడ ఱెక్కలు విఱిచి కట్టుగట్టి, వశపఱచుకొనియె. ఇట్లు సుయోధనుండు పట్టువడఁగాఁ బెఱ గంధర్వులు వానిసోదరు లగు దుశ్శాసన వివింశతివిందానువిందాదు లగు కౌరవులను వారిభార్యలనుం బట్టి బంధించిరి.

### కురుసైనికులు ధర్మరాజునొద్ద కేఁగి కౌరవుల చెఱఁదొలఁగింపఁ బ్రార్థించుట.

ఆతీరున నాగంధర్వులు సోదరసహితుండైనదుర్యోధనుని జెఱ గొనిపోవుచుండ నంతకుమున్ను వారితోఁ బోరి పాఱిన కౌరవులు ధర్మరాజుపాలి కేఁగి దుర్యోధనుపాట్లంతయు విన్నవించుచు, నోదయామయా! కారుణ్యనిధీ! ధార్మికుఁడా! దుర్యోధనాది కురుకుమారు లందఱును గంధర్వులతో యుద్ధమునకుఁ జొచ్చి వారిచేఁ బరాజితులై బంధింపఁబడి యల్లదే గంధమాదనప్రాంతముల కేఁగుచున్నారు. వారందఱును వారికాంతలతోఁ బట్టువడి గంధర్వవశులై కొంపోఁబడుచున్నవారు. కరుణించి నీతమ్ములఁ బంపి వారిం జెఱ వదలింపవే! ధర్మాత్ముండను కీర్తివడసి ధర్మరాజనునామధేయముతో వెలయుచుండు నీ విప్పుడు వారి నాయాపదనుండి తప్పించి సార్థకనాముండవు కమ్ము. కరుణింపుమని దీనాననములతో మొఱ లిడుచుండ నుగ్రుం డగు భీమసేనుం డగ్రజున కిట్లనియె. రథగజతురగపదాతులం గూర్చికొని యొనర్పవలసినపని గంధర్వు లొనర్చి పుణ్యమునఁ బోయిరి. మనకుఁ గార్యంబు సులభమయ్యెను. పాటును నెంతమాత్రము లేక గెలుపు మన కబ్బెను. మనభాగ్యముచే మనకుఁ బ్రియంబు సేయుపురుషుం డయత్నమున లభించె. కష్టములఁ బడుచు నరుల గెలువ లేక నవయుచుండువారిశత్రువుల నోర్చుటకు దైవంబు లాఁతివారల నియమించు నని తొల్లి విని యుంటిని. మనతపోబలంబుచే నయ్యది మనకుఁ బ్రత్యక్షగోచరంబయ్యె. దుర్ద్యూతమాడి, మనభుజబలపరాక్రమార్జితం

బైన రాజ్యంబు మోసపుచ్చి యాచికొన్న కష్టాత్ముని మదమణఁగించుటకు మన మాలోచించుచుండఁగా, నీ వనవాససమయమున నిడుమలఁ బడుచుండు మనల నగుబాట్లొనర్చుట కేతెంచిన యీదురాత్ముని దురాలోచనం బిట్లు వ్యత్యస్తఫల మిచ్చునే? ఆమోసగాఁడు తా నొకటిఁ దలఁప దైవము వేఱొకటి తలంచె. మన మెట్టిసాహసంబునకు నుంకింపక యన్నింటికి దైవముమీఁద భారము వైచి యిడుమలఁ గుడుచుచున్నప్పుడును నీ యధర్మపసంపు చేయనిదుష్కార్యములు, తలఁపనిదురాలోచనములు నుండునే? వాని ననువర్తించువారు సైత మినుముతోఁగూడిన యగ్నికి సమ్మెటపెట్టులువోలె నీనాఁడు గదా యిడుమలఁ గుడుచుచున్నారని చెప్పుచుండ భీమసేనునకు ధర్మపరుం డైన ధర్మరా జిట్లనియె. సోదరా! పరుషభాషణంబుల కిది యదను కాదు. కౌరవులు భీతిపాలై యిప్పుడు మనల శరణనిరి. కావున వారినిఁ బొడిచి నిష్ఠురోక్తులాడ నిది తరుణము కాదు. జ్ఞాతులకుఁ గొన్నినిమిత్తములచేఁ దమలోఁ బగ గల్గుటయు నభిప్రాయభేదములును సహజము. అద్దానఁ గులధర్మము నశింపఁజేయఁ దగునా? అన్యు లెవ్వరేనిఁ గులహాని యగుకర్మములఁ గావింతురేని జ్ఞాతులు తమలోని పగ నణఁచి కులము నుద్ధరించుట మనుమార్గ మని పెద్దలు వచింతురు. సుయోధనుండును క్లేశములతో నుండు మనల నపహసించి యుల్లాసముతో నానందింప నేతెంచినది నిక్కువంబు. కాని మన మిప్పుడు పూర్వవైరమును బాటింపరాదు. మన మనాదరణతో నుందుమేని కురుస్త్రీ లవమానమునకుఁ బాలగుదురు. బహుకాలము నుండి వన్నెకెక్కిన కురుస్త్రీల గౌరవము నశించు. ధార్తరాష్ట్రుల వనితల యవమానమును మన మిప్పుడు సహించితి మేని వారితో నేకకులమున జనించిన మనకు నాయవమానంబు తప్ప నేరదు. ఆలోచింపుము. నామాటకు మాఱాడకుము. నీవును నర్జుననకులసహదేవులును రథముల నారోహించి యింద్రసేనాదు లగుభృత్యులు మీకుఁ దోడురా గంధర్వుల వెన్నంటి ధృతరాష్ట్రకొడండ్రను జెఱ వదలింపుడు. ఇది ధర్మువు. ఎవ్వండేని క్షత్త్రియుని శరణు వేడినచో వానిని రక్షించుట క్షత్త్రధర్మము. క్షత్త్రియుండు శరణన్న శత్త్రువు నైనఁ గాపాడవలయు. అరులచేఁ జిక్కి తప్పించుకొననేరక యుగిలించుచున్న దుర్యోధనుని మన మిప్పుడు కాంతా

జనంబుతోఁ జెఱ వదలింతుమేని, యీయుశస్సున కింతింత యని విలువ యుండునే? అంతియ కాక యీదుష్కృదు డెట్లయినఁ దన్ను మనము విడిపింతు మనితలపోయుచుండు. నిన్నింత ప్రార్థింపక నేనుపోయి గంధర్వుల జెఱనుండి వారి నిప్పుడ వదలింతుఁగాని, యజ్ఞదీక్షితుండవై యుంటఁ జేసి యీకార్యంబున కనర్హుండ. కావునఁ బూనికతో మీరు వారికి విమోచనంబుఁ గావింపుఁడు. అప్పటికిని గంధర్వులపై ముష్టందుగఁ బ్రతాపముఁ జూపకుఁడు. నీతివచనముల వారలం దెల్పుఁడు. సామమునఁ గర్జమొకఁ గూడ దేని వెంటనే శౌర్యమంతయుఁ జూపకుఁడు. అప్పటికిని వారువిధేయులు కారేని సమరంబు సలిపి, తెగువకుఁ జొచ్చి మీరూహించినంత వెనఁకువకుఁ గడగి గంధర్వులనోర్చి మనవారిఁ జెఱ వదలింపుఁడు. ఇది నాకభిమతకార్యంబు. అన్యులతోఁ బగఁ గూరెనేని మనము నూటయేగురము. మనలోమనకు వైరము గలిగినపుడు వారు నూర్వురు, మన మేవురమని భావింపుఁడు. ఈభావము నెల్లప్పు డూని వర్తింపుఁడు. నేను మీకుఁ జెప్పవలసిన దంతయుఁ జెప్పితి. ఎట్లయిన నాయభిమతం బీడేర్చి నాయజ్ఞమును ఫలవంతముగ నొనర్పుఁడు. అని ధర్మవాక్యముల ధర్మజుండు వలుక నర్జునుం డన్నకుఁ జేతులు మోడ్చి నీయాడినపలుకుల నెరవేర్తు. తొలుత గంధర్వులను సామవాక్యములచే నివారింతు. అందులకు వారియ్యకొన రేని పరాక్రమముఁ జూపి యాకసంబున నెగిరిపోవుచున్న వారిని నేలకు దిగిచి వారికి నెత్తుట నుర్వికిఁ దర్పణ మొనరింతు మనఁగా నందులకు భీమసేనుండును గవలును వల్లె యనిరి. శరణాగతులైన కురుసైన్యమువారు కొంత నెమ్మదిపడిరి.

అర్జునుఁడు మున్నగు పాండవులు చిత్రసేనాదిగంధర్వులతోఁ బోరాడుట

అంత యుధిష్ఠిరునియాజ్ఞఁ గొని భీమార్జునులును గవలును గనక కవచములఁ దొడిగి నానావిధాయుధములం బూని, వేగవంతంబులగు రథ్యంబులం బూన్చిన తేరుల నెక్కి కురుసైన్యమునందు సంతోష కోలాహలములు మీఱఁగా గంధర్వులపై నెత్తిరి. లోకపాలురవంటి పాండవులు తమ్ము వెనువెంటనంటి వచ్చుటం దెలిసి గంధర్వులు పలాయమానులు గాక నిలిచిరి. అంత నర్జునుండు వారిం జేరి ధర్మజుమాటలం దలంచి సాంత్వవచనంబుల వారి మరల్పఁ బూని వారితో నిట్లు

నియె. గంధర్వులారా! వినుండు. మాయన్న యుధిష్ఠిరుండు మీతో నిట్లాడు మనియె. మీరు చెఱఁగొని పోవుచున్న యీసుయోధనుండు మాసోదరుండు. వీనిఁ జెఱవిడిచిపుచ్చుఁడు. అనఁగా నా రర్జునుమాటలను వానిమొగంబున నగుచు నిట్లనిరి. అయ్యా! మాకు దేవరాజు నాజ్ఞ యిట్టిది. అతఁడు మా ప్రభువు. ఆమాటల మేము నిరాకరింపము. ఆతనిశాసనమున వర్తించువారము. అనఁగా నర్జునుండు వారికి మఱియు నిట్లనియె. స్త్రీలఁ జెఱఁగొనిపోవుట గంధర్వరాజునకుఁ దగదు. నా మాట వినుఁడు. యుధిష్ఠిరునాజ్ఞ నుల్లంఘింపకుఁడు. దుర్యోధనాదులను భార్యాసహితులఁగఁ జెఱవిడిపింపుఁడు. ఇంతదూర మెందుల కంటిరేని వినుఁడు. ధర్మజుండు మొదట యుద్ధమునకుఁ గడఁగకుఁ డనిమాకు విధించె. సాంత్వవచనంబుల మీరు ధర్మజుమాట లాలకింపరేని నా బెట్టిదంపుబాణములఁ బ్రయోగించి మిమ్ము వశంవదులఁ గావింతు నని చెప్పఁగా వారు సామమునకు లోఁగువారు కాకపోయిరి. అంత నూరకుండరా దని యర్జునుండు తెంపునేసి బాణప్రయోగముల కారంభించుడు, గంధర్వులును బ్రతిశరంబుల వానిఁ దాఁకిరి. అంత నుభయసైన్యములకుఁ బోరు ఘోరమయ్యె. అనేకసహస్రసంఖ్యాకు లగు నాగంధర్వులు పాండవుల నలువురి రథంబులఁ జుట్టుముట్టి తొల్లి కర్ణదుర్యోధనరథంబుల నెట్లు చుట్టికొనిరో యట్లు గావించిరి. కాని వీ రట్టివారు కారు. వారి నోర్చినట్లు వీరి నోర్చుట వారికిఁ గష్టమయ్యె. అంత గంధర్వులు దుర్యోధనాదులఁ గొని యాకసంబున కెగురఁ జూచిరి. అంత వారి నెగిరి పోనీయక యర్జునుం డంపపంజరం బొనర్చె. కావున వారు పంజరంబునఁ జిక్కిన పులుఁగులవంటివారైరి. అంత గంధర్వు లొక్కుమ్మడిఁ బాండవుల నలువురను గదాశక్తిముసలపరిఘాదిసాధనములఁ గొట్ట నారంభించిరి. వాని నన్నింటి నర్జునుండు తమపైఁబడనీయక నడుమన విఱువఁ దొడంగె. ఆసమయమున సవ్యసాచి బాణములతాఁకుడుచే గంధర్వులు కొందఱు తెగిన కాళ్లను, విఱిగిన చేతులును, నుసుకలైన మోఁకాళ్లను, దుత్తుమురులైన వెన్నెముకలును, వీడిన తలలును, బగిలిన ఫాలంబులును, చిదుమఁబడిన ఘ్రాణంబులును, లొత్తపోయిన నేత్రంబులును, చీలిన వీపులును గలిగినవారైరి. మఱియుఁ జిత్రసేనుం డంతటఁబోక యర్జునునిపై ననేకశాస్త్రంబుల

నేయుటయు సవ్యసాచి వాని నన్నింటిని మాఱస్త్రములచేఁ గొట్టె. అంత గంధర్వరాజు మాయ గావించి యాకసంబునఁ గానరాక పాండవులపై శరవర్షములఁ గురియింప నర్జునుండు శబ్దవేధిబాణంబులఁ బ్రయోగించి శత్రువు సన్నిహితుం జేయ వాఁడు గదఁ బూని యర్జునునిపై కుఱికిన నయ్యతిరథుండు వాఁడిబాణంబు లేసి యాగదను దునుకలుగాఁ గొట్టె. అంతఁ జిత్రరథుండు డొల్లవోయి యర్జునునితో నిట్లనియె. ఓ నాచెలికాఁడా! వినుము. నేను జిత్రరథుండ. నీయనుంగుఁజెలికాఁడను. నాపై నీవేయఁబూనియుండు నస్త్రము నుపసంహరింపుము. అనఁగా నర్జునుఁడు విన్నవోయి యాయస్త్రంబు నుపసంహరించె. అంత భీమనకులసహదేవులు యుద్ధముఁ జాలించిరి. అటఁ జిత్రసేనుండును సవ్యసాచియుఁ గుశలప్రశ్నముల నడపిరి. పిదప సవ్యసాచి చిత్రసేనుం జూచి 'గంధర్వపతీ! నీ వేల దుర్యోధనాదులఁ బట్టితి? నీవూనికికిఁ గతంబేమి?' అని యడుగఁ జిత్రసేనుం డిట్లనియె. 'అయ్యా! చెలికాఁడా, సాంతముగ వచించెద. వినుము. ఈసుయోధనుండు పోతరించి రాజ్యస్థుండై సకలభోగముల ననుభవించుచున్నను, వనవాసక్లేశములఁ గుడుచుచున్న మిమ్మును, బరమపతివ్రత యగు ద్రౌపదినిఁ బరిభవింప నుద్దేశించి ఘోషయాత్ర నెపమునఁ గర్ణశకునులదుర్మంత్రంబున నీద్వైతవనంబున కేతెంచుటను దేవేంద్రుం డెఱింగి వీనిచేయుతులువతనంబును సాగ నీయక వీని సభార్యాపుత్రమిత్రామాత్యంబుగ దివంబునకుఁ జెఱఁ గొని రా నన్నంపె. మఱియు వీనిం దెచ్చునపుడు నా కొకవేళ మీతోఁ బోరాటము కలిగె నేని మిమ్మును వదలిరమ్మని యింద్రుండు నా కానతిచ్చె. నీవు నాకు నెచ్చెలివి. మీఁదుమిక్కిలి శిష్యుండవు. నే నింద్రునానతి నిద్దురాత్ముఁ జెఱఁగొని పోవుచున్నవాఁడ. వీని నింద్రలోకమునకుఁ గొనిపోవుదు నని చెప్పఁగా వాని కర్జునుం డిట్లనియె. వీఁడు నిక్కువముగ దురాత్ముండె కాని, నావిన్నపం బొక్కటి కలదు. వినుము. వీఁడు మాకుఁ బితృవ్యపుత్త్రుం డగుట భ్రాత యగు. వీనిఁజెఱ విడిపించుటకు ధర్మజుండు నా కానతిచ్చె. నాకు నిష్టుఁడైతి వేని వీని విడిచిపుచ్చుము. మనమందఱ మాధర్మాత్ముకడ కేఁగి యతండు సెప్పినట్లు చేయుద మనినఁ జిత్రసేనుం డంపుల కొడంబడి యర్జునునితో నిట్లనియె. ఈదురాత్ముండు విడిచిపుచ్చ నర్హుండు కాఁడు. వీని దురుద్యోగ

ముసు నిష్కపటిమైన ధర్మజుం డెఱుంగఁడు. ఎఱింగెనేని వీనిఁ గరు
ణింపఁడు. అయినను మన మప్పటి మామహనీయునికడ కేఁగి యంతయు
నెఱింగింత మని యొప్పుకొనెను.

చిత్రసేనుఁడు ధర్మపుత్రునొద్దకు వచ్చి దుర్యోధనాదుల విడిపించుట

అంతఁ జిత్రసేనుం డస్మన్మాదులతోడ ధర్మరాజునొద్ద కేతెంచి నడ
చినవృత్తాంతంబునంతయు నయ్యజాతశత్రునకు దెలియింప నాతండు
చిత్రసేనవచనము నంతయు విని గంధర్వపతితో నిట్లనియె. గంధర్వ
పతీ! మాభాగ్యవశంబున నీవిని మీరు చంపరైతిరి. మాకులమునకు
దోసఁ గాపాదిల్ల దయ్యె. మాకు మీరు పరమోపకారులరు. మిమ్ముఁ
జూడ నాకెంతయు సంతసమయ్యె. మీయిష్టార్థంబుల నెఱవేర్తు. వీని
బంధవిమోక్షణంబుఁ జేయుఁడు. ఇయ్యది మాకోర్కి. నావేఁడికోలు
నంగీకరింపుఁడు. అని సవినయముగ సంభాషింపఁగా నాగంధర్వపతి
యయ్యజాతశత్రుం గొనియాడి, దుర్యోధనుని సపరివారంబుగా బంధ
విముక్తుఁ గావించి, తా నప్సరోగణసేవితుం డై ధర్మరాజాను
మతిం బడసి నాకంబున కరిగె. అంత నీవృత్తాంతం బంతయు సవిస్తరం
బుగా నాకాధిపతికిఁ జిత్రసేనుండు విన్నవించి ధర్మజుపరమకారుణి
కత్వము గొనియాడె. అంత దేవరాజాయుద్ధమున మ్రందినగంధర్వులపై
నమృతవృష్టిఁ గురియఁగా వారెల్లరు నిద్రలేచినవారువోలె లేచి
గంధర్వులతోఁ గలసికొనిరి. అట ద్వైతవనమునందుఁ బాండవులు
ధార్తరాష్ట్రులఁ జెఱవిడిపించి, కౌరవమంత్రులు దమ్ముఁ నుతింప వాని నాల
కింపుచు, యజ్ఞశాలామధ్యమున నగ్నులంబోలెఁ దేజోమూర్తులై ప్రకా
శించుచుండిరి. అపుడు ధర్మాత్ముండు దుర్యోధనునిఁ జేరం బిలిచి ప్రణయ
పూర్వకంబుగా నిట్లనియె. అన్నా! ఎన్నఁడు నిఁకమీఁద నిట్టిసాహస
కార్యములఁ జేయకుము. ఓభరతవంశజుఁడా! సాహసకార్యకర్త
లెన్నఁడును సుఖులు గారు. ఇటులయ్యెనే యని మనంబున వెతనొంద
కుము. భ్రాతలను నంతఃపురస్త్రీలను సకలపరివారమును దోడ్కొని
పురమునకుఁ బొమ్మని యూఱడించె. అంత దుర్యోధనుండు చావుఁ
దప్పి కన్నులొట్టవోయినచందంబున వగతో ధర్మరాజు మున్నగు
పాండవులచే ననుజ్ఞాతుం డై యుధిష్ఠిరునకు మ్రొక్కి వ్రీడావిదీర్య
మాణహృదయుం డై మగిడి చనియె. అంత ద్వైతవనవాసు లగు

విప్రు లందఱును ధర్మరాజు ధార్మికత్వముఁ గొనియాడిరి. అర్జునుని విక్రమముం బొగడిరి. అట్లు శూరులైనతమ్ములు దన్నుఁ గొలుచుచుండ దేవతలమధ్య నుండు దేవేంద్రుంబోలె ధర్మజుండు ద్వైతవనమునఁ బ్రతిజ్ఞాతసంవత్సరములు గడచుదాఁక విహరించుచుండె.

అట నీవృత్తాంతంబు నంతయు విని జనమేజయుండు వైశంపాయనున కిట్లనియె. మునిప్రవరా! గంధర్వులచే బద్ధుఁడై మహనీయులును శూరులు నగు పాండవుల కరుణ పెంపున బంధచ్యుతిఁ బొందిన దుర్యోధనుండు పదంపడి లజ్జావిహీనుఁడై యెట్లు తనపురము సొచ్చె? ఆతండు సదా పౌరుషమునఁ బాండవులకన్నఁ దాను మిన్న యనియు, నౌదార్యమునఁ దన కీడు వారు గా రనియు నాత్మస్తుతిపరాయణుఁడై వర్తిలుచు వారి నెల్లప్పుడు నవమానించుచుండు. ఆలజ్జ లేనిరాజు పిమ్మటివృత్తాంతంబుల సవిస్తరముగ వివరింపు మని యడుగఁగా వైశంపాయనుం డిట్లని చెప్పందొడంగె.

దుర్యోధనుఁడు కర్ణునితోఁ దనభంగపాటుఁ జెప్పుకొనుట

దుర్యోధనుం డాప్రకారము ధర్మజుచే ననుజ్ఞాతుం డై యవమానమును సహింప లేక తలవాంచి మఱలి రథగజతురగపదాతివర్గసహితసైన్యంబు గొలుచుచుండ హస్తినపురమార్గముం బట్టి యేఁగుచుండఁగా నొక్కరమణీయస్థలంబున జలాశయంబు గల ప్రదేశంబున మార్గంబున విడిసి, తగుచోట్ల సేనల విడియ నియమించి యేకాంతమున దుఃఖాకలితమనస్కుండై యారాత్రి నిదురపోక తనయవమానమును దలంచితలంచి పొగులుచు నేమియుం దోఁపక వేదురుగొన్నవానివలె నుండె. ఆసమయమునఁ గర్ణుండు దుర్యోధనుం గలసికొని యిట్లనియె. రాజరాజా! నీపరాక్రమము నే నేమందును? గంధర్వులఁ బాఱఁద్రోలి నిజపరిజనములను రక్షించుకొని పురమునకు మఱలి వచ్చుచున్నవాఁడవే. నాకుఁ బూర్వపుణ్యముచే నిపుడు నీతోడికూడిక గలిగె. ఆగంధర్వులప్రతాప మెట్టిదో చూచితే? నీవు చూచుచుండఁగనే వారిచే నేను విరథుండనై వారిబాణంబులబారి కోర్వలేక వికర్ణు రథ మెక్కి వారు వెన్నంటి తఱుమఁగా బ్రాణావశిష్టుండనై యెచ్చటనో తలఁదాఁచుకొని యుంటి. యుద్ధరంగమునందు మీర లాగంధర్వులబారిం బడక వారి నెట్లోడింపఁగలిగితిరి? ఇది యెంతయు నద్భు

తంబు. నీవంటిపరాక్రమశాలి దక్క వేఱొక్కండా ప్రతాపశాలు రగు గంధర్వుల నోడింపఁగలుగుదురే! అని ప్రశంసావాక్యముల నుతింపఁగా సుయోధనుండు దగ్గుత్తికపడి, కంట నీరు గాఱఁ గర్ణునితో నిట్లనియె. సూతనందనా! నీవేమియు నెఱుంగవుగాఁబోలు. నేన గంధర్వుల నోడించితి నని తలంచితి. నీవెఱుంగక నన్నీప్రశంసావాక్యములఁ దేల్చుచున్నావు. ఈనీమాటలకు నా కసూయ లేదు. నిక్కమైనవృత్తాంతంబు నంతయు నాలకింపుము. నీ వాగంధర్వులబారిం దప్పించుకొని పాఱిపోఁగా నేను వారితోఁ గొంతతడవు పరాక్రమముం జూపి యుద్ధము చేసి వారిశరపరంపరల కోర్వలేనున్నను ధైర్యము దెచ్చుకొని పెనఁగుచున్నప్పుడు పోరు ఘోరాకృతిం దాల్చె. ఉభయసైన్యములయందును పెక్కండ్రు మడిసిరి. అంతట గంధర్వులు మాయాయుద్ధమును జేయఁ దొడంగిరి. అంత మేము వారిదెబ్బల కోర్వ లేక భృత్యామాత్యస్త్రీజన సమేతంబుగా వారిచేఁ బట్టుపడితిమి. మమ్ము నందఱను వారు బంధించి యాకాశమార్గమునందుఁ గొనిపోవుచుండిరి. మాకుఁగాని, వారిబారి నుండి తప్పుకొన్న మనసైనికులలో నెవరికిఁగాని వేఱుశరణము కానఁబడదయ్యె. అంతఁ జేయునది తోఁపక మనయమాత్యులలోఁ గొందఱు మనస్థితిగతుల ధర్మపుత్త్రునకు మనవిచేసిరి. అంత నాపరమకృపాళుండు తమ్ములఁ బ్రోత్సహించి వారి కుచితవాక్యములఁ జెప్పి యెవ్విధముననైనను మమ్మును గంధర్వులయొద్దనుండి విడిపింపఁబంపె. అంత నప్పాండవులు పైమరువులు దొడిగి నానావిధాయుధపాణులై మమ్మెత్తికొని పాఱుచున్న గంధర్వుల నిలువరించి తొలుత సామవచనంబుల మమ్ము వదలుఁడని యెంతేనిఁ జెప్పియు గంధర్వులు వారిమాటల సరకుఁగొనక పోవుచుండఁగా సవ్యసాచి యిఁక వారు దండసాధ్యుల కా నూహించి పెనఁకువకుఁ దొడంగి శరజాలంబుల భూనభోంతరాళంబుల నొక్కపంజరంబుగా నేర్పఱచి యాగంధర్వు లెటువైపునను బాఱుటకు వీలు లేకుండఁజేసె. అంత గంధర్వులు ఘోరముగా వారిపైఁ బడి యుద్ధము నకుఁ దొడంగిరి. మమ్ము వారెత్తుకొని యుప్పరంబున కెగిరిపోవుటకు వీలు లేక శరజాలంబు నిరోధముగా నేర్పడెను. అప్పుడు గాండీవి వారిపైఁ బుంఖానుపుంఖములుగా బాణము లేసి వారిని దివ్యాస్త్రములఁ బ్రయో

గించి దుర్బలులఁగావించె రాధేయా! వానియసదృశమైన ధనుర్విద్యా
ప్రభావమును నేనేమని చెప్పుదు? ఎటుచూచినను వానితూపులు పరువని
స్థలముండదు. అట్లు యుద్ధము కొంతసేపటికిఁ గొనసాగఁగా గంధర్వ
నాయకుండగుచిత్రసేనుఁడు తనకు నాకంబున నర్జునునితోఁ గలిగిన చెలి
మిని దెలుపుచు నర్జునునిసమక్షమునఁ దా నిలిచి నవ్వుచు వానిని గౌఁగి
లించుకొనుటయు నంతట వా రెల్లరు కుశలప్రశ్నంబులఁ గొంత నడిపి
సమాధానపడిరి. పిమ్మట ధనంజయుండు చిత్రసేనుం బ్రశంసించి మావా
రగు నీధార్తరాష్ట్రుల నేల బంధించికొనిపోవుచున్నవాఁడవు? ఇట్లొ
నర్చుటకుఁ గారణం బెద్ది? మేము జీవించియుండఁగా మావారగు వీరిని
మీ రెట్లు కొనిపోఁ గలరు? అని సకలవృత్తాంతంబును సాంత్వవచ
నంబులఁ దేటతెల్లమగునట్లు చెప్పు మనఁగా జిత్రసేనుం డర్జునునితోఁ
నిట్లనియె. కౌంతేయా! ఈపాపాత్ముండు దుర్మంత్రమున మీఁకు జెట్టఁ
దలంచి ఘోషయాత్రనెపంబున మీకు హాని చేసిమీరిడుమలు గుడుచు
చుండ మిమ్మును బరిహసింప భృత్యామాత్యవనితాజనంబులతో నీద్వైత
వనంబున విడియుట దేవేంద్రుం డెఱింగి వీని సకలసైన్యంబుతోఁ బంధించి
తోడితెమ్మని దేవేంద్రుం డాజ్ఞ సేయఁగా నిట్లొనర్చితి నని మనదురుద్యో
గము నంతయుఁ దెలియం బలికి మమ్ము నందఱును బంధనములతో ధర్మజు
పాలికిం గొనిపోయిరి. రాధేయా! నే నేమందును? అట్టిదీనస్థితితో
వారిముందట నిలుచుటకు నా కెంతమాత్రము మనసు గొల్పదయ్యె.
ఏమి చేయుదు? బద్ధుఁడనై శత్రువులమ్రోల నిలఁబడవలసివచ్చె. వారు
నన్ను విడిపింపవలసినవారైరి. ఇంతటిపరిభవమును సహించుచు ధర్మజు
మ్రోల నే నప్పు డుంటిని. మనరహస్యము లన్నియుఁ బాండవులకుఁ దెలి
యుట, స్త్రీలతోడఁ జెఱఁబట్టఁబడి వారిసమ్ముఖమునఁ బౌరుషశూన్యుం
డనై పగతురచేఁజిక్కుట, పుట్టిననాటంగోలె నాచేనిరాకృతుండైనధర్మజు
నొద్దకు నన్నుఁగట్లతోఁగొనిపోవుట, యాతనిదయకుఁ బాత్రుఁడనైన
నాకు నతనియాజ్ఞచే బంధవిమోచనము గల్గుట మమ్మాతండు బ్రదికిం
చుట, యివియన్నియు నామనస్సును దహించుచున్నవి. ఏమి చేయవచ్చు?
స్వయంకృతాపరాధమునఁగల్గినయవమానమును సైరించుటకన్న గంధర్వు
లతో యుద్ధమునందు వారిచే హతుఁడనై యుంట మేలు కాదే?

ఈపరిభవము దుస్సహము. నేను వారిచే యుద్ధమున వధింపఁబడియుండు
నేని లోకమున సుయోధనుండు గంధర్వులతోఁ బోరాడి రణరంగ
మున మడిసె ననుకీర్తి నలుదెసల వ్యాపించు. పరలోకమునందు రణ
నిహతులకుఁ గల్గునుత్తమస్థానం బబ్బు. ఇప్పుడు రెంటికిని జెడినరేవఁడ
నైతి. కాఁగలది కాక మానదు కాని, ప్రస్తుతము నాతలఁ బోయుచుండు
భావమును వినుము. ఇంతటిపరిభవము కలిగినపిదప హాస్తినపట్టణ
ప్రవేశము నా కిష్టపడదు. మీ రందఱును దుశ్శాసను ముందిడికొని
ససైన్యులై పురమునకుఁ బొండు. నే నీస్థలమునఁ బ్రాయోపవేశము
గావించి యసువులఁ దొఱంగెద. ఇన్నినాళ్లు నాశత్రువులను దలయె
త్తనీయక చేయుచుంటి. మిత్రులకుఁ బరమానందమును గొల్పుచుంటి.
నావంటిపరాక్రమశాలి భూలోకమున లేఁ డనుఖ్యాతి గంటి. అట్టి
వాఁడ నగు నే నీనాఁ డింతపరిభవాస్పదుఁడనై పేరోలగమునఁ బురము
నెట్లు ప్రవేశింతు? రాజైన నాతండ్రితో నే నేవృత్తాంతంబు చెప్పుదు?
కురువృద్ధు లగుభీష్మబాహ్లికసోమదత్తాదులతో నే నేసంతోషవార్త విన్న
వింతు? ఆచార్యు లగుద్రోణకృపులతోను, నాచార్యపుత్త్రుఁ డగునశ్వత్థా
మతోను నే నేమాటలఁ బలుకుదు? విదురసంజయాదిసూతపుత్త్రు లిఁక నన్నా
దరింతురే? పురమునందలి విప్రులకు శ్రేణిముఖ్యులకు నాతల నెట్లుచూ
పుదు? శత్రువు నదా పరిభవించుచు వారికి మేలుబంతినై యున్న నేనీకా
లమునస్వయంకృతాపరాధమునఁ బరిభవింపఁబడితి. దీనిని నేను సహింప
లేను. ఆత్మదోషమున భ్రష్టుఁడ నైతి. అదృష్టవశమున సకలైశ్వర్యముల
బడసినను దుర్వినీతుఁడనై వర్తించి యార్జించిన మానధనము నీనాఁ
టికిఁ గోల్పోయితి. నా కింతదురభిమానము తగునే? బుద్ధిముసించి పేరాస
తోఁ దుర్మార్గవర్తనుండనై యయ్యయో! చెడితిఁ జెడితి. ఇఁక నాకు బ్రదు
కునం దాస కలుగునే? ఈదేహమునం దిఁక నసువులతో నుండ రాదు.
శరీరపరిత్యాగము దప్ప వేఱొం డుపాయము లేదు. గంధర్వులబారి
నుండి నన్ను విడుదలఁ గావించునపుడు కుంతిపుత్త్రు లెంతయో యవమానమున
నన్ను వీక్షించిరి. అప్పటిచూడ్కి యక్కటా! పగతురకును వలవదు.
మానియగుపురుషుండు శత్రువులకుఁ బరిహాసాస్పదుండై మనియుండుట
లగ్గో! ఇసీ! ఈబ్రదు కేల? అని తనబ్రదుకునకు రోయుచుఁ దమ్ముండగు

దుశ్శాసనుని బిలిచి యిట్లనియె. తమ్ముఁడా! నామాట వినుము. నీవు సేనతోఁ దఱలిపోయి హస్తిపురప్రవేశంబు గావించి, రాజ్యమునఁ బట్టాభిషిక్తుండవై, యాకర్ణశకును లమాత్యులుగా రాజ్యమేలుము. ఇంద్రుఁడు నాకరాజ్య మనుభవించున ట్లిఁక మహీరాజ్యమును సర్వసంపదలతో నీవ యనుభవింపుము. భ్రాతలను బంధుసమూహములను బోషింపుము. విప్రులయెడ నప్రమత్తుండవై వర్తిల్లుము. బంధువులకు మిత్రులకు నీవే ప్రాపవు. వైకుంఠుండు దేవతలను రక్షించినట్లు సర్వదా జ్ఞాతులఁ బూజింపుము. భక్తియుతుండవై గురువుల భజింపుము. మిత్రులకు మోదమును శత్రువులకు ఖేదమును గూర్చుచుండుము. హస్తిపురమున కేఁగుము అని యతనిఁ గౌఁగిలించుకొని సెలవీయఁగా దుశ్శాసనుండు చింతతోఁ గన్నీరుమున్నీరై కాఱనేడ్చుచు, డగ్గుత్తికపడి యన్నకుఁ జేతులు మోడ్చి యిట్లనియె. రాజరాజా! ఇటు లనవలదు. నాకుఁ బ్రసన్నుఁడ వగుము. ప్రస్తుతము నీయాజ్ఞను నెఱవేర్చుటకు నాకొప్పదు. భూమ్యాకాశములు బీటలు వాఱినను, భానుండు తేజస్సును గోల్పోయినను, జంద్రుండు వెచ్చనైనను, హుతాశనుండు చల్లపడినను, వాయువునకు వేగగతి దఱిగినను, హిమవంతుఁడు పాదు కదలి పాఱినను, సాగరజలంబు లింకినను, నీవు లేనియీపుడమిరాజ్యము నా కేల ? దయఁ జూడుము. అనుగ్రహింపు మని రోదనము చేయుచు నన్నపాదములపైఁ బడి లేవకున్నంత సుయోధనుండును దుఃఖితుం డయ్యె. వా రిరువురు నట్లు దుఃఖితులై యుండఁ గర్ణుండు గాంధారీపుత్త్రుం డగు దుర్యోధనున కిట్లనియె. మీ రిరువురును బామరులువోలె నిట్లు శోకించెద రేల? శోకింప శోకింప శోకము దఱుగదు. అది మఱింత వృద్ధియగును. ధీరులు శోకింపరు. విపత్తునందు ధైర్యముఁ బూనుట లగ్గు. మీయిప్పటిఖేదము శత్రువులకు మోదావహము. గంధర్వులు మనలను బంధింప గర్భశత్రువులగుపాండవులు మనలను విడిపించిరే యనుదానిని గొప్పగా భావింపరాదు. వగ కది కారణము గాదు. వారు రాజరాజగు నీ కాపదపొడమఁగా నిన్ను నీభృత్యులువోలె విడిపించి వారిధర్మమును నెఱవేర్చిరి. కాని వేఱొండు కాదు. అది భృత్యకృత్యము. దేశము నేలుప్రభువునను నా దేశవాసు లగుజనులును నారాజపోషితు లగుసైనికులును

కాలానుగుణముగఁ బ్రియ మొనర్చుచుండవలయును. పాండవులు నీ వేలు రాజ్యమున సుఖ మున్నవారు. నీ కాపద పొడముఁగా నీదేశవా సులైనవారు తమకర్తవ్యము నొనర్చిరి. ఇంతియ కాని యన్యంబులేదు. వా రుపకరించిరి. వారు కరుణించి బద్ధుఁడైన నిన్ను వదలించి రనుకొనుట మిక్కిలి హేయము. ఇది తగునే ? ఇది పరిభవమే ? వారు భృత్యులై రాజపోషితులైనవారువోలె స్వకర్తవ్యమును నిర్వహించిరి. అవమా నము వచ్చె నని సహింపక ప్రాయోపవేశమును జేసెద ననుచున్నావు. ఇదియుఁదగనికార్యము. ఈ ప్రయత్నమును నీసామంతరాజులు విందురేని నీవు పిఱికిపంద వని నిన్ను ననాదరణతోఁ జూతురు గాని,నిన్నుఁ గొలువ వత్తురే? పాండవు లనుభవించుచుండిన సర్వరత్నరాసులను, సకలైశ్వర్య యుతమైన మహీరాజ్యమును నీవు నాచికొనినప్పుడు వారు ప్రాయోప వేశమును జేసిరే? వారే నీ కాదర్శప్రాయులు కారే? ఇట్టివెట్టియాలో చనలను మాని ధైర్యమూని కర్తవ్యమును యోజింపుము. లెమ్ము. జాగుసేయకుము. దిగులొందియున్న తమ్ములకు ధైర్యముఁ జెప్పుము. ఈనామాట లాలింపక నీపట్టినపట్టును వదలవైతివేని నేనును బురంబు నకుఁ బోనొల్ల. నీపాదసేవఁ జేయుచు నీవెంట నింద వసించియుండెద. నీ వసువులఁ గోల్పోయినవెంటనే నేనును నసువులఁ దొఱంగుదు. నీవులేని యీలోకమున నేనుండ నోపనని యెంత యూరడించినను సుయోధనుం డూరడిల్లఁడయ్యె.

అంత సౌబలుండు సుయోధనుం జేరి యిట్లనియె. రాజరాజా! కర్ణుఁ డాడిన దంతయు మిక్కిలి యొప్పును. నేను నానేర్పున సాధించి నీ కొసంగిన ధర్మజునైశ్వర్యము నంతయు విడనాడి ప్రాణపరిత్యాగం బేల చేయనున్నావు ? ఇంత బుద్ధిమాంద్యంబు నీకుఁ దగునే? బుద్ధిమంతులను పెద్దలను విశేషించి సేవింపనికతంబున నిట్టిపెడమార్గంబులు దోఁచు చుండు. కాలపరివర్తనమునఁ బురుషునకు ఖేదమోదంబులు సంప్రాప్తించు చుండు. వాని నోర్వనిమనుజుం డావమునఁ గాల్పఁబడని పచ్చికుండ వోలె వేవేగ నశించు. నతిభీరువును, అతిమృదుస్వభావుని, సామర్థ్య హీనుని, జిరకారిని, ననవహితుని, గడునాసక్తింజేసి విషయలోలుండ యినవానిని సేవకులు సేరరారు. పాండవులు నీకు సత్కార మొనరిం

చిరి. నీవు శోకంబు పూని, వారియుపకృతి మఱపకుము. మోదమునొంది, పాండవులను సత్కరింపవలసిన యీతరుణంబున నీవేల శోకంబు పూనెదవు. ఇది శోకము పూనుటకు సమయము కాదు ఈవర్తన మంతయు విపరీతముగ నున్నది. ప్రసన్నుఁడవు కమ్ము. ధృతిఁ బూనుము. పాండవుల సత్కారము నాత్మయందుఁ దలపోయుము. వారి రాజ్యము వారికొసంగుము. కీర్తిధర్మములను సంపాదింపుము. ఈపని యొనర్చిన, వారియెడఁ గృతఘ్నుఁడవు కావు. పాండవులతోఁ జెలిమి చేయుము. వారి రాజ్యమునవారిని సుప్రతిష్ఠితులఁ జేయుము. అట్లయిన నీవు సుఖమునొందుదువు. అని నీతిని బోధించె.

అంత దుర్యోధనుఁడు తనపాదములపైఁబడి లేవకుండిన దుశ్శాసనుని రెండుచేతులతో లేవనెత్తి, కౌఁగిలించి, మూర్ధము నాఘ్రాణించి, కొంతసేపూరకుండి, వ్యసనం బతిశయింప జీవితమునందు రోసి లజ్జచేఁ జెదరిన మనస్సుతో నిట్లనియె. నాకు ధర్మమునందుఁగాని, ధనమునందుఁగాని, సుఖమునందుఁగాని, యైశ్వర్యమునందుఁగాని,యాజ్ఞాభోగాదులయందుఁగాని వాంఛలేదు. మీ రెవ్వరును నాయత్నమునకు మాటాడకుఁడు. నానిశ్చయం బియ్యది. మీ రెల్లరును హస్తినాపురమున కేఁగుఁడు. గురువులకు నామారుగాఁ బూజలఁ జెప్పుఁడు. అనిచెప్పఁగా వారిట్లనిరి. మహారాజా! నీగతియె మాకును గాఁగలదు. నిన్ను వదలి మేము నగరమునకుఁ బోనొల్ల మనిరి. ఆతీరున సోదరులు,నమాత్యులు, భృత్యులు, మిత్రులు, చుట్టలు మున్నగువా రెన్ని చెప్పినను దనపట్టినపట్టును వదలక సుయోధనుండు దర్భలఁ బఱచి కుశములు వల్కములు ధరించి పరమనిష్ఠతో నాసీనుండై మౌనముంబూని యింద్రియములను విషయంబులందుఁ జొఱనీయక యేకాగ్రమనస్సుతో నియమవ్రతపరాయణుండై యుండె.

## ప్రాయోపవిష్టుడైన దుర్యోధనునిఁ గృత్యపాతాళమునకుఁ గొనిపోవుట

అంతఁ బూర్వము దేవతలచే నోటువడి పాతాళమున వసించుచున్నదానవులు దుర్యోధనుని యీమనోనిశ్చయము నెఱింగి యాతండిట్లు ప్రాయోపవేశంబునఁ బ్రాణపరిత్యాగంబునకుఁ బూనియుండుట నాలోచించి యాదుర్యోధనునిఁ దమయొద్దకుఁ గొనితేఱను, విపక్షవానియాలోచనము కొనసాగనీయక వానికి బుద్ధులు గఱపుట

కను యత్నించిరి. తన్నిమిత్తమై వారగ్నిని బ్రజ్వలింపఁజేసి యందు వైతానసంభవకర్మను జేయఁబూని బృహస్పత్యుశనస్సులచేఁ బ్రోక్తములగు మంత్రముల నథర్వవేదప్రోక్తములయినవాని నభిమంత్రించి నియతవ్రతులైన యధ్వర్యులసాహాయ్యమునఁ బాలతో హోమము గావించి, యేకాగ్రచిత్తములతో మంత్రరాజములను జపించిరి. అంత నాకర్మఫలముగా నాయగ్నికుండంబునుండి కృత్య యను శక్తి యొక్కతె యావులించుచు వెలువడి యాదానవులయెదుట నిలువఁబడి నే నేమిచేయుదాన నని వారి నడుగఁగా వారు భూతలంబునఁ బ్రాయోపవిష్టుండై యున్న దుర్యోధనుని మాయొద్ద కీపాతాళంబునకుఁ గొనిరమ్ము. అని చెప్పఁగా నాకృత్య యట్ల చేయుటయు, నాపాతాళలోకమునందలి దానవులు వానితో నారాత్రి యంతయు ముచ్చటలు సలిపి వాని కిట్లనిరి. సుయోధనా! వినుము. నీవు శూరులగుసామంతరాజులచే సేవితుఁడవు. భరతకులశిఖామణివి. అట్టి నీవు క్షత్రధర్మమును వీడి తాపసవృత్తియగు ప్రాయోపవేశము నేల చేసెదవు? ఇది తగవు కానేరదు. దీనిచే నాత్మహత్య తప్ప వేఱొకఫలమును బొంద లేవు. ఆత్మహత్య చేసికొనువాఁడు నిందితుఁడై యధోగతిం జెందు. కావున నీవుభయలోకములకుం జెడుదువు. ఘోరకర్మములచేఁ గార్యములు విపరీతములగును. పాపములు సంభవించును. మొదలునకు హాని యగు. నీవంటిమేధావుల కీకార్యము లొప్పునే? ఈయాలోచనంజేసి ధర్మము నశించును; అర్థము హానిఁ జెందును; సుఖ మడుగంటును; కీర్తి పలాయితమగును; ప్రతాపము చల్లనడును. దీన నీశత్రువు లానందింతురు. కావున నిప్పటియత్న మవశ్యంబు త్యాజ్యంబు. యథార్థముగ నీకలరూపు నీ వెఱుంగవు. మేము చెప్పెదము. ఆలకింపుము. పూర్వము మేము శంభు నారాధించి యాతనివరప్రభావంబున వజ్రసమానమును, శస్త్రాస్త్రాభేద్యమును నగు పూర్వకాయమును, లోకమాతం గూర్చి ఘోరతపం బొనర్చి యాదేవీప్రసాదంబునఁ బుష్పమయమును రూపవతులగు స్త్రీలకు మనోహరంబునగు నధఃకాయమును గల నీ దేహమును మేము సృజించితిమి. ఆకారణంబున నీదుమూర్తి దివ్యము. నీవు సాధారణమనుజుండవు కావు. మఱియు నీకు నియుక్తకార్యమునఁ దోడుగ మహామాయంశములందు భగదత్తుఁడు మున్నగు మహీ

పతు లుత్తమక్షత్రియులై జన్మించియున్నారు. వారియస్త్రవేదిత్వము, బాహుబలంబు నీ వెఱుంగనివి కావు. వారు కానున్న ఘోర రణమున నీకుఁ దోడ్పడి నీశత్రువుల వధింతురు. నీకు భయశోకములకుఁ దరుణము కాదు. ఇంతియ కాక భీష్మద్రోణకృపాదులగు మధ్యస్థజనులను దానవుల మగు మే మావేశించుటం జేసి విధిప్రేరితులై, మోహపరవశతనొంది ప్రల్లదంబు లాడుచుఁ గృపావిహీనులై, తండ్రులు బిడ్డలు తోఁబుట్టువులు జ్ఞాతులు బంధువులు గురువులు శిష్యులు బాలురు వృద్ధు లని తలపోయక తెంపున నీశత్రువులతోఁ బోరాడుదురు. పాండవు లేవురును దేవతలయంశమునఁ బుట్టినరాజులు. తమకుఁ దోడ్పడఁగా నీపక్షపురాజులతో నవశ్యము పెనఁగుదురు. ఇంతియ కాక దితిసుతులైన దానవు లనేకు లుత్తమక్షత్రజాతులైనవారు వివిధాయుధపాణులై నానాశస్త్రాస్త్రప్రయోగోపసంహారముల నేర్చినవారు తోడర గల యీఘోరయుద్ధమున నీకు సాయపడెదరు. శూరాగ్రణియగు నర్జునుని నెట్లు పోర నిర్జించుటని నీకుఁ బెనుభీతి యుప్పతిల్లియున్నది. వానిఁ జంపుట కుపాయము మే మూహించియున్నాము. ఆఁకింపుము. శ్రీకృష్ణునిచేఁ జంపఁబడిన నరకాసురునియంశము కర్ణుని నావహించియున్నయది. ఆ కారణంబునఁ గర్ణార్జునులకుఁ బోరు ఘోరమై వర్తిల్లునపుడు కర్ణుం డవశ్యము వాసుదేవార్జునుల నిర్జించు. అంత సవ్యసాచి యోడఁగలఁడు. నీకుఁ గర్ణుం డవశ్యము గెలుపు నీయఁగలఁడు. ఈరహస్యము నెఱింగి దేవేంద్రుండు సవ్యసాచిరక్షణార్థముగఁ గర్ణుని కవచకుండలములను విప్రవేషముఁ దాల్చి యపహరింపఁగలఁడు. కవచకుండలపరిత్యాగముచేఁ గర్ణు పరాక్రమము కొంత తఱుగఁగలదు. అయినను, వానికిఁ బ్రతిగా, మాయంశములం దర్జునునితోఁ బోరి యతనిని వధింపఁజాలిన మహాసత్త్వులగు ననేకసహస్రసంఖ్యాకులయిన దానవులు సంశప్తకు లనువారు జనించి యున్నారు. వారిచేఁ దప్పక యర్జునుండు వధింపఁబడును. వెఱవకుము. ఇది దైవయోగము. అర్జునవధానంతరము నీవు నిష్కంటక మగు రాజ్యమును సుఖివై యేలఁగలవు. దుఃఖమునకుఁ జోటియ్యకుము. దుఃఖము చేటు దెచ్చు. దేవతలకుఁ బాండవులు గతిగా నున్నారు. నీవు దానవు లగుమాకు గతివి. నీ వీప్రాయోపవేశమున శరీరత్యాగ

క్షయం జేయుదు వేని భూలోకమున మాకు బలము క్షీణించు. కావున వేఱుగ నాలోచింపక మాబుద్ధిం గైకొను మని వాని గాఢముగ దానవు లెల్లం గౌఁగిలించి యూరడిల్లునట్లొనర్చి ప్రియములు పలికి యిఁక భూలోకమునకుఁ బొమ్మనిరి. అంత వానింబాతాళమునకుఁ గొనివచ్చిన కృత్య మఱల వానిఁ బదిలముగ వాఁడు పరుండి యున్న దర్భశయనము పైకి సుఖ మొసఁగఁ జేర్చి, వానిగుణగుణములఁ గొనియాడి యాతని వీడ్కొని యదృశ్యయయ్యె. కృత్య యదృశ్యకాఁగానే దుర్యోధనుం డాపాటంతయు స్వప్నముగా భావించి కర్ణుఁడును సంశప్తకులును నర్జునుని వధింతు రని నిశ్చయించుకొనె. సంశప్తకు లనువారు రజస్తమో గుణప్రధాను లగుదానవులు. వీ రెల్లప్పు డర్జునుని వధోపాయ చింతనము నందే యుండిరి. భీష్మద్రోణకృపాదు లగుమధ్యస్థులును రాక్షసావేశ పరులై పాండవులయెడ నంతగాఁ బ్రీతిఁ జూపరైరి. దుర్యోధనుండు తనకు దానవసమాగమము గలిగినవృత్తాంతంబు నెరికిం దెలిపినవాఁడు కాఁడు. దర్భలపైఁ బ్రాయోపవేశ ముండిన దుర్యోధనునిఁ గర్ణుఁడు సమీపించి చేతులు మోడ్చి నగుమొగంబుతో 'ఓకురువంశమణీ, ఇంక నైన నేల యీయాలోచనమును జాలింపవు. బ్రదికియుందువేని శత్రువులను సంహరింతువు. చచ్చిన నేమి సేయఁగలవు? బ్రదికియుందువేని భద్రములను బడయఁగలవు. చచ్చినవాని నెట్లు శుభములు చెందును? ఏల యిట్లున్నావు? ఇయ్యది భయశోకమరణములకు దేనికిని దరుణము గా దని మందలించియు రాజరాజు తననిశ్చయము విడువకుండుట యెఱింగి యంతట రాధేయుం డాగాంధారేయుం గౌఁగిలించి వెండియు నిట్లనియె. రాజేంద్రా! లే లెమ్ము. నీకీమొఱకుఁబట్టెచ్చటినుండి దాపరించె నని శౌర్యమున శత్రువులగం డడంచినవాఁరుఁడ వగునీ వీసమయమునఁ జావు నేల గోరుచున్నావు? నీ కర్జునునివలని భీతి యతిశయించి యుండు నేని, యిదే చూడుము, వాని నేఁబోరునందు వధించెద నని ప్రతిజ్ఞ సలుపుచున్నాను. పాండవులు వనవాసమును, నజ్ఞాతవాసమును బూర్తి చేసి నీమీఁదికి రణోన్ముఖు లగుదురేని నేనాయుధముఁ బూని వారి నోడించి నీకు వారిని వశవర్తులం జేయుదు. ఇది నిక్కువంబు నామాట నమ్ముము.

### దుర్యోధనుండు ప్రాయోపవేశము మాని హస్తినాపురమును బ్రవేశించుట

అని కర్ణుండు రాజరాజును బ్రార్థింప దుర్యోధనుండు కొంతసేప
టికిఁ దనవారివేడికోలును, బాతాళవాసు లగుదానవులమాటలను
బర్యాలోచించి ప్రాయోపవేశము మాని లేచి మంచితే రెక్కి విప్రా
శీర్వచనములం గైకొనుచు, వందిమాగధులస్తోత్రముల నాలించుచు,
సామంతరాజుల వందనము లంగీకరించుచు, భృత్యజనులసేవల నానం
దించుచుఁ గర్ణశకునిదుశ్శాసనాదిరాజులు తమతమతేరు లెక్కి వెనువెంట
రా గంగాప్రవాహంబు వోలె నెడతెగని ప్రచారము గలిగి రథగజ
సంకులపదాతిజనభూయిష్ఠమైనదియు శ్వేతాతపత్రచామరపతాకములు
దట్టమై వాతోద్ధూతశారదాభ్రశకలచయముతో వెలయునాకసంబు ననుక
రించి చతురంగసైన్యము వెంట, గొలిచి రాఁగఁ దఱలి యత్యల్పకాల
మున త్వరితగమనముతో హస్తిపురముం జేరెను. అనిన విని జనమేజ
యుండు వైశంపాయనునితో నట్లు దుర్యోధనుండు ధర్మజుచే ననుజ్ఞా
తుండై చనినపిదప ధర్మజాదు లెట్లు వర్తించిరి? దుర్యోధనాదులు హస్తి
పురి చేరఁగా భీష్మాదివృద్ధులును నాచార్యులును వారల నేమనిరి?
తద్వృత్తాంతం బంతయుఁ దెలియఁ జెప్పు మని వేఁడఁగా నామునివర్యుం
డానృపవర్యున కిట్లనియె.

అట్లు దుర్యోధనుఁడు మున్నగువారు పాండవులపరమకారు
ణ్యమునం జేసి గంధర్వులచెఱనుండి తప్పించుకొని హస్తినపురిం జొచ్చిరి.
అంత భీష్ముండు దుర్యోధనుని సమీపించి యిట్లనియె. వత్సా! పెద్దలు
హితులై నీవు ఘోషయాత్ర పోవల దని చెప్పినను వారిమాటలఁ
ద్రోచిపుచ్చి ద్వైతవనమునకుఁ బట్టు పట్టి పోయితివి. అప్పుడు నీవ
ట్లేఁగుట నాకు సమ్మతము గా దని నీ కెంతో చెప్పితి. అది వినక
పోయి నీవు గంధర్వులచే బద్ధుఁడవై క్రియాశూన్యుండ వైతివి.
దాని కెట్టిఫలము ననుభవించితివో కనుము; గతవిద్వేషుఁ డగు ధర్మ
జుం డుండఁగా నీ విప్పాటిదుర్గతికిం దక్కితివి. ఆమహనీయుండు
నీయెడఁ బగను బాటింపఁడయ్యె. కరుణించి నిన్నుఁ జెఱఁ దప్పించె.
ఇంతటనైనను నీకు సిగ్గు రాదాయెనే? గంధర్వులతోఁ బెనఁగు
చుండఁగా నీవును నీసైన్యమును నఱచుచుండ నీసూతపుత్త్రుండు నీవు
మన్నించు రాధేయుండు రణరంగమునందుండి వెఱచఱచి పాఱిపో

యెంగాదే? వీఁడు నీకు ముఖ్యుండైన వీరుండు. ఈతుంటరి విలువిద్య
యందుఁ గాని, మగటిమియందుఁగాని, ధర్మవర్తనమునందుఁ గాని పాండ
వులలో నేపాటివాఁడు? ఇప్పటికైనను నామాట విని మహనీయు
లగు పాండవులతో సంధిఁ జేసికొని కులరక్షణము గావింపుము. అని
బోధించుచున్న తాత యెదుట దుర్యోధనుండు పకపక నవ్వి సభలో
నుండి లేచిపోయె. వాఁడు పోవుచుండఁగనే వానికిం గూర్చువారైన
కర్ణశకునిదుశ్శాసనులును సభను వీడిపోయిరి. అంత భీష్ముండు వారి
వర్తనమునకుఁ గోపించి లజ్జితుండై మొగంబు జేవురింపఁ దనవిడిదికిం
జనియె. ఆతండు చనుటయు సుయోధనుండు మంత్రులతోఁ గ్రమ్మఱి
యచ్చోటికే తెంచి యందఱుఁ గలయంజూచి భీష్మునిమాటలను మీరంద
ఱును వింటిరి గదా? కర్తవ్యము నిఁక నాలోచించి మేలగు దానినిఁ
జెప్పుఁడు. నాకు హితముఁ దెల్పుఁడు. అని యడుగఁగాఁ గర్ణుండు
దుర్యోధనున కిట్లనియె. రాజవర్యా! ఈముదుకం డెల్లప్పుడు
మనల నిందించుచుండు. పాండవులను మహాత్ము లని యెల్లప్పుడును
బొగడుచుండు. నీయందాతనికిఁ గలద్వేషభావముచే నన్నును నెల్ల
ప్పుడు గీటునఁ బుచ్చు. నీయెదుట నన్నావృద్ధుఁ డట్లు ప్రేలుచున్న నే
నెట్లూరకుందు? వలసినంత సేన నిచ్చి దిగ్విజయార్థము నన్నంపుము.
బలిష్ఠులైన పాండురాజపుత్త్రులు నల్వురు గెలిచినమహీవలయమును
నే నొక్కరుండ గెలిచి యనేకరాజుల నీ కరిగాపులుగఁ జేయుదు. తెలివి
మాలిన యీముదుకం డప్పు డేమనునో చూతుము గాక! పౌరుష
వంతులను నీతిమంతులను నిందించుట, పిఱికిపందలను దుర్వినీతులను
భూషించుట యీకురుకులాధమున కుగ్గుపాలనంటివి. నే నీభూమండ
లము నంతయు గెలిచి వచ్చితి నేని నాపౌరుషబలముల నధఃకరించిన
యీముదుకం డప్పుడు తన్నుఁ దాన దూషించుకొనును. ఇదియ మన
కిప్పుడవశ్యము కర్తవ్యాంశము. నీకు లోకవిజయము గలుగునట్లుగా
సత్యమైన ప్రతిజ్ఞఁ జేసి యాయుధమును బూనెద. అనుజ్ఞ
నొసంగుము. అనఁగా నందనలకు గాంధారేయుం డిట్లనియె.
శూరవరా! ఈలోకంబున నీ కసాధ్యం బొం డుండునే? నీవంటి
శూరుండు నాకు హితుఁడయియుంటం జేసి నేను ధన్యుండ నైతి. నాపైనిఁ
బ్రసన్నత్వంబునఁ గదా నీ విట్లాడుట. శత్రురాజుల నందఱి గెలుచు

నిమిత్తము వలసినపుడు జైత్రయాత్ర నిరాటంకముగ నడుపుము.
నీయాజ్ఞ నుల్లంఘింపక నీ కనురక్తుఁడనై వర్తించువాఁడ నని వచించె.

### కర్ణుఁడు దిగ్విజయముఁ జేయుట

పిదప సుయోధనుసెలవుఁ బొంది రాధేయుండు వలసినంత సైన్యమును సమకూర్చుకొని యొకశుభముహూర్తమున శుభసూచకంబగు మంగళస్నాన మొనర్చి భక్తిపూర్వకముగ బ్రాహ్మణుల నర్చించి వారియాశీర్వచనములఁ బొంది రథనేమిధ్వనులు నలుదెసలఁ బ్రతిధ్వనులీనుచుండఁగా, బహుసైన్య పరివృతుండై దిగ్విజయయాత్ర వెడలెను. ప్రథమమున నతఁడు పాంచాలరాజుపై దండెత్తి ద్రుపదుపురము ముట్టడించి యారాజుతో భయంకరరణము గావించి వాని వశపఱచుకొని, వానివలన నమూల్యములైనరత్న రాసులను, స్వర్ణరజతములను రాజరాజునకుఁ గప్పముగాఁ గొని వానిసామంతరాజులను దుర్యోధనునకుఁ గప్ప మొసఁగున ట్లొనర్చి, యటనుండి తఱలి యుత్తరాభిముఖుండై భగదత్తు నోర్చి, హిమవంతంబుసమీపించి యాపర్వతరాజమునకుఁ జెంత నుండురాజులచేఁ గప్పములఁ గొని, యచ్చటినుండి తూర్పు దిక్కుమొగంబై వరుసగా నంగవంగకళింగమగధవత్సకోసలాది దేశములరాజుల గెలిచి పిదప దక్షిణదేశమువైపునఁ దఱలి యచ్చటిదేశాధీశుల నోడించి వారివలనఁ గప్పములఁ గొనుచుఁ జని ముందటఁ గుండిన నగరపురాజగు రుక్మితోఁ బెనఁకువకుఁ జొరఁగా నాతండు కర్ణునితోఁ జెలిమిచేసి విస్తారధనకనకవస్తువాహనముల సమర్పింప నతఁడు వానిని గైకొని, పిదపఁ బాండ్యుని నటువెనుకఁ జోళరాజును నోడించి వారివలనఁ గప్పములఁగైకొని యచటనుండి చేదిరాజ్యముఁ బ్రవేశించి శిశుపాలు కుమారుఁడగు సహదేవు నోడించి, యటుపిమ్మట నవంతిదేశాధీశుల సమరనిర్జితులఁ గావించి, ప్రతీచిం జొచ్చి యాదవులతోఁ జెలిమిచేసి, శకులను, యవనులను, బర్బకులను, పార్వతీయులను మద మణఁచి యిట్లనేకదేశరాజుల నోడించి వారివలన గప్పములఁ గొనియుఁ గొంతకాలమునకు హస్తినాపురమును జేరె. ఇట్లు మహీమండలము నంతయుఁ దనకై దిగ్విజయము గావించి యేతెంచినరాధేయు నెదుర్కొనుటకు దుర్యోధనుండు నగరమున సాటించి సోదరబంధుగణసమేతుండై వాని కెదురేఁగి ప్రియవాక్యంబుల వాని నభినందించి యతనితో

నిట్లనియె. నాకు లోకముల గెలిచి రాజ్యవిస్తృతి గావింపఁ గలమహా శూరులగుభీష్మద్రోణబాహ్లికాదు లెందఱున్నను వా రెవ్వరును జేయలేని మేలు నాకొనర్చి నన్నుఁ గృతకృత్యుం గావించితివి. వేయేల? నీవలన నేను సనాథుఁడనైతిని. పాండవులు గాని లేక, బలశాలు రగు భూలోకములోని యితర రాజులు గాని నీలో షోడశాంశమున కీడు గారు. ధృతరాష్ట్రుని గాంధారినిం జూడ రమ్మని వేడఁగా రాజుకోర్కెని నెఱవేర్చుటకు గాంధారియొక్కయు ధృతరాష్ట్రునియొక్కయు నగరుల కేఁగెను. అంత వారియడుగులకు మ్రొక్కి యాశీర్వచనములు గ్రహించె. అప్పుడప్పురమున హాహారవంబులు చెలరేఁగె. రాజులు కొందఱు వానిపరాక్రమమును బ్రశంసించిరి. కొంద ఱతనిని దూషించిరి. కొందఱు మౌనము ధరించి యూరకుండిరి. కర్ణుఁ డత్యల్పకాలమున నానాదేశాధీశులను నోడించి హస్తినపురరాజ్యమును నలుదెసల వెలుఁగుదానిగాఁ జేసిననాటంగోలె దుర్యోధనుఁడు మున్నగు ధార్తరాష్ట్రులెల్లరును దాముపాండవులను గూడ గెల్చినవార మని తలంచుచుండిరి. అంత నొక్కనాఁడు కర్ణుం డేకాంతమున నున్న దుర్యోధనునితో నిట్లనియె. నరేంద్రా! సకలమహీరాజ్యమెల్లను నిష్కంటకమై నీయేలుబడికి లోబడియున్నది. ఇంద్రుండు స్వర్గమునంబోలె సకలవిభవములతో నిమ్మహిలోనిరాజు లెల్ల నినుంగొల్చుచుండ సుఖమున రాజ్యపాలనముం జేయు మనెను. అప్పుడు దుర్యోధనుండు కర్ణుని రాధేయా యని పిలిచి యిట్లనియె. నీవంటిమహాపరాక్రమశాలియైన శూరుండు నాకుఁ దోడై యుండ నా కేదియు దుర్లభంబు గాదు. నా మనంబున బహుకాలంబునుండి యొక్కకోర్కె గలదు. వినిపించెద ఆలింపుము. ధర్మరాజు రాజసూయయాగ ముంజేసి పేరోలగంబున లోకోత్తరవిభవముల ననుభవించె. నాటంగోలె నామది యట్టియాగ మొనర్పవలయునని తహతహపడుచున్నది. ఆనాయాశఁ దీర్ప నీవ తగుదువని యెంతు. అనఁగా రాజరాజునకుఁ గర్ణుండి ట్లనియె. మహారాజా! నీ విప్పుడు రాజాధిరాజవై మహీవలయమున నున్న రాజుల నెల్ల వశ్యులఁ జేసికొని యున్న వాఁడవు. యాజకులఁ బిలిపింపుము. యాగయోగ్యసంభారములఁ జేకూర్చునిమిత్తము దగుమానుసుల నియమింపుము నీవు గావింప నున్న యజ్ఞమున విప్రులకన్నపానాదుల సమృద్ధియొనరింపుము.

నీయిష్ట మైనయజ్ఞమును నడుపుము నఁగా విని దుర్యోధనుండు ఋత్విజుల
రప్పించి వారితో నిట్లనియె ఋత్విజులారా, నేను రాజసూయయాగమును
జేయ నుద్యుక్తుఁడనై తిని. ఆయజ్ఞమునకు వలయు సంభారములు సమ
కూర్చి నిర్విఘ్నముగ నయ్యది కొనసాగించునట్లు తగినవారి నియోగింప
వలయు. లోపము లెంతమాత్రము రానీయక జాగరూకతతో మెలఁగ
వలయు. అనఁగా ఋత్విజులు దుర్యోధనున కిట్లనిరి. రాజేంద్రా! నీకుఁ
బాండవులు గర్భశత్రువులు. వారలు జీవించియుండుదనుక నీవీయాగ
మును జేయలేవు. మఱియును నీతండ్రి ధృతరాష్ట్రుండు(౬౦) జీవితుఁడై యున్నా
డు. కావున రాజసూయయాగము నీవు చేయనర్హుఁడవు. అది యిప్పుడు
చేయఁదగిన యాగము కాదు కావున దానికి సమానమైన వైష్ణవ
మనువేఱొక యాగము గలదు. సామంతరాజులును గర్ణునిచే జయింపఁ
బడినరాజులును దెచ్చినకానుకలతో నయ్యాగముల నిర్వహింపుము.
దానంజేసి నీ కత్యున్నతవిభవంబు నేకూఱు. ఈయజ్ఞమును మున్నె
వరును జేయరు. యజ్ఞశాలను బంగరునాగలిచేఁ దోలుత దున్నింప వల
యును. ఇప్పటి కీయాగ మొనర్చుట తగినది. నీకోర్కె సఫల మగును.
అని ఋత్విజులు వివరింపఁగాఁ దుర్యోధనుండు దుశ్శాసనాదిసోదరు
లను, గర్ణశకునులను బిలిచి ఋత్విజులవచనముల నెల్ల నివేదించెను.
వారందఱు దాని విన్నతర్వాత, దుర్యోధనునితో ఋత్విజుల వచ
నము మేరకు నడవ వలయునని యందఱేకవాక్యులై నుడువుటచే దుర్యో
ధనుఁడు యజ్ఞసంభారద్రవ్యములను సమకూర్ప నాయానియోగివర్గం
బుల నేర్పఱిచె. వలసినయజ్ఞసంభారములు కొఱంతపడకుండ సేకరింప
నాజ్ఞాపించె.

### దుర్యోధనుండు వైష్ణవ మనుయజ్ఞమును జేయుట

అంత ముఖ్యమంత్రు లగువిదురాదులు నేర్పరు లగుశిల్పుల
రావించి పురమువెలుపల విస్తీర్ణమైనప్రదేశమునందు రమణీయమగు
యజ్ఞశాల నిర్మింప నిశ్చయించి యాప్రదేశమును దోలుత బంగారు నాగ
లితో దున్నించిరి. అట్లు శాస్త్రోక్తపధానంబున నేర్పఱిచిన యజ్ఞశాల
యందు యాగమునకు వలయు పదార్థముల నింపి యాయుదంతమును
రాజరాజున కెఱింగింప నామహారాజు దైవజ్ఞులచే నేర్పఱుపఁబడిన

శుభదినమునందు యాగదీక్షితుండై సుముహూర్తమునందు యాగశాలాప్రవేశముఁ జేసె. ఈయాగమహోత్సవమునిమిత్తము నానాదేశరాజుల నాహ్వానించుటకు విప్రులును, దూతలును బంపఁబడిరి. మఱియు యాజకులును యజ్ఞనిర్వాహకులును నగు విప్రముఖ్యులు విచ్చేసిరి. అత్తఱి యాగశాల దుర్యోధనునిసోదరులతోను, దలివంశ్రులగు గాంధారీ ధృతరాష్ట్రులతోను, విదురాద్యమాత్యులతోను, భీష్మబాహ్లికాది కురువృద్ధులతోను, ద్రోణకృపాశ్వత్థామాద్యాచార్యబృందముతోను, కర్ణశకునిదుశ్శాసనాద్యాప్తులతోను నిండి బహుజనకోలాహలమునఁ దేజరిల్లుచుండె. అపుడు దుశ్శాసను డొకదూతను బిలిచి వాని కిట్లని యానతిచ్చె. నీవు ద్వైతవనమునకుఁ బోయి యాపాపాత్ములగు పాండవుల మనయజ్ఞమునకు నాహ్వానించి రమ్ము. అనఁగా నాదూత వల్లెయని ద్వైతవనమున కప్పుడ యేఁగి మహాత్ములగుయుధిష్ఠిరాదులం జూచి నమస్కరించి వినయవినమితోత్తమాంగుండై యిట్లనియె. మహాత్ములారా! సుయోధనుండు కర్ణుచే దిగ్విజయము చేయించి నిజశౌర్యమున నార్జించినద్రవ్యమును వెచ్చించి వైష్ణవ మను మహాయజ్ఞమను క్షత్రియోచితమైనదాని నాచరింప దీక్ష వహించియున్నాఁడు. ఆయజ్ఞమును వీక్షింప మిమ్మునందఱను రమ్మని యాహ్వానము నంపెను. మీరందఱును హస్తిపురమునకు రావలయును. మిమ్ముఁ బిల్వ నన్నుఁ బంప నేఁ బనివిని మీసన్నిధానమున కేతెంచితి. అని విన్నవించిన వానికి ధర్మరాజిట్లనియె. సుయోధనుం డీయజ్ఞదీక్ష పూనుటం జేసి మహాభాగ్యమాయెను. పూర్వరాజులవలె దుర్యోధనుఁడు కీర్తిప్రఖ్యాతులను దీన వెలయించుట మిక్కిలి శ్రేయస్కరము. ఆయాగమును జూడవలయునని మాకును వాంఛగలదు. కాని మాప్రతిజ్ఞావత్సరము లరణ్యమున నుండవలసిన కాలము పూర్తి కాకుండ నీమధ్యయందుఁ బురము సొచ్చుట ధర్మువు గాదు. కాన మే మిప్పుడు రామని చెప్పుచుండఁగా నాదూతకు భీముం డిట్లనియె. ఏర్పఱచుకొన్ననియమము మేరకుఁ బదుమూఁడేండ్లు వనవాసమును గడపి ధర్మరాజు చేయుశస్త్రప్రదీప్తమయిన యాగమందు దుర్యోధనాదికురుకుమారులను నూర్వురను బశువులఁగాఁ గ్రోధహవిస్సుతో యుద్ధ మను నేయజ్ఞమును గావించునో, యాయాగ

మునకు నేఁగు వచ్చెద నని దుర్యోధనునకుఁ దెలుపు మనెను. మిగిలిన పాండుకుమారు లేమియుఁ బలుకక యూరకుండిరి. అంత నాదూత ధర్మజానుజ్ఞాతుండై సుయోధనుపాలికిం బోయి సర్వమును నివేదించె. అట యాగదీక్షితుండైన సుయోధనుండు విదురుం బిలిచి యాగాగతులైన సర్వవిప్రులకును, నానాదేశాధిపతులకును నేకొఱంత వాటిల్లనీయక రసవంతములైనభోజనాద్యుపచారములను వారివారిపదవులకుఁ దగినట్లు విచారించుచుండవలయు నని నియమించె. అంత విదురుం డాయాజ్ఞను శిరంబున వహించి యాగమున కేతెంచినసర్వమహీపాలురకు విడిదల లేర్పఱచి భోజనాద్యుపచారములను దగువిధంబున నుపచరించు నిమిత్తము సేవకుల నేర్పఱచి తానంతయు వారికిఁ గన్నాకై యరయుచుండె. అట్లు సుయోధనుండు గావించిన వైష్ణవయాగంబున కేతెంచిన నానాదేశాధీశులును, యాజకులైనవిప్రులును, నన్నాతురు లగు బ్రాహ్మణులును సకలప్రాణులును రసవంతములైన యన్నపానాదులచేఁ దృప్తులును, బహుమతులచే సంతుష్టస్వాంతులును, బహుదక్షిణాతోషితులునునై, విధ్యుక్తముగా ననుష్ఠింపఁబడిన దేవకార్యనిర్వాహణంబుతోఁ గూడినవారై యాగకార్యమును సమాప్తినొందించిరి. అంత సంతుష్టులైన యాయాదేశాధిపతులను వారివారిదేశములకు సాగనంపి దుశ్శాసనాది సోదరులును, కర్ణశకున్యాద్యమాత్యులును గొలుచుచుండ, వందిమాగధవైతాళికులు స్తుతించుచుండఁ, బౌరవృద్ధులు మంగళాక్షతలుఁ బైన వైచుచుండఁ బేరోలగంబున యాగశాల వెడలి పురమును సుయోధనుండు వేడుకతోఁ బ్రవేశించె. అట్టితఱిఁ గొందఱీయాగము ధర్మజు రాజసూయమునకుఁ దుల్యమైనది కా దనిరి. కొందఱిది యాధర్మజు రాజసూయమునకుఁ బదునాఱవపాలికైనఁ దులదూఁగ నేర దనిరి. మఱియుఁ గొందఱీవైష్ణవయాగముతోఁ సరిపోల్పఁ దొల్లింటి నాభాగయయాతులొనర్చిన యాగములును దగ వనియు వేఱుకొందఱు సుయోధనుం డీయాగ మొనర్చి కురువంశమందలి పూర్వరాజులకు స్వర్గమునందు నిత్యనివాసము గల్పించె ననియు, మఱియుఁ గొందఱుఁ గురుకులమునకు సుయోధనుఁ డీయాగ మొనర్చి వన్నె దెచ్చెననియుఁ బలికిరి. ఇట్టి యానందజనకంబులైన మాటలు వినుచు దుర్యోధనుఁ డమందానందంబుతో నగరు ప్రవేశించి తల్లిదండ్రులకును,

భీష్మద్రోణులకును నమస్కరించి, తనకుఁ బ్రణమిల్లిన చిన్నవారి నభి
నందించి భ్రాతృవర్గముతో ధృతరాష్ట్రసమీపమునఁ దనకై యమర్పఁ
బడిన యుత్తమాసనంబు నధిష్ఠించె. అపుడు రాధేయుండు లేచి, మహా
రాజవర్యా! అదృష్టవశంబున నీయధ్వరంబు నిర్విఘ్నంబుగ నెఱవేరె.
రాఁగలఘోరరణమునందుఁ బాండవులఁ జంపి నీచే రాజసూయయాగము
జేయింపఁగోరుదు. అపుడు గదా యీకొలువు మాచూపులకుఁ బండుగ
నేయు. అని చెప్పఁగా దుర్యోధనుం డిట్లనియె. రాధేయా! నీవ కదా
యన్ని కార్యములను నిర్వహింపవలసినవాఁడవు. అని కర్ణుని సుయోధ
నుండు కౌఁగిలించి చెప్పఁగా నప్పుడు కర్ణుండు వెండియు నతనికి నిట్ల
నియె. రాజేంద్రా! యది యొకగొప్పకార్యమే? దానికై వగవ నేల?
అర్జునునిఁ జంపునందాఁక పదధావనంబు నేయను. మాంసముఁ గుడు
వను. నన్నెవఁ డెద్ది యాచించినను లేదనను. ఈవిధమగు నాసుర
ప్రతిజ్ఞఁ బూనెద. అను రాధేయుబీరంపుఁబలుకులాలించి ధార్తరాష్ట్రులు
పాండవుల నప్పుడే గెలిచినవారుగఁ దలంచిరి. అంత సుయోధనుండు
కొలువు చాలించి కుబేరుఁడు చైత్రరథంబునుం బోలె నభ్యంతరగృ
హంబుఁ బ్రవేశించె. సభాసదులైన యితరులు తమతమనెలవులకుఁ జనిరి.
ఈవృత్తాంతంబు నంతను ధర్మజుండు చారులవలన విని సహజకవచకర్ణ
కుండలధారి యగు రాధేయుం దలపోసి యర్జునువధముంగూర్చి కర్ణుఁ
డొనర్చినశపథంబు విని మనస్సునఁ దాము పడినక్లేశముల నెల్లఁ దడవి
కొనుచుఁ జింత దొడఁగ, నానావిధ క్రూరమృగసమూహములతో నిండి
యున్న యాద్వైతవనమును వదలుటకు యత్నించుచుండె. హస్తిపుర
మున సుయోధనుండును సోదర సమూహపరివృతుండై రాధేయు
మతము నవలంబించి భీష్మబాహ్లికాది కురువృద్ధులకును, ద్రోణకృపాశ్వ
త్థామాద్యాచార్యవర్గమునకును, మిగిలిన దొరలకును మానసోల్లాసము
గల్పించుచు, విప్రులను బంధువులను బహుధనదానములచేఁ దని
యించుచు, ధనము కలిమికిఫలము దానభోగములే కదా యని యెల్ల
వారికిని దానముచే సంతృప్తిఁ గావించుచుఁ దాను నఖిలభోగముల నను
భవించుచుండె. అని వైశంపాయనుండు సెప్పఁగా జనమేజయుండు విని
ద్వైతవనంబున ధర్మజాదుల యావలివృత్తాంతంబు సవిస్తరంబుగా

దెలుపు మని ప్రార్థింప జనమేజయునకు వైశంపాయనుం డిట్లు చెప్పం దొడంగె.

{ ద్వైతవనములోనిమృగములు ధర్మజుస్వప్నమునం దగపడి తమ దుఃఖములను జెప్పుకొనుట. }

అంత నొక్కనాఁడు ధర్మపుత్త్రుండు నిద్రించుచుండఁగాఁ బ్రభాత కాలమున ద్వైతవనములోనిమృగము లెల్ల నామహాత్మునకు స్వప్న మునం గానవచ్చెను. అపుడామహనీయుండు 'మీ రెవ్వరు? మీకోరిక లెవ్వి? చెప్పుఁ'డన నా మృగంబు లిట్లనియె. రాజేంద్రా! కరుణాసముద్రా! మే మీద్వైతవనమునందలి మృగములము. మీ రిన్నాళ్లీవనమున నుండుటంబట్టి మీతమ్ములు మమ్మును వేఁటాడఁగాఁ దక్కినమృగములలో బీజప్రాయములమై యత్యల్పసంఖ్యాకులమై యున్నారము. మీరీవనము వీడి వేఱొకకాంతారమునకుఁ బోయిన మేము గొందఱమైన మిగిలి యుందుము. మాకులము నిలుపఁగలందులకై మిమ్మును బ్రార్థింప నేతెంచి తిమి. సర్వభూతహితుఁడ వగు నీవు మామొఱాలించి మాయందుఁ గరుణింపవలయును. అనఁగా యుధిష్ఠిరుండు వానియెడ దయఁ దాల్చి యట్లు సేయుదు ననఁగా నవి యదృశ్యంబు లయ్యె. అంత ధర్మ జుండు మేల్కాంచి మృగంబులు తనస్వప్నగోచరం బులయి వేఁడిన వేఁడికోలును సోదరులతోఁ జెప్పి యిట్లనియె. మన మీ ద్వైతవనమును జొచ్చి యిప్పటి కొక్కయేటిపైన నెనిమిదిమాసములైనవి. ఇఁకఁ గామ్యక వనమున కరుగుట లెస్స. అని చెప్పఁగా సోదరు లందుల కియ్యకొనిరి. వెం టనే యింద్రసేనాదిపరిచారకులురథంబులాయితములు సేసి లలితమార్గముఁ జూపఁ బుణ్యాత్ములు మంచిలోకముల కేగుచాడ్పునఁ గామ్యకవనంబునకుఁ బాండ వులరిగిరి. ఆవనమునందు వారు పండ్లు, కాయలు, గడ్డలు నేరి భక్షిం చుచుఁ గాలము గడపుచుండ సమయవత్సరములు పదనొకండు గడ చినవి. వనవాసక్లేశంబు యుధిష్ఠిరునకు మనంబునకుఁ దోఁచినపుడెల్లను రాధేయునిప్రతిజ్ఞను నతనిపరుషవాక్యములను దలంచుచు మిక్కిలి దైన్యముతో నిట్టూర్పులు నిగుడించుచు రాత్రులందుఁగన్ను కూర్కక వేదనం బడుచుఁ గ్రోధాగ్నిం బొగలుచుఁ దా నానాఁడాడినజూదర

బునఁ గదా యింత యెఱుకువ నింతటియుద్ధమలఁ గుఱువవలసివచ్చె నని మనంబునఁ గుందుచుండె.

అంతఁ బాండవులీతెరునఁ గామ్యక వనంబునఁ గొన్నినాళ్లు గడుపుచుండ భారతవంశవివర్ధనుండును, నాగమపురాణపదార్థతత్త్వనిస్సంశయకారియును, బింగాంశుజటాచ్ఛటాభరణుండును, బ్రాంశుపయోదనీలతనుభాసితుండును, సుజ్వలదండధారియును, గృష్ణమృగచర్మపరిధానుండును నగు సత్యవతీపుత్త్రుండైన వేదవ్యాసుండు పాండవులఁ జూచునిమిత్తమచ్చోటికి విచ్చేయఁగా ధర్మరాజు తానుం దమ్ములును ద్రౌపదీసహితంబుగా నాతని కెదురేఁగి ప్రియంబునఁ దోడ్తెచ్చి యర్ఘ్యపాద్యాదు లొసంగి యుత్తమాసనంబున నాసీనుం జేసి మిక్కిలి భక్తితో నతనిపాదకమలములకు మ్రొక్కి విధ్యుక్తవిధానంబుల నర్చించి యమ్మునిచెంత వినయవిధేయతలఁ గనఁబఱచుచు నాసీనుండయ్యె. అప్పు డామునీంద్రుండు వనవాసక్లేశంబునఁ గృశించిన మనుమలం గాంచి కృపాళుండై కంట నీరు గార గద్గదస్వరమున ధర్మరాజున కిట్లనియె. ధర్మజా! ఆలకింపుము. పురుషుండు సుఖదుఃఖముల నొకటి వెంబడి నొకదానిని గుడుచుచుండుఁ గాని యెల్లప్పుడును సుఖమును గాని, యెల్లప్పుడును దుఃఖమునుగాని యనుభవింపఁడు. కావున జ్ఞాని సుఖదుఃఖములయాతాయాతములయందు మోదఖేదములఁ బొరయ నేరఁడు. కర్షకుఁడు కాలానుగుణముగ ఫలించిన సస్యమును బోలె జ్ఞాని కాలప్రాప్తంబైనదాని ననుభవించు. అందును నొక్కవిశేషంబు వినుము తపంబు లొనర్చినవారే యుత్తమసుఖంబులఁ బొందుదురు. తపస్సు సకలశ్రేయస్సాధనంబు. దానఁ బొందరాని దన్యంబు లేదు. పుణ్యాత్ములకు సత్యము,ఆర్జవము, అక్రోధము, దేవతాతిథిపూజనము, దమము, శమము, అనసూయత, యహింస, శౌచము, ఇంద్రియనిగ్రహము ననునివి సాధనంబులు. వీని నాచరింపని యధర్మపరు లగుమూఢజనులు హీనజన్మముల నెత్తుచుఁ జచ్చుచు బునరావృత్తిఁ గనలేక సుడియందుఁ జిక్కినపూరెపుడకచందంబున సంసారమునఁ బరిభ్రమించుచుండుదురు. అట్టివా రేకాలంబునను సుఖింపరు. ఈలోకమున నాచరించిన కర్మఫలములను బరలోకమున ననుభవింతురు. కావున నియతవ్రతులై తపంబాచరించుచు దేహేంద్రియముల నలయించుచు

శక్త్యనుసారముగ దానములచే దేవతాతిథులకుఁ బూజలు సలుపుచు నరిషడ్వర్గముల జయించిన పురుషుండు మిగుల సుఖియై సంతోషించు. సత్యవాది యాయుర్వృద్ధిం బొందు. ఆర్జవవంతుం డాయాసమునకు దూరుం డగు. అక్రోధనుండును, ననసూయుండును బర మగు నివృత్తి మార్గమును బొందు. శాంతుండు క్లేశములఁ బాయు. దేవతలకును నతిథులకును నన్నాదులకుఁ బంచియిచ్చుధనంబును బుణ్యాత్ముండు సుఖ భోగములు గలవాఁడగును. హింస చేయనివాఁ డారోగ్యవంతుఁడగు. పెద్దలఁ బూజించువాఁ డుత్తమకులమున జన్మించు. ఇంద్రియముల జయించినవాఁడు వ్యసనములఁ బొందఁడు. శుభములే యొనర్చుబుద్ధి గలవాఁడు కాలధర్మము నొంది యపరజన్మమున నాశుభయోగమున నుత్తమజన్మ మెత్తు ననఁగా యుధిష్ఠిరుండు వేదవ్యాసుం జూచి మహాత్మా! దానధర్మతపంబులలో నెయ్యది జన్మాంతరంబున బహుఫలప్రదంబు? ఎయ్యది దుష్కరంబు ? వినిపింపవే యన నమ్మునీంద్రుండు వెండియు నిట్లనియె. తండ్రీ ! వినుము, మానవు లాశాపరులై ప్రాణములనైన నుంకువగాఁ బెట్టి సమరముల నొనర్చుటయు, సముద్రయానంబులఁ బోవుటయు, నరణ్యంబులఁ దిరుగుటయుఁ, గృషియు, గోరక్షణవాణిజ్యంబు లొనర్చుటయు, సేవకవృత్తియు నీధనముం గోరియె కదా. అది యట్లుండ నానాకష్టములం బడి యార్జించినద్రవ్యము నొరుల కిచ్చుట దుష్కరం బని వేఱ చెప్పవలయునా ? కావున దానము దుష్కర మని నామతంబు. ధర్మమార్గమున నార్జించినద్రవ్యమును సత్పాత్రమున దానంబుఁ జేయువాఁ డనంతఫలమును బడయు. అధర్మమున నార్జించిన ధనమున నెట్టిదానము లొనర్చినను నించుకేని ఫలము కలుగ నేరదు. వినుము. పూర్వకాలమున ముద్గలుం డను ఋషీశ్వరుండు న్యాయార్జితమైన వ్రీహిద్రోణము (తూమెడుధాన్యమును) నుత్తమపాత్రమునకు దానమొసంగి యుత్తమలోకంబును బడసె. అని చెప్పఁగా ధర్మజుం డాయితిహాసమును జెప్పు మని యడుగుటయు వేదవ్యాసుండు వ్రీహిద్రోణాఖ్యానమును సవిస్తరముగా యుధిష్ఠిరున కిట్లు చెప్పె.

### వేదవ్యాసుఁడు ధర్మజునకు వ్రీహిద్రోణాఖ్యానంబుఁ జెప్పుట

పూర్వకాలమునందుఁ గురుక్షేత్రంబున ముద్గలుం డను మునిప్రవరుండు వసించుచుండె. ఆతండు జితేంద్రియుండును, ననసూ

యుండును ధర్మాత్ముండును నై కపోతంబులు వోలె సంచితవృత్తిపరాయ
ణుండై జీవించుచుండె. ఆమ్మహాత్ముండు నిజపత్నీపుత్త్రులతోఁ గక్షిపాద్య
ములను మొదలిడి యాపక్షమంతయుఁ బైవిధమున ధాన్యమును దూ
మెడు సంపాదించి దర్శపూర్ణమాసములయందు స్థాలీపాకేష్టులఁ జేయుచుఁ
దా నార్జించినధాన్యము నంతయుఁ బాక మొనర్చి దేవతాతిథులకు విగత
మత్సరుండై కుడువఁబెట్టి విఘసాన్నమును దానును బుత్త్రులును బత్ని
యునుగుడుచుచు శరీరపోషణంబుగావించుకొనుచుఁ దృప్తుండై చరించు
చుండె. ఈమహానీయుండు పక్షమంతయు నుపవసించి పర్వదినములయందు
మాత్ర మాహారముం గొనుచు నదియు నిష్టి గావించి పురోడాశము
నగ్నియందు వ్రేల్చి యతిథులకుఁ దృప్తిగాఁ గుడువఁబెట్టి తాను పిదప శరీర
యాత్రఁ జేయుచుండు. ఆమహానీయుండు గావించుసర్వేష్టులందు దేవేం
ద్రుండు దేవతలతో నేతెంచి ప్రత్యక్షముగ హవిర్భాగములఁగొనిపో
వుచుండు. మఱియు నాతండు పర్వదినములయం దొనర్చునతిథిభోజనము
నకు వేనవేలువిప్రులువచ్చి యారగింతురు. ఎంద ఱేతెంచినను నాతండు తూ
మెడుధాన్యమును వండినను నామహాత్మునిమనశ్శుద్ధివలన నాయన్నంబు
సోపస్కరముగా వలసినంత పెరుగుచుండు. ఈమహానీయునివృత్తాంతంబును
విని దుర్వాసుఁ డొకపర్వదినమునందు వెఱ్ఱివానివోలె దిగంబరుండై
నోటికివచ్చినట్లు వదరుచు ముద్గలునొద్దకుఁబోయి 'మునివర్యా, పేరాఁ
కటఁదూలుచున్నవాఁడ. నాకుఁ బట్టెడోగిరమిడి పుణ్యమునఁ బొమ్ము' అని
వేఁడఁగా నాముద్గలుండు కడుం బ్రీతిమెయి నాతనిని వంటశాలకుఁ గొని
పోయి యర్ఘ్యపాద్యాదు లొసంగి యన్నంబుఁబెట్టఁగా నాదుర్వాసుండు
తూమెడన్నమును దిని మిగిలినయెంగిలి నంతయు నొక్కమెతుకునైనను
మిగులనీయక దన శరీరమున కంతకుఁ బూసికొని యదృశ్యుండై
పోయె. ముద్గలుం డీకృత్యంబున కెంతమాత్ర మసూయపడక యా
పర్వదినమునఁ దనకును దనభార్యాపుత్త్రులకు నన్నంబు మిగులమికి
వగవక, మనస్తృప్తుండై మరల నెప్పటియట్ల పైపర్వదినమునకు వలసి
నంత ధాన్యమును యథారీతిగా నేఱుటకుఁ బోయి పర్వము రాఁగా
నన్నమును వండి యగ్నియం దిష్టిఁ గావించి యతిథులకై యెదురుచూచు
చుండ మునుపటివలెనే దుర్వాసుండు మరల నదేవిధంబున నేతెంచి

యాయన్నంబు నంతను గుడిచి మిగిలిన యుచ్ఛిష్టమును నొడలికిఁ
బూసికొని యేఁగినను ముద్గలుండు తృప్తుండై చలింపక సంతుష్టస్వాం
తుండై మఱునాఁడు యథాపూర్వముగ శిలోంఛవృత్తిమై ధాన్యసంపాద
నమునకుఁ దొడంగుచుండెఁ. ఇట్లు దుర్వాసుండు ముద్గలుని కాలపర్వ
ము లతిథిగాఁ గ్రమమునవచ్చుచుఁ బ్రతిపర్వమునందును నొకేతరు నన్న
మంతయుఁ గుడిచిపోవుచుండగా నాలవపర్వమప్పుడు దేవతలు ముద్గలు
మనోనిశ్చయమునకును స్థిరబుద్ధికిని నసూయారహితంబయిన యతిథి
త్కారమునకు సంతసించి యాతనిని సశరీరస్వర్గప్రాప్తిఁ బొందించునిమిత్తమై
స్వర్గమునకుఁ దోడిపోవుటకు విమానము నంపిరి. ఆవిమానమును దెచ్చిన
దేవదూత ముద్గలునకు దర్శనమిచ్చి యామునిప్రవరునితో నిట్లనెను.
మునిశ్రేష్ఠా! దేవతలు నీవర్తనంబునకు మెచ్చిరి. నీవంటిమత్సరరహితుం
డైనదాత మఱియొక్కండు గన్పడఁడు. దుర్వాసుం డీయాఱుపర్వముల
యందును నీకుటుంబయాత్రకై నమిగిలింపక వ్రీహిద్రోణాన్న మంతయును
గుడిచి యేగుచుండినను నీమనస్సునందు మాత్సర్యముగాని మఱి యేలో
భవికారముగాని గలుగదయ్యె నీ వాఁకటఁ గుటుంబముతో నవయుచు
న్నను నీయాఱుపర్వములను దుర్వాసునకి సంతర్పణమును విమత్సరుండవై
చేయుచునే యుంటివి. ఆఁకలి జనులకు ధర్మబుద్ధిని ధైర్యమును వీడున
ట్లొనర్చు. నాలుక రససహితాన్నమును మెసవ నిచ్ఛగించు. ప్రాణము
లాహారమునఁగాని నిలువ నేరవు. కావున నిరాహారుండవై యుండుట
దుష్కరము. మనస్సు చంచల మగుటచే దానిని నిగ్రహించుట కష్ట
తరము. మఱియు నీవు సకుటుంబముగఁ బదునాలుగుదినము లేటి కష్టపడి
తెచ్చిన ధాన్యమంతయు నీకొక్కపూటకు సైతము లేశమాత్ర మైన
మిగిలింపక యతిథి గుడిచిపోయినను నీకు నిర్వేదము జనింపదు. ఇత
రులకు దుష్కరంబులైన వన్నియు నీకు సుకరంబు లయ్యె. ఇంద్రియ
నిగ్రహమునకంటెఁ గష్టమైన తపస్సన్యంబు లేదు. నీవలన దుర్వాసుండు
కడుం బ్రీతుం డయ్యె. అనుగృహీతుం డయ్యె. ఇంద్రియముల గెలు
చుట, ధైర్యము, దేవతాతిథిభుక్తశేషభోజనము, శాంతి, దయ, సత్య
ము, ధర్మము మున్నగుగుణము లన్నియు నోముద్గలా! నీయందు సుప్రః
ష్ఠితము లయ్యె. నీవు నిష్ఠమై నాచరించుచున్న యోగంబుచేఁ బుణ్య

అనఁగా వారిని శీతోష్ణములు బాధింపవు. ఆఁకలిదప్పులు వారికెన్నఁ డును లేవు. రాగద్వేషములు గలవారి కందుఁ జోటు లేదు. జరాశోకములు వారికిఁ గలుగవు. సుఖస్పర్శములై నెత్తావిం గూడిన పవిత్రమారుతములందు వీచుచుండు. మానసోల్లాసకరంబులును శ్రుతిరమణీయంబులు నగు ధ్వనులు వీనులకు విందుగొలుపుచుండు. అచ్చోట నివసించువారి శరీరములు భూలోకవాసులవియుంబోలె శుక్లశోణితసంయోగమునఁ బుట్టినవిగావు. వారికిఁ జెమటగాని దుర్గంధిమూత్రపురీషములు గాని లేవు. వారుధరించువస్త్రములు ధూళిధూసరితములుగావు. వారు ధరించు పుష్పమాలలకు వాడుపలలేదు. వారు శోకరహితులు, ఈర్ష్యాదివర్జితులు, అనాయాసులు, మోహామాత్సర్యదూరులు, నెల్లప్పుడును గామగమనమగు దివ్యవిమానమున విహరించువారు. ఆలోకంబునకుఁ బైనుండునది బ్రహ్మలోకము. నాకలోకమునకును బ్రహ్మలోకమునకును నడుమఁ దేజోవంతము లైన యనేకలోకము లున్నవి. అవి స్వతేజంబులచేఁ బ్రకాశమానములై యుండు. అచ్చటికిఁ దమశుభకర్మలచేఁ బవిత్రులైన ఋషు లేఁగుచుందురు. అందు దేవతలను దేవతలగు ఋభువులును వారు వసింతురు. వారిలోకంబులు మిక్కిలి శ్రేష్ఠములు. దేవతలాఋభువులనువారి నిటఁ బూజింతురు. స్త్రీకృతతాపమును, భోగైశ్వర్యములయందు మాత్సర్యమును వారికి లేవు. వా రమృతపానంబు చేయరు. అగ్నులనువారు వేల్వరు. వారు దివ్యదేహంబులతో వర్తింతురు. వారు పార్థివశరీరులుగారు. వారికి సుఖములులేవు. సుఖములను గోరువారును గారు. కల్పాంతమునందు నైతము వారికి మార్పులు లేవు. వారికి ముదిమి, చావు, సుఖదుఃఖములు, రాగద్వేషములును లేవు. మౌద్గల్య మహామునీ, ఆయుత్తమలోకంబుల దేవతలకు నైతము కోరఁదగినది. తృష్ణాళువులకు నయ్యది దుర్లభంబు. వారికంటె కది గోచరమును గాదు. అవి ముప్పదిమూఁడు లోకంబులు. జ్ఞానులగువా రుత్తమ నియమములతో నుండియు, శాస్త్రవిధానంబు లనుసరించిన దానములఁ జేసియు, నాలోకంబుల నొందుదురు. నీ వాచరించిన దానములను ఫలముగా నీ వాలోకముల వసించి యందలిసుఖముల ననుభవింపుము. ఇయ్యవి యచ్చటిసుగుణములు. ఆస్వర్గమునందుఁ గొన్ని దోషములును గలవు. వానిం జెప్పెద. వినుము. ఈభూలోకమునా

నాచరించినకర్మములఫలముల నచ్చట ననుభవించుటయే కాని యాలోక ములయందుఁ గర్మాచరణ మనునది లేదు చేసినపుణ్యఫలముల ననుభ వింపఁగా పుణ్యము క్షీణమగునేని, వారిని మఱల దేవదూత లీలోక మునకుఁ బడద్రొబ్బుదురు. అప్పు డట్టివారికి సంజ్ఞామోహము గలుగు. నాకమునందు వాడు ధరించియుండు వాడనిపూలదండలోని పుష్పములు వాడుదల నొందును. నాకమునందలి ఫలములను బెద్దకాల మనుభవించు చుండి యది దొలఁగుట కెంతదుఃఖపడుదురో యయ్యది యందలిదోషము. మఱియు బ్రహ్మలోకవాసులకుఁ దప్ప మఱి యితరలోకవాస్తవ్యులంద ఱును దమకంటె నధికసుఖముగలవారియెడ నసూయ నొందుదురు. ఇవి స్వర్గమునందలిదోషములు. స్వర్గమునందు గుణములు పెక్కులు గలవు. వానినివర్ణించుట దరముగాదు. అయినను, మఱొక్క సుగుణము గలదు. స్వర్గమున నున్నవాఁడు తాను బుడమి నొనర్చినపుణ్యములఫలము క్షీణిం పఁగనే స్వర్గలోకమునుండి భ్రష్టుఁడై తనపుణ్యకర్మసంబంధంబునం జేసి భూలోకమున మానవజన్మమెత్తును. అందును శుచులు శ్రీమంతంబులు నైన వారియొక్కవంశంబున జన్మించు. అట్టిమానవజన్మమెత్తినవాఁడు ముందటిజ్ఞానముతో సత్కర్మం బొనర్పఁడేని, యధోగతినొందును. ఇటఁ జేయఁబడు సుకర్మయొక్క ఫలం బం దనుభవింపఁబడుచున్నది. ఓబ్రాహ్మ ణోత్తమా! ఇది కర్మభూమి. ఆపైలోకంబు కర్మఫలము లనుభవించు లోకము. ఓమహర్షీ, నీవు నన్నడిగితివి కాన స్వర్గలోకమునందలి సుగుణ ముల నెఱిఁగించితిని. మాతోడ రమ్ము విమానమెక్కి పోవుద మనఁగా ముద్గలుఁడు దేవదూత కిట్లనియె. ఓమహానుభావా! నీవు కీర్తించిననాక లోకమున దోషంబులు పెక్కులై యున్నవి. నిర్దోషమైన దేలోకమో దాని ననుగ్రహించి నాకుఁ జెప్పు మనఁగా దేవదూత వెండియు నిట్లని యె. బ్రహ్మసదనమునకుఁ బైన బరమమైన విష్ణుపదము గలదు. అది శుద్ధము శాశ్వతము. దానిని బరబ్రహ్మ మందురు. జ్యోతీరూపమై యది ప్రకాశించుచుండును. విషయలోలురును, దంభలోభక్రోధ మోహ ద్రోహపరాయణులును నగు పురుషులు దానిం జేర లేరు. నిర్మము లును, నిరహంకారులును,నిర్ద్వంద్వులును, సంయతేంద్రియులును,ధ్యాన యోగపరులును నగుమహాత్ములు దాని నభిగమింతురు. అని చెప్పఁగా

ముద్గలుండు దేవదూతం బ్రశంసించి ! యయ్యా ! పోయిరమ్ము. స్వర్గ సుఖము ననుభవించినపిదప మహాశోకము గలుగఁజేయునప్పు డనుభవింపఁ గల మహాదుఃఖమును నే నోర్వలేను కావునఁ బ్రస్థానము నాకు నాకలోక సుఖము వలదనెను. ఎప్పటికిఁ బోయినచో మరలి రాని యా లోకముం బ్రాపింపఁ దపం బాచరించెద నని యమ్మునిసత్తముఁడు, శాంత మూర్తియై నిందాస్తుతులయందును సముఁడును బంగారమును మంటిపెల్లను సమముగాఁ జూచుచుఁ బరిశుద్ధజ్ఞానయోగమునందే బుద్ధిని దదేకాగ్రము గానిలిపి నిర్వాణలక్షణ మగు పునరావృత్తిరహితమోక్షసిద్ధి నధిగమించె. కావున నోధర్మనందనా ! తపస్సుచే సాధింపరాని దెద్దియు లేదు. రాజ్య భ్రష్టుండ నైతి నని వగవకుము. బండిచక్రములు తిరుగునప్పు డందలి యాకు లొకటివెంబడి నొకటి తిరుగునట్లు సుఖమునకు ననంతరము దుఃఖము, దుఃఖమునకు ననంతరము సుఖమును నిట్లు క్రమముగ మరల మరల వచ్చుచును బోవుచు నుండును. సమయానంతంబులగు పదుమూఁ డేండ్లైనపిదపఁ బితృపితామహార్జితమైన నీ రాజ్యమును నీవు మరలఁ బొందెదవు. మనస్సునఁ జింత మానుమని ధర్మజునకు శోకాపనోదనము గావించి యాపింగాంశుజటాధారి నిజాశ్రమమునకు మరలిచనియె.

## దుర్యోధనుండు దుర్వాసునిఁ బాండవులయొద్ద కతిథిగాఁ బంపుట

ఈవృత్తాంతంబు నంతయును జనమేజయుండు సాంతంబుగా విని పాండవుల యవ్వలివృత్తాంతంబుఁ జెప్పుమని వైశంపాయనుని వేఁడఁగా నామునివర్యుం డారాజేంద్రున కిట్లనియె.

పాండవులారణ్యంబునందు భాస్కరప్రసాదలబ్ధ మగు నక్షయాన్నపాత్రమునందలి యన్నముచేతను మృగయాలబ్ధమాంసాదుల చేతను విప్రవర్యులఁ దుష్టిఁ గావించుచుండ వారి కేవిధముననైనను గష్టములు కలిగింపవలయు నను నుద్దేశముతోఁ గర్ణశకునులదుర్మంత్రంబున దుర్యోధనుం డొక్కనాఁడు వారిసుఖవర్తనంబునకుఁ జూపోపక వారి కపాయము సేయసమకట్టి యొద్దియేని యుపాయము నూహించుచుండఁ బరమతపోధనుం డగుదుర్వాసుండు తనపదివేవురశిష్యులతోఁ దుర్యోధనునగరునకు విచ్చేసె. పరమకోపనుం డగు నమ్మునీంద్రున కే పర్యాలోపంచిన నాతం డేమి శపించునో యని సుయోధనుండు సోదర

సహితుండై యామునిసత్తముని భయభక్తులతో సత్కరించుచు నత్యంత
విధేయుండై వర్తించుచుండఁ బ్రీతి గాంచిన యాఋషివర్యుం డచ్చోఁ
గొన్నినాళ్లుండె. అటు లుండు కాలమున నతనిమనస్సున కేమైన పరితాపము
గలుగ నీయక నడుచుచుండఁగా సుయోధనునిమనసు మామునిపుంగవుం
డరయఁగోరి యొకనాఁడు రాజా! మిక్కిలి యాఁకలిగొనియున్నాను.
వేగం బన్నంబుఁ జేయించి పెట్టింపు మని స్నానార్థము పోయి, యతఁడు
మరలి రాకపోయెను. అంతఁ గొంతకాల మతిక్రమించి సుయోధనునిఁ బొడ
గాంచి కౌరవేంద్రా! నా కిప్పు డాఁకలి లేదు. ఆహారంబు వల దని చెప్పి
యదృశ్యుం డగుచు వెంటనే మరలఁ గాన్పించి నన్నును మాశిష్యులను
నాఁకలి బాధించుచున్నది వేగం బన్నంబు నిడు మని తొందరపఱచు.
ఒక్కొకసమయమున నడురాత్రి లేచి యన్నము వండించి మా కాఁకలి
లేదని యాయన్నమున లేనిదోషముల నారోపించి నిందించుచుండుఁ
గాని భుజింపఁడు. ఇట్లు ఋషి యెన్నిపోకలు పోయినను, ధార్తరా
ష్ట్రుండు సూత్రము వికారంబులఁ బొరయకుండుటఁ గని పరమ
ప్రీతుండై వానిం జేరఁబిలిచి కౌరవశ్రేష్ఠా! నీపరిచర్యఁ బరమప్రీతుండ
నైతి. ఇష్టమైనవరముఁ గోరుము. ఒసంగెద. నేను ప్రీతుండ నగుచో
నీ కలభ్యంబైన దొం డుండ నేరదు. అనఁగా సుయోధనుం డీముని
యుగ్రుండు. వీనికోపాగ్నిచే దహింపఁబడక తప్పితిమి గా యనుకొ
నుచుఁ దత్పూర్వమే దనమంత్రులగు శకునికర్ణదుశ్శాసనులతో నాలో
చించియుండుమేరకు దుర్వాసునితో నిట్లనియె. మహాత్మా! నాయదృష్ట
వశంబున నిన్నినాళ్లు నాయింట శిష్యగణంబుతోనుండి నాగృహము
పావనంబు సలిపితిరి. నా కింతియ చాలు. కాని, నా కొక్కకోర్కె
యున్నది, దాని నొసంగ వేఁడెద. సర్వసుగుణాకరుండును గౌరవ
శ్రేష్ఠుండును నగుధర్మజుండు భ్రాతృవర్గముతో భార్యాసమేతుఁడై
యరణ్యమునం దిప్పు డున్నవాఁడు. విప్రవర్గమునకును, తనకును
నన్నపానాదుల నొసంగి ద్రౌపది తానును గుడిచి పరుండియున్నసమయ
మున నాకస్మికముగ మీ రచటికి శిష్యగణంబుతో నతిథులై యేఁగవల
యును. నాపై ననుగ్రహము గల దేని యీవరమును నాకుఁ బ్రసా
దింపవలయు ననఁగా దుర్వాసుం డట్ల చేయుదు నని యొడంబడి
తాను నట కరిగె. అంత దుర్యోధనుండు తన్ను ధన్యుఁగా భావించి

రాధేయుం బిలిచి వానిపైఁ దనచేయి వైచికొని యానందాబ్ధిని మునిఁగి యుండఁ గర్ణుండు దుశ్శాసనాదిసోదరులు వినుచుండ దుర్యోధనునితో ని ట్లనియె. ఇన్నినాళ్లకు మనయభిమతంబు నెఱవేఱె. మనశత్రువు లయిన పాండుపుత్త్రులు దుర్వాసుకోపానలంబున కాహుతులై మ్రందెదరు. పాపాత్ములు తమయొనర్చినపాపములచేతనే కాలుచిచ్చుకటిం బడి రని చెప్పఁగా నాసోదరులందఱును నవ్వుచు సంతుష్టులై తమతమ యిండ్లకుఁ బోయిరి.

అంతట నొక్కనాఁడు దుర్యోధనునివేఁడికోలు కొనసాగించు నిమిత్తము కామ్యకవనంబునఁ బాంచాలి యతిథ్యాదుల కందఱకుఁ గుడువం బెట్టి పతులను భోజనంబులచే సంతుష్టులం జేసి తానును భుజించి పరుండియున్నప్పుడు, దుర్వాసుఁడు తనపదివేవురు శిష్యులతోఁ గూడి యుధిష్ఠిరునకుఁ దోతెంచుటయు, ధర్మాత్ముండు దుర్వాసు నతిథిపూజ్యునిగా నెఱింగినవాఁడు గాన వెంటనే సోదరులతో నెదురేఁగి స్వాగతం బడిగి యర్ఘ్యపాద్యాదులఁ బూజించి యుత్తమాసనంబునఁ గూర్చుండఁబెట్టి యాతనిపాదంబులకుం బ్రణమిల్లి లేచి నిలుచుండి మహాత్మా! శిష్యులతో నీదినంబున మాయింట నాతిథ్యంబుఁ గైకొనవలయు నని ప్రార్థింపఁగా నమ్మునివరుం డందుల కిష్టపడెను. అంత ధర్మజుండు వారి నందఱను గంగకుఁ బోయి యాహ్నికంబులం దీర్చి వేగరమ్మని మనవిచేయుటయు దుర్వాసుం డీవనమధ్యమున నింపఱు శిష్యులతో నుండు తన కీవనవాసి సోపస్కారంబుగా నెట్లాతిథ్యంబు సమకూర్చునో యని సంశయ మించుకేనియుఁ గొనక వల్లె యని శిష్యులతోడ గంగానది కవగాహనార్థమై చని స్నాన మాచరించుచుండె.

### శ్రీకృష్ణుండు ద్రౌపదికిఁ బ్రత్యక్షమై దుర్వాసునివలనిభయ ముడుపుట

ఆసమయంబునఁ బరమపతివ్రత యగు పాంచాలి శిష్యసహితుండైన మునీశ్వరున కెట్టులు భోజనంబుఁ బెట్టుదునా యని వగఁ గూరి తా నంతకు మున్న భుజించుటం జేసి యన్నము సాధింప వేఱుపాయము గానక, యార్తయై యార్తత్రాణపరాయణుం డైన నారాయణుని మనస్సు ధ్యానించి యిట్లని ప్రార్థించె.

"కృష్ణ కృష్ణ మహాబాహో దేవకీనందనావ్యయ,
వాసుదేవ జగన్నాథ ప్రణతార్తి వినాశన.
విశ్వాత్మ న్విశ్వజనక విశ్వహర్తః ప్రభోఽవ్యయ,
ప్రపన్నపాల గోపాల ప్రజాపాల పరాత్పర,
ఆకూతీనాం చ చిత్తీనాం ప్రవర్తక నతాఽస్మి తే.
వరేణ్య వరదానంత అగతీనాం గతిప్రద,
పురాణపురుష ప్రాణమనోవృత్త్యాద్యగోచర.
సర్వాధ్యక్ష పరాధ్యక్ష త్వామహం శరణం గతా,
పాహి మాం కృపయా దేవ శరణాగతవత్సల.
నీలోత్పలదలశ్యామ పద్మగర్భారుణేక్షణ,
పీతాంబరపరీధాన లసత్కౌస్తుభభూషణ,
త్వమాది రంతో భూతానాం త్వమేవ చ పరాయణమ్,
పరాత్పర పరం జ్యోతి ర్విశ్వాత్మా సర్వతోముఖః.
త్వామేవాహుః పరం బీజం నిధానం సర్వసంపదామ్,
త్వయా నాథేన దేవేశ సర్వాపద్భ్యో భయం న హి,
దుశ్శాసనాదహం పూర్వం సభాయాం మోచితా యథా,
తథైవ సంకటాదస్మాన్మాముద్ధర్తు మిహార్హసి."

పూర్వ మాసభలో నోకంసారి! నన్ను దుశ్శాసనుండు సంకట పఱుపఁగా నా కవమానము గలుగ నీయక నిన్ను స్మరించినంతనే రక్షించితివి కాదా మహానుభావా! నీ వీసారియు నీదుర్వాసుని క్రోధానలంబునందుండి నన్నుఁ దప్పింపవే యన భక్తార్తిభంజనుం డగు శ్రీవత్సలాంఛనుండు శయ్యపై నొక్కప్రక్కఁ దనతోఁ బరుండియున్న రుక్మిణి వినా వలకొందుగు మని తటాలున లేచి మనోవేగంబున వనంబునన్న ద్రౌపది కెదుటఁ బ్రత్యక్షగోచరుండయ్యె. అట్లు దర్శనం బొసంగిన పరమమూర్తికిఁ బాండవపత్ని సాష్టాంగప్రణామముల నాచరించి దుర్వాసుండు శిష్యగణంబులతో వచ్చుట యునమ్ముని కాతిథ్యంబు గావింపవలసివచ్చుట యు నింట నుండు సన్నపాత్రంబునఁ గొంత యేని మిగిలియుండక యుండుటయు విన్నవించిన నాయాపద్బాంధవుండు పాంచాలిం జేరి నే నిపుడాఁకలిగొని యున్నాను. ముందు నాయాఁకలిఁ దీర్పుము. పిదప నంతయు

నాలోచింతము. అని చెప్పఁగా భగవద్వచనమునకు మాఱాడ లేక లజ్జిత యైన యాజ్ఞసేని స్వామీ! నే నాహారముగుడుచునంతఁక యన్నపాత్ర మున నన్ను ముండును. ఇది నాకు సూర్యదత్తాన్నపాత్రము ఇం దొక మెతుకైన నిప్పుడు లేదు. నన్ను నీవును బరీక్షించిన నే నేమిసేయుదు? అని కొంకుచు మనవి చేయఁగా వాసుదేవుండు యాజ్ఞసేనితో నమ్మా! ఇది హాస్యమునకు సమయము గాదు. ఆఁకట నేలియున్నాను. అన్నపాత్రంబున నెంతమాత్ర మున్నను దానినా కిడుము. అన్నపాత్రమును దెచ్చి నాకుఁ జూపు మనఁగా నాపుణ్యాంగన వెంటనేపోయి పాత్రశోధనముఁ గావింప నందు మూలనెచ్చటనో యొక మెతుకంటుకొనియున్న, దాని నారగించి, యీశాకగ్రాసంబున విశ్వాత్ముండు ప్రీతిఁ బొందుఁగాక. యజ్ఞభోక్తనగునేను దృప్తిఁబొందితి నని చెప్పి భీమసేనుం బిలిచి గాంగానదికరగాహనార్థమై వెడలినమునిగణంబులను భుజింప వేగ తోడ్తెమ్మని పంపెను. భీముండు వల్లె యని కూరి నాహ్వానింపఁబోయె. అట నాఋషు లఘుమర్షణసూక్తంబులం జెప్పికొనుచు నవగాహనంబుఁ జేయుచుండు వారందఱు కడుపునిండ నాహారము భుజించి త్రేఁపులు పెట్టుచుండినట్లు తోఁప వా రందఱు గంగయందుండి వెలుపలికివచ్చి దుర్వాసునెదుట నిలిచి మునివర్యా! మన మాహారము గుడువన వచ్చెద మని ధర్మజుతోఁ జెప్పి స్నానార్థ మిచ్చోటికి వచ్చితిమి. ఇప్పుడు కంఠదఘ్నముభుజించినట్లు త్రేఁపులు వచ్చుచున్నవి. మన మెంత మాత్ర మాహారము గొనలేము. వృథాపాకము గావింప మంటిమి. ఇఁక మన మేమిచేయఁగలము? అనఁగా వారికి దుర్వాసుం డిట్లనియె వృథా వంటఁజేయించి రాజర్షియైన ధర్మరాజున కపరాధ మొనర్చితిమి. అతండు సామాన్యుండు గాఁడు. మహానీయుండు. మహాతపోవ్రతంబుల నధికతేజోవంతుఁడైన వాఁడు. అతండు తన రూక్షవీక్షణంబుల మనల దగ్ధులఁజేయును. ఎట్లు తప్పించుకొన నగునో! అంబరీషునిబారిఁబడి తొల్లియిట్లే నే నాపదఁ బొందితి. ఇప్పు డామహనీయుఁడు జ్ఞప్తికివచ్చె. భాగవతులవలనిభయము నాకుఁ బెద్దగాఁ దోఁచు. పాండవు లందఱును ధర్మాత్ములు. వాసుదేవభక్తులు. వా రలిగిరేని దూదియగ్నిచే దహింపఁబడినట్లు మనమువారిచే దహింపఁబడి నశింతుము.

కావున మన మిప్పుడు వారికంటఁబడక వారితో నేకారణమును జెప్పక పలాయితులమగుట లెస్స.అని వారికి నాలోచన చెప్పి తా నప్పుడప్పుడు వారును యథాయథలై నలుదెసలకుఁ జనుటకుఁ దోఁచిన స్థలంబులకుఁ గాందిశీకులై పాఱిపోయిరి. భీమసేనుఁడు గంగాతీరమున నున్న మునులం బిలువఁబోయినవాఁడు వారిలో నొక్కనిం గానక, యక్కడనున్న విప్రులను వారిపోఁబడి యడుగఁగా వా రెల్ల రున్నట్లుండి యొక్కటితో పాఱిపోయి రని తెలిసికొని యావృత్తాంతంబు ధర్మజున కెఱింగింపఁగా, ధర్మజుండు దుర్వాసునిమహిమము గుణము నెఱింగినవాఁడు గావున, నామునివరేణ్యుం డే యకాలమున వచ్చునో, యని వెఱచి నిట్టూర్పులు నిగిడించుచుండ వారి కంపఱ కప్పుడు దేవకీనందనుండు భక్తపరాధీనుండు ప్రత్యక్షమై యిట్లనియె. ధర్మనందనా! వృత్తాంతంబు వినుము. మీ కెల్లరకు దుర్వాసునివలన గాఁగలయాపద నెఱింగి పాంచాలి నన్ను స్మరింపఁగా నేను సన్నిహితుండనై మీ వెఱపుఁ దీర్చితి. మీ రాబుషివలనిభయ ముడుగుఁడు. ఆతాపసి మీ తేజంబునకుఁ దాన వెఱచి పలాయితుఁడయ్యె. ధర్మాత్ముల కెన్నఁడును సంకటము గలుగదు. మీకుఁ ద్వారకలో మేలగుఁ గాక! నేను బోయివచ్చెద నని భగవంతుండు వాయువుంబోలె ధర్మజు ననుజ్ఞఁ గొని ద్వారావతికిం జేరె. అంత ధర్మరాజాదులు భగవంతుఁ డగు దేవకీసుతుండు తమ్మును విపత్సముద్రమును సుత్తమనావచేఁ దరింపఁ జేసినందులకు మనస్సున సంతోషించి యాతనిగుణకీర్తనంబులు గావించిరి. మధుసూదను పరమవాత్సల్యమును నవ్యాజప్రేమను దలంచుచు నావనమునఁ గ్రుమ్మరుచుండిరి. దుష్టు లగుధృతరాష్ట్రసుతులు పాండుసుతుల కెన్నిచేటు లొనర్ప యత్నించినను భగవత్కృపాపాత్రులైన వారియెడ నవి యన్నియు సఫలంబులు గాకుండె.

### సైంధవుండు ద్రౌపదిం జూచి మోహించుట

అవ్విధంబునఁ బాండవు లాకామ్యకవనవాసులై కాలముం గడపుచు నొక్కనాఁడు తా మెప్పుడును తృణబిందుం డను మునివరు ననుమతి నొంది యాతనియాశ్రమమునందుఁ బాంచాలి నునిచి యత్తన్వి రక్షణార్థమై తమకులపతి యగు పరమతపస్విని ధౌమ్యుని నియమించి వేఁటకుఁబోయిరి. ఆసమయమున సైంధవుండు సాళ్వరాజకూఁతు

వివాహమాడఁగోరి రాజోచితపరివారముతో నామార్గమునఁ బెక్కుఱు రాజులతోఁ బోవువాఁడు కామ్యకవనముం జొచ్చి పోవుచు నిర్జనంబైన తృణబిందువాశ్రమంబున నొకచో నుటజద్వారంబున నాసనంబున నీల మేఘమును బ్రకాశింపఁజేయు క్రొక్కాఱు మెఱుపువోలెఁ దనశరీర లావణ్యపుంజముచే నవ్వనంబును వెలిఁగించుచుండు పాండవులధర్మపత్ని యగుపాంచాలరాజపుత్త్రిం జూచి దానిరూపరేఖావిలాసంబుల కచ్చెరు వొంది తాను బోవుచున్న తేరు నిలుపంబంచి దుష్టాత్ముఁడగుటం జేసి మన్మథవికారములకు లోనై, దేవిసౌందర్యాతిశయమునకుఁ దనవెంట వచ్చినవా రెల్లరు విస్మయం బంది, యీమె దేవవనితయో, యచ్చరయో యని నానావిధంబుల నాలోచించుచుఁ జేతులు మోడ్చి చూచుచుండఁ దానుమాత్ర మట్లు తలంపక కోటికాస్యుఁ డను మిత్రుండగు రాజకుమారుం బిలిచి యిట్లనియె. రాజకుమారా! ఇత్తరుణీమణి యెవ్వతెయో? చూచితే. దీనిఁ జూడఁగా నాకు మన్మథ వికారంబు పొడముచున్నది. దీనిని వీక్షించినకన్నులకుఁ బెఱవనితలు సొంపు నింపవు. నే సాళ్వరాజు తనయ నొల్ల. ఈశోభనాంగి యెవ్వని కూఁతురో? దీనిం బరిణయమై దీని యం దిష్టోపభోగముల ననుభవించు భాగ్యవంతుం డెవ్వఁడో? దీనియుని కిచే నెచ్చోటు ఖ్యాతి వహించి యున్నదో? అత్తన్వి నన్ను వల చునో? నీవు రథము డిగ్గిపోయి దాని నడిగిరమ్ము. ఆచిగురుఁబోఁడి దద్విష యమును తోడికలయిక నా కొనఁగూడునేని నేఁ గృతార్థుండ నయ్యెద నని వానిని విచారించి రమ్మనుటయు వాఁడును నది రోఁతపని యని యసహ్య పడక యాఁడుబెబ్బులిని సమీపించు నక్కవోలెఁ బాండవధర్మపత్నిని సమీపించి యిట్లనియె. మోహనాంగీ, నీవెవ్వతెవు ? రాత్రిసమయంబున వాయువువీవఁగాఁ జ్వలించునగ్నిజ్వాలవోలెనీకాంతదేహముకనలుచున్నది. ఇట్టిదేహకాంతితో నీకదంబశాఖఁబట్టుకొనియొంటరివై నీవీవిజనారణ్యమున నేల యున్నదానవు? నీవు దేవవనితవో? యక్షాంగనవో? దానవభామినివో? అచ్చరవో? లేక, మాఱురూపుఁగొన్న నాగకన్యకవో? కాకున్న నివ్వనదేవ దేవతవో? విలాసార్థముగ భూలోకంబున జరింపవచ్చిన యింద్రుని దేవివో? యముని రాణివో? కుబేరుని భార్యవో? ధాతృవిధాతృసూర్యకామినులలో నొక్కతెవో? యని యనేకసంశయములు గలుగుచున్నయవి. నిన్నుఁ

బుట్టిన పుణ్యాత్ముం డెవ్వఁడు ? నీచుట్టఱికమున నన్నెక్కినవారలమువా
రెవ్వరు ? నీనామాంతంబైన దివ్యాక్షరంబు లెవ్వి ? యీవనంబున
నేకతం బిట్లుండ నేల ? ఎఱుకపడం జెప్పుము. నీ వడుగకున్నను మావృ
త్తాంతంబును నేను జెప్పెదను వినుము. నేను సురథరాజునకు జనించితిని.
కోటికాస్యుండను పేరుగలవాఁడ. విధ్యుక్తముగ సంస్కృతంబడిన యాగా
మునందు హవిస్సుల నొంది తేజరిల్లు నగ్నివిధమున వెలుగుచుండు నా
బంగారురథముల మెఱయుచుండువాఁడు త్రిగర్తదేశాధిపతి క్షేమంక
రుండనువాఁడు. మఱియును నల్లనిగోఁ గనఁబడుచుండువాఁడు కులింద దేశ
పు రాజు. వికసించియున్న సూనమును జూచునట్లు నిన్ను దూరమునం
డుండి చూచుచున్న యాతరుణాయుష్కుఁ డిక్ష్వాకునృపాలుఁ డగు సుబ
లరాజతనయుండు. ఓసుగాత్రి! అతఁడు శత్రువులఁ బిలుకుమార్చువాఁడు;
అదిగోఁ గనుము. ఎఱ్ఱనిగుఱ్ఱములఁ బూన్చిన పండ్రెండురథములలో సం
గారకుఁడు, కుంజరుఁడు, గుప్తుఁడు, శత్రుంజయుఁడు, సృంజయుఁడు,
సుప్రవృద్ధుఁడు, భయంకరుఁడు, భ్రమరుఁడు, రవి, శూరుఁడు, ప్రతా
పుఁడు, కుహనుఁడు నను పన్నిద్దఱును సౌవీరకుమారులు. మఱియును
సునారువేలరథికులు, వివిధ్వజసికులుం గొలువ నత్యుత్తమరథము
నెక్కి ప్రకాశించువాఁడు సింధుసౌవీరదేశములకుఁ బతి యగు వృద్ధ
క్షత్రకుమారుండగు జయద్రథుండనువాఁడు. వారెల్లరు వానితమ్ములగు
బలాహ, కానీక, విదారణాదు లనువారు. ఇంతయుం దవనింటుదారంగా
వాఁడింపలువిధంబున నుండును నాజయద్రథుండు నన్ను నీవృత్తాంతం
బడిగి రా నంపెను. కాన, నంతయును సవిస్తరంబుగ నీవు నాకెఱిం
గింపు మనఁగా నాపాండవపత్ని పీనవిధము వేఱుగ నున్నది యని
మనంబున యోచించి కదంబశాఖను వదలి పైటు సవరించి వాని
ముఖము నవలోకింపక యిట్లనియె. రాజపుత్త్ర! నిన్ను నే
నెఱుంగుదు. నాబోంట్లు నీతో మాటాడఁ జనదు. ఇప్పుడు నేనొంటరినై
యుండుదాన. ఇట నీకుఁ బ్రత్యుత్తర మొసఁగు పురుషుఁ
డేనియు, నాఁడుదేనియును లేదు. ఇప్పుడు నే నొక్కతెనె యొంటరినై
యుండుదాన. కాన నో సాధువా! నీకు బదులు చెప్పవలసె. అరణ్యం
బున నొంటరినై యున్న కులాంగన నగునేను నీతో నెట్లు మాటలాడు
దును. అయినను విధిలేక నీకు బదులు సెప్పెదను. నీవు సురథునిపుత్త్రుఁడ

నగుకోటికాస్యుఁడవు గదా? ఓశిబివంశోద్భవా, నాబంధువులను, కుశల
మును దెలిపెద. నేను ద్రుపదరాజపుత్త్రిని. జనులు నన్ను గృష్ణయందురు.
ఇంద్రప్రస్థమున రాజ్యమేలుచుండిన పాండురాజతనయు లేవురను
నీవెఱింగియుందువు నేను వారిధర్మపత్నిని. వారిట నన్నొంటరిగ విడచి
నలుదెసలకు వేటకుఁబోయిరి. వారలలో ధర్మరాజు తూర్పు, భీముఁడు
దక్షిణము, సవ్యసాచి పడమర, కవలు ఉత్తరము వేటకుఁబోయియున్నారు.
కొంతవడికి వారిచ్చోటికి రాఁగలరు. అంతదనుక యుండి వారొసంగు
నతిథిసత్కృతుల నందుకొని పొండు. నాపతులు అతిథిసత్కారప్రియులు.
మిమ్ముఁ గని సంతసింతురు. అని చెప్పి వారి కర్ఘ్యపాద్యములఁ గావింపఁ
బర్ణశాలలోపలికిఁ బాంచాలి యేఁగెను. అంత నావృత్తాంతం బంతయు
నెఱింగి కోటికాస్యుండు సైంధవుపాలికిం బోయి యామూలాగ్రం
బుగ నంతయు నెఱింగింప సైంధవుండు వాని కిట్లనియెను. సురథసుతా!
నీవచ్చటినుండి యెట్లు మఱలివచ్చితివో కాని యామనోహరాంగి మోహం
పుంబలుకు లాలించుచుండఁగనే నామనస్సు నే నిలుపఁ జాలకున్న
వాఁడ. దానిం జూచినకన్నుల కన్యకాంతలు రుచింతురే? ఆలా
వణ్యవతి నామనస్సును హరించినది. అది మనుజాంగనయే కదా? ఆ
విషయమున సంశయ మింతపొడముచున్నది. అనఁగా సురథసుతుండు
వృద్ధక్షత్త్రసుతునితో నిట్లనియె. నీ వింతసందియ మేల? ఆయింతి యనఁబడిన
ద్రుపదరాజపుత్త్రి. పాండవులకు ధర్మపత్ని. ఆతొయ్యలిం బటాలునఁ
దోడ్కొని నిజదేశమున కరుగు మనఁగా సైంధవుం డట్లగు నేని దానిం
జూతము రమ్మని సింహాగారముం జొచ్చు తోడేలు చందంబున నాసైంధ
వుండు తనవా రాఱుగురు తనవెంటరా నాపాండవులపర్ణశాలం బ్రవే
శించి యాతొయ్యలితో నిట్లనియె. ఓమోహినీ! నీవును నీభర్తల
కును, నీబంధువులకును గుశలంబె? యనఁగా వానికి ద్రోపది యిట్ల
నియె ఓసింధురాజా! నీరాజ్యమున సప్తాంగములును గుశలంబె
కదా? నీవు దేశములను ధర్మముఁ దప్పక పాలింతువే? నాకును, నా
బంధువులకును, నాపతు లగుపాండవు లేవురకును గుశలంబ. నే నొసం
గునర్ఘ్యపాద్యములఁ గొనుము. ఈయాసనంబున సుఖినై కూర్చుం
డుము. వేటకుఁ బోయియుండు నాపతు లేవురు నిదె వచ్చువారు.
సపరివారుండవయిన నీకుఁ దెల్లవాఱభోజనంబు నిడుదు. పిదప ధర్మజుఁ

డే తెంచి లేళ్లు, కుందేళ్లు, ఎలుగుబంట్లు మున్నగు మృగంబుల మాంస ములతో మిమ్మెల్లర నతిథిసత్కారంబులఁ బూజించు. అనఁగాఁ బాం చాలికి జయద్రథుఁ డిట్లనియె. సుందరి! నీవిన యోక్తులచే మాకాతిథ్యం బొసంగినట్లయ్యె. చాలును. అల్లదె నాదివ్యరథం బున్నది. దాని నెక్కి నావెంట మాపీటికి రమ్ము. నాకు భార్యవై యిష్టభోగంబులం గ్రీడింపుము. రాజ్యభ్రష్టులై గతసంపదులై, దారిద్ర్యము ననుభవిం చుచు, నడవుల నిడుమలఁ గుడుచుచు, శీతవర్షాతపంబులఁ దలఁదాఁచు కొనుటకుఁ గుటీరము లేక పలుపాట్లం బడుచున్న పాండుపుత్త్రుల వెను వెంటఁ దగిలి నీయీజవ్వనంబు నివ్వనంబున వ్యర్థపుచ్చఁదగదు. ప్రాజ్ఞ యైన చక్కని పడతి యెవ్వతె యేనియు విభవచ్యుతుండైనవిభు నను వర్తించునే? భర్త భవ్యుండై సంపదతోఁ దులదూగుచుండునందాక వానియొద్దనుండి సంపద్విహీనుం డయినతఁడ దాసు వేఱొకనిం బొందు. లోకాచార మిట్లున్నను నీవు రాజ్యభ్రష్టులై సిరిఁ బోలంగిన యప్పాం డవుల నింతకాలము సేవించి తప్పుచేసితివి కాదే? ఇది మిక్కిలి వింత. ఇఁకను వారియెడ భక్తిఁ జాలింపుము. వారిని వదలుము. ముని వేషధారులై యున్న పురుషులు మగలైనచో నట్టివారిఁ బూఁబోఁడులు వలతురే. నారాజధానికి రమ్ము. నాకు రాణివై నాతో నభిమతంబు లీడేర సుఖింపుము. సింధుసౌవీరాదిదేశముల నెల్ల నీవ యేలుచుండు మని యప్పాపాత్ముండు తాను బడుపాట్లెఱుఁగక తనభావము నప్పరమ పతివ్రతకుఁ దెలిపె.

## ద్రౌపది సైంధవునితోఁ బరుషములు పలుకుట

అంత నప్పాండవధర్మపత్ని కర్ణకఠోరములగు నాసైంధవుని పలు కుల నాకర్ణించి కటకటంబడి రూక్షవీక్షణములతో వానిఁ జుఱ చుఱం జూచి ఛీ! నీ విట్టిపలుకులు పలుకఁదగదు. లేశమైనను నీకు సిగ్గులేదే యని యన్నిచుం జుఱచుఱఁ జూచుచుఁ దా నున్నచోటు వాని కొంతయెడఁ గలుగ నిలిచి తనభర్తలు వచ్చువఱకు మాటలతోఁ గాలయాపనంబు చేయ నెంచి కటము లదర నిట్లనియె. తెలివిమాలిన వాఁడా! శక్రతుల్యులు, నిజధర్మపరాయణులు, కీర్తిమంతులు, కోప మూర్తులు, మానవాతీతు లగుయక్షరాక్షసాదుల నైనం గెలుచు నంతటిశూరులు నగు నాపతుల నిందించుచున్ననీకు లజ్జ లేదే? యో

గ్యుండగువాఁడు వేదశాస్త్రాదుల నెల్ల నేర్చి నియమతపోవ్రతంబుల నాచరించువారు నగరవాసులైనను వనవాసులైనను బ్రహ్మజ్ఞానులగు పురుషులనుదూఱుదునే? నీచుఁడా! కుక్కలు మొఱిఁగినట్లు నీ పిచ్చిమాటలు తెలియక తలఁగూసెదవు! ఆమహానుభావునకు జెట్టుచేసి నాశనంబునకు బడనున్నని న్నుఁ గడతేర్ప నీవెంటవచ్చిన యీ రాజులలో నొక్కండైనను సమర్థుండు గాఁడు. శూరుండవని మదించి ధర్మజుని గెలుతునని గర్వపుమాటలాడు నీవు హిమవత్ప్రాంతమున సంచరించు మదించిన యేనుఁగును గఱ్ఱతోఁ గొట్టినవానివలె నున్నాఁడవు. నిద్ర కనలిన భీమునిఁ జూచుట గుహలోఁ బఱుండియున్న సింహపుఁగంటిఱెప్పవెంట్రుకలను గ్రహింప నుద్యమించువానిగతివంటి దని యెఱుంగుము. ఆ సంగ్రామశూరుని నెదిరి వానికాలిక్రిందఁ బడనున్నావు గదా? నీ యిప్పటి విజృంభణముల మఱుంగుదువు. అతిరథులలో మేటి యగునర్జునుని నిరోధించి వానితోఁ బోర సమకట్టుట కొండగుహలో సుఖనిద్రం జెందుచున్న మృగరాజును బాదములతోఁ దన్న యత్నించుటే యని తెలియుము. నకులసహదేవులు క్రూరవిషసర్పములవంటివారు. నీయీదురహంకారపుఁబలుకుల కట్టి క్రోధమూర్తులతో విగ్రహించి వారిచేఁ బోటులం బడి యలఁగునప్పుడ కదా నీకుఁ దెలియఁగలదు. వినాశకాలమునను వెదురును నరఁటిమ్రాఁకును వృశ్చికమును ఫలవంత మగునట్లు లోకనిందితులగు వారిచే రక్షితనగు నన్నుఁ గోరుట నీచేటునకే కదా యని తూలనాడిన పాంచాలపుత్త్రికి వృద్ధక్షత్త్రపుత్త్రుం డిట్లనియె. పాంచాలీ! పాండవుల నెఱుంగుమే మెఱుంగనిదియే! ఈ వెఱ్ఱిమాటల నిలుపుము. లోకప్రశస్తములైన పదునేడుక్షత్త్రియకులములలో నుత్తమకులసంజాతుల మని మ మ్మెఱుంగుదే! మేము సంధి, విగ్రహ, యాన, ఆసన, ద్వైధీభావ, సమాశ్రయము లను నాఱుగుణంబుల నధికులము. పాండవులు వాని నెఱుంగరు. కావున నీ వెఱ్ఱిమాటలఁ జాలించి గుఱ్ఱమును గాని, యేనుంగును గాని యెక్కి పేరోలగంబున నావెంట రమ్ము. వట్టిమాటలతోఁ గాలయాపనము సేయకుము. మే మందులకు వెఱచి నిన్ను విడిచి పోవువారము కాము. అని చెప్పఁగా ద్రౌపది మఱియుఁ గోపముతో వాని కిట్లనియె. ఓరీ క్షత్త్రియాధమా! మహాశూరు లగుపాండవుల రాణినైన నేను దుర్బల వోలె నీకు స్వాధీనురాల నగుదునే? నీవు తెంప

రివై కొనిపోవునెడలఁ గృష్ణుసారథికంబును, నర్జునరథికంబును నైన
తేరు మనమార్గమున నిన్నుఁ దఱుముచు వచ్చి దవానలంబువలె దహింం
పదే? లోకోత్తరు లగుపురుషులసాయము గలనన్నుఁ బాకశాసనుండైన
నపహరించికొని పోఁగలఁడే? అట్టుండ సామాన్యమానవుఁడ వైన
నీవా న న్నపహరించికొనిపోవువాఁడవు! శూరు లగుశత్రురాజుల
గుండెలు జల్లు మన దేవదత్తమును బూరించి యెండకాలమున నరణ్యా
మునఁ దనంతటఁ బుట్టిన కార్చిచ్చు చక్కఁగా నెండినగడ్డిపోచలను
దహించువిధమున నీసైన్యముఁ బొదివి పిడుగువంటి గాండీవజ్యారావ
ముచేభూనభోంతరాళము బీఁటలువాఱున ట్లొనర్చి,యల్లెత్రాటిని సారించి
పుంఖానుపుంఖములుగ వాడితూపులఁ బరగించుచుండునప్పుడు కదా
యాసవ్యసాచిం గనుంగొని నీయిప్పటికాఱుకూఁత లాడినందులకు నిన్ను
నిందించుకొనెదవు. ఆపరాక్రమశాలి నారసంబులు నీమేను చించి చెండా
డుచుండ నప్పుడు నీ వేమయ్యెదవో? కాలయముని కాలదండంబుంబోని
గదను బూనియున్న భీమసేనునిగదాప్రహారంబుల నీసైన్య మెల్ల నుగ్గు
నూచమై విధ్వస్తం బగుచుండ నీ వేమగుదువో? ఆశీవిషంబులైన నార
సంబులఁ జిత్తజల్లు కురిసినతీరున నీసైన్యమును గవలు నలుదెసలం బొదివి
యురవడించు సమయమునఁగదా నీవు పశ్చాత్తాపంబుఁ బొందువాఁడవు.
మఱియు శత్రుభయంకరుండును, దానవా టవీదవానలుండును నగు
జనార్దనుండును యదువృష్ణి కేకయాదులును నన్నుఁ గొంపోవునీమార్గము
నంటి రాఁగా, నీచుఁడా! వారిముందు నీ వెంతమానిసివి? మీఁద రాను
న్నచేటును నీవు దలపోసిన ట్లగపడదు. మహనీయు లగునాభర్తలగు
పాండవులను దప్ప నే నితరుల నేకాలమునం గోరను! నాపాతివ్రత్యమహి
మంబున నిన్ను నామగలు సచ్చినకుక్కను లాగినట్లు నేలఁ ద్రోసి లాగు
నప్పుడు చూడఁగలవాఁడను. కావున నేనుగా నిన్ను వరింతునే? దుష్టాత్మా!
నన్ను నీవపహరించికొనిపోయినను శూరు లగునాపతు లేవురును నీవెంట
నంటివచ్చి నిన్ను నిగ్రహించి నన్నీపర్ణశాలకు మఱలఁదోడ్కొని తేఁగల'
రని చెప్పుచుండ సైంధవువెంట వచ్చినవారు దురాగతులై తన్నుఁ
బట్టఁ బూనుటయు నప్పుణ్యాంగన యందులకు భీతిల్లి, 'తులువలారా!

నన్నంటకుఁడు. ముట్టకుఁ డని చెప్పుచు గట్టిగా నెలుంగెత్తి తమపురో
ధసుండైన ధౌమ్యునకు వినఁబడునట్లుగా మొఱపెట్టెను.

సైంధవుండు బలాత్కారముగ ద్రౌపది నెత్తికొనిపోవుట

ఆమునీంద్రుండు ద్రౌపదికంఠస్వరమును విని సమీపించునంతలోఁ
గష్టాత్ముం డగు సైంధవుండు రానున్నహాని నాలోచింపక పాంచాలిపైట
చెఱంగుఁబట్టి లాగుటయు వెంటనే ద్రౌపది మిక్కిలికోపోద్రేకంబున నద
లించి వానిం ద్రోచిపుచ్చఁగా వాఁడు మొదలంట నఱికిన చెట్టువోలె
నేలఁబడియు వెంటనే లేచి యాపుణ్యసతిని దనబాహువులు రెంటితోఁ
గదుర నెత్తికొని పలాయితుఁడయ్యె. పరవశ యగు నాపాండవధర్మపత్ని
తాఁ జేయునది లేక వెన్నంటి యఱచుచు నాక్రోశించుచు వచ్చుచున్న
ధౌమ్యునకు మ్రొక్కుచుండ, సైంధవుం డొకతేరిపై ద్రౌపదిని బలాత్కా
రంబున నుంచికొనిపోయె. ఇంతలో ధౌమ్యుఁడును నారథమును సమీ
పించి సైంధవా! ఇది యేటిపని? పరస్త్రీని బలాత్కరించి కొనిపోవుట
ధర్మమా? దానిసతుల నిర్జించికదా యీపాపమునకు నీ వొడిగట్టవలెను?
ఈ కార్యము నీకుఁ దగదు. పూర్వరాజులధర్మము నాలోచింపుము.
పాండవు లిదె వచ్చి చుట్టుముట్టిరేని యీపాపకర్మఫలము నవశ్యము
నీవు గుడుతువు. ఇందు సందియములేదు. అని యాక్రోశించుచుఁ బదాతి
సమూహమధ్యమున ధౌమ్యుండు ద్రౌపది యున్న రథము వెంటఁ బరు
విడుచుఁ బోవుచుండె.

అటఁ బాండవు లేవురు వేఁటయం దనేకమృగముల వధించి,
యందఱొక్కచోఁ గుమి గూడి యాశ్రమమువైపునకుఁ దఱలుట
కుద్యమించుచుండఁగా ధర్మజునకుఁ గొన్నిదుశ్శకునములు దోఁచె.
మృగములును బక్షులును సూర్యునివైపునకుఁ దిరిగి ఘోరారావంబులు
నేయం దొడంగె. ఆధ్వనులు దుఃఖసూచకములై యుండె. అంత ధర్మ
జుం డాలోచించి తమ్ములకిట్లనియె. మనశత్రువు లెవ్వరో కామ్యక
ములోని మనయాశ్రమమున కుపద్రవ మేమైనను గావించుచున్నట్లు
తోఁచుచున్నది. ఇఁక వేఁట చాలించి యాశ్రమమునకు మఱలుదము.
మనస్సు మిగులఁ గలఁతఁజెందినది. బుద్ధి యేకాగ్రత నొందక యుఱ్ఱూట
లూగుచున్నది. శరీరమునఁ బ్రాణములు స్థైర్యము దప్పుచున్నవి. గరు

డుండు సర్పములఁ దన్నుకొనిపోయిన కొలనిమాడ్కియు, రాజు లేని రాజ్యముపగిది, త్రాగుబోతులు మద్యము పానముచేసిన కడవఁ బోలియు, కామ్యకవనము శాంత మైనట్లు తోఁచుచున్నది' యనిచెప్పుచు వేగంబున రథాశ్వంబుల నదలించి యాశ్రమద్వారంబున కతిరయంబునఁ జేరిరి. అప్పుడు వారు దాపట నక్క కూఁత విని, 'ఆహా! శత్రువు లెవ్వరో మనకు హాని నెద్దానినైన నొనర్చి యుండవలయు నని తలంచెదము. కాకున్న నిన్ని దుశ్శకునములకుఁ గారణ మేమి?' అని పలుకుచు నాశ్రమంబు సొచ్చుటయు నందుఁ బాంచాలి గానరాదయ్యె. దాది కూఁతురు ధాత్రేయిక యాశ్రమంబునఁ బడి పొరలుచు నేడ్చుచుండుటను సారథి యింద్రసేనుండు విని, 'యమ్మా! ఏమి యేడ్చుచున్నావు! దైన్యము దోఁప నీమొగ మేల వాడియున్నది? పాండవుల వెలుపలి ప్రాణమైన పుణ్యాంగన యగు ద్రౌపది కేయపాయము నెవరును జేయరుగా? ధర్మజుమనస్సు తహతహపడినదాని నాలోచింప నప్పరమపతివ్రత పాతాళంబుఁ జొచ్చినను, దానిం దివమునకుఁ గొంపోయినను సాగరంబుననున్నను బాండవులు జాడ తీసి తే నేర్తురని నే నెఱుంగుదు. వారి కేవురకును బాంచాలి బహిఃప్రాణము. సాటి లేని రత్నమువంటిది. ఆకోమలికి హాని చేసినవాఁడు తప్పక యమపురి కతిథియగు. మనరాజశేఖరులు లోకోత్తరులగుశూరులు. అపరాజితులు. కష్టముల ననుభవించినయతి శాంతిపరులు. వీరిట్టివా రని యెఱుంగక యేమూఢుండు ద్రౌపది కపకృతిఁ దలంచెనో వాఁడు హతుఁడు. కావున ద్రౌపదియెట్లు వచ్చునా! యను శోకంపఁ జనదు. శత్రువును వధించి ద్రౌపదినిప్పుడే తోడ్తెత్తురు. జరిగిన వృత్తాంతం బంతయు నామూలాగ్రముగ నెఱింగింపు' మన ధాత్రేయిక వాని కిట్లనియె. ఇంద్రసమాను లగుపాండవులను సరకుచేయక జయద్రథుం డాక్రోశించుచుండు పాంచాలినెత్తికొనిపోయె. నేనేమి చెప్పుదు? ఇవె వానిమనుష్యులజాడ లింకనుసమాయ లేదు. వాఁ డెత్తుకొని వేగముగఁ బోవుచుండఁగా నావాయువ్యమునను విఱిగి క్రిందఁబడిన చెట్లకొమ్మల లోనియాకు లింకను వాడ లేదు. ఇప్పటికి బహుదూరము పోయియుండరు. సమీపముననే పాంచాలిం గొనిపోవుచున్న తేరు పోవుచుండును. అందఱును గవచముల ధరించి, మేలైనయాయుధములఁ బూని సమరమునకు సమకట్టి, యిప్పుడే జాగుసేయక వారి వెన్నంటి పోవలయును.

సైంధవుని బెదరించియు, వెఱపుపుట్టుమాటలాడియు, ధిక్కరించియుఁ జేయునది లేక వానిచేఁజిక్కి వెలవెలపోయినమోముతో నుబ్బిటలూఁగు చిత్తంబుతో నాదుష్టునకు విధి లేక వశంగతి కాక మునుపే మీరు గది యవలయు. ఆలస్యమగుచో నాపతివ్రతావర్తనంబు భస్మాహుతిచంద మునను, ప్రేతభూమియందుఁ బడినపూలదండమాడ్కి, నధ్వర్యు లేమఱి యుండ యాగశాల ప్రవేశించి కుక్క తాఁకినపురోడాశంబుపగిదియుఁ గాఱడవిలో వేటకు బోయి నక్క గలంచిన తామరపువ్వులతో నుండు కొలఁకు విధమునను నాపవిత్రయగుద్రౌపది తిరస్కృత యగు. కావున నాలస్యముఁ జేయక యీయడుగులను శోధించి దీనిజాడ మీఁదుగా నేఁగితిరేని దాపుననే పోవుచుండువారిని నదలించి యుద్ధమున వారిసైన్య ముచు దొడరఁగలరు. అని చెప్పఁగా నాయుధిష్ఠిరుండు మాయెదుట నిట్టిమాట లాడవలదు. ఎట్టివారైనను నొక్కొకవేళ మోసపోవుచుం దురు. ఇందుల కింతవగ వేల? సైంధవునిం దలపడి ద్రౌపదిం దప్పకతెత్తుము. ఊరడిల్లుము. అని దాని నూరార్చి తమ్ములతో, 'నర్జునా! ఆలసింపరాదు. వేగంబ వెడలి వారిసైన్యమును జుట్టుముట్టవలయు'నని వచించె.

### పాండవులు సైంధవుపై నెత్తిపోవుట

అంతఁ బాండవు లేవురును నాగుఁబాములవలె రోఁజుచు నల్లెత్రాటిని సవరించుకొనుచు సైంధవుఁడు సేనాసమేతముగఁ బోయిన జాడల ననుసరించి కొంతదూర మేఁగఁగా సామజాశ్వరథపదాతిపద ఘట్టనంబుల రేఁగినధూళిని గాంచి యతివేగంబునఁ బాఱుచుఁ, గాల్బలముమధ్యమం దాక్రోశించుచుఁ బోవుచున్న ధౌమ్యుం జూచి మీర లింకఁ దిన్నగ రం డని వచించి యామిషంబుఁ గాంచినడేగలం బోలె నాసైన్యమధ్యంబున రథోపరిస్థితయైన యాజ్ఞసేని, సైంధవుతో నుండుటం గాంచి క్రోధాగ్ని పెల్లు రేఁగ, నాఖండలవిక్రమముగల యప్పాండురాజపుత్త్రు లరిగణంబులచెవులు బీటలువాఱఁ బెద్ద యెలుంగున నిలుఁడు నిలుం డని యాజయద్రథుం జేరిరి. ఆపెల్లఱపులకు సైంధవు సేనాముఖమున నున్ననాయకు లదరిపడి భీమార్జునులం జూచి ఘోరముగానఱచిరి. సైంధవుండు దానును వివిధధ్వజములతోడి పాండవులరథములం జూచి వెలవెలపాఱినమొగంబుతో ద్రౌపదిం బిలిచి యిట్ల

ఢియె. పాంచాలీ వేగంబున వచ్చుచున్నయైదురథములలో నున్నవారు నీపతు లగుపాండవులు కారా? వారినిఁ డెక్కెములచిన్నెలతో నేర్పఱచి వివరించి యెవరెవ రేయేరథములలో నున్నవారో చెప్పఁ గలవా? అనఁగా నందులకు ద్రౌపది యిట్లనియె. 'తెలివిమాలిన పందా! నామగ లైదుగురుం గదిసిరి. వారితోడఁ బోరాటము సమకూడు నేని నీసైన్యమున నొక్కఁడు నైనను బ్రదికి మఱల నూరికి పోనేర్చునే? ఆసాహసు లగు ధానుష్కులను వేర్వేఱ యెఱింగినఁ బ్రయోజన మేమి? నీ కంత్యకాలము డగ్గఱుటచే నీదుష్కార్యం బాచరించితివి. చావ నున్న నీ వడిగినదానిం జెప్పుట ధర్మంబు గావునఁ జెప్పెద వినుము. తమ్ములతోఁ గూడి యావచ్చుచున్న తపస్సంపన్నుండును ధార్మికుండును నగు ధర్మజునిఁ బోడఁ గాంచఁగనే నాకు నీవలని వెఱపు తొలఁగి చనియె ఎవనిధ్వజాగ్రమునందు నందోపనందము లను రెండు మృదంగములు మధురముగ మ్రోగుచున్నవో, యెవండు స్వధర్మార్థముల నిర్ణయము నెఱిఁగినవాఁడని బుద్ధిమంతు లగు జను లెవని ననుసరింతురో, యేపురుషుని కాయము బంగారువలె స్వచ్ఛవర్ణము గలదో, యేమహాసుభ్రూవినాసిక యున్నతమై విరాజిల్లునో, యెవని దేహము సన్ననిదో యేపుణ్యమూర్తినేత్రములు విశాలములై వెలయుచున్నవో, యమ్మహానీయుని ధర్మమూర్తి యగు కురుశ్రేష్ఠుఁ డగు పాండవాగ్రజుంగా నెఱుంగుము. ఆతఁడే నాపతి యని యెఱుంగుము. ఆధర్మాత్ముండు శరణాగతుం డగుశత్రువును దనప్రాణముల నొసఁగియైనను రక్షించువాఁడు. ఇంతట నైనను నోమూఢుఁడా! నీవు నీశస్త్రాస్త్రముల నవలఁ బెట్టి ప్రాంజలివై యాపుణ్యపురుషు వేగ నాశ్రయించి బ్రదుకుము. అల్లదిగో నాజానేయంబు లగునుత్తమాశ్వములఁ బూన్చినరథమునందు బొమలు ముడిపడ నపుడు గఱచుచు నుగ్రమూర్తియై మహాబలుండై వెలయుచున్నవాఁడు వృకోదరుండు. ఆమహాభుజుం డమానుష కార్యముల నొనర్చువాఁడు. అరాతులను వెఱచఱచిపాఱునట్లు భీమకర్మములఁ జేయుఁ గాన నాతండు భీముఁ డనఁబరఁగు. ఆవీరున కపకృతిఁ గావించినవారు ప్రాణములను గోల్పోవక నిలువరు. ఎప్పుడును వైరము నాతఁడు మఱువ నేరఁడు. పగకుఁ బ్రతీకారమొనర్చియే పిమ్మట శాంతిఁ బొందు. ఆవిలుకాండ్రమేటియు, ధైర్యశా

లియుఁ, గీర్తిమంతుఁడును, జితేంద్రియుఁడును, బెద్దల నెల్లప్పుడు సేవించు వాఁడును, యుధిష్ఠిరునకుఁ దమ్ముండును శిష్యుండును నైన ధనంజయుఁడు నాపతి. కామమువలనఁగాని భయమువలనఁగాని లోభమువలనఁగాని యెప్పుడును ధర్మమును వదలనివాఁడును, దుష్కర్మములను మనస్సునం దైన నేకాలమునందును దలంపనివాఁడును, సకలధర్మార్థములనిర్ణయముల నెఱిఁగి తత్ప్రకారమనుష్ఠించువాఁడును, భయార్తులఁ బ్రోచువాఁడును, నతిభీకరుండును, నగ్నిసమానతేజస్కుండును, నాయతభుజుండునగు నర్జునుండు. అదిగో చూడుమా సుందరాకారుండగు నకులుని. ఆవిలాసవంతుండు కత్తిఁ జేతఁ బూని చిత్రగతులఁ బగతుఱఁ జెండాడ నేర్పుగలవాఁడు. ఆధీమంతునిఁ దక్కినసోదరులు ప్రాణములకంటె నెక్కువగాఁ జూతురు. సూర్యచంద్రాదులవంటి తేజస్సుగలవాఁడయి యల్లదె కాన్పించువాఁడు సహదేవుఁడు. ఈతండు పాండవులందఱిలోఁ జిన్నవాఁడు. అస్త్రవిద్యయందు నిపుణుండు, వీరుఁడు, ధీమంతుండు ననబరగు. అరిమర్దనుండు. పెద్దలసభలలోనైనను ధర్మాధర్మములు సెప్పఁగల నిపుణుండు. క్షత్రధర్మనిరతుండు. మాయత్త కుంతీదేవి యాతనిఁ దనప్రాణములకంటె నెక్కుడుగా నరయుచుఁ గాపాడును. ఆధార్మికుం డగ్నిం జొచ్చును. అసువుల నైనఁ దొఱఁగుఁగాని ధర్మవిరుద్ధముగఁ బలుకఁడు. నాభర్తలగు పాండవులనుగూర్చి వేర్వేఱ నీకు నుడివితి. మూఢుండవై వారి కపకృతిఁ గావించితివి. ఆమహాశూరులు నీసైన్యముం దలపడి సమర మారంభింతురేని నీయావత్సైన్యమును గడలి నడుమ మొసలిచేఁ బొరలింపఁబడి మునిఁగిన రత్నభరితం బైననావవలె నశించుట కిఁక సంశయము లేదు. కడతేఱకుండునుపాయం బూహించుకొనుము. వారిబారిం బడి యసువులఁ బోఁగొట్టుకొనక తప్పించుకొనుదు వేని యది నీకుఁ బునర్జన్మప్రాప్తి యగు' ననుచున్నంతనే పాండవులు సైంధవుసైన్యముఁ జుట్టుముట్టిరి.

అయిదుగురింద్రులకు సమాను లగు నాపాండుపుత్త్రులైదుగురం జూచుచునే సైంధవసేనలోని కాలరులు భీతిల్లి వారికిఁ గేలు మోడ్చి నిలుచుటయు నాపోటుమగలు వారికిహాని యెంతమాత్రమును గలిగింపక వారిని మీఱి శత్రుసైన్యమధ్యముం బ్రవేశించి నలుదెసలఁ గురియించిన శరపరంపరలచే నాకసంబు మేఘావృతమై చీఁకట్లు గ్రమ్మిన

ట్టిరయ్యె. అంత సైంధవుండు కినిసి పలాయితు లగుచున్న తనసైనికులను బిలిచి నిలువుండు, కొట్టుఁడు, తొలఁగక పొడువుఁ డని పేరెలుంగెత్తి పిలువఁగా నంతటను ప్రోత్సాహభరితులై యిరువాగుల భయంకరమైన పెల్లార్పు లాకసంబును ఏఁటలువారించె. బెబ్బులులవంటి యాపాండవుల నెదిరించి పోరాడి వారిచేఁ గొట్టువడి సైంధవుసైనికులు నివ్వెఱపోయిరి. అప్పుడు భీముఁడు బంగారుగదఁ జేతఁ బూని సైంధవుని సమీపించి యుద్ధమునకు సమకట్టుటయుఁ గోటికాస్యుం డడ్డపడి పెనంగఁ బోడంగె. వానికిఁ బెక్కండ్రు రథికవర్యులు సాయపడి వాయునందనునిపై శక్తితోమరభిండిపాలాద్యాయుధంబులఁ బైపై వైచిన నా శూరుండు వానికి బెదరక స్థైర్యమున నెదుర్కొని సేనాముఖమున నిలిచి యొకయేనుంగును మావటివానితోను, బదునలుగురు పదాతులను వధించె. అర్జునుఁడు ద్రౌపదీసహిత మగు సైంధవురథము నా సేనలో నెమకుచుండఁ దన కడ్డమువచ్చిన పదునైదుగురు మహారథుల యమపురి కతిథులం జేసె. ధర్మరాజు సౌవీరకుమారుల నూర్వురను గాలుపురికిఁ బనిచె. నకులుండు ఖడ్గపాణియై రథమునందుండి నేలకు దిగి బీజములను వెదచల్లుపగిది బాణపరంపరల నేసి పదాతిసమూహము రూపుమాయించె. సహదేవుం డేనుఁగుపై నుండి పోరాడువారిని దలపడి వారిని దమగజములపై నుండి క్రిందికిఁ బడునట్లు కొట్టె. ఆసమయమునఁ ద్రిగర్తరాజు యుధిష్ఠిరు నెదుర్కొని యాతని తేరునకుఁ గట్టియున్న గుఱ్ఱములఁ జావమోది పైకిఁ గుప్పింప ధర్మజుండు వాని ఱొమ్మును గత్తితోఁ బొడుచుటయు వాఁడు నెత్తురు గ్రక్కుచు భూమిపయిం బడి యీల్గె. అంత ధర్మతనయుండు రథ్యములు లేని తన రథమును సారథి యగునింద్రసేనుతో డిగి నకులరథారోహణంబుఁ గావించె. అంత క్షేమంకరుం డనువాఁడును మహాముఖుం డనువాఁడును గూడి యిరువురు నిరుపార్శ్వంబుల నకులుం దాఁకిరి. వారు చిత్తజల్లుమాడ్కి నంపవాన గురియింప మాద్రిపుత్త్రుం డందులకుఁ దలంకక వారి నెదుర్కొని ఘోరంబుగాఁ బోరి హతులం జేసె. అప్పుడు త్రిగర్తాధిపతి యగుసురథుండు గొప్పయేనుంగు నెక్కి నకులు విహ్వలుం జేయఁగా నాగజముయొక్క తాఁకుడునను నకులురథము విఱిగి తునుకలగుటయు నందులకు భీతిల్లక యమ్మాద్రేయుండు నేలపై కుఱికి

కృపాణపాణియై గిరిచాఱ్పునఁ జలింపక నిలుపఁబడఁగా నాసురథుండు గజ
మును దానిపైకిఁ దఱుముటయు నంత వాఁడు తనచేతికృపాణంబుతోఁ
దానితొండమును నఱుకఁగానే యాశుండాలంబు ఘీంకారంబు ఘోరం
బుగాఁ జేసి మడిసె. అంత నకులుండు భీమునిరథము నెక్కె. భీమునిఁ
దాఁకిన కోటికాస్యుఁడు నిజసారథి భీముగదాభిఘాతంబునఁ దలఁద్రెవ్వఁ
బడఁగా దనరథ్యంబులు సారథి లేకుండుటచే రథంబును నలు దెసలకు
లాగుచుండ వాఁడు ప్రాణంబులఁ దప్పించుకొని పలాయితుం డయ్యె.
సవ్యసాచిని మార్కొన్న సౌవీరకుమారులు పన్నిద్దఱితో నాతండు
పోరాడి వారి ననేకబాణంబుల నివ్వెఱపోవునట్లు గొట్టి వారిచేతులలోని
విండ్లనారులం ద్రెంపి విండుల విఱిచి వారితలలఁ దఱిగి సేనామధ్యం
బున నెటుచూచిన దానయై నానాప్రకారంబుల శౌర్యత్వముం జూపుచు
నిక్ష్వాకుశిబిత్రిగర్తసైంధవ వీరులఁ జంపి మందరనగంబు పాలకడలిని
మాడ్కి నాసేనను జిందరవందఱలు సేయుచుండ, విఱిగినవిండ్లును,
దునిసినధ్వజములును, దుత్తుమురైన తేరులును, యమసదనంబుఁ జొచ్చిన
యేనుంగులును, గూలిన గుఱ్ఱములును, దెగినతలలును, మోటు
వడినకాలరుల మొండెంబులును నిండి యుద్ధరంగము బీభత్సంబై యుండ
నెటుసూచిన గ్రద్దలు మాంసఖండములతోను వాయసంబులును నక్క
లును రక్తపానంబులతోను సంతృప్తంబులై భీకరరవంబులఁ గావించు
చుండె.

### సైంధవుఁడు ద్రౌపదిం దిగవిడిచి పలాయితుఁ డగుట

అవ్విధంబునఁ దనసేనయందు నాయకులును శూరులును నైన
వారనేకులు హతులగుటం జూచి చేయునది లేక సైంధవుండు ద్రౌపదిని
రథమునుండి దిగవిడిచి ప్రాణములం గాపాడుకొనునిమిత్తము రణ
రంగమునఁ దేరి నుండనీయక తోలుకొని తొలఁగి పలాయితుండయ్యె.
అంత ధర్మరాజు ధౌమ్యసహిత యైనద్రౌపదిం దనతో సహదేవు
తే రెక్కించుకొనియె. సైంధవుం డట్లు పాఱిపోవుట నర్జునుండు చూచి,
వానిసైన్యమధ్యమునఁ బెక్కుఱతో యుద్ధము చేయు ననేకుల వధించు
చున్నవాయుసూనుం బిలిచి యిట్లనియె. భీమసేనా, సైంధవుండు
ద్రౌపదిం దిగవిడిచి రణరంగమునుండి యెచ్చోటికో పాఱిపోయె.
ఈ తుక్కుమూకలఁ జెండాడినఁ బ్రయోజనం బేమి? ఆదీను లగుననదల

నొంపకుము. నా వెంట రండు. సైంధవు వెన్నంటి పట్టుకొని వానికిఁ జేయ వలసినశిక్షఁ జేయుదము రమ్ము. అనఁగా భీముండు సమరంబు నిలిపి ధర్మజు మొగంబై 'రాజశ్రేష్ఠా! వైరివీరులు వధింపఁబడిరి. యుద్ధమును జాలిం తము. నీవు ద్రౌపదిం దోడ్కొని ధౌమ్యనకులసహదేవులు నీకు సహా యులు కాఁగా నాశ్రమంబునకుఁ జనుము. తులువచే నపహృతయై వెక్క లిపడుమలంబడినకృష్ణ నుపలాలింపుము. నేనును నర్జునుండును రయంబునఁ జని యప్పాపాత్ము సైంధవుని వెన్నంటిపఱచి వాఁడు రసాతలంబుఁ జొచ్చి, పాతాళంబునఁ బాములలోని మఱువునొచ్చినను, శక్రుని సారథిగాఁగొని వచ్చినను వాని నెట్టకేలకుఁ జుట్టుముట్టి రట్టున మట్టుపఱచివచ్చెదము. మాచేఁ జిక్కి వాఁడు ప్రాణములతో నుండఁగలఁడే? యని చెప్పఁగా విని, ధర్మజుండు భీమసేనా! ఆపాపాత్ముం డెట్టికట్టిడియైనను వాని వధింప వలదు. దుశ్శలను గాంధారీదేవినిం జూచి వానియెడఁ గరుణింపవలయు. అని తన సహజభూతదయాళుత్వముఁ దోఁప భీముతోఁ జెప్పెను. అప్పుడు పాం చాలి కోపించి భీమార్జునులం జేరఁ బిలిచి యాపాపిపయిఁ గరుణఁ జూపుట దగునే? ఆపురుషాధముని వధించి తీరవలయును. ఆయపశదుని, బరమపా పిని దుర్మతిని గులపాంసనునిఁ గనికరించువారు గలరే? భార్యాపహారిని, రాజ్యము నపహరించినవానిని బరమశత్రు వని భావించి వాఁడు చేఁ జిక్కినప్పుడు యుద్ధభూమియందుఁ బ్రాణాతురుండై దైన్యముఁ జూపి నను వానిని వధింపక విడువ రాదని చెప్పె. అంత యుధిష్ఠిరుండు ద్రౌపదీ సమేతుండై ధౌమ్యమాద్రేయులు వెంట రా నాశ్రమమును జేరె. అప్పు డచ్చోటి కంతకు మున్న వచ్చియున్న మార్కండేయాది ఋషి వర్యులతోఁ దమయిక్కట్టుల నన్నిటినా పుణ్యపురుషుండు నుడివె. ద్రౌప దియు నాశ్రమాభ్యంతరప్రదేశముఁ జొచ్చి సమయోచితకర్తవ్య నిమ గ్నయై యుండె. ధర్మజు సెలవుఁ గొనిపోయిన భీమార్జును లొకరథమునఁ దామే సారథ్యముం జేసికొనుచు నొక్కక్రోసెడుదూరంబున వేగ గమనముతో నున్న సైంధవురథమును వీక్షించి యం దప్పాపాత్ముం డుం డుటం గాంచిరి. అప్పుడు బీభత్సుండు తనగాండివమున దూరపాత ములగుశరంబులం దొడిగి సైంధవురథ్యములవేగంబుఁ దగ్గఁగా, మఱి శరంబులఁ బ్రయోగించి యశ్వములం జంపె. అంత సైంధవుండు నిజా

శ్వములు హతంబు లగుటచే, నింకను సవ్యసాచి సేయు నమానుష
కార్యంబులం దలపోసి భయకంపితాంగుండై దిక్కు లేక తేరు డిగి కాల్న
డకఁ బాఱిపోయె. అంత నర్జునుండు వాని వదలక పిఱుందన తానును
జనుచు "ఓరీ! రాజాధమా! ఇంతటిపిఱికిపంద వైన నీవు పరస్త్రీ నెట్లు
గోరితివి? నీవారి నెల్ల వదలి శత్రువులు నిన్ను వెన్నంటి తఱుముచుండ
నీవిట్లు పాఱుట మగఁటిమియే? నీకు సిగ్గు లేదే? తగ దిప్పట్టున నీకిప్పా
టనుచున్నను వెఱపున నతఁడు తెంపరియై పఱచుచుండె. అంత మారుతి
వాని నదల్చుచు రథము డిగ్గి పఱచి వాని సమీపించి సిగఁబట్టుకొని
పైకెత్తి నేలఁ గుదియ వేయుటయు వాఁడు మోఁకాళ్ల బైకెత్తి వెల్లకిలఁ
బడఁగా వానిశిరమును దన్ని ముంజేతులు మోఁకాళ్లు పిక్కలు నేక
ముగా ముడిచిగట్టి మరలఁ గాలితో తలఁ దన్నఁగా వాఁడు మూర్ఛ
వోయె. అప్పు డర్జునుండు భీమునితో "దుశ్శలాగాంధారీదేవుల ప్రీతిగా
వానిం జంప వల దని ధర్మజునాజ్ఞ యున్నది. ఆయాజ్ఞను రక్షింపవల
యును. చంపవలదు. వలదు. ఇద్దురాత్ముండు తాన నశించు" అనఁగా భీముఁడు
వీనిఁ జంపను, గాని విడువ. పరమసాధ్వి యగుపాంచాలి నవమానిం
చిన యాక్రూరాత్ముఁ జంపక వదలరాదు. ధర్మరాజున కందఱియెడ కారు
ణికత్వము గలదు. నీవును దెలివి లేక యాతనిమతమును నవలంబింతువు.
ఈప్రవర్తనము మమ్ము బాధించుచున్నది. అని తుట్టతుదకు వధించుట
మాని చేత నొక్కయర్ధచంద్రబాణ మూని వానితల నైదుపాయలుగఁ
గొఱిగి వాని వికృతరూపుం గావించి వానితో నిట్లనియె. ఓదురాత్మా!
నీవిఁక బ్రదుకఁ గోరుదు వేని సర్వసభలయందును "నేను బాండవ
దాసుఁడ" నని చెప్పికొనుము. ఇందు కియ్యకొందు వేని నిన్నుఁ బ్రాణ
ములతోడ వదలుదు. యుద్ధమునం దోడిన నీ కిది విధి యనఁగా వాఁడు
భీముండు తన్నెక్కడ వధించునోయని భీతుండై యట్లనుట కొప్పుకొనియె.
అంత ధూళిధూసరితదేహుం డైన సైంధవుని భీముండు తేరిపై నిడికొని
యర్జునుఁడు తమతోఁ గూడ రాఁగా నాశ్రమమున కేతెంచి విరూపముతో
నుండు సైంధవుని ధర్మజునకుఁ జూప నయ్యజాతశత్రుండీపాపాత్ముఁడు పాండ
వదాసుం డయ్యె నని పాంచాలికిఁ జెప్పుమని చెప్పి 'భీమసేనా! నామాట
యందు నీకు గౌరవముండు నేని వీని నిఁక విడిచిపుచ్చు'మని కరుణతోఁ జెప్పఁ

పాంచాలియు వానివికృతరూపముంజూచి వీఁడు నిక్కువముగఁ బాండవ దాసుండేని విడువల కష్టం బనఁగా భీముండు వాని విడిచిపుచ్చె. అంత నాసైంధవుండు విపణ్ణుండై ధర్మజునకు నచ్చోటివిప్రులకు మ్రొక్కి నిలిచి యుండ నయ్యుధిష్ఠిరుండు వానిఁ జేరఁ బిలిచి యిట్లనియె. సైంధవా! ఇఁకనైన నిట్టిదుష్కార్యముల నొనర్పకుము. దీన నిన్ను లోకులు నిందిం తురు. ఇంతటి పాపకార్యములను నీవు దప్ప వేఱొక నీచపురుషుండు చేయునే? ఇఁక నైన బుద్ధిఁ దెచ్చుకొని ధర్మమార్గమున వర్తిల్లుము. అధర్మమున కొడిఁగట్టకుము. నీకు దాస్యవిమోచనము గావించితిమి. యుద్ధమునఁ జావఁగా మిగిలిన సైన్యంబుతో నూరికిఁ బొమ్మని సెలవొసం గఁగా నాసురాత్ముండు దేమియును ననక సిగ్గున వంచినతలయెత్తక యేఁగెను.

## సైంధవుం డీశ్వరునిఁ గూర్చి తపస్సు చేయుట

అంత సైంధవుండు గంగాద్వారంబున కేఁగి యం దుమాపతిం గూర్చి ఘోరతపస్సుఁ జేయఁగా నాదేవదేవుండు వానితపంబునకు మెచ్చి ప్రత్యక్షుండై వరములు గోరుమనఁగా నావృషభధ్వజుదర్శనమునకు మనంబున సంతసిల్లి సైంధవుం డిట్లని యడిగె. పాండవు లేవురును యుద్ధ మున నాచేఁ బరాజితు లగుదురుగాక యనికోరెను. అట్లువరము నడుగ నామహాదేవుండు,పినాకపాణి వాని కిట్లనియె. ఓరీ,వారలు నీ కవధ్యులు. నీవు వారల గెలువ లేవు. అయిన నీతపస్సునకుఁ బ్రీతిగా వారలలో నలు వుర యుద్ధభూమియందు నొక్కనాఁడు నిలువరింప శక్తి నీకొసంగితి. అర్జునునిమాత్రము నీవెదిరింపను లేవు. వానిని దేవతలు సైతము గెలువఁ జాలరు. నేను వానికి నిరుపమానములగు నస్త్రములను బెక్కింటి నిచ్చి యున్నాఁడ. వేయేల? నాఘోరాస్త్రమగుపాశుపతము నొసంగితి. దాన వాఁడు లోకముల నెల్ల బూది గావింపఁజాలు. లోకపాలు రెల్లరును వానికిఁ దమతమదివ్యాస్త్రంబుల నొసంగిరి. అంతే కాక యతండు పూర్వ జన్మమునందు బదరీవనమునందు బహువర్షములు నారాయణర్షితోఁ దపంబుఁ గావించిన నరుండనుమహర్షి వర్యుండు. నారాయణునిమహిమను నుతించుటకు నేనును జాలను. ఆతండు దేవదేవుండు. అనంతాత్ముండు. విష్ణువు. సురగురుఁడు. లోకములకుఁ బ్రభువు. ప్రధానపురుషుండు అవ్య క్తుండు. విశ్వాత్మ విశ్వమూర్తి యుగాంతము సమీపింపఁగా లోకము

లను గాలాగ్నినై దహించువాఁడు. పర్వతములతో నానారణ్యములతోను నిండియున్న యీభూమిని బాతాళమును నాగలోకమును నంతటిని దహింపఁగలవాఁడు. మఱియును బ్రళయకాలమప్పటిసంవర్తమేఘాకారముం దాల్చి యంతట భూనభోంతరాళంబు లేకధారగా ననేకదినములు వర్షించి యీప్రపంచమునంతటి నేకార్ణవంబుగఁ జేయువాఁడు. అంతటఁ బృథివియందెవ్వరికిని నిలువ మెరక లేకుండఁగాఁదానుమాత్రము సహస్రఫణములతో వెలయు ననంతునిపైఁ బవ్వళించి యోగనిద్ర పూని యుండు. అప్పుడు సర్వమును నిశ్చేష్టితమైయుండు. సూర్యుండు వెలుంగనేరఁడు. చంద్రుండు కాంతిమంతుండు గాఁడు. రిక్కలు కాంతిహీనత నొందు. నాల్గుయుగములును వేయిపర్యాయము లావర్తములు కాఁగా బృథ్వి యీతీరున నీటఁ దేలియాడును. అప్పుడు నారాయణుఁ డనుపేరు గల దేవదేవుండు, సహస్రాక్షుండు, సహస్రపాదుండు, సహస్రశీర్షుండు నగు పురుషుండు సత్త్వోద్రేకమున మేల్కాంచి చరాచరాత్మకం బగు నానావిధజంతుజాలశూన్యంబైన యీజగముంజూచి క్రమ్మఱ సృష్టిచేయు తలంపు గొనుచుండఁగనే యామహనీయు నాభికమలమునంపుండి పితామహుండు నాల్గుమోముల దేవుండై పొడమి యయ్యాదిదేవుననుమతిం గొని సృష్టిని బ్రారంభింపఁ బూని మరీచ్యాదిమానసపుత్త్రులం బుట్టించె. వారు సర్వభూతములను స్థావరజంగమము లగువానిని బుట్టించిరి. యక్షులును రాక్షసులును పిశాచములును నురగములును వారిచే సృజింపఁబడిరి. ఆమహాత్ముండు బ్రహ్మయై చరా చరంబుల సృజించు. పురుషమూర్తియై యన్నిటి రక్షించును. రుద్రమూర్తియై యన్నిటిని లయింపఁజేయు. ఇట్లు త్రిమూర్తిస్వరూపుఁడయిన శ్రీమన్నారాయణునకు మూఁడవస్థలు గలవు. వింతయైన కర్మ లొనర్చు నామహావిష్ణువు యొక్క మహిమలను సకల వేదములను, వేదాంగములను నెఱిఁగిన తపస్వులగు మునీంద్రులు కొనియాడుచుండఁగా, నోసింధుపతీ నీవు విన్నదిలేదా? ఈప్రపంచమెల్లఁ బ్రళయంబున జలమయంబయి, యొక యాకాశమున శ్రీమన్నారాయణుండు వర్షర్తువునందు మిణుఁగురుబూచివోలె మినుకుమినుకుమని సంచరించుచు నీటమునిఁగి యున్న భూమి నుద్ధరింప నుపాయం బూహించి, నే నేరూపం

బున నెత్తి భూమి నుద్ధరింతు నని తలంచినవాఁడై వేదములందుఁ జెప్పఁ బడినదియుఁ, బది యోజనములు విస్తీర్ణంబయినదియు, శతయోజనాయతంబైనదియు, గొప్ప మేఘధ్వనివంటి రవముగలదియు, మహాపర్వతసమానంబును నొక్కకొమ్ముతో వెలయునట్టిదియు నగుమహాద్భుతమైన మహావరాహరూప మొక్కటి దాల్చితనయొంటికొమ్మున భూమి నుద్ధరించె. అప్పుడీపృథ్వి స్వస్థానంబుఁ జేరి నీటఁజొచ్చె మఱియు నద్దేవునకు హిరణ్యకశిపుం డను దానవుండు శత్రువై యాపరమేశ్వరునియునికి సంశయించి సభామంటపస్తంభంబును బ్రేయుటయు నావ్రేటున లోకభయంకరాకారం బగు నృసింహరూపముతో నాపరంధాముం డావిర్భవించి యారక్కసుతోఁబోరాడి వానిఁ దనదొడలపై నిడికొని వక్షస్థలంబుఁ దనగోళ్లం బీల్చి లోకములకు వానివలనిభయంబుఁ బోఁగొట్టె. మఱియు నావైకుంఠుండు జగత్సంరక్షణార్థమై కశ్యపుండను బుషికిఁ బుత్త్రుండై యదితిగర్భంబున వేయివత్సరంబులువసించి యంతఁ బుట్టి వామనుఁడను నామంబుతో దండకమండలువులఁ బూని, జడలు దాల్చి, జన్నిదంబు ధరించి, బ్రహ్మచారియై యింద్రశత్రు వగు బలిని సమీపించి వానియజ్ఞశాలకు బృహస్పతితోడ్పాటునఁ బోయి, తనవిద్యానైపుణ్యంబున నాతని మెప్పించి ప్రీతుండైన యాబలిని మూఁడడుగులు భూమిని వేఁడఁగా నాదాత "ఒసంగితిఁ గొనుము" అనఁ దాను శరీరముఁ బెంచి భూనభోంతరాళంబు లాక్రమించి బలిసమస్తైశ్వర్యంబులం గొని యింద్రున కొసంగె. ఆపరాత్పరుండె యిపుడు దుష్టనిగ్రహశిష్టపరిపాలనములకును ధర్మసంస్థాపనంబునకును, యదుకులమునందు వసుదేవునకు దేవకీగర్భమునఁ గుమారుండై పుట్టి శ్రీకృష్ణనామంబున వెలయుచున్నవాఁడు. వానిచరిత్రం బందఱుఁ గీర్తింతురు. అట్టిశ్రీకృష్ణుం డర్జునునకు సారథియై వచ్చినచో వారిఁ బోర నెదిరించి జీవితుఁడై పోఁ గలవా రుందురే? కావున నర్జునునిఁ దక్కఁ దక్కిన నలువురు పాండవులను వారిసైన్యమును యుద్ధమునం దొకదినముమాత్రము నీవు నిలువరింపఁగలవు. ఈవరము నీ కొసంగితి నని మహాదేవుండు సైంధవు ననుగ్రహించి నిజపార్షదగణంబులతో నదృశ్యుం డయ్యె. అంత నా సైంధవుండును దపంబుఁ జాలించి నిజపురంబునకుఁ బోయెను. అంతటఁ బాండవులు కామ్య

కవనంబునందు మిగిలిన కాలము నెట్లు గడపి రని జనమేజయుం డడుగ
నారాజశేఖరునకు మునిశేఖరుం డైన వైశంపాయనుం డిట్లు వినిపింపఁ
దొడంగె.

మార్కండేయుండు ధర్మజునకు రామాయణకథఁ జెప్పుంబుఁజుట

ఆప్రకారంబు పాండవులు సైంధవుం బరిభవించి ద్రౌపదిని దమయాశ్రమంబునకుఁ దోడ్తెచ్చిపపంపడి ధర్మరాజు విప్రులతో నిష్టా గోష్ఠి సలుపుచుండ నంతకుమునుపే కామ్యకవనంబునకు మఱల విచ్చేసి యున్న మార్కండేయుం జూచి మునిశ్రేష్ఠా! నీవు దేవర్షిసమానుం డవు. నీకు భూతభవిష్యద్వర్తమానంబులు గోచరించు. నామనసున్నన నుండు సంశయమును జెప్పెద. దానికి సమాధానంబుఁ జెప్పి నన్నుఁ గరుణింపవే యని వేఁడుచు నిట్లనియె. ఈ మాధర్మపత్నియగు ద్రౌపది యయోనిజ. యజ్ఞవేదిం బుట్టినది. చంద్రవంశమునఁ బ్రశస్తిఁ గాంచిన పాండురాజునకుఁ గోడలై ప్రసిద్ధి గాంచినది. ఇప్పుడు దురాత్ముండైన సైంధవునిచేఁ నపహృతయై మాచే విడిపింపఁబడి మఱల నాశ్రమంబునకుఁ దోడి తేఁబడినది. ఈతన్వి పరమసాధ్వి. పరిశుద్ధురాలిని స్త్రీయానృతం బులు స్పృశింపవు గదా? అట్లుండ నామూఢుండు దీనిఁ గొనిపోవు టెట్లు తటస్థించె? పాంచాలి పుణ్యాత్మురాలు. పాపకార్యములను మన స్సున నైనఁ దలంపదు. బ్రాహ్మణసేవ యెల్లపుడు చేయుచుండు. అట్టిపతి వ్రతను మూఢబుద్ధి యగు జయద్రథుఁడు బలాత్కారంబున హరించె వీని నన్నింటిని బరిశీలింపఁగాఁ బ్రాణుల శుభాశుభకర్మములయనుభవము నకు దైవమే కారణ మని యూహింతు. శుభాశుభఫలములను ప్రాణు లనుభవించితీరవలయును. కాలగతిని దప్పించుకొనుట కెరికిని సాధ్యము కాదు. మాధర్మపత్నిని వాఁ డపహరించికొని పోవుటంజేసి మేము సక లబాధలఁబడి వానితోఁ బోరాడి వానిని బరిభవించి మఱల మాధర్మ పత్నియగు ద్రౌపదిని దెచ్చితిమి. తలవనితలంపుగా మా కీయవస్థ వాటిల్లె. రాజ్యభ్రష్టులమైతిమి. బంధుల నెడఁబాసితిమి. వనవాసము ఘటిల్లినది. వన్యమృగముల హింసించియే బ్రదుకవలసినది విధి యయ్యెఁగా యని చింతించుచుండ నిపుడు హతాత్మున, దారాపహరణరూప మగు నింద కుం బాల్పడితిమి. ప్రపంచమున నెప్పుడైనను నిట్టి దురవస్థలకుఁ బాల్పడి వేగినమనుజుం డింకొకం డుండునే? అట్టివాని మీరు గంటిరే? యని

విష్ణ్వాదివృత్తాంతంబుతో నడుగ ధర్మజునకు మార్కండేయుం డిట్లనియె. ధర్మనందనా ! జీవులు కర్మాధీనముగ సుఖదుఃఖముల ననుభవించు చుందురు. పూర్వకాలమున నయోధ్యాధిపతి యగు దశరథుం డను రాజునకుమారుండును, మహాబుద్ధిమంతుండును, నీతిమంతుండును, బ్రాజ్ఞుండును, శత్రునిబర్హణుండును నగు శ్రీరాముండు తండ్రియానతి మెయిఁ గాననంబుల నివసించుచుండఁగా వానిభార్యయగు జానకిని రావణుండను నసురుండు మోసముచే నపహరించుకొని పోవుచుండ మార్గమధ్యమున దశరథుని చెలికాఁ డగు జటాయు వను గృధ్రరాజు వాని కడ్డము పోఁగా నారాక్షసుండు వానిం జంపి జానకిని లంకకుఁ గొనిపోయె. అంతట శ్రీరాముండు సుగ్రీవుం డనువానర రాజుతోఁ జెలిమి గావించుకొని వానిసాయమున వానరబలముం గూర్చికొని సముద్రమునకు సేతువుం గట్టి లంకయందు సేనతో విడిసి రావణునితో సుద్ధండప్రచండపోరు సలిపి వాని సంహరించి మరల భార్యయైన జానకిం దోడ్తెచ్చె ననఁగా విని ధర్మజుండు శ్రీరాముఁ డేకులము వాఁడు ? వానివీర్య మెట్టిది ? శ్రీరామునివిక్రమ మెట్టిది ? రావణుఁ డేకులమునఁ బుట్టినవాఁడు ? వాఁ డెవనికొడుకు ? రావణునకు శ్రీరామునితోఁ బగకుఁ గారణం బేమి ? ఇది యెల్ల నాకుఁ దేటపడం జెప్పవే యని వేడఁగా మార్కండేయుండు శ్రీరామచరిత నిట్లు రాజర్షివర్యునకుఁ జెప్పం దొడంగె. లోకప్రసిద్ధంబైన సూర్యవంశంబునం దిక్ష్వాకు కులమునం దజుఁ డనురాజునకు దశరథుం డనువాఁడు పుట్టి యన్ని విధంబులఁ బ్రఖ్యాతిఁ గాంచె. ఆరాజు కౌసల్య, కైకేయి, సుమిత్ర, యను మువ్వురు సుందరాంగులను వివాహమాడె. వారిలోఁ గౌసల్యకు, శ్రీరాముండును, కైకేయికి భరతుండును, సుమిత్రకు, లక్ష్మణశత్రుఘ్నులను కవలును క్రమంబునఁ బుత్రులుగ జన్మించిరి. వారు దినదిన ప్రవర్ధమానులై కులోచితవిద్యల నేర్చి ధర్మార్థవిదు లని పేరుఁ వడసిరి. ఆ శ్రీరామునకు మిథిలాదేశాధిపతి జనకరాజపుత్రి జానకి యను శుభాంగి భార్యయై వెలసె. ఇట్లు సీతారాముల జన్మవృత్తాంతంబును జెప్పితిని. ఇఁక రాక్షసరా జగురావణుండు పుట్టినతెఱంగు నుడివెద. వినుము. బ్రహ్మదేవునకు మానసపుత్రు లనేకు లున్నారు. వారిలో

బులస్త్యుం డనువాఁ డొకండు తక్కినవారివలెనే నియతవ్రతుండై, తపం బాచరించి యశస్సుఁ బొందె. వానికి గోవునందు వైశ్రవణుం డను కుమారుండు గలిగె. ఆ వైశ్రవణుండు పెద్దవాఁడై తండ్రిని వదలి వనంబులకుఁ జని తాత యగు పరమేష్ఠింగూర్చి తపం బాచరింప నాపితామహుండు మనుమనిఘోరతపస్సునకు మెచ్చి వాని కమరత్వమును, ధనేశ్వరత్వమును, లోకపాలత్వమును, శంభునితోఁ జెలిమియును, లంకాధిపత్యమును, గామగమనంబైన పుష్పకవిమానంబును, యక్షేశత్వమును, రాజరాజను పేరును, నలకూబరుం డనుసుందరాకారుండగు పుత్రుని నొసఁగెను. పులస్త్యుండు తనపుత్రుండు తన్ను వదలె నని కుపితుండై తనశరీరార్ధమునందు విశ్రవసుం డనుపేరుగలవానిం బుట్టించి యావైశ్రవణుం డను తొల్లింటి పుత్రునకుఁ గీడొనర్పంబంపె. వైశ్రవణుండు తండ్రిదయ సంపాదింప యత్నించి యావిశ్రవసునకు మిక్కిలి సుందరాంగులును శృంగారవతులును జతురలును నగు రాక్షసాంగనలఁ బుష్పోత్కట, రాక, మాలిని యనుముగ్వుర పరిచారికలను బంపి వారి పాటలచేతను నాటలచేతను విశ్రవసుని మెప్పించె. అంత నాముగ్వురయందు విశ్రవసుండు ప్రీతుండై వారికి లోకపాలురతో బలపరాక్రమములందు దుల్యులైన తేజోవంతులగు పుత్రులఁ గనున ట్లనుగ్రహించె. ఆతనిప్రసాదంబునఁ బుష్పోత్కటకు రావణకుంభకర్ణులు పుత్రులై జనించిరి. రాకకు ఖరుఁ డనుకుమారుండును శూర్పణఖ యనుకుమార్తెయును బుట్టిరి. మాలినికి విభీషణుం డను సత్త్వగుణసంపన్నుఁడగు సుతుండు గలిగె. వారిలో రావణుండు వీర్యబలపరాక్రమసంపన్నుండై రాక్షసాధిపత్యమును బొందె. కుంభకర్ణుండు బహుమాయలను నేర్చి, యుద్ధములయందు భీషణోద్యమములం జూపుచు నపరరుద్రుఁడో యనఁ బ్రశస్తిఁజెంది, మహాబలుం డయ్యె. విభీషణుండు సౌందర్యవంతుండును ధర్మాచరణపరాయణుండును సాత్త్వికగుణప్రధానుండును నై వెలసె. ఖరుఁడు ధనుర్విద్య నభ్యసించి ఖలుండై విప్రులతో ద్వేషముం బూని వారినిఁ బలుబాధలఁ బెట్టందొడంగె. శూర్పణఖ ఘోరాకృతిం దాల్చి యాశ్రమవాసులైన వ్రతులగు తపస్వులజపతపోనుష్ఠానములకు హానిఁ జేయుచుండె.

## బ్రహ్మ రావణకుంభకర్ణవిభీషణులకు వరంబు లొసంగుట

అంత రావణకుంభకర్ణవిభీషణులు వేదాధ్యయనం బొనర్చి గొప్ప వ్రతముల నాచరించి గంధమాదనంబునం దమతండ్రితో వసించుచుండిరి. అంత నొక్కనాఁడు, గుహ్యకయక్షపరివృతుఁడయి తండ్రి యగువిశ్రవస్సువెంబడి నాసీనుండై నసంపన్ను వైశ్రవణుం జూచి సహింపనోపక మనంబున నీసు పొడమ వారు బ్రహ్మదేవుం గూర్చి ఘోరతపంబులు సలిపిరి. రావణుండు పంచాగ్నిమధ్యమునం దొక్కపాదంబుపై నిలుచుండి వాయువునే భక్షించుచు వేయివత్సరంబులు తదేకనిష్ఠతోఁ దపం బొనర్చెను. కుంభకర్ణుఁడు నియతాహారుండై నియమవ్రతముం బూని నేలఁ బరుండుచు ఘోరతపం బొనర్చెను. విభీషణుండు ప్రతిదినమును జెట్టునుండి రాలిన యొకయాకు మాత్రము భక్షించుచు నుపవాసమందే యాసక్తుండై పితామహుఁగూర్చి తీవ్రతపస్సుఁ జేసె. రాక్షసులువారు నీతీరునఁ దీవ్రతపంబు లొనర్చుచుండ వీరికి ఖరుఁడును శూర్పణఖయును సేవ లొనర్చుచు నుగ్రతపంబు గావించుచుండిరి. అంత వేయిసంవత్సరము లుగ్రతపం బొనర్చి రావణుండు తనతలలఁ దఱిగి యీశ్వరప్రీతిగా నగ్నియందు హోమముఁ జేసెను. అంత బ్రహ్మదేవుండు వారికిఁ బ్రీతుండై వారిసమీపమున కేతెంచి వారితో నిట్లనియె. ఓతపస్విలారా! మీతపములకు మెచ్చితి. వరము లడుగుఁడు. అమరత్వమును దప్ప మఱి యెద్ది గోరినను నొసంగెద నని చెప్పి వారిలో రావణుం జూచి యిట్లనియె. ఓతాపసోత్తమా! నీవు తఱిగి వేల్చినతలలు యథాప్రకారంబున నీకుఁబుట్టఁగలవు. నీవు కోరిన రూపుం దాల్తువు. అరుల గెల్తువు. ఇంకను నీ కేమి వరము గావలయునో యడుగు మనఁగా వాఁ డిట్లనియె. నేను దేవతలచేతఁగాని యక్ష రాక్షస గరుడ గంధర్వ విద్యాధర పన్నగాదులచేతఁ గాని యవధ్యుఁడ నగునట్లు వరము వేఁడెద ననఁగా మనుష్యునిచేఁ దప్ప నితరులచే నీవవధ్యుఁడ వని వరం బొసంగె. అంత వాఁ డందులకు మిక్కిలి సంతసించి బలాఢ్యుఁడగు తన్ను మనుష్యు లేమి చేయఁగల రని మదించి వారిని సరకు సేయకుండె. తర్వాతఁ గుంభకర్ణుని వరము వేఁడు మని బ్రహ్మ యడుగఁగా వాఁడు తమోగుణావృతమనస్కుఁడై యెప్పుడు నిదురపోవుచుండవలయు నని కోరఁగా బ్రహ్మ యట్లె యనెను. అంత

పితామహుండు విభీషణునిc బలుమారు వరములు వేఁడు మనెను. వాఁ డంతఁ దన కెంతయాపత్కాలము సంభవించినను తనమనస్సు ధర్మమునందే వర్తిల్లవలయు ననియు బ్రహ్మాస్త్రము తాను నేరకయే తనకుc బ్రయోగోపసంహారములతోడc దోcచునట్లును వేఁడెను. అందులకుc బితామహుండు పరమప్రీతుండై వానికోరినవరముల నొసంగి వానిని గారవించి వాని కిట్లనియె. విభీషణా! రాక్షసగర్భజాతుండవైనను నీ కధర్మమువొంత బుద్ధి చొరకుండిన నీ ధార్మికచిత్తమునకు మెచ్చితి. కావున నీ కమరత్వమునైత నొసంగితి నని చెప్పి యంతర్హితుఁడయ్యె. అంత వరగర్వితుం డైనరావణుండు లంకాధిపతి యగు కుబేరునిపై దండెత్తి వానిని లంకనుండి వెడల నడిచి వానిలంకారాజ్యమునకుc దాను బ్రభువై వానిదైనకామగంబగు పుష్పకవిమానమును నాదికొనcగాc గుబేరుండు రావణుం జూచి యిట్లనియె. రావణా! నేను నీకు గురుఁడను. నన్నవమానించితివి గాన నీకు వేగంబ కీడు మూడుc గాక! పుష్పకంబు నీకు వాహనముగ నుపయోగింపక నిన్నుc జంపువానికి వాహనమై వెలయుc గాక! యని శపించి తన్నుc బరివేష్టించి యుండు యక్షరాక్షసగంధర్వకిన్నరకింపురుషవిద్యాధరులతో గంధమాదనమునకుం బోయె. ధార్మికుం డగువిభీషణుండు కుబేరునివెంటc జనుటంజేసి కుబేరుండు వానియెడల సంప్రీతుండై వానికి సకలయక్షరాక్షససేనలకు సేనానాయకత్వ మొసంగె. అంత రావణుండు పేరోలగంబునc దాను లంకారాజ్యమున కభిషిక్తుండై దేవతలకును రాక్షసులకును భూసురులకును నుపద్రవంబులc జేయుచు వారిధనకనకవస్తువాహనములం గొనుచు వర్తించుచుండె. ఈవిధమున వాఁడు సకలలోకములవారిని నేడిపించుటంజేసి వానికి రావణుం డను పేరు ప్రఖ్యాతంబయ్యె. వాఁడు కామబలుc డై వేల్పులకు భీతిగలిగించెను. వాఁడు గావించుబాధల నోర్వcజాలక బ్రహ్మర్షులును, రాజర్షులును, సిద్ధులును నగ్నిహోత్రు మున్నిడుకొని బ్రహ్మపాలికింబోయి ప్రణమిల్లి శరణు గోరిరి. అప్పుడు బ్రహ్మతో నగ్నిదేవుం డిట్లనియె. పరమేష్ఠీ, దేవదేవా! భవద్వరగర్వితుండై దశముఖుండు దేవదానవయక్షగంధర్వాదులచే నవధ్యుం డయి లోకములోని సాధువులను సిలుగులc బెట్టుచున్నాఁడు. వాని బాధ కోర్వలేక యుపాయంబు వేఁడునిమిత్తము దేవా! నిన్ను మహా

నీయు లందఱు శరణుచొచ్చిరి. వీరిని, లోకములను వానియిడుముల
నుండి తప్పింపవే! యనఁగా వారికి లోకపితామహుం డిట్లనియె. వానిని
దేవతలును రాక్షసులును నెవరును వధింపలేరు. వానివధార్థము శ్రీ
మన్నారాయణుండు నేను బ్రార్థింపఁగా మానుషుఁడై జన్మించియున్న
వాఁడు. ఆయవతారపురుషుండు వానిం బిలుకుమార్చు. అనిసెప్పి యిం
ద్రుం బిలిచి పితామహుండు వెండియు నిట్లనియె. మనుష్యుఁడై యవ
తరించియుండు విష్ణుదేవునకు రావణువధార్థమప్పుడు సహాయపడు నిమిత్త
ముగ దేవత లగుమీరు మీమీయంశములతో నెలుఁగుబంటులందును
గోఁతులందును సంతానములఁ గనుఁడని యాజ్ఞ నొనర్చెను. అంతఁ బర
మేష్ఠి దుందుభి యనుగంధర్వాంగనను బిలిచి నీవు దేవతల కార్యమును
నెఱవేర్చునిమిత్తము మనుష్యాంగనవై జన్మింపుమనఁగా నది కుబ్జరూపం
బున మానవాంగనయై పుట్టి మంథర యనుపేరితోఁ బిలువఁబడుచుండె.
ఇంద్రాది దేవతలును పితామహునానతి చొప్పున వానరాదులందుఁ దమ
తమ యంశములయందుఁ బుత్త్రోత్పాదనంబుఁ గావింప నా వానరులు
తమజననంబులకు హేతుభూతులగు దేవతలగుణబలములు గలవారై
నానావిధయుద్ధముల నొనర్చుటకు శక్తి గలవారై వనములయందును,
వృక్షములకొమ్మలపైని పర్వతశిఖరంబులమీఁదను గ్రుమ్మరుచుండిరి. మంథ
రయు దశరథునిభార్య యగు కైకేయి యంతఃపురదాసియై యాసుంద
రాంగికి శ్రీరామునియెడ ద్వేషంబు జనించునట్లు దైవప్రేరణంబున దుర్బో
ధంబు లొనర్చుచుండె. అని మార్కండేయుండు ధర్మరాజుతోఁ జెప్పఁగా
నృపాలవర్యుం డమ్మునివర్యుని శ్రీరాముండు సీతాలక్ష్మణులతో నడవుల
నుండుటకుఁ గారణం బేమని యడుగ నా తాపసశ్రేష్ఠుం డీవిధమున
నానతిచ్చె.

### కైకేయి దశరథుని వరములఁ గోరుట

దశరథుండు తనకుమారులు నల్వురును వేదవేదాంగములను,
ధనుర్విద్యయును నభ్యసించి తగినకన్యలను వివాహమాడి సుఖమున
నుండుటం జూచి సంతసించుచుండఁ దాను వృద్ధుం డగుటయుఁ, దన
పుత్త్రులలోఁ జ్యేష్ఠుఁడగు శ్రీరాముండు ప్రజానురంజకముగా వర్తించు
చుండుటయు నాలోచించి ధర్మముల నెఱింగిన తనమంత్రిపురోహితులఁ
జేరం బిలిచి వారితో నిట్లనియె. నేను బహుకాలంబు జీవించుటం జేసి

కడు వృద్ధుండ నైతి. నా జ్యేష్ఠపుత్త్రుండును సకలగుణాభిరాముండును నగు శ్రీరామునకు యౌవరాజ్యపట్టాభిషేకము గావింప నుత్సహించి యున్నాఁడ. ఈదినము రాత్రి పుష్యయోగమున సుముహూర్తము. కావున నా శుభసమయమున వానిని యువరాజుం జేసెద. దానికి వలయు సర్వసంభారములం గూర్పుఁడు. ఈసంతోషవార్తను శ్రీరామునకుం దెలుపుఁడు అని సెలవిచ్చెను. నగరునం దంతట నీ శుభవార్త నందఱు నానందాబ్ధి మునుఁగఁగా మంథరమాత్ర మీవార్తసహింపనిదై తన చెలియును దశరథునకుఁ బ్రియభార్యయును నగు కైకేయిని సమీపించి యాదేవితో నిట్లనియె. ఓ రాజపుత్త్రీ! విను మొకదుర్వార్తను రా జీదినంబు వెల్లడించె. దానం జేసి నీదౌర్భాగ్యము ప్రకటితమైనది. కంటివా! ఆ ముసలి రాజు సర్పమువలె నెంతటిక్రోధము నీయెడఁ వహించియున్నాఁడో! నీచెంతఁ జేరినపురుషమాత్ర మతిప్రీతిని నీయెడఁ జూపుచుఁ గార్యమునందుఁ దనకుఁ గౌసల్యయందుండు విశేషప్రీతి నెట్లు బహిరంగపఱచెనో! నామాటలను గమనించి యాలకింపుము. ఈనాఁటి కీదుర్వార్త విన వలసినదాన వైతివి. కౌసల్యాగర్భమునందుఁ బుట్టిన శ్రీరామునకు యౌవరాజ్యపట్టాభిషేకమును రాజు గావింప నున్నట్లు మంత్రిపురోహితులతోఁ జెప్పి తన్నిమిత్తమైనవస్తుసంభారముల సమకూర్ప నియోగించె. ఇఁకను గౌసల్యభాగ్యవంతురా లని వేఱ చెప్పవలయునా? నీవంటి దౌర్భాగ్యవతిని నే నెందును జూడ నైతి. సవతికొడుకు రాజ్యమేలుచుండ నీకొడుకు వానికి దాసుండై నీవు దాసుని తల్లివిగా వర్తింపవలసినవిధి తటస్థించె. అని మంథర నుడువఁగా కైకేయి యావృత్తాంతంబును సాంతంబుగా నాలకించి సర్వాభరణములను దీసివైచి తనపతి యారేయి తనయంతఃపురమునకు రానున్నసమయమునఁ దెల్లచీర గట్టి కోపగృహంబునఁ బ్రవేశించి దుఃఖపరవశయై యుండె. అంత దశరథుండును కైకేయి యంతఃపురముం జేరి దానికోపకారణం బరయఁగా నాధూర్తురాలు ముసలిరాజుతో నిట్లనియె. రాజేంద్రా! మున్నొకకాలంబున నేను నిన్ను వరముల వేఁడ వాని నే నడిగినప్పు డొసంగునట్లు నీవు బాసచేసి యున్నావుగాదె? దానిని స్మరణకుఁ దెచ్చికొనుము. ఇప్పు డావరముల నాకొసంగుము. సత్యప్రతిజ్ఞుండవు గమ్ము. అనఁగా నందుల

"కారా" జిట్లనియె. ఓశుభాంగి! నీ కేవరములు గావలయును? చంపc దగనివానినయ్యేను వానిని జంపించెద. లేక యుతిప్రాణిపై నుండు దోషి యెవ్వండైనను వానిని సకలించి నీమాటc గాపాడెద. ఎవ్వని నైనను నైశ్వర్యవంతుc జేయcదలంచితో? లేక, యెవనినైనను దరిద్రుc గావింప నెన్నితో? విప్రులధనక్షేత్రంబులు దక్క మిగిలిన వన్నియు నీయధీనంబులే. నాల్గువర్ణములవారిని స్వధర్మానుసారంబుగ బ్రహ్మోత్తరంబుగాc బ్రజాపాలనంబుc గొఅంత రానీయక యేలుచుండు నేను నీకుc గావించిన వరదానంబు నీకోర్కెచొప్పున నోసంగి సత్య ప్రతిజ్ఞుcడ నయ్యెద. అని చెప్పగాc గైకేయి తనకోరినవరంబు లడ్డులేక నొసంగcగలవని నిశ్చయించుకొని దశరథున కిట్లనియె. నృపాలవర్యా! వినుము. శ్రీరాముని యువరాజపట్టాభిషేకము గావింపc దెచ్చియుండు సర్వసంభారములతో నాపుత్త్రుం డగుభరతునకు యావరాజ్యపట్టాభిషే కంబు గావింపుము. శ్రీరామునిc బదునాలుగేండ్లు వనవాసమునకుc బంపుము. ఇవి నేc గోరువరములు. అనcగా నాపె వేcడిన వేcడిమాటలను నృపవర్యుcడు నైపకర్ణరంధ్రములందు సీసముc గాcచి పోసినట్లు చుఱ్ఱు మని మండcగా మొదలంట నఱికినప్రాణిభంగి దుఃఖపరవశుcడై యెద్ది యుం జెప్ప నేరక నేల కొఱcగి కన్నీరు గార్చుచుండె.

శ్రీరాముండు సీతాలక్ష్మణులతో నడవులకుc బోవుట

అంతcగొంత సేపటికి నృపాలుండు ధైర్యముc దెచ్చుకొని దీన వదనుండై కైకేయి కిట్లనియె. క్రోమలీ? నీవు కేకయంశమునc బుట్టిన దానవు. ఈపరుసని పలుకులాడ నోరెట్లాడె నీకు. సకలగుణాభి రాముం డగుశ్రీరాము నడవుల వసింప మనుటకు నీ కాతం డొనర్చిన యెగ్గెట్టిది? ఆతండు నీ కనురక్తుండై నీపంపు లొనర్చుచు నీసేవలc జేయుచు, నీయా జ్ఞల శిరంబున వహించి యొనర్చుచుండెనే! ఆమహానీయుని విషయమున నిట్లు దయమాలి యతని నడవులకుc బంపు మనుటకుc గారణం బెయ్యది? ఊహింప లేకున్నాను. అని యిట్లనునయించుచుండ శ్రీరాముం డంత వృత్తాంతముc దెలిసి తండ్రిని సత్యసంధుం గావింపc బూని జడలు దాల్చి నారచీరలు గట్టికొనెను. అంత సీతాలక్ష్మణులును వానివెంట నట్టివేష మును ధరించినవారైరి. అప్పుడు వారు ముగ్గురు నయోధ్యవదలి వన వాసమున కేcగిరి. అంత దశరథుండు సర్వగుణముల కాలవాలం బగు నా

సుపుత్త్రవియోగంబు సహింప లేక శోకసాగరంబున మునింగి యసువులం దొఱంగె. అంతం గైకేయి తనపుట్టింటికి, గొన్నినాళ్లకుముసుపు పోయి యుండిన భరతుం బిలిపించి రాజుమరణముం జెప్పి నిష్కంటకంబైన యయోధ్యారాజ్యంబుం గైకొను మని వేఁడెను. భరతుం డాపలుకులు తనవీనులకు ములుకులై సోఁకఁగాఁ గటకటంబడి తల్లి కిట్లనియె. ఓకులపాంసనీ! ఏల యిట్టిక్రూరకార్యంబుఁ జేసితివి? రాజ్యలోభమునఁ బతిమరణంబు నకుఁ గారకురాలవైతివి. ఘనత కెక్కినరఘుకులంబున కపకీర్తిఁ దెచ్చితివి. నీకోరిక నెఱవేఱదు. సకలగుణాభిరాముం డగు నాశ్రీరామునిం దప్ప మాతండ్రి యనంతరమున నీయయోధ్యాపాలనంబున కర్త్యల్వుండ నగు నే నర్హుండ నగుదునే యని పలువురు పురజనులసమక్షమున శ్రీరాము సుగుణములను సువర్తనంబుల వర్ణించుచుఁ, దండ్రియొక్క హఠాన్మరణ మునకు దుఃఖించుచుఁ, దాను గైకేయి పుత్త్రుండై పుట్టినందులకుఁ దన్ను నిందించుకొనుచుఁ బలుతెఱంగుల వగచుచు నెట్టకేలకు ధైర్యం బవలం బించి తాను శ్రీరాముం డున్నవనంబున కేగి యెవ్విధమునైన నన్నను దోడ్తెత్తు నని యతండు చనినదారి శత్రుఘ్నుండును దానును గొంత సైన్యముతో నవ్వనంబునకుఁ జనియె. అప్పటికి శ్రీరాముండు సీతా లక్ష్మణులతోఁ జిత్రకూటంబు చేరియుండె. అంత భరతుండు చిత్రకూటం బున ధనుష్పాణియై జటావల్కలధారియై యున్న శ్రీరామునకుఁ బ్రణ మిల్లి తండ్రి మరణంబుఁ జెప్పి మరల నయోధ్యకు రమ్మని పలుతెఱంగుల వేఁడె. శ్రీరాముండు తనయందు నపారభక్తిస్నేహంబులతో నుండుభర తుని వాక్యములను సావధానుండై విని పితృవాక్యపరిపాలన మవశ్య కర్తవ్య మని భరతునకు బోధించి యాతనిని నయోధ్య నుండు మని నియోగించుటయు నాశ్రీరామభక్తుం డగు భరతుం డన్నపాదుకలం గొని నందిగ్రామంబు నేరి యయోధ్యారాజ్యపరిపాలనభారము నంతయు నా పాదుకలపై నిడి సర్వకార్యముల నహర్నిశముల౦దు వానికి నివే దించుచు నొకతీరున రాజ్య మేలుచుండె.

శ్రీరాముండు తన్నయోధ్యాపురజనులు రాజ్యమున కేతెమ్మని నిర్బంధింతు రని శంకించి చిత్రకూటమును వదలి దండకారణ్యమును బ్రవేశించి యావనమున నొకచోట శరభంగుం డనుమహర్షి

యాశ్రమంబు గావించికొని తపస్సు చేయుచుండ నమ్మహనీయుని దర్శించి యచ్చోటు వాసి గోదావరీతీరంబు చేరి యచ్చటఁ బర్ణశాల నొక్కదానిని లక్ష్మణుని నిర్మింపఁ బంచి యందు సీతాసహితుండై కొంతకాల ముండె. అంత నొక్కనాఁ డాపర్ణశాలను సమీపమున శూర్పణఖ యనురాక్షసాంగన సంచరించుచుండి సహజశరీరసౌందర్యముతో వెలయుచుండు మహాపురుషుం డైన శ్రీరాముం జూచి కామింపఁగా నేకపత్నీవ్రతుండగు నమ్మహనీయుండు దానివర్తనంబునకు రోసి లక్ష్మణునకు దానినుక్కు సెపులం గోయు నానతీయఁగా నాతం డట్లు సేయ నాఘోరదైత్యాంగన వికృతరూపమును బొంది పెల్లఱచుచు జనస్థానం బనుప్రదేశంబున రావణునియుక్తులై యుండు పదునాలుగువేల రాక్షససేనలతోఁగూడిన ఖరదూషణత్రిశిరు లనువారలయొద్దకుఁ బోయి తనవికృతరూపముం జూపి వారికి శ్రీరామలక్ష్మణులపై ద్వేషంబు జనింపఁజేసి వారిపైకి యుద్ధసన్నద్ధులఁ గావించె. అంత వారు శ్రీరామచంద్రునిబలపరాక్రమములు దెలియక సకలసేనాసమేతులై శ్రీరామునితోఁ బోరి యెల్లరును మడిసిరి. తన యుద్యమం బట్లు విఫలంబగుటయు శూర్పణఖ లంకకుఁబోయి లంకాధిపతి యగు రావణునిపాదంబులపైఁ బ్రాలఁబడి తనవికృతరూపమునుజూపి జనస్థానమందలి సైన్యమంతయు ఖరదూషణత్రిశిరులతో శ్రీరామచంద్రునిచే మృతినొందుటను సవిస్తరముగాఁ జెప్పి గోడుగోడుమని యేడువం దొడంగె. అంత రావణుండును దానియాక్రందనమును విని తోఁకత్రొక్కినపాముం బోలెఁ గనలి పండ్లు పటపటం గొరికి యాసనంబునందుండి లేచి తన్నుఁ బరివేష్టించియున్న సేనాపతిమంత్రిపురోహితుల నవలం బో నెలవొసంగి శూర్పణఖ నేకాంతంబునకుఁ బిలిచి యిట్లనియె.శూర్పణఖా! నన్ను లక్ష్యపెట్టక నీకీవికృతరూపముఁ గావించినవా రెవ్వరు?బుద్ధిలేక యెవ్వఁడు తనకు దానే శూలముతోఁ బొడుచుకొనియె? తనతలపై నిప్పుఁ బెట్టుకొని నిదురించుచుండునామానవుం డెవ్వండు? ఎవఁడు తనకాలితోఁ గ్రూరసర్పమును ధైర్యముతోఁ దన్ని మెలంగుచున్నవాఁడు? అడవులయందు స్వేచ్ఛమై సంచరించు మృగరాజునోటఁ జేతి నిడి దానికోఱల నూడఁ బెఱుక నెవఁడుద్యమించె? నని యడుగుచుండఁగా వానిశరీరమందలి రోమకూపములనుండి రాత్రికాలమునఁ గాలుచున్న వనవృక్షకోటరంబుల

నుండి యగ్నికణములువోలె మిఱుఁగుఱులు బయలు దేఱుచుండె. అప్పుడు, శూర్పణఖ తనవికృతరూపమునకుఁ గారకులగు శ్రీరామలక్ష్మణులచరిత్రంబును, సేనాసమేతములగు ఖరదూషణత్రిశిరులమరణంబును నామూలంబుగాఁ జెప్పె. అంత లంకాధిపతి దాని నూరార్చి లంకం గాపాడుటకుఁ దగువారల నియమించి తాను గామగమనంబున నాకసంబున కెగిరి త్రికూటమును, గాలపర్వతముం దాఁటి సముద్రముం గడచి చంద్రశేఖర నివాసంబగు గోకర్ణ క్షేత్రంబునకుఁ బోయి మున్నొకతూరి శ్రీరాముచే నేటువడి వానికి వెఱచి యచ్చట తపంబుఁ గావించుచుండు మారీచుం గాంచె. అంత మారీచుండును దననెలవునకు లంకాధిపతి యాకస్మికంబుగ వచ్చుటఁగని సంభ్రమంబుగా నాతనికర్ఘ్యపాద్యాదుల నొసంగి యతిథిసత్కారంబులం గావించి మార్గాయాసంబు నపనయించి మిక్కిలి వినయముతో నిట్లనియె. దానవాధిపా, మీకెల్లరకుం గుశలంబే? దైత్యులెల్లరతంత్రితులై నిన్ను సేవింతురే? లంకలోనివారెల్లరు సేమంబుగ నున్నవారే? రాజ్యమునం దేకొఱంతయు లేక సర్వము సమృద్ధంబుగ నున్నది గదా? తొల్లింటివలెఁ గాక నీముఖ మేల వివర్ణతఁ జెందియున్నది? నీప్రజలందఱును నీకు విధేయులే కదా? నీరాకకుఁ గారణం బేమి? అది యెట్టి యసాధ్యకార్యంబైనను నీకై కావింతు. అని యడుగ మంత్రి యగుమారీచునకు లంకేశ్వరుండు శ్రీరామునిచరిత్రమును వానిదుండగమును సంగ్రహముగఁ జెప్పి యెవ్విధమున నైన నాతని కపకృతిఁ జేయఁ దొడ్పడుమనుటయు మారీచుండు రావణునకు మఱియు నిట్లనియె. శ్రీరాముం డమితబలపరాక్రమసంపన్నుండు. వానియెడఁ బరాక్రమంబు చూపుట మానుము. ఆతనిశరవేగము నెవ్వరు నోర్వ లేరు. ఆతనిచేఁ గొట్టంబడి ప్రాణములం గాపాడుకొనునిమిత్తమై యీతాపసవృత్తిం బూనినాఁడ. సర్వసంపదలతో నశించుటకుఁ గారణంబైన యీదురాలోచనను నీకు హితశత్రులై బోధించినవా రెవ్వరు? అని నీతులఁ గఱప రావణుండు వానిఁ గ్రోధతామ్రాక్షుండై వీక్షించి యోరీ మారీచా! కార్యమున నీవు నాకుం దోడ్పడి హితమాచరింప వేని యిదే యొక్కవ్రేటున నిన్నిప్పుడే యమసదనంబున కతిథినిగాఁ జేసెద ననెను. అంత మారీచుండు దీర్ఘాలోచనంబుఁ జేసి యీదురాత్మునిచేఁ జచ్చుటకంటె మహా

నీయుం డగు శ్రీరామునిచే జచ్చుట మేలనియుఁ బరలోకసుఖప్రద మనియుం దలంచి యెట్లైనను దనకుఁ జావు సిద్ధమైయుండ శ్రీరామ బాణనిహతుఁ డగుటయే శ్రేయస్కర మని నిశ్చయించి, రక్కసుల ఱేనిం జూచి, రాక్షసేశ్వరా! నీయాజ్ఞ మెయి వర్తింతు.నన్నుఁ బనిఁగొను ము. నేను జేయవలసిన కార్య మెద్ది? ఆనతీయవే యనుటయు లంకాధి పతి మాయలమారి యగు మారీచున కిట్లనియె. 'మారీచా! నీవు నీ మాయారూపమంబున బంగారు లేడివై రత్నఖచితము లగుకొమ్ములతోను రోమములతోను వెలయుచు శ్రీరామునిపర్ణశాలాసమీపంబున లేఁబచ్చిక మేయుచుండుమృగమై నటించి జానకిమనస్సున కింపుగా వినోద ముం జూపుము. రత్నఖచిత మగునీబంగారుశరీరమును వీక్షించి సీతా దేవి శ్రీరామునితోఁ దన కెవ్విధముననైన నాహరిణంబుఁ గొనితెమ్మని కోరును. స్వాధీనపతిక యగు నమ్మగువమాటల జవదాట నేరక శ్రీ రాముండును నీవెనుకొని బాణ మేయక నిన్నెట్లో పట్టుకొనుటకు యత్నించు. అప్పుడు నీవు శ్రీరామునిఁ బర్ణశాలకు దూరముగఁ గొనిపొమ్ము. అంతట లక్ష్మణుండును నాశ్రమమును వదలుట కుపాయము నూహింపుము. పదంపడి సీత పర్ణశాలయం దొంటిగా నుండును. అంత నేను జానకిని బోడగాంచి దాని నారుపతోఁ గావించుకొని పారావారమధ్యంబున నున్న లంకకుఁ గొనిపోవుదును. పిదప శ్రీరాముండు తనయాశ్రమంబుఁ జొచ్చి సీతం గానక వియోగాగ్నిం గాలి నశించు. కావున నీయుద్యమము నందు నీవు నాకుఁ దోడ్పడవలయు' నని చెప్పెను.

## మారీచుండు మాయామృగరూపము ధరించుట

అంత మారీచుం డెవ్విధమున నేనియుఁ దనకు మృత్యు వాస న్నమై యుండుట యెఱింగి చావు సిద్ధ మని నిశ్చయించుకొని చింతా క్రాంతుండై చేయునది లేక లంకాధిపతివెంట నేఁగి శ్రీరామచంద్రుని పర్ణశాలాసమీపంబున రత్నఖచితశృంగములతోను స్వర్ణమయరోమ ములతోను గాంచనమృగంబై మాయామృగం బని తెలియనీయక మోసంపువిలాసంబుఁ గాన్పించుచుఁ, గుప్పిగంతులు వైచుచుఁ గసవు మేయుచుఁ బిత్తరిచూపులఁ జూచుచు బహువినోదంబులఁ జేయుచుండె. అట జానకి యామాయామృగముయొక్క విలాసముల కచ్చెరువుఁ బొంది దానిం బట్టి తెమ్మని కాకుత్స్థుం బ్రార్థించె. రాఘవుండును దన

ప్రియాంగనమనోరథం బీడేర్చునిమిత్త మాశ్రమంబున లక్ష్మణుని జాగ్ర
రూకతతో నుండ నియమించి, ధనుర్బాణంబులను దూణీరయుగళంబును
ఖడ్గాదిసాధనంబులను గేలఁ గొని మహాదేవుండు యజ్ఞమృగంబును
బోలె నక్కుహనామృగంబుఁ దఱుముచు నరిగె. ఆ మాయల
మారి మృగంబును గొంతవఱకు సమీపంబునను, గొంతదూరమునను
గొంతతడవు కంటికిఁ గానరాకుండను, గొంతవడి దూరమునను గనఁబడుచు
ననేకమాయలం జేయుచు బహుదూరము రామునిం గొనిపోయెను.
అంత శ్రీరాముండు దానిచేష్ట లన్నియు రాక్షసమాయలుగాఁ దెలిసి
యయ్యది యథార్థమృగము కా దని యెఱింగి దూరంబున నుండు
నామృగముపై దనయమోఘబాణము నొక్కదానిం బ్రయోగించె.
ఆబాణంబు తనశరీరంబు దాఁకుడు మారీచుండు మృగరూపమును విస
ర్జించి ఘోరరాక్షసాకృతిం దాల్చి యసువుల వదలుచు 'హా! సీతా!
హా! లక్ష్మణా!' యని శ్రీరాము నెలుంగుతో నఱచి చచ్చె. ఆ దీనధ్వనిని
సీతాదేవివిని శంకాకులితస్వాంతయై భీతహరిణాంగనయుంబోలె రాముఁడు
పోయినవలను గనుఁగొనుచుండ లక్ష్మణుం డద్దేవిం జూచి 'యేల నీవు
సంశయించెదవు? రాము నెవ్వఁడు గొట్టు? ఆతురపడ కొక్కముహూర్త
ముండుము. ఊరడిల్లుము. నీనాథుండు సురక్షితుఁడై నీయొద్ద కేతెంచి
రాక్షసమాయల నన్నింటిని దెలిపి నీకు వీనులపండు వొనర్చును. అని
చెప్పఁగా నాజనక రాజతనయ పూతచారిత్ర యయ్యు స్త్రీసహజస్వభావం
బున విలపించుచుఁ బావనమూర్తియుఁ బరమభక్తుండు నగుమఱఁది కిట్లనియె.
'కష్టాత్మా! నీతలంపులు కొనసాగవు. శస్త్రముననైనఁ బొడిచికొందు. పర్వ
తాగ్రమునందుండి నేలనైనం బడుదు. కాకున్న నగ్నిఁ దరిగొల్పి దాననై
నం జొత్తుఁ గాని నిన్నుఁ గామింపను. వ్యాఘ్రాంగన యెన్నఁడేని నక్కను
గామించునే' యని హృదయదారుణంబులును గర్ణకఠోరంబులును
నగుమాట లాడఁగా రాఘవునియందు భక్తుఁ డయిన లక్ష్మణుఁ డామా
టల విన సహింపక వీనుల గట్టిగ మూసికొని 'హరీ! హరీ' యనుచు
గేల ధనుర్బాణములం బూని సీతను బంచభూతములు రక్షించుఁగాక
యని యామెవైపుఁ జూడక శ్రీరాముపోయినవలన నామహాసీయు
నడుగుజాడలం జూచుచు వనంబునకుఁ బోయె. అంత లంకాధిపతి నిప్పురు
గప్పిననిప్పువోలె నభవ్యుఁ డయ్యును భవ్యరూపముతో సన్న్యాసి

రూపముం దాల్చి సీతను బొడగాంచి యాదేవి నపహరించికొనిపోవు తలంపుతో శ్రీరామునివర్ణశాలను సమీపించి రాఁగా జానకి పరమ ధార్మికురాలు గావున వానిం జూచి 'యయ్యా! మాయింటి కతిథివై యేతెంచితివి. నే నొసంగునర్ఘ్యపాద్యంబులను, నాయింట నుండుఫల మూలములను గ్రహింపు' మనెను.అంత వాఁ డద్దేవిమాటలసట్టసేయక, మునిరూపమును త్యజించి నిజరూపముం దాల్చి 'జానకీ! త్రిలోకమోహినీ! నేను లంకాధిపతిని. రాక్షసరాజను. రావణనామధేయముతో వెలయుదును. ఇచ్చటికి బహుదూరమున దక్షిణపుదిక్కున మహోదధి గలదు. దానికిదక్షిణపుగట్టున నా రాజ్యమగు లంక సుప్రతిష్ఠితమైయొప్పారును. నేను నీచెట్టఁ బట్టి నాపురంబునందలి యుద్యానవనంబుల నభిమతవిహారముల సుఖింపఁగోరెదను. నీవు నాయభిమతంబుఁ దీర్చి నాకు భార్యవు గమ్ము. రాజ్యము నెడఁబాసి జటావల్కములధరించి యరణ్యావాసముఁ గావించురాముని విడనాడుము. అని చెప్పఁగా నామాటలు వీనులకుఁ ములుకులు కాఁగా వైదేహి వాని కిట్లనియె. రాక్షసాధమా, ఆకసంబు చుక్కలతోఁ గ్రిందఁ బడినను, ధరాతలంబు నీటలుపాటిప్రయ్యలైనను, జలరాశిలోనిజలంబు లింకినను, జంద్రుండు శీతకిరణత్వము త్యజించినను, నాదిత్యుండు వేఁడికిరణముల మానినను, హుతవహుండు చల్లఁబడినను, నేను శ్రీరాముని వదలి వేఱొక్కనిఁ గన్నెత్తియైనఁ జూతునే? మదించి యథేచ్ఛముగ యరణ్యంబులఁ దిరుగుచు సుఖమైయుండుకరేణువేనాఁటికైనను బంధింప నిత్తుఁ గోరునే? తియ్యనిమకరందంబుఁ గ్రోలు తేఁటి పొలఁతి రేఁగుపువ్వుల రసముఁ ద్రాగ నిచ్చ గొనునే? అని క్రోధపరవశయై పదవు లదరవానికి బదులు సెప్పి చేతుల విదిర్చికొనుచుఁ బర్ణశాలలోనికేఁగెను.

## రావణుఁడు సీత నెత్తుకొనిపోవుట

అంత దశముఖుఁడు సీతను వెంటఁ దగిలి కఠోరవచనములాడి బెదరింప నాచపలాక్షి మైమరచి పరవశ కాఁగా నంతటఁ గ్రూరుండై వాఁ డద్దేవిశిరోజములం బట్టికొని యాకసంబున కెగిరిపోవుచుండె. అప్పుడారామపత్ని 'హా రామా! హా రామా!' యని బిగ్గరగా రోదనంబుఁ జేయుచుండ దశరథసఖుఁడును, నరుణునికుమారుఁడును సంపాతి యను వానిసోదరుఁడును నగు గ్రద్దలఱేఁడు జటాయువనువాఁ డాయాక్రందన

మును విని రావణుఁ డెత్తికొనిపోవుచుండు దశరథుకోడలినిఁ జూచి యామె యేడ్పు నాలించి యధర్మమున కలిగి వాని సక్రోధుండై యద ల్చుచు నోరీ! రాక్షసాధమా! మైథిలిని వదలుము. వదలు మనెను. మఱియునాపక్షిరా జాదురాత్మునిఁ జూచి యి ట్లనియె. ఓరీ! దుష్టుఁడా! నేఁ జూచుచుండ నీ వీసతిం గొనిపోఁగలవే? ఈదేవిని నీవు వదలి ప్రాణ ముల రక్షించుకొనుము. కాదేని ఘోరయుద్ధంబు సలిపి నన్నుఁ జంపి పిదప మైథిలిని గొనిపొమ్మని రావణునిఁ దనముక్కునం బొడిచియు, ఱెక్కలఁ దాటించియు, గాళ్లతోఁ దన్నియు గోళ్లతోఁ జించియు వాని శరీరము నంతయు నెత్తురువరద లగునట్లు చేసె. ఈవిధమున నాజటా యువు ఱెక్కలతోఁ గొట్టియు ముక్కుతోఁ బొడిచియు గోళ్లతో జక్కియు రావణునిశరీర మంత యు నెత్తురు గాఱుచుండఁ జేయ వాఁడు గైరికాదిధాతు సమూహములకాంతితో నెఱ్ఱుదనముఁ దోఁచు సెలయేళ్ల తో నొప్పు కొండచాడ్పునఁ గాన్పించి క్రోధము వానిమనంబున ముప్పిరిగొన వాఁడు ఖడ్గము చేపట్టి దానితో నాపక్షీంద్రు ఱెక్కలఁ దఱిగె. అంత జటాయువు వజ్రాయుధపుఁ దాకునంబడిన కులపర్వతశిఖ రముం బోలె నవనితలంబుపైఁ బడియె. వెంటనే రావణుండు యుద్ధసమ యమునఁ గ్రింద దించియుండు సీతను మఱల నెత్తికొని యనేకాశ్రమ ములను నదీసరస్సులను నుప్పరంబుననుండి వేగమున దాఁటించి పోవు చుండ నొకపర్వతశిఖరంబున నైదుగురువానరు లాసీనులై యుండుట నద్దేవి గాంచి తత్పూర్వ మాకసంబున నుండి యొక్కొక్కభూషణమును జారవదలుచుఁ దనమేన మిగిలియున్న భూషణములను దనకట్టియున్న పుట్టంబుఁ జించి యందుముడివైచియావానరుల మధ్యంబడునట్లు వైచెను. అయ్యది గాలిచేఁగొట్టుకవచ్చి మేఘమండలంబునఁ గ్రొక్కారు మెఱుంగు చాడ్పున వారిమధ్యం బడియె. రావణుండును దనకార్యమును సాధించిన వాఁడై యాకసంబునందు సీతామహాదేవితో నతివేగంబున సాగరంబు దాఁటి చిత్రవిచిత్రములగు ననేకగోపురములు గలదియుఁ, బలు తెఱంగులఁ దేజరిల్లు ప్రాసాదమాలికలచే విరాజల్లు నదియు, విరాజితంబును మిక్కిలి లోఁతైన యగడ్తతో నొప్పారునదియు, నున్నతప్రాకారవలయితంబును, విశ్వకర్మచే నిర్మింపఁబడి చుట్టును సముద్రముచే నావరింపఁబడి శృంగార ములతో నొప్పారునదియు నగు లంకాపట్టణము సేరి యందు రమ్యణీ

యందుంచె వెలయు నశోకవనమునందు సీత నుంచి యాదేవిరక్షణార్థమై రాక్షసాంగనల నియమించె.

ఇటు దండకావనమున మాయామృగం బైన మారీచు జంపి మఱలి తనపర్ణశాల కేతెంచి శ్రీరాముండు స్వర్ణమృగ మను భ్రాంతిచే దానిం బట్టుతలంపున బహుదూర మేతెంచి తుద కది యొకరాక్షస మాయ యని తెలిసి యామృగరూపధారి యగు రాక్షసుం దును మాడి వచ్చుచు నంతట లక్ష్మణాగమనముం జూచి వ్యథతోఁ దమ్మున కిట్లనియె. లక్ష్మణా! రాక్షసులతో నిండి నిబిడీకృత మగు నా యరణ్య మధ్యంబున సీత నొంటరిదానిని వదలి నీ విట్లు రాఁ గారణం బేమి? సీత సజీవయై యున్నది గదా? ఆలోచింప దాని బ్రతుకు నా కించుక సంశయాస్పదం బగుచున్నది. యని పలుకుచు వేగగమనంబున లక్ష్మణు నెదుర్కొనఁగా నారాఘవానుజుండు సీత తన్నుఁ దూలనాడుట మున్నగు వర్తమానము నంతటిఁ దేటతెల్లంబుగా వచించె ఆసౌమిత్రి మాటల నన్నింటిని రాఘవుండు సావధానుండై యాలించి యిఁక సీత యేమయ్యెనో యనుదీర్ఘశంక దోఁప నగపుఁ గొని వేగంబ పర్ణశాలను సమీపించుచు ఘోరరూపముతోఁ గొండవలె నొక్కమార్గమధ్యంబునఁ గొన యూపిరితో నుండుజటాయువుం గని రాక్షసుం డనితలంచి చేతనున్న ధనుస్సున బాణంబుఁ దొడిగి వాని వేయఁబోఁగా నాగ్రద్దలఱేఁడు వాని కిట్లనియె. రామలక్ష్మణులారా! నేను దశరథసఖుండను. గృధ్రరాజను, జటాయు వనువాఁడను. అని చెప్పఁగా వానివృత్తాంతంబు వినఁగోరి బాణ ముపసంహరించి వారు సత్వరంబుగ వానిం జేరి వాఁడు ఱెక్కలు తెగి నేలఁబొఱలుచు మఁ ప్రాణావసానంబున నుండుటం జూచిరి. అంత నాకొఱప్రాణంబులతో నుండు జటాయువు రావణుం డనులంకాధిపతి సీత నెత్తుకొనిపోవుటయుఁ దా నడ్డపడ వానితోఁ బోరి యాఘోరం బగు పెనఁకువయందు ఱెక్కలు తెగ నేలఁ గూలుటయు నారక్కసుండు సీతం గొనిదక్షిణదిశ కేగుటయుఁ జెప్పి తలవాల్చి యసువులఁ దొఱఁగె. అంతవా రా గ్రద్దలఱేనికిఁ బినతండ్రిచెలికానికిఁ దండ్రికిం బోలె నగ్నిసంస్కారం బొనర్చి తమయాశ్రమమును జేరిరి. అప్పు డయాశ్రమంబున పెదజల్లఁబడినదర్భాసనంబు గలిగి, విఱుగఁగొట్టఁబడిన కమండలువు

తోఁగూడి నక్కలగుంపుతోఁ గూడుకొన్నదై సీతావిరహితంబగు నుటజము వారిపవ్వుపం గాంచిరి. అప్పుడు సీత రావణాపహృత యని వారు నిశ్చయించి శోకవిహ్వలమానసులై దక్షిణాభిముఖులై యేఁగుచు ముందట నిటునటు పరువెత్తు మెకములగుంపులను గాంచి, యప్పటికప్పటికిఁ బెంపొందు కాఱుచిచ్చుయొక్క చిటపటధ్వనులను విని, కొంత తడవునకు ఘోరరూపుఁడును, పర్వతసంకాశుఁడునై, క్రొక్కాఱునల్ల మబ్బుం బురుడించుచు, గొప్పయూపురములు నెగుభుజములు గలిగి ఱొమ్మునందు వెడదకన్నులును దోరపుబొజ్జయు గొప్పనోరును గలవాఁడై చూపఱకు వెఱపు పుట్టించు చూడ్కి గల కబంధుఁ డసురక్కసుం గాంచిరి. అంత నాయసురుఁడు తననిడుదచేతులఁ జూపఁగా జిటపటమని మండుచున్న కాఱుచిచ్చురొదవంటి యొకచప్పుడు వినఁబడెను. మఱియు నిటునటు పరువెత్తుచున్న మృగములనాదంబులు వినవచ్చెను. లక్ష్మణుండు వానిచేతఁ జిక్కి వగ గూర నన్నతో నిట్లనియె. రఘువర్యా! చూడు మీనాయవస్థను. నీకుఁ గలిగిన రాజ్యభ్రంశమును, వనవాసమును, సీతాహరణమును, దండ్రిచావును నివియే నీమనస్సు నెఱియించుచుండ నిప్పట్టున నే నీరక్కసుచేఁ జిక్కి చావ నున్నవాఁడ. నీవు మఱల సీతతో నయోధ్య కేఁగి పెద్దలనాఁటి రాజ్యమున నభిషిక్తుండవై రాజ్య మేలుకాలమును గన్నులారఁ జూడ నోచనైతి. పట్టాభిషేకసమయమున ధన్యులగువారు కుశలు, లాజలు, జమ్మియాకులు చేఁబట్టి పవిత్రజలములతో మునులు నీ కభిషేకము గావించుచుండ నీదివ్యమూర్తిని వీక్షింతురు. కాని యట్టిభాగ్యంబు నాకు లేదయ్యె. అని నానావిధంబులఁ బరిదేవనంబు గావించుచుండ నెంత విపత్తునందును ధైర్యమును వదలని శ్రీరాముండు ధీరోదాత్తుండు గావున దుఃఖనిమగ్నుఁడయ్యును జలింపక తమ్మునిం జూచి లక్ష్మణా! వగపేల? విలాపమునకుఁ గాలము కాదు. ఈదుష్టాత్ముఁ డగురక్కసు దక్షిణహస్తమును నీవు నీచేతిఖడ్గముతోఁ దెగనఱుకుము. నేను వామహస్తమును నాకృపాణమున నేసెదను. అంతటితో మనయవస్థ తీరఁగలదు. అని చెప్పి యిరువు రట్లొనర్చి వానిపార్శ్వభాగమును గాలితోఁ దన్నఁగా వాఁడు విగతప్రాణుండై నేలం గూలె. అప్పుడు వానిపతిత శరీరంబునందుండి యద్భుతావహం బగు నొకదివ్యరూపంబు వారి కగపడి యాయన్న

దస్యులం జూచుటయు నారాఘవుండు వానితో నిట్లనియె. మహాత్మా, నీరూపము దివ్యముగ మారెను. నీవర్తనంబు మాకు నాశ్చర్యమును గలిగించుచున్నది. ఇది యొకతెగ రాక్షసమాయయో? యని యడుగ దాశరథికి నాదివ్యశరీరధారి యిట్లనియె. రాఘవా! నేను విశ్వావసుండను గంధర్వుండను. నన్నొకబ్రాహ్మణుండు రక్కసుండవై చేతికిఁ జిక్కిన మృగములఁ దినుచుండు మని శపించెను. ఇప్పు డాశాపము నీవలనఁ దొలంగితి. ధన్యుండ నైతి. నీభార్య యగుసీతను రావణుండను లంకేశ్వరుం డెత్తికొనిపోయెను. ఈస్థలమునకు సమీపమునందు హంసకారండవాదిజలపక్షిసమేత మయి శీతలోదకం బయి యొప్పు పంప యను సరోవర మొక్కటి గలదు. దానిచెంతఁ దనభార్యను హేమమాలి యగు సోదరుఁడయిన వాలి యపహరింపఁగాఁ జేయునది లేక విషణ్ణుండై సుగ్రీవుం డను వానరుండు నలువురు మంత్రులతోఁ బుుశ్యమూకం బను పర్వతంబున మెలఁగుచుండు. వాని వీక్షించి నీశోకకారణము వానికిఁ జెప్పుము. ఆమహనీయుండు సమానదుఃఖుఁడు గాన వైదేహిని సాధించుటయందు నీకుఁ దోడ్పడు. వానితో నీవు చెలిమి యొనర్పుము. అంత నీవు మైథిలినిం జూడఁగలవు. సుగ్రీవుండు రాక్షసేశ్వరుండగు రావణుని, వానిబలశౌర్యముల నెఱుంగు. నాచెప్పినట్లు చేయుము. నీకు శుభంబు గలుగు. అని వచించి వాఁ డదృశ్యుండయ్యెను. పదంపడి రాముండు తొలుత కబంధురూపమున నున్న విశ్వావసుగంధర్వువార్తల కాశ్చర్యముం బొంది యచ్చోటు వాసి కొంతదవ్వరిగి కమలోత్పలములతో నిండి సర్వమానవమానసోల్లాసకరంబైన పంపాసరోవరంబును జేరెను. అప్పు డాకొలనిచల్లనినీటితుంపరలను దామరపువ్వులలోని పుప్పొడులతోడం దెచ్చు మెల్లగా వీచుచుండు మలయానిలంబునకు మిగుల సొక్కి శ్రీరాముఁ డుల్లమునఁ దనప్రియురా లగుజానకిం దలంచి మన్మథబాణపీడితుఁ డయి వివశమానసుండై వేగుచుండె. అట్టి రాముంజూచి తదనుజుం డిట్లనియె. అన్నా పెద్దలసేవించు నాత్మజ్ఞాని మనోవ్యథలకు లోను గానియట్లు నీవంటి ధీరుం డిట్టివెతలపాలు గాఁ దగునే? లంకేశ్వరుండు సీత నెత్తికొని పోయె ననుమాట రూఢి యయ్యె. కావున మన మిఁక క్షత్త్రియోచితములైన బలపౌరుషములను బయల్పఱచి వైదేహిని మరల సాధింప

నుపాయం బూహింపవలయును గాని యీతీరున వ్యాకులమనస్కులము
గావచ్చునే? సుగ్రీవుండు ఋశ్యమూకమున నున్నవాఁ డని వింటిమి.
వానిం బోయి చూతము. అన్ని కార్యములకును నీకుఁ దోడ్పాటుగ శిష్యుఁ
డనుగాను, భృత్యుఁడనుగాను, సాయపడువాఁడనుగాను నేనుండఁగ నీవు
చింతిల్ల నేల? ఊఱడిల్లి కర్తవ్యము నాలోచింపు మని సాంత్వవచనములం
దెల్పఁగా నప్పరమధీరుండును మేధావియును నగు రాఘవుండు సహజ
ధైర్యముం బూని సమనంతర కార్యాలోచనపరుండై మనోవ్యాకులతను
గొంతఁ దొరఁగియుండె. పిదప నాయన్నయుం దమ్ముండును నాకొలని శీతల
నిర్మలోదకములయందుఁ గృతస్నానులై దేవతలకును పితరులకును ప్రీతిగా
జలాంజలు లొసంగి యాజలంబులఁ గడుపారఁ ద్రావి యటుపిమ్మట నెడ
తెగని పుష్పఫలభారముచే వంగి యింపుగొల్పు మామిడిమున్నగు సఫల
వృక్షములతో నిండి నిబిడీకృతం బగు ఋశ్యమూకమును సమీపించి
యాకొండశిఖరమునఁ గూర్చుండి యున్న యేవురు వానరులం జూచి
తమకు విశ్వావసుగంధర్వుండు సెప్పినవారలు వీరె. కాఁబోలునని తమలో
విచారించుచుండ సుగ్రీవుండు వాలిశాసనంబున రాజపుత్రవేషంబుతో
నుండు నామహాపురుషులు తన్నుఁ జంప నేతెంచినవారో యని వెఱపుఁ
గొని వారివృత్తాంతంబుఁ గనుఁగొనిరాఁగ హిమవంతునివంటి గాంభీ
ర్యము గలవాఁడును, మహామేధావియు, నీతిపరుఁడును నగు హను
మంతు నాంజనేయుని వారియెడకుం బనిచె.

### శ్రీరాముండు సుగ్రీవునితో సఖ్యముఁ జేయుట

సుగ్రీవుపంపున నంత హనుమంతుండు రామలక్ష్మణులకడ కేతెంచి
వారివృత్తాంత మంతయు నరసికొని తనసందేశమును వారల కెఱుక
పఱచి వారల సుగ్రీవుకొద్దకుఁ దన వెంటఁ గొనిపోయెను. సుగ్రీవుండును
శ్రీరామునితో సఖ్యముఁ జేసికొని వైదేహిని రావణుఁ డెత్తికొని
యాకసపుంద్రోవ నేఁగుచుండ నాదేవి తనపైఁటచెఱఁగునఁ గట్టి తమ
ముందటఁ బడవైచిననగలమూటఁ దెప్పించి దానిని విప్పి చూపుట
యు నంత రాఘవుఁడు సుగ్రీవునిపై మఱింత విశ్వాసము నొంది యా
తనికోర్కె లగు వానర రాజ్యపట్టాభిషేకమును వాలివధంబును జేయఁ
బ్రతిన సేసె సుగ్రీవుం డందులకు మాఱుగ శ్రీరాముభార్య జానకి
యుండుస్థలమును దనవానరబలముమూలమునఁ దెలిసికొని యివ్విధ

బాణేయుంటివిగదా? ఇప్పుడేల జీవితాశఁదక్కి సిగ్గుమాలి యుద్ధోన్ముఖుండ వైతి? నీకు మృత్యు వాసన్న మయ్యెఁ గాఁబోలు. అనఁగా సుగ్రీవుండు వాలికి శ్రీరాముపరాక్రమరహస్యముఁ దెలుపుచుండఁ దోఁప నిట్లనియె. వానరేశ్వరా! రాజ్యము నెడఁబాసితి. ఆలిం గోల్పడితి. ఇట్టినాకు నింకను జీవితంబున నాశ యేల? యని విసికి యసువులయం దాస వదలి వచ్చితి నని నర్మగర్భంబుగా నౌచిత్యయుత మయిన మాఱుమాటచెప్పె.

## వాలిసుగ్రీవుల యుద్ధము

అవ్విధమున నాసోదరులు వాలిసుగ్రీవు లట్లు పొలుపుమాటలచేఁ బరస్పరధిక్కారంబుల నొనర్చుచు నొండొరులపైఁ జేతులఁ జేర్చుచు నొకరి నొకరు గ్రిందఁ బడఁద్రొబ్బుచు, ముష్టిప్రహారణంబులఁ గావించుచు, గోళ్లం గీఱుచుఁ బండ్లం గొఱుకుచుఁ జిత్రయుద్ధముఁ బెద్దయుం బ్రొద్దు గావించి యన్యోన్యశరీరముల నెత్తుటిధారలు ప్రవహింపఁ బూచిన మోదుగుచెట్లవలెఁ గాన్పించిరి. అట రాఘవుండు వారియిరువురిలో ముక్కులు, చెక్కులు, కాలు సేతులు, గాత్రము లను వీనియందు నెంతమాత్రము భేదంబుఁ బొడగానక వాలిని గుర్తింపనేరక బాణ మేయక యూరకుండె. అంత హనుమంతుం డా సందర్భము నెఱింగి సుగ్రీవు మెడయందుఁ బుష్పమాలిక నొక్కటిని వైచి యాదండ గలవాఁడు సుగ్రీవుం డని శ్రీరామునికిఁ దెలిపిన, మేఘమాలచే నలంకృతమైన మలయపర్వతంబు చందంబునఁ బుష్పమాలాలంకృతుం డగువాఁడు సుగ్రీవుం డని యెఱింగి వజ్రాయుధధ్వనింబోని ధనుష్టంకారమునఁ గొండ గుహలెల్లఁ బ్రతిధ్వను లీనఁగా గొనయంబుసారించి తీవ్రశరంబుఁ దొడిగి దూరంబున నుండి వాలి నేసె. అంత వాలి రామునిబాణ ప్రహారంబున ఱొమ్ము పగుల నెత్తురు గ్రక్కుచుఁ గూలి శ్రీరాముఁడు లక్ష్మణ సమేతుఁడై తనకట్టెదుటఁ దోఁప నిట్లనియె. వీరవర్యా, యన్యునితోఁ బోరాడుచున్న నాపై మఱుఁగున నుండి బాణమేసితివి. ఇయ్యది శూరధర్మంబే! యని శ్రీరాముని దూలనాడుచు శరబాధ నోర్వ లేక మూర్ఛితుఁడై యసువులఁ దొఱఁగె. వెంటనే తార సమరాంగణ మున కేఁగుదెంచి, రామునెదుట నిలిచి పోరాడఁజాలక మఱుఁగున నుండి తనభర్తపై బాణమేసితి వని దూలనాడెను. అట్లు వాలి రాము

నిచే నిహతుఁడు కాఁగా సుగ్రీవుఁ డన్నకు సంస్కారం బొనర్చి, తాఁ గిష్కింధాపురంబున నభిషిక్తుఁ డయ్యె. అంత గ్రీష్మవర్షర్తువు లాసన్నంబు లయ్యెను. సుగ్రీవుఁ డీనాలుగు నెలలు గడచినపిదప సీతాన్వేషణమునకై కడంగెద ననఁగా, రామలక్ష్మణు లెట్టులేని నంతకాలము మాల్యవంతంబునఁ బుచ్చఁ దలఁచిరి.

అట లంకయందు రావణాసురుఁడు తాపసాశ్రమముం బోలిన యశోకవనంబుచేరువ నందనవనముంబోలిన భవనంబున సీతాదేవి నుంచెను. అచ్చట నావెడఁదకన్నులుగలయాసీతాదేవి తాపసీవేషధారిణియై ప్రాణనాథునే తలఁచుటంజేసి, చిక్కినయొడలు గలదై, యుపవాసతపంబు లొనర్చునదై, కందమూలఫలములే భక్షించుచు, మిక్కిలి దుఃఖముతోఁ గాలముపుచ్చుచుండెను. అపుడు రావణాసురుఁడు ప్రాసాద్యాయుధధారిణులయిన రెండుకన్నులది, ముక్కంటిది, నొసటికంటిది, నిడుపునాలుకది, నాలుకలేనిది, మూచ్చండ్లది, యొంటికాలిది, ముజ్జడలది, యొంటికంటిది, వీరిని నింక ననేక రాక్షసాంగనలను దలవెంట్రుకలు విరియఁబోసికొన్నవారిని సీతాదేవికిఁ గావలియుంచి యుండెను. ఆదయ్యములవంటి రాక్షసకాంతలు రేయింబగలు మేలఁకువగలవారై పరుసనిపలుకులు పలుకుచు నా వెడఁదకన్నులుగల యాజానకీదేవినిగూర్చి యోయమ్మలారా! ఈసీత మనయేలికను సరకుగొనకున్నది. దీనిని నువ్వులంతగ ఖండించి మనము భక్షింతముని గొల్లుపుడు బెదరించుచుండిరి. ఇట్లు అొప్పుచు మాటిమాటికి వెఱపించుచున్న యారాక్షసస్త్రీలను గాంచి, వేడినిట్టూర్పులు నిగిడించి యోరక్కసులారా, నన్ను మీ రిచ్చవొచ్చునఁ గోసి తినుఁడు; నా కీజీవితంబున నాస లేదు. పుండరీకాక్షుఁడు,నల్లనై యడఁగిన కురులుగల యా రాము నెడఁబాసి, నేఁడే ప్రాణంబులఁ దొఱంగెద. మిట్టకిడ్చివేసిన తీఁగచందంబున నేను నిరాహారనై యిప్పుడ ప్రాణంబులఁ దొఱంగెద. నేను రాఘవునిఁదప్ప వేఱొక్కని నొందనని యెఱుఁగుఁడు. ఇఁక మీ యిచ్చవొచ్చునఁ జేయుఁడు. అని యాసీత పలుకఁగా, నా గయ్యాళులగు రక్కసులావృత్తాంతము నంతయు రావణున కెఱిఁగింప నేఁగిరి.

త్రిజట తనస్వప్నవృత్తాంతంబు సీతతో నుడువుట

అంతఁ బ్రియవాదిని ధర్మజ్ఞయు నగు త్రిజట యను రాక్షసవనిత యొక్కతె జానకిని సమీపించి యిట్లనియె. వైదేహీ! భీతి వీడి సంశయింపక విశ్వాసముతో నామాట లాలింపుము. ఈలంకాపురమునందు నవింధ్యుండను రాక్షసవర్యుం డొక్కం డున్నవాఁడు. అతఁడు వృద్ధుఁడు. మిక్కిలి ధీమంతుఁడు. సతతము శ్రీరామహితముఁ గోరువాఁడు. ఆమహనీయుండు తనమాటగా నిన్నూరార్చి యిట్లు నీతోఁ జెప్పు మనెను. ఓసీతా, బలవంతుఁ డయిన నీభర్త యగు శ్రీరాముండు సౌమిత్రితో క్షేమమున నున్నవాఁడు. పురుహూతసమానుం డగుసుగ్రీవునితో సఖ్యముగావించుకొని యతనిభటులమూలమున నిన్ను వెదకి తేర నుత్సహించి యున్నాఁడు పూర్వమున నీలంకాధిపతి గర్వాతిరేకంబున నలకూబరుని కను ప్రియాంగనయై యుండిన రంభను గామించి యాతనిశాపమును బొందియున్నవాఁడు. ఆకారణంబున నీదురాత్ముండు తన్నుఁ గామింపని పతివ్రత యగు నేవనితను బొందఁజాలఁడు కావున లోకకంటకుండగు రావణునిభయము వీడుము. లక్ష్మణసమేతుండై వానరసేనాపరివృతుండైన సుగ్రీవునితో రాఘవుం డీలంకకుం జొచ్చి యీపురమునందలి దుష్టుల సంహరించి నిన్ను వెంటఁ గొనిపోవువాఁడు. అంతేకాక నే నీదుర్మార్గులకుఁ జేటు వాటిల్లునట్టి కలఁ గంటి. వినుము. కారణము లేక తగునిది తగదిది యని, యెదలో వగవక యెల్లవారికిం జెడు గొనర్చుచు, సదా దేవతలతో మాత్సర్యంబువూనియుండు పాపాత్ముండు కాలముచేఁ గొట్టఁబడిన బుద్ధిగలవాఁడై గాడిదెలం బూన్చిన రథము నెక్కి నాట్యమాడుచు దక్షిణాభిముఖుండై చనుచుండుటను కలం గాంచితి. కుంభకర్ణుండు మున్నగువా రెఱ్ఱనిగంధమును మాల్యమును ధరించికొని తలవెండ్రుకలు విరియఁబోసికొని యాతనివెంట దక్షిణదిశకుఁ బోవుచుండుటం గాంచితి. వారిలో నొకరుండు విభీషణుం డనులంకేశ్వరు తమ్ముండు తెల్లనిపాగఁ జుట్టికొని తెల్లగంధము నలందికొని తెల్లనిపూలదండలం దాల్చి శ్వేతచ్ఛత్రముతనపైఁ బొలుపార సితపర్వతారూఢుండై ప్రకాశించె. ఆమహనీయుని వెంబడి నాతనిమంత్రులును శ్వేతపర్వతముపై వెలయుచుండిరి. దాశరథులశస్త్రాస్త్రములు లంకనంతటిని జుట్టుకొని నలుదెసలయందును నిండియుండె. సౌమిత్రి యుద్ధభూమి

యంపఁ జచ్చిన రక్కసుల నొసలకలప్రోవుపై నెక్కి పాయసము గుడుచుచుండెను. నీవును నెత్తుటం దోఁగినశరీరము గలదానవయ్యు మహనీయులగు శ్రీరామలక్ష్మణులచే రక్షింపఁబడి సౌమిత్రిసమేతుం డగు నప్పురుషపుంగవునితోడ విమానము నెక్కి యుత్తరాభిముఖివై పోవుటం గంటి. ఈవిధమున నాకలలో నింతయుం గంటి. కాఁబట్టి నీవు లక్ష్మణసమేతుం డగు శ్రీరామభద్రునితో వేగంబ కలసి ముదముతో నుండు వనఁగా నవ్వాక్యమునఁ బరిపుష్టినొందినదగు త్రిజటమాట లాలించి వైదేహి పతిసమాగమవేళమునకుఁ బ్రతీక్షించుచుండెను. ఇంతలోఁ గడు భీకరలగు పిశాచముఖలైన రాక్షసకాంతలు త్రిజటతో మాటలాడుచున్న సీతాదేవి నెప్పటియట్లు చుట్టుకొని కావలి కాచుచుండిరి.

## సీతారావణసంవాదము

అట సీతనుఁ గాపున్న రాక్షసాంగనలు సీతావృత్తాంతమును జెప్పఁగ విని రావణుండు వైదేహిం దలంచుకొని దేవదానవగంధర్వయక్షపన్నగుల యుద్ధమునఁ గెలిచినను మనసునిబాణపీడితుఁడై, నానావిధభూషణాంబరమాల్యములను ధరించినను భూషాలంకృతుఁ డయ్యుఁ గల్పవృక్షము వలెఁ గాక నల్లకాటియందలి వృక్షమువోలిక్కి భయంకరుఁడయి, రోహిణిని సమీపించు శనైశ్చరునిం బోలెఁ బతివియోగఖిన్నహృదయ యగుటం జేసి, మాసినచీరఁ గట్టి, శిరోరత్న మొక్కటి దప్ప వేఱుభూషణములు లేక దీనవదనయై, యశోకవనమధ్యంబున, శిలాతలమున సాగిలంబడి భయభ్రాంతయై యున్న వైదేహిం జేరి యిట్లనియె. జానకీ! ఇంతవఱకు భర్తపై ననురాగముఁ జూపినది చాలును. నీవు కోరినట్లు నన్నుఁ జూడుము. మేలైన దివ్యాభరణములను మాల్యములను వస్త్రములం దాల్చి నాచేయి పట్టుము. దేవవనితలు, గంధర్వసుందరీమణులు, దానవాంగనలు, దైత్యభామినులు నా పొందుఁ గోరి నన్ను సేవించుచున్నవారు. మఱియుఁ బదునాలుగుకోట్లపిశాచములు, ఇరువదియెనిమిదికోట్ల రాక్షసులు, నలువదిరెండుకోట్ల యక్షులును గనుసన్న మెలఁగుచుందురు. కొందఱుమాత్రమే నాతోఁబుట్టువగు ధనపతిం గొలుతురు. ఓసీ! చిన్నదానా! గంధర్వులు దేవవేశ్యలును దేవుఁడుకొని నన్నుఁ బానశాలయం దున్నవానిని సేవింతురు. పరమేష్ఠితుల్యుం డగు విశ్రవసుండు నాతండ్రి. లోకపాలుర

నలువురతోఁబాటు నన్నుయిదవలోకపాలుఁ డని చెప్పుదురు. దివ్యములగు నాహారపదార్థములు పురందరుభవనంబునంబోలె నాయింట నెల్లప్పుడును దఱుగక యుండు. కావున వనవాసక్లేశంబైన నీతోల్లింటి పాపకర్మము నేటితోఁ దొలఁగునుగాక. నీవు సుశ్రోణీ, మందోదరింబోలె నాకు దేవివై నాజయించిన యీలోకములనను నాప్రాణంబులకును నేలికసానివై యుందువుగాక. అని యారావణుఁడు పలుకఁగా, నాఘూర్తువచనంబులను మోహంపుఁబలుకులను విన నొల్లక జనకాత్మజ క్రోధారుణితనేత్రయై పెడమొగంబునేసి వానివంక వీక్షింపక గడ్డిపోచ నొకదానిని నడ్డంబుగా నిడి కన్నులనుండి దుఃఖావేశంబునం జారుచున్న యమంగళంబు లగు కన్నీటిధార లొండొంటితోఁ గదిసియున్న పాలిండ్లపైఁ గుఱిపించుచు నానిశాచరునితో నిట్లనియె. లంకేశ్వరా! నాదురదృష్టంబునంజేసి నేను నాసమ్ముఖంబున నీ వాడుచుండు నీతులువమాటల నాలకింపవలసె. నేను దాశరథి యగు శ్రీరాముం దప్ప నన్యపురుషునిఁ దలంప. నీమనస్సును నాపైనుండిమరల్చుకొనుము. నేను బరునిభార్యను. నీ కలభ్యను, పతివ్రతను. అదికాక, నీవు రాక్షసుండవు. నేను మానవాంగనను. నాపొత్తు నీకు రుచింపదు. మఱియును నాతలంపు నీపై నెంతమాత్రము లేదు. నీయందనురాగంబు లేనట్టినన్నుఁ గోరి యేటి సుఖము పడయుదు? మఱియుఁ బరమేష్ఠితుల్యుం డైనవిశ్రవసుఁడు నాతండ్రి యనియు, నేను లోకపాలతుల్యుఁడననియు, త్ర్యంబకసఖుండై రాజరాజను పేరఁ బ్రఖ్యాతుండగు ధనేశ్వరునకుఁ దమ్ముఁడ ననియు వచించితివి. అట్టిమహిమగల నీవు నిన్ను గామింపని స్త్రీని బలాత్కరించుట దగునే? ఇది ధర్మంబే? పరస్త్రీలం గోరుటయందు నీన యొక్కింతయైన లేదే? యని భయమున వణఁకుచున్న కుచంబులను, శిరంబును జెఱఁగుతోఁ గప్పికొని యేడ్చుచుండు నాసీతయొక్క వ్రేలాడుచుండునిడుదవేణి సడివిరియైన కాలసర్పముమాడ్కిఁ దోఁప, నాభీతహరిణేక్షణ చుట్టునుండు వనితలమనంబులు జల్లు మన నెలుంగెత్తి యేడ్చె. రావణుండును సీతయొక్కనిష్ఠురంపుమాటలచేఁ దిరస్కృతుండయ్యు బుద్ధిలేక, యంత నిలువక వెండియు నాదేవి కిట్లనియె. ఓవరారోహా! జానకీ! మదనుండు నిర్దయుండై బాణంబుల నామేనెల్లఁజిల్లులువడునట్లు నన్నుఁగొట్టుచున్నను నన్ను వలవని నిన్ను నేఁ బొందఁజాల.

.కాముని బారికి నిలువ లేను. అయినను మాకు భోజ్యవస్తు వగు మాన
వుంపగు రాముని పై నింకను గూర్మి వదలకున్నావు అని కొన్ని మాట
లాడి నిజనివాసంబునకు రాక్షసేశ్వరుం డరిగె. జానకియు రాక్షసస్త్రీ
గణపరివృతయై శోకపరీతచేతస్కయై త్రిజటాసేవితయై యయ్యశోక వనం
బునఁ గొన్ని నాళ్లుండె.

ఇట రామలక్ష్మణులు మాల్యవంతంబున సుగ్రీవానుమతిని గ్రీష్మ
వర్షర్తుకాలంబు లగునాలుగుమాసము లుండి శరత్కాలంబు రాఁగా
నందలి వెన్నెలరాత్రులలో గ్రహనక్షత్ర తారాగణంబులతోఁ గూడిన
చంద్రునిఁ గాంచి, కమలకుముదంబు నెత్తావిఁ గొని తిన్నగ వీచుమంద
మారుతంబులకు నిద్ర మేల్కాని సీతావియోగవిరహంబును సైరిం
పక రాఘవుండు సౌమిత్రిం బిలిచి యిట్లనియె. లక్ష్మణా! సుగ్రీవుండు
సీతను వెదకి తెత్తు నని మనకు మాటఁ జెప్పి తన కార్యమును మనచే
నెఱవేర్చుకొని గ్రామ్యధర్మము నవలంబించి తామసించుచున్నాఁడు.
ఇంతటిస్వార్థపరుండని నే నెఱుంగక వానిని వానరరాజ్యమున నభిషిక్తుఁ
జేసితి. వాని కిచ్చినబాసకై కదా మనము వాలిం జంపవలసె. వాలి
వధానంతరంబునం గాదె సుగ్రీవుండు కపికులంబునకు రాజయ్యె. వీఁడు
దీనినంతయు మఱచిన ట్లున్నాఁడు. ఇంతటికృతఘ్నుఁడయిన నీచవానరుఁ
డుండునే! కావున నీవు కిష్కింధకుం బోయి సుగ్రీవునింగని వాఁడు సీతా
న్వేషణతత్పరుండై యుండెనా నామాటలం జెప్పి వాని నిటకుఁ దోడ్తెమ్ము.
కానిచో సంకోచింపక వానిని సైతము వాలిమార్గము ననుసరించునట్లు
చేయవలయు. అప్పటికైనఁ బ్రయత్న పరుండయ్యెనా, వాని నిటకు వేగఁ
దోడ్తెమ్ము. నీవు జాగు సేయవల దనఁగా లక్ష్మణుండు ధనుర్బాణంబులం
బూని కిష్కింధాద్వారంబు దరిసి లోకములు గడగడ లాడ ధనుష్టం
కారము గావింప సూర్యసూనుం డగు సుగ్రీవుండు రామానుజునికోపం
బెఱింగి భార్యాసమేతుండై గుహ వెడలివచ్చి వినయవినమితోత్తమాం
గుండై లక్ష్మణునకుఁ బూజ లొనరింప సౌమిత్రి వానిని గ్రహించి శ్రీరా
ముమాటలం దేటపడం జెప్పెను. వానిని సుగ్రీవుండు సావధానుండై
విని సౌమిత్రి కిట్లనియె. ఓసౌమిత్రీ, రాఘవుం డట్లు తలంప నేల? నేను
మేలును మఱచువాఁడను గాను. కృపారహితుండను గాను. సీతా
న్వేషణమునకై పలు దెసలకు వానరసమూహములం బంపియున్నవాఁడ.

వారు నలుదెసలఁ గ్రుమ్మరి యన్నిచోట్లను వెదకి వచ్చుటకు నొకనెల యవధి యిచ్చితి. ఆనెలలో నిపుడిరువదిదినము లతిక్రమించెను. ఇంక నైదువాసరంబు లున్నయవి. వారెల్ల రేతేరఁగా సీతావృత్తాంతంబంతయు నివేదింప శ్రీరాముకడ కేతేర నున్నాఁడ. ఇది నాకృతయత్నంబు. అని చెప్పఁగా విని సౌమిత్రి వానియెడఁ బ్రీతుండై వాని ననునయించి శ్రీరామసన్నిధానంబున కతనిఁదోడ్కొని యరిగి యంతయు విన్నవించుటయు రాఘవుండు సంతసించి కపివర్యులవలన సీతావృత్తాంతంబు వినుటకు వేచియుండె. ఇంతలో దక్షిణపుదెస కేఁగినవారు దక్కఁ దక్కిన వానర నాయకు లేతెంచి తాము గ్రుమ్మరిన స్థలములలో సీతను గానమైతి మని విన్నవించిరి. దక్షిణపుదిశ కేఁగిన వానరులు సీతావృత్తాంతంబుఁ నెఱింగి వత్తురని యడియాసతో శ్రీరాముండును మేనం బ్రాణంబుల నుంచియుండె. అంత మఱియు నొకనెల గడచినను సుగ్రీవునుద్యాన వనమును పాలించుచుండిన దధిముఖుం డనువానరుం డొక్కనాఁడు సుగ్రీవుపాలికిం జనుదెంచి ఘోరంబుగా నేడ్చుచు నిట్లని వచించె. దేవా! వాలిదినంబులనుండి చక్కఁగాఁ గాపాడఁబడుచు శృంగారవనం బను పేరొందిన మధువనం బను నీయుద్యానవనంబును హనుమంతుఁడు నంగదుఁడు మున్నగు వానరనాయకులు ప్రవేశించి నిర్భీకులై మమ్మెల్లఁ గొట్టి మాయాజ్ఞల సరకుగొనక చెట్లలోఁ బండినపండ్లను తేనెతెట్టెలలోని మధువులను భక్షించుచుఁ ద్రావుచున్నారు. ఎంతయడ్డు పెట్టినను నిలువరు. వారిని దగినట్లు శిక్షింపవలయు ననఁగా సుగ్రీవుండు వారుపోయిన కార్యము జయప్రదమై యుండనోపు. కాకున్న వారింత దుండగంబు లొనర్తురే? వారు సీతావృత్తాంత మంతయు నెఱింగియుందురు. ఇయ్యది కార్యమును సాధించిన వారివర్తన మని యూహించి వారి యుదంతమునంతయు శ్రీరామునకు విన్నవించె. శ్రీరాముండును సుగ్రీవునియభిప్రాయమును దొలుతనే యెఱింగె.

### హనుమంతుండు సీతను జూచినవృత్తాంతంబు రామునితోఁ జెప్పుట

అంతఁ గొంతవడికి దక్షిణదిక్కునకుఁ బోయిన హనుమంతుండు మున్నగు వానరులు సుగ్రీవసౌమిత్రులతో నుండు శ్రీరామునిసన్నిధానమున కేతెంచిరి. వారిముఖవికాసంబుఁ జూడ వారు సీతం జూచివచ్చిన వారలని శ్రీరాముం డూహించి వారివృత్తాంతంబు నడుగ నుండఁగా

ష్టా రెల్లరు శ్రీరామునకు మ్రొక్కిరి. అప్పుడు శ్రీరాముండు వారల
నందఱ నొకతీరున సంభావించి యిట్లనియె. వానరప్రవరులారా! నన్ను
బ్రతికింతురే? మీరు పోయిన కార్యము నెఱవేర్చుకొని ధన్యులై
యేతెంచితిరే? యుద్ధ మొనర్చి యరాతుల నిర్జించి సీతం దేకున్న నే
జీవింపఁజాల నని పలికిన శ్రీరాముముఖమునం జూచ్చి నిలిచి హను
మంతుండు మహాత్మా! కంటిని సీతను నే నని ప్రీతిపూర్వకముగ వార్తఁ
జెప్పి మఱి యిట్లనియె. దేవా! మేము నతిదూరమున నున్న కొండగుహ
లను, వనములను, నదీతీరములను సరోవరప్రాంతములను నంతటను
సీతను వెదకితిమి. ఇట్లు వెదకుచుండఁ బోవుచుండ మిక్కిలి డస్సియున్నప్పు
డొక్కనాఁడు మే మొకపొంతబిలమున ప్రవేశించితిమి. అయ్యది
బహుయోజనవిస్తీర్ణంబైనది. బహుదూరము దట్టమైనచీకటితో
నావరింపఁబడి మే మొకరి నొకరు గుర్తింపుటకు నైనను వీలుగాకపోయి
నది. అది నానావిధకీటకములతో నిండియుండె. అంతఁ గొంతదూరము
పోఁగాఁ బోఁగాఁ వెలుతురుఁ గాంచి యచ్చోట నొకదివ్యభవన
మును వీక్షించితిమి. అది మయుండను దానవుని భవనముగా విచారిం
చినపిమ్మట నెఱింగితిమి. అందు ప్రభావతియను తాపసకన్యకయొకర్తు మాకు
దివ్యాన్నఫలంబులను మధురపానీయముల నొసంగి యాతిథ్యం బిచ్చె.
మేము వాని నన్నింటిని దినిన తృప్తి నొందిన పిదపఁ దేవీ, బలవంతులమై
యాతాపసకన్యకచే వెలువడనియ్యఁబడి సముద్రతీరంబున నున్న
సహ్యమలయపర్వతంబులం గాంచితిమి. ఆపర్వతములు మూఁటిలో
మలయమను నొక్క పర్వతమునందుండి యనేకశతయోజనములవిస్తీ
ర్ణము గలదియు, మహామత్స్యము లగు తిమితిమింగిలములు తిరుగు
చుండుటచే భయంకరస్వరూపమగునదియు, నొకసమయమున కెగయుచుండు నెత్తైన
యలలను ఘోరమకరములచే బహువిధభూతభూతజాలంబులు గలదియు నగు
సముద్రముం గనుంగొంటిమి. అప్పుడు మాకు వేదనారూపమైన సంశయ
మొకటి జనించె. శతయోజనవిస్తారమగు సముద్రమును దాఁటు టెట్లు?
సీతం గాంచు టెట్లు? కాంచక మఱలి శ్రీరాము సుగ్రీవులకడ కేఁగు
టెట్లు? కావున నుపవాసంబులఁ గొనక గొంతకాలము గడపి శరీరత్యా
గంబు సేయుటయే యుక్తమని నిశ్చయించి మహాపవిత్రమనస్కులమై ప్రాయోప
వేశమును జేసి శ్రీరాముకార్యభ్రష్టులమై జటాయువు దేహమును

విదలె నని యాగ్రద్దలతేనివృత్తాంతంబుఁ జెప్పుచుంటిమి. ఆసమ యమునందుఁ బర్వతశిఖరోపమంబగు ఘోరరూపముతో నంద. అను భయముఁ దోఁప రెండవగరుత్మంతుఁడో యన నొకపక్షి మమ్ముం దినఁ దలంచి మాసమీపమున కేతెంచి యిట్లని యడిగె. ఓరీ యెవఁడుర రా! జటాయువుకథను నుడువుచుండువాఁడు? మీర లెవ్వరు? నే నా జటాయువున్న యగు సంపాతిని. పూర్వ మొకప్పుడు నేనును జటాయువును బంతంబుఁ బూని సూర్యసన్నిధి కెగురుచుండఁగా నాఱెక్కలు సూర్యకిరణములవేడిమిచే దహింపఁబడ, నే నీకొండచరియం బడితి. వాని ఱెక్కలు గాలవయ్యె. వానివృత్తాంతమును మీ రెఱింగినచోఁ జెప్పుఁ డని వేఁడఁగా మేము మీవనవాసవృత్తాంతంబును, జటాయు మరణకథను జెప్పితిమి. అంత నాసంపాతి దుఃఖితుఁడై 'రాముఁ డెవఁడు? సీత యెవతె? జటాయు వెందులకుఁ జచ్చెను? ఓవానరోత్తములారా? మా కీవృత్తాంతమంతయు నెఱిఁగింపుఁ'డని యడుగఁగా నీ కీ వ్యసనము నకుఁ గారణంబును, మాప్రాయోపవేశమునకుఁగారణమును సవిస్తరము గఁదెలిపితిని. అంత జటాయువుమరణంబు విని కొంతసేపు వనటం గుంది మాప్రాయోపవేశము నుడువువాఁడై మమ్మూరడిల్లఁ బలికి మా కిట్ల నియె. అయ్యలారా! రావణు నే నెఱుంగుదు. లంకాపట్టణము వాని రాజధాని. ఆ లంకాపురము సముద్రమధ్యమున దక్షిణదిశయందుఁ ద్రికూటగిరికందరమున నున్నయది. ఆపట్టణంబునందు రావణుండు జానకిం దాచియున్నవాఁడు. అవ్విషయమున నాకు సందేహము లేదు. మీ రచటికిం బోయి సీతను వెదకి రండు. అని చెప్పఁగా మాలో నెవ్వరు నపారంబును శతయోజనవిస్తీర్ణమును దశయోజనా యతంబును నైనదాని నొక్కపెట్టున దాఁటఁజాలక మంతనం బొనర్చు చుండ నెవ్వరును దెగించి యాకార్యమునకుఁ బూన రయ్యె. అంత నేను సాహసించి నాతండ్రి యగు వాయుభట్టారకు నావేశించి దాఁటు చుండఁ గడలినడుమ సింహికాప్రతిరోధము మున్నగు ననేకాతంక ముల నీగి యామహాసముద్రంపు టవ్వలిగట్టుం జేరి లంకాపురిఁ బ్రవే శించి యందు రావణునియుద్యానవనంబున నందనోపమానం బగు నశోకవనంబునం దుపవాసాదులచేఁ గృశించినదియు, స్నానాద్యంగసం స్కారంబులు లేమిచే మలపంకదూషితయు, నీదర్శనమును సర్వదా

కాంక్షించుచు నీనామస్మరణమే తనకు గతిగా భావించుచుండు వైదే హిం గని, పెక్కుగుర్తులచే నాదేవి నీదేవిగా నెఱింగి యొంటరినై సమీ పించి యావైదేహితో నిట్లంటి. దేవీ! నేను శ్రీరామదూతను. సుగ్రీవు బంటను. హనుమంతుం డనువాఁడను. శ్రీరామాజ్ఞఁ గొని సముద్రం బవలీలం దాటి యీపురంబున, వెదకి యీవనంబున నిన్నానవాలు పట్టితి. శ్రీరామలక్ష్మణులు క్షేమంబున నున్నవారు. సర్వవానరులకు రాజగు సుగ్రీవుం డనుమహనీయుండు వారి కిప్పుడు చెలికాఁడయి యున్నాఁడు. ఆసుగ్రీవునాజ్ఞ మెయి వానరవీరు లనేకులు నిన్ను వెదకు నిమిత్తము పలుదెసల కేఁగిరి. నేనును మఱికొందఱువానరులతో నీదెసకు వచ్చి మాభాగ్యవశంబున నీసుదినంబున నిన్నుఁ జూడఁగంటి. శ్రీరామ లక్ష్మణసుగ్రీవులు నీకుశలము నడిగి ర మ్మనిరి. శ్రీరాముండు వానరసై న్యంబుతో నతిశీఘ్రకాలమున నిట కేతెంచి నిన్నుఁ దోడ్కొనిపోవ నున్నవాఁడు. నన్ను సంశయింపకుము. నేను రాక్షసుండను గా నని చెప్పఁగా సీతాదేవి ముహూర్తమాత్రం బాలోచించి నా కిట్లనియె. ఓవానరోత్తమా! మహనీయుండును వృద్ధుండును నగు నవింధ్యుండను రక్కసుండు ముందు నాకు శ్రీరామసుగ్రీవసఖ్యమును దెల్పియున్న వాఁడు. కావున నిన్ను మాయావిఁగా నెంచను. నిన్ను నిక్కంబ వాన రుండ వగుహనుమంతుఁగాఁ దలంచెద. శ్రీరామసన్నిధికిం బోయి నా వృత్తాంతం బెల్ల సాంతంబుగా వివరించి, నే నీరత్నం బొసఁగితి నని చెప్పు మని, యీ చూడామణిని సీత యొసంగె నని దానిని శ్రీరాముని కొసంగె. ఇట్లు హనుమంతుఁడు రత్నము నిచ్చి 'ఓరాఘవా, మఱియుఁ గొన్నియానవాళ్లను వచించె. మీ రెల్లరు చిత్రకూటంబున వసించు చుండ నింద్రసుతుండు కాకాసురుఁడు తన్ను వేధించుటయు వెంటనే నీవు కసవుపోచ నభిమంత్రించి వానిపై పైవ నయ్యది ఘోరాస్త్రంబై వానివెంట నంట వాఁడు త్రిలోకంబులు దిరిగినను నయ్యది వాని వేధింపఁ దుదకు వాఁడు నీపాదములపైఁ బడఁగా నీవు వానిని రక్షించి యార్తత్రాణపరాయణుండవైతి వనియుఁ జెప్పె. అంత నే నద్దేవియనుజ్ఞఁ గొని బయలువెడలి లంకం గాల్చి రాక్షసులకుఁ జిక్కినట్లు నటింపఁగా వారు నన్నుఁ ద్రాళ్లతోఁ గట్టి రావణునిముందుకుఁ గొనిపోయిరి. వానిసభయందు నేను నీ ప్రతాపము నుగ్గడించి యంత లంకం గాల్చి,

మగిడి యేతెంచితి. అని విన్నవింపఁగా శ్రీరాముండు సీతాదేవి యిచ్చిన చూడామణిని మఱిమఱి గాంచి తనహృదయేశ్వరిం గాంచినట్లు సంతసమందె.

### నానాదేశంబులనుండి వానరులు సుగ్రీవునొద్దకేతెంచుట

అవ్విధమున శ్రీరాముండు సీతావృత్తాంతమును వినినంతనే సుగ్రీవు మొగంబై చూడ్కి నిలిపి యిఁక మనమెత్తిపోవుటకు వలయు వానరసైన్యము నాయిత్తము సేయుము మనఁగా దూరమున నుండు వనములలోను, గొండనెత్తములలోను నుండు కపివీరుల కెల్లరకు సుగ్రీవుండు రామాజ్ఞఁ దెలిపె. వెంటనే వాలిశ్వశురుఁడగు సుషేణుండు కోటిసహస్రసంఖ్యగల కపులతో వచ్చెను. గయగవయులు వేర్వేఱ కోటిశత వానరులతో నేతెంచిరి. గవాక్షుఁడను వాఁడరువదివేలకోట్లసైన్యముతోఁ జనుదెంచె. పనసుఁ డేఁబదిరెండుకోట్లతోఁ గూడి వచ్చె. దధిముఖుఁడను ముసలికోఁతి యసంఖ్యాకములగు వీరులతోఁ గలసి నడచి వచ్చె. జాంబవంతుండు నీలదేహంబులతోను, తెల్లనివంతములతోను, గూడి లెక్కింపనలవికాని యెలుఁగుబంట్లవాహినితో నేతెంచె. ఇవ్విధమున నేఁగుదెంచిన పలువన్నెలబుజు వానరగోలాంగూలసేన యంతయు మహాసముద్రముంబోలెఁ గిష్కింధచెంత నెగడుచు, దుముకులాడుచు విచ్చలవిడిగా సంచరించుచుండుటం జేసి ధరణీపరాగంబు వెల్లువ లేఁగఁ దొడఁగె. అంత మేలైన వారనక్షత్రయుతంబై యుండుతిథియందు నొక్క మంచిముహూర్తమున నక్షత్రసమూహపరివృతులగు సూర్యచంద్రుల మాడ్కి నా శ్రీరామలక్ష్మణులు కపిసేనాపరివృతులయి లంకాపురిముట్టడింప యుద్ధయాత్ర చాటించి రావణుపై నెత్తి నడచిరి. వానరసైన్యమంతయు వీరాలాపములతో నభోభాగంబు ఘూర్ణిల్ల సేనాముఖంబున హనుమంతుండును నలుపార్శ్వంబుల మైందద్వివిదనలనీలాంగదులును రక్షకులై నడచిరి. అట్లా వానరసైన్యము ప్రయాణమై యెచ్చటెచ్చట వనములలో ఫలములును, నిర్మలోదకములు నున్నవో యాయాస్థలములయందు విడియుచుం గొన్నిదినములకు దక్షిణపారావారతీరంబు దరిసి, ఘూర్ణిల్లుచు రెండవసముద్రమో యన నెగడె. అంతట శ్రీరాముండు నాయకులగు కపులు వినుచుండ సుగ్రీవుంజూచి యిట్లనియె. వానరాధిపా! వినుము. మనసైన్యము మిక్కిలి విరివియై యున్నది. సముద్రమును

దాటుట కష్టతరము. దీని నిప్పుడు దాటించుట కుపాయమును మన మూహింపవలయును. ననఁగా నాకపివీరులు కొందఱీ సముద్రము నవలీలగ దాటవచ్చు ననిరి. మఱికొందఱు తెప్పలం గట్టుకొని తన్మూలమున దాటుద మనిరి. ఇంకఁ గొందఱు వర్తకుల యోడల నాక్రమించుకొని వానిమూలమున దాటవచ్చు ననిరి. వారియాలోచనల నన్నింటిని శ్రీరాముండు విని శతయోజనవిస్తారంబైన యీసముద్రము నెవరో కొందఱు వానరులు దాటఁగలుగుదురు గాని యితరుల కిది సాధ్యము కాదు. ఇంతవిస్తారమగు సైన్యమును దాటింపఁ దెప్పలు గాని యోడలు గాని చాలవు. ఇంతేగాక సముద్రతీరమున నున్న యోడల నన్నింటిని మనము స్వాధీనపఱచికొనినచో వర్తకులకుఁ గార్యహానివాటిల్లి వాణిజ్యంబు నిలుచును. వారలకు మనవలన హాని కలుగరాదు. మఱియును మన మీయోడలలోఁ గొంచపోయిన నెక్కడ సముద్రమధ్యమునఁ బోవుచుండ మనశత్రువు లోడల ముంచివేయుటకు యత్నింతురు. అట్టిస్థితియందు సైన్యనాశము సంభవము. మనకుఁ గార్యహాని యగు. నీయుపాయములలో నొక్కటియుఁ బనికిరాదు. నే నొక్కటి నుడివెద వినుండు. నేను నిష్ఠఁ బూని యుపవసించి సముద్రుం బ్రార్థించెద. అప్పుడు సముద్రుండు ప్రసన్నుం డగును. నాకు లంకకు సైన్యమును గొనిపోవుటకు దారి నతఁడు యిచ్చు. లేనిచో నాబాణములచే సముద్రజలముల శోషింపఁ జేసి సముద్రమధ్యంబున దారి తీసి సేనను లంకకుఁ జేర్చెద. ఇదియ కర్తవ్య మనెను.

## శ్రీరాముఁడు దర్భశయన మొనర్చుట

ఆవిధమున నిశ్చయించుకొని శ్రీరాముండు లక్ష్మణసమేతుండై యాచమించి సహస్రాకారము దర్భలను బఱచుకొని పరుండెను. అంతఁ గొంతవడికి సముద్రుండు జలజంతుసమేతుండై శ్రీరామునకు స్వప్నమున సాక్షాత్కరించి యిట్లనియె. కౌసల్యానందనా! నీ విట్టి తీవ్ర వ్రతముం బూనితివి? ఏను రత్నాకరుఁడను. పురుషోత్తమా, నీకోర్కి యెట్టిది? నీ కేసాహాయ్యము నావలనఁ గావలయును? వివరింపుము. సత్యపరాక్రమా, రామా, నే నిక్ష్వాకుపుత్రులచేఁ ద్రవ్వఁబడితిని. నీకు దాయాదుఁడ నని దెల్పఁగా రాముం డిట్లనెను. నేను నిన్ను దాటి లంకను బ్రవేశించి పౌలస్త్యకులపాంసనుం డగు రావణుం బరిమార్చి సీతం దో

ద్దెచ్చుటకు వ్రతముఁ బూనితి. అచ్చటికి నావానరసైన్యముతోఁ బోవు టకుఁ ద్రోవ యిమ్ము. నీవు దారి యీయవేని నాదివ్యాస్త్రంబుల నీపైఁ బ్రయోగించి నీజలంబు లింకిపోవునట్లొనర్చి పిదప నాసైన్యముతో లంకను జొత్తు ననఁగా సముద్రుండు శ్రీరాముకోపమునకు గడగడ వణఁకుచుఁ జేతులు మోడ్చి యిట్లనియె. రాఘవా! నీయుద్యమమున కాటంకము నేను జేయను. నీకార్యమునకు విఘ్న మాచరింపను. నా మనవి విని కర్తవ్యము నాలోచింపుము. నీయాజ్ఞచొప్పున సేనకు దారి నిచ్చితి నేని యింకమీఁద నిట్లే యితరులును నా కాజ్ఞ సేయు దురు. వారల కెల్ల నేను దారిఁ దొలంగవలసియుండును. కావున నొక యుపాయము సెప్పెద. నీసైన్యమునందు విశ్వకర్మకుమారుండు శిల్ప శాస్త్రవేత్త నలుం డనుకపివరుండు గలండు. ఆనలుఁడు గడ్డిపోచనుగాని కొయ్యలనుగాని, ఱాతినిగాని నాపై వైవ నేను దానిని దేల్తును. అవి నన్ను దాఁటఁ గట్టయగు. ఆసేతువుపై నీవు సేననునడపించుచు నన్నుఁ దాఁటి యథేచ్ఛ లంకనుజొత్తువు. అనిచెప్పిసముద్రుం డదృశ్యుండయ్యె. అంత శ్రీరాముండు దర్భశయనమునుండి లేచి శిల్పశాస్త్రజ్ఞుండైన నలుఁ జేరి యిట్లనియె. వానరపుంగవా, నీకు శాస్త్రప్రావీణ్యముఁ జూప నదను తటస్థించినది. నీవీసముద్రముపై సేతువుంగట్టుము. నీ వాకార్య మొనర్ప సమర్థుండ వని నాతలంపు. అని రాముం డానతీయ నలుం డా వానరులు దెచ్చిన తరుకాష్ఠములచేతను బర్వతశిఖరంబులచేతను బదియోజన ములవెడల్పును నూఱుయోజనముల నిడివియుంగల సేతువును సముద్ర మునఁగట్టెను. దానినే యిప్పుడు నలసేతువందురు. ఆసమయమున రావ ణునితమ్ముండు విభీషణుం డనువాఁడు తననలువురుమంత్రులతో శ్రీ రాముశరణు వేడరాఁగాఁ గౌసల్యాపుత్త్రుం డాతని స్వాగతంబడిగి ప్రియ వార్తలం దేల్చె. అంత సుగ్రీవుండు శ్రీరామున కిట్లనియె. రాజేంద్రా! ఈతండు శత్రుపక్షమువాఁడు. రావణునివేగులవాఁడై యుండ నోపు. వీని నమ్మరాదు. అని విభీషణువిషయమై సందియపడఁగా శ్రీరా ముఁ డామహనీయునిమాటలసవ్వడిని నింగితవర్తనములను బాగుగ గుర్తించి యాతండు తన్నాశ్రయించి జీవింప వచ్చె నని తెలిసికొని యావిభీషణునకు సర్వరాక్షసరాజ్యపట్టాభిషేకంబుఁ గావించి, తనకు ముఖ్యామాత్యుంగా భావించి, వానికిని సౌమిత్రికిని మైత్రిఁ గలిగించి,

యాతండను దారి సెప్ప నలసేతువుపైఁ గపిసైన్యమును సముద్రమును దాటించి, యక్కడనంపు దెసఁ దనసకలసైన్యముతో లంకయందు విడియించె. అచ్చోట నానాఫలమూలములతోను, మధురశీతలవారిపూరంబుగల సరోవరంబులతోను నొప్పారుచు దేవేంద్రునినందనవనమువంటి యొక్క వనమును దనకును దనయపారవానరసేనకు నెలవుగాఁ గొని మిక్కిలి జాగరూకుండై మెలంగుచుండె. ఆసమయమున రావణునిమంత్రులు శుక సారణులనువారు వేగులయి రామునైన్యమందు సంచరించుచుండ విభీషణుండు వారలం బట్టితెచ్చి శ్రీరామున కప్పగించె. వెంటనే వారును దమరాక్షసరూపములను ధరించిరి. రాముండును వారు వేగులని యెఱింగి వారికిఁ దనసైన్యము నంతయుంజూపఁ బంచె. పిదప వారు సేన నంతయుం జూచి శ్రీరాముని సెలవువేఁడగా నతఁడు వారిని విడిచిపుచ్చుటయు వారు వెంటనే శ్రీరాము బాసుండి తొలంగి రావణుసమీపమునకుం బోయి యిట్లనిరి. రాక్షసేంద్రా! వినుము. రామలక్ష్మణులపరాక్రమంబు విస్తారంబు. వారిబలం బపారంబు. వారిసైన్యము లెక్కింప నలవి కానిది. అని వివరించిరి. అంత రావణుండును లంకాపట్టణంబుచుట్టు నున్న యగాధములగు నగడ్తలలో నింపుగ నీళ్లు నింపి యేడుపరిఖలలోను జంత్రకొయ్యల గూటములు నాటించి, కోటవాఁకిళ్లయందు వీరభటులను గావలికాండ్రను నియోగించి, వారికి నానాయుధంబుల నొసంగి, పురద్వారములయందు నానావిధాయుధసమేతులగు వీరభటులఁ గాపుంచి, యేనుఁగులను గుఱ్ఱములను బరిశోధించి, యన్నిస్థలములయందును గవాటయంత్రములఁ బనిలేకుపఁ దగుకార్యకర్తల నియమించి యత్నయుక్తుండై యుండె.

## అంగదరాయభారము

కపిసైన్యమును డించినస్థలమందుండి శ్రీరాముండు తాను మున్నుగ యుద్ధమునకుఁ దెగింపక వాలిపుత్త్రుని నంగదునిఁబిలిచి నీవు రావణునగరు సొచ్చి రావణునితో రాయబారము నడిపి రమ్మనఁగా నత్తారాసుతుండు లంకంజొచ్చి తన రాక లంకాధిపతి కెఱింగింప నంగదు రాకకు లంకేశ్వరుండు సమ్మతించె. అంగదుండును రావణు నాస్థానంబుఁ జొత్తెంచి మేఘమాలలచే నలంకరింపఁబడిన భానునివగిది స్వీయతేజఃపుంజంబున నలు

దెసలు వెలింగించుచున్న రావణాసురుం జూచి వాని కిట్లనియె. రాక్ష
సాధిపా! నేను శ్రీరాము నాజ్ఞచే నిచ్చటికి దూతగా వచ్చినవాఁడను.
ఆమహనీయునిసందేశము నాలకించి యట్లొనర్చి మేలు గాంచుము.
అన్యాయకరుండవయిన రాజద్రోహమునం జేసి రాజ్యంబును దేశంబును
నగరంబులును నశించు. పరభార్యను సీత నపహరించిన నీయొక్కరునిపాప
మపరాధము గావింపని నీప్రజలనెల్ల నిష్కారణ నశింపఁజేయుదువు. ఇంతియ
గాక పూర్వము నీవు బలగర్వితుండవై వనవాసులగు మునులను, దేవత
లను, రాజులను, స్త్రీలను బలవంతముగా హింసించి యుంటివి. ఆపాపఫలం
బనుభవింపఁ గాలంబాసన్నమయ్యె. ఇప్పుడైనను దెలివిఁదెచ్చుకొని సీతను
జెఱవిడువుము. కానిచో నిన్ను నీవారలను నేను వధింతును. పౌరుషంబు
గల మానిసివైతివేని నాతోడం బోరాడి నాయస్త్రవిద్యాప్రభావంబుం
గనుము. సీతను వదలకున్న నీవు నీప్రాణంబులతో మనఁజాలవు. వాఁడినా
రసములసమూహములఁ బ్రయోగించి నిన్ను గాల్చిచ్చువలెఁ బొడిచి
లంకలో నెల్లరాక్షసులను నిర్మూలంబు గావింతు నని తనమాటగా రఘు
నాయకుండు నీతో నన్నుమనెను. అంత రావణుం డాయుపన్యాసపుమా
టలను విని, క్రోధతామ్రాక్షుండై యంగదునిఁ జెఱపట్టుఁ జూచుచుండ
నా రాక్షసేశ్వరుని మనోభిప్రాయంబెఱింగిన రాక్షసవీరభటులు నలువు
రంగదుం బక్షులు గ్రోల్లులిని బోలెఁ బట్టికొనిరి. అంగదుండును వారిని
లక్ష్యపెట్టక, తటాలున వారితోన పైకెగిరి యొక్కవిదిలింపు విదిలించి
యుప్పరంబున కెగసి రావణప్రాసాదతలంబు నారోహించుటయు, నప్పు
డంగదుం బట్టికొనిన రాక్షసభటులు పైనుండి క్రిందఁబడి మూర్ఛపోయి
మడిసిరి. అంగదుండును, రావణాది రాక్షసవినాశ సూచకముగా
వెంటనే వాని యాస్థానమంటపముపై నుండు శిఖరము నొక్కతన్ను దన్ని
నేలం గూలఁద్రోచి యాప్రాసాదంబునందుండి చెంగుమని యొకదాఁటుగు
రెగిరి లంకందాటి స్వీయశిబిరముం బ్రవేశించి రాముం జూచి యచటి
వృత్తాంత మతనికి నివేదింప నావాలిపుత్త్రుసాహసంబునకు శ్రీరాముండు
సంతసించె. అంగదుండును రామునిపొగడ్త నొంది కొంతతడవ వలసటఁ
దీర్చుకొనెను.

అంత శ్రీరాముఁడు వాయువేగు లగు వానరుల నొక్కుమ్మడిగఁ దోడ్కొనిపోయి వారిని లంకాపురప్రాకారంబు నిడియఁగొట్ట నానతిచ్చెను. లక్ష్మణుఁడు విభీషణజాంబవంతులను మున్నిడుకొని శత్రువుల కభేద్యం బయినలంకాపురదక్షిణద్వారంబును బడఁగొట్టెను. అపుడు రక్తవర్ణు లగు వానరులు పెక్కండ్రును, వ్రేలుడుబుజములు, గోళ్లు, పిక్కలును గలిగిన మూఁపుకోట్లపొలుఁగుబంట్లును లంకను ముట్టడించిరి. వానరులు క్రిందినుండి పై కెగురుచు, మఱలఁ బైనుండి క్రిందికిఁ బడుచు నిట్టు పోఱలుచునుండఁగా లంకాపురంబునందలి వీథులందు దుమ్ము రేఁగి సూర్యబింబముఁ గప్పుటయు జీకట్లు గ్రమ్మిన తెఱఁగు దోఁచె. పక్వసస్యమునుఁగఁ బోలుచాయను, శిరీషపుష్పసదృశులును, బాలసూర్యప్రతిములును, కొండగోఁగు పువ్వులవన్నెలవారు నగు వానరులును ప్రాకారంబుపై గెక్కఁగా నది యంతటఁ గపిలవర్ణంబై యుండెను. అప్పుడా లంకాపురంబునందలి రాక్షసు లాబాలస్త్రీవృద్ధముగా మోరలెత్తి యావానరులను విస్మయంబుతోఁ గాంచుచుండిరి. అట్టితఱి వానరులు స్తంభములను *గర్భగోష్టంబులనెడి గృహములశిఖరములను బడఁగొట్టిరి. అచ్చట నున్న యంత్రముల నూడఁదీసి విసరివైచి, గుంపులుగూడ శతఘ్ను లనెడి యాయుధంబులు గైకొని గర్జిలువెట్టుచుఁ బురమధ్యంబున గుండ్రాళ్లు, చక్రములు మున్నగు నాయుధములు ఉవ్వచుండిరి. ఇట్లు వానరు లాయుధంబులఁ గొని తఱుముచుండఁ బ్రాకారంబుపై నున్న నూఱులకొలఁది రాక్షసులగణంబులు భీతిల్లి నలుదెసలకుఁ బఱచిరి. అంత రావణుండు వానరు లొనర్చిన కలవరపాటెఱిఁగి, కామరూపులగు రాక్షసులను బెక్కండ్రను వానరులపైకిఁ బంపఁగా, మహారాశిసదృశులైన ఘోరరూపులగు నారాక్షసు లందఱు శరవర్షంబులఁ గురిపించుచు నాప్రాకారంబుపై నున్న వానరుల నందఱను బారఁదోలిరి. రాక్షసు లేసినబాణములచే నవయవంబులు విఱుగఁగా వానరపుంగవులు పెక్కండ్రు వివశులయి క్రిందఁ గూలిరి. అట్లే వానరులును స్తంభశృంగముల విఱిచి రాక్షసులఁ గొట్టఁగా వా రందఱు భిన్నాంగులై నేలఁ గూలిరి. ఇట్లు వానరరాక్షసులు కొంతదడ వొండొరులను జుట్టుజుట్టు పట్టుకొనియు, గోళ్లతో నఱకియుఁ, గోఱలతోఁ గొఱుకు

* పల్లపుబయళఁ గట్టబడినగృహములు గర్భగోష్టము లనఁబడును.

కొనియుఁ బెడబొబ్బలిడుచుఁ బైనుండి క్రిందఁబడుచు నొండొరులు పీడక పెనఁగులాడుచుండిరి. అపుడు శ్రీరాముఁడు క్రొక్కారుమబ్బు చాడ్పున శరజాలములఁ గురిపించుచు నాలంకయందలి రాక్షసులను సంహరించెను. విలుకాండ్రమేటి యగులక్ష్మణుఁడు శ్రమము సరకు గొనక, దుర్గంబులో నున్న రాక్షసులను సూటిపెట్టి శరజాలంబు లేసి క్రిందఁబడఁద్రొబ్బెను. ఇట్లు కొంతతడవు వానరులు రక్కసులతోఁ బోరినపదంపడి శ్రీరామునాజ్ఞచేఁ దమసన్నివేశంబులందు విడిసిరి. తర్వాత రావణునిభృత్యులగు పర్వణ, పతన, జమ్భ, ఖర, క్రోధవశ, హరి, ప్రరుజ, జారుజ, ప్రఘసాదు లయిన పిశాచ క్షుద్రరాక్షసుల గణంబులు పెక్కులు వానరుల కదృశ్యులై యాకసంబునుండి వారిపైఁ బెక్కులు బాణంబులు గురిపించుచుండ, వారిమాయ లెఱింగినవిభీషణుఁడు వారిని గనిపట్టి యీయఁగా, దూరమునకు బాణంబులేయు వానరులు బాణము లేయఁగా నారక్కసు లందఱు నిహతులై యసువులఁ దొఱఁగి నేలం గూలిరి.

అంత నారక్కసు లందఱు కపిబలహతులు కాఁగా రావణుం డెఱ్ఱనికన్నులనుండి నిప్పులు రాల్చుచు ననేక రాక్షసపిశాచదానవుల బలముం గూర్చుకొని గొప్పసైన్యము వెంట రాఁగా యుద్ధరంగంబున నౌశనసవ్యూహంబుఁ బన్ని వానరసేనపైఁ బడఁగా రాముండు వాని పరాక్రమమును వీక్షించి వానివ్యూహంబునకుఁ బ్రతిగాఁ గపిబలంబుతో బార్హస్పత్యవ్యూహముం బన్ని ప్రతిఘటించి నిలిచెను. అప్పుడు రామరావణులకును, లక్ష్మణేంద్రజిత్తులకును, ప్రహస్తవిభీషణులకును, సుగ్రీవవిరూపాక్షులకును, తారనిఖర్వటులకును, నలపౌండ్రులకును, పనసపటుశులకు, నిట్లు సమానబలు లగు నిరువాఁగులలోనివారికి ద్వంద్వయుద్ధము ప్రవర్తిల్లఁగా నాయుద్ధము తొల్లిటి దేవాసురయుద్ధము విధమున నతిభయంకర మయ్యె. ఆయుద్ధమునందు రావణుం డనేకాస్త్రములు రాముపైఁ బ్రయోగింప శ్రీరాముండు వాని నెల్లఁ బ్రత్యస్త్రంబులం బడఁగొట్టి రావణు మేను చిల్లులు వోవునట్లు పెక్కుబాణము లేసెను. అట్లే యుద్ధసన్నద్ధుండైన యింద్రజిత్తును లక్ష్మణుఁడు మర్మభేదకంబులగుశరంబులతోఁ గొట్టె లక్ష్మణునిపై నింద్రజిత్తుకూడ శరవర్షంబు గురియించెను. ఇట్లు ప్రహస్తుండు విభీషణునిపై మహాగదను వైచె.

దాని దెబ్బను విభీషణుండు లక్ష్యపెట్టక శూరుండగు ప్రహస్తునియెదుట హిమవంతునిం బోలె ధీరుండై నిలువఁబడి విఱివిఱియైనశతఘంటయను బాణమునందుశక్తి నభిమంత్రించిప్రయోగించిననది భూరిధ్వనిం జేయుచు నాప్రహస్తునితలం దునుమాడె. అప్పుడు వజ్రసమానంబగు నాశక్తిప్రహారంబునఁ బ్రహస్తుశిరము ఖండింపంబడఁగా వానిమేను పెనుగాలికి విఱిగిన మ్రానువోలెఁ గన్పడెను.

హనుమంతుండు ధూమ్రాక్షునిఁ జంపుట

అవ్విధంబునఁ బ్రహస్తుండు కూలుటయు ధూమ్రాక్షుం డను రాక్షసనాయకుండు వానరసైన్యము నదలింప వచ్చిన, ఘోరరూపము గల వానిం జూచి వానరులు పెక్కుఱు వెఱచఱచి పాఱిరి. అప్పుడు హనుమంతుండు వారినెల్ల కోయని చీరి యొక్కతలంబుగాఁ జేర్చి యానిశాచరుం డాకి యాటోపంబు సూపుచుండఁగఁ గూడినవానరులెల్లరు రాక్షససేనపైఁ గవిసి పోరాడుచుండ నారాక్షసవానరశూరుల యొండొరులదెబ్బలధ్వను లాకసంబునఁ బ్రతిధ్వనించె. ఆదారుణయుద్ధంబునందు ధూమ్రాక్షుండు తామ్రాక్షుండై వానరబలంబుల నెల్ల వెనుకకు మరలునట్లు కొట్టుచుండ వానిపరాక్రమమును వాయుపుత్రుండు సైపలేక యోహటించి వానియెదుట శూరుండై నిలిచి వానిపై వృక్షములను బర్వతశిలలను ఱువ్వుచు నానావిధముష్టిఘాతంబుల నెమ్ములు విఱుగునట్లు గొట్ట నారాక్షసవీరుం డాంజనేయుని సరకుగొనక వానిపై ననేకాస్త్రంబులఁ బ్రయోగించియుఁ బరశుపట్టిసశూలాద్యాయుధంబు లనేకంబులు వైచియుఁ బరస్పరవిజయ కాంక్షతోఁ బెనఁగుచుండ వారిరువురియుద్ధ మింద్రప్రహ్లాదులరణముతో సమమైయుండె. అప్పుడు యుద్ధభూమి మృతరాక్షసవానరవీరరక్తసిక్తమై నెత్తురు వరదలువాఱె. అంత హనుమంతుండు విజృంభించి రోషారుణితనయనుండై ధూమ్రాక్షుపై నొక్కమహాగిరిశిఖరమును సూటిగా వైవఁగా నంత నాగిరిశృంగంబు వానిని వానిరథరథ్యంబులను నుగ్గునూచము సేయుటయుఁ గపివీరులు వేవేగ నాటోపంబుఁ జూపుచుఁ దక్కనరాక్షసబలంబుపైఁ గవిసినఁ బోరతిఘోరంబై కపివీరులకు మానసోల్లాసంబు గలుగఁ జేసె. అప్పు డనేక రాక్షసులు హతులైరి. ధూమ్రాక్షుండు హనుమంతునిచేఁ గాలపురమున కతిథిగాఁ బంపఁబడియె. హతశేషు లగురాక్షసులు

యుద్ధభూమియందలి ధూమ్రాక్షాదిరాక్షసశూరుల మరణమును రావణునకుఁ దెలిపిరి. అప్పు డాలంకేశ్వరుండు ధూమ్రాక్షప్రహస్తుల మరణంబునకుఁ బెద్దయుం బ్రొద్దు చింతించి వేఁడినిట్టూర్పులు వడల యక్కటా! నాకు డాపలివలపలిభుజంబు లట్లున్నవారు కొనకు వానరులచే హతులైరి యని పగచె. అంతఁ గొంతవడికిఁ బ్రజ్ఞం బూని యుఁడఁడగు మానుసు లెవ్వరును లేరు. కావున దీర్ఘనిద్రతో నుండు కుంభకర్ణు నిప్పుడు నిదురలేపి యీ వానరసైన్యమును వానిచే వధింపఁ జేయుపల యును. వాఁడు తప్ప దిక్కెవ్వరును లేరని నిశ్చయించి నిద్రాపరవశుం డగు కుంభకర్ణు లేప ఘోరధ్వానంబులగు ననేకభేరుల వాయింపఁ బంచిన నా భయంకరారావంబులకు విదీర్ణకర్ణుండై కుంభకర్ణుండు మేల్కాంచె. అట్లు కుంభకర్ణుండు నిదురనుండి లేవ రావణుండు చేరంజని యిట్లనియె. కుంభకర్ణా! నిద్రావశత్వమున నీవు కృతార్థుండవైతివి. లంకా పురమునందు జరుగుచుండు ఘోరయుద్ధము నెఱుంగవు. తత్కారణంబు వినుము. నేను శ్రీరాముండను వానిభార్యను మోసమున లంకాపురికిఁ గొనివచ్చితినిగదా. ఆ రాముండు తనభార్యను మఱలఁ గొనిపోవు నిమిత్తము విస్తారమగు వానరసేనకు రాజైన సుగ్రీవునితోఁ జెలిమిఁ జేసికొని వానిసాహాయ్యమున గపివీరులచే సముద్రమునకు సేతువుం గట్టించి యా సేతువుమీఁద బహుళకపిసైన్యముతో సముద్రముసుదాఁటి లంకయందు విడిసి మనకవమానంబుగా నీపురంబు ముట్టడించియున్న వాఁడు. వానర సేనలతోఁగూడి ఘోరయుద్ధమున మనవారి ననేకులఁ జంపుచుండె. ప్రహస్త ధూమ్రాక్షాదు లగు ననేకు లగు శూరరాక్షసులు వారితో యుద్ధముం జేసి మడిసిరి. వారలను జయించుటకు నీవుదప్ప నన్యు లెవ్వరును లేరు. కావున నీవు గట్టికవచమును దొడిగి వలసినయాయుధములం గొని యుద్ధమునకు బూనుకొని నడచి శత్రువులను నిశ్శేషముగ వధింపుము. నీకు సహాయులుగా దూషణునితమ్ములును శూరులును నగువజ్రవేగ, ప్రమాథు లనువారిని విస్తారసైన్యమును గొనిపొమ్ము అనఁగా నతం డన్నమాటకు జవదాఁటక యన్న చెప్పినచొప్పున రణంబునకుఁ బోనొడం బడెను.

### కుంభకర్ణుడు లక్ష్మణునితో యుద్ధముచేసి మడియుట

అవ్విధంబుగ నోడంబడి కుంభకర్ణుండు యుద్ధమునకుఁ దఱలి శ్రీరామలక్ష్మణసంరక్షితంబై నకపిసైన్యంబుపైఁ గవియుడు వానరులారక్కసుం జుట్టుముట్టి వానిపై బండల విసరియు, వృక్షముల వేసియు, వానిశరీరంబును గోళ్లచే గీఱియుఁ బండ్లతోఁ గొఱికియు, దౌడలఁ దాటించియు, శిరంబు ముష్టిప్రహారంబులఁ బగిలించియుఁ బలుతెఱంగులఁ బోరు సలుప నాకుంభకర్ణుండు కోపోద్దీపితమానసుండై వానరులం గొందఱం బట్టుకొని బల చండబల వజ్రబాహువులు మున్నగువారిని మ్రింగెను. అంతఁ గొందఱు వానరులు వానికి భయంపడి పాఱిరి. వారి యఱపుల నుదగ్రక్రోధుండై సుగ్రీవుండు విని యారాక్షసు నెదుర్కొని యొక్కమహాసాలంబుఁ బెఱికికొని తెచ్చి దానిని వానిపై వైవఁగా నయ్యది వానిశిరంబుఁ దాకి నుగ్గయ్యె. వాఁ డందులకుఁ జలింపక రోషముతోఁ జేతులఁ జాచి సుగ్రీవు నెత్తుకొనిపోవుచుండఁ గని శత్రుఘాతి యగు లక్ష్మణుండు పఱచి పసిఁడిపులికిగలబాణము నేయఁగా దాని వేగంబు కుంభకర్ణుండు సైరింపక ఱొమ్ము పగిలి నెత్తురు సోనలుగ గాఱ నేలం బడి మూర్ఛిల్లె. వెంటనే తెప్పిరిలి వాఁ డలుకతో సుగ్రీవుని వదలి గొప్పబండ నొక్కదానిం గేలం గొని లక్ష్మణుని దెసం బాఱుతెంచిన నాసౌమిత్రి యంపుదివ్యబాణంబు లేసి వానిచేతులు రెంటిని నఱికివైచె. అంత వాఁడు మాయఁ గావించి యందఱకుఁ జతుర్బాహుండై కానిపింప లక్ష్మణుండు తనశరలాఘవము మెఱయ ననేకబాణంబు లేసి వానిభుజముల నన్నిటి నఱికెను. వాఁ డంతఁ బోక మఱియు మాయావిలాసంబున బహుపాదములును శిరస్సులును భుజములును గలిగి గొప్పశరీరముతో నగపడియెను. అంత సౌమిత్రి వీఁడు సామాన్యముగఁ బోవువాఁడు కాఁడని బ్రహ్మాస్త్రం బభిమంత్రించి వానిపైఁ బ్రయోగించిన నవశాంకఁగా వాఁడు పిడుగుదగిలిన చెట్టువోలె నేలం గూలె. అట్లు కుంభకర్ణుండు సచ్చుటయు వానియనుచరు లగు రాక్షసులు వెఱచఱచుచుఁ బాఱుచుండ దూషణునితమ్ము లగు వజ్రవేగప్రమాథులు తమసేనల నెల్ల మగిడించి లక్ష్మణునిపై నొక్కపెట్టునఁ గవిసిరి. అంత లక్ష్మణుండును వారిపై వేగంబుగ బాణవర్షము గురియింప వారిపోరు ముహూర్తకాలము చూచువారికి గగుర్పాటు గలిగించె. అంతలో

హనుమంతుం డెచ్చటనుండియో యొక్కమహాశిలను మోచి కొని తెచ్చి యతివేగంబున వజ్రవేగుపై సూటిగా నేయఁగా వాఁడా పర్వతశిలక్రిందఁ బడి తుత్తునియలయ్యె. నీలుండును హనుమంతుని చాడ్పున వేఱొక్కబండ నెత్తికొనివచ్చి ప్రమాథిపైఁ బడవేయఁగా దానిక్రింద వాఁడు నలిగిపోలె. ఆవిధమున వజ్రవేగప్రమాథులు హతు లగుటయు రాక్షసవీరులు క్రోధఘూర్ణమానమానసులై కపి వీరులపై బాణంబు లేయం దొడంగిరి. అప్పు డుభయసైన్యములకుఁ బోరు ఘోరం బయ్యె. ఆనాఁటిఘోరయుద్ధమునందు రక్కసు లనేకులు మ్రందిరి కాని, వానరులు చావరైరి

### ఇంద్రజిత్తు లక్ష్మణునిచేఁ జచ్చుట

పదంపడి రణనిహతులుగాక శేషించిన రాక్షసులు రావణుని యొద్ద కేఁగి కుంభకర్ణాదివీరులవధంబును విన్నవింప నామేటిశూరుండు మిక్కిలి వంతఁ గూరియుండి కొంతసేపునకు ధైర్యం బవలంబించి శూరుండును ననుంగుపుత్త్రుండును సర్వాస్త్రవేదియు బహుమాయా యోధియు నగు నింద్రజిత్తును బిలిచి యిట్లనియె. కుమారా! ముక్కడివానరులచేఁ గుంభకర్ణధూమ్రాక్షప్రహస్తాదు లగుమహా యోధులును నింక ననేకవీరభటులును మ్రందిరి. రాక్షసకులంబునకు నరు లవమానంబుఁ దే నున్నవారు. నీవు మున్నాఖండలు నిర్జించి నాబలపౌరుషంబుల లోకంబుల వెల్లడిపఱచితివి. నీవు సకలాస్త్రవేదివి. మాయాయుద్ధవిశారదుఁడవు. ఇప్పుడు నీవు యుద్ధసన్నద్ధుండవై శిర స్త్రాణతనుత్రాణంబులం దొడిగి వేగంబ యానరథములను వానరసమూ హంబుతోడఁ బోరిగొని నాపౌరుషంబు నిలుపుము. నీవంటిసత్పు త్త్రులుగదా తండ్రికి సంతసంబు గలిగింతురు. కావున నిప్పుడ తఱలి యుద్ధభూమికిం జని తొల్లి వాసవుం గెలిచినట్లు రామాదులను గెలు వుము. అని చెప్పఁగా నింద్రజిత్తు తండ్రిమాటలకు నలరి వల్లె యని దృఢకవచముం దొడిగి సకలాయుధసహితంబగు రథంబు నారోహించి లంకాపురమునుండి వెడలి యుద్ధరంగమును సమీపించెను. అప్పుడు వానరవీరు లందఱు నొక్కుమ్మడిగా వానిపైఁ బడిరి. ఇంద్రజిత్తు వారి నెవ్వరిని లక్ష్యపెట్టక లక్ష్మణా! యని సౌమిత్రిం బిలిచి, 'యిదె యింద్రజిత్తు వచ్చియున్నవాఁడు. నీ వోపుదేని సమరమున నీనేర్పు

,వానిపైఁ జూపుము. లేకున్న నీకు లావు లేదనుము.' అని కయ్యము నకుఁ గాలుద్రవ్వఁగా సౌమిత్రియుఁ దనవింటినారి సవరించికొని వింటి కొప్పున దృఢముగా నమర్చి యోంకారంబుఁ జేసి రోదసీకుహరంబు మ్రోఁగునటు లారావము చేయ నాధ్వనికి రక్షోగణంబులగుండె లదరఁగా నా యింద్రజిత్తు శుద్రజంతువు సింహముఁ గవియుచాడ్పున సౌమిత్రిం దలపడఁగా వారిరువురును గొంతసే పొండొరులు తమయస్త్రవిద్యానైపుణ్యంబుఁ జూపుచుండిరి. అంత నింద్రజిత్తు శరసంధానమునను, బాణప్రయోగమునను సౌమిత్రి తన కెంతమాత్ర మీడుకాఁడనిభావించి సౌమిత్రిపై నశనిపాతతుల్యంబులగు తీవ్రశరములం గుప్పింప లక్ష్మణుండు తనతీవ్రశరసంధాననైపుణ్యంబు వానికిఁ జూపుచు వానితూపుల నన్నింటిని బ్రతిబాణములచే బడఁగొట్టి వెండియు ననేకబాణపరంపరలచే వానిశరీరము నింపెను. అట్టియెడ నందుం డొక్కమహావృక్షంబుఁ గొని యింద్ర జిత్తుశిరంబుపై వైవ వాఁ డందుల కించుకేనియుఁ జలింపక ప్రాసాయుధము ప్రయోగించి యంగదునిఱొమ్ము పగులునట్లు కొట్ట యత్నించుడు, రామానుజుండు దానిని మధ్యమందే తుత్తునియలు గావించె. ఆతీరునఁ బ్రాసంబు శకలంబులై పోఁగా మేఘనాదుండు తన మహాగదఁగొని క్రియంగదుపై వేయఁగా నంగదుండు దానిని సరకు గొనక సాలవృక్షశాఖ నొక్కదానిని నింద్రజిత్తుతేరిపై వైచెను. దానం జేసి యారక్కసుని రథంబు నుగ్గునూచమై పోఁగా రథ్యంబులును నద్దాన మడిసె. అవ్విధంబున రథంబును రథ్యంబులును నశింపఁగా వాఁడు మాయాబలంబున నాకసంబున సంచరించుచుఁ దనకు దేవత లొసంగిన వరప్రభావముచేఁ గల్గిన బలశౌర్యముల వినియోగించుచు నానావిధాయుధంబులఁ గపిబలంబును బ్రహరించుచు శ్రీరామలక్ష్మణులను నొప్పించుచుండె. అట్లు మేఘనాదుండు వియత్తలంబున నుండి యదృశ్యుండై మాయాయుద్ధం బొనర్చుచుండ రామలక్ష్మణులు మాయాతిరోహితుఁ డయిన రావణిని బాణంబులం గొట్టుచుండిరి. అపుడు సుగ్రీవాదివానరులు హస్తంబులఁ బెద్దబండల నుంచుకొని వాఁ డుండుస్థలముఁ దెలియుచుండఁగనే వానిపై నువ్వెట సంసిద్ధులై యుండిరి. కాని, వాఁ డంతకుఁ దనమాయాయుద్ధవైశారద్యమును గపులకుఁజూపుచు నదృశ్యుండై వారిపై నానావిధబాణప్రయో

గములం జేయుచు, శ్రీరామలక్ష్మణులపై ననేకబాణంబు లేసిన, నయ్యన్నదమ్ములు వానిశరప్రహారణంబుల నొచ్చి పరవశులై ప్రలయమునందు వియత్తలమునందుండి భూతలంబునఁ బడిన చంద్రసూర్య బింబములు వోలెఁ బ్రజ్ఞాహీనులై యుండిరి. అయ్యవసరమున నింద్రజిత్తు తనవరమహిమం జేసి యాయిద్దఱన్నదమ్ములను నాగపాశబద్ధులఁ గావింపఁగా వారు పంజరస్థితపక్షులమాడ్కిఁ గదలమెదలనేరకుండఁగా నారాజపుత్త్రులయవస్థను జూచి మేఘనాదుండు తనవీర్యముచేఁ బ్రజ్ఞాహీను లయినరామలక్ష్మణులం జూచుటకుఁ దండ్రిని యుద్ధరంగమునకు బిలువం బోయె. అవ్విధంబున నాగపాశబద్ధులైన యప్పురుషసింహుల వేదనను జూడనేరక సుగ్రీవాంజనేయమైందద్వివిదాంగద నీలాది ప్రముఖు లగు కపివీరులు తత్తరపడుచుండ విభీషణుం డా రాజపుంగవులఁ బ్రజ్ఞాస్త్రంబునఁ బ్రబోధితులం గావించుటయు సుగ్రీవుండు మంత్రరక్షితంబైన విశల్యకరణిం గొనివచ్చి వారిమేనఁ గ్రుచ్చిన బాణంబులమూలుకులఁ దొలగింపఁగా వారు నీరోగులై లేచిరి. అప్పుడు విభీషణుండు శ్రీరామున కంజలి గావించి యిట్లనియె. రాజేంద్రా! ధనేశ్వరునిశాసనమున గుహ్యకుండు దివ్యసలిలముంగొని శ్వేతపర్వతమునందుండి యేతెంచినవాఁడు. ఆసలిలముచే నేత్రములం గడిగికొనిన నాకంటికిఁ గానరానిభూతము లన్నియు గోచరించు. ఆజలము లేరికేని యొసంగిన వారికిని నట్టిమహిమ గలుగు. కావున నాజలములతో నీవును సౌమిత్రియు సుగ్రీవాదివానరులును నేత్రములు కడిగికొనుఁడు. అంత నదృశ్యుండై యుద్ధము గావించుచున్న యింద్రజిత్తు మీకు గోచరించును. పిదప నందఱును వానియునికి నెఱింగి సమక్షంబున సమరం బొనర్చి వానిం బోరితంబున బొలియింప వీలగు నని చెప్పఁగా వారెల్ల రాజలంబులతో నేత్రంబులఁ గడిగికొనిరి. వెంటనే యదృశ్యంబు లెల్ల దృశ్యంబులయ్యె. అంతకుఁ బూర్వమే మేఘనాదుండు తనపరాక్రమమును దండ్రి కెఱింగించి మఱల యుద్ధభూమి కేతెంచి యదృశ్యుండై మాయాయుద్ధమారంభింపఁగా లక్ష్మణుండు దివ్యజలంబులచేఁ గన్నులు కడుగుకొన్నవాఁడు కావున వాని నెదుర్కొని తనమగఁటిమిఁ జూప నారంభించె. అంత రావణి తనకు విజయప్రదమగు హోమ మొక్కటి దాని నొనర్పనుద్దేశించి రణాంగణంబునందుండి తొలంగి పోవుచుండ విభీషణుం

డాసన్న యోజించి లక్ష్మణునితో నిట్లనియె. సౌమిత్రీ! ఆలోచింపుము. ఈదుష్టాత్ముం డభిచారహోమంబు నొనర్చి యగ్నికుండమునుండి తనకు విజయము నొసంగు రథశస్త్రాస్త్రములఁ గొనివచ్చినవాఁడై పోవుచున్నవాఁడు. అప్పుడు వీనిం గెలుచుట యసాధ్యంబు. కావున మనము వాని నిప్పుడు వానియుద్యమమునుండి మరలించి నొప్పించి వధించుట మేలు. అని తెలుపఁగా సౌమిత్రి విభీషణునియాలోచనమును విని మేఘనాదు వెన్నంటి వానిపై వాఁడిసాయకంబులఁ బర్వ, వాఁడు వెనుదిరిగి సమరాభిముఖుం డగుటయును నప్పటి వారిరువురయుద్ధము ప్రహ్లాదేంద్రులయుద్ధముం బోలి యుండె. అంత రావణాత్మజుండు మర్మభేదకశరంబులను వైవఁగా దశరథాత్మజుం డగ్నితుల్యంబులగుదివ్యశరంబులచే వాని నొంచె. అంత రావణసూనుండు సౌమిత్రిబాణప్రహారణంబుల నొచ్చి క్రోధమూర్ఛితుండై వెంటనే యెనిమిదివాఁడితూపులచే లక్ష్మణునిఁ బ్రహరించె. దానికి లక్ష్మణుండును కినిసి రెండువాఁడిశరంబు లేసి వానియిరుభుజంబుల ఖండించె. మఱియును వేఁగ వేఱొక్క బాణంబున రత్నకుండలములతో వెలయు నాతనిశిరం బిలఁ బడ నేసె. ఆవిధమున రావణసూనుఁ డగు మేఘనాదుని దశరథాత్మజుం డగు లక్ష్మణుడు హతుం గావించి వానిసారథిని నుఱుమాడఁగా గుఱ్ఱములు రథమును లాగికొని పురంబు వైపునకు మఱలెను. అంత దశవదనుండు పుత్త్రవిహీనంబై నతనీయ రథంబుఁ గాంచి కుమారుండు మరణించె నని యూహించి శోకమోహవిహ్వలమనస్కుండై యీపాటులకెల్లం జానకిమూలం బని యెంచి యద్దేవిం జంపుమనను నిశ్చయించినవాఁడై కృపాణంబుఁ బూని యశోకవనంబున కేఁగిన, నప్పుడు వానిం దుష్టభావజ్ఞుండును ధార్మికుండును నగు నవింధ్యుం డను మంత్రిముఖ్యుండు లంకేశ్వరునకిట్లనియె లంకేశ్వరా! వైదేహిని వధింప నేల తలంచెదవు? సర్వలోకములకు నవ్యయంబైన సామ్రాజ్యమున కధినాథుండ వైన నీకు స్త్రీవధంబు తగునే? నీ చెఱఁ జేరినప్పుడే యివ్వనిత హత యయ్యె. దీని నిప్పుడు చంప నేల! పౌరుషవంతుండ వైతివేని దాని మగనిని వధింపుము. వాఁడు హతుండయ్యెనేని యివ్వనిత చచ్చినదియే? దేవేంద్రుఁడు నీపరాక్రమమున కెదురుగ నిలువ లేఁడు. దేవలోకమున నుండువారికిఁ బలుమాఱు గెలిచిన నీకు నరుండగు రాముం డెంతటి

వాఁడు? వాఁడచిరంబున నీచేఁ జచ్చు. స్త్రీవధకు విముఖుండ వగుము. రణాంగణాభిముఖుండ వగుము. యుద్ధమొనర్చి పౌరుషముచేఁ బగఱ గెలువుము. మానుషంబు గలవానికి స్త్రీవధ తగదు. అని నానావిధనీతి వాక్యములను బ్రబోధింప వానిమాటల నాదరించి లంకేశ్వరుండు వైదేహీవధోద్యమంబు మాని నగరు సొచ్చి యనుచరులం బిలిచి శ్రీరామసైన్యముమీఁదికిఁ దేరాయితంబు నేసి తెండనఁగా వారు వెంటనే యట్లొనర్చిరి.

## రావణుండు రామునితో యుద్ధ మొనర్చి చచ్చుట

అంత రావణుండు దృఢకవచమును దొడిగికొని యమ్ములతో నిండినతూణీరమును సర్వయుద్ధోపకరణంబులను రథమున నుంచి ధ్వజ ముగట్టి వేగవంతము లగుహయములను బూన్చిన రథమెక్కి తఱలఁగా నానావిధాయుధధారులగు ఘోరరాక్షసు లసంఖ్యాకులయి తన్ను వెన్నంటి యుద్ధభూమి కేతెంచి దశరథాత్మజుం దొడరఁగా నా రావణుని రథమును హనుమజ్జాంబవదంగదసుగ్రీవాదులగు కపివీరు లనేకులు చుట్టు ముట్టి యాదశగ్రీవుఁడు చూచుచుండఁగనే యాతనిసైన్యమును వృక్షం బులతోఁ గొట్టి రూపుమాపిరి. అంత దశవదనుండు క్రోధారుణితలోచ నుండై మాయ గావింపఁగా దానివలనశక్తితోమరపరిఘపట్టిసాదుల ధరించిన రాక్షసు లనేకులు దోఁచిరి. ఆమాయారాక్షసుల సందఱను దివి ధాస్త్రములచే రాఘవుండుసమయించె దశవదనునియమ్మాయ కాకుత్థ్సుచే విధ్వస్తంబగుడు, వాఁ డందులకు రెట్టించినకోపంబున మాయారామలక్ష్మ ణులను ననేకులఁ గల్పింప వారలందఱతోఁ దానొక్కండు పోరుచుండు నట్లు వానరులకును శ్రీరామలక్ష్మణులకును దోఁచున ట్లొనర్పఁగా రాముఁ డద్దాని రాక్షసమాయగా నెఱింగి లక్ష్మణుముఖారవిందము నవలోకించి మన ప్రతిరూపముల నీమాయావి మనకన్నులయెదుటఁ గల్పించె. ఈమా యారూపములను నశింపఁజేయుము. అని చెప్పి లక్ష్మణుఁడును దానును మహనీయాస్త్రములనేసి తమ ప్రతిరూపములనెల్ల రూపుమాయించె. పదం పడి దశముఖునిపైఁ బరాక్రమంబు చూప యత్నించుచున్న సమయ మునం దింద్రసారథియగు మాతలి సూర్యప్రభలతో వెలుఁగుచున్న పురందరురథమును శక్రానుమతంబున శ్రీరాముకడకు యుద్ధభూమికిఁ

దోలుకొనివచ్చి యామహావీరుం జూచి యిట్లనియె. రఘువరతిలకా! ఇదెయుత్తమాశ్వయోజితంబైన దేవేంద్రునుత్తమరథంబు. ఆఖండలుండు దేవకార్యనిర్వహణసమయమున నీరథంబు నీ కారోహింపఁ బంపె. దీని నెక్కి నీశత్రుం దెగటార్పుము. ఇయ్యది నిలింపారాతితో నీవు పోరునప్పుడు నిన్ను భూమిష్ఠుం జేయక వానితో సమానంబుగా నెత్తున నుండునట్లొనర్చు. పూర్వకాలమున శక్రుం డీరథము నెక్కి దైత్యదానవుల ననేకుల రూపుమాయించె. ఇది జయప్రదము. కావున నోమహాత్మా! నీవును నిట్టి దివ్యరథము నెక్కి లోకకంటకుండయిన రావణుం బరిమార్పు మని మనవి సేయఁగా దాశరథి వానిమాటల నాకర్ణించి యిదియును నొక రాక్షసమాయయో యని తలపోయుచుండఁగా విభీషణుం డమ్మహావీరు సమీపించి యిట్లనియె. మహనీయా! ఇది రాక్షసమాయ కాదు; సంశయింపవలదు. పాకశాసను నానతివొప్పున నీదివ్యరథము నెక్కి పరాక్రమమును జూపుము. అని చెప్పఁగా దాని నంగీకరించి దివ్యరథారోహణంబు గావించి మహాట్టహాసంబున వీరరసోద్రేకంబు పఙ్క్తికంధరుపైఁ జూప నందులకు లోకములోని భూతంబులు గడగడ వడంకె. రాక్షసులలో హాహారవంబులు సెలంగె. కపిసైన్యమున సింహనాదము లాకసంబు ముట్టె. దివమునందు దేవతలు దుందుభులు మ్రోగించిరి. ఆవిధముగా రామరావణయుద్ధం బతిఘోరంబుగాఁ బ్రవర్తిల్లుచుండ లంకేశ్వరుండు దేవేంద్రువజ్రాయుధమునకుఁ బోల్పఁదగినదియు, బ్రహ్మదండోపమము నగు నొక్కమహాశక్తి గల శూలము నుదగ్రక్రోధసమగ్రుండై యేసినం దక్షణంబ రాఘవుండు దానిపై దివ్యాస్త్రప్రయోగంబు గావించి దాని నడుమనే తుత్తునియలు చేసినం బఙ్క్తికంఠుండు కినిసి వాఁడిశరములచే శ్రీరాముం గొట్టి యంత నిలువక శూలపట్టిసపరిఘముసలశతఘ్నిప్రభృతి నానావిధాయుధంబులచే నొక్కుమ్మడిగఁ బ్రతిపక్షులఁ గొట్ట నాసినమరాటోపంబునకు వానరులు వెఱచఱచి నలుదెసలం బాఱిరి కాని, యామాయలకుఁ జలింపనియమ్మహాత్ముండు శ్రీరాముండు దివ్యపక్షంబులు గలిగి దివ్యముఖముచే విరాజిల్లుచుఁ గనకపుంఖం బయిన దివ్యబాణంబున బ్రహ్మాస్త్రము నభిమంత్రించి యానిలింపారాతిపై వైచుడు నాఘోరాస్త్రకీలలం బడి యాలోకకంటకుండు

సాశ్వరథసారథికంబుగ భస్మీభూతుండయ్యె. అంత హానిమరణంబునకు,
దినంబున దేవత లానందించి దివ్యదుందుభులు మ్రోఁగించిరి అచ్చర
లాడిరి. కింపురుషులు నాట్యములు సలిపిరి. కిన్నరులు పాడిరి విద్యా
ధరులు దివ్యగానంబు లొనర్చిరి. బ్రహ్మాస్త్రకీలలంబడిన వానిశరీరమును
బంచభూతములు వీడినవి. శరీరధాతువులును, రక్తమాంసములును
నశించెను బూదియుం గానరాదయ్యె.

{ రావణవధానంతరమవింధ్యుఁడను వృద్ధరాక్షసుఁడు శ్రీరాము
సవిధమునకు సీతం దోడ్తెచ్చుట }

ఆప్రకారంబున దాశరథి క్షుద్రుండును సురద్వేషియును నగు
రాక్షసేంద్రుండయిన రావణుని సంహరించి హృష్టాత్ముండై సౌమిత్రితోను
సుగ్రీవాదిమిత్రబృందముతోను దేవతలయాశీర్వాదంబులఁ గొనెను.
గంధర్వు లప్పుడు జయజయధ్వానంబు లొనర్చిరి కమలపత్రాక్షుం
డైన శ్రీరామచంద్రుని దేవత లంతయు నుతించిరి. గంధర్వులు పాటలు
పాడిరి. సిద్ధచారణులును కిన్నరకింపురుషులును దమతమసంతోషములం
దెలిపిరి. దేవదుందుభులు మ్రోఁగెను. పూలవాన గురిసెను. ఆకసం
బంతయు మహోత్సవయుతంబుపోలెఁ గన్పట్టె. తదనంతరమున శ్రీరామ
చంద్రుండు చతుస్సముద్రోదకంబులను, సరిత్తీర్థంబులను దెప్పించి సర్వ
సుగుణభూషితుఁ డగువిభీషణునకు లంకారాజ్యపట్టాభిషేకంబుఁ
గావించె. అంత నవింధ్యుం డను రాక్షసవృద్ధుండు సీతాదేవిని నశోకవ
నంబునుండి తోడ్కొనివచ్చి దాశరథికిం జూపి మిక్కిలి దైన్యంబుదోఁప
నిట్లనియె. మహానుభావా! పరమపతివ్రతాశిరోమణి యగు జానకిని
గ్రహింపుము. అనఁగా రాఘవుండు రథావరోహణంబు నేసి ధూళిధూస
రితసర్వాంగియు జటాధారిణియు మలినవస్త్రయునై యెడతెగనిశోకం
బుచేఁ జిక్కిన వైదేహిం జూచి యిట్లనియె. లోకాపవాదము
లేకుండుటకై రావణుం బరిమార్చితి. ఇఁక నీవు యథేష్టముగా వర్తిం
పుము. అన్యునింట దీర్ఘకాల ముండిననిన్ను సకలధర్మజ్ఞుఁడని ప్రఖ్యాతి
వడసిన నేను మఱలఁ జేరఁ దీయను. నీవర్తనంబు మంచిదైనను
జెడ్డదైనను నిన్నుఁ ద్యజించుటయ మేలు. కుక్క దాఁకిన పవిత్రమైన
హోమాన్నంబును మరల నెట్టివాఁడైన ముట్టునే? పెక్కుమాట లేల?
నీకుఁదోఁచినట్లు వర్తింపుము, అనిపలుక వీనులకు వేఁడియగునాపరుసనిపలు

సదాచారసంపన్నుఁడవు. కావున నామాట నాలకింపుము. ఈ నీచుఁడైన శత్రువు దేవగంధర్వులకును మహర్షులకును లోకమునందలి సర్వతాపసులకును బ్రాహ్మణులకును బరమశత్రువు. ఇట్టిదుష్టాత్ముండు నాకరుణచే నిన్నిదినములు జీవించియుండె. వాని నిన్నాళ్లు మన్నించి యుంటి. వానికిఁ జేటుకాల మాసన్నమగుటచే నీధర్మపత్ని సీత నపహరించికొనిపోయె. వీనికిఁ బూర్వము నలకూబరశాప మొకటి కలదు. అకామ యగుస్త్రీని వీఁడు పొందెనేని తత్క్షణంబ వీనితల వ్రయ్యలగు అని. ఆశాపముచే సీత సురక్షితయై మలినత పొందక పాతివ్రత్యముతో నిన్నాళ్లుండఁ గలిగె. ఓమహాబుద్ధిమంతుఁడా! నీ వీదేవివిషయమున సంశయమును మానుము. ఈదేవి సర్వకాలసర్వావస్థలయందును నిన్నుఁదప్ప నన్యుని స్మరింప లేదు. నీచే దేవకార్యము లెస్సఁగాఁ జేయఁబడినది. అని చెప్పుచుండఁగానే విధేయుండై సపుత్త్రుసకు స్వర్గలోకమునందుండి విమానమున దేవతలతో రావణసంహారముయొక్క వేడుకలు జూడ వచ్చిన తండ్రియైన దశరథుం డిట్లనియె. పుత్త్రా! నేను దశరథుఁడను. నీయాచరణంబునఁ బరమప్రియముఁ బొందితి. నీవు పదునాలుగేండ్లరణ్యవాసంబు గావించి ప్రతిజ్ఞఁ దీర్చితివి. సెల వొసంగితి. ఇఁకను రాజ్య మేలు మనఁగా శ్రీరాముండును తండ్రిపాదంబుల కెఱఁగి యిట్లనియె. మహారాజా! నీ యుత్తరువు ననుసరించి యయోధ్య కేఁగి రాజ్యంబు పరిగ్రహించి ప్రజల నేలెద నని విన్నవించి దేవతలకు నమస్కరించి సీతం బరిగ్రహించి యింద్రాణితోఁగూడిన మహేంద్రుననుకరించి తేజోవంతుండై యవింధ్యుం డను వృద్ధరాక్షసునకును దిజటకును గోరినవరముల నొసంగి బ్రహ్మానుమతికై వేచియుండ సప్రీతామహుండు శ్రీరాముం జేరఁదీసి మహాత్మా! నీవతిప్రయాసంబును సమానుషంబును నగుమహాకార్యం బొనర్చితివి. వరముల వేడుము ఒసఁగెద ననఁగా శ్రీరాముం డిట్లని వచించె నాకు ధర్మమునం దెల్లప్పుడు బుద్ధియు, నన్ను నాశత్రువు లెవరును గెలువరామియు, రాక్షసులచే హతులైన వానరులు పునర్జీవితు లగుటయు వరములుగా నిమ్ము, అనఁగా శ్రీరామునకు బ్రహ్మదేవుండును కోరినవరముల నొసంగి సమస్తదేవతలతో నదృశ్యుండయ్యె. అంతఁ బితామహువరప్రభావంబున రణనిహతు లగు వానరు లెల్లఁ బునర్జీవితులైరి. సీతామహాదేవియు హనుమంతునకు

శ్రీరామచరిత్రంబు లోకంబున నెందాక వర్తిల్లునో యంతదనుక నీవు కీర్తిమంతుఁడవై వెలయుదువు గాక యని వరము నొసంగె. అంత సీతారాములను మహేంద్రసారథి యగు మాతలి సమీపించి రామభద్రునితో నిట్లనియె. రాఘవా! లోకకంటకుండైన లంకేశ్వరు వధించి దేవతలసన్నుతికిఁ బాత్రుండ వైతివి. ఇఁక నెంతకాలము భూలోకమునుండునో యంతకాలము మానవులు నీకీర్తిని శ్లాఘించుచుందురు. అని నుతించి మాతలి యింద్రరథమును దోలుకొని స్వర్గముం జేరె.

## శ్రీరామచంద్రుం డయోధ్యఁ జేరి పట్టాభిషిక్తుం డగుట

అంత శ్రీరాముండు సీతాలక్ష్మణసమేతుండై సుగ్రీవాంగద హనుమజ్జాంబవత్ప్రముఖులతోఁ గూడికొని విభీషణుండు భక్తుండై వెన్నంటి రాఁగాఁ దానును బుష్పకంబు నెక్కి లంకాద్వీపంబుఁ దరలి సేతుమార్గమునఁ బారావారము దాటి యొక్కచో విడిసి వానరసైన్యమునం దనుపఁదగినవారల నెల్ల సత్కరించి యాజ్ఞ నొసంగి ముఖ్యమంత్రులతోఁ గూడి కిష్కింధకుఁబోయి యంగదునకు యౌవరాజ్యపట్టాభిషేకం బొనర్చి యచ్చోటినుండి కతిపయదినప్రయాణముల నయోధ్యఁ జేరి భరతునిఁ దోడ్కొని వచ్చుటకు హనుమంతుం బంపె. అతండు వెంటనే నందిగ్రామంబునకుఁ జని మలినదేహుఁడును జటావల్కలధారియునై శ్రీరామపాదుకలకుఁ బూజ లొనర్చుచున్నవానిని భరతుం జూచి శ్రీరామచరితం బంతయు సాంతంబుగ విన్నవించె. ఆవృత్తాంతంబును వినుచుండఁగనే భరతుండు శత్రుఘ్నుం దోడ్కొని వెడలి యయోధ్యం జేరి సీతాలక్ష్మణసమేతుండగు శ్రీరాముం జూచి యాతనిపాదంబులకు మ్రొక్కి మహాసంతోషంబుతో నయోధ్యారాజ్య మెల్ల నాతనికి నొప్పగించె. శ్రీరామచంద్రుండు భరతశత్రుఘ్నులను సత్యాదరంబున వీక్షించి మిక్కిలి సంతసించె. పదంపడి యొకసుముహూర్తంబు నిర్ణయించి వసిష్ఠవామదేవాదిమునీంద్రులు సర్వసరిత్తీర్థంబులను జతుస్సముద్రోదకంబులను నింకనుం గలగంగాదిపుణ్యనదీజలంబులను దెప్పించి శ్రీరామున కయోధ్యారాజ్యపట్టాభిషేకమును గావించిరి. ఆమహోత్సవమును జూచువేడ్క నచ్చోట నున్నసుగ్రీవాంగద హనుమదాదికపీశ్వరులకును విభీషణాది రాక్షసవర్యులకును దక్కంగల ముఖ్యామాత్యులకును వారివారికిం దగు సత్కారంబు లొనర్చె. అంత వానరు లెల్లరు

దమతమనివాసంబులకుఁ బోయిరి. పదంపడి శ్రీరాముండు పుష్పకంబు
ధనపతి యగుకుబేరుని దని యున్న తెలిసినవాఁడు గాన దానిని వాని
యొద్దకుఁ గొనిపోవుట కనుజ్ఞ నొసంగె. ఇట్లు మహోన్నతపదవిత్రో
శ్రీరాముం డనేకసహస్రవర్షంబులు బ్రహ్మోత్తరంబుగా రాజ్యపరిపాల
నంబుఁ జేసి గోమతీసరయూతీరంబులయందు మూఁడింతలు దక్షిణలు
గల యనేకయాగంబు లొనర్చి యశఃకాయుండై వన్నె కెక్కె...

యుధిష్ఠిరా, నీవును శ్రీరామభద్రునియట్లు నాపదల నన్నింటిఁ
గడచి హస్తినాపురము నేలి సుఖింపగలవు. పెద్దలమార్గంబున ధర్మయుత
ముగాఁ బ్రవర్తించునీబోఁటి మహనీయులకు శుభంబు లొదవకుండునే?
మఱియు మహనీయుం డగు శ్రీరామభద్రుండు నిజపరివారదూరుండై
ఋక్షవానరగోలాంగూలసహాయుండై బహుదూరమున ద్వీపములో
నున్న శత్రుం బరిమార్చి యశస్సుఁ బొందె. నీ వట్లుగాక దేవతల
నైనం బోరునందుఁ జించి చెండాడఁగల విక్రమము గలవారును విధే
యులును నగు తమ్ములైన భీమార్జుననకులసహదేవులతోఁ గూడియున్న
వాఁడవు. అట్టివానికి నేది సాధింపరాదు? ఒక్కమాటు వినుము. సైంధ
వుఁడు ద్రౌపది నెత్తికొనిపోఁగా బలపౌరుషయుతులగు నీయనుగు భీమా
ర్జునులు వాని వెన్నంటి తఱిమి పట్టికొని కృష్ణను జెఱవిడిపించి సైంధవు
నవమానించి నీయాజ్ఞ ననుసరించి వానిని మోసఁ బ్రాణంబులతో విడిచి
పుచ్చిరి గాదే? ఇంతటిమహనీయుల బలపౌరుషంబుల నుతింపఁ దరమే?
ఈ రాజ్యమెల్ల సకలగుణపరిపూర్ణుండవయిన నీయదియ యగుంగనుక శోకింపఁ
జనదు. అని యూఱడించిన మృకండుపుత్త్రువాక్యామృతధారల నేద దేఱి
యుధిష్ఠిరుండు తనయరణ్యవాసంబునకును, రాజ్యభ్రంశమునకును సం
తగఁ జింతింపనట్లును, దమనిమిత్తమున నయోనిజయు మహారాజపాంచాల
రాజపుత్త్రియుఁ బరమపతివ్రతయు నగు యాజ్ఞసేని యిన్నియిడుములఁ
గుడువవలసెనే యనియు నిట్టిపతివ్రతాంగనలు పూర్వ మెవరైన
నిట్టిబాధలను నవమానంబులను బడిరే? అట్టివారిని మీరు విని కని
యెఱుంగుదురే? పతివ్రతామాహాత్మ్యంబును వినఁగోరి యున్నవాఁడ.
నీవాగమృతధారల మాపీనులకు విందొనర్పవే. అని యడిగిన ధర్మరా
జునకు నమ్మునిరా జిట్లనియె. లోకంబుల వినుతికెక్కినపరమపతివ్రత
యగు సావిత్రీచరిత్రం బుపన్యసించెద. ఆచరిత్రంబు వినినఁ బతివ్రతా

మాహాత్మ్యంబు తేటతెల్ల మగు. సావధానమనస్కుండవై యాకర్ణింపు
మని చెప్ప నారంభించె.

### ధర్మరాజునకు మార్కండేయుండు సావిత్రీచరిత్రంబు చెప్పుట

పూర్వకాలమునందు ధర్మాత్ముండును, సత్యవచనతత్పరుండును,
జితేంద్రియుండును, యాగాచరణపరాయణుండును, యాచకకల్పతరువును,
నేర్పరియుఁ, బౌరజానపదప్రియుండును, నహింసావ్రతపరాయణుండును,
సర్వభూతహితేచ్ఛువును, బరమశాంతుండును నని ప్రఖ్యాతివహించి
మద్రదేశము నేలుచుండిన యశ్వపతినామకుం డగు రాజొకం డుండెను.
ఆతండు బ్రహ్మోత్తరంబుగా వర్ణాశ్రమధర్మంబుల నతిక్రమింపక ప్రజా
పాలనం బొనర్చుచుండె. ఇట్టివాఁ డయ్యును నామహనీయునకు సంతా
నము లేమిం జేసి కఠిననియమము పూని సావిత్రీమంత్రముచే లక్షహోము
లగ్నిహోత్రమునఁ వేల్చుచు, బ్రహ్మచర్యవ్రతనిరతుండయి, యింద్రియ
ములను వశపఱచుకొని ప్రతిదినంబును నాఱవముహూర్తంబునఁ గొలఁ
దిగ భుజించుచుఁ గాలంబు పుచ్చుచుండెను. ఇత్తెఱంగున నతండు పదు
నెనిమిదివత్సరంబు లిట్టినియమంబుతో సావిత్రి నుపాసించెను. ఆపదునెని
మిదవయేఁడు నిండఁగా, సావిత్రీదేవి యశ్వపతినియతవ్రతమునకు సుప్రీ
తయై హోమకుండమునందుండి వెలువడి యారాజున కిట్లనియె. అశ్వపతీ!
నీనియతవ్రతమునకు బ్రహ్మచర్యశమదమములకును గడు మెచ్చితి. ధర్మ
మార్గమున నిరతము వర్తిల్లుచుండుము. కోరినకోర్కె నిచ్చెద నడుగు
మనఁగా నశ్వపతి మిక్కిలి సంతసించి యాపరదేవతతో నిట్లనియె. దేవీ,
నాయెడం గరుణ గలదేని వంశోద్ధారకులగు పెక్కండ్రు పుత్త్రులు గలు
గునట్లనుగ్రహింపుము. ఎంతసంపద గలిగియు నపుత్త్రకునకు గతిలే దని
సర్వజ్ఞు లగు విప్రు లాడెదరు. సంతానమున నన్నిధర్మములను బడయ
నగు. మీఁదుమిక్కిలి దానం బరమధర్మమును సాధింపనగు. కావునఁ
దన్నిమిత్తము నే నిట వ్రతంబు సలిపితి నని విన్నవించెను. అంత సావిత్రీ
దేవి యారాజున కిట్లనియె. రాజర్షివర్యా! నే నింతకు మున్నె నీయభిప్రా
యంబు నెఱింగి బ్రహ్మపాలికిం బోయి నీకుఁ బుత్త్రోత్పత్తి గలిగింపు మని
ప్రార్థింప నాతండు నీ కొక్కకూఁతుం బుట్టించెద నని నాతో నానతిచ్చె.
దీనికిఁ బ్రతి చెప్పకుము. పెద్దలనుగ్రహించినదానిని బ్రసాదంబని గ్రహిం

పుము. బ్రహ్మావరము లమోఘంబు గాన నీకుం బుట్టఁగలకుమార్తయే
సర్వశ్రేయస్సాధనం బగు నని సెలవిచ్చి సావిత్రీదేవి యదృశ్య యయ్యె.
అంత నశ్వపతి తపంబు చాలించి పురంబు సేరి యథోచితముగఁ బ్రజాపాల
నంబు సేయుచుండె. అంతఁ గొంతకాలమున కాతనిపట్టమహిషి మాళవి
యను వనితారత్నంబు దైవానుగ్రహంబునఁ జూలుఁ దాల్చె. ఆచూలు
శుక్లపక్షపుఁజంద్రునింబోలె ననుదినప్రవర్ధమానం బగుచుండఁ బ్రజను
లందఱును సంతోషించిరి. మాళవియుఁ గొన్నినాళ్లకు గ్రహ ముచ్చస్థలు
రాఁగా నొక్కశుభముహూర్తంబున రాజీవలోచన యగు నొక్క
కూఁతుం గనెను. అంత నశ్వపతి యాకూఁతునకు జాతకర్మాదిసంస్కా
రంబు లొనర్చి సావిత్రీహోమంబునను సావిత్రీదేవి వరంబునను జనించి
నది యగుటచే నాకూఁతునకు సావిత్రి యని నామం బిడెను. ఆకూఁతురును
దినదినప్రవర్ధమాన యై మాతాపితరు లెంతయో గారాబమునఁ బెంపఁ
బెద్దది యయ్యెను. అప్పు డాకన్య తనదివ్యకోమలరూపంబునం జేసి యపర
లక్ష్మీదేవియో యనునట్లుండె. అంత నాకోమలిజవ్వనంబు నివ్వటిల నమరి
పెంపుసొబగుల కిక్కయై విరాజిల్లఁ బురజను లందఱును నాకమలముఖిని
బంగరుబొమ్మయో, దేవతాంగనయో యని యూహించిరి. దివ్యాం
గనయే యశ్వపతికిఁ గుమార్తెగాఁ బుట్టెనదని దానితేజోమహిమలకు
రాజపుత్రు లందఱు వెఱచి యట్టిమహనీయ యగు కన్యకామణినిఁ జేపట్ట
వెఱచుచుండిరి. అంత నొక్కపర్వకాలంబున శిరస్స్నాతయై సావిత్రి
యుపవసించి సావిత్రీదేవతను ధ్యానించి యగ్నిం బ్రజ్వలింపఁ జేసి విధ్యు
క్తముగ బ్రాహ్మణులసాహాయ్యంబున నద్దేవతకుఁ బ్రీతిగా హోమ
మొనర్చి వేదపారగులగు విప్రులచే దీవనలఁ బడసి వా రనుగ్రహించి
యొసఁగిన పూలదండల నంజలిపుటంబున గ్రహించి, తండ్రి యగు నశ్వ
పతిని సమీపించి యాతనికి సాష్టాంగదండప్రణామంబులం జేసి
యామాల్యముల నొసఁగి యాతని ప్రక్క నొదిగి నిలుచుండియుండె. అంత
నజ్జనపతి తనకూర్మికూఁతుం జూచి దీనికి గుణవయోరూపముల ననుకూలుఁ
డైన భర్త నెట్లు బడయుదునో యనియు, దేవతాంగనవలె నొప్పుచున్న
యీకూఁతును వరు లెవ్వరును వరింపకున్నారే యనియుఁ జింతాక్రాంతుం
డై కొంతసే పూరకుండి పదంపడి కూఁతుం జేరఁ బిలచి యిట్లనియె. ఓగుణ

పతీ, నీకు వివాహకాల మాసన్నంబైనది. రాజపుత్త్రు లెవ్వరు నేలకో
[illegible]తపలకు నిన్ను వరింపరైరి. నీ కనురూపుం డగు భర్తను నీవై
నను వరించి నా కెఱింగింపుము. ఏసును దగు నాలోచనంబుఁ జేసి
వానికి ని న్నొసంగి కృతార్థుండ నయ్యెద. కన్య కుచితకాలమున వివా
హంబు గావింపని తండ్రియు, ఋతుకాలంబునందుఁ భార్యను గవయని
భర్తయు, దండ్రియనంతరము తల్లినిం బోషింపని కుమారుండును నిందా
ర్హులని ధర్మశాస్త్రంబులు ఘోషించు. కావున న న్నానింద పొరయ
కుండఁ జేయుము. అని చెప్పి సమీపవర్తు లగు మంత్రులను బిలిచి
పూజ్యులారా! వినుండు. మనసావిత్రి భర్తను వరించుపొంటె నాశ్ర
మంబులకుఁ దఱలుచున్నది. ఆయమ ప్రయాణంబునకుఁ దోడ్పడుఁ
డనిన వారట్ల కావించిరి. సావిత్రియుఁ దండ్రి పాదంబులకు నెఱఁగి
సెలవుం గొని ముఖంబున లజ్జ తొలుకాడ బంగారురతె నెక్కి మంత్రు
లును, వృద్ధబ్రాహ్మణులును దోడురాఁగాఁ దఱలి రాజర్షు లుండునాశ్రమం
బులనునడుగుచుఁ బెద్దలసేవించుచు బుణ్యనదీతీర్థము లాడుచు సత్పా
త్రంబులకు దానంబు లొసంగుచుఁ దపోవనంబులఁ గ్రుమ్మరుచు రాజర్షి
పుత్త్రులఁ గాంచుచుండె.

## నారదుం డశ్వపతియొద్దకువచ్చుట

అంత నొక్కనాఁ డశ్వపతినగరునకుఁ ద్రిలోకసంచారి యగు
నారదమహర్షి రాఁగా నామహానీయున కశ్వపతియెదు రేఁగి తోడ్తెచ్చి
యాసనంబు నొసఁగి భక్తిపూర్వకముగ నర్ఘ్యపాద్యాదు లొసంగి
పూజించి లోకవార్తల వినుచుండ సావిత్రి సకలతీర్థముల నాడి ఋష్యా
శ్రమములలోఁ బెద్దల సేవించి మగిడి తండ్రిసదనంబున కేతెంచె. అంత
నామె నారదమునీంద్రునితో నిష్టగోష్ఠి సలుపుచుండుతండ్రిం గాంచి
యయ్యిరువురకుఁ దండప్రణామంబు లాచరించి వినయవినమితోత్త
మాంగయై నిలుచుండె. అప్పుడు దేవర్షి యగునారదుండు మద్రనాథు
నితో నిట్లనియె. నృపాలా! నీకూఁతు రిప్పుడెచ్చోటికిఁ బోయియుండె
ఎచ్చోటినుండి యేతెంచె. నిండుజవ్వనమున నుండు నీపుత్త్రియ నింతవు
ము న్నెయెవరున కైన నేల యిచ్చి వివాహంబు గావింపవైతివి? అనఁగా
నమ్మునిపతికి మద్రపతి యిట్లనియె. ఋషివర్యా! వినుము. ఇప్పుత్త్రియుం
బతివరణంబుపొంటె పంపయుంటి. ఎవ్వని వరించివచ్చెనో వినవలయు

నని కూఁతుం బిలిచి 'సావిత్రీ! నీవు పోయిన కార్యంబు సాధించి యేతెంచితివే?' అనిన నదియుఁ గొండొక లజ్జించి కోర్కి పెంపున సిగ్గుఁ దొలంగంజేసి కుతూహలమున నల్లలనాడుచుండు నంతరంగంబుతోఁ దండ్రి కిట్లనియె. చిరకీర్తితో సాళ్వదేశము నేలు పరమధార్మికుం డగు ద్యుమత్సేనుం డను మహారాజు పెద్దకాలంబునకుఁ దనముసలితనంబునం దొక్కకుమారుం బడసె. ఆద్యుమత్సేనుండు దైవయోగమున నంధుండు కాఁగాఁ దత్పూర్వ మాతని కోడిన శత్రురాజులు తటి వేచియుండి యాతనిరాజ్యముం గొనిరి. అంత నాచీకురాజు బాలుం డైనపుత్త్రునితోను వృద్ధురాలగు భార్యతోను నరణ్యంబుల కరిగి తపం బాచరించుచున్నవాఁడు. వానిపుత్త్రుం డాశ్రమంబులయందు మునికుమారులతోఁ బెరుగుటఁజేసి క్రూరవృత్తియెఱుంగక సత్యవచనపరుఁ డయి యుండుటంజేసి సత్యవంతుం డను సార్థకనాముండై వెలయుచున్నవాఁడు. ఆసత్యవంతుని నాకుఁ దగినవరునిగాఁ గోరివచ్చినదాన. కావున నోరాజశేఖరా! ప్రీతితో నాతనికి నన్నుఁ గన్యాదానంబు సేయుము. అనిన విని నారదుం డక్కటా! సావిత్రి యెఱుంగక వాని వరించి వచ్చినయది యనఁగా మద్రేశ్వరుండు నారదుం జూచి మునీంద్రా! ముల్లోకముల మీ రెఱుఁగనివారు లేరు. సావిత్రిచేత వరింపఁబడిన కుమారుఁ డెట్టివాఁడు. వానిగుణరూపశీలంబు లెఱింగింపుఁడు. అనఁగా దేవర్షి యగు నారదుం డిట్లనియె. మద్రేశ్వరా! వినుము. ద్యుమత్సేనపుత్త్రుం డనయము సత్యముం బలుకువాఁడు గాన వాని నాశ్రమవాసు లగు విప్రులు సత్యవంతుం డని పేర్కొందురు. వానితలిదండ్రులును నిరంతరము సత్యవాక్కులు. వాఁడు చిఱుతనాఁటంగోలె మట్టితో నశ్వంబుల నేర్పుతోఁజేయు శిల్పకౌశలంబు గలవాఁడు గాన వానికిఁ జిత్రాశ్వుం డనియు నామాంతరంబు గలదు. వానిసుగుణము లపారములు. అతఁడు తేజస్సున సూర్యునిం బోలు. బుద్ధియందు సురాచార్యు ననుకరించు. శౌర్యమున నింద్రునకు సమానుం డగు. శాంతియందు వసుధ కెనవచ్చు. దాతృత్వమున రంతిదేవునకు సాటి. సత్యవచనంబున శిబి కీడగు. ఔదార్యంబున నపరయయాతియే యన నగు. రూపసౌందర్యంబున నశ్వినీదేవతలకుఁ దుల్యుండు. అంతియకాక తపస్సు, శమము, బ్రాహ్మణభక్తి, మహాప్రభావత, జితేంద్రియత్వము, మిత్రవాత్సల్యము,

అనసూయత, బలశౌర్యములు, హ్రీధృతికీర్తులును గలిగిన మహనీయుండు. శీలవంతులును దపోవృద్ధులును నగు రాజర్షులును బ్రహ్మర్షులును వానిం బెద్దయుం బొగడుదురు. ఇట్లు సకలగుణసమేతుండయ్యును నతండు నేఁడు మొదలుగ నొక్కయేట మృతిం బొందు. ఇది నిక్కవంబు. దాని నెఱుంగక సావిత్రి వాని నేల వరించె నని తొలుకఁ బలికెను. ఈదోషంబు దప్ప వానియందుండుగుణము లన్నియు సద్గుణములే యని చెప్పఁగా విని యశ్వపతి విషణ్ణమానసుండై కూఁతుఁ జేరఁబిలిచి సావిత్రీ! దేవర్షి మాట వింటివి గదా! ఇట్టి యల్పాయుష్కునివిడిచి వేఱొండుపతిం గోరుకొనుము. అనఁగాఁ దండ్రికి ననుంగుఁగూఁతు రిట్లనియె. తండ్రీ! వినుము. భాగస్వవస్థయు, కన్యాదానంబును, నడిగినవా రడిగినట్లిత్తు నను నొడఁబాటును నొక్కసారి చేసినంతేఁ దప్పరాదు. త్రికరణము లగుమనోవాక్కాయములందు మనస్సు ప్రధానము కావున మనోనిశ్చయము గావించుకొనినపిదప మరల మగుడందగదు. ఏల యనఁగా, మనోవాక్కాయములందు వెనుకవానికంటెఁ బూర్వపూర్వంబు ప్రమాణంబు. కావున నామనంబున నిశ్చయించుకొనిన పురుషుండు దీర్ఘాయు వయ్యును నల్పాయు వయ్యును శీలగుణసంపన్నుం డయ్యును దుశ్శీలుండయ్యును నెట్టివాఁడైనను వానినకాని యన్యుని వరింప. నీవు తగుయత్నంబు గావించి సన్నాహమున కొసంగుము. అనఁగా నారదుండు మద్రపతిం జూచి, రాజేంద్రా! నీకూఁతురు దృఢనిశ్చయురాలు. దానినిశ్చయంబు మాన్ప నీలు గాదు. సత్యవంతునికంటె నిప్పటి రాజపుత్త్రులలో వయోరూపగుణములయం దధికుం డన్యుండు లేఁడు. కావున వాని కొసంగి ధన్యుండ వగుము. నీకూఁతుసుకృతమున నైనను వాఁడు దీర్ఘాయుష్మంతుండు కాఁగలఁడు. మీకు శుభము లగుఁగాక యని దీవించి దేవర్షి యగు నారదుండు నాకలోకమునకుఁ జనియె.

### సావిత్రి సత్యవంతునిఁ బరిణయంబగుట

అంత మద్రేశ్వరుండు నారదువచనంబునఁ దనకూఁతును సావిత్రిని ద్యుమత్సేనుకొడుకు సత్యవంతుఁడను వరునకుఁ గన్యాదానంబు చేయ నిశ్చయించి మంత్రిపురోహితులను రావించి తననిశ్చయ మెఱిఁగించి యొక్కశుభముహూర్తం బేర్పఱచికొని యాశుభదినమునకుఁ

బూర్వమే వివాహోచితసకలపదార్థములను సమకూర్చికొని సర్వబంధు మిత్రపరివారసమేతుండై సావిత్రిం దోడ్కొని ద్యుమత్సేను నాశ్రమంబు చేరువ విడిసి పాదచారిగ్యై యాశ్రమంబుఁ బ్రవేశించి సాలవృక్షపునీడ నాసీనుండై యుండు వృద్ధుఁడు, నంధుఁడు నయిన ద్యుమత్సేను నకుఁ దన్నెఱింగించి తగినసత్కారంబు లొనరించి మౌనముతో నుండె. సాళ్వపతియు నశ్వపతి కాశ్రమయోగ్యం బగు నాసన మిచ్చి కూర్చుండ నియమించి యర్ఘ్యపాద్యాదు లొసంగ నియమింప మద్రేశ్వరుండు యథార్థంబుగఁ గైకొని తన కొసంగినయాసనంబున నాసీనుండై యుండ సాళ్వపతి మద్రపతిని స్వాగతం బడిగె. అప్పు డశ్వపతి యి ట్లనియె. ఈకన్నియ నాకూఁతురు. మాకులమునకుఁ దెప్పనంటిది. రాజవర్యా! ఈకన్యను నీకొడుకు సత్యవంతున కొసఁగి వివాహము గావింప నేతెంచితి. నాయందు విశ్వసించి దీనిని నీకోడలుగాఁ గైకొనుము. నామాట లాలించి నన్నుఁ గృతార్థుం గావింపుము. అని చెప్పఁగా విని ద్యుమత్సేనుం డిట్లనియె. రాజా! మేము విగతరాజ్యులమై ఘోర కాంతారములయం దిమ్మెయిఁ దపమాచరించుచున్న వారము. నీకూఁతురు బాల సుకుమారి గావున నరణ్యమున మాతోడియిడుములఁ గుడుచుటకు నోర్చునే? అనఁగా నశ్వపతి మఱియు నతని కి ట్లనియె సుఖదుఃఖములు విధివశంబున సంయోగవియోగంబులం బొరయుచుండు. అవి మనుష్యుని యధీనములు గావు. అని నాకును నాకూఁతునకును లెస్సఁగాఁ దెలియు. వాని నెల్ల నెఱింగియే యేను వచ్చితి. ఇఁక వానితోఁ బనిలేదు. మాకోర్కి కడ్డు సెప్పకుము. మనము సంబంధ బాంధవ్యములుచేసికొనవలయు. నీకొడుకు సత్యవంతున కీ కన్నియ తగినది. ఈకన్యకకు నీకొడుకు తగినవరుండు. ఇరువురును నన్యోన్యగుణములతో నొప్పినవారు, దివ్యమూర్తులు. నీతోడ వియ్యమంద నా మనస్సున నాస కలుగుటంజేసి సర్వసంభారసమేతుండనై యిట కేతెంచితి. నాప్రార్థన మంగీకరింపుము. అనఁగా నాద్యుమత్సేనమహారాజా సంబంధమునకు సంతసిల్లి నిజాశ్రమవాసు లగుమునులం గూర్చికొని శుభలగ్నంబున సత్యవంతునకు సావిత్రిం బరిణయంబు జరిగించె. అయ్యశ్వపతియుఁ గూఁతునకు నల్లునకు వివిధాంబరాభరణాదివస్త్ర విశేషంబు లరణంబుగా నొసంగి నిజపురంబునకు మగిడె. ద్యుమత్సే

నుండు తనకుఁ దగిన సంబంధము లభించినందులకై సంతసించె. సత్యవంతుండును సర్వగుణసమేత యగు భార్యను బొంది ప్రముదితస్వాంతుం డయ్యె. సావిత్రియుఁ దండ్రి తన్ను విడిచిపురంబున కరిగిన పిదపఁ దనపై నున్న మేలైనవస్త్రాభరణాదుల నొలిచియుంచి పతివలెనె తానును నారచీరలఁ గట్టి మితభాషిణియై దేవకార్యములయం దత్తమామలకుఁ దోడ్పడుచుఁ గాయక్లేశంబున కోర్చి వారికి సత్కారముల నమర్చుచుఁ బ్రియవార్తల నైపుణ్యంబుఁ జూపుచు నేకాంతంబునఁ బతికిఁ జేయవలసినపరిచర్య లొనర్చుచు వినయముతో నెల్లవారికి నోటనాలుకయై వర్తించుచుండె.

**సావిత్రి సత్యవంతునితో వనంబున కేఁగుట**

ఆపిమ్మట సావిత్రి యెల్లవారి ననువర్తించి మెలఁగుచుండి పతియొక్కయాయుఃప్రమాణంబున నొక్కొక్కదినంబు దగ్గుచు రాఁగా నింక నొకసత్సరమునకు నాల్గుదినము లున్నవనఁగా నాటికి నాలవనాఁడు పతిమరణదినం బని మనంబునఁ జింత గదుర త్రిరాత్రోపవాసవ్రతమును నతినియమముతోఁ జేయుచుండె. ఆమె త్రిరాత్రవ్రతనియమమును బూని యున్న దని మామ యగు ద్యుమత్సేనుండు విని కోడలిం బిలిచి 'యమ్మా! ఇట్టి కఠినవ్రత మేల పూనితివి? ఇది దుష్కరము. ఇది నీయట్టి కోమలాంగులు నెఱవేర్పఁగలరే! నీవు పూనినవ్రతమును విడుపు మనుటకు నొప్పదు.' అనఁగా మామకుఁ గోడ లిట్లనియె. మహనీయా! దీని కింత వగ వగునే? అన్నింటికి మనోనిశ్చయంబె కారణంబు. దృఢమనస్కులకు విఘ్నములు రావు. దృఢనిశ్చయు లాపదలను బొరయరు. నేను దృఢనిశ్చయనై యీవ్రతమును బూనితి. కాన దీని సాగింతు. అని మామగారిని సమ్మతిపఱచి యుపవాసంబున బడలినదయ్యును బతి కాసన్నంబగు మృత్యువుఁ దలఁచి చింతాక్రాంతయై యెట్లో మూఁడు రాత్రులును గడపె. అంత సావిత్రి నాలవనాఁడు రేపకడ లేచి నారదుఁడు చెప్పిన నీదినము కదా పతిమరణదినం బని తలంచుచు మిక్కిలి నియమమున సూర్యోదయానంతరమున నగ్నినిఁ బ్రజ్వలింపఁ జేసి విధ్యుక్తముగ హోమము గావించి యాశ్రమవాసులగు పెద్దలకును ద్విజులకును నత్తమామలకును దండప్రణామంబు లొనర్చి వారివలన దీర్ఘసౌమంగల్యాశీర్వచనములను బొంది మఱల నత్తమామలం జేరి

యాశ్రమమునఁ బెద్దలదీవనలఁగూర్చి తలపోయుచుండి నారదువచనములఁ దలపోసి కడుదుఃఖించుచు నాభర్తృమరణమస్సమయ మెప్పుడు రానున్నదో యని దిగులుపడుచుండె. అప్పు డత్తమామలు సావిత్రిని 'కోమలీ! దుష్కరంబగు నీత్రిరాత్రోపవాసవ్రతము పూర్తిగావించితివి. నేఁడు పారణంబు సేయుము. పారణ కిది సకాలంబు కాదా' యనఁగా సావిత్రి వారి కిట్లనియె. నావ్రతమునకు సూర్యాస్తమయంబు దాఁక ఉపవసించి పిదపఁ బారణకాలము. నేనట్లే యీవ్రతంబు సంకల్పించితి. అట్లే నియమము చేసికొంటి. అప్పటికి నవశ్యము పారణము నొనర్తునని చెప్పుచుండ సత్యవంతుండు దేవకార్యనిమిత్తము ఫలములను బుష్పములను సమిత్తులను దెచ్చుటకై గొడ్డలి మూఁపున నెత్తికొని యరణ్యమునకుఁ దఱలెను. అట్లు తఱలుటఁ జూచి యాసుకుమారి భర్తయొద్ద కేఁగి యీదినము నీవెంట ఫలకుసుమసమిథలం దేఱ నేనును వత్తు. నామాట నాదరించి నన్ను నీవెంటఁ గొనిపొమ్ము. నేఁడు నిన్ను విడిచియుండ ననఁగా సత్యవంతుఁ 'డోసుకుమారీ! నీవెన్నఁడును నడవికిఁ జన్నదానవుకావు. అడవిదారి దుర్గమంబు. మఱియు నీవు త్రిరాత్రోపవాసవ్రతమునఁ గృశించి బడలియున్నదానవు. ముండ్లతోను ఱాలతోను నుండు కఱుకునేలమీఁద మెత్తని నీపాదముల నుంప లేవు.' అని చెప్పఁగా నాసుగుణుండైన పతికి నప్పరమపతివ్రత యిట్లనియె. ఉపవాసమున నే నించుకయు బడలినదానఁ గాను. వనంబులందు సంచరించుట కీదినమున నాకు వేడుక జనించినది. నామాట కడ్డు సెప్పక నీవెంట నన్నుఁ గొనిపొమ్ము. అని చెప్పఁగా సత్యవంతుం డందుల కొడంబడి, నీ కిష్టమున్నచో నావెంబడి రమ్ము. నాతల్లిదండ్రులయనుజ్ఞఁ గొనుము. వారియానతి యైనచో నానేర ముండ దని సత్యవంతుఁడు భార్యతో నుడువఁగా నప్పరమసాధ్వి పతిమాటలకు మాఱాడక యత్తమామల పాలికిం బోయి నమస్కరించి వినయముతో నిట్లనియె. పూజ్యులారా! మీసుతుండు వనములకుఁ బుష్పఫలసమిత్తులం దేరఁబోవుచున్నవాఁడు. మీ యాజ్ఞ యొసంగిన నీదినము నాభర్తవెంబడి వనమునకుం జనెద. నే నిప్పుడు నాప్రియుని విడిచియుండ. తమకుఁగా సమిత్ఫలాహారణంబుకై నాప్రియుఁ డేఁగువాఁడు. నాకోర్కి నిరాకరింపరాదు. లేనిచో నతని నివారించుటయే నాకు సమ్మతంబు. పుష్పించి యుండు

వనవృక్షములను జూడ నాకపేక్ష పొడముచున్నది. నేనును మీయాశ్రమంబుఁ బ్రవేశించి దాదాపు వత్సరకాలం బయ్యెను నాయపేక్ష నెఱవేఱ దయ్యె. కావున నావేఁడికోలు నంగీకరించి నాపతి వెంట నన్నంపుట కనుజ్ఞ యిండు. అనఁగా మామగారగు ద్యుమత్సేనుండు కోడలు వచ్చిననాటంగోలె మనల నెద్దియుఁ గోరియుండదు. ఈదిన మేదియో యుల్లాసంబున నొక్కటి కోరఁగా వలదనరాదని మనంబునఁ దలంచి కోడలియిష్టమునకు వల్లె యని పలికి, "అమ్మా! ఏమఱక మార్గమునఁ బతి ననుసరించి నడుచుచుండుము. నీయభీష్టములం బడయుము. అనఁగా నత్తయు మామమాటల నామోదించి దీవన లొసంగి సావిత్రినిఁ గుమారునితోడ నంపెను. అట్లత్తమామలయనుజ్ఞఁ బొంది మనంబునఁ బతిమరణదిన మది యని చింతతోఁ గూడినదయ్యెను, నాచింతను వెలిఁ బెట్టక యానందంబు గలదివోలెఁ గాన్పించుచు సత్యవంతుని వెంబడించి పోవుచు, వింతలయిన నెమళ్లగుంపులతోఁ గూడి, మనోహరంబులై యున్నవనంబు లన్నిటిని నిర్మలోదకంబులతోఁ బ్రవహించు నదులను, బుష్పభరితంబు లగు నుత్తమవృక్షములను బ్రియుఁడు చూపుచుండ వాని నెల్లఁ జూచునట్లు నటించుచు మరణసమయ మాసన్న మగు కొలఁదిని, నారదమునీంద్రునిమాటఁ దలఁచి, భర్త మరణమొందినట్లే తలఁచుచు భర్తను వెంబడించి మెల్లఁగాఁ బోవుచు మనంబున నెమ్మదిఁ దప్పి, తన కానారదుఁడు చెప్పిన కష్టకాల మేవేళ రానున్నదో యని తహతహ పడుచుండెను.

పిదప సత్యవంతుండు పుష్పఫలములం జిదిమి గరిడియ నిండించికొని పదంపడి గొడ్డలితో నొక్కచోటఁ గట్టెలం గొట్టి యాయాసంబున డస్సి చెమర్చినదేహము గలవాఁడై గొడ్డలిని నేలపైచి ప్రియురాలిం జేరి యిట్లనియె. ప్రేయసీ, శిరంబు శూలములతోఁ బొడిచినట్లు పోట్లెత్తుచున్నది. శరీరము పరవశ మగుచున్నది. మనస్సు వేదనం బొందుచున్నది. చిత్తము స్వాస్థ్యము తప్పి యున్నది. నిలుచుటకు నావంతేనియు నశక్తుండనై యున్నాఁడ. కొంత తడవు విశ్రమించెద. అని చెప్పఁగాఁ సావిత్రి తనతొడను బ్రియునకు నుపధానంబు చేసి యాతనిని బరుండఁ జేసెను. కాని సావిత్రిని నారదుమాటలు వేధించుచుండె. అంతఁ గొంతవడికి నల్లనిశరీరమును, నెఱ్ఱనినేత్రములు గలిగి నీలవస్త్ర

ముల ధరించి, బద్ధశిఖాకలాపుఁడయి సూర్యనిభతేజోమూర్తియును, పాశ
హస్తుఁడును, సకలభూతభయంకరుఁడు నైన మహాపురుషుం డొకఁడు
భర్తపార్శ్వమునఁ జూచుచున్నవానిం గని, యమ్మహాపతివ్రత మెల్లన
మగని శిరంబును క్రింద మోపి తాను లేచి నిలుచుండి యాపురుషు
నకు మ్రొక్కి భయకంపితహృదయయై యి ట్లనియె. అయ్యా! నీ వెవ్వఁ
డవు? నీ వేపని చేయఁబూనియున్నావు? నీరూపం బమానుషంబుగ
నున్నయది. నీవు దేవతాస్వరూపుఁడ వని తలంచెద. నీకర్తవ్యము నాన
తిమ్ము. అనఁగా నాపురుషుం డి ట్లనియె. శుభాంగీ! నేను గాలుండను.
నీవు మహాపతివ్రతవు గావున నామహత్త్వంబున నన్నుఁ జూడం గంటివి.
అన్యుల కెవ్వరికిని నాస్వరూపంబు కానరాదు. కావున నేను నీతోమాట
లాడుచున్నాను. సత్యవంతునకాయువు మూఁడినది. వీనిని పాశబద్ధుఁజేసి
కొంపోయెద. ఇది నాకర్తవ్యము. అనఁగా సావిత్రి మృత్యుదేవత
కి ట్లనియె. పరమపురుషా! ఆయుస్సుమూఁడినవారిని నీదూతలు గొని
పోవుదు రని విందు. అట్లుండ సాక్షాత్తుగ నీకార్యమునకై నీవే యేల
రావలయు? ననఁగా మృత్యు వి ట్లనియె. కల్యాణీ! నీభర్త పరమధార్మి
కుండు. కావున వానిని నాదూతలం బంపక నేనే యీకార్యమునకై
వచ్చితి నని సత్యవంతుని శరీరమునుండి యంగుష్ఠమాత్రుఁడయిన జీవునిఁ
బాశబద్ధుం జేసి లాగికొని దక్షిణాభిముఖుండై తరలె. అంత సత్యవం
తునిశరీరము ప్రాణము లేనిదైపోవ, నూపిరి నిలిచి, కాంతి తఱిగి, చెయ్వు
లు దక్కి చూడ నింపుగాక యుండె యముఁడు దక్షిణదిక్కు మొగంబై
పోవుచుండఁగా, నియమవ్రతముల సంసిద్ధిగల మహానుభావ యగు పతి
వ్రత యైన సావిత్రి భర్తృశరీరమును బదిలంబుగ నుంచి, యముని
వెంబడించెను. అపుడు యముఁడు సావిత్రిం గాంచి యి ట్లనియెను.
శుభాంగీ! మఱలిపొమ్ము. భర్తకు నౌర్ధ్వదైహికక్రియ లొనర్పుము.
నీవు భర్తృఋణముఁ దీర్చుకొంటివి. నీవు పోఁదగినంతవఱకు పోయితివి.
ఇఁక మఱలు మనఁగా యమునిఁ జూచి సావిత్రి బదులు సెప్పఁదొడఁ
గెను. 'దేవా, నాభర్త యెక్కడికిఁ గొనిపోఁబడునో, లేక తానుగా
నెచటికిఁ బోవునో యచ్చటికిఁ బోవుట నాకు విధి. భర్తవెంబడిఁ బోవుట
భార్యకు ధర్మము. ఇది సనాతనధర్మము. నే నొనర్చిన తపస్సుచేతను,
నాకుఁ గలగురుభక్తిచేతను నాకుం బతియందుఁ గల యనురాగంబు

నను, జేసిన ప్రతప్రభావంబునను, నీయనుగ్రహమునను నాకడ్డు లేదు. నేఁ దలఁచినచోటికిఁ బోఁగలను. నన్ను నడ్డపెట్టకుము. మహాత్మా, నా మాట యించుక యాలింపుము. కలరూ పెఱిఁగినపండితులకు మైత్రి సాప్తపదీనము. ఏడడుగులు గూడ నడచుటచే నేర్పడిన దంద్రు. నేఁ గొంతదవ్వు మీతో నడచుటం జేసి నాకు మీతోఁ గలిగినమైత్రిని మున్నిడుకొని యించుకంత సెప్పెద. దాని నాలింపుము. సకల జనులును గార్హస్థ్యము, బ్రహ్మచర్యము, వానప్రస్థము, సన్న్యాసము అను నాలు గాశ్రమములు పుణ్యసంపాదనమునకు మార్గము లనియు నందును గృహస్థమార్గ మన్నింటికంటె బ్రధాన మనియు నందురు. సజ్జనసమ్మతమైన యొక్క యాశ్రమధర్మముచేతనే తక్కిన యాశ్రమధర్మములు గలుగు ననుటచే నట్టి గృహస్థధర్మమునే నే నవలంబించితి. ఇఁక రెండవ దగు బ్రహ్మచర్యము గాని, మూఁడవ దగు సన్న్యాసము గాని నేఁ గోరను. గృహస్థధర్మమే మే లని యంద ఱందురు. అని సావిత్రి పలుకఁగా యముఁ డామెతో ని ట్లనియె. ఓయనిందితురాలా! నీవు చక్కని కంఠముతోను విడివిడిగను, సకారణముగను మాటలాడిన పలుకులకు మిక్కిలి సంతసించితిని. నీవు పతిజీవితేతరం బైన వరం బొండు వేఁడు మొసఁగెద నని ధర్మరాజు పలుకఁగా సావిత్రి యి ట్లనియె:—ఓ సమవర్తీ! నామామ కన్నులు లేనివాఁడై, రాజ్యమును బోఁగొట్టుకొని, వనవాసంబు చేయుచున్నవాఁడు. అతఁడు నీయనుగ్రహమునం జేసి, మఱలఁ జూపు నొంది బలిష్ఠుఁడును, సూర్యాగ్నులమాడ్కి వెలుఁగువాఁడు నయ్యెడు మని వరంబు వేఁడెను. అంత శమనుఁడు 'ఓ యనిందితురాలా! నీకు వరం బొసఁగితిని. నీయడిగినయట్ల నీమనోరథంబు నెఱవేఱుఁ గాక. నీవు దారి నడచుటచే సలసినట్లు కాన్పించుచున్నదానవు. ఇఁక మఱలిపొమ్ము. నీ కలసట తగ్గును.' అని సమవర్తి పలుకఁగా నాసావిత్రి వెండియు ని ట్లనియె. ఓ సురేశా! పతిచేరువ నున్న నాకు శ్రమం బేడ భర్త యేడ నుండునో యదియు నాకు నిత్యం బైనగతి. నాప్రియు నెక్కడికిఁ దోడ్కొనిపోవుదో, యక్కడికే నే నేఁగద నన్నాఁగకు. వెండియు నొకపలుకు పలికెద ఆలకింపుము. లోకంబున సజ్జనసంగ మొక తేపమైన నత్యంతకాంక్షణీయము. అంతకంటె మిత్రసంగము మిగులఁ గోరఁదగినది, సత్పురుషుల తోడిసంగ మెన్నటికి వృథ గాదు. కాన భవాదృశు లగు సత్పురుషుల

చెంతనే మెలఁగవలయు. అని సావిత్రి చెప్పినమాటల కలరి యముఁ
డిట్లనె. ఓభామినీ! నీమాట యిష్టమును హితకారియు బుధులబుద్ధికి
మెప్పు గలిగించునదియు నై యున్నది. నీవు సత్యవంతుని ప్రాణముఁ
దక్కఁ దక్కిన దేదైన రెండవవరంబు వేఁడు మొసఁగెద నని యముఁ
డనెను. ఆపలుకులు విని సావిత్రిదేవి యామశమనునితో నిట్లనెను.
మా మామ ద్యుమత్సేనుఁడు రాజ్యంబుఁ గోల్పోయె నంటిఁ గదా.
ఆ సత్పురుషునకుఁ గ్రమ్మఱ రాజ్యము వచ్చుఁగాక. యనుటయు
యముఁడును నావరం బొసఁగువాఁడై 'నీమామ మఱల శత్రులఁ గెలిచి
రాజ్యముఁబొంది ధర్మమునఁ బ్రజల నేలును గాక' యని సావిత్రితోఁ
బలికి వెండియు, 'ఓసీ చిన్నదానా, కడు దవ్వేతెంచితివి. ఇఁక మఱలి
పొమ్ము. దారిబడలిక లేక యుండును.' అనుశమనునిపలుకులు విని
సావిత్రియు యమునిఁ జూచి యిట్లని వచించె. ఓదేవదేవా, లోక
మునందలి ప్రాణులనెల్లర నీవు లోపఱచికొని, వాని నీయాజ్ఞచొప్పున
నడపించుటం జేసి యముఁడను పేరు లోకప్రసిద్ధ మయ్యెను.
మనోవాక్కాయంబులచే సకలజీవరాసులకు ద్రోహముచేయమి, దయ,
దానము సజ్జనులకు శాశ్వతధర్మము. లోకంబున సజ్జను లిట్టివార
లున్నారు. మనుష్యులు శక్తిహీనులై యున్నారు. సజ్జనులు మను
ష్యులదుస్థితిఁ గనిపెట్టి తమ్ము శరణు వొచ్చిన శత్రువులందును దయ
చూపుచున్నారు. నీవెఱుఁగని ధర్మంబులు లేవని పలుకఁగా యముఁ
డును 'దప్పిగొన్నవానికి నీరు దనివి గలిగించుచందంబున నీయింపుగు
లుకు పలుకులు నామదికి సంతసంబు గలిగించినవి. ఈసత్యవంతునిజీవి
తంబు దప్పఁ దక్కినవరంబు వేఁడు మొసఁగెద' ననఁగా సావిత్రి యిట్ల
నియె. ఓ మహానుభావా! నాతండ్రి పుత్రసంతతి లేక కుందుచుండెను.
అతనికి వంశకరులగు నౌరసపుత్రులు నూఱుగురు గల్గునట్లు మూఁడవ
వరం బొసఁగవే యని ప్రార్థింపఁగా, యముఁడును 'ఓకల్యాణీ, యట్లే.
నీతండ్రికి నూఱుగురు కొడుకులు పుట్టునట్లు వరం బొసఁగితి. ఓశు
భాంగీ, రాజపుత్రీ, నీవిఁక మఱలి పొమ్ము. చాలదూరంబు నడచి వచ్చి
తివి. నీకు మార్గాయాసంబు మెండుగ నున్నది' యని సావిత్రితోఁ
జెప్పెను. ఆసావిత్రియు యమున కిట్లనియె. ఓ దేవదేవా, పెనిమిటి
వెంట నేఁగుట నాకు దూరము గాదు, నాడెందము మఱింత దవ్వునకుఁ

బోప నుంకించెడి. ఇప్పుడు నే నొకమాట సెప్పెద. నీవు పోవుచునే నేఁ జెప్పెడి పలుకు వినుము. దేవదేవా, నీవు వివస్వంతుని (సూర్యుని) తనయుఁడవు. కడు వెలుఁగువాఁడవు. నిన్నుఁ బండితులు వైవస్వతుఁ డందురు. లోకమున నందఱు ప్రజల నొక విధంబగు ధర్మంబుతో నడిపింతువు. కావున నో యీశ్వరా, నీకు ధర్మరాజను పేరు ప్రసిద్ధికెక్కె. మఱియొక్క విశేషంబు వినుము. జనులకు సజ్జనులం దున్న నమ్మకము తమ యాత్మయందుఁ గలుగదు. కనుక నందఱు సుజనులను విశేషముగ నమ్ముదురు. సుజనులయందు సకలప్రాణులకుఁ జెలిమి యుండుటం బట్టియే వారికి వారియందు విశ్వాసంబు గలుగుచున్నది. కనుక జనులు సుజనులను నమ్ముచున్నారు. అని సావిత్రి చెప్పిన పలుకులు విని యముఁ డిట్లనియె. ఓకల్యాణీ! ఇట్టి పలుకులు నీవలనఁదప్ప మఱి యెవరివలనను విని యెఱుఁగ. ఈసత్యవంతుని ప్రాణముఁదప్ప నెద్దియైన నాలుగవ వరంబు వేఁడు మొసఁగెదను. వేఁడు మనఁగా సావిత్రి యమునిఁ జూచి, నాకును సత్యవంతునకును వంశవృద్ధి సేయు నూఱుగురు ఔరసపుత్రులు గల్గునట్టుల నాలుగవ వరంబు నిమ్మని యడిగెను. ఆపలుకు విని యముఁడును 'ఓ యబలా, బలవీర్యములచే నొప్పినవారై నీకుఁ బ్రేమపాత్రు లగునూఱు పురుషపుత్రులు నీకోరిక ప్రకారము పుట్టుదురు. నీకు మార్గాయాసము లేకుండును. నీవు మఱలిపొమ్మని సావిత్రికిఁ జెప్పెను. అంత నామె యమునికిట్లనియె. ఓమహానుభావా, సత్పురుషులు నిరంతరము శాశ్వతం బగు ధర్మంబున నిలిచియుందురు. సజ్జను లెప్పుడును కృశింపరు; దుఃఖము లొందరు. సజ్జనులతోఁ జేరిన సాధువులకు, ఫలము గలుగకపోదు. జనులు సుజనులనుండి యెట్టి భయంబును బొందరు సజ్జనులు తమ సత్యప్రభావముచేతనే సూర్యుల నడపింతురు. సజ్జనులు తమ తపంబుచేఁ బుడమిని ధరింతురు. ఓమహాత్మా, సజ్జనులే భూతభవిష్యంబులకు రెంటికిని నాధారంబులు. సజ్జనుల నాశ్రయించినవా రెన్నఁటికిఁ జెడరు. లోకవర్తనంబునకు సత్పురుషులే గతి యండ్రు. ప్రతిప్రయోజనమును బాటింపక సత్పురుషులు అన్యులకార్యములను సాధింతురు. కాఁబట్టి సజ్జనుండ వగు నీయాశ్రయంబు నన్ను విఫలమనోరథనుగాఁ జేయునే. సత్పురుషసేవకుల కెందును భయంబు లేదు. సంగ్రామములును దదాశ్ర

యంబున సమకూరును. అనర్థములు తొలంగు. కావున సజ్జనులే రక్షకులు. నీవు సజ్జనుండవు. అనాథ నగునన్ను సనాథఁ గావించి రక్షింపుము. నాయభీష్టము నీయక నన్నూరక మఱలుమన్న నే మగిడి పోవుదునే. యని వినయముతో విన్నవింపఁగా యముం డిట్లనియె. ఓసావిత్రీ! నీమాటలు గూఢార్థయుతములు, సారసంబులు. నీయుపన్యాసంబు ధర్మార్థసహితంబు. భవద్వాక్యంబులు, మనోనుకూలంబులు వినను వినను బరమానందంబు గలుగుచున్నది. నాయందును నీ కుండు ననుపమ భక్తి వెల్లడి యయ్యె. ఇష్టంబైనవరముఁ గోరికొనుము. అనఁగా సావిత్రి యిట్లనియె. దేవా! ఇంతదనుకఁ జెప్పినట్లు గాకయీమారు నిర్బంధము లేక నాకోరిన వర మెట్టిదైనను నొసఁగుదు నంటిరి. కావున నాపతి యగు సత్యవంతుప్రాణంబు నొసంగి వానిని బ్రతికింపవే యనెను. మఱియుఁ బతివియోగము కలిగె నేని సతికి స్వర్గంబును వ్యర్థమే. ప్రియుండు చెంత లేని సుఖము లేల? పతిని నీవు గొనిపోయినచో నాప్రాణంబులను గొనిపొమ్ము. నాప్రార్థన నంగీకరించి నాపతిని నా కొసంగి సత్పురుషుఁ డనునామంబు సార్థకంబుఁ జేసికొనుము. అని గంభీరవచనంబులతోఁ బ్రార్థింపగా వైవస్వతుండును దానిమాటలకుఁ బరమానందభరిత చేతస్కుండై సత్యవంతునిఁ బాశవిముక్తుం జేసెను. ఓమత్తకాశినీ, ఇదే నీభర్తను బ్రదికించితి. ఈమహానీయుండును సకలార్థములఁ గోరినంతఁ బొందుచు, నన్నూరేండ్లు జీవించి, నీతోడ సర్వసంపదల ననుభవించి, నీయందు నూర్వురు పుత్త్రులంబడసి, యనేకయజ్ఞములం జేసి, బహుధార్మికుం డని కీర్తిఁ జెందును. నీకొడుకులు పుత్త్రపౌత్త్రులం బడసి యనేక రాజ్యముల నేలుదురు. నీవంశము నీపేర శాశ్వతంబై వెలయు. మున్నొసంగినవరము లన్నియుఁ జెప్పినట్ల నడచు. ఇంక మఱలి పొమ్మని సావిత్రిని మఱలించి ధర్ముండు నిజలోకమున కరిగె.

సావిత్రియు భర్తప్రాణంబులతో మఱలి వానికళేబర మున్న చోటికేతెంచి, యాశిరంబును దనతొడపై నిడికొని కూర్చుండె. అంత సత్యవంతుండు మృత్యువు తనయందున్న యంగుష్ఠమాత్రపురుషునిఁ బాశబద్ధునిఁ జేసినప్పుడు కల్గిన విరూపము లన్నియు పోయి నిజరూపము నొంది పరదేశములకుఁ బోయివచ్చినవాఁడు ప్రియురాలిమోముం

బలుమాఱులు గనునట్లు చూచి యిట్లనియె. సుందరీ! నే నీచోటం బెద్ద యెుఱుం బ్రొద్దు నిద్రించితినిగదా! ఇంతకాలము నన్ను మేల్కొలుపవైతి వేల? నన్నొక నల్లనిపురుషుం డాకర్షించికొని బహుదూరము గొని పోయెను. ఆపురుషుం డిప్పు డేల కానరాఁడో? అని యడుగుచుండ సావిత్రి కన్నులు తెఱచికొని తన ముఖారవిందమునే చూచుచుం దన్ను నానందింపఁ జేయుభర్త కిట్లనియె. నాథా! నాతొడపైఁ దల నిడికొని నిదురవోయి యిప్పుడే మేల్కొంటివి. దృష్టిగోచరుఁడైన నల్లని పురుషుండు యముఁడు. అతఁడు తనయునికిపట్టున కేఁగె. లేవఁగలవేని లెమ్ము. రాత్రి యయ్యెను. నలుదెసలఁ జీకట్లు క్రమ్ముచున్నవి. ఇచ్చోట నింక నిలువరాదు. వేగంబ యాశ్రమమున కేఁగుదము. అని చెప్పఁగా సత్యవంతుండు మనోనాయకిమాటలను విని నిదురవోయి లేచువాని వలె నల్లన లేచి యంతటఁ గలయం జూచి సావిత్రి కిట్లనియె. కల్యాణీ! దేవపూజార్థము ఫలపుష్పాదులఁగొని గరిడియ నించి పిదప గొడ్డలితోఁ గట్టెలు కొట్టుచుండఁగాఁ దలనొప్పిచే బాధితుండనై నిలువలేక నీతొడపైఁ బరుండితిం గదా! అట్లు మైమఱచి నిదురించు నప్పుడు నల్లనిశరీరము గలిగి, రక్తనయనములు వెలుంగ నపారతేజోమూర్తియు ఘోరాకారుఁడు నైన యొకపురుషుం జూచితి. అది కలయో స్వప్నమో గుర్తింపలేకయున్నాను. నీ వెఱుంగుదేని చెప్పుము. అని యడుగ సత్యవంతునకు భార్య యిట్లనియె 'నాథా! ఇది యెల్ల నాశ్రమంబున రేపటికిని విస్తరించి చెప్పెద. గాఢాంధకారముతో రాత్రి యయ్యెను. మన మింక నిచ్చోటఁ దడయరాదు. రాక్షసులు దిరుగు వేళ గ్రమ్మెను. హారవుం బెల్లఱచుచు నలుదెసలఁ గ్రమ్ముచున్నారు. రాలిన యాకులు గలగల మని శబ్దించుటం జేసి క్రూరమృగములు సంచరించుచున్నవని యూహింపవలె. దక్షిణపశ్చిమదిక్కుల నక్కల యఱపులు వినఁబడుచున్నవి. మనస్సు భీతిఁ జెందియున్నది. లే లెమ్ము. ఆశ్రమమార్గముం బట్టి పోవుదము. ఆశ్రమముం జేరి మీతల్లిదండ్రులం జూడు మనఁగా నప్పరమపతివ్రతకుఁ బరమసాధు వగు భర్త యిట్లనియె. అనేక వృక్షసమూహములు దట్టముగాఁ బెఱిగి యంధకారము బంధురంబై మిక్కుటమైనది రాత్రి యగుటం జేసి కన్నులకు దారి తెలియకున్నది. ఆలోచింపఁగా నికటికచీకటియందు దారిఁ దీయుట

దుష్కరము. అని చెప్పఁగా వానికి మద్ర రాజపుత్త్రి యిట్లనియె. అల్లదిగో చూడుము. ఈవనమధ్యమునఁ గ్రాలుచుండు మ్రానొక్కటి ప్రకాశమానమై వెలుఁగుచున్నయది. దానియం దుండి యగ్ని కణంబులు గాలి కెగురుచుఁ బలుతావులం బడుచున్నయవి. ఆనిప్పు కలసు దెచ్చి యింతకుమున్న నీవు చీల్చినకట్టియలఁ బరిగొల్పెద. ఆవెలుంగున మనము దారిఁ దప్పక యాశ్రమంబు సేరెదము. నడువ శక్తి లేనిచో నెట్లో యీరేయి యిందె యుండి ప్రభాతంబునఁ నాశ్రమమునకు బోవుదము. అని చెప్పఁగా సాళ్వరాజపుత్త్రుండు మద్ర రాజపుత్త్రిక కిట్లనియె. ఇపుడు నాకు శిరోవేదన ముపశమిల్లినది. దేహము పాటునం బడినది. నీవు తోడు రాఁగా నీవెంటఁ జని, యాశ్రమంబుఁ జేరి నాతల్లిదండ్రులం జూచెద. నేను మున్నెన్నఁడు నింతవఱ కాశ్రమంబుఁ జేరక వనమునఁ దారసిల్లినవాఁడఁగాను. ఏవేళ కాశ్రమమును జేరి చేరుచుండుదును. రాత్రివేళల నాతల్లి నన్నాశ్రమము వెలుపలికిఁ బోనీయదు. పగలాశ్రమమును వదలి యెందేని తడసినచోఁ దల్లిదండ్రులు మిక్కిలి పరితపింతురు. ఇప్పుడు మాతండ్రి యాశ్రమవాసులం బిలిచి నాపోఁబడి యారయుచుండు. నేఁ డీదినము తఱలునపుడే వనమున నుండి వేగముగ రా వని నన్నుఁ గోపించితి. ఇప్పు డీకాలుచీఁ కటియం దెక్కువప్రొద్దైనది. నారాక నెదురుచూచుచు వారెంతయడలు చున్నవారో! మున్నొక్కప్పుడు వారు నన్ను సమీపంబునఁ గూర్చుండఁ బెట్టికొని, 'మాతండ్రీ! నిన్ను వదలి మేము జీవింపనేరము. నీవు జీవించియుండునందాక మేమును జీవింతుము. నీవే మాకుఁ దెప్పకొయ్యవు. నీచే మావంశ ముద్ధరింపఁబడు'ననియు, మాకు నీవు పిండ తిలోదకంబుల నిత్తువనియు, మాకు బహుకాలము యశస్సును సంపాదింతు వనియు నత్యంత ప్రేమవాక్యములను నాతో నుడివిరి. అట్టి నన్నే నమ్మియుండు నాతలిదండ్రు లింతతడవిట మసలినందులకు నెంత కుందుదురో! వారు నన్నుం గానక జీవముల వదలుదు రేని నాప్రాణములు వారి కుపకరింపనివి యుండ నేల? నేను బ్రదికియుండుట వారికి శుశ్రూషకుఁడనై యుండ వారి కుపచరింపని నాశరీర మేల! అంధుండైన నాతండ్రి నన్నుఁ గానక యెంత కుందునో? ఎల్లప్పుడును వారికి బ్రియం

బాచరింపవలసిన నేను వారిని దుఃఖాబ్ధి ముంచు టేటి తగవో? నా నిమిత్తము వా రెంతపరితపించిరో? అని పలుతెఱంగులఁ బనవి పనవి మాతాపితృభక్తి యెక్కువఁగ నుండుటంబట్టి మనస్సు నిలుప నోపక చింత బయల్పడఁ జేతులుపైకెత్తి బోరున నేడ్చె. అట్లేడ్చుచున్న భర్తను సావిత్రి సమీపించి తనచీరచెఱంగునఁ గన్నీరు దుడిచి యిట్లనియె. నాథా! నేఁ దపంబొనర్చితినేని, దానములఁ గావించితినేని, దేవతల కగ్నిముఖమున హవిస్సులను వేల్చియుంటినేని పరిహాసమునకైనను నానోట నన్నృతము వెలువడదేని, నాయత్తమామలు సేమమున నుండుదురుగాక. ఈరేయి సుఖంబుగాఁ గడచుఁగాక యని రాజపుత్రి పలుకఁగా రాజపుత్రుండా రాజపుత్రికతో, వెండియు నిట్లనియె. ప్రేయసీ, నే నిపుడ నాతల్లిదండ్రులఁ జూడఁ దలంచినాఁడ. జాగుసేసిన వారు సజీవులై యుందురో యుండరో? ఏమైన వైపరీత్యము గలిగెనేని నేనును బ్రదుకనేర. నేనుశపథంబు సేసెద. నీకు ధర్మమున బుద్ధిగలదేని, నేను సజీవుఁడనై యుండ నీకుఁ దలంపుగలదేని, నాకుఁ బ్రియము చేయఁగోరుదేని యిప్పుడే నన్నాశ్రమమునకుఁ దోడ్కొనిపొమ్ము. అని తెంపుగాఁ జెప్పెను.

**సావిత్రీసత్యవంతులు మఱలి యాశ్రమమున కేతెంచుట**

ఇవ్విధమున సత్యవంతుఁడు ననేకప్రకారంబులఁ బనవి కన్నీరు నింపఁగా నక్కాంత చింతాక్రాంతయై యతని నూఱడించి కురులు ముడిచి తన బాహువులచే సత్యవంతుఁ గ్రుచ్చి లేవ నెత్తిన మెల్లన నిలచి యతండు ధూళిధూసరంబైన తనశరీరమును దుడిచికొని గమనోన్ముఖుండై బుట్టఁ జూడఁగా ఫలపుష్పములతో నిండించిన గరిడియను మోవం జాలఁ డని యెంచి యద్దాని నొక చెట్టుకొమ్మకుఁ దగిల్చి గొడ్డలిని మాత్రము భుజంబునఁ దగిల్చికొని సంభ్రమంబున నిజేశ్వరువామబాహువును దనవామభుజంబుమీఁద నిడికొని కుడిచేత నతని గ్రుచ్చి కౌఁగిలించికొని మెల్లని నడకతో నాశ్రమంబునకు మఱలఁగా సత్యవంతుండు సావిత్రి కిట్లనియె. ప్రేయసీ, నే నీదారిఁ బలుమాఱు నడచి యుండుటచే, నేనీమార్గముఁ జక్కఁగ నెఱుఁగుదు. అదికాక చెట్ల యాకులసందులఁ గనఁబడు వెన్నెలచేతం దారిగుర్తు తెలియుచున్నది. ఇదియే మనయాశ్రమంబునకు సూటియైన మార్గము. ఆలోచింపక నడువుము. ఈమోదుగుతోపువొద్ద మార్గము రెండుగాఁ జీలుచున్నది.

అం దుత్తరమార్గమువలన యాశ్రమమునకుఁ బ్రోవ. ఆలోచింపక నడువుము. నా కిప్పటికి బడలిక తీరినది. స్వస్థుఁడనై తొంటివలె దృఢగాత్రుఁడ నైతి. వేగంబ నడువఁగలుగుదు. అని త్వరితగతిం జనుచున్నంత వారు తమయాశ్రమమును సమీపించిరి. అటు లాశ్రమమునందు ద్యుమత్సేనుండు తటాలున దృష్టి రాఁగా నాశ్చర్యమగ్నమానసుండై యట్లగుటకుఁ గారణంబు నరయుచుండ సాయంసమయ మగుటయు, సత్యవంతుండు సావిత్రీసమేతుండై రాత్రి చీకటిపడ్డతర్వాతను నరణ్యంబునుండి రామికిఁ జింతించుచు నాశ్రమమునం దుండి సనసా[illegible]గ్రమును బట్టి వెదకుచుఁ గొడుకుకోడళ్ల యెలుఁగెందేని వినఁబడునా యని చీమ చిటుక్కుమన్నను గమనించుచుచుఁ బాపములయందున వారి ముంగ్గు, కన్నుకైనవాలు గ్రుచ్చుకొని నెత్తురు కాలుచుండ సమీపంబున నుండు మున్యాశ్రమంబుల నేలులఁ గొలంకుల వాగుల వెదకి వేసారి యంతట సావిత్రి సత్యవంతులఁ గానక వనవుచుండ నాశ్రమవాసు లగువిప్రులు వారి నూరార్చి వారిం దోడితెచ్చి తమయాశ్రమములందుఁ గూర్చుండఁబెట్టి పూర్వరాజచరిత్రములం జెప్పుచుఁ గాలయాపనము చేయుచుండిరి. ఎంత తెన్ని యూరడింపుమాట లాడుచున్నను, నాము మసల్లినువురుసు చేపతీపకుసు గొడుకుం గోడలిస దలఁచుచు 'హాసత్యవంతా! మాయనుంగుకొడుకా! హా! సావిత్రీ! మీరిరువు రెచ్చట నున్నవారు? మే మింతప్రేమ పిలిచినను మీ రేల పలుక రని పెరెలుంగున నేడ్చుచున్నంత సువర్చసుం డను విప్రుండు వారి కిట్లనియె. మీపుత్త్రుండు శమదమతపస్సంయుక్తుఁడు, గుణవతియగు మీకోడలిచే సంరక్షితుండై యున్నవాఁడు. మీరు భీతిల్ల వల దనుచుండఁగా గౌతముం డను విప్రుండు వారి కిట్లనియె. నేను వేదములను సాంగముగ నభ్యసించినవాఁడను. బహుకాలము తపము నాచరించితిని. విధ్యుక్తముగ బ్రహ్మచర్యమును నడిపితి. పెద్దలకు సేవ లొనర్చితిని. గురుశుశ్రూషలు గావించితి. నిరతాగ్నిహోత్రుఁడను. శాంతచిత్తుఁడనై నేను వాయుభక్షుండనై యుపవాసవ్రతము నాచరించుచుఁ గఠినవియమములతోఁ దపస్సులం జేసితి. ఈవ్రతాచరణముల మహిమవలన నాకు లోకమున సర్వవృత్తాంతంబులు మనోగోచరము లగుచుండు. నీకుమారునకుఁ జేటు వాటిల్లదు. వాఁడు

సజీవుఁడై యున్నవాఁడు. నామాట నమ్ముఁ డని పలికె. పిదప నాగౌతమ
శిష్యుండును దమయుపాధ్యాయుఁ డాడినమాట సత్య మనియు,
నాతనినోట నన్నృతంబు వెడల దనియు సత్యవంతుండు సజీవుఁడై యున్న
వాఁడనియు దనగురువుమాట ననువదించెను. మఱియు నొక్క బ్రాహ్మ
ణుండు భరద్వాజుం డనువాఁడు తపముచేతను దమముచేతను నాచార
నియమముచేతను వెలయువాఁడు సత్యవంతునకుఁ బరమసాధ్వియు
సద్గుణగరిష్ఠయు నగు సావిత్రి ధర్మపత్ని యగుటంజేసి సత్యవంతున కేయ
పాయమును లేదనెను. తర్వాత దాల్భ్యుం డనువేఱొకవిప్రుం డిట్ల
నియె. అయ్యలారా; వినుఁడు. ఈరాజునేత్రము లెన్నఁడో కానరాక
పోయె. అట్టినేత్రముల నీవాఁడు కనఁబడుట మున్నగునవి యెల్లఁజిత్ర
ములై యున్నయవి. వీరి కిఁక శుభదినంబులు. ఆకారణంబున సత్యవం
తున కపాయం బొందెడిదియు లేదు. వాఁడు వేగంబ యాశ్రమముం జేరు.
అని నుడివెను. అంతట నాపస్తంబుం డను భూసురవర్యుండు మృగ
ములయెలుంగులును బక్షులరుతంబులును నెఱింగినవాఁడు వానిని బరిశీ
లించి యందు వ్యత్యాసమును వ్యసన కారణంబును నెవ్వియు లేవనియు
దానివలన సత్యవంతుండు జీవించియున్నాఁ డనియు, నాపదం బొరయఁ
డనియుఁ దోఁచెడి ననియె. వెంటనే ధౌమ్యుం డనువిప్రుఁడు సత్య
వంతుఁడు సుగుణాకరుఁడు. దీర్ఘాయుష్మంతుండు. వాని కేయిక్కట్టు
గలుగ దనెను. అంత నాశ్రమవాసి మును లెల్లరును సావిత్రీదీర్ఘ
సౌమంగల్యమున సత్యవంతుఁడు చిరంజీవి గా నోపు. అని యంద ఱేక
వాక్యముగాఁ సూచించిరి. ఇట్లు ఋషులందఱును ద్యుమత్సేనశైబ్యల
నూఱడించుచుండ వారు కొంత యుపశమిల్లి వాపోవకుండిరి. ఆసమయ
మున సతీసమేతుండై సత్యవంతుం డాశ్రమద్వారమునఁ గన్పట్టుటయు
నాభూసురు లందఱును సాళ్వపతిం జూచి యిట్లనిరి. రాజేంద్రా! నీవు
మహాభాగ్యసంపన్నుండవు. మే మాడినమాటలు నమ్ముగావు. నీకొడుకుం
గోడలును నేతెంచిరి. అంధుండవై యింతకాల మున్ననీవు దృష్టిఁ బడ
సితివి. వేగంబ నీకు సంపదలు సమకూరు నని చెప్పి యగ్నిం బ్రణయించి
మహారాజుచుట్టుం గూర్చుండుటయు శైబ్యయు సావిత్రి సత్యవంతు
లును వారియానతిమెయి నచ్చోట నాసీనులైరి.

అంత నమ్మునులందఱు సత్యవంతు నిట్లడిగిరి. రాజపుత్రా, నీ వెన్నండు నింతతడవరణ్యంబునందు మసలినవాఁడవు కావు. సాయంసమయమగువఱ కాశ్రమంబు చేరుచుంటివి. మఱియు నీవిన నబల యగు సతీమణిం దోడ్కొని వనమునకుం బోయితివి. ఇంత తడవేలయ్యె ఆలస్యమునకుఁ గారణం బేమి? మీ కేటంక మేమైనఁ గలిగెనే? మీరింతవఱ కాశ్రమంబునకు రాకుండుటం జేసి ముసలివారైన నీతల్లి దండ్రులు మేమును నిందాఁకఁ బెల్లడలుచుంటిమి. తడయుటకుఁ గారణ మేమి? యనఁగా వారికి సత్యవంతుండు సవినయముగ నిట్లనియె. మహాత్ములారా, వినుండు. మే మిరువురము వనంబునకుఁ బోయి ఫలకుసుమాదులఁ గోసి గరిడియయం దునిచికొంటిమి. పిదప బరశువుం గొని నేను కాష్ఠవిదళనంబు సేయ సమకట్టుడు నాకుఁ దటాలున శిరోవేదన గలిగె. అంత సావిత్రియూరువు లంపిగాఁ గొని చాల సేపు నిదురించితి. ఇంతసేపు పగటిపూట నే నెన్నండును నిద్రించి యెఱుంగను. అంత మేల్కాంచి, దిక్కులం బరికింప రాత్రి యయ్యె. వెంటనే సావిత్రిఁ దోడ్కొని యరణ్యంబునందుండి తరలి వేగంబున నాశ్రమంబునకు వచ్చునప్పటికి నడురేయి యయ్యె. ఇదియ నే నెఱింగిన కారణంబు. ఆ కారణము సహేతుకము కానేరదు. సాల్వపతికిఁ గన్నులకు దృష్టి కలుగుటకు వే ఱగు హేతు వుండును. అది సావిత్రికిఁ దప్ప నన్యుల కగోచరము. అని గౌతముం డను మునిసత్తముండు పలికి సావిత్రి మొగంబై దేవీ, ఇయ్యది రహస్యముగాదేని బయలుపఱుపుము. అని యడుగ నచ్చోట నుండిన వారల కామె యిట్లని చెప్పందొడంగె. ఋషివర్యులారా! మీరెఱుంగనివృత్తాంతంబు లుండునే? మీ రుడుగఁ బలుకరానిమాటలును గలవే! నాయెఱింగిన దంతయు నెఱింగింతు. వినుఁడు. పూర్వ మొకప్పుడు నారదునివలన నీసత్యవంతున కీదినము మరణదినమని వినియుంటి. కావున మనంబున మిక్కిలి చింతతో నాల్గుదినములకు మునుపు త్రిరాత్రోపవాసవ్రతంబుఁబూని యీశ్వరు నారాధించుచుంటి. ఈదినము సత్యవంతుండు పుష్పఫలసమిధలం దేర వనమునకుఁ దరలఁగా నాతనియెంటరిపోక కిష్టపడక మామయత్తమామలయనుజ్ఞం గొని నేనుం గూడఁ బోయితి. అంత వనమునందుఁ బరశువుతోఁ గట్టెలఁ

జీల్చుచున్న సత్యవంతునకు సయిరింపరానిశిరోవేదనంబు గలుగఁగా నాతనికి నాతొడ నుపధానముఁగా నిచ్చి పరుండఁబెట్టితి. అంత మృత్యుదేవత యచ్చటను సమీపించి తనచేతిపాశంబున సత్యవంతునిదేహమున నున్నజీవుని బంధించి కొనిపోవుచుండ నేనును మృత్యువుపు వెన్నంటి చని పలుదెఱంగుల నతనిని స్తోత్రముచేసి తత్ప్రసాదంబున నైదువరములఁ బడసితి. అందుఁ బ్రథమవరమున మామామకుఁ గన్నులు గానవచ్చునట్లును, రెండవవరమున నీతనికి రాజ్యము గ్రమ్మర వచ్చునట్లును, మూఁడవదాన నాతండ్రి యగు నశ్వపతికిఁ గులోద్ధారకులగు నూఱుగురుపుత్త్రులు గలుగునట్లును, నాల్గవవరమునకు నాకు వంశోద్ధారకు లగు నూర్వురు కొడుకులను సత్యవంతుండు బడయువాఁ డనియును, బంచమవరప్రభావమున సత్యవంతుండు నన్నూఱేండ్లు జీవించి యనేక యజ్ఞములను నాచరించి కీర్తిమంతుండు కావలయు నని కోరఁగ నామృత్యువు నాయందుఁ గరుణించి నాకోరినవరము లొసఁగి నన్నాశీర్వదించి యదృశ్యుండయ్యె. నేను నాభర్తృజీవితంబు గోరియే వ్రతంబు నాచరించితి. నావ్రతఫలంబుగ మామగఁడు దీర్ఘాయువయ్యెను. నాయెఱింగిన దంతయు సవిస్తరముగ మీకుం దెలుపఱచితి. అనఁగా మును లెల్లరును సావిత్రిని ఓపతివ్రతాశిరోమణీ! అంధుండైన నీమామకుఁ గనులకు దృష్టి నొసంగి గతరాజ్యుండై యడవుల నీవారములఁ గుడుచుచున్న రాజునకు రాజ్యంబుఁ గలిగించి యాచంద్రార్కస్థాయి యైనకీర్తినిఁ గడించితివి. నీవు సాక్షాత్సావిత్రీదేవి కెనయగుదానవు. అని యాదేవిని బలుతెఱంగులఁ బ్రస్తుతించి ద్యుమత్సేను నామంత్రణంబుచేసి సంతుష్టస్వాంతులై తమతమ నెలవులకుం బోయిరి.

### ద్యుమత్సేనుండు మరల రాజ్యముం బొందుట

అట్లామునిపల్లెలోనివారు పరమకుతూహలంబున నారేయి గడపి రేపకడ లేచి కాల్యకరణంబులఁ దీర్చి ద్యుమత్సేనునొద్ద కేతెంచి సావిత్రీపుణ్యచరిత్రంబు సెప్పుచుండ సాల్వదేశమునందుండి పురజనులనేకు లరుదెంచి ద్యుమత్సేనుని దర్శించి యిట్లనిరి. నృపాలవర్యా! నీరాజ్యంబు నాక్రమించిన శత్రురాజును వానిమంత్రులను బంధువులను సహాయులను నెల్లవారిని నీయమాత్యుండు వధియించె. నీవైరిసైన్యం

జెల్ల నలుదెసలం బాతె. నీకుఁ గన్నులున్నను లేకున్నను మ స్తేలుట కర్హుండవు నీ వనియు మమ్మును రక్షించుటకుఁ దగినరాజవునీవ యనియు నెంచి నీయొద్ద కేతెంచితిమి. నీకు రాజోచిత మగు సైన్యమును నీ వారోహింపఁదగిన వాహనంబులను గొని తెచ్చితిమి. నీవ సాల్వ దేశంబునకు రాజ వని యంతటం జాటించితిమి. నీ కీరాజ్యము వంశ పారంపర్యముగ సంప్రాప్తమై యిప్పుడు విధిప్రేరణంబునఁ దొలఁగినను మఱల దైవానుకూల్యంబున నిన్నుఁ బొందినది. అని ద్యుమత్సేనునకు మనవి చేసికొనిరి. మఱియు నాతండు లబ్ధదృష్టి యగుటకుఁ గరంబు సంత సిల్లిరి. అంత ద్యుమత్సేనుండును నాశ్రమవాసులగు మునుల కెల్ల సాష్టాంగదండప్రణామంబు లాచరించి వారిచే ననుజ్ఞాతుండై కొడు కునుం దానును గజారూఢుండై సావిత్రియును శైబ్యయునుం బరిచారికా జనంబులతో వెంట రాఁగా బహుళచతురంగ సేనాసమన్వితుండయి పురం బునకుఁ జని సకలమహీరాజ్యమును గైకొని సత్యవంతునకు బుధజన సమ్మతిని యౌవరాజ్యపట్టంబు గట్టి పరమైశ్వర్యధుర్యుం డయ్యె. అంతఁ గొంత కాలంబునకు సావిత్రి కులోద్ధారకులగు నూఱుగు రుత్తమపుత్త్రులం గాంచె. మద్రేశ్వరుం డగు నశ్వపతి సావిత్రి పడసిన వరప్రభావంబున మాళవియందుఁ బుత్రశతంబుఁ బడసె. ఇట్లు పరమసాధ్వి యగు సావిత్రి తన్నుఁ దనమగనిఁ దనయత్తమామల జననీజనకులను నుభయ కులంబుల నుద్ధరించె. ధర్మనందనా! ఆసుచరిత యగు సావిత్రిచందం బున నీయాజ్ఞసేనియుఁ బరమకల్యాణి; సచ్ఛీలంబు గలది; తనమహా భాగ్యంబుగలిమిని మిమ్మును గులాంగన యగు సావిత్రిమాడ్కి నుద్ధ రింపఁగలదు. అని సావిత్త్ర్యుపాఖ్యానంబును మార్కండేయుం డుప న్యసింప యనఘమూర్తు లగునప్పాండవుల వీడ్కొని తనయాశ్రమం బున కరిగె. ధర్మరాజును దత్సుచరిత్రము నంతయు విని కామ్యకవనము నందు శోకసంతాపములు వీడియుండె. ఈసావిత్రీచరితంబును భక్తితో వినినవారు సర్వార్థములను బొంది సుఖు లయ్యెదరు అని చెప్పిన విని జనమేజయుండు వైశంపాయనునితో మునీంద్రా! ఇంద్రుండు కర్ణు వచకుండలముల నెవ్విధంబున హరియించెం జెప్పవే యని యడిగిన నతం డతని కిట్లనియె,-

**సూర్యుఁడు బ్రాహ్మణవేషముతో వచ్చి కర్ణునకు హితము చెప్పుట**

పాండవు లరణ్యవాసంబుఁ జేయుచుండ వనవాసనియతకాల మగు ద్వాదశవత్సరంబులు గడచని పదమూఁడవయేఁడు వచ్చుసమయమునఁ బాకశాసనుండు పాండవులకు మేలు కోరి కర్ణునిసహజకవచకుండలములను విప్రవేషమున వచ్చి యాచింపనున్నవాఁడని యెఱింగి సూర్యుండు కర్ణహితముం గోరి కర్ణున కొక్కనాఁటిప్రభాతసమయంబున స్వప్నమున నగపడి పుత్త్రస్నేహము నిండార నిట్లనియె. కర్ణా! నేను నీ కొక హితబోధ గావింప నేతెంచితి. నాహితవచనములను వినుము. నీవు విప్రుఁ డేది యాచించినను నిత్తు నని వ్రతమును బూని యున్నాఁడవు. ఆనెపంబును మనమునం దిడికొని యింద్రుండు పాండవహితార్థియై విప్రవేషము దాల్చి నీయొద్ద కేతెంచి నిన్ను నీకవచకుండలములను యాచింప వచ్చువాఁడు, ఆతం డట్లు రాఁగా నీవు నానోపాయములచే నాతనికి స్త్రీలను ధనమును రత్నాభరణాదుల నిత్తునని చెప్పి సమాధానమున ననుపవలయు కాని నీసహజకవచకుండలముల నీయకుము. అవి నీకు దీర్ఘాయుఃప్రదంబులు. వానిం దొలఁగితివేని. నీవు మృత్యువువాతఁ బడుదువు. కవచకుండలయుతుఁడ వగు నీవు సకలరణములయందును నవధ్యుఁడవు. అవి రెండును నమృతసంభవములు. వాని ప్రభావం బట్టిది. కాన నామాటలను విని వాని నెట్టివారికి నీయకుము. నీకుఁ బ్రాణములపైఁ బ్రీతి గలదేని యట్లు చేయుము. అని చెప్పఁగాఁ గర్ణుం డతనిఁ జూచి, దేవా, నీ వెవ్వఁడవు? యాచింపఁగా నీవు విప్రాకృతిఁ దాల్చిన దేవుఁడవై యుండు వని తలంచెద. ననియడుగ సూర్యుండు వాని కిట్లనియె. నేను సూర్యుండను. నీ కాగతంబుఁ జెప్పి హితబోధ గావింపవచ్చితి నేను జెప్పినట్లు నడువుము. నీకు మిక్కిలి మే లయ్యెడు. అని చెప్పఁగా నప్పుడు కర్ణుం డాకర్మసాక్షి కెఱఁగి యిట్లనియె దేవా! నీవు నాకు హితబోధ గావింప వచ్చినంతనే నాకు శుభంబు సేకూరె. నీయనుగ్రహమునకుఁ బాత్రుఁడ నగుటకై స్నేహభావమున నొకమాట నుడివెద నాలకింపుము. నాయెడను విశ్వసించి యుండుదువేని నావ్రతమున కాటంకము పెట్టకుము. బ్రాహ్మణు లడిగినచోఁ బ్రాణముల నైన నే నిత్తు నని లోకమునఁ బ్రఖ్యాతిం గాంచితి. ఇప్పుడు పాండవులకు హితముఁ గోరి యాఖండలుఁ డంతటిమహనీయుండు విప్ర

వేషమున నన్ను సమీపించి నాసహజకవచకుండలముల నడిగిన నే నెట్లీయ నని పలుకుదు? ఒసఁగుటయే యుత్తమంబు. ఒసఁగకున్న మూఁడు జగములయందు విఖ్యాతమైయుండు నాకీర్తి కొఱంతపడును. పాండవులకు మేలు సేయవలయు నని పురుహూతునియంతటిమహాప్రభావసంపన్నుఁడు కపటబ్రాహ్మణవేషమును ధరించి నాసహజకవచకుండలముల నడుగునేని, నే హాని నా మహేంద్రున కొసఁగుసంగతి ప్రాప్తి కలుగునేని, నాకు ముజ్జగములయందును గీర్తి యినుమడించును. వారి కపకీర్తి గలుగు. ఎంతయాలోచించినను వాని నిచ్చుటయే యుచితం బని తోఁచెడిని. ప్రాణమిచ్చియైనం గీర్తి సంపాదింతు. ఇది నానిశ్చయము. కీర్తిమంతుండు నాకలోకంబున సుఖించు. కీర్తి పురుషునిఁ దల్లివోలెఁ గాపాడును. కీర్తియె యీలోకమున నాయుర్వృద్ధికరంబు. ఊర్ధ్వలోకంబులె సద్గతి ప్రదంబులు. కాఁబట్టి పురుషుండు కీర్తికై యత్నింపవలయును. అదియ పరాయణంబు. కీర్తికై పాటుపడనివాఁడును గీర్తిం బోఁగొట్టుకొన్నవాఁడును నన్నివిధంబులం జెడుదురు. అట్టిపురుషులు బ్రదికియుండియు జీవచ్ఛవంబులువోలె దూషింపఁబడుదురు. సర్వశుభములఁ బడయుటకుఁ గీర్తియే సాధనం బని పితామహుండు తొల్లి పలికియుండె. విప్రులడిగినదాని నొసంగి, యరిమర్దనంబు గావించి రణరంగమున శరణన్నవానిం గాంచి, బాలవృద్ధులగు బ్రాహ్మణుల సంకటములనుండి తొలఁగించి, యుద్ధమునఁ బిరు దివియక పోరి దేహపాతమును గాంచి యుత్తమకీర్తిం బొంది, పుణ్యలోకమున నుత్తమగతిం బొందనున్నవాఁడ. కీర్తిరక్షణమే నాకుఁ బరాయణంబు. పరమవ్రతంబు కావున విప్రవేషధారి యైన సహస్రాక్షునకుఁ గవచకుండలముల నొసఁగి సద్గతిం బ్రాపింతు నని చెప్పఁగా నాకర్ణించిన భానుండు కర్ణున కిట్లనియె. కర్ణా! నీమతంబున నీవును నీతల్లితండ్రులను, గలత్రపుత్రమిత్రులకును గీఁడగు. నీసహజకవచకుండలములఁ గోసి యిచ్చుచో నీశరీరమునకు హాని వాటిల్లు. శరీరమునకు హాని రానీయక కీర్తి సంపాదింపవలయును గాని యట్టివిపరీతకీర్తి దెస: బోరాదు. దానివలన ఫలం బేమి? జీవించియుండు నప్పుడు కీర్తి యలంకారమైయుండు. చచ్చినవానికిఁ గీర్తితోఁ బ్రయోజనంబు లేదు. దానివలన వాని కేసుఖము

గలుగు? వానికీర్తి పేసుఁగుకుఁ జేసినశృంగారముఖముమన నిష్ప్రయోజనం బగు. కావున దేహమునకు హానికరంబుకాని కార్యములనే పురుషుం డొనర్ప వలయును. నీవు నాకుఁ బరమభక్తుండవు. నిన్ను రక్షించుట నా కవశ్యకర్తవ్యంబు. కాన నీతో నింతపట్టు వలుక వలసె. మఱియు నీసంగతియందు మానవుల కగోచరంబైన గోప్యమొండు కలదు. ఆరహస్యము నీకు మఱియొక కాలంబునఁ దాన తెలియును. దాని నిప్పు డేను వివరింపను. ఉపాయముల నెన్నింటినో పన్ని యింద్రునకు సహజకవచకుండలముల నీయక పంపుట యుత్తమము. అమృతమయంబులై, దివ్యతేజోవిలసితంబు లగుకుండలములతో నొప్పాగు నీవు విశాఖామధ్యగుండైన నిశాకరుంబోలె తేజోవంతుండవై యున్నవాఁడవు వాని నింద్రుండు గొనిపోవుచో నీసొంపు దఱుగును. వెండియు నీ వెప్పుడు నర్జునునితో మల్లచఱచుచుందువు. వానికిని నీకును రణరంగమునఁ బోరాట మవశ్యము గల్గు. నీతోడఁ బుట్టినకవచకుండలములు నీమేన నుండునందాక నిన్నర్జునుండు పోర గెలువలేఁడు. మహేంద్రుండు వానికిఁ దోడై వచ్చినను వాఁడు నిన్ను గెలువలేఁడు. వే యేల? పోర నర్జునుం గెలువఁ దలఁపు గల దేని నీకవచకుండలముల నింద్రున కీయకు. అని బోధింపఁగాఁ గర్ణుండు ప్రభాకరున కిట్లని వచించె. మహానుభావా! భక్తునియం దుండు ప్రీతిం జేసి యింత వలికితివి. నాభార్యాపుత్త్రులపై కన్న నీపై నాకుఁ బ్రీతి మెండు. నీవు నాకు హితబోధను గావించితివి. అయినను నీకు మాటిమాటికి సాష్టాంగవందనము లొనర్చి వేఁడెద. అనుగ్రహించి మన్నింపవలయును. విప్రులు యాచింపఁగాఁ బ్రాణముల నైన నిత్తు ననునావ్రతమున కీబోధ వినుటవలన భంగ మగు. దాని కెంతయును భీతిల్లెద. కవచకుండలములు లేకున్న నే నర్జునుని గెలువలేనంటివి గదా? ఆ చింత మానుము. నేను బరశురామునియొద్దను ద్రోణాచార్యునియొద్దను బడసిన యనేకాస్త్రములు నాయొద్ద నున్నవి. నీవు నాసంగతి యెఱింగియే యున్నాఁడవు. కావున వానిచే నర్జునుని గెలువనోపుదు. పురుహూతుండు విప్రరూపుండై వచ్చి నన్ను యాచించి నప్పుడు నేను గవచకుండలముల నవశ్య మిత్తు. అట్లొనర్పుటం జేసి నాకు వ్రతభంగంబు వాటిల్లదు. ఇందుల కొడంబడు మనఁగాఁ గర్ణున

కహర్పతి మఱియు నిట్లనియె. భక్తా! కవచకుండలముల నవశ్యం బిత్తు
వేని నీకు వేఱొకయుపాయంబు సెప్పెద. దానినైనం జేయుము. ఇంద్రు
నియొద్ద నమోఘంబైన శక్తి యొక్కటి యున్నది. అది సర్వశత్రువినా
శకంబు. దాని నింద్రుండు యుద్ధములలో నెన్నిమాఱులు ప్రయోగించి
నను నమ్మహాసాధనంబు వానిశత్రువులం దునుమాడి మఱల వానియొద్దకు
వచ్చుచుండు. దానిం గైకొని నీసహజకవచకుండలముల నిమ్ము. మఘ
వుండు నిన్నర్జునునిచే వధింప నీయుపాయంబున నచ్చుం గాని వేఱొక్క
యును లేదు. ఇంద్రునియొద్దనుండి శక్తిని గ్రహింపుము. దానంజేసి నీశత్రు
వగు నర్జునునిం గెలుతువు. కావున వినయముతో నాతనిని మంచిమాట
లచే వేడి యాశక్తిం గొనుము. అని యాదిత్యుండు సెప్పి యదృశ్యుం
డయ్యె. అంత సూర్యోదయకాల మగుడుం గర్ణుండు నిదుర మేల్కాంచి
దంతధావనాదికాల్యకృత్యంబులం దీర్చి సూర్యు నారాధించి యుపస్థా
నము చేయఁగా నద్దేవునితోఁ దనస్వప్నవృత్తాంతంబు సంతయు నివేదింప
సూర్యమండలంబునందుండి యొక్క యెలుంగు స్వప్నవృత్తాంతంబంతయును
నిక్కంబని కర్ణుచెవులకు వినఁబడం జెప్పె. పిదపఁ గర్ణుం డింద్రునియొద్ద
నుండి శక్తిని గ్రహించు సంతోషముతో నింద్రురాక నెదురు చూచు
చుండె.

అనఁగా విని జనమేజయనరేంద్రుండు వైశంపాయనమునీంద్రున
కిట్లనియె. భానుఁడు కర్ణునకు బోధించునపుడు "నీసంగతియందు మాన
వుల కగోచరమైన గోప్య మొండు కలదు. ఆరహస్యము నీకు మఱియొక
కాలంబునఁ దాన తెలియు. దాని నిప్పుడేను వివరింపను" అని చెప్పె
నని యానతిచ్చితివి. ఆరహస్యం బెద్దియో? కర్ణున కాయమృతభవంబు
లగు కవచకుండలము లెట్లు లభించె? వివరింపవే యని యడుగ నమ్ముని
పతి యానృపతి కిట్లనియె.

తొల్లి మహాప్రభావసంపన్నుం డగు దుర్వాసుండు కుంతిభోజు
నొద్ద కేఁగి రాజవరా! నీయింటఁ గొంతకాల ముండఁ దలంచి వచ్చితి.
నీవు నీపరిజనులును నాయెడఁ గపటము లేక నాకు వరవుడంబులు
సేయవలయు. నేను నీయింట నుండుట నీ కభిమతంబే? నీయింట నున్న
ప్పుడు యథేష్టసంచారినై యుండుదు. నాకుఁ బడక యమర్చుటయం
దును గూర్చుండఁ బీఠాదులను వేయుట మున్నగు పరిచర్యలవిష

యమునందు లోపము కలుగనీయక మెలంగుదువే? అని యడుగఁ గుంతిభోజుండు 'ఋషివర్యా! నీయాజ్ఞ ననుసరించి నడిచెద. నాకుమార్తె పృథ యనుదానిని శీలవృత్తములయందును నాచారమునందును నిష్ఠమెయి వర్తించుదానిని నీసేవ లొనర్చుటకు నియమించెద. దాని శీలాదిసద్గుణంబులు పరీక్షించినచో నీవే సంతసింతువు. అని చెప్పి తన కూఁతు రావించి యమ్మునిసపర్యలయందు దానినియమించె. అప్పుడా కూఁతుతోఁ దండ్రి యిట్లనియె అమ్మా! దుర్వాసుం డనుమునివర్యుండు మనయింటఁ గొన్నినాళ్లుండఁగోరంగా నల్లె యని యొడంబడితి. ఆతనికి మెప్పు పుట్టించునట్లు సేవించుటకు నిన్ను నియమించెద నంటి. ఆతని కానందము కలుగునట్లు పరిచర్యలు సేయుము. నామాటఁ బొల్లుగా కుండఁజేయుము. విప్రు లధిక తేజోవిలాసులు. వారిప్రభావంబుఁ గొంత వినుము. వారిప్రభావమునే పరమతేజ మందురు. వారిదే పరమతపము. బ్రాహ్మణులకు నమస్కారంబులు చేయుటచే నాదిత్యుం డాకసంబున వెలుఁగుచున్నవాఁడు. విప్రుని నవమానించి వాతాపితాలజంఘప్రభృతులు నెడిరి. అందును దుర్వాసుం డసాధ్యుండు. మహాతపస్సంపన్నుండు. ఎల్లప్పుడు వేదాధ్యయనసంపన్నుఁడు. ఆమహనీయుండు ని న్నేది గోరినను వడవుసేయక యేమఱక భయభక్తులతోఁ దెచ్చి యిచ్చునది. బాల్యమునుండి నీకు విప్రులయెడను నాచార్యులవిషయమునను దేవతలయందును గాఢంబగు భక్తియుఁ జుట్టాలయెడ నాదరబుద్ధియు సేవకులయందు ననుగ్రహంబును మిత్రులయెడ ననురాగంబును దీర్ఘాలోచనంబును గలిగియున్నదానవని నే నెఱుంగుదు. నీవృత్తంబు నెఱింగినవారు నీవిషయమున సంతసింపనివారు ఈపురమునను నంతఃపురమునను లేరు. మఱియు నీవు వృష్ణివంశప్రసిద్ధుం డగు శూరునకుఁ బుట్టి మహామహుం డైన వసుదేవునకు సోదరి వని ప్రఖ్యాతిం గాంచి, యాశూరుండు మిగులఁ బ్రీతితో నాకు నిన్నుఁ గూఁతుంగా నొసంగ నొకకాలనిఁ బాసి పెంపకాలనిం జేసికమలముంబోలె నాయిల్లు చేరి పెరిగితివి. నీసద్వృత్తంబునను, గుణాచారంబునను నుభయకులములును వన్నె కెక్కినవి. దుష్కులమునందుఁ బుట్టినవారికి సద్బోధలు సేయవలసియుండును. కులీనులకవి బోధింపఁ బనిలేదు. నీవు సర్వగుణాఢ్యవు గాన దుర్వాసునిపరిచర్యకు నీకు నియమించితి. డంబము

నభిమానాహంకారములు వీడి మిక్కిలిభక్తితో నమ్మహనీయునిఁ గొలిచి యాతని కటాక్షంబున శ్రేయముఁ బొందుము. ఎంతమాత్ర మేమరి యుండక వేని మనవంశమును నగ్నిపాలు సేయు. ఇది యెప్పుడు మన స్సునం దుంచుకొను మని చెప్పఁ గుంతి యి ట్లనియె. నృపాలవర్యా! నీమాటచొప్పున నాఋషిసత్తమునకు భక్తిమెయిఁ బరిచర్యలు సేసెద. నాకు బ్రాహ్మణారాధన మనినఁ గడుఁ బ్రియంబు. మఱియు నీమహాత్మునిఁబూజించుట నీకు బ్రియంబును నాకు శ్రేయస్సాధనంబు నగు నేనిఁ దప్పక నీయాజ్ఞ నొనర్చెద. ఇది నిక్కము. మీఁదుమిక్కిలి దీని నాకింత చెప్పనేల? విప్రులం బూజించుచు నీయానతిమెయి వర్తించుచుంట నాకుఁ బరమలాభంబు. ఆమునివర్యుండు దివారాత్రములం దెవ్వేళ నేతెంచినను నాతనిమనంబున కానందంబును మెప్పును గలుగు నట్లు పరిచర్యలు సేసెద. నీగృహంబున నాబ్రాహ్మణశ్రేష్ఠున కేకొఱంత లేకుండునట్లు నడిచికొందు. ఈవిషయమున నన్ను నమ్మి నీవు రాజ కార్యములయందుఁ బరాకు లేక వర్తింపుము. లెస్సఁగా బ్రాహ్మణులు పూజింపఁబడి రేని వారు నిరాతంకముగఁ దరింపఁ జేయుదురు. వారికిఁ గీ డొనర్చినచో నశింపఁజేయుదురు. ఇవి యెల్ల నే నెఱుంగుదు. సుకన్యానిమిత్తమునఁ జ్యవనుం డలిగినాఁ డనుట మనము వినియున్నారము గాదే? కావున భయభక్తులతోను, వినయసంభ్రమములతోను నాఋషీశ్వరునకు సేవలొనరింతు నని చెప్పినం గుంతిభోజుండు కూఁతుభక్తి వినయములకు మెచ్చి కౌఁగిలించుకొని, పరిచర్యాక్రమమును గొంత బోధించి, యమ్మా! నీకును నీవంశమునకును మేలు గావింపుము. అని వక్కాణించి యక్కన్యం దోడ్కొని దుర్వాసు నొద్ద కేతెంచి యిట్లనియె. మునిచంద్రా! ఈకన్యక నాకూఁతురు. పసితనమునందుండి మిక్కిలి గారాబముతోఁ బెంచితి. సేవలొనర్చువిషయమున నేదేని లోపము గలిగినచో మన్నించి దీనిని చిత్తమునకుఁ దేవలయు మీరు మహనీయు లరుగావున బాలురయు వృద్ధులయుఁ దపస్వులయు నపరాధంబులు సైతురు గాదే? కావున లోపములు ప్రమాదంబునఁ గలిగినను మన్నించి పూజలం గొనవలయు ననఁగా దుర్వాసుం డందుల కియ్యకొని పరమానందంబునఁ గుంతి పరిచర్యలనొనర్ప వానిని ముదంబున గొనుచుండె.

## కుంతి దుర్వాసునకుఁ బరిచర్య సేయుట

అప్పుడు కుంతి యమ్మహానీయుని కొక్కచంద్రకాంతశిలలచే నొప్పారుదివ్యసౌధంబున విడిది యేర్పఱచి యందు దత్తనియాహ్నికంబుల దీర్పఁ దగురీతిని స్థలంబుల సమర్చి తాను మిక్కిలిశౌచముతో డంబము నహంకారమును నభిమానమును వీడి భక్తియుక్తయై యాతనికి దేవతలకుంబోలె సేవలొనర్చుచుండె. దుర్వాసుం డొకనాఁడు బరీక్షింపఁ గోరి యుదయమున నే వత్తు నని సాయంసమయమున కేతెంచు. సాయంసమయమునకు వత్తు నని యర్ధరాత్రంబునఁ బొడసూపు. కొండొకవేళ యేమియుం జెప్పక పోయి నాలుగేయి యేతెంచి తన కప్పుడు దివ్యాన్నం బొసంగ వలయు ననును. మఱియొక్కొకదినము సంధ్యావేళలయందు భుజింప నన్నమిడు మనును. ఎప్పుడేమి చెప్పినను బృథ యొకనాఁటిపరిచర్యకంటె వేఱొకనాఁడు మఱింత వినయభక్తులం జూపుచు మునిచిత్తమున మెప్పు పెంపుఁజేయుచు నొక్కొకతఱి శిష్యురాలింబోలెను వేఱొక్కసమయమున ననుంగుకూఁతుచందమున నింకొకవేళఁ బ్రియసఖిపరిపాటియు సమస్తవిధముల సపర్య లొనర్చుచుండె. కుంతిభోజుం డనుదినంబును బ్రాతస్సాయంకాలములయందుఁ గూఁతుం జూచుచుఁ బరిచర్యలయందు నేమఱుపాటు లేమి నడిగి తెలిసికొనుచుండె. ఇట్లు పృథ తనకు నియమించినకార్యమును మిక్కిలి శ్రద్ధాభక్తులతోఁ జేయుచు నాతండ్రిని, ఋషివర్యుని నానందింపఁ జేసెను.

అంత దుర్వాసుం డొక్కవత్సరము కుంతిపరిచర్యలుగాంచి దాని యందుఁ బ్రీతుండై యా రాజపుత్త్రిం బిలిచి యిట్లనియె. కల్యాణీ! నీసపర్యలకు నే నెంతయును బ్రీతిఁ జెందితి. అమానుషంబు లైన వరముల నొసంగెద. కోరికొనుము. నామహిమవలన నీవు సమస్తకాంతలలో నుత్తమురాలవుగ గణింపఁ దగుదువు. అని చెప్పఁగాఁ బృథ యమ్మునికి మ్రొక్కి ఋషివర్యా! నాసేవలచే నీవు సంతసించితి వని చెప్పుటయే చాలును. నీవు నాయెడఁ బ్రసన్నుండవై తేని నాతండ్రి నా యెడఁ బ్రీతుండగు. అదియ నాయభిలషితంబు. ఇంతకన్న వేఱు వరంబును నే వేఁడ. అని చెప్పఁగా దుర్వాసుండు దేవీ! నీ వడుగకున్నను నీయెడ నేను సుప్రీతుండనైతి. ఒక్కమంత్రరాజ ముపదేశించెద.

గ్రహింపుము. ఈమంత్రప్రభావమును జెప్పెద వినుము. నీ వేదేవతనైనను మనంబునం బ్రార్థించి యీమంత్రరాజమును బఠించుచో నాదేవుండు నీయొద్ద కేతెంచి సేవకుండువలె నీయెదుట నిలిచి తాను నిన్నుం గామించినను గామింపకున్నను నీకు సత్పుత్త్రుఁడు గలుగునట్లు గర్భము ననుగ్రహించును. అని చెప్పంగా నామంత్రము విననని వల దనినచో మునివరుండు శపించు నని భీతిల్లి యేమియుం బలుక నేరక యంగీకరింపంగా నమ్మునివరుం డథర్వశిరోవిఖ్యాతంబైన యామహామంత్రమును బృథకు విధ్యుక్తముగా నుపదేశించెను. అంత నమ్మునివరుండు కుంతిభోజుపాలి కరిగి యిట్లనియె. రాజేంద్రా! మీయింట నిన్నినాళ్లుపచారములను నీకూతు రేకొఱంత లేక చేయుచుండ సుఖముంటిని. ఇకం బోయి వత్తు నని చెప్పి యదృశ్యుం డయ్యె. అట్లా ముని చెప్పి యదృశ్యుండగుటకుం గుంతిభోజుండు విస్మయం బంది యానందపరవశుండై సుతావృత్తంబు నభినందించె.

కుంతి సూర్యునివలన గర్భముం దాల్చి గర్ణుం గనుట

ఒక్కనాఁడు కుంతి ఋతుస్నాతయై తనయంతఃపురహర్మ్యంబు మీఁదఁ గురు లార్చుకొని యిట్లని యాలోచించె. దుర్వాసమునీంద్రుండు నాసపర్యలకు మెచ్చి నా కానాఁడు మంత్ర ముపదేశించెను. దీనిచంద మెట్టిదో చూతును గాక యని యాసుదతీరత్న ముదయ కాలమునఁ బర్వశైలసానువులపై శోభిల్లు తిగ్మాంశుఁ జూచునిమిత్తము పంకజము వోలె వికసించి సహజకుండల కవచములతో వెలయుచుండు నద్దివ్యమూర్తివిధంబున కోటునడి దేవా! భవత్సముండగు నందనుం గరుణింపవే యని మనంబునం గోరుచు మంత్రోచ్చారణంబు సేసినఁ బ్రభాకరుండును నిజయోగబలంబున రూపాంతరంబు దాల్చి కుంతిపాలికిం జనుదెంచి మనోహరం బగు స్వరంబున నిట్లనియె. రాజపుత్త్రీ! మంత్రము నుచ్చరించి నీవు నన్నాహ్వానించుటం జేసి కవచకుండలాదివిభూషితుండనై నిజప్రభలతో దెసల నెల్ల వెలింగించుచు నీయొద్ద కేతెంచితి. నీకు వశ్యుండ నైతి. ఏమి సేయవలయును? నీమనంబున నుండుభావ మెద్ది? నిజంబు చెప్పుము. అనంగా భాస్కరునకుం గుంతి యిట్లనె. దేవా! తొల్లి దుర్వాసముని నాకొసంగినమంత్రమును బరీక్షించునిమిత్త మిట్లొనర్చితి. ఏవిధ మగుకార్యమును

లేదు. ఇంతమాత్రమునకుఁ జేసి నీకు నిచ్చోటికి రా నేల? ప్రసన్నుఁడవై వచ్చినట్లు విచ్చేయుము. అనఁగా దానికిఁ దపనుం డిట్లనియె. కామినీ! క్రమ్మఱిపోక తప్పునా? నీమనస్సునందు మంత్రోచ్చారణకుఁ బూర్వమే మని కోరితివి? ఆకోరికను దప్పక యిప్పుడు చెప్పరాదే? తేజోవీర్యంబుల నత్యున్నతుఁడు గవచస్ఫుటకుండలమండితాంగుఁడును సత్త్వసంపన్నుఁడును నగు పుత్త్రుని నావలన నీవు గోరవా? నిజంబుగఁ బల్కుము. నీసంకల్పము నెఱవేఱఁగలదు. నాతో సంగమింపుము. నామాట విని నాకుఁ బ్రియంబొనర్పవేని నన్ను శపించుటగాక నీకుఁ గా నీసంపర్కము లేమింగాని నీజననీజనకులను దగుపాత్రము నెఱుంగక నీమంత్రరాజమును నీ కుపదేశించిన యమ్మునిని సైతము శపించి మిత్తుఁ [illegible]. నీవు పిలువఁగ మోసపోయివచ్చిన నన్నుం జూచి యింద్రాదిదేవతలు నీకతంబునఁ జిక్కువడి యుండిన నన్ను నవ్వుచున్నవారు. నీవు జూడుము నన్ను మాత్రము వీక్షించుటకుఁ గొంత దివ్యదృష్టి యిచ్చియుంటిని. ఇప్పుడు వారిం జూచుటకు మఱియుఁ గొంత దివ్యదృష్టి నొసంగెద. చూడుము అనఁగా నాకుంతి వారిం జూచి కుంతిభోజరాజనందన దేవతలను నత్యంతలజ్జావివశయై దినేశ్వరున కిట్లనియె. అహస్కరా! బాల్యదోషంబున నేను దప్పు గావించితి. నన్ను మన్నింపుము. నిజనిధానము నెక్క నీస్థలంబునను మఱిపొస్తు నను నిచ్చుటకుఁ గర్తలు నాజననీజనకులు. వారిం గాదని నీతో నే నెట్లు సంగమింతు? వనితాధర్మము మీఱం దగునా? దాన వంశహాని గాదే? మంత్రబల మెఱుంగునిమిత్తము నిన్ను మదిఁగోరి తప్పు సేసితి. మహాత్మా! దీని నిరాకరణాగాఁ గొనక నాబాల్యచేష్టను గణించి సైరింపుము. నీ వెఱుంగని ధర్మంబులు గలవే? యని సవినయముగ విన్నవింపఁ బ్రభాకరుండు వెండియు నిట్లనియె. నీవు చిన్నదాన వనియే యింతవనుక నిన్నే మనుచు నసనున్నవాఁడ. దివ్యపురుషులయెడ మాయాప్రవర్తనంబు సెల్లదు మఱియు నేను నీతో సంగమింపక మఱలుదు నేని వియత్పథంబున విమానములు నాకై యుండు మహేంద్రాదినిర్జరులు నన్నెగతాళి సేయుదురు. కాఁబట్టి మాఱుసెప్పక సంగమమునకుఁ గోడంబడుము. దివ్యతేజోవిలసితుం డగుపుత్త్రుం బడయుము. అనిచెప్పనం

గుంతియు నెన్నియే నుపాయముల నా దేవుఁ బోలంగఁ బన్నియును నతని
వారింప నేరక కొంతవడి యాలోచించి నానిమిత్తమున నిరపరాధు
లగు జననీజనకులును మహర్షి యగుదు ర్వాసుండును నీమహానీయుని
వలన శాపదగ్ధులు గానేల? నాయొనర్చినది యనుభవింపక తీర దని
నిశ్చయించి మఱియు నిట్లు మదిం దలపోసె. తల్లిదండ్రులు తగినవరున
కీయకుండఁగా నే నిప్పుడీకార్యమున కియ్యకొనుట యెట్లు సాహసింతు?
స్వాతంత్ర్యమును బొంది నే నొనర్పం గూడని యీయాత్మప్రదానం
బెట్లు సేయుదు? నని యేమిటికిం దెంపు చెప్పలేక యుత్తాలుంగుమనం
బున లజ్జామోహభయములు పెనఁగొన వేయికిరణంబులవాని కిట్లనియెను.
వివస్వంతుఁడా! నీయిచ్చమెయి నడువ నిశ్చయించియున్నదాన. అయి
నను నామనవి నాలకింపుము. జననీజనకులు తగినవరునకుఁ గన్యాదా
నంబు సేయకుండఁగాఁ గన్యకలు తమంతటఁ దామె శాస్త్రోల్లంఘనము
గావించి పురుషులతో సంగమించి గర్భాధానంబు నొందుట దోష
మని విందు. నీతో సంగమించిననాకుఁ గన్యాత్వము దూషితం బగు.
నానిమిత్తమున నావంశ మంతయు నపకీర్తిపా లగును. ఇట్లొనర్ప నధ
ర్మంబు గాకుండుటయు, ధర్మలోపము వాటిల్లకయు నుండు నేని నీ యిష్ట
మును చేకూర్తు. నాకుఁ గన్యాత్వము దూషితంబగుటయు, ధర్మలోపం
బును గాకుండ ననుగ్రహింపుము. శరీరధారులయొక్క యాయుస్సు,
ధర్మాచరణము, కీర్తియనునవి యెల్ల నీయెడల సుప్రతిష్ఠితము లని పెద్దలు
సెప్పుదురు. అని చెప్పఁగా విని కర్మసాక్షి యద్దేవి కిట్లనియె. భామినీ,
కన్యాశబ్దమునకు నర్థము సర్వకామములను గామించుట యని తెలి
యుము. కావున నన్నింటిని గోరుటకు నీవే స్వతంత్రురాలవు. శుభాంగీ,
పెద్దలయనుజ్ఞ యనావశ్యకంబు. దీన ధర్మలోపంబు లేదు. మఱియు
నన్నుఁ బొందిననీకుఁ గన్యాత్వము దూషితంబు గాకుండునట్లును, ధర్మలో
పంబు కలుగకుండునట్లును, వరంబుల నిచ్చితి! నావలన సత్పుత్త్రుం బడ
యుము. వాఁడు మహావీర్యుం డగును. అనఁగాఁ గుంతియు వానివచనం
బుల కొడంబడి యిట్లనియె. తమోహారీ! నీసంగమమువలన నాకు సహజ
కవచకుండలమండితుండైనవాఁడును దేజోవంతుండును నగు సత్పుత్త్రు
నొసంగుము. అని యడుగ దివాకరుం డిట్లనియె! మదిరాక్షీ! అమ్మాత

సంభవములగు కుండలములఁ బూర్వ మదితి నా కొసంగె. వానిని నద్భుతంబగు కవచమును నాసంగమంబున నీకుఁ గల్గుపుత్త్రున కొసంగెద. అని వచించి యాముద్దరాలి నొడంబఱచి తనయోగమహిమంబున నా రాజనందనతో సంగమించి గర్భాధానముం జేయఁగా నాసుదతి యామహనీయునిదివ్య తేజోవిహ్వలయై పాన్పుపైఁ గొంత పరుండి యుండి పిదప లేచుటయు వివస్వంతుఁ డాయమ కిట్లనియె. శోభనాంగీ! అమృతమయములగుదివ్యకవచకుండలములతో మహాబాహువీర్యుండై నీగర్భంబున సత్పుత్త్రుండు జనించువాఁడు. నావరమహత్త్వంబునం జేసి నీకన్యాత్వంబు చెడదు. ఇఁక నాకు సెల విమ్మనఁగా నామత్తకాశిని లలితలజ్జావిలాసములు ముఖంబునం దోఁప నట్ల యనుటయు సప్తాశ్వుండు నిజమార్గముం బట్టె.

అంతఁ గుంతి సూర్యసమాగంబునం జేసి గర్భంబుఁ దాల్పఁగాఁ గర్భస్థశిశువు శుక్లపక్షచంద్రునిమాడ్కిఁ బెంపొందుచుండెను. ఈవృత్తాంతంబు నంతయు నంతఃపురంబునఁ గుంతిదాదిమాఁతురు దప్ప నన్యు లెవ్వ రెఱుంగరు. ఇట్లు గోప్యమును సురక్షితంబుగా నుంచి నవమాసపూర్తి గాఁగా సహజకవచ కుండలాలంకృతుండును, వికచ కమలనేత్రుండును, దీర్ఘబాహుండును, వృషస్కంధుండును, దృఢగాత్రుండును, దివ్యతేజోవిరాజితుండును, దేవసమానుండును, బాల సూర్యసదృశుండును నగు పుత్త్రుఁ గనియె. ఇట్లు కన్యయర్భకుం జూచి కుంతి లోకాపవాదంబునకు వెఱచి దాదిమాఁతుతోఁ గొండొక వడి యాలోచించి యొకగట్టిమంజూషం దెప్పించి యందుఁ బొత్తి గుడ్డల మెత్తగాఁ బఱచి యాపురుటిబిడ్డ నందుంచి సఖియును దానును నర్ధరాత్రంబునఁ గొనిచని పురపరిసరంబునంపలి యశ్వనదియం దునిచి, కన్యకాదశయందే చూలాలైనందుల కియ్యది ఫలం బని వగచుచుఁ గంట నీరు కాఱ్పుచుఁ బుత్త్రస్నేహంబున నిట్లు విలపించెను.

### కుంతి పుత్త్రుని నదీప్రవాహంబున విడిచి విలపించుట

కొడుకా! ఏ నిన్నుఁ గనునంతటిమాత్రమునకై కొఱనోము నోఁచితిం గాని నిన్నుఁ బెంచి నీబాల్యచేష్టల నల్లారుముద్దుగాఁ జూచు భాగ్యము నాకు లేదయ్యె. పున్నమచంద్రునివంటి నీనిండుమోము నందుఁ జిఱునవ్వొలయుచుండ, నానాఁటి నీచెలువముఁ జూచి నిను

నక్కునం జేర్చి ముద్దాడు పుణ్యము నే నోచనైతి. ఓనాచిన్నికుఱ్ఱా! ఈతీరున నాపాపిదైవము నిన్ను వఱద వదలఁగ జేసెనే. అక్కటా! నే నెందుఁ జొత్తు? ఏపుణ్యవతి నిన్ను సంకఁ బెట్టికొని సుతుఁగా భావింప నున్నదియో! ఎక్కడఁ జేరెదవో యే నెఱుంగ. ఏసౌభాగ్యవతి నిన్నుఁ గొడుకునుగాఁ గాంచుటకు మేలైన కలను గాంచునో! నీయొంటిమన్ను దుడిచి నీయవ్యక్తమధురాలాపములను వీను లార వినఁగల సుదతియెవ్వతెయో? ఏభాగ్యవతి స్తన్యముఁగుడిచి యాఁకలిఁ దీర్చికొందువో! నిండునోమునోచినయేపుణ్యాత్మురాలు హిమవత్పర్వత గుహాలయందుఁబుట్టి యథేచ్ఛమై చరించుసింహముపోలె యౌవనము ను దాల్చి పరాక్రమవంతుండ వైయుండు నిన్నుఁ గన్నులారం జూచి యానందించునో! నే నెఱుంగ నేరను. కాని యిట్టిదివ్యతేజుని, సహజకవచ కుండలునిఁ,గమలపత్రాక్షునిఁ, బద్మోదరసంకాశుని,నెఱికురులవానిని, సుల లాటునిఁ, బుత్త్రుంగాఁ దలంచు భాగ్యంబు నా కబ్బదగున్నె. దయ మాలి నిన్నీప్రవాహంబున విడిచిపుచ్చవలసె. ఏటిప్రవాహంబునఁ గొట్టికొని పోవుచుండు నిన్ను దివ్యదృష్టితోఁ జూచుచుండు నీతండ్రి ధన్యుఁడు. అంతరిక్షమునను, నుదకంబులను సంచరించు భూతములు నీకు శుభ ముల నిచ్చుఁగాక! నీటఁ దేలిపోవుచుండు నిన్ను జలదేవత యగు వరుణుండు ప్రోచుఁగాక. అంతరిక్షచరుండైన వాయువు నిన్ను రక్షిం చుఁగాక. నీతండ్రియగుతపనుఁడు నిన్ను నెండకుఁ దపింపనీయక కాపా డుఁగాక. ద్వాదశాదిత్యులును, నష్టవసువులును, నేకాదశరుద్రులును, సాధ్యులును, విశ్వేదేవతలును, వాయువును, మహేంద్రుండును, దిశ లును, దిక్పతులును, సర్వదేవతలును నిన్ను విషమసమవేళలయం దుద్ధరిం తురుగాక. నీవు విదేశముల నున్నను నీకవచకుండలముల నానవాలుఁ గొని నే నెఱుంగుదు. నీవారులు నీకు శుభముల నొసంగు. శత్రువులు నిన్నుఁ జేరకుండుదురు. చేరినను నీకు హానిఁ దలంపకుండుదురు గాక. యని పలుతెఱంగుల విలపించి పుత్త్రస్నేహంబునఁ బెట్టెను విడువనోపక యతిదీనముగ విలపించుచుఁ దండ్రి నిదురమేల్కని తన్ను విచా రించునో యని భీతిల్లి యయ్యర్ధరాత్రంబున శిశువుతో నుండు మంజూ షను నశ్వనదియందు విడిచి దాదితోడ నగరు సేరి యెప్పటియట్ల నుండె. అటు నాపెట్టెయు నశ్వనదీప్రవాహంబునఁ జర్మణ్వతీనదిం జొచ్చి

దానినుండియమునాగతంబై యటనుండి భాగీరథిం బడి సూతవిషయ మునందుఁ జంపానగరసమీపమున నదీతరంగమాలిక లిట్టట్టు గదల్ప నరుగుచుండె.

### కర్ణుండు సూతకులముఁ జేరుట

ఆసమయమునందు ధృతరాష్ట్రునకు నెచ్చెలియగు నతిరథుఁ డను సూతుఁడు వనితతో గంగయందు జలకేళి సల్పుచుండి గంగాజలము లందలి పొడవులైనయలలయందు నూగులాడుచు వచ్చుచున్న మంజూషం గని తనసేవకులం బంచి, దానిని బట్టి తెప్పించి, యెవరికిం దెలియనీయక యేకాంతమునం దాపెట్టెను దెఱచిచూచె. అందు బాల సూర్యునిపోలిక విరాజిల్లువాఁడును, సహజకవచకుండలమండితుం డును, దివ్యసుందరముఖారవిందుండును నగు నొక్కశిశువుం గని, యద్భుతం బంది, యాశిశువు నెత్తి, తనయంకతలంబునందిడికొని, బిడ్డలు లేక బహుకాలమునుండి నవయుచుండువాఁడు గావున తన భార్య రాధ యనుదానిం బిలిచి ముదంబున నిట్లనియె. వనజాక్షీ! ఈ పెట్టెయం దీయద్భుతశిశు గంటివే? బిడ్డలు లేనివారమగు మనకు దైవ మీదివ్యసంభవుఁ డగు కుమారరత్నము నొసంగె నని యాశిశువును రాధచేతి కందియ్యఁగా నాయబల యప్పుడ వాని నురమున నదిమికొనెను. వెంటనే యవ్వనితకు బాలెంతకుంబోలె జన్నులు సేఁపె. అంత రాధయుఁ బ్రియుననుమతి నాశిశువుం దన పుత్త్రుఁగా నెన్ని వానిని బుత్త్రవాత్సల్యంబునఁ బెంచుచుండె. కుంతీ దేవియు నావృత్తాంతం బంతయు గూఢచారులవలన విని మనంబున నెమ్మదితో నుండె. ఈతీరున రాధయు నతిరథుండును బ్రమోదసంపద నొంపారం గుమారుం గొని నిజగృహంబునకుఁ జని తమకులోచితంబు లగుజాతకర్మాదిసంస్కారంబు లొనర్చి కనకకవచధరుండై వెలయుచుం డునా శిశువునకుఁ గర్ణుండనియు, వసుషేణుండనియు నామకరణం బొనర్చిరి. ఈతీరున సూర్యసూనుండు సూతసూనుండై యొప్పారె. అంత నయ్యతి రథునకు రాధయం దౌరసు లగు పుత్త్రు లనేకులు పుట్టిరి. ఆవసుషేణుఁ డును దినదినప్రవర్ధమానుండై యుండఁగా నయ్యతిరథుఁ డాపుత్త్రుని హాస్తినపురమునకుఁ దోడ్కొనిచని వానిని ద్రోణునకు శిష్యుంగా నొప్ప గించె. అంతనాబాలుండు ద్రోణునియొద్దను గృపాచార్యునికడను, గడపటఁ

బరశురామునియొద్దను ననేకదివ్యాస్త్రప్రయోగోపసంహారముల నేర్చి
దుర్యోధనుని సఖుండై పాండవులకుఁ గీడు దలంచుచు ననేక దినంబు
లుగ నర్జునునితో మాత్సర్యముం గలిగియుండె. కవ్వడియుం గర్ణుం
జూచిననాఁటంగోలె నతనిపై స్పర్థ వెంచుచుండె. ఇదియే కర్ణునిపుట్టుక
వృత్తాంతము-ఇది దేవరహస్యము. కర్ణుండును ననుదినంబును మధ్యాహ్న
కాలంబున సూర్యోపాసనఁ గావించుచుండు. ఆకాలమునందు బ్రాహ్మణు
లెవ్వ రేని దేనిం గోరినను దాని నొసంగుచు నది యొక వ్రతముగా నాచ
రించుచుండె. అతనియస్త్రవిద్యయందలి నేర్పును, సహజకవచకుండల
ధారిత్వమును ధర్మసూనుం డాత్మలోఁ దలఁచి మిక్కిలి భీతిల్లి
యాతం డభేద్యబలుం డని యెడతెగక యధైర్యపడుచు మనో
వ్యథతో నరణ్యావాసముం జేయుచుండ నయ్యుధిష్ఠిరునకుఁ బ్రియం
బాచరింపం గోరి కర్ణుని కవచకుండలంబులు గొనునిమిత్తము పురందరుం
డొక్కనాఁడు విప్రవేషంబుఁ దాల్చి కర్ణుండు సూర్యోపాసనఁ జేయు
మధ్యాహ్నసమయమునకు బ్రాహ్మణులకుఁ గోరినదానినొసంగుతఱిం గని
'భిక్షాం దేహి' యనెను. అంతఁ గర్ణుం డాదివ్యభిక్షుకుని నిజశాత్రవ్యం
బెఱుంగక స్వాగతం బడిగి పూజించి యిట్లనియె.

ఇంద్రుండు కర్ణునికవచకుండలంబులం గొనుట

విప్రోత్తమా! నీ వేమి కోరెదవు? విలాసవతులును, సుందరా
కారులును నగువనితాజనంబు నొండె, ముక్కాఱు పంటపండఁగల
భూములుగల గ్రామముల నొండె, రత్నశృంగములును, గనకఖురం
బులుం గలగోవుల నొండె వలసినవి గోరుకొనుము. ఇచ్చెద ననఁగా
నాకుమహాభూసురుం డా నెఱదాత కిట్లనియె. ఓవదాన్యా, నేను వాని
లో నెద్దానిని గోరివచ్చినవాఁడను గాను. నీవు సత్యవ్రతుఁడవైతివేని
నాయెడం గరుణించి నీసహజకవచకుండలములను గత్తిరించి దానం
బొసంగుము. వాని నిచ్చినఁ గొనియెద. ఇదియె నాయభీష్టంబు. అనఁగా
నతనికిఁ గర్ణుం డిట్లనియె. విప్రోత్తమా! వినుము. ఈనాకవచకుండ
లము లమృతసంభవములు. అవి యుండుటం జేసి నేను నాశత్రువుల కవ
ధ్యుఁడను. వాని నొరుల కొసంగితినేని నాశత్రువులు నన్ను వధింతురు.
కావున లాఁతిదాని నెద్దియేనియుం గోరుము. ఒసంగెద. అని బహుప్రకా
రంబుల వేఁడికొనుచు మిక్కిలి వినయము గదురఁ బ్రార్థించుచుండ

నావిప్రుం డదియే తనకుం బరమలాభం బని నుడువుచుం దనపట్టును వీడక వానినే యిమ్మనుటయు సూతసూనుండు నవ్వుచు నాకపటంపు విప్రున కిట్లనియె. అవి యుండుకతమున నాశత్రువులు న న్నోర్వలేరు. నారాజ్య మెల్ల నిచ్చెద. గ్రహించి ముదం బలర విచ్చేయుము. కవచకుండలములఁ గోరి యాచింపకుము. అనఁగా నావిప్రుండు కర్ణునితో వెండియు నిట్లనియె. సత్యపరిపాలనాసక్తి గలదేని నాకోరినవాని నొసంగుము. అని నిష్ఠురములాడఁ గర్ణుండు వానినింద్రుంగాఁ దలఁచి యిట్లనియె. మహాశయా! నీ కొండెట్టియు వలదనుచున్నావు నాదేహజనితంబయి సహజంబయిన కవచకుండలములనే కోరుచున్నావు కావున నీవు శక్రుండ వని యెఱింగితి. ముల్లోకంబుల కధినాథుండవై మహేంద్రుం డని పేర్కొనంబడుచు, సకలభూతములకు సర్వాభీష్టంబుల సమకూర్ప శక్తి గల నీవు మావంటివారలకోర్కు లొసంగుటకుఁ దగినవాఁడవు. ఈశ్వరుండవు. కావున నట్టినీవు మానవులను మమ్ము యాచింపఁ దగునే? నేను నాకవచకుండలముల నొసఁగితినేని నాశత్రువులచే నేఁ బరాజితుఁడను, వధ్యుఁడను, బరిహాసాస్పదుఁడనగుదు. నా దేహము వ్రణితమై విరూపముం బొందు. కావున నా కొక్కవరం బొసఁగి నాకవచకుండలముల గ్రహింపుము. అనఁగా నాశునాసీరుండు సూతసూనున కిట్లనియె. రాజపుత్రా, నారాక నింతకు మున్న సూర్యుండు నీకుఁ దెలిపియుండె. దాని నే నెఱుంగుదు. నావజ్రాయుధము దక్క నాదివ్యాయుధములలో నీవు దేనిం గోరినను దడయక యిత్తు. అనఁగా గర్ణుం డానముచిసూదనున కిట్లనియె. మహేంద్రా! శత్రుసేన నమోఘంబుగఁ జెండాడు నీశక్తి నొసంగవే? యని యడుగ నాఖండలుం డొక్కముహూర్తమాత్ర మాలోచించి, కర్ణా! నీకోరినట్లు నాదివ్యశక్తిని నీ కొసంగుదు. కాని, యొక్క నియమమునకు నీవు లోఁబడవలయును. అయ్యమోఘమగుశక్తి నాశత్రువులను జంపిచంపి మఱలి నాచేతికి వచ్చుచుండు నీ కిచ్చు టట్టు గానేరదు. దుర్జయుఁ డగునీశత్రువు నొక్కనిని మాత్ర మయ్యది దెగటార్ప ననుగ్రహింతు. పిదప నది నన్నుం జేరఁగాక. దీని నీసమయముచేఁ బరిగ్రహింపుము. అనఁగా వాసవుఁ గర్ణుం డిట్లనియె. అయ్యా! నాకుం గల పగతుం డొక్కరుండ. వానిం జంపుటయే నాయభీష్టం బనెను. అంతఁ బాకశా

సనుండు నవ్వుమొగంబుతోఁ గర్ణున కిట్లనియె. నీయభీష్టం బే నెఱుంగుదు. తేజోవంతుండు సుగ్రశౌర్యుండునునగుపార్థుని దీనం గెలువఁదలంతువు. అట్లు నీ వానర్పలేవు. వానిని రక్షించువాఁడు పరమకృపాళుండును, జగత్త్రయపాలకుండును, నవ్యయుండును నగు జగన్నాథుండుండ వాఁడు నీకు సాధ్యుఁ డగునే? కావున నెయ్యది యెత్తినను నితరాస్త్రముల కార్యముదీఱక ప్రాణాపాయదశరాఁగా నాశక్తిని నీవు ప్రయోగించునది. దానిఁ బ్రమాదమున నల్పులపైఁ బ్రయోగించినను, నవసరము లేక వినియోగించినను నామహనీయసాధనంబు నిన్న వధియించు. అని చెప్పి శక్తిని నిచ్చి కవచకుండలముల నిమ్మనెను. అప్పుడు కర్ణుఁడు మహేంద్రున కిట్లనియె. సహస్రాక్షా! కవచకుండలములు నా దేహాసంభవంబులు. వానిం గోసియిచ్చినచో నాశరీరమునకు వైరూప్యము గలుగకుండ వరము నిమ్మనఁగాఁ, బురుహూతుండు సత్యప్రతిజ్ఞున కిట్లనియె. సూతసుతా! కవచకుండలములకర్తనంబున నీకు వికృతశరీరము గాని, వ్రణము గాని గలుగకుండఁగను, దేహకాంతియెప్పటియట్లుగఁ దలుగకుండఁగను సత్యవచసుండవై ననీకు వరములుగా నొసంగితి. నాచెప్పిన నియమముచొప్పున శక్తిని గ్రహింపు మనఁగా రాధేయుండు సంకేతమున నయ్యమోఘశక్తి మహేంద్రువలనం గొని యామహనీయునకుఁ గవచకుండలముల నీయ నుద్యమించి ముఖవికారము లెవ్వియుం దోఁపక సర్వావయవములంగోసి కవచాదులనొలుచుచుండ నామహాత్ముని స్థిరవచనంబుల కలరి దేవతలు దుందుభులను మ్రోయించిరి. కిన్నరయక్షసిద్ధసాధ్యులు దివినుండి తూర్యరవంబులఁ గావించిరి. అప్పుడు కర్ణునిపై దివినుండి పుష్పవృష్టిగురిసె. అవ్విధంబునఁ గర్ణుండు తన దేహమునం దుండి కవచకుండలముల నొలిచి యిచ్చి పరమానందంబున నింద్రునిఁ బ్రీతుంజేసి తనసత్యవ్రతమును బాలించెను. కవచకుండలములకర్తనంబున జేసి యానాఁటినుండి యామహనీయునకుఁ గర్ణుం డను పేరు విఖ్యాతిఁ గాంచె. ఇవ్విధంబునఁ బురందరుండు సూతసుతుని వంచించి వికృతగాత్రుం జేసి ప్రభాసితుండై వానిసత్కీర్తి నంతట నలుదెసల నిండింపఁజేసి నిజలోకంబున కరిగె. ఈవృత్తాంతంబు నంతయు విని కౌంతేయులు మిక్కిలి సంతసిల్లిరి. గాంధారేయులు చింతాక్రాంతులైరి. ఇట్లు పాకశాసనుఁడు చేసిన కర్ణ కవచకుండలాహరణంబు సవిస్తరంబుగా వైశంపా

యనుండు సెప్పఁగా జనమేజయుండు విని వెండియు నామునికి ట్లనియె.

మూపితామహా లట్లు సైంధవుని నిగ్రహించి ద్రౌపది మఱలఁ గొనితెచ్చి మార్కండేయువలన రామునిసచ్చరిత్రంబును సావిత్రిపాతి వ్రత్యమహిమంబును విని యమ్మునిఁ ననిచిపుచ్చి, కామ్యకవనమును నడలి ద్వైతవనముఁ బ్రవేశించి యందుఁ గాయకూరలను భక్షించుచు దుస్తర మగువనవ్వనవాసము నిస్తరించి పంద్రెండువర్షములసమాప్తియం దెట్లు వర్తించిరి యనిన నమ్మహీపతి కమ్మహీదేవుం డిట్లనియె.

అట్లు మార్కండేయునివలనఁ బుణ్యకథలు విని పాండవు లనంతరంబ ద్వైతవనముఁ బ్రవేశించి యందున్నయెడ నొక్కనాఁడు సుఖాసీనుండై యున్న ధర్మజుపాలికి నొకబ్రాహ్మణుండు తొట్రుపాటుతో నరుదెంచి, ధరణీశ్వరా! చెట్టుకొమ్మకుఁ దగిల్చిన నాయరణి నొకమృగంబు వచ్చి యత్తరువు నొరసికొనుచుండ దానికొమ్మునఁ దగులఁగా నమ్మృగము దానిఁ గొని పరుగెత్తుచున్నది. వేగంబ దానివెంటం బోయి నాయగ్నికార్యమునకుఁ గొఱఁతపడకుండ దానిని నాకుఁ దెచ్చి యిచ్చి పుణ్యమునఁ బొమ్మని మిక్కిలి దైన్యముతోఁ బ్రార్థించెను. ఆవిప్రుని దీనాలాపంబులను విని పశ్చాత్తప్తహృదయుం డై నధర్మజుండు తానును దనతమ్ములును దక్షణంబె విల్లెక్కుపెట్టి దాని వెంట నరిగి దానిపై నెన్నిబాణములు ప్రయోగించినను నొక్కబాణమైనను దానిం దాఁకదయ్యె. అదియును వారి నతిదూరంబుగ నెలయించుకొని యొక్క ఘోరకాంతారంబున నదృశ్యంబయ్యె. అపు డయ్యైవు రాయుద్యమంబు విఫలంబైన విషాదయుతులై ధుత్పిపాసాపరిశ్రాంతులై నడువనేరక చల్లనినీడ గల యొక్కచెట్టు క్రిందఁ గూర్చుండి యాలోచించుచుండిరి. అప్పుడు నకులుండు ధర్మపుత్త్రునితో నిట్లనియె. ఉన్నతకులశీలములును, నచంచలకృపానురక్తియు ధార్మికప్రవర్తనముం గల మన కిట్టికష్టములపైఁ గష్టములు వచ్చుచుండుట కేమికారణము? ధర్మనరా! కారణములెవ్వియో యని విషణ్ణుండై యడుగ నానుకుమారునకిఁ బ్రాజ్ఞుం డైనయన్న యిట్లనియె. వత్సా! వినుము. పూర్వజన్మకర్మంబె పురుషునియాపత్సంపదలకు మూలంబు. దాని ననుసరించి జీవులు సుఖదుఃఖముల ననుభవించుచుందురు. అని చెప్పుచుండఁగా వారికి భీమసేనుం డిట్లనియె. ఆనాఁడు ధార్తరాష్ట్రుల

యనుమతిం బ్రాతిగామి పోయి పాంచాలిం గొలువునకుం
దోడ్తేరంగా నప్పుడ యప్పాపాత్ముల నందఱిం దునుమకుంటచే మన
కిట్టిపాట్లనుభవింపవలసె. అనంగా వారికిఁ బార్థుం డిట్లనియె. ఆదుర్ద్యూ
తకాలంబున సూతసుతుండు మనల నాడినపరుసపుంబలుకులను వినియును
శాంతమనస్కుండనై యలుకం బూనక యిట్లు కాననమునకుం గాతర
జనులం బోలె నేతెంచుటచేతనే మన కిట్టి దురంతదుఃఖములు సంప్రా
ప్తించె ననెను. అనంతరంబ సహదేవుం డిట్లనియె. ఆదుర్మార్గుం డైన
కపటంపుజూదరి యగుశకునిని నాఁడాసభలోఁ దఱిమి చంపనిది
యే మన కీదుర్దశల కెల్లఁ గారణము. అని యిట్లందఱు నన్నితెఱంగులం
బలుకుచుండ నయ్యజాతశత్రుండు నకులుం జూచి నీసోదరులు హరిణ
మును వెన్నంటి దఱుముటం జేసి యతిదాహమునుం గొని యున్న
వారు. ఈచెట్టెక్కి నలుదెసలం జూచి నీరుగలచోటుం గుర్తెఱింగి
తెలుపు మన నకులుం డావటవృక్షము నెక్కి జల ముండు స్థలముం
జూచి దిగివచ్చి ధర్మజున కిట్లనియె. ఇచ్చోటికి సమీపమున హంసలు
మున్నగుజలపక్షులనాదంబులు వినవచ్చుచున్నవి. అచ్చో నున్నచెట్లు
పాదులయందు సమృద్ధజలంబులగుటచే నేపారఁ బెరుగుచున్నవి.
త్రాగుటకు నీ రచ్చోట వలసినంతయుండు నని తలంచెద. అనంగా ధర్మ
నందనుండు నకులుం జూచి యట్లగునేని నీవు త్వరితగతి నచ్చోటి
కరిగి నీదగ దీర్చుకొని యమ్ములపొదియందు వలసినంతనీరుఁ గొని రమ్మని
పనిచె.

### నకులాదులు యక్షప్రశ్నముల కుత్తరము లీక మూర్ఛితు లగుట

అంత నకులుం డన్నమాట విని వైళంబ యప్పులుఁగు లుండు
సరోవరంబుం జేరి యందు విమలతోయంబులఁ గ్రోలుటకుఁ దలంచు
నెడ నొక్కయశరీరభూతం బిట్లనియె. "ఓయన్నా! ఈసరోవరంబు
నాయది. ఈజలంబులఁ ద్రాగఁ గోరుదేని నా యడుగు ప్రశ్నములకుఁ
దేటపడంగా నుత్తరములఁ జెప్పి మఱి నీరు ద్రావుము. వలసినంతనీరు
కొని పోవుము. సాహసము చేసి నాపలుకుల నిరాకరింపకుము."
అన్నను, నకులుఁ డామాటల ననాదరణము చేసి యక్కొలనిలోని శీతల
జలంబులం ద్రావి దానిగట్టున నిశ్చేతనుఁడై పడియెను. అట ధర్మజుండు
నకులుఁ డెంతతడవునకును రాకపోఁగా సహదేవుం బిలిచి నకు

లుండు జలంబులఁ గొనితేర నరిగి యింతకును రాఁడయ్యె. కతం బరసి నకులుం దోడ్కొని నీవు జలంబులఁ గొనితెచ్చి మానీరువట్టుం దీర్పుమనెను. అంత సహదేవుం డట్ల యని యాకొలనికడకుం జనుటయు భూతలంబున నిశ్చేతనుండై పడియున్న నకులుం జూచి చింతాక్రాంతుండై దాహము నడంపలేక సరస్సునం డిగి యంజలి నిర్మలశీతలమధురజలంబులఁ ద్రావ యత్నించుచుండఁ, దొల్లింటి యశరీరభూతం బాకసంబున నుండి నకులునిలుం బోలె నాజ్ఞ పెట్టినను సహదేవుండు దానివచనంబుల నిరాకరించి యాకొలనినీరు ద్రావి ధరపైఁ బడెను. అంతట ధర్మరాజర్జునుం బిలిచి యోశత్రుసంహారకా, నీరు దేర నీకూరిమితమ్ము లిరువురుం బోయి యింతకు రారు. కారణము నూహింపఁ జాలకున్నాను. నీవు చని వారిం దోడ్కొని వారి సమృద్ధంబుగఁ దెమ్ము. నీవ కదా మాయాపదుద్ధారకుఁడవు. నీకు శ్రేయస్సు కలుగుఁగాక! యని చెప్పఁగా విజయుండును వింటి నమ్ములం దాల్చి ఖడ్గముం గేలఁగొని, వేగంబున నాసరోవరసమీపంబున కేఁగి యాకొలనిగట్టున నొడళ్ళెఱుంగక నిశ్చేతనులై పడియున్న తమ్ములం జూచి యత్యంతశోకసంతప్తుండై వీరి నిట్లు చేసినవాఁ డెవ్వాం డగునా యని నలుదెసలం గలయం జూచి యామహావనమునం దొక్కజంతువునుం గానక నీరువట్టు నాపలేక సరోవరజలమును సమీపించుడు నయ్యశరీరభూతం బంతరిక్షగతంబై కుంతీతనయా! ఏల యీనీరు ద్రావ సమీపింతువు? ఈజలంబులను బలవంతముగఁ ద్రావుటకు వీలు కానేరదు. నేను నిన్నుఁ గొన్ని ప్రశ్నల నడిగెద. వానికి సదుత్తరముల నిత్తువేని నీనీరువట్టు దీరఁ గడుపార నీమధురజలంబుల నానుము. వలసినంతఁ గొని పొమ్మని చెప్పఁగా నప్పార్థుం డాభూతము నుద్దేశించి యదృశ్యంబుగ నీవు వారింప నేల? శక్తుఁడ వైతేని నాకు గోచరుండవై నన్ను వారింపుము. వాఁడిబాణము వేసి నీమేను తూటువడం గొట్టుదు. అని చెప్పి యాశబ్దమేతెంచినవైపును గుర్తించి దివ్యాస్త్రము నభిమంత్రించి వాఁడిబాణంబులను మిన్ను మన్ను గప్పునట్లు ప్రయోగించి నీరువట్టు నిలుప లేక సరస్తీరంబుఁ జేరి జలములనుఁ గ్రోల సమకట్టుడును, మఱియు నయ్యశరీరభూతంబు పార్థుం జేరి యోరీ! ఏల సాహసించి నీకార్యవిఘాతము గావించికొనియెదవు? నాప్రశ్నల కుత్తరముల నిచ్చి నీటిం ద్రావుము, కాదేని

నీతమ్ములట్లు నీవుం బడియెదవనెను. అంత నప్పార్థుండును నావలుకుల ననాదరంబు సేసి నీరు ద్రావి తోడ్తోడ నిశ్చేష్టుండై బడియెను. అంత నక్కడ ధర్మతనయుండు భీమసేనుం జూచి, ఓ వాయుపుత్త్రా! నకుల సహదేవులును నర్జునుండును నీరు దేరం బోయి యెంతసేపటికిం బ్రొద్దు తడసిరి. ఏమికారణముననో యింతను రారైరి. నీవు పోయి వారిం దోడ్కొని జలములను గొని రమ్మనఁగా వృకోదరుం డన్నమాట నంగీకరించి సెలవుం గొని యతివేగమున నాసరస్సమీపమున కేతెంచి నిశ్చేతనులై భూపతితులై యున్న తమ్ములం జూచి యిది యసురకృత్యం బని మది నూహించి సుస్థిరమైన గొప్పసమరము సంప్రాప్తమగునని నిశ్చయించి సరస్సులోని జలమును సమీపించి యాఁకొన్నదగుటను ద్రావఁ బోఁగాఁ దొల్లింటియశరీర భూతంబు, 'కౌంతేయా తొందరపడకుము నాయుది. నేను గొన్నిప్రశ్నముల నడిగెద. వానికి సదుత్తరముల నొసంగి పిదప నీజలముఁ ద్రావుము. వలసినంతఁ గొనిపొమ్ము. సాహసించి త్రాగితివేని నీతమ్ములగతి నీకును సంప్రాప్తించు.'నని చెప్పుచుండఁగా భీమసేనుండును దొల్లింటివారివలె నాయశరీరిపలుకుల సరకుసేయక జలములఁ ద్రావి వారివలెనే నిశ్చేష్టుండై ధరం బడియె. వెంటనే ధర్మరాజు తన తమ్ము లెవ్వరును నీరుదేక మగిడిరాక పోయినందులకు మనంబునఁ గుంది తానే లేచి, నిర్జనంబును, సింహవ్యాఘ్రాదిక్రూర మృగసంకీర్ణంబును ననేకపక్షిసంకులంబును వివిధవృక్షషండమండితంబు నగు నమ్మహారణ్యమునందుఁ బోయిపోయి, యం దొక్కచోట నానావిధలతాబృంద పరీతమును బథికజనశ్రమాపనోదకనిర్మలశీతలవాతమును సంచారసంగమున తంబును వికసితకమలమరందపాన మత్తమధుకర ఝంకార ధ్వని యుతంబును నై నిర్మలోదకముచే నిండిన యొకసరోవరముం గాంచి దానిరామణీయతకు విస్మితుండై సమీపించి దానితీరంబున నిశ్చే తనులయి నేలంబడి యుగాంతమునందుఁ గ్రిందఁబడిన లోకపాలుర నంటి వారలఁ దనయనుంగుఁదమ్ములం గనుంగొని వేఁడినిట్టూర్పుల విడిచి కన్నీరు సోనలై కాఱ నిట్లని యేడ్చె. ఓ యన్నా భీమసేనా! రణరంగమున దుర్యోధనునూరువులను భంజింతు నన్న ప్రతిజ్ఞ కురుకులమునకుఁ గీర్తిఁ దెచ్చెడి నీ వీనేలం బడుటంజేసి వ్యర్థమయ్యె. మానవమాత్రుల ప్రతిజ్ఞ

వారు. నీతమ్ముల ప్రాణంబులపై నాస గలదేని నాసరస్సునందలి నీరు త్రాగ వలదు. ప్రశ్నములకు సదుత్తరముల నొసంగినపిదపఁ ద్రాగుము. వలసి నంతసేపటికి గొనిపొమ్ము. అనఁగా ధర్మజుండు, యక్షశ్రేష్ఠా! నీసొమ్ము నాకు వలదు. సజ్జనులసొమ్ము వల దనుచుండ నేఁ బరిగ్రహింపంది తగునే, నీవు నన్ను నడుగుము. నీ యడుగు ప్రశ్నములకు నేనుదుత్తరముల నీ గలనే? అయినను నాయెఱిఁగినంత చెప్పెద. అడుగు మనఁగా యక్షుం డిట్లడుగం జొచ్చె.

ధర్మరాజు యక్షుని ప్రశ్నములకు నుత్తరముల నొసఁగి తమ్ముల బ్రతికించుట

సూర్యుని నడపునది యెయ్యది? ఆతని యిరుపార్శ్వంబుల నడచు వా రెవ్వరు? ఆతం డేమిట నస్తమించు? ఆతని కాధార మెయ్యది? అనఁగా ధర్మజుం డిట్లుత్తరముల నొసఁగె.

సూర్యుని బ్రహ్మము నడపును. ఆసూర్యుని యిరుపార్శ్వంబుల యందు దేవతలు నడచుచుందురు. ఆతని నస్తమొందించునది ధర్మము. ఆతని కాధారము సత్యము.
అనఁగా యక్షుం డిట్లనియె.

ఏమిట శ్రోత్రియుండగును? ఏమిటఁ గడుమహిమ వడయును? పురుషుం డెట్టిసహాయము గలవాఁడగు? ఏమిట బుద్ధిమంతుఁ డనఁ జను?
అని యడుగఁగా ధర్మనందనుండు వాని కిట్లుత్తరము చెప్పెను.

వేదాధ్యయనమువలన శ్రోత్రియుఁ డగును. తపస్సుచేత మహిమ వడయును. ధైర్యమునఁ బురుషుండు సహాయవంతుఁ డగును. అతిశయముగ బుద్ధిమంతుఁ డగు బుధసేవచేత.
అని చెప్పఁగా యక్షుండు మరల నిట్లనియె.

బ్రాహ్మణుల కేకారణంబున దేవత్వము కలుగును? వారికి సాధుభావ మెవ్విధముగ నగును? వారి కెట్లు నసాధుత్వముఁ గల్గు? దేని చేత వారు మానుషత్వమును బొందుదురు?
అని యడుగ ధర్మజుం డిట్లనియె.

బ్రాహ్మణులు వేదాధ్యయనంబున దేవత్వము నొందుదురు. తపస్సుచే వారికి సాధుభావము గల్గును. ఆచారనియమములేమిచే వా

రసాధువు లయ్యెదరు. వారికి మానుషభావము మరణ మని చెప్పఁ
గును. అది విని మఱియు యక్షుం డిట్లని యడిగెను.

క్షత్రియులకు దేవత్వ మే మిటఁ గలుగును. వారికి సదాచార
మును సాధుభావము నెద్ది? వారికి మానుషత్వ మే మిటఁ గలుగును? అన
ధర్మజుం డిట్లనియె.

క్షత్రియులు శస్త్రాస్త్రవిద్యలయందు నేర్పు గలిగియుండుటచేత
వారికి దేవత్వము సిద్ధించును. యజ్ఞముల నాచరించుటచేతను, వారు సదా
చారులుగను, సాధుస్వభావులుగ నుండుటచేతను సత్ప్రవర్తనము వారికి గలుగు.
భయము గలిగియుండుట వారికి మానుషభావము. శరణాగతులను
కభయ మొసంగ వారి కసాధుత్వము గలుగు.
అనిన యక్షుం డిట్లనియె.

యజ్ఞియ మగు సామ మెద్ది? యజ్ఞియ మగు యజు స్సెద్ది?
యజ్ఞమును వరించున దేది? యజ్ఞము దేని నతిక్రమింపదు?
అనియడుగఁ గౌంతేయాగ్రజుం డిట్లనియె.

యజ్ఞియ మగుసామము ప్రాణము. మనస్సు యజ్ఞియ మగు
యజస్సు. ఋక్కొక్కటి యజ్ఞమును వరించు. యజ్ఞము ఋక్కు నతి
క్రమించి వర్తింపదు.
అంత యక్షుండు వెండియు నిట్లు ప్రశ్నించెను.

విత్తనము చల్లువాని కేది ముఖ్యము? దానము చేయువారికి
శ్రేష్ఠ మెద్ది? ప్రతిష్ఠను బొందగోరువారి కేది యుత్తమము?
ప్రసవించువారికి ముఖ్య మెద్ది?
అనఁగా యుధిష్ఠిరుం డిట్లనియె.

విత్తనము చల్లువానికి వర్షము ముఖ్యము. దాన మొసంగు
వారికి బీజదానము శ్రేష్ఠము. ప్రతిష్ఠ గాంచఁగోరువారికి బ్రాహ్మణ
దానాదులచే గోవు లుత్తమములు. ప్రసవించువారికి బుత్త్రుండు
ముఖ్యము.
అంత యక్షుం డిట్లడిగెను.

తెలివిగలవాఁడై విషయములను లెస్సఁగా ననుభవించుచు
సమస్తభూతములకు ద్రోహముఁ దలంపక జనులచేఁ బూజితుండై
బ్రతికియుండియు నెవఁడు చచ్చినవాఁ డనంబడును?

అనఁగా యుధిష్ఠిరుం డిట్లనియె.

ఏపురుషుఁడు దేవతలకును పితరులకును భృత్యులకును నతిథులకును దగినట్లు ధనమును విభజించి యీయక, యాత్మోపభోగమునకు మాత్రము వెచ్చించునో వాఁడు జీవించియుండియుఁ జచ్చినవాఁడే యనంబడు.

అంత యక్షుం డిట్లనియె.

భూమికంటె మిక్కిలి గొప్పవస్తు వేది? ఆకసమునకంటె నున్నతమైన దేది? వాయువునకంటె త్వరితగతి గల దేది? అన్నిటికంటె నెక్కువైన దెయ్యది?

అనఁగా యుధిష్ఠిరుం డిట్లనె.

తల్లి భూమికంటె గొప్పది. తండ్రి యాకసంబునకంటె నున్నతుఁడైనవాఁడు. వాయువునకంటె శీఘ్రగతి గలది మనస్సు. మనుజులకు చింత యన్నింటికంటెఁ నెక్కువైనది.

అంత యక్షుం డిట్లనియె.

ఎద్ది నిద్రించియుఁ గన్నుమూయదు? జనించియుఁ గదలక యుండున దెద్ది? హృదయము లేని పదార్థ మేది? అతిశీఘ్రముగ వృద్ధి బొందున దెద్ది?

అనఁగా యుధిష్ఠిరుం డిట్లని వచించె.

మీను నిద్రించియుఁ గన్నుమూయదు. గ్రుడ్డు జనించియుఁ గదలక యుండును. ఱాయి హృదయశూన్యము. వేగముగ వృద్ధిఁ బొందునది యేఱు.

అనఁగా యక్షుండు వెండియు నిట్లడిగెను.

దేశాంతరమున కేఁగినవానికి మిత్ర మేది? ఇంట నుండువానికి మిత్ర మెయ్యది? రోగి కెయ్యది మిత్రము? మరణ మాసన్నంబై యుండువాని కెయ్యది మిత్రము? అని యడుగఁగా, వానికి యుధిష్ఠిరుం డిట్లనియె.

దేశాంతరమున నుండువానికి విద్యయు, నింటనుండువానికి (గృహస్థునకు) సద్భార్యయు, రోగికి వైద్యుఁడును, చావ నున్నవానికి దానమును మిత్రములు.

అని చెప్పఁగా యక్షుండు మఱియు నిట్లనియె.

భూతముల కెల్ల నతిథి యెవ్వఁడు? సనాతనం బైన ధర్మ మేది? అమృత మెయ్యది? జగ మెల్ల నెట్టిది?
అనఁగా యుధిష్ఠిరుం డిట్లనియె.

అగ్ని భూతముల కెల్ల నతిథి. కైవల్యము సనాతనధర్మము. సోముఁ డమృతము. జగ మెల్ల వాయుమయము.
అని చెప్పఁగా యక్షుం డింకను నిట్లడిగెను.

ఎల్లప్పుడు నొంటరిగఁ దిరుగువాఁ డెవ్వఁడు? పుట్టినను మఱల మఱలఁ బుట్టుక నొందువాఁ డెవ్వండు? మంచునకు మందెయ్యది? సర్వమును జనించుటకుఁ దగిన స్థలమెయ్యది?
అనఁగా ధర్మతనయుం డిట్లని వచించె.

సూర్యుఁ డెప్పుడును నొంటరిగాఁ దిరుగువాఁడు. పుట్టినను మఱలమఱలఁ బుట్టువాఁడు సోముండు. అగ్ని మంచునకు మందు. భూమి సర్వోత్పత్తియోగ్యక్షేత్రము.
అని యుత్తరముల నీయఁగా యక్షుం డిట్లడిగెను.

ధర్మమునకుఁ గుదు రెద్ది? కీర్తికరము లగువానిలో నుత్తమ మేది? స్వర్గసాధనములయందు ముఖ్య మేది? సుఖకరము లగువానిలో శ్రేష్ఠమేది?
అనఁగా ధర్మతనయుం డిట్లుత్తరముల నిచ్చె.

దాక్షిణ్యము ధర్మమునకుఁ గుదురు. కీర్తికరము లగువానిలో దాన ముత్తమము. సత్యము స్వర్గసాధనములలో ముఖ్యము. సుఖకరము లగువానిలో శీలము శ్రేష్ఠము.
అనఁగా యక్షుఁ డిట్లని యడుగుచున్నాఁడు.

నరున కాత్మ యెయ్యది? అతనికి దైవసన్నిహితమైనమిత్ర మెయ్యది? అతని ప్రాణాధారమగున దేది? అతం డెద్దానిని వీడక యనయము నవలంబింప వలయును?
అనఁగాఁ గౌంతేయుం డిట్లనియె.

నరున కాత్మ పుత్త్రుండు. ఆతనికి భార్య దైవసన్నిహితమైనమిత్త్రము. వర్ష మతనికిఁ బ్రాణాధారము అతనికి దానము పరాయణము.
అనఁగా యక్షుం డిట్లు మఱల నడిగె.

ద్రవ్యసంపాదనసాధనంబులలో నుత్తమం బేది? ధనములలో నుత్తమధనం బేది? లాభములలో నెట్టిది యుత్తమము? సుఖములలో నుత్తమసుఖం బెద్ది? అని యడుగుడుఁ గౌరవకులప్రజ్ఞావంతుం డిట్లనియె.

ద్రవ్యసంపాదనసాధనములలో శరీరపటుత్వ ముత్తమంబు. విద్య పలుతెఱంగు లగుధనములలో నుత్తమము. ఆరోగ్యలాభ మన్నిలాభములలో మేలైనది. సంతోష మన్ని సుఖములలో శ్రేష్ఠము. అనఁగా యక్షుం డిట్లనియె.

పరమధర్మము లోకమున నెయ్యది? ఏధర్మము సర్వకాలముల యందును ఫల మొసంగుచుండు? దేని నడచినచో దుఃఖము లుడుగును? ఎట్టివారితోడి కలయిక చెడకుండును? అని యక్షుఁ డడుగుచుండఁగనే ధర్మపుత్త్రుం డిట్లానతిచ్చెను.

అద్రోహచింత లోకమునఁ బరమధర్మము. వేదములయందుఁ జెప్పబడినధర్మ మన్నికాలములయందు ఫలము నొసంగుచుండు. మనస్సు నడచిపుచ్చినచో దుఃఖము లుడుగును. సాధువులతోఁ గలయిక యెప్పుడును జెడనేరదు.
అనఁగా యక్షుం డిట్లనియె.

లోకమునఁ బురుషుండు దేని విడిచినచోఁ బ్రియుం డగును? శోకింపకుండుట కెద్దాని విడువవలయు? దేని విడుచుటచే నర్థవంతుం డగును? సుఖి యగుటకు దేనిని విడువవలయు?
అని యడుగఁ బరమధార్మికుండు ధర్మాత్ముఁ డిట్లని వచించె.

అభిమానమును వదలుచోఁ బ్రియుం డగు. శోకింపకుండుటకుఁ గ్రోధమును విడువవలయు. కామము వదలువాఁ డర్థవంతుం డగును. లోభమును వదలినవాఁడు సుఖి.
అనఁగా యక్షుం డిట్లడిగెను.

నటనర్తకుల కేల దాన మొసఁగవలయు? విప్రులకే యేల దాన మొసఁగవలయును? భృత్యుల కేల దానమియ్యవలయును? రాజున కేల బలి యర్పింపవలయును?
అనఁగా పాండవజ్యేష్ఠుం డిట్లని వచించె.

ధర్మార్థము విప్రులకే యొసఁగవలయు. కీర్త్యర్థము నటనర్తకుల కొసఁగవలయును. పోషణార్థము భృత్యుల కీయవలయును. భయార్థమై రాజుల కర్పింపవలయును.
అని చెప్పఁగా యక్షుఁ డిట్లనుచున్నాఁడు.

లోక మెద్దానిచే నావరింపఁబడియున్నది ? దేనిచే నది ప్రకాశింపదు ? దేనిచే లోకము మిత్రులను సైతము విడిచిపుచ్చు ? దేనివలన స్వర్గమునకుఁ బోకడ యాటంక పెట్టఁబడును?
అనఁగా నక్కౌంతేయాగ్రజుం డిట్లని యుత్తరముల నొసఁగె.

లోక మజ్ఞానముచే నావరింపఁబడియున్నది. నష్టప్ర తమస్సుచేఁ బ్రకాశింపదు. లోభబుద్ధి మిత్రులను విడుచు నట్లొనర్చును. స్త్రీసంగము స్వర్గగమనమునకుఁ జేటు.
అనఁగా యక్షుండు మఱియు నిట్లడిగెను.

ఎట్టి పురుషుండు బ్రదికియును మృతుం డనఁబడు? రాష్ట్ర మెవ్విధమైనచో మృత మనఁబడును? ఎట్టిశ్రాద్ధము మృతప్రాయంబు? ఎట్టి యజ్ఞము మృతము?
అని యడుగఁ గౌంతేయాగ్రజుం డిట్లనియె.

పురుషుండు దరిద్రుఁడైనచో మృతప్రాయుఁడు. రాష్ట్ర మరాజకమగుచో నయ్యది మృతమగు. అశ్రోత్రియ మగు శ్రాద్ధము మృత మనఁబడు. అదక్షిణమయిన యాగంబు మృతంబు నాఁబడు.
అనఁగా యక్షుండు క్రమ్మర నిట్లడిగెను.

పురుషునకు దిక్కెయ్యది? జల మెయ్యది? అన్న మెయ్యది? విష మెయ్యది? శ్రాద్ధకాల మెయ్యది ?
అని యడుగఁ బాండవజ్యేష్ఠుం డిట్లనియె.

పురుషునకు సత్పురుషులు దిక్కు. ఆకసము జలము. గో వన్నము. యాచించుట విషము. వేదములను జదివినబ్రాహ్మణునియాగమనకాలంబు శ్రాద్ధకాలము.
అని చెప్పఁగా యక్షుం డిట్లడిగెను.

తప మెట్టిది? దమ మెట్టిది? క్షమ యన నెటువంటిది? హ్రీయనున దెట్టిది?
అని యడుగ వానికిఁ బృథాసుతుం డిట్లనియె.

పురుషునకు స్వకులధర్మము నాచరించుటయే తపము. మన స్సును గట్టిగ నుంచుట దమము. ద్వంద్వముల నోర్చియుండుట క్షమ. చేయరాని కార్యమునుండి నివృత్తుఁ డగుటయే హ్రీలక్షణము. పరముం గూర్చి యథార్థమగు బోధయే జ్ఞానము. చిత్తము నుపశమింపఁజేయఁ గలిగియుండునది శమము. సమస్తజంతువులసుఖముం గోరుటయే దయ నాఁబడు. అన్నిటియందు సమచిత్తత్వమార్జవ మనఁబడును.

అని వచింప యక్షుం డిట్లనియె.

పురుషునకు గెలువరానిశత్రు వెయ్యది? వానికి నశింపనిరోగ మేది? సాధుజనుం డెట్టివాఁడు? అసాధు వెట్టివాఁడు?

అని యడుగఁ బాండవజ్యేష్ఠుం డిట్లనియె.

మహాపురుషా! వినుము. క్రోధము పురుషునకు గెలువరాని శత్రువు. లోభము నశింపనిరోగము. సర్వభూతహితముగ వర్తించు వాఁడు సాధువు. దయారహితుం డసాధువు.

అని చెప్పఁగా నంత యక్షుం డిట్లడిగెను.

దేనిని మోహ మందురు? మాన మన నెట్టిది? ఆలస్య మనున దేది? శోక మెట్టిది? ఋషులచే నెద్ది స్థైర్య మనఁబడును? ధైర్యమేది యని చెప్పఁబడును? స్నాన మనఁగా నెయ్యది? దేనిని దాన మందురు.

అని యడుగ యుధిష్ఠిరుఁ డిట్లనియె.

ధర్మమూఢత్వము మోహము. ఆత్మాభిమానమే మానము. ధర్మము నాచరింపమియే యాలస్యము (జాగు). అజ్ఞాన మనునదియే శోకము. స్వకులధర్మాచరణమునందు సుస్థిరమగుబుద్ధి స్థైర్యము. ఇంద్రియముల సపశోంబులుగాఁ జేయక వానిని నిగ్రహించుటయే ధైర్య మనఁబడునది. మనోమాలిన్యముఁ గడిగికొనుట స్నానము. సర్వభూత రక్షణమే దానము.

అని చెప్పఁగా యక్షుండు మఱియు నిట్లడిగెను.

పండితుఁ డెవఁడు? నాస్తికుఁ డెవఁడు? మూర్ఖుఁ డెవఁడు? కామ మెట్టిది? మాత్సర్య మెట్టిది?

అని యడుగుచుండఁగనే ధర్మతనయుం డిట్లు చెప్పుచున్నాఁడు.

ధర్మజ్ఞుఁడే పండితుండు. నాస్తికుఁడే మూర్ఖుఁడు. సంసార హేతువు కామము. హృదయతాపమే మత్సర మని స్మృతులు చెప్పును.
అంత యక్షుం డిట్లడుగుచున్నాఁడు.

అహంకార మనఁగా నెట్టిది ? దంభ మెయ్యది ? పైశున్య మేది? దైవ మనునది యెయ్యది ?
అనఁగాఁ బాండురాజాగ్రనందనుం డిట్లనుచున్నాఁడు.

తీరనియజ్ఞానమే యహంకారము. తాను ధర్మశీలుండ నని వెల్లడించుటయే దంభము. ఇతరుల నెప్పుడు దూషించుస్వభావము పైశున్య మనఁబడును. పూర్వజన్మంబులలో నార్జించిన దానఫలమే దైవ మనఁబడును.
అనఁగా యక్షుండు మఱియు నిట్లడుగుచున్నాఁడు.

ధర్మార్థకామములు పరస్పరవిరుద్ధములు. నిత్యవిరుద్ధము లగు నీమూఁడును నెచ్చోట సంగమించును?
అని యడుగఁ గౌరవవంశతిలకుం డిట్లనియె.

ధర్మమును భార్యయుఁ బరస్పరవశానుగములైనచో ధర్మార్థకామములు మూఁడును నొక్కటిగ మేళగించును.
అనఁగా యక్షుం డిట్లనియె.

ఎవఁ డక్షయ మగు నరకమును బొందును. ఈప్రశ్నమునకు వేగంబ నా కుత్తర మొసంగు మనుచుండఁగనే ధర్మనందనుం డిట్లని వచించె.

యాచింపవచ్చిన దరిద్రుఁ డగుబ్రాహ్మణునిఁ దానుగఁ బిలిచి దానము నిచ్చెద నని చెప్పి యాశఁ జూపి పిదప లేదనువాఁడును, వేదముల యందును ధర్మశాస్త్రములయందును దేవతలయందును బితరుల యందును బ్రాహ్మణులయందును ద్వేషముం బూనినవాఁడును, ధన ముండియు లోభబుద్ధిచేఁ దా ననుభవింపక సత్పాత్రదానంబుఁ జేయక లే దనువాఁడును నక్షయ్యం బగునరకమును బొందుదురు.
అని చెప్పుచుండఁగనే యక్షుం డిట్లడిగెను.

(రాజేంద్రా!) కులముచేతనా ? లేక వృత్తముచేతనా ? లేక వేదాధ్యయనముచేతనా ? లేక శాస్త్రజ్ఞానముచేతనా ? వీనిలో నెద్దానిచే బ్రాహ్మణ్యంబు గలుగు?

అని యడుగఁగా ధర్మజుం డిట్లు ప్రత్యుత్తర మొసఁగుచున్నాఁడు.

శాస్త్రజ్ఞానము చేఁ గాని వేదాధ్యయనముచేఁగాని బ్రాహ్మణ్యం బెంతమాత్రము నుండదు. వృత్తమునందే బ్రాహ్మణ్యము ప్రతిష్ఠితమై యున్నది. అదియే బ్రాహ్మణ్యమునకు ముఖ్యకారణము. కాఁబట్టి మను జుండు వృత్తమును యత్నపూర్వకముగఁ గాపాడుకొనవలయును. వృత్తలోపము కలుగ జేసి బ్రాహ్మణ్యమునకు హాని కలుగనేరదు. వేదములను నధ్యయించుటచేతను శాస్త్రచింతనములచేతను నెల్లప్పుడు వృత్తవంతులు గాని వారు పండితులు గారు. అంతేకాక వారు మూర్ఖు లనఁబడుదురు, నాలుగు వేదములఁ జదివి దుర్వృత్తశీలుం డగు బ్రాహ్మణుఁడు(శూద్రునికంటె)నీచుఁ డగును. సాయంప్రాతఃకాల ములయందును బర్వములయందును నగ్నికార్యనిరతుండై సద్వృత్తియం దుండువాఁడే బ్రాహ్మణుఁ డనఁబడును.

అని చెప్పఁగా యక్షుండు క్రమ్మఱ నిట్లడుగుచున్నాఁడు.

ప్రియవచనములనుబల్కువాఁ డేమి బొందును? విమర్శించి కార్యముల నొనర్చువాఁ డేమి పొందును? అనేకులతోఁ జెలిమి యొన ర్చువాఁ డేమి పొందును? ధర్మనిరతుఁ డేమి పొందును?

అని యడుగఁగాఁ గురుకులప్రదీపకుం డిట్లు చెప్పుచున్నాఁడు.

ప్రియవచనము లాడువాఁడు పెక్కండ్రకు నెచ్చెలి యగును. విమర్శించి కార్యములు సలుపువాఁ డందఱికంటె మేటియగు. పెక్కం డ్రతోఁ జెలిమి గలవాఁడు సుఖం బుండు. ధర్మనిరతుండు సద్గతిం బొందును.

అనిన యక్షుం డిట్లనియె.

ఎట్టివాఁడు సంతోషించు? ఎట్టిది యాశ్చర్యము? మార్గ మన నెయ్యది? వార్త యెయ్యది? ఈనాలుగుప్రశ్నములకు దత్తోత్తరుఁడ వగుము. మృతులైన నీబంధువులు సజీవు లగుదురు.

ఋణము, పరసేవ, దేశాంతరసంచారము లేక తనయింట నుండి నిర్విచారముగ నాకలములైన వండించికొని పగలయిదవకాలమునఁగాని లేకయాఱవకాలమునఁగాని భుజించువాఁడు సంతోషి. యమాలయమున కనుదినమును భూతములు పోవుచుండుటను జూచుచుండియుఁ దక్కిన వారు దామమాత్రము స్థిరముగ నుండఁగోరుటయే పరమాశ్చర్యము.

తర్క వాదములు నిలుకడ లేకయుండు. వేదము లొండొంటికి విభిన్నములు. ధర్మవచనములను జెప్పువారును ననేకు లున్నారు. దేనిని బ్రమాణము గాదనరాదు. ధర్మము మాత్రము సూక్ష్మముగా నాలోచించి గ్రహింప వలయును. కాఁబట్టి ధర్మమును నిర్ణయించునపుడు పెద్ద లాచరించునదియే మార్గ మని యామార్గమున మనుజుఁడు నడువవలయు. ప్రకృతివికారమైన యీప్రపంచము గొప్పపాత్రము. ఆకసము మూఁత. రాత్రిందివంబులను కట్టెల నుంచి, సూర్యుఁ డను నగ్నిచే రగిల్చి మాసఋతువు లనఁబడు దర్వులచే నెగఁ బోఁడిచి జ్వాల గావించి కాలుండు భూతంబులను పచనము చేయుచున్నాఁడనుటయే వార్త.

అనఁగా యక్షుండు ధర్మరాజుతో నిట్లనియె. మహాత్మా! నా ప్రశ్నంబుల కన్నింటికి సదుత్తరముల నొసఁగితివి. నేను సంతసించితిని. మఱియు వీనికి సమాధాన మొసంగుము. ఎట్టివాఁడు పురుషుఁడు? ఎవ్విధము గలవాఁడు సర్వధని? అనఁగా ధర్మపుత్త్రుం డిట్లని చెప్పె.

ఎవనిపుణ్యకర్మప్రభావములచే నవనియందును స్వర్గమునందును వానిపేరు ప్రఖ్యాతమై నెగడునో వాఁడె పురుషుండు. ప్రియాప్రియములయందును, సుఖదుఃఖములయందును, నతీతానాగతముల యందును నెవ్వండు సమభావము గలిగియుండునో వాఁడె పురుషుండు. అన్నింటియందు సమత్వమును నిస్పృహత్వమును శాంతమనస్సును, సుప్రసన్నతయుఁ గలిగి యోగియై యుండు మహాత్ముఁడె సర్వధని యనఁబడును.

అన విని యక్షుం డిట్లనియె. సర్వధనుని నీ విప్పుడు వర్ణించితివి. కావున నీసోదరులలో నొక్కనిఁ గోరుకొనుము. వానిని నీ కొసంగెద. నీసదుత్తరములకు మెచ్చి నీకీవరం బొసఁగెద. అనఁగా ధర్మజుం డిట్లనియె. యక్షశ్రేష్ఠా! వినుము. శ్యామగాత్రుండును, రక్తలోచనుండును, మహాబాహుండును, విశాలవక్షుండును, సాలోన్నతుండును నగు నకులుం బ్రతికింపుము. అని ప్రార్థింపఁగా నయ్యక్షుండు ధర్మరాజుం జేరి యిట్లనియె. నీకు మహాబలుండైన భీముండు ప్రియుండు. బహుశస్త్రాస్త్రవేత్తయగు నర్జునుండు పరాయణుఁడు. ఇట్టివారిని వదలి సవతితల్లికొడుకగు నకులు గోరెదవే? భీముండు నాగాయుతబలుండు అట్టిబలవంతునిఁ గోరకొనక నకులు నేల గోరెదవు? అనిన నప్పరమపురుషునకుఁ రాజపురుషుం

డి ట్లనియెను. ధర్మము రక్షింపఁగాఁ బడెనేని యయ్యది మనల రక్షించును. దానిని నిర్మూలించితి మేని యయ్యది మనల నిర్మూలించు. కావున నే నెన్నఁడును ధర్మమార్గముఁ దప్పను. ధర్మద్రోహముఁ గావింప కుండుటయే నాకుఁ బరమధర్మము. ఆమతంబునే నే నెల్లకాలము నను సరించుచుందును. నన్ను లోకములోని మనుజు లెల్లరు ధర్మశీలుఁ డని కొనియాడుచుందురు. అట్టి నేను ధర్మద్రోహమును గావింప నొల్లను. ఇందు ధర్మమును వివరింతును. వినుము. మాతండ్రియగు పాండురాజునకు కుంతీమాద్రులను నిరువురుభార్యలు. కుంతికున్న పుత్త్రులలో నే నొక్కఁ డను జీవించియున్నాను. మాద్రి పుత్త్రులలో నొక్కఁడు జీవితుఁడగు నట్లుగా నావరమును వేఁడితి. మాతల్లు లిరువురును సజీవులగు కొడు కులు గలవా రగుట న్యాయ్యమని నాకుఁ దోఁచె. కావున నేను నకులుం బ్రదికింపు మని నిన్ను వేఁడితి. అని చెప్పఁగా ధర్మపుత్త్రుని ధర్మసమ్మిశ్ర మగు సుభాషితమును విని యక్షుం డిట్లనియె. అనఘా! నీ కన్నింటికంటె ధర్మద్రోహము గావింపకుండుటయే పరమధర్మ మని నీవృత్తంబు వలన గుర్తించి సంతసించితి. నీధర్మపరాయణత్వమునకు మెచ్చి నీతమ్ములు నలువురను బ్రదికించితి ననెను.

అంతట భీమార్జుననకులసహదేవులు యక్షునికరుణం జేసి ధర్మరాజు సత్ప్రవర్తనంబునం జేసి సచేతనులై నిదురనుండి మేల్కాంచినవిధం బున లేచి యాఁకలిచేతఁ గాని దప్పికచేతఁ గాని యలసినవారు గాక వికసితవదనులైరి. అందఱను ధర్మనందనుండు మిక్కిలి సంతోషించి యా సరస్సున నొక్కపాదముమీఁద నిలుచుండియుండు యక్షుం గని "అయ్యా! నీవు సామాన్యయక్షుండవు గావు. వసురుద్రాదిత్యమరుత్తు లలో నెవ్వండవు" కావలయు. కానిచో నాకాధిపతి యగు సురేం ద్రుండవో లేక నాజనకుం డగు ధర్మదేవతవో గావలయు నని తలం చెద. నీ వెవ్వండవో యెఱుంగం జెప్పు మనఁగా ధర్మపుత్త్రున కమ్మ హానాయక్షుం డిట్లనియె. పుత్త్రా! నేను నీతండ్రి నగు ధర్మదేవతను. నీ యథార్థము నెఱుంగవచ్చితి. యశస్సు, సత్యము, దమము, శౌచము, ఆర్జవము, హ్రీ, అచాపలము, దానము, తపము, బ్రహ్మచర్యము, అహింస సమత, శాంతి, అమత్సరము ఇవి నామూర్తులు. ఇవి గలవారే నన్నె ఱుంగుదురు. అవి నన్నెఱుంగుమార్గములు. ఇవి యెల్లను నీయందుఁ

గలిమింజేసి నీయెడ నేను మిక్కిలి ప్రీతుండనై సంతసించితి. మహా భాగ్యంబున నీవు పితృపూజనమునందును, మాతృసేవయందును, గురు శుశ్రూషాదులయందును, నగ్నిహోత్ర పూజావిధానములయందును, నాత్మ పూజనంబునందును నీనైయెదింటిని మిక్కిలి ప్రీతిగలిగి యున్నావు. మానవుల కజేయంబైన యంతశ్శత్రువు లాఱింటిని గెలిచితివి. నాకును రక్తులును భక్తులును నగువారు దుర్గతిం బ్రాపింపరు. వరము నొసంగెద. అడుగుము. అనఁగా ధర్మరాజు పరమసంతోషమును బొంది యిట్లనియె. దేవా! నాయాశ్రమంబున నొక్కబ్రాహ్మణుఁ డరణిని జెట్టుకొమ్మయందుఁ దగిల్చియుండ మృగ మొక్కటివచ్చి యాచెట్టున మేనిదురదఁ దీర్చికొనునిమిత్తము రాచుకొనుచుండఁగా దానికొమ్ముల కాయరణిఁ దగుల్పడెను. అంత నామృగం బరణితోఁ బరువిడిపోయె. ఆబ్రాహ్మణున కరణి లేకుండ నగ్నికార్యము కొనసాగదు. కావున నావిప్రున కగ్నికార్యము లోపింపకుండ వర మనుగ్రహింపుము. ఇది నా మొదటి కోరిక. అనఁగా యముం డిట్లనియె. పుత్రా! నీమన స్సెఱుంగం గోరి మృగవేషముం దాల్చి యయ్యరణిని గ్రహించి తెచ్చితి. దాని నిదిగో నీచేతి కిచ్చెద నీకుఁ బ్రియంబైన వేఱొకవరమును వేఁడు మనఁగా ధర్మజుండిట్లనియె. సమవర్తి! మాకుఁ బండ్రెండేండ్లవనవాస నియమకాలము ముగిసె. ఇఁక నొక్కయే డజ్ఞాతవాసంబు సలుప వలయు. ఆకాలమునందు మ మ్మెవ్వరు నెఱుంగకుండునట్లుగఁ బ్రసా దింపుము. అని యడుగుటయుఁ బ్రేతపతి యారెండవవర మొసఁగి యిట్లనియె. మీర లిట్లు మీరూపములతో సంచరించుచున్నను నా యజ్ఞాతవత్సరకాలమునందు మి మ్మెవ్వరును గుర్తింపకుండెదరు గాక. ఇది నావరమహిమమున మీకు నెరవేరఁగలదు. మీలో నెవ్వ రే రూపమును బొందఁ గోరినను బొంద నగు. నియమవత్సరాంతమున నారూపమును విసర్జించి నిజరూపమును బొందఁగలరు. ఇంకను వరము గోరుము. నీవు నాప్రసాదపాత్రుఁడవు. విదురుండు నాయంశ మునఁ బుట్టినవాఁడు. నీ కెన్నివరముల నొసఁగినను నాకుఁ దృప్తి కలుగ నేరదు. అని చెప్పఁగా, ధర్మపుత్త్రుం డిట్లనియె. పుణ్యపురుషా! నీదర్శనమునం జేసి ధన్యుండనైతి. ఇంత కన్న నొందువరం బేల? అయి నను నీయాజ్ఞ చొప్పున వర మొక్కటి వేఁడెద. అరిషడ్వర్గములను నేను

కెంతయుఁ గలుగుఁగాక, సత్యదానతపస్సులలో నామనం బెల్లప్పు డుండ వలయునని యనుకొని కోరెదవు. అనుగ్రహింపు మని వేఁడఁగా నందుల కియ్యకొని ధర్ముం డిట్లనియె. ధర్మస్వరూపమయిన నీధర్మశీలత్వమున కనుగుణ మగుననుమనే ప్రార్థించితివి. నేను సంతసించి యావర మును బడసు ప్రీతితోఁ బ్రసాదించితి. ఆవిప్రునరణి నిదే గైకొనుము. అని చెప్పి యరణి నిచ్చి యక్షరూపధరుఁడైన ధర్మదేవత యదృశ్యుం డయ్యె. అంత పాండవులు లేచి తమకు సంభవించిన కొండవంటి యాపద హిమమువలె నశించినందులకు సంతసించినమనస్సులతోఁ నిజాశ్రమమున కేఁగి యరణిని విప్రున కొసంగి యావద్వృత్తాంతం బును నాశ్రమవాసులకు వినిపింపఁగా వా రంతయును ధర్మపుత్త్రు ధర్మవైశిష్ట్యముఁ గొనియాడిరి. ఈయుపాఖ్యానమును బఠించుపుణ్యా త్ములు పాపములం బోఁద్రోచి ధర్మశీలురై సత్సంతానంబుఁ బడసి చిరా యుష్మంతులై సుఖింతు రని వైశంపాయనుండు జనమేజయునకు మఱియు నిట్లు చెప్పం దొడఁగెను.

పాండుపుత్త్రు లాతీరున వనవాసనియమమును జరిపి తమ యజ్ఞాతవాసనియమమును నెఱవేర్ప నుద్యుక్తులై తమవెంట నున్న బ్రాహ్మణులసెలవుఁ గొని పోవుటకుఁ దలంచి యుండఁగా, నచ్చటివిప్రు లను ధర్మపుత్త్రుండు నమస్కరించి యిట్లనియె. మహనీయులారా! దుర్యో ధనాదులు మమ్మును గపటద్యూతంబున నోడించి మారాజ్యము నంతయు నపహరించినారను వృత్తాంతం బంతయును మీ రెఱింగినదే కదా? అప్పటిసమయము ననుసరించి యిప్పుడు మేము పండ్రెండేండ్ల వనవాస మును సలిపియుంటిమి. ఇఁక నొక్కయేఁ డజ్ఞాతవాసము సలుపుట యవ శ్యకర్తవ్యము. జరిగినవనవాస మెటులో కడపితిమి. జరుగవలసినయే డజ్ఞాతచర్య మిక్కిలి దుష్కరము. ఈయేఁడు మేమేవురమును బాంచా లితో గుప్తచారులుగ నుండవలయు. కర్ణుఁడును, శకునియును, దుర్యోధనుఁడును మమ్ముఁ బట్టుట కెన్నియేని యుపాయములఁ జలు పుదురు. ప్రచ్ఛన్నచర్య వెలిపడకుండ సమయమును నెఱవేర్పఁ దని మాకు మీ రాశీర్వచనములఁ గావింపుఁడు. మా కనుజ్ఞ యొసంగుఁడు. బ్రాహ్మణులను నింకను దగినగొప్పవారిని సమకూర్చికొని మేము

రాజ్యమును బడసి రాజ్యపాలనము సుఖముగ నొనర్పఁగలనో లేదో యని సంశ యించునాఁకో యని దగ్గుత్తికతోఁ గన్నీరు గార్చుచు శోకసంతప్తుండై విలపించె. అప్పు డావిప్రవర్యులును భీమసేనాద్యనుజులును ధర్మజు నూరార్చుచుండ ధర్మజునకు ధౌమ్యుం డిట్లనియె. నృపాలా! నీవు సకలధర్మవేత్తవు. దాంతుఁడవు. సత్యప్రతిజ్ఞుండవు. శత్రువులను నోడించుట నిమిత్త మింతకుఁ బూర్వము కొందఱు మహనీయు లిట్లు వనవాసం బుగ వర్తించియుండిరి. నీవును రాగద్వేషరహితుండవు. ఇట్టి యాప త్కాలంబున శోకింపఁజనదు. కీర్తిప్రతిష్ఠలను దొలఁగి గుప్తముగఁ జరింపవలసివచ్చెనే యని చింతింపకుము. ఇట్లుండ శత్రువులఁ బొలిగొని విజయులై భూపరిపాలనంబు గావించినవా రనేకు లున్నారు. ఇంద్రుని వంటిమహాపురుషుఁడు నిషధపర్వతమున నుండి గిరిప్రస్థమున నాశ్ర మంబునఁ గొంతకాలము శత్రుపరాజయమును సహించి దాఁగియుండె. విష్ణుండు తొల్లి రాక్షసపరాజయనిమిత్త మదితిగర్భ మున నుండి వామనుఁడై పుట్టి సకాలమున విక్రమించి బలి నణంచె. అప్పు డాదేవదేవుండు తనరూపనామములను వీడి వామనాకా రంబు దాల్చి వామనుఁ డను పేరుతో పిలువఁబడియుండె. ఆదేవుండే యింద్రునిమిత్తముగ వజ్రాయుధంబున మరఁగియుండె. మఱియును దశరథ పుత్రుండై పుట్టి యాయాదిదేవుండు శ్రీరామనామాంకితుండై యెన్ని యేనాపదలకుఁ బాల్పడి తుది నరిమర్దనంబు గావించి విజృంభించె. అగ్ని దేవుండు సముద్రమునందు దాఁగియుండె. ఔర్వుం డను బ్రహ్మర్షి శత్రుభీతుండై బహుకాలము తల్లితొడయందు దాఁగియుండె. వీ రెల్ల రును వీరికిఁ దొల్తవచ్చిన కష్టముల నోర్చియుండి పిదపఁ దఱియెఱుఁగుచు విజృంభించి శత్రునిషూదనం బొనర్చి సుఖులైరి. ఇవి యెల్ల నీ వెఱుంగ నివి కానేరవు. అవ్విధమున వారివంటి మహనీయుండ వగునీవు నీకుఁ దటస్థించిన యీయాపదల నన్నింటిని నచిరకాలముననే కడచని పగఱ గెలిచి సామ్రాజ్యంబు నధిగమించి సుఖి వగుదువు. అని యాశ్వాసిం పఁగా నావచనంబుల యుధిష్ఠిరుండు నేదఁ దేరి శాస్త్రీయంబైన నిజ బుద్ధిచే వితర్కించి యుపశమిల్లె. అప్పుడు భీమసేనుండు మహాయశస్కుండు ధర్మబద్ధుండై యానాఁ డూరకుండెఁగాని లేకున్న నీశత్రువు లిప్పటి

[illegible] మహాప్రతీక పోయి ధర్మనందనా! కనుకను నేను నారించఁజూచిన [illegible] నీయాజ్ఞాబద్ధులై యుండకున్న వారు. [illegible] శత్రువుల విధ్వంసంబు గావించి యుండువారు! మీ సోదరులును నీయాజ్ఞాబద్ధులై నీనిర్దిష్టకార్యములను జేయుటకు సంసిద్ధులై యున్నవారము. [illegible] వేని యొక్క పట్టాన నీశత్రువుల నోడించి నీకు సామ్రాజ్యలక్ష్మిం గట్టిపెట్టెదము. అని వినయముగ విన్నవించిన యుధిష్ఠిరుం డంతట చింత మాని సంతుష్టహృదయుండై యుండె. అంత నావిప్రు లందఱును దమత్తపఃప్రభావ సంజాతమ్ములైన యాశీర్వచనపరములను నపాండవులశిరస్సుల వర్షించి [illegible] పునస్సమాగమమయ్యెడు మని చెప్పి తమతమనివాసములకేగిరి. పిదప సకలశాస్త్రముల నెఱింగినవారును, మంత్రకోవిదులును, రాజనీతితత్త్వజ్ఞులును, మహాబుద్ధిమంతులును నగు నపాండవులు [illegible] యగుపాంచాలి రాజసుతతోఁ బురోహితుండగు ధౌమ్యునిఁ బురస్కరించుకొని యాస్థలమును విడనాడి యొక్కకోసెడు దూరమరిగి మఱునాఁడు మొదల జ్ఞాతవాసనియమమును జరుపుటకు నిశ్చయించుకొని సర్వశాస్త్రజ్ఞమూర్తియును, దపశ్శాలియునగు ధౌమ్యునితో నేకాంతమునం బాలోచనాపరులై యుండిరి.

అని యిట్లు పాండురాజాతనయులవనవాస ప్రకారము సవిస్తరముగ మనసురస్థమైన మాటలతో ననఘుఁడు కృష్ణద్వైపాయనశిష్యుఁడు జ్ఞాననిధి యగువైశంపాయనమునీంద్రుండు సముచితమేధాఘనుఁడును బారిక్షితుండును నగు జనమేజయనరేంద్రునకు సమగ్రముగను ననవరతానంద మొసఁగునట్లును నుపన్యసించె. మహనీయులగు పాండుపుత్త్రుల వనవాసప్రకారము నంతయు శాంతియుక్తుఁడై విన్నవాఁడు భూసురులకు శాంత్యర్థము మేలైనఫలములను దంపలను జల్లనినీరుగలకుంభముల నొసఁగి సంతృప్తికరముగ మృష్టాన్నమును సరసఘృత శర్కరాయుత భక్ష్యపానీయములతో సంతర్పణంబుఁ గావింపవలయును.

గద్యము.—శ్రీమదాంధ్రవచనమహాభారతమునం దారణ్యపర్వంబునఁ బాండవులు ద్వైతవనమున కేఁగుటయు, మృగస్వప్నదర్శనంబును,

గామ్యకాగమనంబును, వ్రీహిద్రౌణికోపాఖ్యానంబును, దుర్వాసుండు పాండవులకడ కేతెంచుటయు, ద్రౌపదీహరణంబును, సైంధవవిమోక్షణంబును, రామాయణకథయు, సావిత్రీచరిత్రంబును, కర్ణునికవచకుండలముల నింద్రుండపహరించి యతనికి శక్తి నిచ్చుటయు, ద్వైతవనగమనంబును, నారణేయోపాఖ్యానంబును, ధర్మజుండు యక్షుని ప్రశ్నముల కుత్తరముల నిచ్చుటయుఁ బాండవులు ధర్మదేవతవలన మునుబొంది పశ్చిమాభిముఖులై చనుటయు నన్నది షష్ఠాశ్వాసము.

ఆరణ్యపర్వము సమాప్తము.



చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1949.